శ్రీరస్తు.

శార్ఙ్గధరమిశ్రవిరచిత

# శార్ఙ్గధరసంహిత

ఆంధ్రతాత్పర్యసహితము.

చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

 [వెల 5—0—0

# భూమిక.

"ఆయుః కామయమానేన, ధర్మార్థసుఖసాధనం, ఆయుర్వేదోపదేశేషు విధేయః పరమాదరః" అను వాగ్భటోక్త్యనుసారంబుగా పుడమింబుట్టిన ప్రతిమానవునకును శరీరరక్షణం బాద్యధర్మమగుటంజేసి తద్రక్షణసాధనం బగు నాయుర్వేదపరిశ్రమం బించుకంతయైనను ముఖ్యకర్తవ్యమై యున్నది. ప్రాచీనమహర్షు లట్టి యాయుర్వేదమును భారతఖండమునందంతటను విపులముగా వ్యాపింపఁజేసిరి. ఒక్కొక్క విషయంబును దెలియఁజేయు నొక్కొక్క గ్రంథమును బరిశీలించుట కెన్నియో వత్సరంబులు పట్టుచున్నది. మహర్షులు ప్రసాదించియున్న యష్టాంగాయుర్వేదములో నొక్కయంగంబునందు పరిశ్రమచేయుట కొకని జీవితకాలముగూడా సరిపోవుట లేదు. ఇట్టి యాయుర్వేదమహాబ్ధియందు సర్వాంగములందును నాతిసంక్షిప్తముగా ననుకూలంబులగు విషయంబులను జేకొనిన గ్రంథరత్నంబు నొక్కదానిని మన యాంధ్రసోదరులకర మలంకరింప [illegible] గా నొక్కరత్నము చేఁ జిక్కెను. అయ్యది శార్ఙ్గధరసంహిత.

### గ్రంథకర్తృకాలము.

ఈ సంహితాకారుండగు శార్ఙ్గధరుండు స్వనామానుసారంబుగనే యీ గ్రంథమునకు నామం బిడెను. ఇతండు క్రీస్తు పదునాలవ శతాబ్దంబున దక్షిణదేశంబున జన్మించెననియు, దామోదరాత్మజుండనియు, దెలియవచ్చుచున్నది.

### గ్రంథవిషయము.

"ప్రసిద్ధయోగా మునిభి ర్ప్రయుక్తా శ్చికిత్సకై ర్యే బహుశోఽనుభూతాః, విధీయతే శార్ఙ్గధరేణ తేషాం సుసంగ్రహస్సజ్జనరంజనాయ"

అని యీశార్ఙ్గధరుఁడు తనగ్రంథమున చెప్పుకొనినవిషయ మతిశయె
గానేరదు. ఇందు ప్రాత్యక్షికంబులై బహుఫలదాయకంబులైన చ
ములు, కషాయంబులు, వటికలు, ఆసవములు, అరిష్టములు, అవ
ములు, ఖనిజౌషధములు పొందుపఱుపఁబడియున్నవి. స్నేహ,
వస్తి, వమన, విరేచనాదివిషయంబు లన్నియుఁ జక్కఁగా నావ
మగునంతవఱకు వర్ణింపఁబడియున్నవి. రోగంబులభేదంబులు, న
బులు మాత్రము చేర్కొనఁబడినవి గాని వానిలక్షణంబులు మాత్ర
వివరింపఁబడి యుండలేదు. వైద్యవృత్తియం దున్నవారికేగాక య
లకుఁగూడ నియ్యది గ్రంథాంతరసాహాయ్యమును గోరుటచే నార
బుల లక్షణంబులను చరక, సుశ్రుత, వాగ్భటాదిగ్రంథానుసారం
వివరించియు, నచ్చటచ్చట విశేషార్థముల వ్రాసియు నీగ్రంథము న
యాంధ్రవ్యాఖ్యానముతో సమకూర్చితిమి. ఈసంహిత పూర్వము
తంబై యున్నను నందు తప్పులు బహుళంబుగా నుండుటచే
విషయవిమర్శ లేకుండుటం జేసియు మరల ముద్రింపవలసివచ్చెను.
పూర్వము ముద్రితంబై యున్న పొత్తంబున మూలగ్రంథమ
"వసంతకుసుమాకరము" మున్నగుకొన్ని యోగంబులు గానరావు.
వైపరీత్యములచే నన్నివిధముల దాని యప్రాశస్త్యముంజూచి
వేత్తలసహాయంబున ముద్రించితిమి. ఇట్టి గ్రంథరాజంబు నాశ్రం
మనయాంధ్రసోదరులు రోగారినికాయంబు నణంచికొందురుగాక.

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

# విషయసూచిక.

## పూర్వఖండము.

## మధ్యమఖండము.

### ప్రథమాధ్యాయము.

## ద్వితీయాధ్యాయము.

## సప్తమాధ్యాయము.

అనుక్తసంగ్రహము.



## ఉత్తరఖండము.

ప్రథమాధ్యాయము.

తృతీయాధ్యాయము.

శారంగ—C



శ్రీమ ద్ధన్వంతరయే నమః.

# శార్ఙ్గధరసంహిత, పూర్వఖండము

## ఆంధ్రతాత్పర్యసహితము.

## ప్ర థ మా ధ్యా య ము.

శ్లో. శ్రియంసదద్యాద్భవతాంపురారి ర్యదంగతేజః ప్రసరేభవానీ,
విరాజతేనిర్మలచంద్రికాయాం మహౌషధీవజ్వలితాహిమాద్రౌ. 1

తా. హిమవత్పర్వతంబున స్వచ్ఛంబగు పున్నమవెన్నెలచే నోషధులు ప్రకా ంచుచందంబున నెవ్వనిశరీరకాంతిచే హిమవంతుని ముద్దులపట్టి తేజరిల్లుచుండునో అట్టి ార్వతీసహితుఁడగు పరమేశ్వరుఁడు మీకు శుభం బొనర్చుఁగాత.

ప్రసిద్ధయోగా మునిభిః ప్రయుక్తా శ్చికిత్సకై ర్యే బహుశోఽనుభూతాః,
ధీయతే శార్ఙ్గధరేణ తేషాం సుసంగ్రహస్సజ్జనరంజనాయ. 2

చరకసుశ్రుతాదిఋషులచేఁ జెప్పఁబడి భిషగ్వరులయనుభవంబున నున్న ప్రసిద్ధయోగంబుల నిందుఁ బొందుపఱచుచున్నాఁడ నని శార్ఙ్గధరాచార్యుఁడు చెప్పు న్నాఁడు.

### రోగోద్భవపూర్వలక్షణము.

హేత్వాదిరూపాకృతిసాత్మ్యజాతిభేదైస్సమీక్ష్యాతురసర్వరోగాన్,
చికిత్సితంకర్షణబృంహణాఖ్యంకుర్వీతవైద్యోవిధివత్సుయోగైః. 3

[1]హేతువు, [2]పూర్వరూపము, [3]ఆకృతి, [4]సాత్మ్యము, [5]జాతి వీనిచే రోగ స్వరూపంబును చక్కఁగా నెఱింగి దోషావస్థాభేదంబుచే [6]కర్షణ, [7]బృంహణ చికిత్సలం జేయందగును.

దివ్యౌషధీనాం బహవః ప్రభేదాః
బృందారకాణామివ విస్ఫురంతి,
జ్ఞాత్వేతిసందేహమపాస్య ధీరైః
సంభావనీయా వివిధప్రభావాః. 4

ఇంద్రాదిదేవతలకు విభిన్నప్రభావంబు అణిమాదిశక్తులు గలిగియుండు చందం బున నోషధులకుఁగూడ ననేకభేదంబులు, భిన్నంబు లగు శక్తులు గలవు. ఇట్టి వానిని చక్కఁగా నెఱింగి గుణదోషజ్ఞుఁడగు వైద్యుఁడు చికిత్సలం జేయం దగును.

రోగభేదములు.

స్వాభావికాగంతుకకాయికాంతరా
రోగా భవేయుః కిల కర్మదోషజాః,
తచ్ఛేదనార్థం దురితాపహారిణః
శ్రేయోమయాన్యోగవరాన్నియోజయేత్. 5

---

1 'హేతువు' అనగా రోగము పుట్టుటకు ముఖ్యకారణము. 2 'పూర్వరూపము' అనగా రోగము జనించుటకు పూర్వము పుట్టు వెలవెలఁబాటు, ఒడలువిఱుపు, ఆవులింతలు, నేత్రస్రావము మొదలగునవి. 3 'ఆకృతి' యనగా రోగము పుట్టినపిమ్మట నారోగంబున పుట్టు లక్షణములు. 4 'సాత్మ్యము' అనగా రోగజ్ఞానము సంపూర్ణముగా తెలియనపుడు ఆయాదోషనివృత్తికి సాధనంబులగు ఆహారాచారప్రయోగము. 5 'జాతి' యన ప్రకుపితంబగు దోషంబునకు ఊర్ధ్వగతియు, అధోగతియు, తిర్యగ్గతియు వీని చే గలిగెడి రోగంబులకు చికిత్సాభేదంబును తెలియఁజేయు నుపాయము. అయ్యది సంప్రాప్తి యని వ్యవహరింపఁబడును. అది సంఖ్యాదిభేదంబుల నానావిధంబై యుండును. ఆయాభేదంబుల తంత్రాంతరంబున జూడందగును. 6 'కర్షణచికిత్స' యనగా తీక్ష్ణంబులగు నోషధులచే శరీరంబును కృశింపఁజేయుట, ఇది ''అపతర్పణ'' మనంబడును. 7 'బృంహణచికిత్స' యనగా స్నిగ్ధంబులగు పదార్థంబులచే కృశించినశరీరమునకు పుష్టిని గలిగించుట. ఇయ్యది ''సంతర్పణ'' మనఁబడును.

1స్వాభావికములు, 2ఆగంతుకములు, 3కాయికములు, 4ఆంతరములు, అని రోగంబులు నాలుగువిధంబుల వ్యవహరింపఁబడును. ఇయ్యవి కర్మచేతను, దోషప్రకోపముచేతను, కర్మదోషములచేతను బుట్టుచుండును.

ప్రయోగానాగమాత్సిద్ధాన్ప్రత్యక్షాదనుమానతః,
సర్వలోకహితార్థాయ వక్ష్యామ్యనతివిస్తరాత్. 6

ప్రత్యక్షానుమానప్రమాణంబులకు విరుద్ధంబులుగాని శాస్త్రోక్తప్రయోగము లను సంగ్రహముగాఁ జెప్పుచున్నాను.

పూర్వఖండస్థాధ్యాయానుక్రమణిక.

ప్రథమం పరిభాషాస్యాద్భైషజ్యాఖ్యానకం తథా,
నాడీపరీక్షాదివిధిస్తతో దీపనపాచనమ్. 7
తతః కలాదికాఖ్యానమాహారాదిగతిస్తథా,
రోగాణాం గణనాచైవ పూర్వఖండోఽయమీరితః. 8

పూర్వఖండమందు ప్రథమాధ్యాయంబున పరిభాషాకథనంబును, రెండవ యధ్యాయంబున ఔషధాదివిధియు, మూడవయధ్యాయంబున పరీక్షాదివిధులును, నాలవ యధ్యాయంబున దీపన, పాచన, లేఖనాదిలక్షణంబులును, ఐదవయధ్యాయంబున కలాది వరణంబును, ఆఱవయధ్యాయంబున రోగసంఖ్యయు చెప్పఁబడును.

---

1 'స్వాభావికములు' అనగా మానవజన్మమునకు స్వభావంబుగా గలుగుచుండెడి ప్పి, నిద్ర, ఆకలి, ముదిమి మొదలగునవి. ఇయ్యవి స్వభావంబుగా జనించుటంజేసి శరీర ంనకు బాధను కలిగింపకున్నను అవస్థాభేదంబుచే రోగలక్షణంబు లగుటంజేసి రోగంబు ) వ్యవహరింపఁబడుచున్నవి. 2 'ఆగంతుకములు' అనగా యుద్ధాదులందు ఖడ్గంబులచే ట్టుతగులుట, శక్తికిమించి బరువుమోయుట, క్రూరజంతువులతోఁ బోరుట, గుట్టల ండి క్రిందికిపడుట ఈ మొదలగువానిచే పుట్టిన "ఉరఃక్షతము" "అభిఘాతవ్రణము" ందలగునవి. 3 'కాయికములు' అనగా మిథ్యాహారవిహారాదులచే ప్రకోపించిన వాత కఫములచే జనించిన జ్వరము, రక్తపిత్తము, అతిసారము, కాసము, శ్వాసము, మొద ునవి. ఇయ్యవి దోషజరోగంబులనిగూడ వ్యవహరింపఁబడును. 4 'ఆంతరములు' గా మనోవికారంబులచే జనించెడి మదము, మూర్ఛ, భ్రమ, ఉన్మాదము, అపస్మా ం, భూతావేశము మొదలగునవి. ఇయ్యవి మానసికరోగంబు లని వ్యవహరింపఁబడును.
రోగభేదజ్ఞానంబుగలిగి యాయారోగంబులకు చెప్పఁబడియుండు ప్రసిద్ధయోగంబుల నైతెలిసి చికిత్సచేయం దగును.

### మధ్యమఖండస్థాధ్యాయానుక్రమణిక.

స్వరసః క్వాథఫాంటౌ చ హిమః కల్కశ్చ చూర్ణకం, 9
తథైవ ఘుటికాలేహౌ స్నేహ స్సంధాన మేవ చ
ధాతుశుద్ధిరసాశ్చైవ ఖండోఽయం మధ్యమ స్స్మృతః,

మధ్యమఖండమందు ప్రథమాధ్యాయంబున స్వరసవిధానంబును, రెండవయధ్యాయంబున కషాయక్రమమును, మూఁడవయధ్యాయంబున ఫాంటలక్షణంబును, నాల్గవయధ్యాయంబున హిమాదికల్పనయు, ఐదవయధ్యాయంబున కల్కవిధానంబును, ఆఱవయధ్యాయంబున చూర్ణనిర్మాణంబును, ఏడవయధ్యాయంబున గుటికావిధానంబును, ఎనిమిదవయధ్యాయంబున లేహ్యవిధానంబును, తొమ్మిదవయధ్యాయంబున ఘృతతైలాదిలక్షణంబులును, పదియవయధ్యాయంబున సంధానాదిలక్షణంబులును, పదునొకటియవయధ్యాయంబున స్వర్ణాదిధాతుశుద్ధియు, పదిరెండవయధ్యాయంబున రసభస్మ, ఉపరసభస్మాదులును చెప్పఁబడును.

### ఉత్తరఖండస్థాధ్యాయానుక్రమణిక.

స్నేహపానం స్వేదవిధి ర్వమనంచ విరేచనమ్. 10
తత స్తు స్నేహవస్తిస్స్యా త్తతశ్చాపి నిరూహణం,
తతశ్చా పుత్తరోవస్తి స్తతో నస్యవిధిర్మతః. 11
ధూమపానవిధిశ్చైవ గండూషాదివిధి స్తథా,
లేపాదీనాం విధిః ఖ్యాత స్తథా శోణితవిస్రుతిః. 12
నేత్రకర్మప్రకారశ్చ ఖండస్స్యా దుత్తర స్త్వయం,

ఉత్తరఖండమందు ప్రథమాధ్యాయంబున స్నేహపానవిధియు, రెండవయధ్యాయంబున స్వేదవిధియు, మూఁడవయధ్యాయంబున వమనవిధియు, నాలవయధ్యాయంబున విరేచనవిధియు, ఐదవయధ్యాయంబున స్నేహవస్తి విధానంబును, ఆఱవయధ్యాయంబున నిరూహవస్తిక్రమంబును, ఏడవయధ్యాయంబున ఉత్తరవస్తివిధియు, ఎనిమిదవయధ్యాయంబున నస్యకర్మవిధియు, తొమ్మిదవయధ్యాయంబున ధూమపానవిధియు, పదియవయధ్యాయంబున గండూషాదివిధియు, పదునొకటియవయధ్యాయంబున లేపనాదివిధియు, పదిరెండవయధ్యాయంబున రక్తమోక్షణప్రకారంబును, పదిమూఁడవయధ్యాయంబున నేత్రకర్మ విధానంబును చెప్పఁబడును.

### గ్రంథసంఖ్య.

ద్వాత్రింశత్సమ్మితాధ్యాయై ర్యుక్తేయం సంహితా స్మృతా. 13
షడ్వింశతిశతా న్యత్ర శ్లోకానాం గణితాని చ,

ముప్పదిరెండు అధ్యాయంబులుగ విభజింపఁబడియుండు నీగ్రంథమున రెండువేల ఆఱునూర్లశ్లోకంబులు గలవు.

## ఔషధమానప్రయోజనము.

న మానేన వినాయుక్తిర్ద్రవ్యాణాం జ్ఞాయతే క్వచిత్. 14
అతః ప్రయోగకార్యార్థం మాన మత్రోచ్యతే మయా,

తూనికలేకుండ నెట్టిద్రవ్యములనైనఁ గలిపి ప్రయోగింపఁజనదు. పరిమాణహీనంబగు ద్రవ్యసంయోగంబు నిష్ఫలము. ఏద్రవ్యం బేయోగంబున నెంతపరిమితిగ నుండవలెనో యాద్రవ్యం బాయోగంబున నంతపరిమితముగ నుండెనేని యాఫలంబునిచ్చును. కాన ద్రవ్యాదుల నుపయోగించుతఱి ప్రమాణజ్ఞానార్థము పరిమాణము చెప్పఁబడును. ఇందు మాగధమానంబు శ్రేష్ఠంబని ముందు చెప్పఁబడును గాన యామాగధమానంబును చెప్పుచున్నాఁడ.

## పరమాణ్వాది వివరణము.

జాలాంతరగతే భానౌ యత్సూక్ష్మం దృశ్యతే రజః. 15
తస్య త్రింశత్తమోభాగః పరమాణుస్స కథ్యతే,

గవాక్షరంధ్రంబులనుండి ప్రసరించుసూర్యకిరణంబుల మధ్యమున సంచరించు సూక్ష్మంబగు అణువులో ముప్పదియవభాగము ఒకపరమాణు వనంబడును.

త్రసరేణుర్బుధైః ప్రోక్త స్త్రింశద్భిః పరమాణుభిః. 16
త్రసరేణు స్తు పర్యాయనామ్నా వంశీ నిగద్యతే,

అట్టి పరమాణువులు ముప్పదియైన నొక్కత్రసరేణు వనంబడును. ఇయ్యది "వంశి" యనునామాంతరముచే చెప్పఁబడును.

జాలాంతరగతై స్సూర్యకరై ర్వంశీ విలోక్యతే. 17
షడ్వంశీభి ర్మరీచి స్స్యా త్తాభి ష్షడ్భిస్తు రాజికా,
తిసృభీ రాజికాభి శ్చ సర్షపః ప్రోచ్యతే బుధైః. 18

పూర్వముచెప్పఁబడిన గవాక్షరంధ్రమందు సూర్యకిరణములఁ దెలియంబడు నణువు ఒక 'వంశి' యని వ్యవహరింపఁబడును. అట్టి ఆఱువంశులు ఒకమరీచియనియు, ఆఱు మరీచులు ఒకరాజికయనియు, మూఁడురాజికలు ఒకసర్షపమనియు చెప్పఁబడును.

యవోఽష్టసర్షపైః ప్రోక్తో గుంజా స్యాత్తచ్చతుష్టయం,
షడ్భిస్తు రక్తికాభి స్స్యా న్మాషకో హేమధాన్యకౌ. 19

ఎనిమిది సర్షపములు ఒకయవమనియు, నాలుగుయవములు ఒకగుంజ (ఎఱ్ఱగురి

వింద విత్తు) మనియు, ఆఱుగుంజ లొకమాషమనియు చెప్పఁబడును. మఱియు నీమాషము హేమమనియు, ధాన్యకమనియు చెప్పఁబడును.

మాషైశ్చతుర్భిశ్శాణస్స్యా ద్ధరణస్స నిగద్యతే,
టంక స్స ఏవ కథిత స్తద్ద్వయం కోల ఉచ్యతే. 20
క్షుద్రకో వటకశ్చైవ ద్రంక్షణ స్స నిగద్యతే,

నాలుగుమాషములు [1]ఒకశాణమనియు, ధరణమనియు, టంకమనియు చెప్పఁబడును. రెండుశాణములు ఒకకోలమనియు, క్షుద్రకమనియు, వటకమనియు, ద్రంక్షణమనియు చెప్పఁబడును.

కోలద్వయం చ కర్ష స్స్యా త్స ప్రోక్తః పాణిమానికా. 21
అక్షం పిచుః పాణితలం కించిత్పాణిశ్చ తిందుకం,
బిడాలపదకం చైవ తథా షోడశికా మతా. 22
కరమధ్యో హంసపదం సువర్ణం కబలగ్రహః,
ఉదుంబరంచ పర్యాయైః కర్ష ఏవ నిగద్యతే. 23

మఱియు రెండుకోలములు ఒకకర్షమనియు, పాణిమానికయనియు, అక్షమనియు, పిచువనియు, పాణితలమనియు కించిత్పాణియనియు, తిందుకమనియు, బిడాలపదకమనియు, షోడశికయనియు, కరమధ్యమనియు, హంసపదమనియు, సువర్ణమనియు, కబలగ్రహమనియు, ఉదుంబరమనియు చెప్పఁబడును.

స్యాత్కర్షాభ్యా మర్ధపలం శుక్తి రష్టమికా తథా,
శుక్తిభ్యాంచ పలం జ్ఞేయం ముష్టి రామ్రం చతుర్థికా. 24
ప్రకుంచ షోడశీ బిల్వం పల మేవాత్ర కీర్త్యతే,

రెండుకర్షములు ఒకఅర్ధపలమనియు, శుక్తియనియు, అష్టమికయనియు, రెండు శుక్తులు ఒకపలమనియు, ముష్టియనియు, ఆమ్రమనియు, చతుర్థికయనియు, ప్రకుంచమనియు, షోడశియనియు, బిల్వమనియు, చెప్పఁబడును.

పలాభ్యాం ప్రసృతిర్జ్ఞేయా ప్రసృతశ్చ నిగద్యతే. 25
ప్రసృతిభ్యా మంజలిస్స్యా త్కుడవోఽర్ధశరావకః,
అష్టమానం చ స జ్ఞేయః కుడవాభ్యాం చ మానికా. 26

1 ఆంగ్లేయమానరీతి శాణము, కోలము, కర్షము అనునవి క్రమముగా అణా, పావులా, అరరూపాయీల యెత్తగును.

శరావో౽ష్టపలం తద్వజ్జ్ఞేయ మత్ర విచక్షణైః,

రెండుపలములు ఒకప్రసృతియనియు, లేక ప్రసృతమనియు, రెండుప్రసృతులు ఒకయంజలియనియు, కుడవమనియు, అర్ధశరావమనియు, అష్టమానమనియు, రెండు కుడవములు ఒకమానికయనియు, శరావమనియు, అష్టపలమనియు చెప్పఁబడును.

శరావాభ్యాం భవేత్ప్రస్థ శ్చతుః ప్రస్థై స్తథాఢకం,
భాజనం కంసపాత్రం చ చతుష్షష్టిపలం చ తత్. 27

రెండుశరావంబు లొక ప్రస్థమనియు, నాలుగుప్రస్థములు ఒకఆఢకమనియు, భాజనము, కంసము, పాత్రము అనిచెప్పఁబడును. ఇయ్యది అఱువదినాలుగుపలములు.

చతుర్భిరాఢకై ర్ద్రోణః కలశో నల్వణోన్మనా,
ఉన్మానశ్చ ఘటో రాశి ర్ద్రోణపర్యాయసంజ్ఞకాః. 28

నాలుగుఆఢకములు ఒకద్రోణమనియు, కలశమనియు, నల్వణమనియు, అర్మణ మనియు, ఉన్మానమనియు, ఘటమనియు, రాశియనియు చెప్పఁబడును.

ద్రోణాభ్యాం శూర్పకుంభౌ చ చతుష్షష్టిశరావకః,
శూర్పాభ్యాం చ భవేద్ద్రోణీ వాహోగోణీ చ సాస్మృతా. 29

రెండుద్రోణములు ఒకశూర్పమనియు లేక, కుంభమనియు చెప్పఁబడును. ఇయ్యది అఱువదినాల్గుశరావంబులగును. రెండుశూర్పములు ఒకద్రోణియనియు, వాహమనియు, గోణియనియు చెప్పఁబడును.

ద్రోణీ చతుష్టయం ఖారీ కథితా సూక్ష్మబుద్ధిభిః,
చతుస్సహస్రపలికా షణ్ణవత్యధికాచ సా. 30

నాలుగుద్రోణులు ఒకఖారియని చెప్పఁబడును. ఇయ్యది నాలుగువేల తొంబది యాఱుపలములు.

పలానాం ద్విసహస్రంచ భార ఏకః ప్రకీర్తితః,
తులా పలశతం జ్ఞేయా సర్వత్రైవైష నిశ్చయః. 31

రెండువేలపలములు ఒక భారమనియు, నూఱుపలములు ఒకతులయనియు చెప్పఁబడును. ముందు చెప్పఁబోవుప్రమాణంబుల నీప్రకారంబుగనే తెలిసికొనందగును.

మాషటంకాక్షబిల్వాని కుడవః ప్రస్థ మాఢకం,
రాశి ర్గోణీ ఖారికేతి యథోత్తరచతుర్గుణాః. 32

నాలుగుమాషంబు లొకటంకమనియు, నాలుగుటంకము లొకఅక్షమనియు,

నాలుగుఅక్షము లొకబిల్వమనియు, నాలుగుబిల్వము లొకకుడవమనియు, నాలుగుకుడవము లొక ప్రస్థమనియు, నాలుగుప్రస్థము లొకఆఢకమనియు, నాలుగుఆఢకము లొకరాశియనియు, నాలుగురాసు లొకగోణియనియు, నాలుగుగోణు లొకఖారియనియు తెలియంగునది.

గుంజాదిమాన మారభ్య యావత్స్యాత్కుడవస్థితిః,
ద్రవార్ద్రశుష్కద్రవ్యాణాం తావన్మానం సమంమతమ్. 33
ప్రస్థాదిమాన మారభ్య ద్విగుణం తద్ద్రవార్ద్రయోః,
మానం తథా తులాయాస్తు ద్విగుణం న క్వచిత్స్మృతమ్. 34

పూర్వము చెప్పఁబడిన గుంజాప్రమాణము మొదలు కుడవప్రమాణమువఱకును ద్రవపదార్థములను, పచ్చిద్రవ్యములను, ఎండినవస్తువులను ప్రయోగించునెడల పూర్వపుపరిమాణముగనే ప్రయోగింపందగును. ప్రస్థము మొదలుకొని ద్రవపదార్థములను, పచ్చివస్తువులను ద్విగుణంబుగాఁ బ్రయోగింపక జనును. అయినను తులాప్రమాణమునకు ద్విగుణప్రయోగంబుగూడదు. నూఱుపలములుమాత్రమే ప్రయోగింపందగును.

పాలు మొదలగువానిఁ గొలుచు పాత్రలక్షణము.

మృద్వృక్షవేణులోహాదే ర్భాండం యచ్చతురంగుళం,
విస్తీర్ణం చ తథోచ్చం చ తన్మానం కుడవం విదుః. 35

బంకమన్ను, వృక్షము, వెదురు, లోహము మొదలగువానిచే నిర్మింపఁబడి నాలుగు అంగుళములు వెడల్పును, నాలుగుఅంగుళములపొడవును గలపాత్రము కుడవమనంబడును. ఇయ్యది ద్రవపదార్థములకొలఁత కుపయోగించును.

ఔషధనామ వివరణము.

యత్తౌషధంతు ప్రథమం యస్య యోగస్య కథ్యతే,
తన్నామ్నైవస యోగోహి కథ్యతేఽత్ర వినిశ్చయః. 36

ఏయౌషధయోగంబున నేద్రవ్యము మొదట చెప్పఁబడియుండునో యాద్రవ్యప్రధానమగు నామంబున నాయోగంబు వ్యవహరింపఁబడును. ఎట్లనగా సితోపలాదిచూర్ణము తాళీసాదిచూర్ణము మొదలగునవి. మఱియు నీగ్రంథమున యోగకర్తలనామంబునను యోగశక్తులచేతను గూడ గొన్నియోగనామంబులు గలవు. భాస్కరలవణము, సుదర్శనచూర్ణము మొదలగునవి.

ఔషధప్రమాణము.

కాలింగం మాగధం చైవ ద్వివిధం మానముచ్యతే,

కాలింగా న్మాగధం శ్రేష్ఠం మానం మానవిదో విదుః. 37

కాళింగమనియు, మాగధమనియు, మానంబు రెండువిధంబులు. అందు కాళింగ మానంబుకంటె మాగధమానంబు శ్రేష్ఠంబు గాన పూర్వము మాగధమానంబు చెప్పఁబడి యెను.

స్థితిర్నా స్త్యేవ మాత్రాయాః కాలమగ్నిం వయో బలం,
ప్రకృతిందోషదేశౌచ దృష్ట్వామాత్రాంప్రకల్పయేత్. 38

ఈగ్రంథంబున యోగంబులందు కొన్నిస్థలముల మాత్ర చెప్పఁబడినది. కొన్ని ప్రదేశంబుల చెప్పఁబడియుండలేదు. ఎట్లైనను ఔషధము ప్రయోగించునపుడు కాలము, జాఠరాగ్ని, వయస్సు, బలము, స్వభావము, దోషము, దేశము వీనిని చక్కఁగా నాలో చించి తత్తదనుకూలంబగు మాత్రను ప్రయోగింపందగును.

యతో మందాగ్నయో హ్రస్వా హీనసత్వానరాఃకలౌ,
అతస్తుమాత్రాతద్యోగ్యాప్రోచ్యతే ప్రాజ్ఞసమ్మతా. 39

ఈకలియుగంబున మానవులు మిగుల జాఠరాగ్ని లేనివారును, పొట్టివారును, బలములేనివారును అగుటచేత వారికి తగినమాత్రలను కాళింగమానప్రకారము చెప్పఁబడు చున్నది.

యవోద్వాదశభిర్గౌరసర్షపైః ప్రోచ్యతే బుధైః,
యవద్వయేనగుంజాస్యా త్త్రిగుంజోవల్లఉచ్యతే. 40
మాషోగుంజాభిరష్టాభి స్సప్తభిర్వాభవేత్క్వచిత్,
స్యాచ్చతుర్మాషకై శ్శాణ స్సనిష్కష్టంకఏవచ. 41
గద్యాణో మాషకైష్షడ్భిః కర్షస్స్యాద్దశమాషకః,
చతుఃకర్షైః పలంప్రోక్తం దశశాణమితంబుధైః. 42
చతుఃపలైశ్చకుడవం ప్రస్థాద్యాఃపూర్వవన్మతాః,

పండ్రెండు తెల్ల ఆవగింజలు ఒక యవప్రమాణమనియు, రెండుయవములు ఒక గుంజయనియు, మూడుగుంజలు ఒకవల్లమనియు, ఎనిమిదిగుంజలుగాని ఏడుగుంజలుగాని ఒకమాషమనియు, నాలుగుమాషములు ఒక శాణమనియు - నిష్కమనియు - టంక మనియు, ఆఱుమాషకములు ఒకగద్యాణమనియు, పదిమాషములు ఒకకర్షమనియు, నాలుగుకర్షములు ఒకపలమనియు - పదిశాణములనియు, నాలుగుపలములు ఒకకుడవ మనియు చెప్పఁబడును. ప్రస్థాదిప్రమాణంబులను మాగధమానంబువలె నెఱుంగునది.

### ఔషధయుక్తాయుక్తవిచారము.

నవాన్యేవహియోజ్యాని ద్రవ్యాణ్యఖిలకర్మసు. 43
వినావిడంగకృష్ణాభ్యాం గుడధాన్యాజ్యమాక్షికైః,

వాయువిడంగములు, పిప్పళ్లు, బెల్లము, ధనియములు, తేనె వీనిని విడిచి సర్వయోగంబులందును క్రొత్తవస్తువులనే చేర్పందగును. పైవస్తువులమాత్రము ప్రాతవిగాఁజేర్చిన శ్రేష్ఠంబులై యుండును.

గుడూచీకుటజోవాసా కూష్మాండశ్చ శతావరీ. 44
అశ్వగంధాసహచరౌ శతపుష్పాప్రసారిణీ,
ప్రయోక్తవ్యాస్సదైవార్ద్రా ద్విగుణానైవకారయేత్. 45

తిప్పతీగె, కొడిసెపాలపట్ట, అడ్డసరము, నేలగుమ్మడు, పిల్లిపీచర, పెన్నేరుగడ్డ, ములుగోరింట, పెద్దసదాప, గొంతెమగోరు వీనిని ఎప్పుడును పచ్చివిగనే ఉపయోగింపందగును. ఇట్టివానిని బ్రయోగించునపుడు పచ్చివిగనే ప్రయోగింపవలెనను నియమముండుటచే ద్విగుణంబుగాఁ బ్రయోగింపందగదు.

శుష్కంనవీనంయద్ద్రవ్యం యోజ్యంసకలకర్మసు,
ఆర్ద్రంచద్విగుణంయుంజ్యా దేషసర్వత్ర నిశ్చయః. 46

పైనఁజెప్పిన తిప్పతీగె మొదలగుద్రవ్యములు గాక ఇతరద్రవ్యములను ఎండినవానిని క్రొత్తవిగా ప్రయోగింపవచ్చును. వానినిమాత్రము పచ్చివిగా నుపయోగించుతఱి రెండింతలు ప్రయోగింపవలెను.

కాలేఽనుక్తేప్రభాతంస్యా దంగేఽనుక్తేజటాభవేత్,
భాగేఽనుక్తేతుసామ్యంస్యా త్పాత్రేఽనుక్తేచమృణ్మయమ్. 47
ద్రవేఽనుక్తేజలంగ్రాహ్యం తైలేఽనుక్తే తిలోద్భవం,

సిద్ధంబగు నౌషధము సేవించుకాలము చెప్పఁబడకుండిన నచ్చట ప్రాతఃకాలమున సేవింపందగును. ఓషధిగ్రహించునపుడు వేరు, పట్ట, ఆకు మొదలగువాని భేదము నుడువకున్న వేళ్లు గ్రహింపందగును. వస్తువులపరిమాణము చెప్పకుండిన సమభాగంబులుగా గూర్పందగును. ఔషధపాత్రమును జెప్పకుండిన మంటిపాత్ర నుపయోగింపవలెను. ద్రవపదార్థములను నిర్దేశింపకుండిన నీటిని బోయందగును. ఏనూనెయో చెప్పకుండిన నువ్వులనూనె వేయవలయును.

ఏకమప్యౌషధంయోగే యస్మిన్యత్పునరుచ్యతే. 48
మానతోద్విగుణంప్రోక్తం తద్ద్రవ్యంతత్త్వదర్శిభిః,

ఏ ఔషధయోగంబుననైన నొక్కద్రవ్యమును రెండుమాఱులు చెప్పియుండిన దానిని రెండింతలు ప్రయోగింపవలెనని యెఱుంగునది.

## చూర్ణాదిమిళిత చందనలక్షణము.

చూర్ణస్నేహాసవా లేహాః ప్రాయశశ్చందనాన్వితాః. 49
కషాయలేపయోః ప్రాయోయుజ్యతేరక్తచందనం,

చూర్ణములు, ఘృతములు, తైలములు, ఆసవములు, లేహములు, వీనియందు గంధమును జేర్చునెడ శ్వేతచందనంబును, కషాయంబు, లేపనము వీనియందు రక్త (ఎఱ్ఱ) చందనంబును జేర్పందగును.

## ఔషధవీర్యహీనకాలము.

గుణహీనంభవేద్వర్షా దూర్ధ్వంతద్రూపమౌషధమ్. 50
మాసద్వయాత్తథాచూర్ణం హీనవీర్యత్వమాప్నుయాత్,
హీనత్వం ఘుటికాలేహౌ లభేతే వత్సరాత్పరమ్. 51
హీనాస్స్యుర్ఘృతతైలాద్యా శ్చతుర్మాసాధికాస్తథా,
ఓషధ్యోలఘుపాకాస్స్యు ర్నిర్వీర్యావత్సరాత్పరమ్. 52
పురాణాస్స్యుర్గుణైర్యుక్తా ఆసవా ధాతవో రసాః,

ఓషధులను అట్లనే యుంచిన సంవత్సరము పిమ్మట గుణహీనంబులగును. చూర్ణములు రెండుమాసంబులకు పిమ్మటను, గుటికలు, లేహ్యములు, ఇవి సంవత్సరమునకు పిమ్మటను, ఘృతము-తైలము మొదలగునవి నాలుగుమాసంబుల యనంతరంబునను గుణహీనంబులగును. ఆసవములు, భస్మములు, రసాయనంబులును, ప్రాతవి యగుకొలఁదిని గుణవత్తరంబులై యుండును.

వ్యాధేరయుక్తంయద్ద్రవ్యం గణోక్తమపి తత్త్యజేత్. 53
అనుక్తమపియద్యుక్తం యోజయేత్తత్ర తద్బుధః,

ఏయౌషధగణంబునందైనఁ జెప్పఁబడిన ద్రవ్యము ప్రకృతరోగంబునకు అయుక్తమైనచో నట్టిద్రవ్యమును త్యజింపవలెను. చెప్పఁబడకుండినను యోగ్యమగుద్రవ్యమును గ్రహింపవలయును. ఇయ్యది అనుభవంబుగలిగి చికిత్సజేయు వైద్యుని యధీనంబైయున్నది.

## దేశభేదముచే ఔషధభేదములు.

ఆగ్నేయావింధ్యశైలాద్యా స్సౌమ్యోహిమగిరిర్మతః. 54
అతస్తదౌషధాని స్యురనురూపాణి హేతుభిః,

అన్యేష్వపిప్రరోహంతి వనేషూపవనేషుచ. 55

వింధ్యాదిపర్వతప్రాంతములు ఉష్ణవంతంబులై యుంటఁజేసి యందుద్భవించు ద్రవ్యములు ఉష్ణవీర్యంబులుగను, హిమవత్పర్వతము శీతలవంత మగుటచే నందలి పదార్థములు శీతవీర్యంబులుగ నుండును. మఱియు నేదేశంబున నేపదార్థంబు పుట్టునో యాదేశ గుణంబు గలిగియుండును.

ఓషధిగ్రహణవిధి.

గృహ్ణీయాత్తాని సుమనాశ్శుచిః ప్రాతస్సువాసరే,
ఆదిత్యసమ్ముఖో మౌనీ నమస్కృత్యశివంహృది. 56
సాధారణధరాద్రవ్యంగృహ్ణీయాదుత్తరాశ్రితం,
వల్మీకకుత్సితానూపశ్మశానోషరమార్గజాః. 57
జంతువహ్నిహిమవ్యాప్తానౌషధ్యఃకార్యసిద్ధిదాః,

ఓషధిని గ్రహింపఁదలఁచిన వైద్యుఁడు నిర్మలమనస్కుఁడై శుచిగలిగి సుదినంబున ప్రాతఃకాలంబున సూర్యాభిముఖుండై పరమేశ్వరుని దలంచి సాధారణదేశంబునఁ బుట్టి యుత్తరపుదిక్కునను న్న యోషధిని మాటాడక గ్రహింపవలెను. పుట్టలు, కుత్సితపు ప్రదేశము, ఊటభూమి, శ్మశానము, చౌటభూమి, మార్గము, ఇందుద్భవించిన యోషధులను, పురుగుపట్టినయోషధిని, కాలినద్రవ్యమును, మంచుపట్టినదానిని విసర్జింపవలయును.

శరద్యఖిలకార్యార్థం గ్రాహ్యం సరసమౌషధమ్. 58
విరేకవమనార్థంచ వసంతాంతే సమాహరేత్,

శరత్కాలంబున ద్రవ్యములు వీర్యవంతంబులై యుండుటచేత నాకాలంబున సర్వద్రవ్యములను గ్రహింపవలయును. విరేకౌషధంబులను, వమనౌషధంబులను వసంతకాలమున అంత్యమందు గ్రహింపవలెను.

అతిస్థూలజటాయాస్స్యుస్తాసాం గ్రాహ్యాస్త్వచోబుధైః. 59
గృహ్ణీయాత్సూక్ష్మమూలానిసకలాన్యపిబుద్ధిమాన్,

వేరు గ్రహింపదగిన వృక్షములయొక్క వేరు లావుగనుండిన నావేరుపైని పట్టను గ్రహింపవలెను. సన్నగానుండిన సమూలంబుగా గ్రహింపవలెను.

న్యగ్రోధాదేస్త్వచో గ్రాహ్యస్సారంస్యాద్బీజకాదితః. 60
తాలీసాదేశ్చ పత్రాణి ఫలం స్యాత్త్రిఫలాదితః,
ధాతక్యాదేశ్చపుష్పాణిస్నుహ్యాదేఃక్షీరమాహరేత్. 61

ఇతి శ్రీదామోదరసూను శార్ఙ్గధరాచార్యవిరచితాయాం
ద్విసహస్రషట్ఛతపరిమితసంహితాయాం, సూత్రస్థానే,
పూర్వఖండే, పరిభాషాకథనంనామ
ప్రథమోఽధ్యాయః.

మఱ్ఱి మొదలగు వానినుండి పట్టను, చంద్ర, జీడి మొదలగువానినుండి లోని చేవను, తాళీసవృక్షము మొదలగు వానినుండి ఆకులను, కరక, తాని, ఉసిరిక, పోక, రేగు మొదలగువానినుండి కాయలను, ఆరె, మోదుగు, ఇప్ప, గులాబి మొదలగువానినుండి పువ్వును, జిల్లేడు, జెముడు మొదలగువానినుండి పాలను గ్రహింపదగును.

ఇది శ్రీదామోదరసూను శార్ఙ్గధరాచార్య విరచిత ద్విసహస్ర షట్ఛత
పరిమితసంహితయందు సూత్రస్థానమందలి పూర్వఖండమునఁ
బరిభాషాకథనమను ప్రథమాధ్యాయము.

---

# ద్వితీయాధ్యాయము.

---

## ఔషధసేవనకాలము.

భైషజ్యమభ్యవహరేత్ప్రభాతే ప్రాయశో బుధః,
కషాయాంశ్చ విశేషేణ తత్ర భేదస్తుదర్శితః. 1

రోగి సామాన్యంబుగా ఔషధమును ప్రాతఃకాలముననే సేవింపదగును. అందు ముఖ్యముగా స్వరసము, కషాయము, కల్కము, ఫాంటము ఈ మొదలగువానిని ప్రాతఃకాలముననే సేవింపదగును.

జ్ఞేయఃపంచవిధఃకాలో భైషజ్యగ్రహణేనృణాం,
కించిత్సూర్యోదయేజాతే తథాదివసభోజనే. 2
సాయంతనేభోజనేచ ముహుశ్చాపితథానిశి,

ప్రాతఃకాలము, మధ్యాహ్నము, సాయంకాలము, పలుమాఱు భోజనమధ్యకాలము, రాత్రి ఈ యైదుకాలంబులును ఔషధంబును సేవించుట కుపయుక్తంబులై యుండును. పూర్వపువచనంబు దీనికి విరుద్ధంబుగా నుండినను ప్రాయోవచనంబుగాన విరోధములేదు.

## ప్ర థ మ కా ల ము.

ప్రాయఃపిత్తకఫోద్రేకే విరేకవమనార్థయోః. 3
లేఖనార్థంచభైషజ్యం ప్రభాతేతత్సమాచరేత్,
ఏవంస్యాత్ప్రథమఃకాలోభైషజ్యగ్రహణేనృణామ్. 4

పిత్తప్రకోపంబును నివారించుటకు విరేకౌషధమును సేవించునపుడును, శ్లేష్మప్రకోపంబును నశింపఁజేయుటకు వమనౌషధంబును గ్రహించునపుడును, వాతాదిదోషంబులచే శరీరము వృద్ధినొందునపుడు కృశింపఁజేయుటకు లేఖనౌషధమును సేవించునపుడును, ప్రాతఃకాలము శ్రేష్ఠమై యుండును.

## ద్వి తీ య కా ల ము.

భైషజ్యంవిగుణేఽపానే భోజనాగ్రే ప్రశస్యతే,
అరుచౌచిత్రభోజ్యైశ్చ మిశ్రంరుచిరమాహరేత్. 5
సమానవాతేవిగుణేమందేఽగ్నావగ్నిదీపనం,
దద్యాద్భోజనమధ్యేచభైషజ్యంకుశలోభిషక్. 6
వ్యానకోపేచభైషజ్యంభోజనాంతేసమాహరేత్,
హిక్కాక్షేపకకంపేషుపూర్వమంతేచభోజనాత్. 7
ఏవంద్వితీయకాలశ్చప్రోక్తోభైషజ్యకర్మణి,

అపానవాతము ప్రకోపించినయెడల భోజనముచేయుటకు పూర్వమునను, అరోచకమునందు రుచించుచిత్రపదార్థములను భుజించునపుడును, సమానవాతము ప్రకోపించి అగ్నిమాంద్యముగలిగినయెడల అగ్నిదీప్తికొఱకును భోజనమధ్యంబునను, వ్యానవాతము ప్రకోపించినయెడల భోజనము పిమ్మటను, ఎక్కిళ్లు, ఆక్షేపకవాతము వీనియందు భోజనమునకు పూర్వమందును, పరమందును ఔషధమును సేవింపందగును. ఇయ్యది రెండవ కాలమగు మధ్యాహ్నకాలము.

## తృ తీ య కా ల ము.

ఉదానేకుపితేవాతే స్వరభంగాదికారిణి. 8
గ్రాసగ్రాసాంతరేదేయంభైషజ్యం సాంధ్యభోజనే,
ప్రాణేప్రదుష్టేసాంధ్యస్యభక్తస్యాంతేచదీయతే. 9
ఔషధంప్రాయశోధీరైఃకాలోఽయంస్యాత్తృతీయకః,

కంఠగతమగు ఉదానవాయువు ప్రకోపించుటచేఁ గలిగెడి స్వరభంగాదిరోగంబులందు సాయంకాలభోజనపు కబలముల మధ్యను, హృదయవ్యాప్తమగు ప్రాణవాయువు

ప్రకోపించునపుడు సాయంకాల భోజనంబు పిమ్మటను, ఔషధంబును సేవింపవలయును. ఇయ్యది మూఁడవసాయంకాలము.

## చతుర్థ కాలము.

ముహుర్ముహుశ్చతృట్ఛర్దిహిక్కా శ్వాసగరేషుచ. 10
సాన్నంచ భేషజందద్యాదితి కాలశ్చతుర్థకః,

దాహము, వాంతి, ఎక్కిళ్లు, శ్వాసము, విషదోషము ఈమొదలగురోగంబులందు పలుమాఱులు భోజనంబున నౌషధంబును సేవింపవలయును. ఇది చతుర్థకాల మనఁబడును.

## పంచమ కాలము.

ఊర్ధ్వజత్రువికారేషు లేఖనే బృంహణే తథా. 11
పాచనంశమనం దేయమనన్నం భేషజంనిశి,
ఇతిపంచమకాలస్స్యాత్ప్రోక్తో భైషజ్యకర్మణి. 12

కర్ణరోగములు, నేత్రరోగములు, ముఖరోగములు, నాసారోగములు ఈమొదలగు ఊర్ధ్వజత్రురోగములందును, ప్రకోపించు వాతాదిదోషంబులను శాంతిపఱచు లేఖనకర్మయందును, క్షీణంబులగు ధాతువులను వృద్ధినొందించు బృంహణకర్మమందును, పాచనౌషధంబులను, శమనౌషధంబులను రాత్రి సేవింపందగును.

## ఔషధావస్థాస్వరూపము.

ద్రవ్యేరసోగుణోవీర్యం విపాకశ్శక్తిరేవచ,
సంవేదనక్రమాదేతాః పంచావస్థాః ప్రకీర్తితాః. 13

ఔషధద్రవ్యమందు మధురాదిరసంబును, గురుత్వాదిగుణంబును, ఉష్ణాదివీర్యంబును, మధురాదివిపాకంబును, ప్రభావంబును, అను నాఱుశక్తులుగలవు. ఈయాఱును ప్రతిద్రవ్యంబునందును నిమిడియున్నవి.

మధురోఽమ్లఃపటుశ్చైవ కటుతిక్తకషాయకాః,
ఇత్యేతేషడ్రసాఃఖ్యాతా నానాద్రవ్యసమాశ్రితాః. 14

తీపు, పులుపు, ఉప్పు, కారము, చేదు, ఒగరు అనునవియాఱును రసంబు లనఁబడును. ఇవి ద్రవ్యము నాశ్రయించియున్నవి.

ధరాంబుక్ష్మానలజలజ్వలనాకాశమారుతైః,
వాయ్వగ్నిక్ష్మానిలైర్భూత ద్వయైరసభవఃక్రమాత్. 15

భూమి, ఉదకము-వీనిచే మధురరసమును, భూమి, వాయువు - వీనిచే నమ్లరసంబును, ఉదకము, అగ్ని-వీనిచే లవణరసంబును, ఆకాశము, వాయువు - వీనిచే కటురసం

బును, వాయువు, అగ్ని-వీనిచే కషాయరసంబును పుట్టుచున్నవి. రసములన్నియు పంచ భూతాత్మకంబులైనను రెండురెండుభూతములు ప్రధానంబుగా గలియుటచేత నీరసంబులు పుట్టుచున్నవి.

గురుస్స్నిగ్ధశ్చ తీక్ష్ణశ్చ రూక్షో లఘు రితి క్రమాత్,
ధారాంబువహ్నీ పవనవ్యోమ్నాం ప్రాయో గుణాస్మృతాః.
ఏష్వేవాంతర్భవం త్యన్యే గుణేషు గుణసంచయాః,

భూమియందు గురుత్వంబును, జలమందు స్నిగ్ధత్వంబును, అగ్నియందు తీక్ష్ణత్వంబును, వాయువునందు రూక్షత్వంబును, ఆకాశమందు లఘుత్వంబును గలవు. ఇట్టి పంచ భూతగుణముల నీరైదిటియందును ఇరువదిగుణము లనిచెప్పఁబడిన ఇతరగుణములన్నియు నంతర్భావము నొందును.

వీర్య ముష్ణం తథా శీతం ప్రాయశో ద్రవ్యసంశ్రయమ్. 17
తత్సర్వమగ్నీషోమీయం దృశ్యతే భువనత్రయే,
అత్రైవాంతర్భవిష్యంతి వీర్యాణ్యన్యాని యాన్యపి. 18

లోకమందలి ద్రవ్యసమూహమంతయు చంద్ర సూర్యాత్మకం బౌటచేత ద్రవ్యమందలివీర్యము ఉష్ణత్వముగాని, శీతలత్వముగాని యగుచుండుటచేత ఉష్ణవీర్యము, శీతవీర్యము అని వీర్యము రెండువిధంబులగును. ఇతరులుచెప్పిన అష్టవిధవీర్యంబులు వీనిలోననే యంతర్భావములై యుండును.

త్రిధావిపాకో ద్రవ్యస్య స్వాద్వమ్లకటుకాత్మకః,
మిష్టఃపటుశ్చమధురమమ్లోఽమ్లం పచ్యతే రసః. 19
కషాయకటుతిక్తానాం పాకస్స్యాత్ప్రాయశఃకటుః,
మధురాజ్జాయతే శ్లేష్మా పిత్త మమ్లాచ్చ జాయతే. 20
కటుకాజ్జాయతే వాయుః కర్మాణీతి విపాకతః,

మనము భుజించు షడ్రసయుక్తంబగు అన్నము జాఠరాగ్నిసంబంధముచే మూఁడు రసములుగా పరిణమించుచున్నది. అందు మధురము, లవణము, మధురరసముగాను, అమ్లరసము అమ్లరసముగాను, చేదు, వగరు, కారము, ఇవి కటు (కారము) రసముగాను విపాకము నొందుచున్నవి. మఱియు నట్టివిపాకంబులలో మధురవిపాకంబుచే శ్లేష్మంబును, అమ్లవిపాకంబుచే పిత్తమును, కటువిపాకంబుచే వాతమును ప్రకోపించుచుండును.

ప్రభావాస్తు యథాధాత్రీ లఘుశ్చాపి రసాదిభిః 21
సమాపి కురుతే దోష త్రితయస్య వినాశనం,

క్వచిత్తు కేవలం ద్రవ్యం కర్మ కుర్యాత్ప్రభావతః. 22
జ్వరం హంతి శిరోబద్ధా సహదేవీజటా యథా,

రసము, వీర్యము, విపాకము, వీనిచే తుల్యంబగు ఉసిరికకాయ త్రిదోషములను శమింపఁజేయుచున్నది. ఒకవస్తువు త్రిదోషంబుల నెట్లుబోనణఁచును? అయ్యది వస్తు ప్రభావము. శిరంబునఁగట్టఁబడిన సహదేవివేరు జ్వరంబును హరించుచందంబునఁ గొన్ని ద్రవ్యములు తమప్రభావంబుచే గొన్నిక్రియల నిర్వర్తించును.

క్వచిద్రసో గుణో వీర్యం విపాకశ్శక్తిరేవచ. 23
కర్మస్వంస్వం ప్రకుర్వంతి ద్రవ్యమాశ్రిత్య సంస్థితాః,

రస, గుణ, వీర్య, విపాకంబులు ద్రవ్యము నాశ్రయించి యుంటఁజేసి ద్రవ్యాధీనంబులైనను, కొలఁదివిషయంబుల స్వతంత్రముగనే తమతమ కార్యంబుల నిర్వర్తించుచున్నవి.

## వాతాదిదోషోత్పత్త్యుపశమనకాలము.

చయకోపశమా యస్మిన్ దోషాణాం సంభవంతి హి. 24
ఋతుషట్కం తదాఖ్యాతం రవేరాశిషు సంక్రమాత్,

సూర్యుఁడు మేషాదిరాసులందుఁ బ్రవేశించుటచే పదిరెండురాసు లగుచుండును. అట్టి రాసులు రెండుకూడిన నొక్కఋతువు అనఁబడును. అట్టి ఋతుభేదంబుచే వాతాది దోషములకు చయ, ప్రకోప, ప్రశమావస్థలు గలుగుచుండును.

గ్రీష్మోమేషవృషౌ ప్రోక్తౌ ప్రావృణ్మిథునకర్కయోః. 25
సింహకన్యేస్మృతావర్షా స్తులావృశ్చికయో శ్శరత్,
ధనుర్గ్రాహౌచ హేమంతో వసంతః కుంభమీనయోః. 26

మేష వృషభరాసులు గ్రీష్మర్తువు లనియు, మిథున కర్కటక రాసులు ప్రావృడృతువనియు, సింహ కన్యారాసులు వర్షర్తువనియు, తులా వృశ్చికరాసులు శరదృతువనియు, ధనుర్మకరరాసులు హేమంతర్తువనియు, కుంభ మీన రాసులు వసంతర్తువనియుఁ జెప్పఁబడును.

గ్రీష్మే సంచీయతే వాయుః ప్రావృట్కాలే ప్రకుప్యతి,
వర్షాసు చీయతే పిత్తం శరత్కాలేప్రకుప్యతి. 27
హేమంతే చీయతే శ్లేష్మా వసంతేచ ప్రకుప్యతి,
ప్రాయేణ ప్రశమం యాతి స్వయమేవ సమీరణః. 28
శరత్కాలే వసంతేచ పిత్తం ప్రావృడృతౌ కఫః,

కాలస్వభావంబుచే వాతము గ్రీష్మర్తువునందు వృద్ధిఁజెంది, ప్రావృడృతువునందు ప్రకోపించును. శరదృతువునందు శాంతించును. పిత్తము వర్షర్తువునందు వృద్ధినొంది, శరదృతువునందు ప్రకోపించి వసంతర్తువునందు శాంతించును. శ్లేష్మము హేమంతర్తువునందు వృద్ధినొంది వసంతమునందు ప్రకోపించి ప్రావృడృతువున శాంతించును.

కార్తికస్యదినాన్యష్టావష్టా వాగ్రయణస్యచ. 29
యమదంష్ట్రాసమాఖ్యాతా స్వల్పభుక్తో హి జీవతి,

కార్తికమాసమునందలి యంత్యమున ఎనిమిది దినములును, మార్గశీర్షమాసంబున ప్రారంభమందలి ఎనిమిదిదినములును "యమదంష్ట్ర" యనంబడును. ఆసమయంబున స్వల్పముగా భుజించువాఁడు ఆరోగ్యవంతుఁ డగును.

చయకోపశమాదోషా విహారాహారసేవనైః. 30
సమానైర్యాంత్యకాలేఽపి విపరీతై ర్విపర్యయమ్,

పూర్వము వాతాదిదోషంబులు కాలస్వభావంబుచే చయప్రకోప ప్రశమంబులం జెందుచుండునని జెప్పఁబడెను. కాని వాతాదిదోషము మిథ్యాహార విహారాదులచే నెప్పుడైనను చయప్రకోపప్రశమంబులం జెందును. యోగ్యములగు ఆహారాదులచే వాని కాలంబునఁ గూడఁ బొందకుండును.

లఘురూక్షామితాహారాదతిశీతాచ్ఛ్రమాత్తథా. 31
ప్రదోషేకామశోకాభ్యాం భీచింతారాత్రిజాగరైః,
అభిఘాతా దపాంగాహా దజీర్ణే ధాతుసంక్షయాత్. 32
వాయుః ప్రకోపం యాత్యేభిః ప్రత్యనీకైశ్చ శామ్యతి,

లఘుపదార్థములు, రూక్షపదార్థములు, అతిమాత్రభోజనంబు, అతిశీతలసేవ, అలసట, కామము, శోకము, భయము, విచారము, రాత్రిమేల్కొనుట, దెబ్బతగులుట, చెఱువులోనీదుట, అజీర్ణము, ధాతుక్షయము వీనిచే వాతము ప్రకోపించును. మఱియు ప్రదోషకాలంబునఁగూడ వాతప్రకోపము గలుగును. అట్టి వాతము వీనికి విపరీతంబులగు గురుపదార్థము, స్నిగ్ధపదార్థము మొదలగువానిచే శాంతిఁ జెందును.

విదాహికటుకామ్లోష్ణభోజ్యైరత్యుష్ణసేవనాత్. 33
మధ్యాహ్నే క్షుత్తృషారోధాజ్జీర్యత్యన్నేఽర్ధరాత్రకే,
పిత్తం ప్రకోపంయాత్యేభిః పత్యనీకైశ్చ శామ్యతి. 34

విదాహి పదార్థములు, కారము, పులుసు, ఉష్ణపదార్థములు, ఎండందిరుగుట, ఆకలి, దప్పి వీనిని నిరోధించుట, వీనిచే పిత్తము ప్రకోపించును. మఱియు మధ్యాహ్న

కాలమున అన్నము జీర్ణమగునపుడును అర్ధరాత్రమందును ప్రకోపించును. వీనికి విపరీతంబులగు ఆహారాదులచే శమించును.

మధురస్నిగ్ధశీతాద్యై ర్భోజ్యైర్దివసనిద్రయా,
మందేఽగ్నౌ చ ప్రభాతేచ భుక్తమాత్రే తథాఽశ్రమాత్. 35
శ్లేష్మా ప్రకోపంయాత్యేభిః ప్రత్యనీకైశ్చ శామ్యతి,

ఇతి శ్రీదామోదరసూను శార్ఙ్గధరేణ విరచితాయాం సంహితాయాం
సూత్రస్థానే, పూర్వఖండే, భైషజ్యాఖ్యానంనామ
ద్వితీయోఽధ్యాయః.

తీయనివస్తువులు, చమురుపదార్థములు, చల్లనిపదార్థములు, వీనిని మిక్కుటముగా సేవించుట, పగట నిద్రించుట, అగ్నిమాంద్యము, వ్యాయామము చేయకుండుట, వీనిచే శ్లేష్మము ప్రకోపించును. మఱియు, ప్రొద్దునను భోజనము చేసినంతను, ప్రకోపించును. వీనికి విపరీతంబులగు ఆహారాదులచే శమించును.

ఇట్లు దామోదరాత్మజుండగు శార్ఙ్గధరునిచే రచింపఁబడిన శార్ఙ్గధర
సంహితయందు పూర్వఖండంబున భైషజ్యాఖ్యానంబను
ద్వితీయాధ్యాయంబు ముగిసెను.

---

# తృతీయాధ్యాయము.

## నాడీపరీక్ష.

కరస్యాంగుష్ఠమూలే యా ధమనీ జీవసాక్షిణీ,
తచ్చేష్టయా సుఖం దుఃఖం జ్ఞేయం కాయస్య పండితైః. 1

కరాంగుష్ఠమూలంబుననుండెడి నాడి జీవనాడి యని చెప్పఁబడును. జ్ఞానవంతుఁడగు వైద్యుఁడు ఆనాడిని పరీక్షించి రోగియొక్క సుఖదుఃఖంబులం దెలిసికొనందగును.

## వాతాదిప్రకోపనాడీలక్షణము.

నాడీ ధత్తే మరుత్కోపే జలౌకాసర్పయోర్గతిం,
కులింగకాకమండూకగతిం పిత్తస్య కోపతః. 2
హంసపారావతగతిం ధత్తే శ్లేష్మప్రకోపతః,

వాతము ప్రకోపించినపుడు నాడి జలగ, సర్పము, వీనివలె చలించును. పిత్తము ప్రకోపించుతఱి ఊరబిచ్చుక, కాకి, కప్ప, వీనిగమనంబును గలిగియుండును. కఫము ప్రకోపించినచో హంస, పావురము, వీనిగతి గలిగియుండును.

## సన్నిపాతద్విదోషాసాధ్యనాడీలక్షణము.

లావతిత్తిరివర్తీనాం గమనం సన్నిపాతతః,
కదాచిన్మందగమనా కదాచిద్వేగవాహినీ, 3
ద్విదోషకోపతో జ్ఞేయా హంతిచ స్థానవిచ్యుతా,
స్థిత్వా స్థిత్వా చలతి యా సా స్మృతా ప్రాణనాశినీ. 4
అతిక్షీణాచ శీతాచ జీవితం హంత్యసంశయం,

సన్నిపాతంబులందు నాడి లావుకపిట్ట, తిత్తిరిపక్షి, వర్తకపుపిట్ట, వీనిగతి గలిగియుండును. ద్వంద్వంబున నాడి ఒకమాఱు మెల్లగను, ఒకమాఱు వేగంబుగను చలించుచుండును. స్వస్థానంబున నుండిపోయి చలించు నాడి మరణమును గలిగించును. మఱియు మృత్యునాడి నిలిచినిలిచి చలించుచుండును. అతి క్షీణంబుగనుండును. అతిశీతలంబుగ నుండును.

## జ్వరాదినాడీలక్షణము.

జ్వరకోపేతు ధమనీ సోష్ణా వేగవతీ భవేత్. 5
కామక్రోధాద్వేగవహా క్షీణాచింతాభయప్లుతా,
మందాగ్నేః క్షీణధాతోశ్చ నాడీమందతరా భవేత్. 6
అసృక్పూర్ణాభవేత్కోష్ణా గుర్వీ సామా గరీయసీ,

జ్వరప్రకోపంబున నాడి ఉష్ణముగను వేగముగనుండును. కామక్రోధంబులచే వేగంబుగను, విచారము, భయము, వీనిచే క్షీణంబుగను నుండును. అగ్నిమాంద్యము, ధాతుక్షయము వీనియందు మిగుల మందముగను, అతిరక్తము గలవానినాడి కొంచెము వేడిగను, ఆమదోషంబున మిగుల మందముగను జడముగను నుండును.

లఘ్వీవహతిదీప్తాగ్నేస్తథా వేగవతీ భవేత్. 7
సుఖితస్యస్థిరాజ్ఞేయా తథా బలవతీమతా,
చపలాక్షుధితస్యాపి తృప్తస్య వహతి స్థిరా. 8

అగ్నిదీప్తి గలవాని నాడి లఘువుగను, వేగముగను, ఆరోగ్యవంతుని నాడి స్థిరముగను, బలముగనునుండును. ఆకలి గలవానినాడి చపలముగను, భోజనము చేసిన వానినాడి స్థిరముగనుండును.

### దూతపరీక్ష.

దూతాస్స్వజాతయోవ్యంగాః పటవోనిర్మలాంబరాః,
సుఖినోఽశ్వవృషారూఢాః శుభ్రపుష్పఫలైర్యుతాః. 9
సుజాతయస్సుచేష్టాశ్చ సజీవదిశి సంగతాః,
భిషజం సమయే ప్రాప్తా రోగిణ స్సుఖ హేతవే. 10

వైద్యునిఁ బిలువవచ్చిన రోగియొక్క దూతలు రోగియొక్క జాతియందుఁ బుట్టినవారుగను, అంగవైకల్యము లేనివారుగను, మాటాడుటయందు సామర్థ్యముగల వారుగను, పరిశుద్ధమైన వస్త్రంబుల ధరించినవారుగను, అభిజాత్యము గలవారుగను, సత్స్వభావంబు గలవారుగను, పుష్పాదులం జేత ధరించినవారుగను, గుఱ్ఱమునుగాని వృషభమునుగాని యధిష్ఠించినవారుగ నుండినచో రోగికి సుఖంబు చేకూరును.

### శుభాశుభశకునములు.

వైద్యాహ్వానాయ దూతస్య గచ్ఛతో రోగిణః కృతే,
న శుభం సౌమ్యశకునం ప్రదీప్తంచ సుఖావహమ్. 11

దూత రోగికడనుండి వైద్యునియింటి కేగునపుడు వానికి శుభశకునంబు లయ్యెనేని రోగికి శుభంబు చేకూరును. అశుభశకునంబు లయ్యెనేని యశుభంబౌదవు.

### వైద్యునిశకునములు.

చికిత్సాం రోగిణః కర్తుం గచ్ఛతో భిషజశ్శుభం,
యాత్రాయాం సౌమ్యశకునం ప్రోక్తందీప్తం నశోభనమ్. 12

రోగియొద్దకేగువైద్యునకు శుభశకునం బయ్యెనేని రోగి కారోగ్యంబగును. అశుభశకునంబైన అశుభంబు గలుగును.

### చికిత్సాయోగ్యరోగిలక్షణము.

నిజప్రకృతివర్ణాభ్యాం యుక్తస్సత్త్వేన సంయుతః,
చికిత్స్యో భిషజా రోగీ వైద్యభక్తో జితేన్ద్రియః. 13

నిర్మలంబు లగు స్వభావవర్ణంబులుగలిగి బలసంపన్నుండై వైద్యుఁడు చెప్పిన పథ్యము భుజించుచు వైద్యునియందు భక్తిగలరోగికి చికిత్స చేయందగును.

### దుస్స్వప్నములు.

స్వప్నేషు నగ్నాన్ముణ్డాం శ్చ రక్తకృష్ణాంబరా న్వితాన్,
వ్యంగాంశ్చవికృతాన్కృష్ణాన్ సపాశాన్ సాయుధానపి. 14
బద్ధ్వాతోనిఘ్నతశ్చాపి దక్షిణాం దిశమాశ్రితాన్,



మహిషోష్ట్రఖరారూఢా స్త్రీపుంసోర్యస్తుపశ్యతి. 15
స స్వస్థో లభతే వ్యాధిం రోగీ యాత్యేవ పఞ్చతామ్,

రోగికి స్వప్నంబున (నిద్రలో) వస్త్రవిహీనులును, బోడితలవారును, నల్లనివస్త్రంబుల గట్టుకొన్నవారును, కురూపులును, అంగహీనులును, నల్లనివారును, బంధింపఁబడినవారును, శస్త్రమును ధరించినవారును, కొట్టఁబడుచు దున్నపోతు, ఒంటె, గాడిద, వీనిలో నెద్దానినైన నధిష్ఠించి దక్షిణపుదిశగాఁ బోవుచుండినవారును, అగు స్త్రీపురుషులలో నెవ్వరైనఁ గాన్పించిన రోగి శీఘ్రముగ మరణము నొందును. ఆరోగ్యవంతులకు వ్యాధిపుట్టును.

అధో యోనిపతత్యుచ్చా జ్జలేఽగ్నౌ వా విలీయతే. 16
శ్వాపదైర్హన్యతే యోఽపిమత్స్యాద్యైర్గిలితో భవేత్,
యస్య నేత్రే నిలీయేతే దీపో నిర్వాణతాం వ్రజేత్. 17
తైలం సురా పిబేద్వాపి లోహం వా లభతే తిలాన్,
పక్వాన్నం లభతేఽశ్నాతి విశేత్కూపం రసాతలమ్. 18
స స్వస్థో లభతే వ్యాధిం రోగీ యాత్యేవ పంచతామ్,

రోగికి నిద్రలో తాను ఎత్తుప్రదేశమునుండి క్రిందికిపడినట్లును, నీటిలో మునిఁగినట్లును, అగ్నిలో కాలుచున్నట్లును, దుష్టమృగములచేఁ గొట్టబడినట్లును, మత్స్యాదులచే భక్షింపబడినట్లును, కనులు పోయినట్లును, దీపము ఆరిపోయినట్లును, నూనెనుగాని కల్లునుగాని త్రావినట్లును. లోహము దొరికినట్లును, అన్నము లభించినట్లును, గోడలో ప్రవేశించినట్లును, నువ్వులు దొరికినట్లును కలఁగాంచిన మృతినెందును. ఆరోగ్యవంతునకు రోగము గలుగును.

## దుస్స్వప్నపరిహారము.

దుస్స్వప్నాన్యేవమాదీని దృష్ట్వా బ్రూయాన్నకస్యచిత్. 19
స్నానంకుర్యాదుషస్యేవ దద్యాద్ధేమతిలాదికాన్,
పఠేత్స్తోత్రాణి దేవానాం రాత్రౌ దేవాలయే వసేత్. 20
కృత్వైవం త్రిదినంమర్త్యో దుఃస్వప్నాత్పరిముచ్యతే,

ఇట్టి దుస్స్వప్నంబులఁ గాంచినవారలు తెల్లవాఱినపుడే లేచి ఎవ్వరితోఁగాని చెప్పక శీఘ్రంబుగ స్నానమాచరించి బ్రాహ్మణులకు సువర్ణము నువ్వులు వీనిని దానముచేసి దేవతాస్తోత్రంబులఁ బఠించుచు మూడుదినములు దేవాలయంబుననుండిన నట్టి దుస్స్వప్నదోషంబు వారించును.

### సుస్వప్నములు.

స్వప్నేషు యస్సురాన్ భూపాన్ జీవతస్సుహృదో ద్విజాన్. 21
గోసమిద్ధాగ్నితీర్థాని పశ్యేత్సుఖమవాప్నుయాత్,
తీర్త్వాకలుషనీరాణి జిత్వాశత్రుగణానపి. 22
ఆరుహ్యసౌధగోశైలకరివాహాన్ సుఖీ భవేత్,
శుభ్రపుష్పాణివాసాంసి మాంసమత్స్యఫలానిచ. 23
అగమ్యాగమనం లేపో విష్ఠయా రుదితం మృతిః,
ఆమమాంసాశనం స్వప్నే ధనారోగ్యాప్తయే విదుః. 24
జలౌకాభ్రమరీసర్పో మక్షికావాపి యం దశేత్,
రోగీసభూయాదుల్లాఘః స్వస్థో ధనమవాప్నుయాత్. 25

ఇతి శ్రీదామోదరసూను శార్ఙ్గధరవిరచితాయాం ద్విసహస్రషట్ఛత
పరిమితాయాం సంహితాయాం సూత్రస్థానే,
పూర్వఖండే, నాడీపరీక్షాదికథనంనామ
తృతీయోఽధ్యాయః.

మనుజునకు నిద్రలో, దేవతలు, రాజులు, బ్రతికియుండిన మిత్రులు, బ్రాహ్మణులు, గోవులు, ప్రజ్వరిల్లుచుండినయగ్ని, ప్రయాగాదితీర్థములు, ఈమొదలగునవి గాన్పించినను, తాను బురదనీటిని దాటినట్లును, విరోధులను జయించినట్లును, మేడ, గోవు, పర్వతము, ఏనుగు, గుఱ్ఱము వీని నెక్కినట్లును, మంచిపువ్వులనుజూచినట్లును, మంచిబట్టలను ధరించినట్లును, మత్స్యములు, మాంసము, పండ్లు వీనినిభక్షించినట్లును, రమింపఁదగని స్త్రీతో రమించినట్లును, మలమును పూసికొనినట్లును, తాను మృతినొందినట్లును, పచ్చిమాంసమును భుజించినట్లును, మొసలి, సర్పము, తేనటీగలు ఇవి కరచినట్లును, స్వప్నంబును గాంచినరోగికి ఆరోగ్యము కలుగును. ఇతరులకు ధనంబుచేకూరును.

ఇది శ్రీదామోదరసూను శార్ఙ్గధరాచార్యవిరచిత ద్విసహస్రషట్ఛతపరిమిత
సంహితయందు సూత్రస్థానమందలి పూర్వఖండమున నాడీపరీక్షాదికథనమను
తృతీయాధ్యాయము ముగిసెను.

---

# చతుర్థాధ్యాయము.

## దీపనపాచనౌషధము.

పచే న్నామంవహ్నికృచ్చ దీపనం తద్యథామిసిః,
పచత్యామం న వహ్నిం చ కుర్యాద్యత్తద్ధి పాచనమ్.
నాగకేసరవద్విద్యాచ్చిత్రో దీపనపాచనః,

ఆహారపదార్థములను మాత్రము పచనంబుగావించి అగ్నిని వృద్ధినొందింపకుండు పెద్దసోపుపాచనంబనియు, ఆమమును పచనంబు గావింపక అగ్నిని వృద్ధినొందించు పెసదాప దీపనమనియు, దీపనపాచనంబులఁ గలుగఁజేయు చిత్రమూలము దీపనపాచమనియుఁ జెప్పఁబడును.

## సంశమనౌషధము.

నశోధయతి యద్దోషాన్ సమాన్నోదీరయత్యపి.
సమీకరోతి విషమాన్ శమనం తద్యథాఽమృతా,

సమానస్థితిలోనుండు వాతాదిదోషములకు వైకల్యమును విరోధనమును గల్గింపక ప్రబలంబులును విషమంబులును నగుదోషములను సమముగఁజేయు తిప్పతీగె మున్నగునవి సంశమనౌషధములని యెఱుఁగునది.

## అనులోమనౌషధము.

కృత్వాపాకం మలానాంయద్భిత్వా బంధమధోనయేత్.
తచ్చానులోమనంజ్ఞేయం యథా ప్రోక్తా హారీతకీ,

ఆహారపదార్థంబులను పచనంబు గావించి వానిబంధమును బోగొట్టి యధోమార్గమున వెడలించు కరకకాయ మొదలగునవి యనులోమనౌషధంబు లనఁబడును.

## స్రంసనౌషధము.

పక్తవ్యం యదిపక్త్వైవా శ్లిష్టంకోష్ఠేమలాదికం,
నయత్యధ స్త్రస్రింసనంతద్యథాస్యాత్కృతమాలకః,

పచనంబు గావింపఁదగినపదార్థంబులను పచనంబుగావించి వాని స్థానంబుల నొదించి మలాదులను క్రిందికివెడలించు రేలబంక మొదలగునవి స్రంసనౌషధంబులనఁబడు

### భేదనౌషధము.

మలాదికమబద్ధం యద్బద్ధంవాపిండితంమలైః. 5
భిత్త్వాధః పాతయతి తద్భేదనంకటుకీయథా,

స్వమార్గంబునఁ బోవుచున్నట్టియు బంధించియున్నట్టియు మలమూత్రాదులను భేదించి యధోమార్గంబున వెడలించు కటుకరోహిణి మొదలగునవి భేదనౌషధంబు లనఁబడును.

### రేచనౌషధము.

విపక్వంయదపక్వంవామలాదిద్రవతాంనయేత్. 6
రేచయత్యపితద్జ్ఞేయంరేచనంత్రివృతాయథా,

అఱిగినను అఱుగకున్నను పదార్థములను ద్రవత్వమును జెందించి యధోభాగంబునకు వెడలించు నల్లతెగడ మున్నగునవి రేచనౌషధంబు లనఁబడును.

### వమనౌషధము.

అపక్వపిత్తశ్లేష్మాణౌ బలాదూర్ధ్వం నయేత్తు యత్. 7
వమనంతద్ధి విజ్ఞేయం మదనస్య ఫలంయథా,

పక్వముగాని పిత్తమును, శ్లేష్మమును, ఊర్ధ్వముఖంబున వెడలించు మ్రంగకాయ మున్నగునవి వమనౌషధంబు లనఁబడును.

### సంశోధనౌషధము.

స్థానాద్బహిర్నయేదూర్ధ్వమధోవామలసంచయమ్. 8
దేహే సంశోధనం తత్స్యాద్దేవదాలీఫలం యథా,

వాతాదిదోషంబులతో స్వస్థానంబుననుండెడి మలాదులను ఊర్ధ్వముఖంబుగానైనను, యధోముఖంబుగానైనను, వెడలించు దావరడంగి మొదలగునవి సంశోధనౌషధంబు లనఁబడును.

### ఛేదనౌషధము.

శ్లిష్టాన్కఫాదికాన్దోషానున్మూలయతితద్బలాత్. 9
ఛేదనంతద్యథాక్షారామరిచానిశిలాజతు,

ఒకదానితో నొకటి కలిసియుండెడి దోషములయొక్క బంధమును, బలాత్కారముగ విడగొట్టి స్వస్థానంబునఁ జేర్చు క్షారము, మిరియములు, సొంటి, పిప్పళ్లు, శిలాజతు మొదలగునవి ఛేదనౌషధము లనఁబడును.

### లేఖనౌషధము.

ధాతూన్మలాన్వాదేహస్య విశోష్యోల్లేఖయేచ్చయత్. 1
లేఖనంతద్యథాక్షౌద్రం నీరముష్ణం వచాయవాః,

శరీరమందలి దోషయుక్తంబులగు రసాదిధాతువులను మలములను శుష్కింపఁజేసి శమనం బొనరించు తేనె, వేడినీరు, వస, యవలు మున్నగునవి లేఖనౌషధము లనఁబడును.

### గ్రాహ్యౌషధము.

దీపనం పాచనం యత్స్యాదుష్ణత్వాద్ద్రవశోషకమ్. 1
గ్రాహితచ్చయథాశుంఠీ జీరకం గజపిప్పలీ,

ఎయ్యది దీపనంబై, పాచనంబై, ఉష్ణవీర్యంబౌటచే ద్రవమును శోషింపఁజేయునో, అట్టి సొంటి జీలకఱ్ఱ, పిప్పళ్లు మొదలగునవి గ్రాహ్యౌషధంబు లనఁబడును.

### స్తంభనౌషధము.

రౌక్ష్యాచ్ఛైత్యాత్కషాయత్వాల్లఘుపాకాచ్చయద్భవేత్.
వాతకృత్స్తంభనంతత్స్యాద్యథా వత్సకటుంటుకౌ,

ఎయ్యది రూక్షంబై, శీతంబై కషాయరసంబుతోఁగూడి హితమును శమింపఁజేయునో అట్టి కొడిసెపాలవిత్తులు, దుందిలపుమ్రాను మొదలగునవి స్తంభనౌషధంబు లనఁబడును.

### రసాయనౌషధము.

రసాయనంచతద్జ్ఞేయం యజ్జరావ్యాధినాశనమ్. 13
యథాఽమృతారుదంతీచ గుగ్గులుశ్చహరీతకీ,

శరీరమందలి రోగంబులను నశింపఁజేసి ముదిమిని బోఁగొట్టు తిప్పతీఁగె, అడవి సెనగలు, కరకకాయలు మున్నగునవి రసాయనౌషధము లనఁబడును.

### వాజీకరణౌషధము.

యస్మాద్ద్రవ్యాద్భవేత్స్త్రీషు హర్షో వాజీకరంచతత్. 14
యథానాగబలాద్యాస్తు బీజంచకపికచ్ఛుజమ్,

ఎయ్యది వీర్యవృద్ధిని గలుగఁజేసి సంభోగశక్తిని గలిగించునో అట్టి చిట్టాముట్టి, చన్నచర్లగడ్డ, పంచదార, దూలగొండివిత్తులు మున్నగునవి వాజీకరణౌషధంబు లనఁబడును.

ధాతువృద్ధ్యౌషధము.

యస్మాచ్ఛుక్రస్య వృద్ధిస్స్యాచ్ఛుక్రలంచ తదుచ్యతే. 15
యథాఽశ్వగంధాముసలీ శర్కరాచ శతావరీ,

ఎయ్యది శుక్రమును వృద్ధిఁజేయునో, అట్టి పెన్నేరు, నేలతాడి, పంచదార, పిల్లిపీచర మున్నగునవి ధాతువృద్ధ్యౌషధంబు లనఁబడును.

శుక్రోత్పత్త్యౌషధము.

దుగ్ధంమాషాశ్చ భల్లాతఫలమజ్జామలాని చ. 16
ప్రవర్తకానికథ్యంతే జనకానిచ రేతసః,

శుక్రమును ప్రవర్తింపఁజేయు పాలు, మినుములు, నల్లజీడివిత్తులు, ఉసిరిక పండ్లు మొదలగునవి శుక్రోత్పత్త్యౌషధము లనఁబడును.

వాజీకరణౌషధము.

ప్రవర్తినీ స్త్రీ శుక్రస్య రేచనంబృహతీఫలమ్. 17
జాతీఫలంస్తంభకంచ శోషణీచహరీతకీ,

శుక్రమును ప్రవర్తింపఁజేయునది స్త్రీయనియు, పెద్దములకపండు ఇంద్రియ రేచనమును గలిగించుననియు, జాజికాయ ఇంద్రియస్తంభనమును గలిగించుననియు, కరకకాయ ఇంద్రియమును శోషింపఁజేయుననియుం తెలియం దగును.

సూక్ష్మౌషధము.

దేహస్యసూక్ష్మఛిద్రేషు విశేద్యత్సూక్ష్మముచ్యతే. 18
తద్యథాసైంధవంక్షౌద్రం నింబస్తైలంరుబూద్భవం,

శరీరమందలి సూక్ష్మరంధ్రములను ఎయ్యది ప్రవేశించునో అట్టి సైంధవలవణము, తేనె, వేపనూనె, నువ్వులనూనె, ఆముదము మున్నగునవి సూక్ష్మౌషధము లనఁబడును.

వ్యవాయ్యౌషధము.

పూర్వంవ్యాప్యాఖిలంకాయంతతఃపాకంచగచ్ఛతి. 19
వ్యవాయీతద్యథాభంగా ఫేనంచాహిసముద్భవం,

ఎయ్యది భుజించినతోడనే శరీరమునంతను వ్యాపించి పిమ్మట పచనంబగునో అట్టి గంజాయి, నల్లమందు మున్నగునవి వ్యవాయ్యౌషధము లనఁబడును.

వికాస్యౌషధము.

సంధిబంధాంస్తు శిథిలాన్యత్కరోతి వికాసితత్. 20
విశ్లేష్యౌజశ్చధాతుభ్యోయథాక్రముకకోద్రవాః,

శరీరమునందలి కీళ్లపట్టును వదలించి ప్రకాశంబుగజేసి రసాదిధాతువులద్వారా ఓజస్సును గలుగంజేసెడి వక్కలు, కొఱ్ఱలు, ఈమొదలగునవి వికాస్యౌషధంబు లనం బడును.

మదపదార్థములు.

బుద్ధిం లుంపతియద్ద్రవ్యం మదకారి తదుచ్యతే. 21
తమోగుణప్రధానంచ యథామద్యసురాదికం,

ఏయ్యది తమోగుణప్రధానంబై బుద్ధిని లోపింపఁజేయునో అట్టి కల్లు మొదలగునవి మదపదార్థము లనఁబడును.

ప్రాణహరౌషధము.

వ్యవాయిచవికాసిస్యాత్సూక్ష్మచ్ఛేదిమదావహమ్. 22
ఆగ్నేయంజీవితహరం యోగవాహిస్మృతంవిషం,

ఏయ్యది వ్యవాయి, వికాసి, సూక్ష్మ, ఛ్ఛేది, మద గుణములుగలిగి యాగ్నేయంబై ప్రాణంబులఁ దీయునో అట్టి విషము, వత్సనాభి మొదలగునవి ప్రాణహరౌషధంబు లనఁబడును.

ప్రమాథ్యౌషధము.

నిజవీర్యేణయద్ద్రవ్యం స్రోతోభ్యో దోషసంచయమ్. 23
నిరస్యతిప్రమాథిస్యాత్తద్యథామరిచం వచా,

ఏయ్యది స్వవీర్యంబుచే కర్ణములు, నాసిక, ముఖము మొదలగు రంధ్రంబులఁ బ్రవేశించి యందలి దోషంబులఁ బోగొట్టునో అట్టి మిరియములు, వస మొదలగునవి ప్రమాథ్యౌషధము లనఁబడును.

అభిష్యందిపదార్థములు.

పైచ్ఛిల్యాద్గౌరవాద్ద్రవ్యం రుద్ధ్వా రసవహాస్సిరాః. 24
ధత్తేయద్గౌరవంతత్స్యాదభిష్యందియథా దధి,

ఇతి శ్రీదామోదరసూను శార్ఙ్గధరాచార్యవిరచితాయాం ద్విసహస్ర
షట్ఛతపరిమితసంహితాయాం, సూత్రస్థానే, పూర్వఖండే,
దీపనపాచనాదికథనంనామ చతుర్థోఽధ్యాయః

జిగురుగలిగి గురుగుణవిశిష్టంబై యెయ్యది రసవాహిస్రోతస్సుల నరికట్టి శరీరమునకు గౌరవమునుగలుగఁజేయునో అట్టిపెరుగు మున్నగునవి అభిష్యందిపదార్థము లనఁబడును.

ఇట్లు దామోదరాత్మజుండగు శార్ఙ్గధరునిచే రచింపంబడిన శార్ఙ్గధరసంహితయందు
సూత్రస్థాన పూర్వఖండంబున దీపనపాచనాదికథనమను
చతుర్థాధ్యాయము ముగిసెను.

# పంచమాధ్యాయము.

## కలాలక్షణము.

ధాత్వాశయాంతరస్థస్తు యఃక్లేద స్తత్రధితిష్ఠతి,
దేహోష్మణావిపక్వోయస్సా కలేత్యభిధీయతే. 1

రసాదిధాతువులకు, ఆమాశయాద్యాశయంబులకు మధ్యభాగంబున నుండునట్టియు, దేహసంబంధమగు సూక్ష్మముచే పచనంబు గావింపఁబడిన క్లేదము కల యనఁబడును. ఇదియే శరీరమందలి పొరలనఁబడును.

## శరీరలక్షణము.

కలాస్సప్తాశయాస్సప్త ధాతవస్సప్తతన్మలాః,
సప్తోపధాతవస్సప్త త్వచస్సప్తప్రకీర్తితాః. 2
త్రయోదోషానవశతం స్నాయూనాంసంధయస్తథా,
దశాధికంచద్విశత మస్థ్నాంచత్రిశతంతథా. 3
సప్తోత్తరంమర్మశతం సిరాస్సప్తశతంతథా,
చతుర్వింశతిరాఖ్యాతా ధమన్యోరసవాహికాః. 4
మాంసపేశ్యస్సమాఖ్యాతా నృణాంపంచశతంబుధైః,
స్త్రీణాంచవింశత్యధికా కండరాశ్చైవ షోడశ. 5
నృదేహేదశరంధ్రాణి నారీదేహే త్రయోదశ,
ఏతత్సమాసతఃప్రోక్తం విస్తరేణాధునోచ్యతే. 6

మానవశరీరంబున ఏడు కలలు, ఏడు ఆశయములు, ఏడు ధాతువులు, ఏడు మలములు, ఏడు ఉపధాతువులు, ఏడు చర్మభేదములు, మూఁడు దోషములు, తొమ్మిదినూర్ల స్నాయువులు, ఇన్నూటపది సంధులు, మున్నూఱు ఎముకలు, నూటఏడు మర్మస్థానములు, ఇరువదినాలుగు రసవాహిధమనులు, ఐదునూర్ల మాంసపేసులు, స్త్రీలకు ఐదునూర్ల ఇరువది మాంసపేసులు, స్త్రీపురుషులకు పదునాఱు కండరములు, పురుషునకు పది రంధ్రములు, స్త్రీలకు పదిమూఁడు రంధ్రములుగలవు. ఇట్టి యంగవిభాగంబు సంక్షేపముగాఁ జెప్పఁబడెను. పిమ్మట విస్తరించి చెప్పఁబడును.

## కలావివరణము.

మాంసాసృఙ్మేదసాం తిస్రో యకృత్ప్లీహ్నోశ్చతుర్థికా,

పంచమీచతథాఽఽన్త్రాణాం షష్ఠీచాగ్నిధరామతా. 7
రేతోధరాసప్తమీస్యా దితిసప్తకలాస్మృతాః,

పూర్వము చెప్పఁబడిన యేడు కలలలోను మొదటిది మాంసమును, రెండవది రక్తమును, మూఁడవది మేదస్సును, నాల్గవది యకృత్తును, ప్లీహములను, ఐదవది అంత్రములను, ఆఱవది జాఠరాగ్నిని, ఏడవది శుక్రమును ధరించుచున్నవి.

## ఆశయవివరణము.

శ్లేష్మాశయస్స్యాదురసి తస్మాదామాశయ స్త్వధః. 8
ఊర్ధ్వమగ్న్యాశయోనాభే ర్వామభాగేవ్యవస్థితః,
తస్యోపరితిలంజ్ఞేయం తదధఃపవనాశయః. 9
మలాశయ స్త్వధ స్తస్యవస్తి ర్మూత్రాశయస్మృతః,
జీవరక్తాశయమురో జ్ఞేయా స్సప్తాశయా స్త్వమీ. 10
పురుషేభ్యోఽధికాశ్చాన్యే నారీణామాశయాస్త్రయః,
ధరాగర్భాశయఃప్రోక్త స్తనౌ స్తన్యాశయామతౌ. 11

పూర్వము చెప్పఁబడిన యాశయంబులలో వక్షఃస్థలంబున శ్లేష్మాశయంబును, దాని క్రిందిభాగమున ఆమాశయమును, నాభికి ఎడమప్రక్క పైభాగమున అగ్న్యాశయమును అద్దానికి పైభాగమున తిలకమును, దానిక్రింద వాతాశయమును, వాతాశయమునకు క్రిందిభాగమున మలాశయమును, దాని క్రిందుభాగము మూత్రమున కాధారంబగు వస్తియు, వక్షఃస్థలంబున రక్తాశయమును గలవు. స్త్రీలకు పురుషులకంటె ఉదరంబున గర్భాశయంబును, స్తనములయందు స్తన్యాశయమును అధికంబుగా గలవు.

## రసాదిసప్తధాతువులవివరణము.

రసాసృఙ్మాంసమేదోస్థి మజ్జాశుక్రాణి ధాతవః,
జాయంతేఽన్యోఽన్యతస్సర్వే పాచితాః పిత్తతేజసా. 12
రసాద్రక్తంతతోమాంసం మాంసాన్మేదఃప్రజాయతే,
మేదసోఽస్థి తతోమజ్జా మజ్జాయాశ్శుక్రసంభవః. 13

రసము, రక్తము, మాంసము, మేదస్సు, అస్థి, మజ్జ, శుక్రము అను శరీరమందలి యేడు ధాతువులు జాఠరాగ్నియనెడి పిత్తద్రవముచే పాచితంబులై పుట్టుచున్నవి. అందు భుజించెడి పదార్థములచే రసమును, రసమునుండి రక్తమును, రక్తమునుండి మాంసంబును, మాంసంబునుండి మేదస్సును, మేదస్సునుండి అస్థి (ఎముక)యు, అస్థినుండి మజ్జయు, మజ్జనుండి శుక్రమును క్రమముగా పుట్టుచుండును.

### సప్తధాతువులమలవివరణము.

జిహ్వానేత్రకపోలానాం జలం పిత్తం చ రంజకం,
కర్ణవిడ్రసనాదంతకక్షమేఢ్రాదిజం మలమ్. 14
నఖనేత్రమలం వక్త్రస్నిగ్ధత్వం పిటికా స్తథా,
జాయంతే సప్తధాతూనాం మలాన్యేతాన్యనుక్రమాత్. 15

జిహ్వా, నేత్రములు, చెక్కిళ్లు వీనినుండి స్రవించెడి ద్రవము, రసధాతుమలంబనియు, యకృత్తు నాశ్రయించియుండెడి పిత్తకోశమునుండి పుట్టెడు పిత్తద్రవము రక్తమలమనియు, కర్ణములనుండి పుట్టు గులిమి మాంసమలంబనియు, నాలుక, దంతములు, కక్షము (చంక,) మేఢ్రము వీనినుండి పుట్టునది మేదోమలంబనియు, గోళ్లు, నేత్రములు, వీనియందలి మలము అస్థిమలంబనియు, ముఖమునందలి నునుపు మజ్జామలంబనియు, ముఖమందుపుట్టు మొటిమలు శుక్రమలంబనియు చెప్పఁబడును.

### సప్తోపధాతువులవివరణము.

స్తన్యంరజశ్చనారీణాం కాలే భవతి గచ్ఛతి,
శుద్ధమాంసభవస్స్నేహ స్సావసాపరికీర్తితా. 16
స్వేదోదంతా స్తథా కేశా స్తథై వౌజశ్చసప్తమః,
ఇతిధాతుభవాజ్ఞేయా ఏతే సప్తోపధాతవః. 17
ఓజస్సర్వశరీరస్థం శీతం స్నిగ్ధం స్థిరంమతం,
సోమాత్మకం శరీరస్య బలపుష్టికరం మతమ్. 13

స్తన్యము, రజస్సు, వస, చెమట, దంతములు, వెండ్రుకలు, ఓజస్సు, ఇవి సప్తధాతువుల కుపధాతువు లనంబడును. ఇందు మొదటిరెండును స్త్రీలకు కాలభేదముచే పుట్టి శించుచుండును. పరిశుద్ధంబగు మాంసంబునుండి పుట్టిన చమురు వసయనఁబడును. సర్వశరీరవ్యాపియై శీతవీర్యంబై, స్నిగ్ధమై, స్థిరమై, సోమాత్మకంబై శరీరమునకు బలమును, దార్ఢ్యమును కలుగఁజేయునది ఓజస్సనంబడును.

### సప్తత్వగ్వివరణము.

జ్ఞేయావభాసినీపూర్వాం సిధ్మస్థానంచ సా మతా,
ద్వితీయాలోహితాజ్ఞేయా తిలకాలక జన్మభూః. 19
శ్వేతాతృతీయాసంఖ్యాతా స్థానంచర్మగళస్యసా,
తామ్రాచతుర్థీవిజ్ఞేయా కిలాసశ్విత్రభూమికా. 20
పంచమీవేదనీఖ్యాతా సర్వకుష్ఠోద్భవ స్తతః,

విఖ్యాతరోహిణీషష్ఠీ గ్రంథిగండాపచీస్థితిః. 21
స్థూలాత్వక్సప్తమీ ఖ్యాతా విద్రధ్యాదేస్థితిశ్చసా,
ఇతిసప్తత్వచః ప్రోక్తాః స్థూలావ్రీహిద్విమాత్రయా. 22

పూర్వము చెప్పబడిన సప్తవిధచర్మంబులలో మొదటిది అవభాసిని యనఁబడును అయ్యది సిధ్మకుష్ఠంబునకు స్థానంబు. రెండవది లోహిత యనఁబడును. అది తిలకాలకంబు నకు జన్మస్థానంబు. మూఁడవది శ్వేతయనఁబడును. అది చర్మగళంబునకు స్థానంబు. నా వది తామ్ర యనఁబడును. అది కిలాసము, శ్విత్రము వీనికి స్థానంబు. ఐదవది వేదిని యనంబడును. అందు సర్వకుష్ఠములు జనించును. ఆఱవది రోహిణి యనఁబడును. అందు గ్రంథులు, గండమాలలు, అపచి జనించును. ఏడవది స్థూల యనఁబడును. అందు విద్రధి మూలరోగము, భగందరము జనించును. ఇయ్యది రెండు యవలప్రమాణము గలి యున్నది.

### వాతాదిభేదము.

వాయుఃపిత్తంకఫోదోషాధాతవశ్చమలామతాః,
శరీరదూషణాద్దోషాధాతవోదేహధారణాత్. 2
వాతపిత్తకఫాజ్ఞేయాః మలినీకరణాన్మలాః,
తత్రాపిపంచధాఖ్యాతాః ప్రత్యేకందేహధారణాత్. 2
పిత్తంపంగు కఫఃపంగుః పంగవోమలధాతవః,
వాయునా యత్ర నీయంతే తత్ర గచ్ఛంతి మేఘవత్. 2

వాతము, పిత్తము, కఫము, అను నవి శరీరమును దూషించుటచే దోషంబులనియుం శరీరమును ధరించుటచే ధాతువులనియుఁ, రసాదిధాతువులను దూషించుటచే మలంబు లనియు చెప్పఁబడును. ఇయ్యవి మూఁడును కార్యభేదంబులచేతను, స్థానభేదంబులచేత, ప్రత్యేకము నైదువిధంబులై యుండును. ఇందు పిత్తము, కఫము, పంగువులై (స్వతం ముగా చరించుటకు సామర్థ్యములేనివై) మేఘంబువోలె వాతముపోయిన స్థలము కే తెంచును.

### వాతవివరణము.

పవనస్తేషు బలవాన్విభాగకరణాన్మతః,
రజోగుణమయస్సూక్ష్మశ్శీతోరూక్షోలఘుశ్చలః. 2
మలాశయే చరేత్కోష్ఠే వహ్నిస్థానే తథాహృది,
కంఠే సర్వాంగదేశేషు వాయుః పంచప్రకారతః. 2

అపానస్స్యాత్సమానశ్చ ప్రాణోదానౌ తథైవచ,
వ్యానశ్చేతి సమీరస్య నామాన్యుక్తాన్యనుక్రమాత్. 28
హృది ప్రాణో గుదే పానస్సమానో నాభిసంస్థితః,
ఉదానః కంఠదేశస్థో వ్యాన స్సర్వశరీరగః. 29

త్రిదోషంబులలోను, వాతము బలవత్తరంబై రజోగుణవికారంబై సూక్ష్మంబై
ల్లనై రూక్షంబై చులకనై చంచలంబై యుండును. అయ్యది స్థానభేదంబుచే పంచాత్మ
ంబై మలాశయంబుననుండి అపానంబనియు, ఆగ్న్యాశయంబుననుండి సమానంబనియు,
హృదయమందుండి ప్రాణంబనియు, కంఠమందుండి ఉదానమనియు, సర్వశరీరవ్యాపి
నగుచు వ్యానంబనియు చెప్పఁబడును.

పిత్తవివరణము.

పిత్తముష్ణం ద్రవంపీతం నీలం సత్త్వగుణోత్తరం,
కటుతిక్తరసంజ్ఞేయం విదగ్ధం చామ్లతాంవ్రజేత్. 30
అగ్న్యాశయే భవేత్పిత్త మగ్నిరూపం తిలోన్మితం,
త్వచి కాంతికరం జ్ఞేయం లేపాభ్యంగాదిపాచకమ్. 31
దృశ్యం యకృతియత్పిత్తం తద్గ్రసం శోణితం నయేత్,
యత్పిత్తం నేత్రయుగళే రూపదర్శనకారి తత్. 32
యత్పిత్తం హృదయే తిష్ఠన్మేధా ప్రజ్ఞాకరంచ తత్,
పాచకం భ్రాజకంచైవ రంజకాలోచకే తథా. 33
సాధకంచేతిపంచైవ పిత్తనామాన్యనుక్రమాత్,

పిత్తము ఉష్ణంబై, ద్రవంబై, పీత, నీలవర్ణంబులుగలదై, సత్వగుణ భూయిష్ఠం
, కటు, తిక్త, రసవిశిష్టంబై యుండును. ఇయ్యది పదార్థంబులచే విదగ్ధంబై అమ్లత్వము
ందును. అయ్యది కార్యభేదముచేతను, స్థానభేదంబుచేతను, పంచాత్మకంబై యుండును.
గ్న్యాశయమందలి పిత్తము అన్నాదులను పచనంబు గావించుచు, తిలప్రమాణంబై
ుండును. ఇది పాచకపిత్తమనఁబడును. చర్మమందలి భ్రాజకమను పిత్తము అభ్యంగ
పాదులను పచనంబుగావించుచు, శరీరమునకు కాంతిని గలుగఁజేయును. యకృత్తు
ందలి పిత్తము రంజకనామకంబై రసధాతువును రక్తధాతువుగా పరిణమింపఁజేయును.
త్రముల నాశ్రయించియుండు పిత్తము ఆలోచకమనుపేరునొంది నీల, పీత, సూక్ష్మ,
ాలరూపాది భేదజ్ఞానమును కలుగఁజేయును. హృదయమందలి పిత్తము సాధకమను
ామంబుతో మేధ, ప్రజ్ఞ వీనిని గలుగఁజేయును.

కఫవివరణము.

కఫస్స్నిగ్ధో గురుః శ్వేతః పిచ్ఛిలశ్శీతల స్తథా. 34
తమోగుణాధికస్స్వాదు ర్విదగ్ధో లవణోభవేత్,
కఫశ్చామాశయే మూర్ధ్ని కంఠే హృదిచసంధిషు. 35
తిష్ఠన్కరోతి దేహేషు స్థైర్యం సర్వాంగపాటవం,
క్లేదనస్స్నేహనశ్చైవ రసనశ్చావలంబనః. 36
శ్లేష్మణశ్చేతి నామాని కఫస్యోక్తాన్యనుక్రమాత్,

కఫము స్నిగ్ధంబై, బరువై, తెల్లనై, పిచ్ఛిలంబై, శీతలంబై తమోగుణభూయిష్టంబై యుండును. ఆశ్లేష్మము విరుద్ధవస్తుసంయోగంబుచే వికృతినొందినచో లవణరసంబై యుండును. అయ్యది పంచాత్మకంబై ఆమాశయంబున క్లేదకమనియు, శిరంబున స్నేహానమనియు, కంఠంబున రసనంబనియు, హృదయంబున అవలంబకమనియు, సంధులయందు శ్లేష్మకమనియు, వ్యవహరింపఁబడుచు శరీరమునకు స్థైర్యమును, అవయవపటుత్వంబును చేయుచుండును.

స్నాయులక్షణము.

స్నాయవో బంధనంప్రోక్తా దేహే మాంసాస్థిమేదసామ్. 37

శరీరమందలి మాంసము, ఎముకలు, మేదస్సు, వీనికి బంధకంబులగునవి "స్నాయువు" లనంబడును.

సంధివివరణము.

సంధయశ్చాంగసంధానా ద్దేహే ప్రోక్తాః కఫాన్వితాః,

దేహమందలి హస్తపాదాద్యంగములు, వ్రేళ్లు మొదలగు ప్రత్యంగములు, సంధులు గలిగియున్నవి. ఆసంధులు చలములనియు, అచలములనియు రెండువిధములు. అందు కంఠము, నడుము, పాదము, హస్తము, గ్రుడ్లు, వీనిసంధులు చలంబులనియు, ఇతరమగు సంధులు అచలంబులనియు చెప్పఁబడును. తైలసంబంధముచే చక్రము తిరుగుచందంబున శ్లేష్మముచే సంధులు చలించుచుండును.

అస్థిలక్షణము.

ఆధారశ్చ తథాసారః కాయేఽస్థీని బుధా విదుః. 38

ఎముకలు శరీరమున కాధారంబులై బలకరంబులై యున్నయవి.

మర్మవివరణము.

మర్మాణి జీవాధారాణి ప్రాయేణ మునయో జగుః,

ాబున కాధారంబులగు అవయవదేశములు మర్మము లనఁబడును. ఆయ్యవి
నేదంబులంబరగు.

## సిరావివరణము.

సైబంధనకారిణ్యో దోషధాతువహాస్సిరాః. 39

లకు బంధకంబులై వాతాదిదోషములను, రసాదిధాతువులను వహించు
లనంబడును. స్థూలసూక్ష్మంబులగు నీసిరలు నలువది సంఖ్యగలవియై ఊర్ధ్వా
భిచక్రము నాశ్రయించియుండి వాతమును, పిత్తమును, కఫమును, రక్త
ంచున్నవి.

నో్య రసవాహిన్యో ధమంతిపవనంతనౌ,

నాశ్రయించియుండి రసమును వహించు నరములు శరీరమందు వాతమును
ధమను లనంబడును. ఇరువదినాల్గుభేదంబులుగల నీధమనులు పది ఊర్ధ్వ
క్రిందుగాను, నాలుగు అడ్డముగనువ్యాపించుచు, అధోగంబులగునవి మూత్ర
, ఆర్తవము శుక్రము అన్నపానరసంబులను, క్రిందికి ప్రవింపఁజేయు
్వగాములగు పదిధమనులు శబ్దస్పర్శరూపరసగంధజ్ఞానంబులను, శ్వాసము
ఆవలింత, తుమ్ము, నవ్వు, మాటలు, వీనిని ఊర్ధ్వంబుగాఁబ్రవర్తింపఁజేయు
బుగా ప్రసరించు నాలుగుధమనులనాశ్రయించి యనేకంబులగు ధమనులు
ంతనువ్యాపించి రోమకూపంబులయందుప్రతిబద్ధంబులై అన్నపానరసంబుల
ంపఁజేయుచు మనుజులు గావించు స్నానాభ్యంజనగంధ లేపాదులను
లనుండి లోనికాకర్షించుచు లోనిస్వేదమును బైటకుఁబోగొట్టుచుండును.

## పేశీలక్షణము.

ంసపేశ్యో బలాయ స్యురవష్టంభాయ దేహినామ్. 40

ంనకు బలముగలిగించుచు పట్టును గలుగఁ జేయునవి మాంసపేశు

## కండరలక్షణము.

ారణాకుంచనయోరంగానాం కండరా మతాః,

ందలి సంధులను చాచునట్లును ముడుచునట్లు చేయునవి కండరము లనఁ

## రంధ్రవివరణము.

ానయనకర్ణాభ్యాం ద్వేద్వే రంధ్రే ప్రకీర్తితే. 41

మేహనాపానవక్త్రాణా మేకైకంరంధ్రముచ్యతే,
దశమంమస్తకేప్రోక్తంరంధ్రాణీతి నృణాంవిదుః. 4
స్త్రీణాం త్రీణ్యధికానిస్యు స్తనయోర్గర్భవర్త్మనః,
సూక్ష్మచ్ఛిద్రాణిచాన్యానిమతానిత్వచిజన్మినామ్. 4

శరీరంబున నాసికలు, నేత్రములు, శ్రోత్రములు, మూత్రద్వారము, మ ద్వారము, వాక్కు, బ్రహ్మరంధ్రము, అను పదిరంధ్రములుగలవు. మఱియు-స్త్రీలకు గర మార్గంబున నొకరంధ్రమును, స్తనములయందు రెండురంధ్రములును అధికముగాగలవు స్త్రీపురుషులశరీరంబున చర్మమందు లెక్కింపరాని యనేకసూక్ష్మరంధ్రములు గలవు.

పుప్ఫుసవివరణము.

తద్వామేపుప్ఫుసప్లీహా దక్షిణాంగేయకృన్మతం,
ఉదానవాయోరాధారః పుప్ఫుసఃప్రోచ్యతే బుధైః. 4
రక్తవాహిసిరామూలంప్లీహాఖ్యాతోమహర్షిభిః,
యకృద్రంజకపిత్తస్యస్థానంరక్తస్య సంశ్రయమ్. 45

స్త్రీపురుషులశరీరంబున వామపార్శ్వంబున ఉదానవాతంబునకాశ్రయంబగుశ్వాస కోశమను నామాంతరముగలపుప్ఫుసమును, రక్తమునువహించు సిరలకు నాశ్రయంబగు ప్లీహమునుగలవు. కుడివైపున రంజకపిత్తమునకును, రక్తమునకును, నాశ్రయంబగుయకృత్తును గలదు.

తిలవివరణము.

జలవాహిసిరామూలం తృష్ణాచ్ఛాదనకం తిలం,

రక్తము ఘనీభవించుటచే సంభవించిన తిలకము యకృత్తునకు సమీపంబుననుండి నీటిని వహించు సిరలకు మూలంబై దప్పి నణచుచుండును.

వృక్కలవివరణము.

వృక్కౌ పుష్టికరౌ ప్రోక్తౌ జఠరస్థస్య మేదసః. 46
వీర్యవాహిసిరాధారౌ వృషణౌ పౌరుషావహౌ,

రక్తమేదస్సులసారంబుచే జన్మించి పార్శ్వభాగంబునందుండెడి వృక్కలు, జఠరమందలి మేదస్సునకు పుష్టినిఁజేయుచుండును. శుక్రమును వహించెడి సిరల కాధారంబులగు వృషణములు రెండును, పురుషత్వమును గలుగఁజేయుచుండును.

లింగవివరణము.

గర్భాధానకరం లింగమయనం వీర్యమూత్రయోః. 47

మూత్రము, శుక్రము, వీవిని వహించుచు గర్భమును గలుగఁజేయు అంగము
ఁబడును.

హృదయవివరణము.

హృదయం చేతనాస్థానమోజసశ్చాశ్రయో మతః,
ంఠమునాశ్రయించియుండి పద్మముకుళాకారంబై యధోభాగంబునకు వ్రేలు
తన్యము, ఓజస్సు, వీనికాధారంబగు నవయవము హృదయంబనఁబడును.

శరీరపోషణ వివరణము.

సిరాధమన్యోనాభిస్థా స్సర్వాంవ్యాప్యస్థితా స్తనుమ్. 48
పుష్ణంతిచానిశంవాయోస్సంయోగాత్సర్వధాతుభిః,
ాభినాశ్రయించియుండు సిరలు, ధమనులు, సర్వశరీరమును వ్యాపించియుండి
ంధముచే సప్తధాతువులచే శరీరమును పోషించుచున్నవి.

ప్రాణవాయు కృత్యము.

ాభిస్థః ప్రాణపవనః స్పృష్ట్వా హృత్కమలాంతరమ్. 49
ంఠాద్బహిర్వినిర్యాతి పాతుం విష్ణుపదామృతం,
ీత్వాచాంబరపీయూషం పునరాయాతి వేగతః. 50
ప్రీణయన్ దేహమఖిలం జీవంచ జఠరానలం,
ాభినాశ్రయించియుండు ప్రాణవాతము హృదయకమలమును వ్యాపించియుండి
దలివిష్ణుపాదామృతముఁదీసికొను నిమిత్తము కంఠమునుండి బైలువెడలి విష్ణు
తమును గ్రోలి మరల శరీరములోఁబ్రవేశించి శరీరమందలిరక్తమును శుభ్రపఱచి
ం, జాఠరాగ్నికిని బలము నిచ్చుచుండును.

ఆయుర్మరణ లక్షణము.

రీరప్రాణయోరేవం సంయోగాదాయురుచ్యతే. 51
ాలేన తద్వియోగాచ్చ పంచత్వంకథ్యతే బుధైః,
ర్వపు ప్రాణవాయువునకును, శరీరమునకును, గలసంబంధమే ఆయువనఁబడును.
గము మరణమనఁబడును.

జంతుఃకశ్చిదమరః పృథివ్యాం జాయతే క్వచిత్. 52
తోమృత్యురవార్యస్స్యాత్కింతు రోగాన్నివారయేత్,
పంచంబున మృత్యువులేనిమానవుఁడు జనింపఁడు గాన మృత్యువును వారించుట
కాని శరీరంబునఁబుట్టు రోగములను నివర్తింపఁజేయందగును.

యాప్యత్వంయాతిసాధ్యస్తుయాప్యోగచ్ఛత్యసాధ్యతామ్. 5
జీవితం హంత్యసాధ్యస్తు నరస్యాప్రతికారిణః,

మానవశరీరంబున రోగంబుజనించినతోడనే చికిత్సఁజేయకుండిన నయ్యది సుసాధ్యంబైనను యాప్యంబగును. యాప్యమగునేని అసాధ్యంబగును. ప్రాణములఁ బోఁగొట్టును.

ధర్మార్థకామమోక్షాణాం శరీరం సాధనం యతః. ౬
అతోరుగ్భ్యస్తనుం రక్షేన్నరః కర్మవిపాకవిత్,

ధర్మార్థకామమోక్షసంపాదనకు శరీరము ముఖ్యసాధనంబు. కాన నీశరీరము రోగములంటకుండ రక్షించుకొనవలెను.

ధాతవస్తన్మలాదోషానాశయంత్యసమాస్తనుమ్. ౭
సమాస్సుఖాయవిజ్ఞేయా బలాయోపచయాయచ,

రసాదిసప్తధాతువులు, వానిమలములు, త్రిదోషములు, వికృతంబులైనచో రోగంబులంబుట్టించి శరీరమును నశింపఁజేయును. సమంబుగానుండిన వానికార్యంబ నిర్వర్తించుచు మానవు నారోగ్యవంతునిఁజేయును.

స్పృష్టివివరణము.

జగద్యోనేరనిచ్ఛస్య చిదానందైకరూపిణః. ౮
పుంసోఽస్తిప్రకృతిర్నిత్యా ప్రతిచ్ఛాయేవ భాస్వతః,

సచ్చిదానందస్వరూపుండై, ఇచ్ఛాదికారణవిహీనుండై, చతుర్దశభువనాత్మకంబగు నీజగత్తునకు నిమిత్తకారణంబగు భగవంతుని సత్వరజస్తమోగుణాత్మకంబై నిత్యంబైయుండు మూలప్రకృతి సూర్యుని ప్రతిచ్ఛాయ యనుకరించుభంగిని విడువకయుండు

అచేతనాపిచైతన్యయోగేన పరమాత్మనః.
అకరోద్విశ్వమఖిలమనిత్యం నాటకాకృతి,

మూలప్రకృతి యచేతనంబైనను పరమాత్మసంయోగంబుచే చేతనావిశిష్టంబై నాటకంబువోలె యనిత్యంబగు నీప్రపంచమును సృజించెను.

ప్రకృతిర్విశ్వజననీ పూర్వంబుద్ధిమజీజనత్.
ఇచ్ఛామయీంమహద్రూపా మహంకారస్తతోఽభవత్,
త్రివిధస్సోఽపి సంజాతో రజస్సత్వతమోగుణైః.

సృష్టికర్త్రియగు నామూలప్రకృతి మొదట ఇచ్ఛారూపంబై మహద్రూపంబగు బుద్ధినిసృజించెను. ఆబుద్ధివలన సత్వరజస్తమోగుణాత్మకంబగునహంకారము పుట్టెను.

### అహంకారవివరణము.

తస్మాత్సర్వరజోయుక్తా దింద్రియాణి దశాభవన్,
మనశ్చజాతం తాన్యాహుః శ్రోత్రత్వఙ్నయనం తథా. 60
జిహ్వాఘ్రాణవచోహస్త పాదోపస్థగుదాని చ,
పంచబుద్ధీంద్రియాణ్యాహుః ప్రాక్తనానీతరాణి చ. 61
కర్మేంద్రియాణి పంచైవ కథ్యంతే సూక్ష్మబుద్ధిభిః,

అందు సాత్వికరాజసాహంకారమువలన త్వగింద్రియము, చక్షురింద్రియము, శ్రోత్రేంద్రియము, రసనేంద్రియము, ఘ్రాణేంద్రియము, అను నైదుజ్ఞానేంద్రియములు మనస్సు, వాక్కు, హస్తములు, పాదములు, ఉపస్థము, గుదము, అను నింద్రియములు పుట్టెను. ఇందు త్వగింద్రియాదులైదు బుద్ధీంద్రియంబులనియు, వాగాదులైదు కర్మేంద్రియంబులనియుం జెప్పఁబడును.

తమస్సత్వగుణోత్కృష్టా దహంకారా దథాభవత్. 62
తన్మాత్రపంచకం తస్య నామాన్యుక్తాని సూరిభిః,
శబ్దతన్మాత్రకంస్పర్శతన్మాత్రం రూపమాత్రకమ్. 63
రసతన్మాత్రకంగంధ తన్మాత్రం చేతి తద్విదుః,

సత్వగుణోద్రిక్తంబగు తామసాహంకారమువలన శబ్దతన్మాత్రము, స్పర్శతన్మాత్రము, రూపతన్మాత్రము, రసతన్మాత్రము, గంధతన్మాత్రము అను నైదుతన్మాత్రములు జనించెను.

### భూతపంచకోత్పత్తి.

తన్మాత్రపంచకాత్తస్మాత్సంజాతం భూతపంచకమ్. 64
వ్యోమానిలానలజలక్షోణీరూపం చ తన్మతం,

పైఁబేర్కొనిన పంచతన్మాత్రములనుండి ఆకాశము, అగ్ని, వాయువు, జలము, భూమి ఈరూపములగు పంచభూతంబు లుద్భవిల్లెను.

### తన్మాత్రపంచకవిశేషవివరణము.

శబ్దఃస్పర్శశ్చరూపం చ రసగంధావనుక్రమాత్. 65
తన్మాత్రాణాం విశేషాస్స్యుః స్థూలభావముపాగతాః,

ఈసూక్ష్మంబులగు తన్మాత్రలవలన స్థూలభావంబునొంది విశేషంబులగు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు జనించెను.

### ఇంద్రియవిషయము.

బుద్ధీంద్రియాణాం పంచైవ శబ్దాద్యా విషయా మతాః. 66

కర్మేంద్రియాణాం విషయా భాషాదానవిహారితాః,
ఆనందోత్సర్గకౌ చైవ కథితా స్తత్త్వదర్శిభిః. 67

పూర్వముచెప్పఁబడిన బుద్ధీంద్రియములలో త్వగింద్రియమునకు స్పర్శము, చక్షు రింద్రియమునకు రూపము, శ్రోత్రేంద్రియమునకు శబ్దము, రసనేంద్రియంబునకు రసము, ఘ్రాణేంద్రియంబునకు గంధము విషయంబులనఁబడును. కర్మేంద్రియంబు లగు నైదింటి లోను వాగింద్రియమునకు వదనము, పాణీంద్రియమునకు ఆదానము, పాదేంద్రియము నకు గమనము, ఉపస్థేంద్రియమునకు ఆనందము, గుదేంద్రియమునకు విసర్గము విషయం బులై యొప్పుచుండును.

### ఉక్తవిషయసంగ్రహము.

ప్రధానం ప్రకృతిశ్శక్తి ర్నిత్యాచావికృతి స్తథా,
ఏతాని తస్య నామాని శివమాశ్రిత్యయాస్థితా. 68
మహానహంకృతిఃపంచ తన్మాత్రాణి పృథక్పృథక్,
ప్రకృతిర్వికృతిశ్చైవ సప్తైతాని బుధా జగుః. 69
దశేంద్రియాణి చిత్తంచ మహాభూతాని పంచ చ,
వికారాష్షోడశజ్ఞేయా స్సర్వంవ్యాప్య జగత్థ్సితాః. 70

ఈశ్వరు నాశ్రయించియుండి ప్రకృతి, శక్తి, నిత్యము, అవికృతి, అను నామం బులచే వ్యవహరింపఁబడు ప్రకృతియు, ప్రకృతివికృతిభావంబులం జెందియుండెడి మహత్తు, సత్వరజస్తమోగుణాత్మకంబగు నహంకారము, శబ్దాదిపంచతన్మాత్రలు, బుద్ధీంద్రియములు, కర్మేంద్రియంబులు, చిత్తము, పంచమహాభూతములు, ఇవియన్నియు షోడశ (౧౬) వికారంబులనఁబడును. వీనిచే వ్యాప్తంబై ప్రపంచము వర్తించుచుండును.

### చతుర్వింశతితత్త్వవివరణము.

ఏవం చతుర్వింశతిభి స్తత్త్వైస్సిద్ధే వపుర్గృహే,
జీవాత్మా నియతోనిత్యో వసతిస్వాంతదూతవాన్. 71
స దేహీ కథ్యతే పాపపుణ్యాదుఃఖసుఖాదిభిః,
వ్యాప్తోబద్ధశ్చమనసా కృత్రిమైః కర్మబంధనైః. 72
కామక్రోధాలోభమోహాహంకారశ్చపంచమః,
దశేంద్రియాణి బుద్ధిశ్చ తస్యబంధాయ దేహినః. 73
ఆప్నోతిబంధమజ్ఞానా దాత్మజ్ఞానాద్విముచ్యతే,

తద్దుఃఖయోగకృద్వ్యాధి రారోగ్యం తత్సుఖావహమ్. 74

ఇతి శ్రీదామోదరసూను శార్ఙ్గధరాచార్యవిరచితాయాం ద్విసహస్ర
షట్ఛత పరిమితాయాం సంహితాయాం, సూత్రస్థానే,
పూర్వఖండే, కలాదికాఖ్యానంనామ
పంచమోఽధ్యాయః.

అవ్యక్తము, మహత్తు, అహంకారము, పంచతన్మాత్రలు, దశేంద్రియములు, మనస్సు, పంచభూతములు అను నీ యిరువదినాల్గుతత్త్వంబులతోఁగూడియుండు శరీరం బను గృహంబున నిత్యుండగు జీవాత్మ స్వాంతంబనుదూతతోఁ వసించుచుండును. ఈచతుర్వింశతి తత్త్వాత్మకంబగు నీశరీరమున వసించుజీవుఁడు పాపము, పుణ్యము, సుఖము, దుఃఖము, కామము, క్రోధము, లోభము, మోహము, మదము, అహంకారము, కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు, బుద్ధి, మనస్సు వీనిచే బద్ధుఁడై దేహియన నొప్పుచుండును. ఇట్లు జ్ఞానంబుచే బద్ధుఁడైనదేహి జ్ఞానసంపత్తిచే ముక్తుఁడగుచుండును. ఈ దేహికి పాపంబులచే రోగంబులు పుట్టుచుండును. కాన నారోగంబులకు చికిత్స చేయం జనును.

ఇట్లు దామోదరసూను శార్ఙ్గధరాచార్యవిరచిత ద్విసహస్రషట్ఛతపరిమిత
సంహితయందు సూత్రస్థానమందలి పూర్వఖండంబున కలాదికాఖ్యానంబను
పంచమాధ్యాయంబు ముగిసెను.

---

# షష్ఠాధ్యాయము.

## ఆహారాదిగతి.

యాత్యామాశయమాహారః పూర్వం ప్రాణానిలేరితః,
మాధుర్యం ఫేనభావం చ షడ్రసోఽపి లభేత సః. 1
అథ పాచకపిత్తేన విదగ్ధశ్చామ్లతాం వ్రజేత్,
తతస్సమానమరుతా గ్రహణీమభినీయతే. 2
గ్రహణ్యాంపాచితఃకోష్ఠే వహ్నినా జాయతే కటుః,
షష్ఠీ పిత్తధరానామ యాకలా పరికీర్తితా. 3
పక్వామాశయమధ్యస్థా గ్రహణీత్యభిధీయతే,

షడ్రసయుక్తంబై చతుర్విధమగు నాహారము ప్రథమమున ప్రాణవాయు ప్రేరితంబై ఆమాశయంబును జెంది మాధుర్యపాకమును, ఫేనత్వమును బొందును. పిమ్మట సూక్ష్మాంత్రమున ప్రవేశించి యచ్చట పాచకపిత్తముచే విదగ్ధంబై అమ్ల (పులుసు) భావము నొంది సమాన వాయుప్రేరితంబై గ్రహణినిబొంది యచ్చట కోష్ఠాగ్నిచే పాచితంబై కటుత్వము నొందును. పక్వాశయమునకు, ఆమాశయమునకును, మధ్యనుండి పిత్తమునకు నివాసం బైయుండు "పిత్తధర" యను నాఱవకలయే గ్రహణి యనంబడును.

రసోభవతిసంపక్వాదపక్వాదామసంభవః. 4
వహ్నేర్బలేన మాధుర్యం స్నిగ్ధతాం యాతి తద్రసః,
పుష్ణాతిధాతూనఖిలాన్ సమ్యక్పక్వోఽమృతోపమః. 5
మందవహ్నివిదగ్ధశ్చ కటుశ్చామ్లో భవేద్రసః,
విషభావం వ్రజేద్వాపి కుర్యాద్వా రోగసంకరమ్. 6

భుజించిన యాహారము జాఠరాగ్నిచే బాగుగా పచనంబైనచో రసధాతువు క్రిందపరిణమించును. అట్లుకాదేని ఆమంబగును. ఆరసము జాఠరాగ్నిబలముచే మాధుర్యస్నిగ్ధభావంబులంజెంది అమృతతుల్యంబై రక్తాది ధాతువులకు పుష్టిని గలిగించును. ఆ రసము మందాగ్నిచే విదగ్ధంబయ్యేనేని కట్వమ్లరస విశిష్టంబై విషతుల్యం బగును. లేక రోగంబులనైన పుట్టించును.

### ఆహారాద్యవస్థ.

ఆహారస్య రసస్సారస్సారహీనో మలద్రవః,
శిరాభిస్తజ్జలం నీతం వస్తౌ మూత్రత్వమాప్నుయాత్. 7
తత్కిట్టంచమలంజ్ఞేయం తిష్ఠే త్పక్వాశయే చతత్,

భుజించిన యాహారమందలి సారము రసంబుగను, సారములేనిది మలద్రవముగను పరిణమించును. సారహీనమగు ద్రవము మూత్రవాహి సిరలనుండి ప్రవహించి వస్తి యందుఁ జేరును. సారహీనమైన కిట్టము (పిప్పి) పక్వాశయంబున మలరూపముగ పరిణమించును.

### మలాపగమనము.

వళిత్రితయమార్గేణ యాత్యపానేన నోదితమ్. 8
ప్రవాహినీ సర్జనీచ గ్రాహికేతి వళిత్రయం,

ఆట్టిమలము అపానవాయు ప్రేరితంబై గుదమందలి ప్రవాహిని, విసర్జని, గ్రాహిణి, అను వళిత్రయమునుండి బయలుకువచ్చును.

### రసగమనము.

రసస్తు హృదయం యాతి సమానమరుతేరితః. 9
రంజితః పాచితస్తత్ర పిత్తేనాయాతి రక్తతాం,

పూర్వపురసము సమానవాయుప్రేరితంబై ఊర్ధ్వముఖంబుగ హృదయమును జేరి పిమ్మట యకృత్ప్లీహములయందలి పిత్తముచే పాచితంబై రక్తధాతువుగా పరిణమించును.

### రక్తలక్షణము.

రక్తం సర్వశరీరస్థం జీవస్యాధారముత్తమమ్. 10
స్నిగ్ధం గురుచలంస్వాదు విదగ్ధం పిత్తవద్భవేత్,

అట్టిరక్తము స్నిగ్ధంబై, గురుత్వవిశిష్టంబై మధురంబై సర్వశరీరమును సంచరించుచు ప్రాణమున కాధారంబగుచుండును. అయ్యది విదగ్ధంబైనచో పిత్తమువలె రోగంబులను పుట్టించును.

### రసాదిధాతూత్పత్తి.

పాచితాః పిత్తతాపేన రసాద్యా ధాతవః క్రమాత్. 11
శుక్రత్వం యాతి మాసేన తథాస్త్రీణాం రజోభవేత్,

పూర్వము చెప్పఁబడినరసము పిత్తద్రవముచే పాచితంబగుచు క్రమముగ రక్తాది ధాతుస్వరూపంబు నొందుచు నొక్కమాసంబునకు పురుషులకు శుక్రధాతువుగను, స్త్రీలకు రజస్సుగను పరిణమించును.

### గర్భోత్పత్తి.

కామాన్మిథునసంయోగే శుద్ధశోణితశుక్రజః. 12
గర్భస్సంజాయతే నార్యాస్సజాతో బాల ఉచ్యతే,

కామవికారంబుచే స్త్రీపురుషులు సంయుక్తులగుసమయంబున స్రవించెడి పరిశుద్ధంబు లగుశుక్రశోణితంబులవలన గర్భముజనించి క్రమముగా వృద్ధినొంది శిశువుగ జనించును.

అధిక్యాద్రజసఃకన్యా పుత్రశ్శుక్రాధికాద్భవేత్. 13
నపుంసకం సమత్వేన యథేచ్ఛాపారమేశ్వరీ,

గర్భాశయంబునఁ బ్రవేశించు శుక్రశోణితంబులలో శుక్రమధికమైన పురుషుఁడును, శోణితంబధికమైన స్త్రీయునుగలుగుదురు. సమంబుగనుండిన నపుంసకసంతానము గలుగును. కాని యీప్రజాభేదంబు సృష్టికర్తయగు పరమేశ్వరాధీనంబై యున్నది.

బాలచికిత్సావివరణము.

బాలస్య ప్రథమే మాసి దేయా భేషజరక్తికా. 14
అవలేహీకృతైకైవ క్షీరక్షౌద్రసితాఘృతైః,
వర్ధయేత్తావదేకైకాం యావద్భవతివత్సరః. 15
మాషైర్వృద్ధిస్తదూర్ధ్వంస్యా ద్యావత్షోడశ వత్సరః,
తతఃస్థిరా భవేత్తావ ద్యావద్వర్షాణిసప్తతిః. 16
తతోబాలకవన్మాత్రా హ్రాసనీయా శనైశ్శనైః,
మాత్రేయం కల్కచూర్ణానాం కషాయాణాం చతుర్గుణా. 17

బాలురకు ప్రథమమాసంబున నౌషధము నొసంగవలయునేని యొక్కగురివింద గింజప్రమాణమునుదీసి పాలు, తేనె, చక్కెర, నేయి, వీనిలో నెద్దానితోనైన నొసంగ వలయును. ఈప్రకారంబున ప్రతిమాసంబునను వృద్ధినొందించి సంవత్సరానంతరమున నొక్క మాషప్రమాణముగా నొసంగుచు పదియాఱు సంవత్సరములవఱకు వృద్ధిఁజేయ వలెను. ఆపరిమాణముగనే డెబ్బదివత్సరంబులవఱకు నిచ్చుచు తరువాత బాలునివలె క్రమ ముగ తగ్గింపవలెను. ఈచెప్పినపరిమాణము కల్కము, చూర్ణము, కషాయంబులు వీనికి నాల్గింత లీయందగును.

అంజనాద్యుపచారములు.

అంజనం చ తథాలేప స్స్నానమభ్యంగకర్మ చ,
వమనం ప్రతిమర్శశ్చ జన్మప్రభృతి శస్యతే. 18
కబళః పంచమాద్వర్షా దష్టమా న్నస్యకర్మచ,
విరేకషోడశాద్వర్షా ద్వింశతేశ్చైవ మైథునమ్. 19

అంజనము, అంగలేపము, స్నానము, అభ్యంగము, వమనము, ప్రతిమర్శము, వీనిని పుట్టినది మొదలు చేయవచ్చును. ఐదవ సంవత్సరము మొదలు గండూషమును, ఎనిమిదవ వత్సరము మొదలు నస్యము, పదునాఱవ వత్సరము మొదలు విరేకము, ఇఱువదియవ వత్సరము మొదలు మైథునమును చేయవచ్చును.

బాల్యాదివయోవస్థ.

బాల్యంవృద్ధిర్వపుర్మేధా త్వగ్దృష్టిశ్శుక్రవిక్రమౌ,
బుద్ధిఃకర్మేంద్రియంచేతి జీవితందశతో హ్రసేత్. 20

బాల్యావస్థ పదివత్సరములకు పిమ్మటను, దేహవృద్ధి యిరువదిసంవత్సరములకు తరు వాతను, దేహపుష్టి ముప్పదిసంవత్సరములయనంతరమునను, మేధ నలుబదివత్సరంబులకు తరువాతను, చర్మము ఏఁబదిసంవత్సరములకు పిమ్మటను, ఇంద్రియములు డెబ్బదిసంవత్సర

ములతరువాతను, పరాక్రమము ఎనుబదివత్సరంబులపిదపను, బుద్ధి తొంబదివత్సరముల యనంతరంబునను, కర్మేంద్రియములు నూఱువత్సరంబులకు పిదపను, రేతస్సు నూటపది సంవత్సరములకు తరువాతను, జీవితము నూటయిరువది సంవత్సరంబులకుపిదపను క్షీణించును.

వాతప్రకృతిమనుజలక్షణము.

అల్పకేశః కృశో రూక్షో వాచాలశ్చలమానసః,
ఆకాశచారీ స్వప్నేషు వాతప్రకృతికో నరః. 21

వాతప్రకృతిగల మనుజుఁడు అల్పములగు వెండ్రుకలుకలవాఁడై కృశించినవాఁడై, రూక్షదేహముగలవాఁడై, విశేషముగమాటాడువాఁడై, చంచలచిత్తుఁడై, ఆకాశంబున సంచరించునట్లు స్వప్నముగలవాఁడై యుండును.

పిత్తప్రకృతిమనుజలక్షణము.

అకాలే పలితైర్వ్యాప్తో ధీమాన్ స్వేదీ చ రోషణః,
స్వప్నేషు జ్యోతిషాంద్రష్టా పిత్తప్రకృతికో నరః. 22

పిత్తప్రకృతిగలమనుజుఁడు అకాలమందు వెండ్రుకలు నరసినవాఁడై, బుద్ధిమంతుఁడై, స్వేదముకలవాఁడై, కోపముగలవాఁడై, స్వప్నమున నక్షత్రాదులను గాంచువాఁడై యుండును.

శ్లేష్మప్రకృతిమనుజలక్షణము.

గంభీరబుద్ధిస్థూలాంగ స్స్నిగ్ధకేశో మహాబలః,
స్వప్నే జలాశయాలోకీ శ్లేష్మప్రకృతికో నరః 23

కఫప్రకృతిగలవాఁడు గంభీరమగుబుద్ధిగలవాఁడై స్థూలదేహముగలవాఁడై మృదుత్వము గలవెండ్రుకలుగలవాఁడై బలముగలవాఁడై స్వప్నమందు చెఱువులను చూచువాఁడై యుండు.

ద్విదోష, త్రిదోష, ప్రకృతి మనుజలక్షణము.

జ్ఞాతవ్యామిశ్రచిహ్నైశ్చద్విత్రిదోషోల్బణానరాః,

రెండుదోషములలక్షణములు గలవాఁడు ద్విదోషప్రకృతియనియు, మూఁడు దోషముల లక్షణము గలవాఁడు త్రిదోషప్రకృతియనియు చెప్పఁబడును.

కౌమారంయౌవనంవార్ధం ప్రాణినాం త్రివిధం వయః. 24
కఫపిత్తానిలప్రాయం క్రమతః ప్రకృతిస్త్రిధా,
ఆషోడశాద్భవేద్బాలో వర్షాత్క్షీరాన్నవర్ధకః. 25
మధ్యమం సప్తతిర్యావత్తదూర్ధ్వం వృద్ధ ఉచ్యతే,

మనుజులకు కౌమారము, యౌవనము, వార్ధకము లను మూడువయోవస్థలు. మఱియు కౌమారంబున శ్లేష్మప్రాయుండును, యౌవనంబున పిత్తప్రాయుండును, వార్ధకంబున వాతప్రాయుండుగను నుండు. మఱియు కౌమారము పదియాఱు వత్సరంబులవఱకుండుగాన నక్కాలంబున క్షీరాన్నమును భుజింపవలయు. అందుకుపైన డెబ్బది సంవత్సరములవఱకు యౌవనంబనియు, దానికి పిదప వృద్ధత్వంబనియు జెప్పంబడును.

నిద్రాద్యుత్పత్తి.

తమఃకఫాభ్యాం నిద్రాస్యాన్మూర్ఛాపిత్తతమోభవా. 26
రజఃపిత్తానిలైర్భ్రాంతిస్తంద్రాశ్లేష్మతమోనిలైః,

తమోగుణము, కఫము, వీనిచే నిద్రజనించును. పిత్తము, తమోగుణము వీనిచే మూర్ఛగలుగును. రజోగుణము, పిత్తము, వాతము, వీనిచే భ్రమపుట్టును. శ్లేష్మము, తమోగుణము, వాతము వీనిచే నిద్రజనించును.

గ్లానిలక్షణము.

గ్లానిరోజఃక్షయాద్దుఃఖాదజీర్ణాచ్ఛ్రమాద్భవేత్. 27

ఓజస్సు నశించుటవలనను, దుఃఖమువలనను, అజీర్ణమువలనను, శ్రమమువలనను బడలిక పుట్టును.

ఆలస్యలక్షణము.

యస్సామర్థ్యేప్యనుత్సాహస్తదాలస్యముదీర్యతే,

శరీరమందు సామర్థ్యమున్నను ఉత్సాహములేకుండుట "ఆలస్య" మనఁబడును.

ఆవులింతలక్షణము.

చైతన్యశిథిలత్వాద్యత్పీత్వైకం శ్వాసముద్గిరేత్. 28
వివృతవదనశ్శ్వాసం జృంభా సా కథ్యతే బుధైః,

చైతన్యము శిథిలం బౌటచేత శ్వాసమును పీల్చికొని నోరు తెఱచి వదలుట జృంభ యనఁబడును.

క్షుతలక్షణము.

ఉదానప్రాణయోరూర్ధ్వయోగాన్మౌళికఫస్రవాత్. 29
శబ్దస్సంజాయతే నస్తః క్షుతం తత్కథ్యతే బుధైః,

ఉదానప్రాణవాయువులకు ఊర్ధ్వముఖసంయోగముచే కఫము స్రవించును. అట్టి స్రావసమయంబున గల్గుశబ్దము క్షుత (తుమ్ము) మనంబడును,

ఉద్గార స్వరూపము.

ఉదానకోపాదాహారస్య స్థితత్వాచ్చ యద్భవేత్. 30
పవనస్యోర్ధ్వగమనం తముద్గారం ప్రచక్షతే,

ఇతి శ్రీదామోదరసూను శార్ఙ్గధరాచార్యవిరచితాయాం ద్విసహస్ర షట్ఛతపరిమితసంహితాయాం, సూత్రస్థానే, పూర్వఖండే, ఆహారాదిగతిర్నామ షష్ఠోఽధ్యాయః.

ఉదానవాతము ప్రకోపమునొంది యూర్ధ్వముగ సంచరించుటచేత అన్నాద్యాహారములు స్వస్థానంబుననుండి వాయువున కూర్ధ్వగమనంబును గలుగఁజేయుట ఉద్గార (త్రేనుపు) మనఁబడును.

ఇట్లు శ్రీదామోదరసూను శార్ఙ్గధరాచార్యవిరచిత ద్విసహస్రషట్ఛతపరిమిత సంహితయందు సూత్రస్థానమందలి పూర్వఖండమున ఆహారాదిగతియను షష్ఠాధ్యాయము ముగిసెను.

# సప్తమాధ్యాయము.

రోగ గణనము.

రోగాణాం గణనా పూర్వం మునిభిర్యా ప్రకీర్తితా,
మయాఽత్ర ప్రోచ్యతే సైవ తద్భేదా బహవో మతాః. 1

పూర్వకాలంబున ఋషులచే చెప్పఁబడిన రోగములను తద్భేదంబులను నిందు వివరించుచున్నాఁడను.

జ్వరవివరణము.

పంచవింశతిరుద్దిష్టాః జ్వరాస్తద్భేద ఉచ్యతే,
పృథగ్దోషైస్తథా ద్వంద్వభేదేన త్రివిధస్స్మృతః. 2
ఏకశ్చ సన్నిపాతేన తద్భేదా బహవస్స్మృతాః,
ప్రాయశస్సన్నిపాతేన పంచ స్యుర్విషమజ్వరాః. 3
సంతతస్సతతశ్చైవ అన్యేద్యుష్కస్తృతీయకః,
చాతుర్థకశ్చ పంచైతే కీర్తితా విషమజ్వరాః. 4

తథాగంతుజ్వరోఽప్యేకస్త్రయోదశవిధో మతః,
అభిచారగ్రహావేశశాపై రాగంతుకస్త్రిధా. 5
శ్రమాద్దాహాత్క్షతాచ్ఛేదాచ్చతుర్ధాఘాతకజ్వరాః,
కామాద్భీతేశ్శుచో రోషాద్విషాదౌషధగంధతః. 6
అభిషంగజ్వరాష్షట్స్యు రేవం జ్వరవినిశ్చయః,

జ్వరము - వాత, పిత్త, కఫ, వాతపిత్త, వాతకఫ, పిత్తకఫ, సన్నిపాత, సంతత, సతత, అన్యేద్యుష్క, తృతీయక, చాతుర్థిక, అభిచార, గ్రహావేశ, శాప, శ్రమ, దాహ, క్షత, ఛేద, కామ, భయ, దుఃఖ, కోప, విషాద, ఔషధగంధభేదంబులచే నిరువది యైదువిధంబులనుండును. వాతాదులుమొదలు సామాన్యజ్వరములనియు, అట్లు సన్నిపాతంబు లనేకవిధంబులనియు, సంతతాదులుమొదలు చాతుర్థికమువఱకు విషమజ్వరములనియు, అభిచారముమొదలు శాపమువఱకు ఆగంతుకజ్వరము లనియు, శ్రమముమొదలు ఛేదమువఱకు అభిఘాతజ్వరములనియు, మిగిలినవి అభిషంగజ్వరములనియు చెప్పఁబడును. అందు వాతజ్వరమందు వణఁకు జ్వరముయొక్క ప్రవృత్తి ఒకొ్కకపుడు అధికముగను ఒకప్పుడు సూక్ష్మముగను నుండుట, గొంతు, పెదవులు ఆరుట, నిద్రలేమి, తుమ్ములు, మాంద్యము, శరీరమున జిడ్డులేకుండుట, శిరంబు హృదయము వీనియందు నొప్పి, అరోచకము, మలము గట్టిగానుండుట, కడుపునొప్పి, ఉబ్బరము, ఆవలింతలు అనులక్షణంబులు చూపట్టును.

పిత్తజ్వరమందు, జ్వరప్రవృత్తి అధికముగానుండుట, మలము ద్రవముగా నుండుట, నిద్ర స్వల్పముగానుండుట, వాంతియగుట, కంఠము, పెదవులు, ముక్కు, ఇవి పుండగుట, చమ్మటఁబట్టుట, అసంబద్ధప్రలాపములాడుట, నోరు చేదుగనుండుట, మూర్ఛ, మత్తిల్లియుండుట, దప్పియగుట, మలము, మూత్రములు, నేత్రములు, పచ్చగానుండుట, ఒడలుతిరుగుట, అనులక్షణంబులు చూపట్టును.

కఫజ్వరమునందు శరీరముపై తడిగుడ్డకప్పినట్లు కదలకుండుట, జ్వరప్రవృత్తి మందముగనుండుట, పనులయందు ఆసక్తిలేకుండుట, నోరు తీయఁగనుండుట, మలమూత్రములు తెల్లగానుండుట, దేహము మొద్దుబారుట, కోష్ఠ మెల్లపుడును అన్నముచే పూర్ణమైనదిగా తోఁచుట, ఒడలు బరువుగనుండుట, చలి, వాంతి, గగ్గురుపాటు, అతినిద్ర, పడిసెము, దగ్గు, నేత్రములు తెల్లగానుండుట అనులక్షణములు చూపట్టును

వాతపిత్తజ్వరమునందు దప్పి, మూర్ఛ, తాపము, నిద్రలేమి, తలనొప్పి, కంఠమారిపోవుట, వాంతి, గగ్గురుపాటు, అన్నమందు అరోచకము, కండ్లు చీకట్లుకమ్ముట, కీళ్లు కొంకరలుపోవుట, ఆవలింతలు అనులక్షణంబులు చూపట్టును.

వాతశ్లేష్మజ్వరమందు, దేహము తడిగుడ్డకప్పినట్లుండుట, కీళ్లకణుపులు కొంకర పోవుట, అతినిద్ర, దేహము బరువుగనుండుట, తలదిమ్ము, పడిసెము, దగ్గు, ఒడలిమంట, జ్వరవేగము విశేషముగ లేకుండుట అనులక్షణంబులు గలిగియుండును.

పిత్తశ్లేష్మజ్వరమునందు నోరు జిగటపూసినట్లుండుట, చేదుగనుండుట, కునికిపాటు, దగ్గు, అరోచకము, దప్పి, మాటిమాటికి శరీరమందు తాపము, చలిగల్గుట, అనులక్షణములు చూపట్టును.

సన్నిపాతజ్వరమునందు కొంతసేపుతాపము, కొంతసేపుచలి, ఎముకలయందు, కీళ్ల యందు శిరస్సునందు నొప్పి, కన్నులు కన్నీటిచే కలఁకఁబారి యెఱ్ఱనై కూరుకొని యుండుట, చెవులయందుధ్వని, నొప్పిగల్గుట, గొంతు ముండ్లచే నిండియున్నట్లుండుట, కునికిపాటు, మూర్ఛ, అసంబద్ధప్రలాపము, దగ్గు, ఆయాసము, అన్నమందు ఇచ్ఛలేమి, ఒడలుతిరుగుట, నాలుకకాలినట్లు నల్లనై పశువులనాలుకంబోలె గరగరలాడుట, అవయవములు వీడిపోవు నట్లుండుట, కఫరక్తములతోఁగూడిన పసరు నోటినుండివచ్చుట, శిరస్సును ఇటునటు త్రిప్పుచుండుట, దప్పి, నిద్రలేమి, రొమ్మునొప్పి, చెమట, మూత్రము, మలము ఇవి చిరకాలమునకు స్వల్పముగాపోవుట, అవయవములు చిక్కిపోవుట, ఎల్లపుడును కంఠము నందు మూల్గుచుండుట, నల్లరంగును, ఎఱ్ఱరంగునుగల బొబ్బలు శరీరమున పైలువెడలుట, మూగమాటలు, స్రోతస్సులయందు పుండగుట మొదలగు లక్షణములు చూపట్టును. మఱియు నీసన్నిపాతజ్వరము దోషసంయోగభేదంబులచే పదిమూఁడు విధంబులై పరఁగు. దానిలక్షణంబులును, గతిభేదంబులను చరకాదులందు చూడందగును. ఈ సన్నిపాత జ్వరము ఏడుదినములుగాని, పదిదినములుగాని, పదిరెండుదినములుగాని, తీవ్రవేగమును గనఁబఱచి సాధ్యమైనచో పిమ్మట నశించును, అసాధ్యంబయ్యెనేని రోగిని నశింపఁ జేయును.

దోషత్రయప్రకోపముచే పుట్టు విషమజ్వరములందు మొదటిదియగు సంతతజ్వ రము రసధాతువు నాశ్రయించియుండి ఎడతెగక 7 దినములుగాని, 10 దినములుగాని, 12 దినములుగాని జ్వరవేగమును గనఁబఱచి పిమ్మట మరలిపోవును.

రెండవ సతతజ్వరము రాత్రియందు నొక్కమాఱును, పగటియం దొక్కమాఱును జ్వరప్రవృత్తిని గల్గించుచుండును.

మూఁడవదియగు అన్యేద్యుష్కజ్వరము ప్రతిదినమున నొక్కమాఱు తీవ్రతను గనఁబఱచుచుండును.

నాల్గవదియగు తృతీయజ్వరము ఒకదినమువిడచి రెండవదినమున తీవ్రతను గనఁ బఱచుచుండును.

అయిదవది చాతుర్థకజ్వరము నాల్గవదినమున జ్వరవేగమును గనఁబఱచుచుండును.

మఱియు మాంత్రికా ద్యుచ్చాటనాదులచే జనించినజ్వరము అభిచార జ్వరమనియు, భూతప్రేత పిశాచాద్యావేశముచే జనించినజ్వరము ఆవేశజ్వరమనియు, బ్రాహ్మణాదుల శాపంబుచే జనించినజ్వరము శాపజ్వరమనియు, శరీరమునకు గల్గెడి యాయాసముచే జనించినజ్వరము శ్రమజ్వరమనియు, తాపముచే పుట్టునది తాపజ్వరమనియు, ఖడ్గప్రహారముచే గల్గినజ్వరము క్షతజ్వరమనియు, ఖడ్గము మొదలగువానిచే ఛేదించిన చూపట్టిన జ్వరము ఛేదజ్వరమనియు, కామముచే పుట్టిన జ్వరము కామజ్వరమనియు, భయమువలన పుట్టిన జ్వరము భయజ్వరమనియు, రోషముచే పుట్టిన రోషజ్వరమనియు, విషభక్షణమువలన బుట్టిన విషజ్వరమనియు, విషప్రాయంబులగు ఓషధులనాఘ్రాణించుటచే పుట్టిన జ్వరము ఓషధీగంధజజ్వరమనియు చెప్పఁబడును.

## అతిసార గ్రహణీ వివరణము.

పృథక్త్రిదోషైస్సర్వైశ్చ శోకాదామాద్భయాదపి. 7
అతిసారస్సప్తధా స్యాద్గ్రహణీ పంచధా మతా,
పృథగ్దోషైస్సన్నిపాతాత్తథా చామేన పంచమీ. 8

అతిసారరోగము, వాత, పిత్త, కఫ, సన్నిపాత, శోక, ఆమ, భయంబులచే నుత్పన్నంబై ఏడువిధంబులం బరఁగు. గ్రహణీరోగము వాత, పిత్త, శ్లేష్మ, సన్నిపాత, ఆమములవలన నుత్పన్నంబై ఐదువిధంబులం బరఁగు.

అందు వాతాతీసారమందు అరుణవర్ణంబును, నురుగుతోఁగూడినదియు, రూక్షంబును, అపక్వంబును, నొప్పితోడను శబ్దముతోడను గూడిన మలము కొద్దికొద్దిగా వెడలుచుండును. పిత్తాతీసారమందు పసుపురంగు గల్గినదియు, లేక నల్లవర్ణంబును, కొంచెము రక్తవర్ణంబు గల్గినదియు, నైనపురీషము బోవుచుండును. దప్పి, మూర్ఛ, శరీరమందు మంటలు, గుదస్థానమునపుండు, ఈ మొదలైన లక్షణంబులు గల్గియుండును.

కఫాతీసారమందు మలము తెల్లగను, కఠినముగను, శ్లేష్మముతో గూడియుండియు, దుర్గంధముగను, శీతంబుగను స్రవించుచుండును.

సన్నిపాతాతీసారమందు పందిచమురు, మాంసము, వీనిని కడిగిన నీటితోఁసమానముగను, పూర్వము చెప్పబడిన వాత, పిత్త, కఫ, అతీసారముల లక్షణంబులన్నియుఁ గల్గియుండి మలము స్రవించుచుండును.

దుఃఖాతీసారంబున ధనము, బంధువులు, మిత్రులు మొదలగువారి నాశంబుచే గల్గు దుఃఖంబువలన స్వల్పముగ భుజించు మనుజునకు కన్నీళ్లువిడుచుటచే జనించిన ఉష్ణము జాఠరాగ్నితోఁగలసి కోష్ఠమున ప్రవేశించి రక్తమును క్షోభింపఁజేసి గురిగింజతో

సమానమైన వర్ణముగల రక్తము మలముతోఁ గూడియైనను, మలములేకుండగనైనను, దుర్గంధముతోఁ గూడియు, లేకయు స్రవించుచుండును. ఈ అతిసారము శోకంబుచే జనించుటంజేసి చికిత్సచే సాధించుట కసాధ్యంబై యుండును. అనగా కారణమైన దుఃఖము నశించిన నీఅతిసారము నశించును. అన్నసంబంధమైన అజీర్ణముచేత వాతాదిదోషములు స్వమార్గము వదలి ఇతరమార్గంబుల సంచరించుచు కోష్ఠమును, రక్తాదిధాతువులను, పురీషాదిమలములను దుష్టములుగఁజేసి అనేకవిధవర్ణములుగల్గి శూలతోఁ గూడియుండు మలమును స్రవింపఁజేయును. ఇయ్యది ఆమాతీసార మనఁబడును.

భయాతీసారమునందు, శత్రువులు మొదలగువారిచేఁగల్గినభయముచేత వాతప్రకోపము గలిగి వాతాతిసారలక్షణములు గలిగియుండును.

అతిసారవ్యాధియందు నెవ్వఁడు విరుద్ధాహారములను సేవించునో వానియొక్క గ్రహణి దుష్టంబై గ్రహణీరోగము సంభవించును.

అందు వాతగ్రహణియందు అన్నము అతికష్టముగా జీర్ణమగుట, పులిత్రేనుపులు గల్గుట, అగ్నిమాంద్యము, దాహము తక్కువయగుట, కర్ణరంధ్రములందు ధ్వనిపుట్టుట, ఇరుప్రక్కలు, తొడలు, గజ్జలు, కంఠము, ఇవి నొప్పిగానుండుట, ఆమంబైన అన్నరసము ఊర్ధ్వాధోమార్గంబుల వెడలుట, రొమ్మునొప్పి, శరీరము కృశించుట, బలమునశించుట, నోటికి రుచితెలియకుండుట, గుదమునందు అంపముతోఁ గోయునట్లుబాధ, మనసు నొచ్చియుండుట, అన్నము జీర్ణమగునపుడును, జీర్ణము అయినపిమ్మటను కడుపుబ్బరించుట, భుజించినపుడు స్వస్థముగానుండుట, వాతగుల్మము, హృద్రోగము, ప్లీహాభివృద్ధి గలిగినట్లుండుట, ద్రవముగను, శుష్కంబుగను, సూక్ష్మంబుగను, నురుఁగుతోడను మలము స్రవించుట మొదలైన లక్షణంబులు గల్గియుండును.

పిత్తగ్రహణియందు పిత్తము ప్రకుపితంబై అజీర్ణంబును, పసుపు, నలుపు కలసిన రంగుగలదియు నైనమలమును మాటిమాటికి స్రవింపఁజేయును. అట్టివ్యాధిగల మనుజుఁడు పచ్చని శరీరముగలవాఁడై దుర్గంధముతోఁగూడిన త్రేనుపులుగలవాఁడై యుండును. మఱియు కంఠము, హృదయము, వీనియందు మంట, అరుచి, దప్పి గల్గియుండును.

కఫగ్రహణియందు కఫము ప్రకుపితంబై జఠరాగ్నిని నశింపఁజేయును. భుజించిన యాహారము కష్టముగా జీర్ణమగును. మఱియు నోటినుండి నీరుకారుట, వాంతి, అరుచి, నోరుజిగటగను, తీయఁగనుండుట, దగ్గు, నోటగల్లపడుట, పడిసెము, హృదయము బరువుగానుండుట, వికృతంబుగ త్రేనుపులువచ్చుట, అగ్నిమాంద్యము, స్త్రీసంభోగమునం దిచ్ఛ లేకుండుట, ఆమకఫములతోఁ గూడిన మలము స్రవించుట, బలము నశించుట ఈ మొదలైన లక్షణములు గల్గియుండును.

సన్నిపాతగ్రహణియందు దోషత్రయములకు వేఱుగాచెప్పఁబడిన లక్షణము లన్నియు కూడియుండును.

ఆమగ్రహణియందు ఆమము ప్రతిదినముగాని నాల్గుదినములకుగాని ఎనిమిదిదిన ములకుగాని స్రవించుచుండును.

## ప్రవాహికారోగవివరణము.

ప్రవాహికా చతుర్థా స్యాత్పృథగ్దోషైస్తథాఽసృజః,

అపథ్యాహారములను భుజించుమనుజునకు వాతము ప్రకుపితంబై సంచితంబైన కఫమును మలముతోడ బలాత్కారముగ ముక్కినపుడు అల్పముగానైనను అధికముగా నైనను స్రవింపఁజేయుచుండును. ఇయ్యది ప్రవాహికారోగ మనంబడును. ఇయ్యదివాత పిత్తశ్లేష్మరక్తములవలన నుత్పన్నంబై నాల్గువిధంబులం బరఁగు.

అందు వాతప్రవాహిక శూలముతోఁగూడియుండును. పిత్తప్రవాహిక మంట తోఁ గూడియుండును. కఫప్రవాహిక శ్లేష్మముతోడను, రక్తప్రవాహిక రక్తముతోడను గూడి యుండును.

## అజీర్ణాదిరోగవివరణము.

అజీర్ణం త్రివిధం ప్రోక్తం విష్టబ్ధం వాయునా మతమ్. 9
పిత్తాద్విదగ్ధం విజ్ఞేయం కఫేనామం తదుచ్యతే,
విషాజీర్ణం రసాదేకం దోషైస్స్యాదలసస్త్రిధా. 10

అజీర్ణంబు త్రివిధంబు. అందు వాతప్రకోపంబుచే విష్టబ్ధాజీర్ణంబును, పిత్తప్రకో పంబుచే విదగ్ధాజీర్ణంబును, కఫప్రకోపంబుచే ఆమాజీర్ణంబును జనించును. అన్నరసము యొక్క దోషముచే రసాజీర్ణము జనించును. వాత, పిత్త, శ్లేష్మములచే త్రివిధంబై అలస రోగంబు జనించును.

అందు విష్టబ్ధాజీర్ణంబున శూల, కడుపుబ్బరము, మలబంధము, ఒడలు నొప్పి, శరీరము స్తంభించుట, మొదలగు లక్షణములు చూపట్టును.

విదగ్ధాజీర్ణమునందు భ్రమము, దప్పి, మూర్ఛ, పిత్తప్రకోపలక్షణములు, పొగ కూడినత్రేనుపులువచ్చుట, చెమ్మట, తాపము ఈ మొదలైన లక్షణంబులు చూపట్టును.

ఆమాజీర్ణమందు ఓకర, ఎక్కిళ్లు, కండ్లు వాచుట, ఒడలు బరువు, భుజించినది భుజించినట్లు త్రేనుపులు వచ్చుట మొదలగు లక్షణంబు లుండును.

విషాజీర్ణమునందు విషము భుజించినపుడు గలుగులక్షణము లన్నియుం చూపట్టును.

అలసరోగంబున అధికముగ కడుపుబ్బరించుట, మూర్ఛగల్గుట, పలుదెఱంగుల

దీనముగ ధ్వని చేయుట, వాతము అజీర్ణదోషముచే నధోమార్గంబునకు వెడలక కుక్షిలోని నూర్ధ్వభాగంబున హృదయాది స్థానంబులందు సంచరించుట, వాతము, మలము, ఈ రెండును అడ్డగింపఁబడి బైట వెడలకుండుట, దప్పిపుట్టుట, త్రేనుపులువచ్చుట, మొద లైనలక్షణములు కనుపట్టును. మఱియు ప్రత్యేకముగా దోషత్రయలక్షణంబులుఁగూడఁ గాన్పించును.

### విషూచికాది రోగవివరణము.

విషూచీ త్రివిధా ప్రోక్తా దోషైస్సా స్యాత్పృథక్పృథక్,
దండకాలసకశ్చైకా ఏకైవ స్యాద్విలంబికా. 11

విషూచిరోగము, వాత పిత్త శ్లేష్మములచే నుత్పన్నంబై మూఁడువిధంబులం బరఁగు. దండకాలసకము, విలంబిక అనురోగములు నొక్కొక్క విధంబై యుండును.

అందు విషూచి రోగంబున విరేచనములు, వాంతులు, దాహము, మూర్ఛ, శూలము, ఒడలుతిరుగుట, ఒడలునొప్పి, తాపము, ఆవలింతలు, కంపము, తేజోవికారము, రొమ్మునొప్పి, తలనొప్పి, శరీరమున సూదులచే పొడిచినట్లుండుట, మొదలగు లక్షణంబులు గల్గియుండును. మఱియు అసాధ్యవిషూచికయందు దంతములు, పెదవులు, గోళ్లు, ఇవి నలుపుఁ బాఱియుండును. నేత్రము గుంటలుబడి కంఠస్వరము హీనంబై సంధులయం దీడుపు గలిగి యుండును. వాతాదిదోషములు మిగుల దుష్టంబులై స్రోతస్సులనావరించి శరీరమును దండము వలె ధనురాకారముగా వంచివేయును. ఇయ్యది దండకాలసక మనం బడును. ఇది అసాధ్యము.

వాత శ్లేష్మములు ప్రకుపితంబులై భుజించిన యాహారము జీర్ణముఁ గానీయక ఊర్ధ్వభాగమును, అధోభాగమును, బంధించి కోష్ఠమునందే నిలపియుంచిన నయ్యది విలం బిక యనఁబడును. ఇయ్యది అసాధ్యరోగము.

### అర్శోరోగవివరణము.

అర్శాంసి షడ్విధాన్యాహుః వాతపిత్తకఫాస్సృజః,
సన్నిపాతాచ్చ సంసర్గాత్తేషాం భేదో ద్విధా స్మృతః. 12
సహజోత్తరజన్మభ్యాం తథా శుష్కార్ద్రభేదతః,
త్రిధైవ చర్మకీలాని వాతాత్పిత్తాత్కఫాదపి. 13

అర్శోరోగము వాత, పిత్త, శ్లేష్మ, సన్నిపాత, రక్త, సంసర్గ భేదంబులచే నుత్ప న్నంబై నాఱువిధంబులం బరఁగు. అందు ప్రత్యేకముగా సహజ (జన్మముతోఁబుట్టునది) ఉత్తరజన్మ (మధ్యకాలంబునఁబుట్టునది) శుష్క (ఎండినది) ఆర్ద్ర (ద్రవముగానున్నది) భేదంబులచే నాల్గు విధంబులై యుండును.

అందు వాతార్శోరోగంబునందు వాతప్రకోపము జనించి గుదస్థానమందలి మొలకలు శుష్కంబుగాను, చిమచిమలాడునవిగాను, వాడినవిగాను, శ్యావారుణ వర్ణములు గలవిగాను, మేకపలె పొడిచియుండునవిగాను, గరగరలాడునవిగను, కఠినములుగాను, భిన్నభిన్నరూపంబులు గలవిగాను, మొనలు గలవిగాను, కొనలయందు పగిలినవిగాను, దొండపండు, ఖర్జూరము, ప్రత్తిపండుతో సమానంబులుగాను, కొన్ని ఆవగింజలవలె సూక్ష్మంబులుగానుండును. మఱియు నట్టిరోగికి శిరస్సు, ప్రక్కలు, భుజశిరస్సులు, నడుము, తొడలు, గజ్జలు మొదలైన అవయవములందు మిగుల నొప్పి, తుమ్ముట, త్రేనుపులు, మలబంధము, అరోచకము, కాసము, శ్వాసము, అగ్నిమాంద్యము, కర్ణములయందు ధ్వని, మొదలగు లక్షణంబులుండును. మఱియు ఆసనమునందు గుడగుడ యనుశబ్దముతోఁ గూడి కఠినంబై పిచ్ఛిలంబై మలము బలాత్కారముగ పోవుచుండును. చర్మము, గోళ్లు, ముఖము, మలమూత్రములు నల్లబారియుండును.

పిత్తార్శోరోగంబునందు గుదాంకురములు నల్లని కొనలుగలవియై రక్తవర్ణముగాని, పీతవర్ణముగాని, కృష్ణవర్ణంబుగాని గలిగియుండి రక్తమును సూక్ష్మముగ స్రవించుచుండును. దుర్గంధముగలవియై సూక్ష్మంబుగను, కోమలంబుగను, సడలివ్రేలుచున్నవిగను, చిలుకనాలుక, యకృత్తను మాంసఖండము, జలగముఖము, వీనితో సమానమైన యాకారము గలవిగను నుండును. అట్టిరోగికి తాపము, గుదస్థానము పుండు అగుట, జ్వరము, చెమ్మట, దప్పి, మూర్ఛ, అరోచకము, మోహము, మొదలగు లక్షణంబులు చూపట్టును. కఫార్శోరోగంబునందు గుదాంకురములు మిగుల లోతుగ వ్యాపించియుండి దట్టంబులై, తెల్లనిరంగుగల్గి, స్వల్పముగాబాధించునవియై, స్థూలంబుగాను, స్నిగ్ధంబుగాను, జిగటగాను, నిగనిగగాను, దురదగాను, గోకిన సుఖప్రదములుగాను, వెదురుమోవు, పనసపిత్తులు, ద్రాక్షపండు వీనితోసమానాకారములుగాను నుండును. అట్టిరోగికి గజ్జలు నుబ్బరించుట, శ్వాసము, కాసము, రొమ్ము ఆదఱుట, నోట నీరువెడలుట, అరుచి, పడిసెము, ప్రమేహము, మూత్రకృచ్ఛ్రము, శిరోభారము, చలి, జ్వరము, అగ్నిమాంద్యము, వాంతి మొదలగు లక్షణంబులు చూపట్టును. సన్నిపాతార్శోరోగంబునందు త్రిదోషంబుల లక్షణంబులు చూపట్టును.

రక్తార్శోరోగంబునందు గుదాంకురములు, పిత్తార్శోరోగలక్షణంబులతో సమంబుగా నుండును. మఱియు మఱ్ఱిచిగుళ్లు, గురిగింజలు, పవడములు, వీనితోసమానవర్ణంబు గలిగియుండును. మఱియు నాగుదాంకురములు కఠినమైన పురీషముచే పీడింపఁబడి అధికముగా రక్తమును స్రవింపఁజేయుచుండును. అట్లు రక్తము స్రవించుటచే మనుజుఁడు వర్షాకాలంబున కప్పశరీరముండుచందంబున పచ్చనిశరీరకాంతిగలవాఁడై బలంబును, ఉత్సా

హంబునుదక్కి రక్తక్షయంబుచే గలిగినత్వక్పారుష్యముగలవాఁడై యుండును. మఱియు మలమువిసర్జించునపుడు అపానవాతము బైలువెడలక మిగుల బాధ నొందుచుండును.

ద్వంద్వార్శోరోగంబులందు రెండుదోషముల లక్షణంబులు చూపట్టుచుండును.

మఱియు గుదస్థానంబున గల మూడువళులలోను మొదటివళియందు బుట్టిన అర్శస్సు సుఖసాధ్యంబనియు, రెండవవళియందు బుట్టిన అర్శస్సు కృచ్ఛ్రసాధ్యంబనియు, మూడవ వళియందు బుట్టిన అర్శస్సు అసాధ్యంబనియు నెఱుంగదగు. చర్మకీలరోగము వాతపిత్తశ్లేష్మంబులవలన త్రివిధంబు. వాతప్రకోపంబుచే గుదాగ్రంబున నెఱ్ఱగాని నల్లఁగాని యుండెడి మాంసపుమొలకయొక్కటి జనించును. అయ్యది వాతాదిలక్షణంబులు వేఱువేఱుగా గలిగి త్రివిధంబు.

## క్రిమిరోగవివరణము.

ఏకవింశతిభేదేన క్రిమయస్సుర్ద్విధా చ తే,
బాహ్యాస్తథాఽభ్యంతరాస్స్యుస్తేషు యూకా బహిశ్చరాః.
లిక్షాశ్చాన్యేభ్యంతరగాః కఫాత్తే హృదయాదకాః,
అంత్రాదా ఉదరావేష్టాశ్చురవశ్చ మహాగుహాః. 15
సుగంధా దర్భకుసుమాస్తథా రక్తాచ్చ మాతరః,
సౌరసా రోమవిధ్వంసా రోమద్వీపా ఉదుంబరాః. 16
కేశాదాశ్చ తథైవాన్యే శకృజ్జాతామకేరుకాః,
లేలిహాశ్చ సలూనాశ్చ సౌసురాదాః కకేరుకాః. 17
తథాఽన్యః కఫరక్తాభ్యాం సంజాతస్స్నాయుకః స్మృతః,
వ్రణస్య కృమయశ్చాన్యే విషమా బాహ్యయోనయః. 18

క్రిమిరోగమునకు కారణంబులైన క్రిములు ఇరువదియొక్క భేదంబులు గలవియై యున్నవి. మఱియు నాక్రిములు బాహ్యములనియు, అభ్యంతరములనియు రెండువిధములఁ బరఁగు. త్వక్కు మొదలగు వానియందు స్వేదము మొదలగు వానియందు పుట్టునవి బాహ్యంబులనియు, కఫము, రక్తము, పురీషము వీనిచే లోన జనించునవి అభ్యంతరములనియుఁ జెప్పఁబడును.

అందు పూర్వోక్తము లగు క్రిములలో బాహ్యమలంబులైన స్వేదాదులయందు జనించిన క్రిములు నువ్వుగింజ పరిమాణంబును పోలియుండి వెండ్రుకలు, వస్త్రములు మొదలగు వాని నాశ్రయించి యుండును. ఇవి అనేక పాదంబులు గలవియై యున్నవి. ఇవి యూకంబు (పేను) లనియు, లిక్షంబు (ఈరు) లనియుఁ ద్వివిధంబులై యుండును. కఫదోషంబువలన నామాశయమందు పుట్టిన క్రిములు అంత్రాదము, హృదయాదము,

ఉదరావేష్టము, చురవము, మహాగుహము, సుగంధము, దర్భకుసుమము అను నామంబులు గల్గి యేడువిధంబులై యుండును.

రక్తదోషంబుచే రక్తవహస్రోతస్సులం జనించినక్రిములు మాతరము, సౌరసము, రోమవిధ్వంసము, రోమద్వీపము, ఉదుంబరము, కేశాదము అను నామంబులచే నాఱు విధంబులై యుండును. పురీషదోషంబుచే పక్వాశయంబునఁ బుట్టినక్రిములు మకేరుకము, లేలిహము, సలూనము, సౌసురాదము, కకేరుకము అను నామంబులచే నైదువిధంబులై యుండును.

కఫరక్తములచేఁ బుట్టిన క్రిమి స్నాయుక మని వ్యవహరింపఁబడును.

అందు బాహ్యక్రిములు మండలములను, బొబ్బలను, దురదను గలిగించును.

కఫక్రిములు హృదయమునం దంతటను, నోట నీరుగారుటను, ఆహారము జీర్ణము కాకుండుటను గలిగించును. మఱియు నట్టిరోగికి అరుచి, మూర్ఛ, జ్వరము, వాంతి, కడుపుబ్బరము, శరీరము కృశించుట మొదలగు లక్షణంబులు చూపట్టును.

రక్తజక్రిములు కుష్ఠరోగమును గల్గించును.

పురీషజక్రిములవలన, మలము ఉండలుగపడుట, శూలము, మలబంధము, శరీరము కృశించుట, గరగరలాడుట, తెల్లపారుట సంభవించును. మఱియు నాక్రిములు స్వస్థానమును వదలి ఇతరస్థానములందు సంచరించునపుడు గగురుపాటు, అగ్నిమాంద్యము, గుదస్థానమందు దురద గలుగుచుండును.

మఱియు పుండ్లయందు సరియైన యౌషధాదుల జేర్పకుండుటచే బాహ్యంబులగు క్రిములు వ్యాపించుచుండును.

## పాండురోగాదివివరణము.

పాండురోగాశ్చ పంచ స్యుర్వాతపిత్తకఫైస్త్రిధా,
త్రిదోషైర్మృత్తికాభిశ్చ తథైకా కామలా స్మృతా. 19
స్యాత్కుంభకామలా చైకా తథైకం చ హలీమకం,

పాండురోగము వాత, పిత్త, కఫ, సన్నిపాత, మృత్తికలచే నుత్పన్నంబై యైదు విధంబులం బరఁగు. కామల, కుంభకామల, హలీమకము అనునవి యొక్కొకవిధంబై వర్తించును.

వాతపాండువునందు చర్మము, ముఖము, మూత్రము ఇవి నల్లబారుటగాని, ఎఱ్ఱబారుటగాని సంభవించును. కంపము. ఒడలునొప్పి, భ్రమ, వాపు, ఈమొదలగు లక్షణంబులు గలిగి యుండును. పిత్తపాండువునందు పచ్చనిరంగు గలమూత్రము, పురీషము,

నేత్రములు కలవాఁడై తాపము, దప్పి, జ్వరము, పురీషము పలచగానుండుట, శరీరము పచ్చగానుండుట గల్గును.

శ్లేష్మ పాండువునందు చర్మము, మూత్రము, పురీషము, నేత్రములు తెల్లఁబాఱి యుండును. అగ్నిమాంద్యము, శరీరము బఱువుగానుండుట మొదలగు లక్షణంబు లుండును.

సన్నిపాత పాండువునందు మూఁడుదోషముల లక్షణంబులు కలిసి యుండును.

మృత్తికాపాండువునందు ప్రబలంబులగు వాత, పిత్త, కఫములయొక్క లక్షణం బులు చూపట్టును.

మఱియు పాండురోగమునందు పిత్తప్రకోపపదార్థములను సేవించుటచే కామలా రోగము జనించును. అందు నేత్రములు, గోళ్లు, ముఖము, శరీరము, ఇవి పచ్చగా నుండును. మలమూత్రములు రక్త, పీత వర్ణంబులు గలిగి యుండును. మఱియు నగ్ని మాంద్యము, అజీర్ణము, అరోచకము, దౌర్బల్యము, మొదలగు లక్షణంబులు చూపట్టును.

కామలారోగంబునకు చికిత్సఁజేయక ఉపేక్షించిన కుంభకామల పుట్టును. అందు మలమూత్రములు పచ్చగానుండును. శరీరమందు వాపు, నేత్రము లెఱ్ఱబాఱుట, వాంతి మొదలగు లక్షణంబులు చూపట్టును. ఇయ్యది కష్టసాధ్యము.

వాత పిత్త ప్రకోపముచే పుట్టినహాలీమకరోగంబున శరీరము నల్లగగాని, తెల్లగ గాని, పచ్చగగాని యుండి నేత్రములందు మత్తు, అగ్నిమాంద్యము, మందజ్వరము, స్త్రీల యందు ద్వేషము, శరీరమందు వేదన, శ్వాసము, కాసము, దాహము, భ్రమ, అరుచి మొదలగు లక్షణంబులు గల్గియుండును. ఇది కష్టసాధ్యము.

## రక్తపిత్తరోగవివరణము.

రక్తపిత్తం త్రిధా ప్రోక్తమూర్ధ్వగం కఫసంగతమ్. 20
అధోగం మారుతం జ్ఞేయం తద్ద్వయేన ద్విమార్గగం,

మిథ్యాహార విహారంబులచే పిత్తము ప్రకోపంబుజెంది రక్తమును దుష్టంబుగాజేసి యూర్ధ్వభాగమునుండియు నధోభాగమునుండియు స్రవింపఁజేయును. ఊర్ధ్వభాగమున ముక్కు, నేత్రములు, కర్ణము వీని నుంచియు, యధోభాగమున శిశ్నము, యోని, గుదము వీని నుండియు రక్తము స్రవించుచుండును. మఱియు రెండు త్రోవలనుండియుఁగూడ రక్తము స్రవింపఁజేయును. ఇయ్యదియే రక్తపిత్త మనఁబడును. ఇయ్యది వాత, పిత్త, కఫ ములచే నుత్పన్నంబై త్రివిధంబుగ వ్యవహరింపఁబడును. అట్టి రక్తపిత్తము ఊర్ధ్వగామి యనియు, అధోగామి యనియు, ఉభయగామి యనియు, త్రివిధంబు. అందు ఊర్ధ్వ గామి కఫసంబంధము గలిగియు, అధోగామి వాతసంబంధము గలిగియు, ఉభయగామి

ఉభయసంబంధము గలిగియుం నుండును. అందు ఊర్ధ్వగామి సాధ్యమగును. అధోగామి యాప్యమగును. ఉభయగామి అసాధ్యంబు.

## కాసరోగవివరణము.

కాసాః పంచ సముద్దిష్టాస్తే త్రయస్తు త్రిభిర్మలైః. 21
ఉరఃక్షతాచ్చతుర్థశ్చ క్షయాద్ధాతోశ్చ పంచమః,

కాసరోగము వాతపిత్తము, కఫ, ఉరఃక్షత, క్షయములచే నుత్పన్నంబై యైదు విధంబులం బరఁగు.

వాతకాసంబున హృదయము, కణతలు, శిరస్సు, ఉదరము, పార్శ్వములు వీని యందు బాధగల్గుట, ముఖముకృశించుట, బలము, కంఠస్వరము: ఓజస్సు ఇవిక్షయించుట, ఎల్లపుడు కాసవేగము అనుసరించియుండుట, కఫములేక పొడిదగ్గువచ్చుట, కంఠధ్వని మాఱియుండుట, ఈలక్షణంబులు చూపట్టును.

పిత్తకాసమందు ఉదరమందు తాపము, జ్వరము, నోరుఆఱిపోవుట, నోరుచేదుగా నుండుట, దప్పి, పచ్చనివాంతులు, తెల్లకఫము నోటనుండిబడుట, మొదలైనలక్షణంబులు చూపట్టును. కఫకాసమందు నోరు జిగటగల్గియుండుట, తలనొప్పి, శరీరమంతయు కఫముచే నిండియుండుట, అన్నమునం దిచ్ఛలేమి, శరీరమునకుభారము, దగ్గినపుడు కఠినమై ముద్దగానుండినకఫముపడుట మొదలైనలక్షణంబులు చూపట్టును.

ఉరఃక్షతకాసంబున కంఠమందు వేదన, జ్వరము, శ్వాసము. వ్రేలికణుపులయందు నొప్పి, స్వరముమాఱుట, దప్పి మొదలగు లక్షణంబు లుండును. అట్టిరోగియొక్క ధ్వని పావురపుపిట్టధ్వనిబోలియుండును.

క్షయకాసంబున శరీరమందెల్లనొప్పి, జ్వరము తాపము, మూర్ఛ, బలక్షయము, ద్రవములేనికఫము నోటినుండివదలుట, మాంసము నశించుట, చీముతోఁగూడినరక్తమును నోటగ్రక్కుట, మొదలైనలక్షణములు గలిగియుండును.

## క్షయరోగవివరణము.

క్షయాః పంచైవ విజ్ఞేయాస్త్రిభిర్దోషైస్త్రయశ్చ తే. 22
చతుర్థస్సన్నిపాతేన పంచమస్స్యాదురఃక్షతాత్,

క్షయరోగము వాత, పిత్త, శ్లేష్మ, సన్నిపాత, ఉరఃక్షతంబులచే నుత్పన్నంబై పంచవిధంబగు.

భుజశిరస్సులయందును పార్శ్వములందును మిగుల తాపము, కాళ్లు, చేతులు, వీని యందు తాపము, సర్వధాతువులనాశ్రయించియుండుజ్వరము, ఇవి రాజయక్ష్మసామాన్య లక్షణంబులు. రాజయక్ష్మయే క్షయమని వ్యవహరింపంబడును.

అందు వాతక్షయమందు స్వరభేదము, శూలము, భుజంబులందును, ప్రక్కల యందును ముడుచుకొనిపోవుట చూపట్టును.

పిత్తక్షయంబున జ్వరము, తాపము, అతిసారము, రక్తపిత్తము మొదలగులక్షణములు చూపట్టును.

కఫక్షయంబున శిరోభారము. అన్నమునందిచ్ఛలేమి, కాసము, కంఠనాళంబులు శిథిలంబు లగుట మొదలగులక్షణంబులు చూపట్టును.

సన్నిపాతక్షయంబున వాత, పిత్త, శ్లేష్మ లక్షణంబు లన్నియుం చూపట్టును.

ఉరఃక్షతక్షయంబున, శక్తికిమించిన క్రూరకర్మంబులం జేయుటచేత రొమ్మునం దభిఘాతముగలిగి దానంజేసి ఉరఃక్షతంబు బలిష్ఠంబై క్షయము జనించును. అందు రొమ్ము పగిలినట్లుండుట, రొమ్మునొప్పి, మంట, పీడ, పార్శ్వములు చిక్కిపోవుట, వీర్యము, కాంతి, బలము నశించుట, మలంబధికంబుగా వెడలుట, అగ్నిమాంద్యము, మొదలగు చిహ్నంబులు చూపట్టును. ఈవ్యాధిగలపురుషుఁడు శ్యామవర్ణంబును, దుర్గంధయుక్తంబును, పీతవర్ణంబును, కఠినంబునై కఫముతోఁగూడియుండురక్తమును పలుమాఱునోటినుండి గ్రక్కుచుండును.

## శోషరోగవివరణము.

శోషాస్త్వష్టస్త్రికారేణ స్త్రీప్రసంగాచ్ఛుచో వ్రణాత్. 23
అధ్వశ్రమాచ్చ వ్యాయామాద్వార్ధక్యాదపి జాయతే,

అతిమైథునము, దుఃఖము, శరీరవ్రణము, శరీరాయాసము, మార్గాయాసము, ముదిమి, వీనిచే జనించెడు శోషము (క్షయము) ఆఱువిధంబులఁ బరఁగు. వానిలక్షణంబులు గ్రంథాంతరంబున మృగ్యంబులు.

## శ్వాసరోగవివరణము.

శ్వాసాశ్చ పంచ విజ్ఞేయాః క్షుద్రస్స్యాత్తమకస్తథా. 24
ఊర్ధ్వశ్వాసో మహాశ్వాసశ్ఛిన్నశ్వాసశ్చ పంచమః,

శ్వాసరోగము, క్షుద్రశ్వాసము, తమకశ్వాసము, ఊర్ధ్వశ్వాసము, మహాశ్వాసము, ఛిన్నశ్వాసము అను భేదంబులచే నైదువిధంబులు.

క్షుద్రశ్వాసమందు స్వల్పముగా వాతము ప్రకోపించి శ్వాసమును గలుగజేయును. అందు శరీరమున కేవిధమైనబాధయు గలుగనేరదు. స్వల్పకాలంబుననే నివర్తించును.

తమకశ్వాసంబున వాతము ప్రకోపించి ప్రతిలోమముగ సంచరించుచు కఫమును ప్రకోపింపఁజేయును. ఆకఫము కంఠమున కడ్డుపడుటచే ఘురఘురధ్వనితో శ్వాసము వచ్చుచుండును. అట్టిశ్వాసముచే మోహము, దప్పి, మాటిమాటికి దగ్గు, దగ్గినపుడు

కంఠమునుండి కఫము వెడలిన సుఖముగానుండుట, కన్నులు పైకి నుబ్బియుండుట, వర్షకాలము, శీతకాలము, వీనియందు వృద్ధియగుట మొదలగు లక్షణంబులు చూపట్టును.

ఊర్ధ్వశ్వాసంబున మిగుల దీర్ఘముగ నిశ్వాసవాతము నూర్ధ్వముగ వెడలించి యానిశ్వాసమును మరల లోనికి మరలింపలేకుండుట, కఫము కంఠమున కడ్డుపడుట, ఊర్ధ్వదృష్టి, చెప్పరానిబాధ, నోరు తెల్లగానుండుట, మొదలగులక్షణంబులు చూపట్టును. మహాశ్వాసంబున ఊర్ధ్వముగనీడ్వఁబడిన వాతముగలిగియుండుట, శబ్దముతోగూడి మిగుల కష్టముగా మదించినవృషభమును బంధించినయెడల నయ్యది కోపముచే నార్చుచందంబున నిట్టూరుపు నిగుడించుట, నేత్రములు చంచలంబులైయుండుట, కన్నులను నోటిని తెఱచికొనియుండుట, మలమూత్రములు బంధించుట మొదలగులక్షణంబులు చూపట్టును. ఇట్టి రోగి శీఘ్రముగా మృతినొందును.

ఛిన్నశ్వాసంబున విభిన్నముగా శ్వాసమును విడుచుట, ఒకానొకసమయంబున హృదయమందలి బాధచే శ్వాసమును విడువలేకుండుట, కడుపుబ్బరము, చెమ్మటగ్రమ్ముట, వస్తిదహింపఁబడినట్లుండుట, కన్నులనీరుగ్రమ్ముట మొదలగులక్షణంబులు గలిగియుండును.

## హిక్కారోగవివరణము.

కథితః పంచ హిక్కాస్తు తాసు క్షుద్రాన్నజా తథా. 25
గంభీరా యమలా చైవ మహతీ పంచమీ మతా,

హిక్కారోగము క్షుద్ర, అన్నజ, గంభీర, యమల, మహతీభేదంబులచే నైదు విధంబులు.

అందు వాతము స్వల్పముగ ప్రకోపముచెంది గుండెల కెగఁతట్టి యచ్చటనుండి శబ్దమును వెలువరించిన నది క్షుద్రహిక్క యనఁబడును.

అన్నము ఉదకము వీనిని విశేషముగ సేవించుటచే వాతప్రకోపమునొంది గుండెల కెగఁతట్టి శబ్దమును వెలువరించిన నది అన్నజహిక్క యనఁబడును.

నాభిస్థానంబున గంభీరముగ శబ్దము బైటవెడలి యయ్యది అవయవములనన్నిటిని పైకినీడ్చుచువచ్చిన నయ్యది గంభీరహిక్క యనఁబడును.

వాత మూర్ధ్వగామియై ఎల్లపుడును రెండు ఎక్కిళ్లువచ్చుచుండిన నది యమలహిక్క యనఁబడును.

వాత మూర్ధ్వగంబై సంధులను విదలించుచు శరీరమునకు కంపము గలుగఁజేయుచు ఎడతెగక కలిగెడు హిక్క మహతీహిక్క యనఁబడును.

## జాఠరాగ్నివికారరోగవివరణము.

చత్వారోఽగ్నివికారాస్స్యుర్విషమో వాతసంభవః. 26

తీక్ష్ణః పిత్తాత్కఫాన్మందో భస్మకో వాతపిత్తకః,

జాఠరాగ్ని దోషసంబంధముచే నాలుగువికారముల నొందుచుండును. అందు వాతసంబంధముచే విషమంబై యొకానొకప్పుడు పదార్థమును చక్కగా జీర్ణముచేసి మఱియొకప్పుడు జీర్ణముఁ జేయలేకుండును.

పిత్తసంబంధముచే తీక్ష్ణంబై తినినపదార్థములనే కాక శరీరమందలి ధాతువులను గూడ నశింపఁజేయును.

కఫసంబంధముచే మందంబై ఎల్లపుడు తినినయన్నాదులజీర్ణముచేయ నశక్తంబై యుండును.

వాతపిత్త సంబంధముచే భస్మకంబై ఎన్నిసారులు భుజించినను జీర్ణముచేయు చుండుటచే ఎల్లపుడును క్షుద్బాధ నివర్తింపకుండును. కాని అట్టిపురుషుఁడు మిగుల బలహీనుఁడై కృశించియుండును. దోషసామ్యముచే నగ్నిసమానంబై యుండును. అయ్యది శ్రేష్ఠాగ్నియనంబడును.

## అరోచకము ఛర్ది - వీని వివరణము.

పంచైవారోచకా జ్ఞేయా వాతపిత్తకఫైస్త్రిధా. 27
సన్నిపాతాన్మనస్తాపాచ్ఛర్దయస్సప్తధా స్మృతాః,
త్రిభిర్దోషైః పృథక్త్రిస్త్రః క్రిమిభిస్సన్నిపాతతః. 28
ఘృణయా చ తథా స్త్రీణాం గర్భాధానాచ్చ జాయతే,

అరోచకరోగము వాత, పిత్త, శ్లేష్మ, సన్నిపాత, మనస్తాపములచే నుత్పన్నంబై యైదువిధములు. ఛర్ది (వాంతి) రోగము, వాత, పిత్త, కఫ, సన్నిపాత, క్రిమిదోష, జుగుప్సాగర్భధారణములచే నుత్పన్నంబై ఏడువిధంబులు గలదియగు.

అందు వాతారోచకంబున దంతములందు పులుసుదనము, నోటియందు ఒగరు, ఱొమ్మునొప్పి మొదలైన చిహ్నములు చూపట్టును.

పిత్తారోచకంబున నోరు చేదుగాను, పులుసుగాను, ఉష్ణముగాను, దుర్గంధముగాను నుండును.

కఫారోచకంబున నోరు ఉప్పగను, తీయగనునుండును. మఱియు జిగటగాను, గురుత్వముగల్గియు నుండును.

సన్నిపాతారోచకంబున వాతపిత్తశ్లేష్మలక్షణంబులు చూపట్టును.

మనస్తాపారోచకంబున వాతాదిదోషంబులలో నేది ప్రబలంబుగనుండునో దాని లక్షణంబులు చూపట్టును.

వాతచ్ఛర్దియందు హృదయమందు, పార్శ్వములందును మిగుల బాధ, నోరు ఎండుట, శిరంబునను నాభియందును నొప్పి, దగ్గు, స్వరభంగము, వమనము, ప్రబలమైనశబ్దముతోఁ గూడియుండుటయుఁ గల్గును. అట్టివాంతి నల్లగను, కషాయరసంబుగ నుండును.

పిత్తచ్ఛర్దియందు మూర్ఛ, దప్పి, నోరెండుట, నేత్రములందు మంట, భ్రమము, పచ్చనిరంగుగలిగి ఉష్ణంబుగానుండి మంటతోఁగూడిన వాంతియగుట మొదలైన లక్షణంబులు చూపట్టును.

కఫచ్ఛర్దియందు నిద్ర, నోరుతీపు, నోట కఫము స్రవించుట, అరోచకము, గురుత్వము, స్నిగ్ధంబుగను, కఠినంబుగను, మాధుర్యంబుగను, వాంతియగుట మొదలైన లక్షణంబులు చూపట్టును.

సన్నిపాతచ్ఛర్దియందు శూల, అజీర్ణము, అరుచి, తాపము, శ్వాసము, మోహము, ఉప్పగను, పుల్లగను, నల్లగను, ఉష్ణంబుగను, ఎఱ్ఱగను వాంతియగుట మొదలైనచిహ్నములు చూపట్టును.

క్రిమిచ్ఛర్దియందు శూలంబును, ఓకరింత, క్రిములతోఁగూడిన వాంతి మొదలైన లక్షణంబులు చూపట్టును.

జుగుప్సాచ్ఛర్ది యనఁగా అసహ్యపుపదార్థములను చూచునపుడు గలిగినవాంతి.

గర్భధారణచ్ఛర్ది యనఁగా గర్భధారణముచేత స్త్రీకి గలిగిన వాంతి.

## స్వరభేదరోగవివరణము.

స్వరభేదాఽష్టధైవ స్యుర్వాతపిత్తకఫైస్త్రయః. 29
మేదసా సన్నిపాతేన క్షయాత్షష్ఠః ప్రకీర్తితః,

స్వరభేదము వాతపిత్త, కఫ, మేద, సన్నిపాతక్షయములచే నుత్పన్నంబై యాఱు విధంబులై యుండును.

వాతస్వరభేదంబున నేత్రములు, నాలుక, మలమూత్రములు, ఇవి నల్లగనుండును. స్వరము గార్ధభస్వరమును బోలియుండును.

పిత్త స్వరభేదంబున నేత్రములు, నోరు, మలమూత్రములు మొదలైనవి పచ్చగనుండును. మిగులతాపముతోఁగూడిన కంఠముతో మాటాడుట మొదలైన చిహ్నములు చూపట్టును.

కఫస్వరభేదంబున కఫముచే నావరింపఁబడిన కంఠముగలవాఁడై చల్లఁగా మాటాడును. పగటియందు శ్లేష్మము కఱగుటచే నధికముగా మాటాడును. రాత్రులయందు తక్కువగా నుండును.

మేదోజస్వరభేదంబున కంఠస్వరము కంఠముననే నిలిచి మాట విరళముగ వెలియక చిరకాలమునకు కష్టముగ మాటాడును.

క్షయజస్వరభేదంబున మాటాడునపుడు నోటను పొగవెడలుట మాటమిగుల హీనంబుగానుండుట మొదలైనచిహ్నములు చూపట్టును.

## తృష్ణారోగవివరణము.

తృష్ణా చ షడ్విధా ప్రోక్తా వాతాత్పిత్తాత్కఫాదపి. 30
త్రిదోషైరుపసర్గేణ క్షయాద్ధాతోశ్చ షష్ఠికా,

తృష్ణా (దప్పి) రోగము వాత, పిత్త, కఫ, సన్నిపాత, ఉపసర్గ, ధాతుక్షయంబులచే నుత్పన్నంబై యాఱువిధంబులం బరఁగు.

వాతికతృష్ణయందు ముఖము వాడియుండుట, రసవాహిస్రోతస్సులందును జలవాహిస్రోతస్సులందును ప్రతిబంధముగల్గుట, శీతజలంబు ద్రావినను దాహము శాంతింపకుండుట చూపట్టును.

పైత్తికతృష్ణయందు మూర్ఛ, అన్నద్వేషము, తఱచుగామాటాడుట, తాపము, అతిదాహము, నేత్రము లెఱ్ఱబాఱుట, శీతలపదార్థములం దభిలాష గానంబడును.

శ్లైష్మికతృష్ణయందు అతినిద్ర, దేహభారము, నోరుతీపు, అన్నద్వేషము గలుగును.

సాన్నిపాతికతృష్ణయందు వాతపిత్తశ్లేష్మముల లక్షణంబులు చూపట్టును.

ఔపసర్గికతృష్ణ అభిఘాతాదులచే జనించి యాగంతుక మనఁబడును. క్షయజతృష్ణయందు ధాతువులన్నియు క్షయించుటవలన సర్వదా తాపముతో గూడిన దప్పి గలుగుచుండును.

## మూర్ఛాదివివరణము.

మూర్ఛా చతుర్విధా జ్ఞేయా వాతపిత్తకఫైః పృథక్. 31
చతుర్థీ సన్నిపాతేన తద్భైకశ్చ భ్రమస్స్మృతః,
నిద్రా తంద్రా చ సన్న్యాసో గ్లానిశ్చైకైకశస్స్మృతః. 32

మూర్ఛారోగము వాత, పిత్త, కఫ, సన్నిపాతములవలన నుత్పన్నంబై నాలుగు విధంబులం బరఁగు. భ్రమ, నిద్ర, సన్న్యాసము, తంద్ర, గ్లాని అనునవి మూర్ఛాభేదంబులయి యొక్కొక్క విధంబగును.

మూర్ఛారోగమున వాతాదిదోషములు ప్రకోపముఁజెంది జ్ఞానవహాస్రోతస్సుల నకస్మాత్తుగ నావరించుటచే శరీరమందు తమోగుణము వ్యాప్తంబై విషయజ్ఞానము నశించి పురుషుఁడు విఱిగిపడిన వృక్షంబువోలె నేలం గూలును.

అందు వాతికమూర్ఛయందు కృశత్వము, శరీరమందువేదన, ఆకసము నల్లగను ఎఱ్ఱగను తెలుపుగను గాన్పించుట, వర్ణవైకల్యము, రోమ్మకొప్పి మొదలయినలక్షణంబులు చూపట్టును.

పైత్తికమూర్ఛయందు ఆకసమును ఎఱ్ఱగను పచ్చగను పసుపుగను చూచుట, మూర్ఛదేరునపుడు చెమ్మట, తాపము, దప్పి, కన్నులు ఎఱ్ఱగను పచ్చగనుండుట, మలము పచ్చగనుండుట మొదలైన చిహ్నములు చూపట్టును.

శ్లైష్మికమూర్ఛయందు ఆకసమును; మేఘావృతంబుగను అంధకారావృతంబుగను చూచుట, చిరకాలమునకుగాని తెలివిరాకుండుట, శరీరముపై తడిగుడ్డలను కప్పినట్లుండుట, నోట తెల్లనిచొంగ కారుట మొదలైన చిహ్నములు చూపట్టును.

సాన్నిపాతికమూర్ఛయందు వాత, పిత్త, కఫలక్షణములు చూపట్టును. మఱియు నట్టిమనుజుఁడు చేష్టందక్కి వృక్షంబువోలె క్రిందపడియుండును.

రజోగుణము, పిత్తము, వాతము, వీనిచేఁ గల్గినవికారము భ్రమమనఁబడును. తమోగుణము, శ్లేష్మము, వీనిసాంకర్యమువలన నింద్రియాజ్ఞానము నశించి ఘటపటాది వస్తుజ్ఞానము నశించిన యవస్థ నిద్ర యనఁబడును.

ఇంద్రియములు మోహితంబులై ఒకప్పుడు నిద్ర, ఒకప్పుడు జ్ఞానము, నేత్రముల యందు భ్రమణము గలిగియుండిన నాయవస్థ తంద్రయనఁబడును.

ఆత్మయందలి సర్వజ్ఞానములు నశించినపురుషుఁడు వృక్షంబుమాదిరి చిరకాలము క్రిందఁబడియుండిన నాయవస్థ సన్న్యాసమనఁబడును.

మఱియు నీసన్న్యాసరోగము జనించినతోడనే పాదములు, హస్తములు, వీనివ్రేళ్ల యందు సూదులతోఁ బొడిచి రక్తమును స్రవింపఁజేయందగును.

## మదరోగవివరణము.

మదాస్సప్త సమాఖ్యాతాః వాతపిత్తకఫైస్త్రయః,
త్రిదోషైరసృజో మద్యాద్విషాదపి చ సప్తమః. 33

మదరోగము వాత, పిత్త, కఫ, సన్నిపాత, రక్త, మద్యపాన, విషభక్షణంబులచే నుత్పన్నంబై ఏడువిధంబులంబరఁగు.

మదమును గలుగజేయు పదార్థములను భుజించుటచే పూర్వము చెప్పఁబడిన వాతాదిదోషములలో నెద్దియైనను ప్రకోపముజెంది శరీరమునకు మదమును గలుగఁ జేసి యాయానామంబులఁ బరఁగు. అనఁగా వాతమదము, పిత్తమదము, ఇత్యాదుల నెఱుఁగునది.

మదాత్యయరోగ దాహరోగవివరణము.

మదాత్యయశ్చతుర్ధా స్యాద్వాతాత్పిత్తాత్కఫాదపి,
త్రిదోషైరపి విజ్ఞేయ ఏకః పరమద స్తథా. 34
పానాజీర్ణం తథా చైకం తథైకః పానవిభ్రమః,
పానాత్యయ స్తథా చైకో దాహాస్స ప్తమతా స్తథా. 35
రక్తపిత్తాత్తథారక్తా త్తృష్ణాయా పిత్తత స్తథా,
ధాతుక్షయా న్మర్మఘాతా ద్రక్తపూర్ణోదరాదపి. 36

మదాత్యయరోగము వాత, పిత్త, కఫ, సన్నిపాతంబులచే నుత్పన్నంబై నాలుగు విధంబులంబరఁగు. మఱియు నట్టు మదాత్యయభేదంబులై పరమదము, పానాజీర్ణము, పానవిభ్రమము, పానాత్యయము అనునవి యొప్పుచుండును.

దాహరోగము రక్తపిత్త, రక్త, తృష్ణా, ధాతుక్షయ, మర్మచ్ఛేద, రక్తపూర్ణోదరములచే నుత్పన్నంబై ఏడువిధంబులు.

వాతికమదాత్యయంబున శిరఃకంపము, శ్వాసము, ఎక్కిళ్లు, పార్శ్వములయందు పోట్లు, నిద్రలేమి, అతిప్రలాపము, మొదలైన లక్షణంబులు చూపట్టును.

పైత్తికమదాత్యయంబున తాపము, జ్వరము, దప్పి, చెమ్మట, మోహము, అతిసారము, భ్రమ, దేహముపచ్చగనుండుట, ఈమొదలైనచిహ్నములు చూపట్టును.

శ్లైష్మికమదాత్యయంబున నోటియందుచొంగ, అరుచి, వాంతి, ఒడలుబరువు, కన్నులుగుంటలుపడుట, మొదలైనచిహ్నములు చూపట్టును.

సాన్నిపాతికమదాత్యయంబున వాత, పిత్త, శ్లేష్మములయొక్క లక్షణములుగూడి చూపట్టును.

పరమదంబున ముక్కునుండి కఫస్రావము, ముఖశోషము, పలుమాఱులు మలమూత్రవిసర్జనము, శరీరభారము, అరుచి, తలనొప్పి, కన్నులుగుంటలుపడుట, మొదలగు చిహ్నములు చూపట్టును.

పానాజీర్ణమందు అధికపానముచే గలిగిన అజీర్ణముచే కడుపుబ్బరము, వాంతి, త్రేనుపులు, దాహము చూపట్టును.

పానవిభ్రమంబున హృదయము, శరీరము, వీనియందు శూల, ముఖమునుండి కఫము వెలువడుట, మూర్ఛ, కంఠమునుండి పొగలువచ్చుట, వాంతి, జ్వరము, తలనొప్పి చూపట్టును.

పానాత్యయంబున జ్వరము, ఎక్కిళ్లు, ప్రక్కపోట్లు, దగ్గు, భ్రమ, వాంతి, కఫము మొదలగు చిహ్నములు చూపట్టును.

రక్తపిత్తమువలనఁ బుట్టినదాహము (తాపము) నందు ఒకానొకపుడు రక్తలక్షణం బులును, మఱియొకసమయంబున పిత్తలక్షణంబులును గానంబడును.

రక్తదాహమునందు శరీరమునందంతటను దాహము, అగ్నిసమీపముననున్నవాడుం బోలె తానముడస్సియుండుట, శరీరంబును కన్నులును ఎఱ్ఱబాఱియుండుట, ముఖము లోహమువంటి గంధంబుగల్గియుండుట, మొదలైనచిహ్నంబులు చూపట్టును.

తృష్ణాదాహంబున దప్పినినిగ్రహించుటచేత జలవహస్రోతస్సులుక్షీణించి దానం జేసి యుష్ణముప్రబలమై శరీరమందంతటను వ్యాపించి దహింపఁజేయును. అట్టిదేహము గల మనుజునికంఠమును, తాలువులును, పెదవులును ఎండిపోవును. నాలుకనుబైటకుచాచి వణంకుచుండును. మఱియు నిందు పిత్తదాహలక్షణంబులు చూపట్టును గాన పిత్తచికిత్సం జేయవలయును.

క్షయదాహంబున రసాదిధాతువులు క్షయించుటచేత మోహము, దప్పి, హీన స్వరము, నిశ్చేష్టత మొదలగుచిహ్నంబులు చూపట్టును.

అభిఘాతజదాహంబున మర్మస్థానంబులైన శిరస్సు, హృదయము, వస్తి మున్నగు వానికి అభిఘాతము (దెబ్బ) గల్గుటచే శరీరమంతటను దాహము జనించును. ఇయ్యది అభిఘాతజదాహమనంబడును.

శస్త్రాదులచే నభిఘాతముగల్గినపుడు రక్తముస్రవింపకుండ బంధించినయెడల హృద యము, అగ్న్యాశయంబు, పక్వాశయంబు, వస్తి, యకృత్తు, ప్లీహము, మొదలైనవి రక్త ముచే పూర్ణమై దాహముగలిగించును. ఇయ్యది రక్తపూర్ణోదరజదాహమనంబడును.

## ఉన్మాదరోగవివరణము.

ఉన్మాదాష్షట్సమాఖ్యాతాస్త్రిభిర్దోషైస్త్రయశ్చ తే,
సన్నిపాతాద్విషాజ్జ్ఞేయష్షష్ఠో దుఃఖేన చేతసః. 37

ఉన్మాదరోగము వాత, పిత్త, శ్లేష్మ, సన్నిపాత, విష, దుఃఖంబులచే నుత్పన్నంబై యాఱువిధంబులంబరఁగు. మిగులవృద్ధిజెంది హృదయమున కూర్ధ్వభాగంబున సంచరించు వాతాది దోషములు మనోవహంబులగు ధమనులనాశ్రయించి మనస్సును భ్రమింపఁ జేయుటచే నున్మాదంబనఁబడును. మనస్సును చలింపఁజేయుచున్నది ఉన్మాదమనిభావము.

వాతోన్మాదంబున హాస్యము, చిఱునగవు, నృత్యము, గానము, మాటలు, అవయవ విన్యాసము, రోదనము, దేహము పరుషంబైయుండుట, కృశతనొందుట, అరుణవర్ణముంగ నుండుట, ఆహారముజీర్ణమయినపుడు బాధహెచ్చుగానుండుట మొదలగు లక్షణంబులు చూపట్టును.

పిత్తోన్మాదంబున ఓర్పు లేకుండుట, ఆర్భటము చేయుట, దిగంబరముగా నుండుట ఇతరులను భయపెట్టుట, పరుగెత్తుట, శరీర ముష్ణంబుగనుండుట, కారణములేక కోపము పడుట, నీడయందు నీళ్లయందు శీతలపదార్థములయందు అభిలాష, ముఖము పచ్చగా నుండుట మొదలైన చిహ్నంబులు చూపట్టును.

కఫోన్మాదంబున మాటాడుట మొదలగువ్యాపారములు మందముగనుండుట, అరోచకము, స్త్రీలయందభిలాష, అతినిద్ర, వాంతి, నోటజొల్లు, అన్నముతినిన రోగము వృద్ధినొందుట, గోళ్లు, చర్మము తెల్లబాఱుట, మొదలగు చిహ్నంబులు చూపట్టును.

సన్నిపాతోన్మాదంబున వాత, పిత్త, కఫ, లక్షణంబులు అన్నియు కానంబడు.

విషోన్మాదంబున కన్నులెఱ్ఱబాఱుట, దేహబలము, ఇంద్రియబలము, కాంతి, ఇవి నశించుట, ముఖమున నలుపుగలసిన వర్ణముగానంబడుట మొదలగు లక్షణంబులు చూపట్టును.

దుఃఖోన్మాదంబున అసంబద్ధముగ విచిత్రముగ మాటాడుట, మనంబునందలి రహస్యాంశములను బైటికిచెల్పుట, విరుద్ధజ్ఞానముగలుగుట, గానము చేయుట, నవ్వుట, ఏడ్చుట, మూఢచిత్తుండగుట మున్నగు చిహ్నంబులు చూపట్టును.

## భూతోన్మాదరోగ వివరణము.

భూతోన్మాదా వింశతిస్స్యుస్తే దేవాద్దానవాదపి,
గంధర్వాత్కిన్నరాద్యక్షాత్పితృభ్యో గురుశాపతః. 38
ప్రేతాచ్చ గుహ్యకాద్వృద్ధాత్సిద్ధాద్భూతాత్పిశాచతః,
జలాదిదేవతాయాశ్చ నాగాచ్చ బ్రహ్మరాక్షసాత్. 39
రాక్షసాదపి కూశ్మాండాత్కృత్యా భేతాళయోరపి,

భూతోన్మాదము దేవ, దానవ, గంధర్వ, కిన్నర, యక్ష, అగ్నిష్వాత్తాది పితృ, గురు, ప్రేత, గుహ్యక, వృద్ధ, సిద్ధ, భూత, పిశాచ, జలాధిదేవతా, నాగ, బ్రహ్మరాక్షస, రాక్షస, కూశ్మాండ, కృత్యా, భేతాళములవలన నుత్పన్నంబై ఇరువది విధంబులంబరఁగు. వీనిలక్షణంబులు, నిదానములు, తంత్రాంతరంబున జూడందగును.

## అపస్మారరోగవివరణము.

అపస్మారశ్చతుర్ధా స్యాత్సమీరాత్పిత్తతస్తథా. 40
శ్లేష్మణోఽపి తృతీయస్స్యాచ్చతుర్థస్సన్నిపాతతః,

అపస్మారరోగము వాత, పిత్త, కఫ, సన్నిపాతంబులచే నుత్పన్నంబై నాల్గువిధంబులంబరఁగు. వాతాదిదోషములయొక్క ప్రాబల్యముచే శరీరస్మృతిదప్పినమనుజుఁడు చీఁకటి

యందు ప్రవేశించిన చందంబున జ్ఞానము నశించి కనులంద్రిప్పుచు కాళ్లుచేతులు విః లించుచుండిన నది అపస్మారమనఁబడును.

వాతాపస్మారంబున వణఁకు, పండ్లు కొఱుకుట, నోట నురుఁగు కాఱుట, శ్వాః మునువిడుచుట, మనుష్యులను పరుషంబుగను, అరుణంబుగను జూచుట, మున్నగులక్షణం బులు చూపట్టును.

పిత్తాపస్మారంబున నోటపసుపురంగుగలనురుఁగు కాఱుట, శరీరంబును, ముఖంబును కన్నులును, పచ్చగానుండుట, మనుజులరూపంబులు పచ్చగ చూచుట, దప్పి, ఉష్ణము మున్నగు చిహ్నంబులు గాన్పించును.

కఫాపస్మారంబున, నోటినుండి తెల్లనినురుఁగు కాఱుట, ముఖము, కన్నులు తెల్లగా నుండుట, శరీరము చల్లగానుండుట, బరువు, చూచువారు తెల్లగానుండుట, చిరకాలమునన జ్ఞానము వచ్చుట, మున్నగునవి చూపట్టును. సన్నిపాతాపస్మారంబున త్రిదోషలక్షణంబులు చూపట్టును.

## ఆమవాతము, శూల పీనివివరణము.

చత్వారశ్చామవాతాస్స్యుర్వాతపిత్తకఫైస్త్రిధా. 41
చతుర్థస్సన్నిపాతేన శూలాన్యష్టౌ బుధా జగుః,
పృథగ్దోషైస్త్రిధా ద్వంద్వభేదేన త్రివిధాన్యపి. 42
ఆమేన సప్తమం ప్రోక్తం సన్నిపాతేన చాష్టమం,

ఆమవాతరోగము వాత, పిత్త, శ్లేష్మ, సన్నిపాతంబులచే నుత్పన్నంబై నాల్గువిధం బులంబరఁగు. శూలరోగము వాతపిత్త, శ్లేష్మ, వాతపిత్త, వాతశ్లేష్మ, పిత్తశ్లేష్మ, ఆమ, సన్నిపాతంబులచే నుత్పన్నంబై ఎనిమిది విధంబులం బరఁగు.

స్వకారణంబులచే ప్రకోపము జెందిన వాతము ఆమపదార్థముచేప్రేరితంబై శ్లేష్మ స్థానముం జేరును. అట్లు వాతముచే చెడిన ఆమము ధమనులంజేరి వాతపిత్త కఫములచే మరలదూషితంబై పిచ్ఛిలంబును నానావిధవర్ణంబునై స్రోతస్సుల నన్నిఁటిని స్రవింపం జేయును. దానంజేసి బలహీనత, హృదయభారము గల్గును. మఱియు వాతకఫములు త్రికస్థానముంజేరి శరీరమును స్తంభింపఁజేయును. ఇయ్యది "ఆమవాత" మనంబడును.

అట్టిరోగమున ఒడలు విఱుపు, అరోచకము, దప్పి, అలసత్వము, శరీరభారము, జ్వరము, అజీర్ణము, శరీరమందు ఉబ్బు ఇవి సాధారణముగ నుండులక్షణంబులు. మఱియు హస్తములు, పాదములు, శిరస్సు, చీలమండ, వెన్నెముకక్రిందిభాగము, మోకాళ్లు, తొడలు, కాళ్లు వీనియందు పోటుతోఁగూడిన వాపు జనించును.

ఆదోషము చేరినస్థలమున తేలుకుట్టినట్లుండును. అగ్నిమాంద్యము, నోటనీరు గాఱుట, అరుచి, శరీరభారము, అతిమూత్రము, కడుపు గట్టిగనుండుట, శూలము, నిద్ర లేమి, వాంతి, దప్పి, భ్రమము, బొమ్మునొప్పి, మలబంధము, ప్రేవులఱచుట, కడుపుబ్బ రము, మొదలగు చిహ్నంబులు చూపట్టును. ఈగుణములయందు దోషానుసారంబుగా వాతికాది భేదంబుల నెఱుంగునది.

మఱియుం బిత్తముచే మంటగలిగి ఎఱ్ఱగా నుండుట, వాతముచే పోటు గలిగి యుండుట, కఫముచే జడముగను భారముగను దురదగను నుండుట తెలియందగును. అందు సన్నిపాతమునం జనించినది అసాధ్యంబు.

వాతశూలంబున వాతముప్రకుపితంబై హృదయము, పార్శ్వములు, వీపు, వెన్నె ముకక్రిందిభాగము, ఈస్థలములయందు శూలము గలిగించును. ఈశూలము జీర్ణకాలంబు నను, ప్రభాతకాలంబునను, వర్షకాలంబునను, చలికాలంబునను విశేషముగ నుండును. ఇందు వాతముచే మలబంధము గలిగి దానంజేసి శరీరమున మిగుల బాధ గల్గును.

పిత్తశూలంబున పిత్తము ప్రకుపితంబై నాభిస్థానంబునజేరి దప్పి, ఇంద్రియసమ్మో హము, తాపము, నొప్పి వీనినిగలిగించును. మఱియుం చెమ్మట, మూర్ఛ, భ్రమము, శోష మును పుట్టును. ఈశూలము మధ్యాహ్నమునను, అర్ధరాత్రియందును, ఉష్ణకాలంబునను, శరత్కాలంబునను ప్రకోపముం జెందును.

శ్లేష్మశూలయందు కఫముప్రకుపితంబై ఆమాశయంబున శూలమును గలుగఁ జేయును. ఈవ్యాధియందు ఓకరింతలు, దగ్గు, అగ్నిమాంద్యము, అరోచకము, మల బంధము, శిరోభారము పుట్టును. ఈవ్యాధి సూర్యోదయంబునను, శిశిరర్తువునందును, వసంతకాలమునను ప్రకోపము జెందును.

వస్తి, హృదయము, పార్శ్వములు, వీపు వీనియందు జనించినశూలము కఫవాతిక మనియు, కుక్షి, హృదయము, నాభి వీనియందు జనించిన శూలము కఫపైత్తిక మనియు, దాహము, జ్వరము, వీనిని గలుగంజేయునది వాతపైత్తికమనియు నెఱుఁగందగును.

ఆమశూలమందు కడుపున గుడగుడశబ్దము, ఓకరింతలు, వమనము, శరీరము భారం బుగనుండుట, కడుపుబ్బరము, నోటకఫమువెడలుట, మొదలగులక్షణంబులు చూపట్టును.

సన్నిపాతశూలంబున వాతపిత్త, కఫ లక్షణంబు లన్నియు చూపట్టును. ఇయ్యది అసాధ్యంబు.

### పరిణామశూల, ఉదావర్తము వీనివివరణము.

పరిణామభవం శూలమష్టధా పరికీర్తితమ్. 43
మలైర్వ్యైశ్శూలసంఖ్యా స్యాత్తైరేవ పరిణామజం,

అన్నద్రవభవం శూలం జ్వరపిత్తభవం తథా. 44
ఏకైకం గణితం సుజ్ఞైరుదావర్తాస్త్రయోదశ,
ఏకః క్షున్నిగ్రహాత్ప్రోక్తస్తృష్ణారోధాద్ద్వితీయకః. 45
నిద్రాఘాతాత్తృతీయస్స్యాచ్చతుర్థశ్శ్వాసనిగ్రహాత్,
ఛర్దిరోధాత్పంచమస్స్యాత్షష్ఠః క్షవథునిగ్రహాత్. 46
జృంభారోధాత్సప్తమస్స్యాదుద్గారగ్రహతోఽష్టమః,
నవమస్స్యాదశ్రురోధాద్దశమశ్శుక్రధారణాత్. 47
మూత్రరోధాన్మలస్యాపి రోధాద్వాతవినిగ్రహాత్,
ఉదావర్తాస్త్రయశ్చైతే ఘోరోపద్రవకారకాః. 48

అన్నము జీర్ణమగునపుడు జనించు పరిణామశూలము పూర్వోక్తశూలమువలెనే ఎనిమిది విధంబులై వాని లక్షణంబులనే గలిగియుండును.

అన్నద్రవశూలము, జ్వరపిత్తశూలము అనునవి ఒక్కొకవిధంబై యుండును. మఱియు ఉదావర్తరోగము క్షుత్తు, తృష్ణ, నిద్ర, శ్వాస, ఛర్ది, క్షవథు, జృంభా, ఉద్గార, నేత్రోదక, శుక్ర, మల, మూత్ర, అపానవాతములను నిగ్రహించుటచే నుత్పన్నంబై పదిమూఁడు విధంబులంబరఁగు. అందు మలమూత్రవాతములను నిరోధించుటచే జనించిన ఉదావర్తము భయంకరమై అనేకోపద్రవములను గలుగఁజేయును.

భుజింపఁబడిన యాహారము జీర్ణమైనపుడును, కాకుండినపుడును, పథ్యాకరపదార్థములను భుజించినను, దుష్టపదార్థములను భుజించినను, భోజనము చేసినను, భోజనము చేయకుండిన శాంతినొందక యెల్లపుడు బాధించుచుండిన నది అన్నద్రవశూల యనంబడును.

జ్వరపిత్తశూలము ఆమ్లపిత్తముచే నుత్పన్నంబై దానిలక్షణంబులం గలిగియుండును.

ఆఁకలి నిరోధించుటచేఁ గల్గిన ఉదావర్తమునందు కునికిపాటు, ఒడలినొప్పులు, అరోచకము, బడలిక, దృష్టినాశము, ఈవ్యాధులు కలుగును.

దప్పి నిరోధించుటచేత కంఠమును నోరును ఎండుట, చెవులు వినఁబడకుండుట, ఱొమ్మునందునొప్పి ఈలక్షణములు గలుగును.

నిద్రను నిరోధించుటచేత ఆవలింతలు, ఒడలి విఱుపులు, కన్నులు శిరస్సు మిగుల బరువుగానుండుట, కునికిపాటు ఇవి గల్గును.

శ్వాసమును నిరోధించుటచేత హృదయరోగము, మూర్ఛ, గుల్మవ్యాధి ఇవి జనించును.

ఛర్దిని నిరోధించుటచేత శరీరమందు దురద, దద్దురు, అరుచి, వ్యంగము (మంగు), వాపు, పాండువు, జ్వరము, కుష్ఠము, విసర్పము, హృల్లాసము ఇవి గల్గును.

తుమ్ము (క్షవథు) ను నిరోధించుటచేత పెడతలనరములు స్తంభించుట, తలనొప్పి, అర్దితవాతము, అర్ధావచ్ఛేదము ఇవి గల్గును.

జృంభను (ఆవులింత) నిరోధించుటచేత పెడతల నరంబులు, కంఠంబును స్తంభించుట, వాతాత్మకంబులగు శిరోరోగములు జనించుట, అక్షిరోగములు, నాసికారోగములు, ముఖరోగములు, కర్ణరోగములు సంభవించును.

ఉద్గారము (త్రేనుపు) ను నిరోధించుటచేత కంఠంబును ముఖంబును నిండియుండుట, అధికమైనపోటు, కడుపులో ధ్వనిపుట్టుట, శ్వాసము వెడలకుండుట, వాతవ్యాధులు, మొదలగు నుపద్రవములు పుట్టును.

నేత్రోదకమును నిరోధించుటచేత శిరోభారము, నేత్రరోగములు, పీనసవ్యాధియు, జనించును.

శుక్రనిరోధముచేత మూత్రాశయము, గుదము, వృషణములు, వీనియందు వాపు, నొప్పి, మూత్రబంధము, శుక్రాశ్మరీవ్యాధి, కారణములేకయే శుక్రముపోవుట, ఈవ్యాధులు జనించును.

మలనిరోధమువలన ఆటోపము, శూలము, కడుపులో, క్రోంతగానుండుట, మలబంధము, ఊర్ధ్వశ్వాసము, నోటపురీషము పడలుట మొదలైన లక్షణములు గాన్పించును.

మూత్రనిగ్రహముచేత వస్తియందు మేఢ్రమునందు శూల, మూత్రకృచ్ఛ్రము, తలనొప్పి, శరీరము వంగియుండుట, గెజ్జలయందు పట్టుకొనినట్లు బాధ, మొదలగుచిహ్నంబులు చూపట్టును.

అపానవాతము నిరోధించుటచేత వాతమూత్రపురీషములయొక్క బంధము, కడుపుబ్బరము, బడలిక, నొప్పి, కోష్ఠమందు పోటు గలుగును.

## ఆనాహరోగవివరణము.

ఆనాహో ద్వివిధః ప్రోక్త ఏకః పక్వాశయోద్భవః,
ఆమాశయోద్భవశ్చాన్యః ప్రత్యానాహస్స కథ్యతే. 49

ఆనాహరోగము పక్వాశయోద్భవంబనియు, ఆమాశయోద్భవంబనియు ద్వివిధంబు. అందు ఆమాశయోద్భవంబు ప్రత్యానాహమని వ్యవహరింపఁబడును. ఆమమైనను, మలంబైనను ప్రతిదినంబునను సరిగాపోవక కోష్ఠంబున నిలిచియుండి వాతాదులచే శుష్కింపఁ జేయఁబడిన నయ్యది ఆనాహమనఁబడును.

అట్టి యానాహారోగము పక్వాశయంబున జనించినపుడు శోఫము, అలసకవ్యాధి యందు చెప్పఁబడిన ఆధ్మానవాతనిరోధాదిలక్షణంబులన్నియు చూపట్టును.

ఆమాశయంబున జనించినయెడల దప్పి, పీనసము, శిరస్సున తాపము, ఆమాశయంబున శూలము, గురుత్వము, తేన్పులు వెడలక హృదయముననే అణఁగియుండుట, కటిప్రదేశంబునను, వీఁపునందును పట్టుకొనియుండుట, మలముతోఁగూడి వాంతియగుట, మొదలైన చిహ్నంబులు చూపట్టును.

ఉరోగ్రహము, హృద్రోగము, ఉదరరోగము—వీనివివరణము.

ఉరోగ్రహ స్తథా చైకో హృద్రోగాః పంచ కీర్తితాః,
వాతాదిభిస్త్రయః ప్రోక్తాశ్చతుర్థస్సన్నిపాతతః. 50
పంచమః క్రిమిసంజాత స్తథాష్టావుదరాణి చ,
వాతాత్పిత్తాత్కఫాత్త్రీణి త్రిదోషేభ్యో జలాదపి. 51
ప్లీహ్నః క్షతాద్బద్ధగుదాదష్టమం పరికీర్తితమ్,

ఉరోగ్రహమను రోగమొకవిధము. హృద్రోగము—వాత, పిత్త, కఫ, సన్నిపాత, క్రిమి, వీనిచే నుత్పన్నంబై పంచవిధం బగును. ఉదరరోగములు—వాతపిత్తకఫసన్నిపాతములచే నాల్గును, జలోదరము, ప్లీహోదరము, క్షతోదరము, బద్ధగుదము, అను నాల్గు ఉదరంబులును, కలసి ఎనిమిది విధంబులు.

ఉరోగ్రహరోగము—హృద్రోగభేదమైయున్నది. అందు రక్తము, మాంసము, ప్లీహము, యకృత్తు అన్నియు వృద్ధిఁజెందును.

వాతాదిదోషములు ప్రకుపితంబులై ధాతువులకు వైకల్యమును గలుగఁజేసి హృదయము నాశ్రయించి యందు అనేకవేదనలను గలుగఁజేయును. ఇయ్యది హృద్రోగ మనఁబడును.

అందు వాతహృద్రోగంబున—హృదయము నీడ్చునటులను, సూదులతో బొడుచునటులను, కత్తితో కొట్టునటులను, గొడ్డలిచే భేదించునటులను ఉండును. పిత్తహృద్రోగంబున—దప్పి, కంఠశోషము, శరీరమందు మంటలు, తాపము, ఆయాసము, మూర్ఛ, పులితేన్పులు, చెమ్మట, ముఖశోషము మొదలైన చిహ్నంబులు చూపట్టును.

కఫహృద్రోగంబున—శరీరభారము, దగ్గు, అరుచి, అగ్నిమాంద్యము, ఒడలు బిఱుపు, నోరుతీపు, మొదలైన చిహ్నంబులు చూపట్టును.

సన్నిపాత హృద్రోగంబున—వాత, పిత్త, కఫ, లక్షణంబులన్నియు చూపట్టును.

క్రిమిహృద్రోగంబున—ఓకరింతలు, అరోచకము, శూలము, నోటజొల్లు, శోషము, మొదలైన లక్షణంబులు చూపట్టును.

దేహమందలి చెమ్మటను, ఉదకమును వహించుస్రోతస్సులను వాతాదిదోషము లడ్డగించి ప్రాణ, అగ్ని, అపానస్థానముల నాశ్రయించి వానిని దుష్టంబులుగఁజేసి మనుజులకు ఉదరరోగమును గలుగఁజేయును.

కడుపుబ్బరము, నడుచుచోశక్తిలేమి, బలహీనత, అగ్నిమాంద్యము, వాపు, అవయవములు కృశించుట, వాతపురీషములు బంధించుట, తాపము, కునికిపాటు, ఇవి ఉదరరోగసామాన్యలక్షణంబులు.

వాతోదరంబున—హస్తపాదములయందును, నాభికుక్షులయందును వాపు, కుక్షి, పార్శ్వములు, ఉదరము, వెన్నుపూస, వీఁపు-వీనియందునొప్పి, కాళ్లనొప్పులు, పొడిదగ్గు, అధోభాగము బరువుగానుండుట, మలబంధము, చర్మము ముక్కు వీనియందు శ్యావారుణవర్ణము గల్గుట, ఉదరము కారణమేలేక వృద్ధినొందుట, మరలఁదగ్గుట, ఉదరంబున పొడిచినట్లు బాధ, ఉదరముసూక్ష్మమైన నల్లనిసిరచే నావరింపఁబడియుండుట, ఉదరమును వాయించినయెడల గాలిచే నిండినతిత్తివలె నుండుట, మొదలైన చిహ్నంబులు చూపట్టును.

పిత్తోదరంబున—జ్వరము, మూర్ఛ, తాపము, దప్పి, నోరుచేదు, భ్రమము, అతిసారము, చర్మము నాసిక ముఖము ఇవి నల్లనైయుండుట, పచ్చనిరంగు గలసిరలు ఉదరముపై వ్యాపించుట, ఉదరము హస్తముచే స్పృశించినచో మృదువుగానుండుట, శీఘ్రముగ పక్వమగుట, ఈచిహ్నంబు లుండును. కఫోదరంబున శరీరము కృశించుట, స్పర్శజ్ఞానము నశించుట, వాపు, బరువు, అతినిద్ర, వాంతి, అరుచి, శ్వాసము, కాసము, ఉదరము నిశ్చలంబై నిగనిగలాడుచు తెల్లనిరేఖలు కల్గి గొప్పదిగానుండుట, మొదలైన చిహ్నంబులు చూపట్టును.

సన్నిపాతోదరంబున—విషలక్షణంబులన్నియు చూపట్టును. మఱియు మూర్ఛ, పాండురోగము, కార్శ్యము, దప్పి, నోరెండుట, చలికాలంబున వర్షకాలంబున మిగుల వృద్ధిజెంది తాపమునొందించుట, ఈలక్షణంబు లుండును. మిగుల సంతాపకరంబు లగు పదార్థములను భుజించు మనుజులకు రక్తంబును కఫంబును మిగుల ప్రకోపించి ప్లీహమును వృద్ధి నొందించును. ఈవ్యాధియందు ఎడమప్రక్కనున్న ప్లీహము మిగుల వృద్ధిజెంది శరీరము మిగుల శిథిలంబగుట, అగ్నిమాంద్యము, బలక్షయంబు, పాండువు మొదలగు చిహ్నంబులు చూపట్టును. ఈరీతిగనే కుడిప్రక్కనున్న యకృత్తును వృద్ధిజెంది యకృదుదరమనఁబడును.

స్నేహపానము, అనువాసనవస్తి, వమనము, విరేకము, ఈచికిత్సలలో నెద్దాని నైనను జేసికొని చల్లనీటిని విశేషముగ పానముచేసినయెడల జలవహంబులైన స్రోతస్సు లన్నియు దుష్టంబులై ఉపస్నేహన్యాయము ననుసరించి స్రవించు అన్నరసముతోఁగూడి ఉదరము నానాటికి వృద్ధిజెందుచుండును. అట్టి జలోదరంబున నూనెపూసినచందంబున నిగనిగలాడుచు బొడ్డుకుచుట్టును, విశాలంబుగ నావరించి నీళ్ళచే నిండియున్నట్లుండును. ఉదకపూర్ణంబైన తిత్తివలె గుళ గుళ, యనుశబ్దముతో గదలుచుండును.

ముండ్లు, రాళ్లు, మొదలగు శల్యములతోఁగూడిన యన్నంబును భుజించినయెడల నాశల్యము పక్వాశయమునుండి విలోమంబుగ వచ్చుచుండి ఆంత్రమును భేదించును. పిదప పగిలిన ఆంత్రమునుండి జలముతో సమమైన చీముస్రవించి గుదద్వారమునుండి బైట వెడలును. దానంజేసి నాభిక్రింద ఉదరము వృద్ధిజెందును. ఆయుదరము సూదులు గ్రుచ్చిన విధంబునను చీల్చినవిధంబునను బాధించును. దీనిని క్షతోదరంబనియు, పరిస్రావ్యుదరంబనియు వ్యవహరించెదరు.

జిగటగల్గిన యన్నమును భుజించుటచేతను, వెండ్రుకలతోనైనను, సన్నని రాళ్లతోనైనను కలసిన యన్నమును భుజించినయెడల ప్రేవులడ్డగింపఁబడినయెడ మలము నానాఁట వృద్ధినొంది మలము వహించునాడులంజేరి గుదద్వారమున పురీషము నడ్డగించును. లేక కొద్దిగనైనను వెడలించును. ఇయ్యది బద్ధగుదోదర మనంబడును.

### గుల్మ, మూత్రాఘాత, రోగవివరణము.

గుల్మాస్త్వష్టౌ సమాఖ్యాతా వాతపిత్తకఫై స్త్రయః. 52
ద్వంద్వభేదాత్త్రయః ప్రోక్తాస్సప్తమస్సన్నిపాతతః,
రక్తాదష్టమకః ఖ్యాతో మూత్రాఘాతాస్త్రయోదశ. 53
వాతకుండలికాపూర్వా వాతాష్ఠీలాతతః పరా,
వాతవస్తిస్తృతీయస్స్యాన్మూత్రాతీతశ్చతుర్థకః. 54
పంచమం మూత్రజఠరం షష్ఠో మూత్రక్షయస్స్మృతః,
మూత్రోత్సంగస్సప్తమస్స్యాన్మూత్రగ్రంథిస్తథాఽష్టమః. 55
మూత్రశుక్లం తు నవమం విడ్ఘాతో దశమస్స్మృతః,
మూత్రాసాదశ్శ్లేష్మవాతో వస్తికుండలికా తథా. 56
త్రయోఽప్యేతే మూత్రఘాతాః పృథగ్ఘోరాః ప్రకీర్తితాః,

గుల్మరోగము, వాత, పిత్త, కఫ, సన్నిపాత, వాతపిత్త, పిత్తశ్లేష్మ, శ్లేష్మవాత, రక్తములవలన నుత్పన్నంబై యెనిమిది విధంబు లగును.

మూత్రాఘాతరోగము, వస్తికుండలిక, వాతాష్ఠీల, వాతవస్తి, మూత్రాతీత, మూత్రజఠర, మూత్రక్షయ, మూత్రోత్సంగ, మూత్రగ్రంథి, మూత్రశుక్ర, విడ్వాత, మూత్రసాద, ఉష్ణవాత, వస్తికుండలిక యనుభేదంబులచే పదిమూఁడువిధంబులై యుండును.

హృదయంబునకును, నాభికిని మధ్యభాగంబున వర్తులాకారంబై యొకపుడుచలించు నట్టియు నొక్కపుడు నిశ్చలంబుగ నుండునట్టియు గ్రంథి గుల్మ మనంబడును.

వాతగుల్మంబున—నాగ్రంథి వ్యవస్థలేక ఒకపుడు నాభియందును ఒకపుడు ఇరు ప్రక్కలయందును ఒకపుడు వస్తియందును సంచరించుట, చిన్నది పెద్దదియగుచుండుట, మలబంధము, అపానబంధము, చలిజ్వరము గల్గుట, హృదయము, పార్శ్వములు, భుజ శిరస్సులు, కుక్షి, శిరంబు మీనియందు నొప్పిగల్గుట, అన్నము జీర్ణంబగునపుడు మిగుల బాధ గల్గుట, అన్నము భుజించినయెడల శాంతినొందుట, మొదలగు చిహ్నంబులు చూపట్టును.

పిత్తగుల్మంబున—జ్వరము, దప్పి, ముఖము, శరీరము, ఇవి నల్లగనుండుట, అన్నము భుజించునపుడు జీర్ణమగునపుడును అధికముగ శూలగల్గుట, చెమ్మటబట్టుట, మిక్కిలిసంతాపముగల్గుట, వ్రణమువలె స్పర్శము నోర్వలేకుండుట, ఈ మొదలైనచిహ్నంబులు చూపట్టును.

కఫగుల్మంబున—శరీరము మొద్దుబాఱియుండుట, చలిజ్వరము, శరీరము కృశత నొందుట, దగ్గు, అరుచి, గురుత్వము, శీతలత్వము, బాధ కొంచెముగనుండుట, కఠినంబై మిక్కిలి యున్నతంబుగ నుండుట, ఈలక్షణంబు లుండును. ద్విదోషంబులవలనఁ బుట్టిన గుల్మములందు దోషద్వయలక్షణంబులను, త్రిదోషజగుల్మంబున దోషత్రయలక్షణంబులను తెలియందగును.

ప్రథమగర్భప్రసవకాలంబునను, పరిపూర్ణముకాని గర్భము స్రవించినపుడును, ఋతుమతియైన సమయంబున అపథ్యపదార్థములను భుజించినను, వాతము ప్రకోపము జెంది రక్తమును నిరోధించి పిత్తగుల్మముతో సమానమైన చిహ్నంబులుగల గుల్మమును స్త్రీలకు జనింపఁజేయును. ఇందు రక్తము స్రవింపకుండుట, నోట నీరు వెడలుట, స్తనాగ్రములు నల్లగనుండుట, మొదలగు గర్భచిహ్నము లన్నియు చూపట్టును. కాని ఈ గ్రంథి పిండాకారమై చలించుచుండును. ఆరక్తగుల్మమును 10-వ మాసము గడచినపిదప చికిత్సం జేయవలయును.

వాతకుండలికయందు—వాతము ప్రకోపముఁజెంది మూత్రాశయంబునఁ బ్రవేశించి సుడిగాలివలె మూత్రకోశంబునఁ దిరుగుచుండును. దానంజేసి మూత్రము మిగుల స్వల్పముగ బాధతోడఁ బోవుచుండును.

వాతాష్ఠీలయందు—వాతము వస్తినిపూరించి గుదమునడ్డగించి తీవ్రంబైనవేదనతోఁ గూడి మలమూత్రమార్గంబులనిరోధించుచుఱాయివలె కఠినంబగు అష్ఠీలను జనింపఁజేయును.

వాతవస్తియందు—మూత్రముయొక్క వేగమును నిరోధించి మనుజునియొక్క వస్తిముఖంబును వస్తిగతంబైనవాతము అడ్డగించును. దానంజేసి మూత్రము బైలువెడలక వస్తియందును, కుక్షియందును బాధగల్గును. ఇయ్యది వాతవస్తియనంబడును. ఈవ్యాధి మిగుల కష్టసాధ్యంబు.

మూత్రాతీతంబునందు—మూత్రమును చిరకాలమువఱకు విసర్జింపక నిరోధించు మనుజునకు మూత్రము శీఘ్రముగ వెడలక మెల్లమెల్లగ పోవుచుండును.

మూత్రజఠరంబున—మూత్రవేగంబును నిరోధించినయెడ నపానవాతము ప్రకుపితంబై యుదరమును నిండించి నాభిక్రింద నధికముగా నుబ్బరమును, మిక్కిలి తీవ్రమైన వేదనను గల్గించును.

మూత్రక్షయంబున—వాతపిత్తములు ప్రకోపమునుజెంది మంటను, నొప్పిని గలుగఁజేసి మూత్రమును నశింపఁజేయును, ఇది మూత్రక్షయ మనఁబడును.

మూత్రోత్సంగంబున—మూత్రముబైలువెడలక వస్తియందుగాని, మూత్రనాళంబులయందుగాని మేఢ్రాగ్రంబుననుండు మణియందుగాని నిలచియుండును. బలాత్కారముగ ముక్కినయెడల వస్త్యాదులయందు గలిగిన యభిఘాతముచే రక్తముతోఁ గూడి కొంచెము కొంచెముగ స్రవించును.

మూత్రగ్రంథియందు—వస్తిముఖముయొక్క లోప్రక్కయందు వర్తులాకారంబును, కఠినంబును, మిక్కిలి సూక్ష్మాకారంబును, అశ్మరితో సమానంబైన గ్రంథి జనించును. దానంజేసి మూత్రము రక్తముతోగూడి మిగుల కష్టముతో ప్రవర్తించును.

మూత్రశుక్రంబున—మూత్రము వచ్చునపుడు దానిని నిరోధించి స్త్రీలతో సంభోగముచేసినయెడల శుక్రము వాతముచే స్థానమునుండి చలింపఁబడి ఊర్ధ్వముగ ప్రసరించి మూత్రముపోవుటకు ముందైనను, వెనుకనైనను బూడిదె కలిసిన నీళ్లవలె స్రవించును. దాని మూత్రశుక్రమనెదరు.

విడ్విఘాతంబున—వాతముచేత మలము ఊర్ధ్వంబుగ ప్రసరించి మూత్రమార్గంబున జేరినయెడల అట్టి మలముతోఁగూడి మలముఁవలె దుర్గంధంబైన మూత్రము మిక్కిలి కష్టముచే స్రవించును.

మూత్రసాదంబున—పిత్తముగాని, కఫముగాని, రెండునుగాని వాతముచే ఘనీభావమునొంది పచ్చగగాని, ఎఱ్ఱగగాని, తెల్లగగాని, చిక్కనైయుండు మూత్రము మిగుల కష్టముచే మంటతోఁగూడి వెడలుచుండును.

ఉష్ణవాతంబున పిత్తము ప్రకుపితంబై వస్తియందుజేరి వాతముతోఁగూడి వస్తి మేఢ్రగుదంబులయందు మంటఁబుట్టించి పసుపు, ఎఱుపు, రక్తము, ఇట్టివర్ణముగల మూత్రమును మాటిమాటికి వెడలించును.

వస్తికుండలికయందు—క్రూరకర్మంబులచే మూత్రాశయంబు స్వస్థానమునుండి బైటవెడలి గర్భమువలె స్థూలంబై యుండును. దానంజేసి పోటు, నొప్పి, కంపము, మంట, వీనితోడ మూత్రము ఒక్కొకబొట్టుగ స్రవించును. అట్టిసమయమున వస్తిని చేతితో పిసికినయెడల మూత్రము ధారగ వచ్చును.

### మూత్రకృచ్ఛ్రము, అశ్మరి, మేహరోగము-వీనివివరణము.

మూత్రకృచ్ఛ్రాణి చాష్ట స్యుర్వాతపిత్తకఫైస్త్రిధా. 57
సన్నిపాతాచ్చతుర్థస్స్యాచ్ఛుక్రకృచ్ఛ్రం చ పంచమం,
విట్కృచ్ఛ్రం షష్ఠమం ఖ్యాతం ఘాతకృచ్ఛ్రం చ సప్తమమ్. 58
అష్టమం చాశ్మరీకృచ్ఛ్రం చతుర్ధా చాశ్మరీ మతా,
వాతాత్పిత్తాత్కఫాచ్ఛుక్రాత్తథా మేహాశ్చ వింశతిః. 59
ఇక్షుమేహాస్సురామేహాః పిష్టమేహాశ్చ సాంద్రకః,
శుక్రమేహోదకాఖ్యౌ చ లాలామేహాశ్చ శీతకః. 60
సికతాఖ్యశ్శనైర్మేహో దశైతే కఫసంభవాః,
మంజిష్ఠాఖ్యో హారిద్రాఖ్యో నీలమేహాశ్చ రక్తకః. 61
కృష్ణమేహః క్షారమేహష్షడైతే పిత్తసంభవాః,
హస్తిమేహో వసామేహో మజ్జామేహో మధుప్రభః. 62
చత్వారో వాతజా మేహా ఇతి మేహాశ్చ వింశతిః,

మూత్రకృచ్ఛ్రము—వాత, పిత్త, కఫ, సన్నిపాత, శుక్ర, విట్, ఘాత, అశ్మరీ, కృచ్ఛ్రభేదంబులచే నెనిమిదివిధంబులు.

అశ్మరీరోగము—వాత, పిత్త, కఫ, శుక్రభేదంబులచే నాల్గువిధంబులు.

ప్రమేహరోగము—ఇక్షు, సురా, పిష్ట, సాంద్ర, ఉదక, లాలా, శీత, సికతా, శనైః, మంజిష్ఠా, హారిద్రా, నీల, రక్త, కృష్ణ, క్షార, హస్తి, వసా, మజ్జా, మధుమేహములన నిరువది విధంబులై యుండును.

వాతాదిదోషము కలసియైనను వేర్వేఱుగనైనను ప్రకోపమునుజెంది వస్తినాశ్రయించి మూత్రమార్గమున బాధను గలిగించినయెడల మూత్రము మిక్కిలికష్టముచే వెలువడును. ఇది మూత్రకృచ్ఛ్రమనఁబడును.

వాతజమూత్రకృచ్ఛ్రంబున—గజ్జలయందు, పొత్తికడుపునందు, మేఢ్రమునందు మిగుల తీక్ష్ణంబైన వేదన, మిగులకష్టముచే కొంచెము కొంచెముగ మాటిమాటికి మూత్రము పదలుట మొదలగులక్షణంబులు చూపట్టును.

పిత్తజమూత్రకృచ్ఛ్రంబున—రక్తము, నొప్పి, మంట, దీనితోఁగూడి పసుపురంగుగల మూత్రము మిగుల కష్టముచే వెడలుట గాన్పించును.

శ్లేష్మజమూత్రకృచ్ఛ్రంబున—వస్తియందును మేఢ్రమునందును గురుత్వంబు వాపుగల్గి మిక్కిలి చిక్కనైనమూత్రము వెడలును. ద్వంద్వజమూత్రకృచ్ఛ్రంబున-దోషద్వయలక్షణములును, సాన్నిపాతికమూత్రకృచ్ఛ్రంబున త్రిదోషలక్షణంబులును చూపట్టును.

శుక్రజమూత్రకృచ్ఛ్రంబున—శుక్రము వాతాదిదోషములచే దుష్టంబై మూత్రమార్గము నొందునపుడు శుక్రముతోఁగూడిన మూత్రము మిగులకష్టముచే వెలువడును. అట్టిసమయమున వస్తియందును, మేఢ్రమునందును, మిగులవేదన జనించును.

పురీషజమూత్రకృచ్ఛ్రంబున—మలమును నిరోధించుటచేత వాతము ప్రకుపితంబై కడుపుబ్బరము, వాతశూల, వీనిని కల్గించి మూత్రకృచ్ఛ్రమును గలిగించును.

ఘాతజమూత్రకృచ్ఛ్రంబున—మూత్రమును వహించు స్రోతస్సులయందు ముల్లు మొదలగు శల్యములచే గాయముగల్గినను, అభిఘాతము గల్గినను, మూత్రమును నిరోధించుటచే మిగుల కష్టంబై మూత్రకృచ్ఛ్రము గలుగును. ఇందు వాతజ మూత్రకృచ్ఛ్రముయొక్కలక్షణంబులు చూపట్టును.

అశ్మరీజమూత్రకృచ్ఛ్రము—అశ్మరీవ్యాధిచే జనించును. అందు మూత్రమున జనించు అశ్మరియనురాయి ముందు వెడలి పిమ్మట మూత్రము వచ్చును.

వాతము ప్రకుపితంబై వస్తిగతమైన మూత్రమును, శుక్రమును, పిత్తమును, కఫమును, క్రమముగ శోషింపఁజేసి గోవునందు గోరోచనము జనించుభంగి అశ్మరిని జనింపఁజేయును.

అందు వాతాశ్మరియందు—మిగులబాధ, పండ్లుకొఱుకుట, వణఁకుట, బాధకోర్వలేక మేఢ్రమును చేతితోఁబట్టుకొనుట, బొడ్డును పిసికికొనుట, ఎల్లపుడును బాధచే నార్చుచుండుట, అపానవాతముతోఁగూడ పురీషమును విసర్జించుట, బొట్టుబొట్టుగ మూత్రమును విడుచుట, అశ్మరి అరుణ వర్ణంబునై నీలవర్ణంబై ముండ్లతోఁ గూడినట్లుండుట మొదలగు చిహ్నము లుండును.

పిత్తజాశ్మరియందు—పొత్తికడుపుమంట, పొత్తికడుపు ఉడుకుచున్నట్లు వేఁడిగల్గియుండుట, అశ్మరి రక్తవర్ణముగ గాని, నీలవర్ణంబుగ గాని, జీడి విత్తువలె కఠినముంగనుండుట మొదలగు చిహ్నములు చూపట్టును.

కఫజాశ్మరియందు—వస్తియందు సూదులుగ్రుచ్చినట్లు పోటు, చల్లగను, గురు
ఁంబుగను నుండుట, అశ్మరి మిగుల పెద్దదియై నునుపుగల్గి తేనెవంటివర్ణముగల్గి యుం
ట మొదలగు చిహ్నంబులు చూపట్టును.

శుక్రాశ్మరియందు యౌవనకాలంబున పురుషుఁడు స్త్రీసంభోగము చేయక శుక్ర
ంను నిగ్రహించుటచేత స్వస్థానంబుననుండి చలనంబగు శుక్రము మేఢ్రవృషణములకు
ధ్యభాగముననుండు వస్తిముఖంబున వాతముచే శుష్కంబై మూత్రమును అడ్డగించును·
ందు వస్తియందు పోటు, మూత్రము కష్టముచే వెడలుట, వృషణములయందు వాపు
దలగు చిహ్నంబులు చూపట్టును.

కఫము వస్తిగతంబై ప్రకోపముజెంది మేదస్సు మాంసము, శరీరజక్లేదము, వీని
న్నిటిం జెఱిచి కఫజనితమేహ వ్యాధులను పదింటిని జనింపఁ జేయును. పిత్తము ప్రకు
తంబై పూర్వపు మేదస్సు మొదలగు వానిని దుష్టంబులుగఁజేసి యాఱుమేహరోగం
లం గలుగఁజేయును. కఫ పిత్తములు క్షీణంబుగా నున్నపుడు వాతము ప్రకుపితంబై
సామజ్జౌజస్సులం జెఱిచి వస్తిముఖంబునకుజేర్చి నాలుగు వాతప్రమేహంబులం గలుగఁ
యును. మూత్రము కలకబారి యధికముగ స్రవించుట ప్రమేహసామాన్య లక్షణము·

ఇక్షుమేహంబున చెఱకురసమువలె మిగుల మధురంబైనమూత్రము వెడలును.

సురామేహంబున కల్లునుబోలి పైన స్వచ్ఛంబును అధోభాగంబున మడ్డిగనుండు
ూత్రముపోవును.

పిష్టమేహంబున గగురుపాటు గలిగి పిండిగలసిన విధంబుగ తెల్లనైన మూత్రము
డలును.

సాంద్రమేహంబున మూత్రమును విడచిన యెడల కొంతసేపటికి మూత్రము
ట్టిబడును.

శుక్రమేహంబున శుక్రంబుఁబోలిన మూత్రమైనను శుక్రముతోఁగూడిన
ూత్రమైనను స్రవించును.

ఉదకమేహంబున స్వచ్ఛంబును, మిగులనధికంబును, తెల్లని వర్ణంబు గలదియు,
ల్లగనుండునదియు, గంధరహితంబును, కొంచెముకలకబారి పిచ్ఛిలంబునునగు మూత్రము
్రవించును.

లాలామేహంబున జొల్లుతీఁగెవలెనుండి జిగటగనుండు మూత్రము వెడలును.

శీతమేహంబున మిగుల శీతలంబును, మధురంబునైన మూత్రముపోవును.

సికతామేహంబున యిసుకవలెసన్నముగ కఠినంబైయుండు కపఖండములతోఁ
ాడిన మూత్రము వెడలును.

శనైర్మేహంబున మెల్ల మెల్లగ కొంచెముకొంచెము మూత్రము వెడలును.

ఈచెప్పఁబడిన పదిపది మేహములు కఫజన్యములని యెఱుంగవలయు.

మంజిష్ఠా మేహంబున మంజిష్ఠా కషాయమువంటి రంగుగల్గి దుర్గంధయుక్తమై మూత్రము స్రవించుచుండును.

హారిద్రామేహంబున కారముగ పసుపురంగు గలమూత్రము స్రవించును. నీల మేహంబున నల్లనివర్ణముగల మూత్రము స్రవించును.

రక్తమేహంబున దుర్గంధంబును, ఉష్ణంబును, ఉప్పగనుండి రక్తముతో సమాన మైనవర్ణముగల మూత్రము స్రవించుచుండును.

కృష్ణమేహంబున బొగ్గువలె నల్లగ మూత్రము స్రవించుచుండును.

క్షారమేహంబున గంధము, వర్ణము, రసము, స్పర్శము, ఈ నాల్గింటిచే క్షారో దకముతో సమానంబైన మూత్రము వెడలును.

ఈచెప్పఁబడిన యాఱును పిత్తప్రమేహము లని యెఱుంగదగును.

హస్తిమేహంబున మూత్రము వేగములేక మాంసమునకును, చర్మమునకును మధ్య భాగంబుననుండు నీరుబోలి అపుడపుడు నిలచి మదించిన యేనుంగునుండి స్రవించు చందంబున స్రవించును.

వసామేహంబున వసతోగలసిగాని, వసతోసమానమైన రంగు గలిగిగాని మూత్రము వెడలుచుండును.

మజ్జామేహంబున మజ్జతోఁగూడిగాని, మజ్జతో సమానవర్ణంబుగాని గలిగియుండి మాటిమాటికి మూత్రము వెడలుచుండును.

మధుమేహంబున కషాయంబును, మధురంబును, రూక్షంబును నైనమూత్రము విశేషముగా స్రవించుచుండును. ఈనాల్గును వాతముచే జనించిన ప్రమేహము లని యెఱుంగదగును.

### సోమరోగము, ప్రమేహపిటికారోగము-వీనివివరణము.

సోమరోగస్తథా చైకః ప్రమేహపిటికా దశ.
శరావికా కచ్ఛపికా పుత్రిణీ వినతాలజీ, 63
మసూరికా సర్షపికా జాలినీ చ విదారికా.
విద్రధిశ్చ దశైతాస్స్యుః పిటికా మేహసంభవాః, 64

సోమరోగం బొక్కవిధంబును, ప్రమేహపిటికలు-శరావిక, కచ్ఛపిక, పుత్రిణి, వినత, అలజి, మసూరిక, సర్షపిక, జాలిని, విదారిక, విద్రధి, అనునామంబులచే పది విధంబులుగ నగును.

విశేషముగా సంభోగముచేయుటచేతను, భయమువలనను, దుఃఖమువలనను, స్త్రీల శిరోగము జనించును. దోషప్రకోపముచే శరీరమందలి యుదకము క్షోభమునుజెంది స్రవించుచు మూత్రమార్గమున బైలు వెడలును. అట్టియుదకము నిర్మలంబై, గంధరహితంబై, శీతలంబై, తెల్లనై యుండును. అట్టిస్త్రీ యామూత్రవేగమును నిలుపజాలకుండును. శరీరమునందు సుఖము గలుగకుండును. శిరస్సు శిథిలంబగుట, ముఖము తాలువులు ఎండుట, మూర్ఛ, ఆవలింత, ప్రలాపము, చర్మము మొద్దుబాఱియుండుట, మొదలగు చిహ్నములు పుట్టును.

పూర్వము చెప్పఁబడిన ప్రమేహములను త్వరలో చికిత్సచేయక నుపేక్షించిన యెడల పిటకలు పుట్టును.

చుట్టును ఉన్నతంబుగను మధ్యభాగమున పల్లముగనుండి మూకుడువలె నున్నది శరావికయనియు, మంటతోగూడి తాబేటివీపువలెనున్నది కచ్ఛపికయనియు, సన్నని బొబ్బలతో గూడి గొప్పయాకారముగలది పుత్రిణి యనియు, వీపునందైనను ఉదరమునందైనను మిక్కిలిపోటుగలిగి ఆర్ద్రంబై నీలవర్ణము గలది వినతయనియు, రక్తవర్ణంబును శ్వేతవర్ణంబునుం గలిగి బొబ్బలతో గూడి మిక్కిలి క్రూరంబైనది అలజియనియు, చిఱునెనగలయాకారముగలది మసూరికయనియు, ఎఱ్ఱనియావాలయాకారంబుగలది సర్షపికయనియు, అధికమైనమంటగలిగి దుర్మాంసము నావృతంబై యుండునది జాలిని యనియు, నేలగుమ్ముడు గడ్డవలెనుండునది విదారికయనియు, విద్రధియొక్కలక్షణంబులు గలది విద్రధియనియు చెప్పఁబడును.

## మేదోరోగము, శోఫరోగము-వీనివివరణము.

మేదోదోష స్తథా చైకశ్శోఫరోగా నవ స్మృతాః. 65
దోషైః పృథగ్ద్వయైస్సర్వై రభిఘాతాద్విషాదపి,

మేదోరోగ మొక్కవిధంబై యుండును. శోఫ (ఉబ్బు) రోగము వాత, పిత్త, శ్లేష్మ, వాతశ్లేష్మ, పిత్తశ్లేష్మ, వాతపిత్త, సన్నిపాత, అభిఘాత, విషంబులవలన నుత్పన్నంబై తొమ్మిది విధంబు లగును.

దేహపరిశ్రమఁజేయక పగటియందు నిద్రించువానికిని, పిండిపదార్థములను స్నిగ్ధపదార్థములను సేవించువానికిని, భుజించిన యాహారముయొక్కరసము పక్వముగాక స్నిగ్ధగుణముచే మేదస్సును వృద్ధినొందించును. ఇది మేదోరోగంబనఁబడును. సకలప్రాణులకును మేదస్సు ఉదరంబుననుండును. కాన మేదోరోగము గలవానికి ఉదరము వృద్ధియగును. వృద్ధినొందిన మేదస్సుచే వాతము నిరోధింపఁబడి కోష్ఠమునందే సంచరించుచు జాఠరాగ్నిని బలపఱచును. దానం జేసి భుజించిన యాహారము త్వరలోనే జీర్ణమగును. అట్టి

రోగికి శ్వాసము, దప్పి, మూర్ఛ, అతినిద్ర, తుమ్ములు, బడలిక, చెమ్మట, శరీరమున దుర్గంధము, బలహీనత, సంభోగశక్తితగ్గుట, మొదలగునవియుపద్రవములు. అట్టి మేదోవృద్ధిచేత వాతాదులన్నియు వృద్ధిజెంది ప్రమేహము, జ్వరము, ప్రమేహపిటికలు, విద్రధి మొదలుగాగల వానిని జనింపజేసి ప్రాణములను హరించును.

వాతంబు దుష్టంబై స్వకారణములచే దుష్టంబు లగు పిత్త కఫములను నాభాహ్యనాడులయందు వ్యాపింపఁజేసి వానిచే నడ్డగింప బడినమార్గము కలదియై చర్మము నాశ్రయించి శోఫమును గలుగజేయును.

అట్టి శోఫంబున వాపు మిగుల నున్నతంబై మొద్దుబాఱియుండుట, ఉష్ణము, సిరలు వ్యాపించుట, గగుఱుపాటు, శరీరము వివర్ణంబగుట, ఇవి సామాన్య లక్షణంబులుగా నుండును.

వాతశోఫంబున వాపు చంచలంబై యుండుట, చర్మము పలచనై మిగుల కఠినంబై ఎఱ్ఱనిరంగు గలిగియుండుట, స్పర్శము తెలియక తిమ్మిరిగల్గియుండుట, పగటియందు అధికముగ నుండుట, ఈలక్షణంబులుండు.

పిత్త శోఫంబున వాపు మృదువుగను, వాసనగలదియై యుండుట, నలుపు పసుపు ఎఱుపు ఈరంగులుగల్గియుండుట, భ్రమ, జ్వరము, దప్పి, చెమ్మట, మంట, నొప్పిగల్గుట, కన్ను లెఱ్ఱబాఱియుండుట, ఈచిహ్నంబులుండు.

కఫ శోఫంబున వాపు భారమై కఠినమైయుండుట, పాండువర్ణము, అరోచకము, జొల్లుకారుట, అతినిద్ర, వాంతి, అగ్నిమాంద్యము, చేతితో నొత్తినపుడు పల్లము పడుట, రాత్రి వాపు అధికముగ నుండుట మొదలగుచిహ్నంబులు చూపట్టును.

ద్విదోషశోఫమందు ద్విదోషలక్షణంబులును, త్రిదోషశోఫయందు త్రిదోషలక్షణంబులును యెఱుంగునది.

దండప్రహారము, శస్త్రాదులచే ఛేదము, మంచుగాలి, సముద్రపుగాలి, జీడివిత్తుల రసము, దురదగొండిరసము, ముల్లు, వీనిచే శరీరమున వాపు జనించును. అట్టివాపు మిగుల నుష్ణంబై యెఱ్ఱనిరంగుగల్గి తఱుచుగ పిత్తశోఫలక్షణంబులు గలిగియుండును. ఇది అభిఘాతజశోఫ మనంబడును.

విషాదిసంబంధముచేత విషశోఫము పుట్టును. అందు మృదుత్వము, చలించుట, శీఘ్రముగవ్యాపించుట, మంటయు నొప్పియు విశేషంబుగ నుండుట మొదలగు చిహ్నంబులు చూపట్టును.

### వృద్ధిరోగ వివరణము.

వృద్ధయస్సప్త గదితా వాతాత్పిత్తాత్కఫేన చ. 66

రక్తేన మేదసా మూత్రాదాంత్రవృద్ధిశ్చ సప్తమీ,

వృద్ధి (వృషణములువాచుట) రోగము వాత, పిత్త, శ్లేష్మ, రక్త, మేదో, మూత్ర, ఆంత్ర వృద్ధులన నేడువిధంబులై యుండును.

శరీరమునందధోగమనము గలవాతము ప్రకుపితంబై వృషణములయందును గజ్జలయందును వ్యాపించుచు అండకోశములను, అండముల నాశ్రయించియుండు నాడులను దుష్టములుగజేసి, అండములయందును, అండకోశములయందును వాపునుపోటునుగలిగించును. ఇది వృద్ధియనిగాని అండవృద్ధియనికాని చెప్పఁబడును.

వాతవృద్ధియందు అండమును స్పృశించినయెడల వాతముచేనిండియుండుతిత్తివలెనుండి రూక్షంబైయుండును.

పిత్తవృద్ధియందు పండినమేడిపండువలెనుండి మంటయు, నొప్పియు, ఉష్ణంబును గలిగియుండును.

శ్లేష్మవృద్ధియందు శీతంబుగను, భారంబుగను దురదగను నుండును. రక్తవృద్ధియందు నల్లని బొబ్బలతో గూడి యుండి పిత్తవృద్ధి లక్షణంబులు గలిగియుండును.

మేదోవృద్ధియందు మృదువైన తాటిపండువలె వట్రువగానుండి కఫవృద్ధిలక్షణంబులు గలిగియుండును.

మూత్రమును నిరోధించువానికి అట్టిమూత్రము వృషణంబుల వ్యాపించి నీటిచే నింపఁబడినతిత్తివలె నుండి చలించుచు వేదనగల్గి మృదువుగానుండునది మూత్రవృద్ధి యనఁబడును.

వాతప్రకోపకపదార్థములను భుజించుట, చల్లనినీటియందు స్నానముచేయుట, మలమూత్రములను నిరోధించుట, బలాత్కారముగ మలమూత్రములను వెడలించుట, భారముమోయుట, త్రోవ నధికముగానడచుట, ఈమొదలగుకారణంబులచే వాతము ప్రకుపితంబై సన్నప్రేవులలో నొక్కభాగము సంకోచింపఁజేసి స్థానమునుండి క్రిందికి తోయును. అట్టి ప్రేగు గజ్జలయందు గ్రంథిరూపంబైన వాపునుగల్గించును. ఇది ఆంత్రవృద్ధి యనఁబడును.

## అండవృద్ధి, గండమాల, గలగండ, అపచి, గ్రంథ్యర్బుదరోగము.

అండవృద్ధిస్తథా చైకా తథైకా గండమాలికా. 67
గండాలజీతి చైకా స్యాద్గ్రంథయో నవధా మతాః,
త్రిభిర్దోషైస్త్రయో రక్తాచ్ఛిరాభిర్మేదసో వ్రణాత్. 68
అస్థ్నా మాంసేన నవమష్టధా స్యాత్తథార్బుదం,
వాతాత్పిత్తాత్కఫాద్రక్తాన్మాంసాదపి చ మేదసః. 69

అండవృద్ధిరోగ మొకవిధంబుగను, గండమాల, గలగండ, అపచీరోగము లొక్కొ క్క విధంబుగను, గ్రంథిరోగము-వాత, పిత్త, శ్లేష్మ, రక్త, మేదో, సిరా, వ్రణ, అ మాంస, గ్రంథులన తొమ్మిదివిధంబులుగను విభజింపఁబడియున్నది. అర్బుదరోగము-వా పిత్త, శ్లేష్మ, రక్త, మాంస, మేదోభవంబై యాఱు విధంబులం బరఁగు. అండవృద్ధియ వృషణవృద్ధియే. ఇందు పూర్వము చెప్పఁబడిన అంత్రవృద్ధిలక్షణంబులు చూపట్టును.

రేగుపండు, కమ్మరేగుపండు, ఉసిరికకాయ, వీనితోసమానమైన ప్రమాణముగ గ్రంథులు మేదఃకఫములచే చంకలు, భుజశిరస్సులు, పెడతలనుండునరములు, కంఠమ గజ్జలు, వీనియందు జనించును. ఇది గండమాలయనంబడును. ఈగ్రంథులు చిరకాలమున కొంచెము కొంచెముగా పగులును. మేదో దోషంబుచే వాతశ్లేష్మములు ప్రకుపితంబు మెడ, కంఠము, గడ్డము క్రిందిభాగము, వీని సంధులయందు గుండ్రముగా నల్లలలాడున చిన్నదిగాని, పెద్దదిగాని యగు గ్రంథిని గలుగఁజేయును. ఇయ్యది గలగండమనఁబడును

పైఁజెప్పిన గండమాలారూపమైనగ్రంథులు చిరకాలమునుండి యనుసరించి అంద కొన్ని పగిలి స్రవించి కొన్ని నశించి మరలజనించుచుండినయెడల అపచియనఁబడును.

వాతపిత్త కఫంబులు దుష్టంబులై మాంసము, రక్తము, మేదస్సు, సిరలు, వీని దుష్టంబులుగజేసి వర్తులంబును, ఉన్నతంబును, కఠినంబును నగువాపుఁ గల్గించును. ఇ గ్రంథియనంబడును.

వాతగ్రంథియందు ఈడ్వఁబడినట్లుండుట, సూదుల బొడిచినట్లుండుట, కొట్ట బడినట్లుండుట, పగలఁదీయుచున్నట్లుండుట, నల్లనిరంగు గల్గియుండుట, పగిలినపుడు నిర్మలంబైన రక్తమును స్రవించుట మొదలగు చిహ్నంబులు చూపట్టును.

పిత్తగ్రంథియందు అగ్నిచేకాల్పఁబడినట్లు లోపలనుండి పొగలువచ్చుచుండు నట్లుండుట, క్షారాదులంబెట్టి నట్లుండుట, జ్వలించునట్లుండుట, ఎఱుపుగను, పసుపుగ నుండుట, పగిలినపుడు ఉష్ణంబైన రక్తమును స్రవించుట మొదలైన చిహ్నంబులు చూపట్టును.

కఫగ్రంథియందు చల్లగనుండుట, స్వాభావికమైనవర్ణము గల్గియుండుట, బాధ స్వల్పముగానుండుట, దురద గలిగియుండుట, కఠినంబుగనుండుట, చిరకాలమునకు వృద్ధి జెంది పగిలినపుడు తెల్లనిరక్తమును స్రవించుట మొదలగు చిహ్నములు చూపట్టును.

మేదోజగ్రంథి శరీరము వృద్ధినొందునప్పుడు వృద్ధినొందుచు, శరీరముక్షీణించు నపుడు క్షీణించుచు నునుపుగల్గి బాధలేక గొప్పదిగానుండును. పగిలినపుడు పేరిననేయి వంటి చీము స్రవించును.

రక్తగ్రంథియందు పిత్తగ్రంథియందలి లక్షణములు చూపట్టును.

సిరాగ్రంథియందు పీడ, చలనము, ఔన్నత్యము ఇవిగలిగి మర్మస్థానంబులం బుట్టును. అయ్యాది అసాధ్యము.

వస్త్రాఘాతాదులచే వ్రణము జెంది అందుపుట్టు గ్రంథి వ్రణగ్రంథి యనఁబడును. ఇందు పిత్తలక్షణంబులు వాతలక్షణంబులు చూపట్టును.

వాతాదులు ప్రకోపముంజెంది అస్థులం జెఱచి అస్థులయందు గ్రంథిని గలుగఁ జేసిన నయ్యాది అస్థిగ్రంథియనఁబడును.

మాంసము చెడుటచే పుట్టిన గ్రంథి మాంసగ్రంథి యనియుఁ జెప్పఁబడును.

శరీరమునం దెచ్చటనైన నొకచోట వాతాదిదోషములు ప్రకోపమునొంది రక్త మాంసంబులంజెఱచి వర్తులంబును, కఠినంబును, స్వల్పబాధయుం కల్గినదియు, గాఢమైన మూలము కలదియుం, చిరకాలమునకు వృద్ధినొంది పరిపక్వంబగునదియు నైన మాంస పిండమును కల్గించును. ఇది అర్బుద మనఁబడును.

ఇందు వాత, పిత్త, కఫ, మేదస్సులచేపుట్టిన అర్బుదములయొక్క లక్షణంబులను వాత పిత్త కఫ మేదోగ్రంథుల లక్షణంబులతో సమానముగా నెఱుంగునది.

దోషములు ప్రకోపముజెంది రక్తమును విశేషముగ చెఱచి సిరలను సంకోచము నొందించి యొక్కచోట గుంపుగఁజేర్చి మాంసపిండమును నున్నతముగఁ జేయును. అట్టి మాంసపిండముపగిలి స్రవించుచు మాంసపు మొలకలతోగూడి శీఘ్రముగ వృద్ధినొందును. ఎల్లప్రుడును రక్తమును స్రవించుచుండును. ఇది రక్తార్బుదమనఁబడును. ఇది అసాధ్యము.

ప్రహారాదులచే మాంసముచెడి వాపుగల్గును, అట్టివాపు నొప్పిలేక నునుపుగల్గి శరీరమునకు సమానమైనవర్ణముగలిగి పగలక తాయివలె కఠినంబై యుండును. అది మాంసార్బుద మనఁబడును. ఈవ్యాధి మాంసము చెడినవానికిని మాంసము విశేషముగా భుజించు వానికిని జనించును. ఇది సాధ్యము. అర్బుదము ప్రక్క నొకయర్బుదము పుట్టిన నయ్యాది అసాధ్యము.

## శ్లీపదరోగవివరణము.

శ్లీపదం చ త్రిధా ప్రోక్తం వాతాత్పిత్తాత్కఫాదపి,

శ్లీపద(బోదకాలు)రోగము వాత, పిత్తశ్లేష్మములచే నుత్పన్నంబై త్రివిధంబగు.

జ్వరముతోఁగూడ మిగుల వేదనతోఁగూడినవాపు గజ్జలలో ముందుజనించి క్రమముగా పాదములకు దిగినయెడల నయ్యాది శ్లీపదం బనఁబడును. వాతశ్లీపదము నల్లగను రూక్షంబుగను తీవ్రంబగు వేదనగలదియుం, కారణములేకయే విశేషమగు నొప్పి గలదియునై యుండును.

పిత్తశ్లీపదము పచ్చనిరంగుగలదై తాపముతోఁగూడి జ్వరముగలిగి మృదువుగ నుండును.

శ్లేష్మశ్లీపదము నిగనిగలాడుచు శ్వేతవర్ణంబుగలిగి మిక్కిలి భారముతోఁగూడి కఠినంబైయుండును. తటాకాదులయందలి నీరు బైటకుపోవక యచ్చటనే చిరకాలము నిలచియుండు ప్రదేశంబులను అన్నిఋతువులయందును మిగుల శీతలంబుగానున్న ప్రదేశంబులను ఈశ్లీపదవ్యాధులు విశేషముగా జనించును.

మిక్కిలి వాతాదిదోషములు వానిలక్షణంబులం గనబఱచి నీరు మొదలగువానిని స్రవింపఁజేయుచుండిన నాశ్లీపదం బసాధ్యము.

### విద్రధి, వ్రణరోగము, వీనివివరణము.

విద్రధిష్షడ్విధః ఖ్యాతో వాతపిత్తకఫైస్త్రయః. 70
రక్తాత్క్షతాత్త్రిదోషైశ్చ వ్రణాః పంచదశోదితాః,
తేషాం చతుర్ధా భేదాస్స్యురాగంతుర్దేహజస్తథా 71
శుద్ధోదుష్టశ్చ విజ్ఞేయస్తత్సంఖ్యా కథ్యతే పృథక్,
వాతవ్రణః పిత్తజశ్చ కఫజో రక్తజో వ్రణః. 72
వాతపిత్తభవశ్చాన్యో వాతశ్లేష్మభవస్తథా,
తథా పిత్తకఫాభ్యాం చ సన్నిపాతేన చాష్టమః. 73
నవమో వాతరక్తేన దశమో రక్తపిత్తతః,
శ్లేష్మరక్తభవశ్చాన్యో వాతపిత్తాసృగుద్భవః. 74
వాతశ్లేష్మాసృగుత్పన్నః పిత్తశ్లేష్మాస్రసంభవః,
సన్నిపాతాసృగుద్భూత ఇతి పంచదశ వ్రణాః. 75

విద్రధిరోగము వాత, పిత్త, కఫ, రక్త, క్షత, సన్నిపాతములచే నుత్పన్నంబై యాఱువిధంబులగు.

వ్రణరోగము ఆగంతుకవ్రణము, శారీరవ్రణము, శుద్ధవ్రణము, దుష్టవ్రణము, అను నాలుగువిధంబుల విభజింపఁబడును. ఆట్టివ్రణము, వాత, పిత్త, కఫ, రక్త, వాతపిత్త, వాతశ్లేష్మ, పిత్తశ్లేష్మ, సన్నిపాత, వాతరక్త, రక్తపిత్త, శ్లేష్మరక్త, వాతపిత్తరక్త, వాతశ్లేష్మరక్త, పిత్తశ్లేష్మరక్త, సన్నిపాతరక్తంబులచే నుత్పన్నంబై ప్రత్యేకంబుగా పదునైదువిధంబులు.

వాతాదిదోషములు ప్రకోపముజెంది చర్మము, రక్తము, మాంసము వీని చెఱచి అస్థులయందుజేరి ప్రబలమైనమూలముగలది, నొప్పితోఁగూడినదియు, వర్తులంబును, లేక నిడుదయునైన క్రూరమైనవాపును గల్గించును. దీనిని విద్రధియని వ్యవహరించెదరు.

వాతవిద్రధియందు నల్లనిరంగుగల్గుట, ఎఱ్ఱనిరంగుగల్గుట, ఒకప్పుడు చిన్నదిగను, ఒకప్పుడు పెద్దదిగను ఉండుట, అధికమైనవేదనగల్గియుండుట, అనేకవిధంబులుగాపుట్టుట, పరిపాకముగల్గుట, మొదలైనచిహ్నంబులు చూపట్టును.

పిత్తవిద్రధియందు పండిన మేడిపండు వర్ణంబుగాని, శ్యామలవర్ణంబుగాని గలిగియుండుట, పుట్టినతోడనె జ్వరము, మంట, పరిపాకము గల్గుట మొదలైన చిహ్నంబులు చూపట్టును.

శ్లేష్మవిద్రధియందు మూకుడువలె వర్తులంబును, పాండువర్ణంబును గల్గియుండుట, చల్లగానుండుట, స్వల్పమైనబాధగల్గుట, చిరకాలమునకు పాకముచెందుట మొదలైన చిహ్నంబులు చూపట్టును.

ఈమూడువిద్రధులలోను వాతవిద్రధియందు పలచగను, పిత్తవిద్రధియందు పచ్చగను, శ్లేష్మవిద్రధియందు తెల్లగను, చీముకాఱును. రక్తవిద్రధియందు నల్లనిబొబ్బలు గలిగి శ్యామవర్ణంబుతోఁగూడి మిగులతీవ్రంబైన నొప్పి, బాధ కల్గుట పిత్తవిద్రధిలక్షణంబులు చూపట్టును.

క్షతవిద్రధియందు శరీరమున కభిఘాతము గల్గినపుడు అపథ్యాహారములను జేసినయెడల గాయమందలి యుష్ణము వాతముచే శరీరమందు వ్యాపింపఁబడిన రక్తముతో గూడిన పిత్తమును ప్రకోపమునొందించి జ్వరము, దప్పి, తాపము వీనితోగూడిన విద్రధిని గలుగఁజేయును. అందు పూర్వముచెప్పఁబడిన పిత్తవిద్రధిచిహ్నంబులు చూపట్టును.

సన్నిపాతవిద్రధియందు అనేకవర్ణంబులు, నానావిధంబులగువేదనలు, ఆస్రావంబులుగల్గుట, పెదతలవలె నున్నతమైయుండుట, ఒకచోట త్వరలోపాకముజెందుట, మఱియొకచోట జెందకుండుట, మొదలైనచిహ్నంబులు చూపట్టును. ఇయ్యది అసాధ్యంబు. ఈయాఱును బాహ్యవిద్రధులనంబడును.

మఱియు వాతాదిదోషములు ప్రకోపముజెంది శరీరమునకు లోప్రక్క పాము పుట్టవలె నున్నతంబును, గుల్మముఁవంటియాకారంబును కలవిద్రధిని గుదము, వస్తిద్వారము, నాభి, కుక్షి, గజ్జలు, వృకములు, ప్లీహము, యకృత్తు, హృదయము, క్లోమము వీనిలో నెచ్చటనైనను జనింపంజేయును. ఇది అంతర్విద్రధి యనంబడును. వానిలక్షణంబులను తంత్రాంతరంబుల చూడందగును.

వాతాదిప్రకోపముచేఁ గల్గినది శరీరవ్రణమనియు, శస్త్రాదిప్రహారముచే నుత్పన్నంబైనది ఆగంతుకవ్రణమనియు, దుర్గంధయుక్తమైనచీమును దుష్టరక్తమును స్రవించుట, మిగులఉన్నతంబుగనుండుట, చిరకాలమునుండి అనువర్తించియుండుట, గంధము వర్ణము ఇవి మిక్కిలి అధికంబుగ నుండుట, ఈమొదలైనచిహ్నంబుల గాన్పించిన నది దుష్టవ్రణమనియు, నాలుకవలె మిక్కిలిమృదువై నునుపుగలిగి స్నిగ్ధంబుగనుండి స్వల్పమైన వేదనగల్గి మిగుల నున్నతంబును మిగుల నిమ్నంబునుగాక సమముగానుండి చీముమొదలగు వానిని స్రవింపకుండిన నావ్రణము శుద్ధవ్రణంబనియు జెప్పఁబడును.

వాతవ్రణమందు స్తంభించియుండుట, స్పృశించినపుడు కఠినంబుగ నుండుట, చీమును మెల్లగ స్రవించుట, అధికమైన బాధ గల్గించుట, పోటుగల్గి అదరుచుండుట, శ్యామవర్ణము కల్గియుండుట, మొదలగులక్షణంబు లుండును.

పిత్తవ్రణంబున దప్పి, మూర్ఛ, జ్వరము, క్లేదము, తాపము, లోపల దుష్టంబై పగులఁదీయున ట్లుండుట, దుర్గంధముతోకూడి చీమును స్రవించుట ఈమొదలగు చిహ్నంబు లుండును.

శ్లేష్మవ్రణమందు మిక్కిలి జిగటగనుండుట, భారముగనుండుట, నునుపుగల్గి యుండుట, నిశ్చలంబై యుండుట, స్వల్పమైన వేదన గల్గియుండుట, పాండువర్ణము కల్గియుండుట, చీమును కొంచెము స్రవించుట, చిరకాలమునకు పాకమునొందుట మొదలైనచిహ్నంబు లుండును.

రక్తవ్రణంబున రక్తవర్ణంబై రక్తము స్రవించును.

ఈరీతిగ ద్విదోషలక్షణంబులును, త్రిదోషలక్షణంబులును కాన్పించినయెడల మిగిలిన భేదములనుకూడ తెలియందగును.

సద్యోవ్రణ వివరణము.

సద్యోవ్రణాస్త్వష్టధా స్యాదవిక్షప్తవిలంబితౌ,
ఛిన్నభిన్నప్రచలితఘృష్టవిద్ధనిపాతితాః. 76

సద్యోవ్రణము—అవక్షప్తము, విలంబితము, ఛిన్నము, భిన్నము, ప్రచలితము, ఘృష్టము, విద్ధము, నిపాతితము, అనుభేదంబులచే ఎనిమిదివిధంబులుగ నున్నది.

నానావిధంబులైనముఖములుగల శస్త్రములచేత నానావిధంబులైనఅవయవము లందు ప్రహారములుగల్గినయెడల పలువిధంబులైనవ్రణములు జనించును.

అందు కత్తిరించినట్లుండినవ్రణము అవక్షప్త మనంబడును.

వ్రేలాడుచుండినమాంసము గలవ్రణము విలంబితమనంబడును.

శరీరంబున అడ్డంబుగనైనను, నిడుపుగనైనను, ఛేదింపఁబడినయెడ నయ్యది ఛిన్న వ్రణమనఁబడును.

శక్తియనునాయుధము, దంతములు, బాణములు కత్తికొన, కొమ్ము, ఈమొదలగు దానిచే దేహమందలి మూత్రాద్యవయవములకు అభిఘాతము గల్గినయెడల నయ్యది భిన్న వ్రణమనఁబడును. ఇయ్యది మూత్రాదులను స్రవించుచుండును.

ముద్గరము, ముష్టి, వీనిచేగలిగెడి ప్రహారంబులచే అవయవములునలిగి అస్థులు, మజ్జ, రక్తములచేఁదడిసి అణఁగి విశాలముగఁగనఁబడుచున్న నయ్యది ప్రచలిత(పిచ్ఛిత) వ్రణంబనఁబడును.

కర్కశంబులైనవస్తువులయొక్క ఒరపిడిచేతను, అభిఘాతముచేతను, శరీరము దలి చర్మముపైతోలుడుడి మంటగల్గిస్రవించుచుండినయెడ నయ్యది ఘృష్టవ్రణ మనం బను.

సూక్ష్మమగుఅగ్రములు గలముల్లుమొదలగునవి అవయవములలో నెచ్చోటనైనను గిగి శైలువెడలినను, లేకున్నను ఆవ్రణము విద్ధవ్రణ మనఁబడును.

అధికముగ ఛిన్నంబును, భిన్నంబును గాక పై జెప్పఁబడినఛిన్నభిన్నలక్షణంబులు క్ష్మంబుగఁగల్గి శరీరమందు నిమ్నోన్నతంబగువ్రణము నిపాతితవ్రణమనిగాని, క్షత ణమనిగాని చెప్పఁబడును.

## కోష్ఠభేద వివరణము.

కోష్ఠభేదో ద్విధా ప్రోక్తశ్ఛిన్నాంత్రో నిస్సృతాంత్రకః,

కోష్ఠభేదరోగము—ఛిన్నాంత్రము, నిస్సృతాంత్రము, అను భేదంబుచే ద్వివిధంబు.

శల్యము కోష్ఠమందలి పొరలను భేదించినయెడల నయ్యది ఛిన్నాంత్రమనియు, ్యము కోష్ఠమందలిపొరలనుభేదించి ఈవలకు బయులు వెడలచేసిన నయ్యది నిస్సృతాంత్ర యుం చెప్పఁబడును.

## అస్థిభంగము, వహ్నిదగ్ధము వీనివివరణము.

అస్థిభంగోఽష్టధా ప్రోక్తో భగ్నపిష్టవిదారితౌ. 77
వివర్తితశ్చ విశ్లిష్టస్తిర్యక్క్షిప్తమధోగతః,
ఊర్ధ్వగస్సంధిభగ్నశ్చ వహ్నిదగ్ధశ్చతుర్విధః. 78
ప్లుష్టోఽతిదగ్ధో దుర్దగ్ధస్సమ్యగ్దగ్ధః ప్రకీర్తితః,

భగ్నంబనునది—ఎముకలయందును, కీళ్లయందును జనించుటంజేసి ద్వివిధంబు. ను సంధిగతభగ్నము—భగ్నపిష్టము, విదారితము, వివర్తితము, విశ్లిష్టము, తిర్యక్క్షి ు, అననైదువిధంబులుగను, అస్థిభంగము—అధోగతము, ఊర్ధ్వగతము, సంధిభం లన మూఁడువిధంబులుగను కలసి అస్థిభంగము ఎనిమిది విధంబులు.

అగ్నిదగ్ధరోగము—ప్లుష్టము, అతిదగ్ధము, దుర్దగ్ధము, సమ్యగ్దగ్ధము అన నాల్గం బులు.

అందు సంధియందలి ఎముకలురెండును ఒండొంటినొరసి నలిగినయెడల భగ్న ము. ఆరీతిగ కీళ్లునలిగినపుడు ఎముకల కిరుప్రక్కలయందు వాపును, రాత్రులయందు ప్రకోపముచే నధికమైనబాధయుం గల్గును.

సంధులయందు అస్థులుపగిలిన నయ్యది విదారిత మనంబడును.

కీలు కొంచెమువదలియున్న నయ్యది విశ్లిష్ట మనంబడును.

కీళ్లువీడి క్రిందుమీదుగ వ్యత్యస్తమైయున్నయెడల వివర్తితమనఁబడును.

కీలుసడలి అందొకఎముక అడ్డముగతిరిగియున్నయెడల నయ్యది తిర్యగ్గత మనఁబడును.

కాళ్లయందు ఎముకలుజాఱినయెడ నయ్యది అధోగత మనంబడును.

సంధులయందలి ఎముకలు మీఁదుగాపోయిన నయ్యది ఊర్ధ్వగత మనంబడును.

సంధులంగల యస్థులు విఱిగినయెడల నయ్యది సంధిబంధ మనంబడును.

అగ్నిచే శరీరముకాలుట అగ్నిదగ్ధ మనంబడును.

అందు చర్మము కమలి వేఱురంగును గల్గినయెడల నయ్యది ప్లుష్టమనియు, రక్తము మాంసము, సిరలు, స్నాయువులు, సంధులు, అస్థులు మొదలగునవి బైటబడి జ్వరము తాపము, దాహము, మూర్ఛ వీనిని గల్గించినయెడ నయ్యది అతిదగ్ధమనియు, అగ్నిచే మిగుల బొబ్బలుపుట్టి చిరకాలమువఱకు శమింపక బాధించుచుండిన నయ్యది దుర్దగ్ధమని యు, అగ్నిదగ్ధమైన శరీరము మరల స్వకాంతిం గలిగిన సమ్యగ్దగ్ధమనియు చెప్పఁబడును.

## నాడీవ్రణ, భగందర వివరణము.

నాడ్యః పంచ సమాఖ్యాతా వాతపిత్తకఫైస్త్రిధా. 79
త్రిదోషైరపి శల్యేన తథాష్ట స్యుర్భగందరాః,
శతపోనస్తు పవనాదుష్ట్రగ్రీవశ్చ పిత్తతః. 80
పరిస్రావీ కఫాత్ జ్ఞేయః ఋజుర్వాతకఫోద్భవః,
పరిక్షేపీ మరుత్పిత్తాదర్శోజః కఫపిత్తతః. 81
ఆగంతుజాతశ్చోన్మార్గీ శంఖావర్తస్త్రిదోషజః,

నాడీవ్రణము—వాత, పిత్త, శ్లేష్మ, సన్నిపాత, శల్యములచే నుత్పన్నంబై యైదు విధంబులం బరఁగు.

భగందరరోగము—శతపోన, ఉష్ట్రగ్రీవ, పరిస్రావి, ఋజు, పరిక్షేపి, అర్శోజ, ఉన్మార్గి, శంఖావర్త భేదంబులచే నెనిమిది విధంబులు.

పక్వమగు వాపును పక్వము గాని దని తలఁచి చికిత్సజేయక యుపేక్షించినను, అధికముగ చీము గల వ్రణములను పీడన శోధనాది చికిత్సలంజేయక యుపేక్షించినను, ఆట్టిచీము, చర్మము, మాంసము, సిరలు, స్నాయువులు, సంధులు, ఎముకలు, కోష్ఠము, మర్మములు, వీనినన్నిటి భేదించి లోనం బ్రవేశించును. ఇది నాడీవ్రణము (నారికుఱుపు) లనఁబడును.

వాతనాడీవ్రణంబున వ్రణద్వారము మిగుల సూక్ష్మంబుగనుండుట, పరుషంబై

యుండుట, అధికముగపోటు, రాత్రియందు వాతము ప్రకోపముజెంది అధికముగ చీము గాఱుట, ఈచిహ్నంబులు చూపట్టును.

పిత్తనాడీవ్రణంబున దప్పి, జ్వరము, మంట, మిగుల ఉష్ణంబు, పచ్చని చీము స్రవించుట మొదలగు చిహ్నంబులు చూపట్టును.

కఫనాడీవ్రణంబున చిక్కగానుండి తెల్లని చీముగాఱుట, స్తంభించి యుండుట, దురద, నొప్పిలేమి, మొదలగు చిహ్నంబులు చూపట్టును.

సన్నిపాత నాడీవ్రణంబున తాపము, జ్వరము, శ్వాసము, మూర్ఛ, నోరెండుట, మఱియు త్రిదోషలక్షణంబులును చూపట్టును.

శల్యములు, చర్మము, మాంసము, మొదలగువానియందు ప్రవేశించి కొన్నికారణంబులచేఁ గనఁబడకుండి శీఘ్రముగ వ్రణమును గల్గించును. ఇది శల్యనాడీవ్రణ మనఁబడును. ఇందు వ్రణమందు నురుఁగు, ఉష్ణంబు, రక్తముతోఁగూడిన చీముగాఱుట, ఎల్లప్పుడును ఎడతెగనిబాధ, ఈ లక్షణంబులు చూపట్టును.

గుదస్థానమునకు రెండంగుళములదూరమున అధికమగు వేదనతోఁగూడిన పిటిక (బొబ్బ) జనించి అది పగిలినయెడ నయ్యది భగందరమనఁబడును.

శతపోన భగందరంబున కషాయరూక్షాదిపదార్థములను సేవించుటచే వాతము మిగుల ప్రకోపము జెంది బొబ్బను గల్గించును. అది సమయమున చికిత్సజేయమింజేసి పరిపక్వంబై పగిలి క్రూరంబైన బాధతోఁగూడి యరుణవర్ణంబైన నురుఁగును స్రవించును. మఱియు నచ్చోట జల్లెడవలె ననేక రంధ్రములు కల్గి యారంధ్రములనుండి మలమూత్రశుక్రంబులు స్రవించుచుండును.

ఉష్ట్రగ్రీవ భగందరంబున పిత్తము ప్రకుపితంబై గుదస్థానంబున ఎఱ్ఱని బొబ్బను కల్గించును. అది జనించినతోడనే శీఘ్రముగ పాకమునుజెంది ఉష్ణంబైన చీమును స్రవించును. ఇది ఒంటెముఖమువలె వక్రంబై యుండుటంజేసి ఉష్ట్రముఖం బనఁబడును.

పరిస్రావి భగందరంబున కఫము ప్రకుపితంబై బొబ్బను గలుగజేయును. దానియందు దురద, చిక్కని చీముగాఱుట, కఠినంబుగ నుండుట, స్వల్పమైన బాధగల్గియుండుట, తెల్లగనుండుట మొదలగు చిహ్నంబులు చూపట్టును.

శంఖావర్త భగందరంబున త్రిదోషములు ప్రకోపమునుజెంది బొబ్బను గల్గించును. అందు అనేకవిధంబులైన బాధలుగల్గి బొబ్బ మేకచన్నువలె నుండుట, శంఖమునందలి సుడివలె ఆవర్తముగలిగియుండుట, మఱియు త్రిదోషలక్షణంబులును గానంబడును.

ఋజుభగందరంబున వాతశ్లేష్మములయొక్క లక్షణంబులు చూపట్టును.

పరిక్షేపిభగందరంబున వాతపిత్త లక్షణంబులు చూపట్టును.

అర్శోజభగందరంబున పిత్తశ్లేష్మ లక్షణంబులు చూపట్టును.

కంటకాదులచే గుదంబునఁ గలిగిన గాయమును చికిత్సజేయక యుపేక్షించిన నది నానాఁట వృద్ధినొంది పురుగులు పుట్టును. ఆ పురుగులు అనేకద్వారంబులను గలుగఁ జేయును. అట్టి భగందరము ఉన్మార్గిభగందర మనంబడును. భగందరములన్నియు దుస్సాధ్యంబులు. అందు శంఖావర్తభగందరము, ఉన్మార్గిభగందరము మిగుల నసాధ్యంబులని యెఱుంగునది.

ఉపదంశరోగము, శూకరోగము-వీనివివరణము.

మేఢ్రే పంచోపదంశాస్స్యుర్వాతపిత్తకఫైస్త్రిధా. 82
సన్నిపాతేన రక్తాచ్చ మేఢ్రే శూకామయా స్తథా,
చతుర్వింశతిరాఖ్యాతా లింగార్శో గ్రథితం తథా. 83
నివృత్తమవమంథశ్చ మృదితం శతపోనకః,
అష్ఠీలికా సర్షపికా త్వక్పాకశ్చావపాటికా. 84
మాంసపాకస్స్పర్శహానిర్విరుద్ధమణిరుత్తమా,
మాంసార్బుదం పుష్కరికా సమ్మూఢపిటికాలజీ. 85
రక్తార్బుదం విద్రధిశ్చ కుంభికా తిలకాలకః,
నిరుద్ధః ప్రకశః ప్రోక్తస్తథైవ పరివర్తికా. 86

ఉపదంశ (కొఱుకు) రోగము-వాత, పిత్త, శ్లేష్మ, సన్నిపాత, రక్తంబులచే నుత్పన్నంబై యైదువిధంబులు.

శూకరోగము-లింగార్శః, గ్రథిత, నివృత్త, అవమంథ, మృదిత, శతపోనక, అష్ఠీలిక, సర్షపిక, త్వక్పాక, అవపాటిక, మాంసపాక, స్పర్శహాని, విరుద్ధమణి, మాంసార్బుద, పుష్కరిక, సమ్మూఢపిటిక, అలజి, రక్తార్బుద, విద్రధి, కుంభిక, తిలకాలక,నిరుద్ధ, ప్రకశ, పరివర్తిక, అను భేదంబులచే నిరువదినాల్గువిధంబులుగ నుండును.

హస్తములచే మర్దనాద్యభిఘాతములను చేయుట, రతిచేయు కాలమున ననురాగాతిశయముచే నఖదంతక్షతములను జేయుట, సంభోగముచేసిన పిదప కడగకుండుట, అధికముగ సంభోగముచేయుట, భగమందలి దోషములు సంక్రమించుట, ఈకారణముల చేత పురుషునియొక్క మేఢ్రంబున ఉపదంశవ్యాధి పుట్టును.

అందు వాతోపదంశంబున సూదులంబొడిచినవిధమున బాధగల్గుట, పగులుట, అదరుట, ఈ చిహ్నములు గల్గి శిశ్నంబున నల్లని బొబ్బలు పుట్టును.

పిత్తోపదంశంబున మిక్కిలి మంటగలిగి తడితోగూడి పచ్చగనుండు బొబ్బలు గాన్పించును.

కఫోపదంశంబున దురద, వాపు, గల్లును.

సన్నిపాతోపదంశంబున నానావిధంబులైన స్రావంబులు, పోటు, దప్పి, ఇవిగల్గి త్రిదోషలక్షణంబులు చూపట్టును.

రక్తోపదంశంబున రక్తమువంటి రంగుగల్గి నల్లనిరక్తమును స్రవించుచు పిత్తలక్షణంబులు చూపట్టును. ఇందు మేఢ్రమందలి మాంసము పిండములుగనున్నను, మేఢ్రము నంతయు పురుగులుతిని వృషణములు మాత్రము మిగిలియున్నను, ఉపదంశము అసాధ్యం బగును. సాధ్యమగు నుపదంశమునకు చికిత్సంజేయకుండిన కొంతకాలమునకు వాపు, పురుగులు, మంట, ఇవికల్గి పక్వంబై మేఢ్రము తుత్తునియలై రోగి మరణము నొందును.

అక్రమముగ మేఢ్రమును వృద్ధినొందించు నిమిత్తము విషజంతువులను జేర్చిన ఔషధములను మేఢ్రమునకు లేపనము చేసినయెడల నట్టి మూఢునకు శూకదోషము జనించును.

గ్రథితమునందు శిశ్నమునందు ఎల్లపుడును కురుపులు పుట్టును.

అవమంథమునందు కఫరక్తములు ప్రకుపితంబులై మధ్యమున చీలియుండు పొక్కుల ననేకముగ శిశ్నంబున గలుగఁజేయును.

వాతప్రకోపంబున శిశ్నంబున వేదనాయుక్తంబులగు కురుపులులేచి శిశ్నము వాచియుండుట మృదిత మనఁబడును.

వాతరక్త ప్రకోపముచేత శిశ్నమునందు చిన్నకురుపులుపుట్టి బాధను గలుగజేసిన నయ్యది శతపోనక మనంబడును.

వాతప్రకోపముచేత శిశ్నంబున చిన్నకురుపులుపుట్టి యయ్యవి ఇనుమువలె గట్టిగా నుండిన అయ్యది అష్ఠీలిక యనఁబడును.

వాతశ్లేష్మ ప్రకోపంబుచేత శిశ్నంబున ఆవగింజలవంటి పొక్కులుపుట్టిన నయ్యది సర్షపిక యనఁబడును.

వాతపిత్తప్రకోపముచేత శిశ్నముయొక్క చర్మము పాకమునొంది జ్వరము, తాపము గలిగిన నయ్యది త్వక్పాక మనఁబడును.

వాతాదిప్రకోపముచేత శిశ్నమందలి మాంసము క్రిందికి జాఱిపోయి స్రవించు చుండిన నయ్యది మాంసపాక మనఁబడును.

శుక్రదోషంబుచేత రక్తము ప్రకోపమునొంది శిశ్నమునందు కురుపులు పుట్టి స్పృశించిన బాధను గలుగఁజేసిన నయ్యది స్పర్శహాని యనఁబడును.

శూకరోగానంతరమున అభిఘాతముచే మాంసముచెడి గ్రంథులుగలిగిన నయ్యది మాంసార్బుద మనఁబడును.

రక్తపిత్త ప్రకోపంబుచేత తామరమొగ్గలవలె జంటవకుఱుపులులేచిన నయ్యది పుష్కరిక యనఁబడును.

వాతప్రకోపముచేత శిశ్నమున సన్నముగను, కఠినముగను నుండు కుఱుపులు పుట్టిన నయ్యది సమ్మూఢ మనఁబడును.

ప్రమేహ పిటికవంటి లక్షణములు గల్గినది అలజి యనఁబడును.

శిశ్నము, పొత్తికడుపు-వీనియందు నల్లని, ఎఱ్ఱని, వర్ణముగల కుఱుపులు జనించి వేదన యధికముగానుండిన రక్తార్బుద మనఁబడును.

పూర్వము చెప్పఁబడిన సన్నిపాత విద్రధి లక్షణంబులు గలిగి అనేక వర్ణ వేదనా స్రావములు గలిగిన నయ్యది విద్రధి యనఁబడును.

రక్తపిత్తములవలన కుఱుపులు జనించి నేరేడువిత్తుల వర్ణములను గలిగియుండిన కుంభిక యనఁబడును.

త్రిదోష ప్రకోపంబుచేత శిశ్నమునందు చిత్రవర్ణముగలిగి యందలి మాంసము ఖిల్లి యూడిపడి చీము స్రవించుచుండిన నయ్యది తిలకాలక మనఁబడును. మఱియుం లింగార్శము, నివృత్తము, అవపాటిక, నిరుద్ధమణి, నిరుద్ధము, ప్రకశము, పరివర్తిక-వీని లక్షణంబులను గ్రంథాంతరంబులందు చూడందగును.

## కుష్ఠరోగవివరణము.

కుష్ఠాన్యష్టాదశోక్తాని వాతాత్కాపాలికం భవేత్,
పిత్తేనోదుంబరం ప్రోక్తం కఫాన్మండలచర్చికే. 87
మరుత్పిత్తాదృష్యజిహ్వం శ్లేష్మవాతాద్విపాదికా,
తథా సిద్ధ్మైకకుష్ఠం చ కిటిభం చాలసం తథా. 88
కఫపిత్తాత్పునర్దద్రుః పామా విస్ఫోటకం తథా,
మహాకుష్ఠం చర్మదళం పుండరీకం శతారుకమ్ 89
త్రిదోషైః కాకణం జ్ఞేయం తథాఽన్యం చిత్రసంజ్ఞికం,
తథా వాతేన పిత్తేన శ్లేష్మణా చ త్రిధా భవేత్. 90

కుష్ఠరోగము—కపాలిక, ఉదుంబర, మండల, చర్చిక, ఋష్యజిహ్వ, విపాదిక, సిధ్మ, కిటిభ, అలస, దద్రు, పామా, విస్ఫోటక, మహాకుష్ఠ, చర్మదళ, పుండరీక, శతారుక, కాకణ, చిత్ర భేదంబులచే పదునెనిమిది విధంబులు.

విరుద్ధాహారములను సేవించుటచేతను, మలమూత్రనిరోధముచేతను, దేవ, గురు, బ్రాహ్మణ, వృద్ధ, మాతా, పితలను నిందించుటచేతను, వాతాదిదోషంబులు ప్రకోపము నొంది త్వఙ్మాంస రక్తలసీకలను దుష్టంబులుగ చేసి కుష్ఠమును గలిగించును.

అందు వాతప్రకోపముచేత చర్మము ఎఱుపు నలుపు, రంగులతోఁగూడినదై కుండ పెంకువలెనుండి స్పృశించిన గరగరలాడుచుండి చర్మము అతిమృదువుగానుండిన కపాలిక కుష్ఠ మనఁబడును.

పిత్తప్రకోపముచేత చర్మము రక్తవర్ణంబై తాపము, వేదన దురద గలిగియుండి యందలిరోమంబులు పచ్చనిరంగు గలిగి యుండిన ఉదుంబరకుష్ఠ మనఁబడును.

శ్లేష్మప్రకోపము చేత చర్మముతెల్లనిరంగు గలిగి జింకవలెను, మండలాకారంబు గను నుండిన నయ్యది మండలకుష్ఠ మనఁబడును.

శ్లేష్మ ప్రకోపంబుచేత పాదములయందు దురదతోఁగూడిన నల్లని కుఱుపులు జనించి నీరును స్రవించుచు, పాదములు పగిలియుండిన నయ్యది విచర్చికకుష్ఠ మనఁబడును.

వాతపిత్తప్రకోపముచేత చర్మము కఠినముగను, గరగరగను, మండలాగ్రమున ఎఱ్ఱగను, మండలమధ్యమున నల్లగను నుండిన నయ్యది ఋష్యజిహ్వా మనఁబడును.

వాత, పిత్త, శ్లేష్మ, ప్రకోపంబుచేత, అఱకాళ్లు, అఱచేతులు, పగిలి మిగుల బాధగానుండిన నయ్యది విపాదికాకుష్ఠ మనఁబడును.

వాతశ్లేష్మప్రకోపంబుచేత చర్మము తెలుపు వర్ణముగలిగి, పలచగానుండి సొర కాయ పువ్వుతోఁసమానంబుగా నుండి రాచినపొట్టురాలుచుండిన సిధ్మకుష్ఠంబనఁబడును. మఱియు నయ్యది తఱచుగా ఱొమ్మునందు పుట్టుచుండును.

వాతశ్లేష్మప్రకోపంబుచేత చర్మము నల్లగను, అందలివ్రణము కఠినంబుగను గర గరగనుండిన నయ్యది కిటిభకుష్ఠమనంబడును.

శ్లేష్మవాతప్రకోపంబుచేత చర్మమున కుఱుపులు జనించి రక్తవర్ణముగను, దురద గను నుండిన నయ్యది అలసకుష్ఠ మనంబడును.

పిత్తశ్లేష్మప్రకోపంబుచే చర్మమున కుఱుపులుజనించి రక్తవర్ణముగను, దురదగను నుండి మండలంబున తాపముగలిగిన నయ్యది దద్రుకుష్ఠమనంబడును.

పిత్తశ్లేష్మప్రకోపంబుచేత చర్మమున చిన్నకుఱుపులుపుట్టి దురదగల్గి, పగిలి అందుండి నీరుకాఱుచు నడుము చేతులు వీనియందు అధికముగానుండిన నయ్యది పామా కుష్ఠ మనఁబడును.

పిత్తశ్లేష్మప్రకోపముచేత చర్మమున శ్యామారుణవర్ణంబులు గలిగినకుఱుపులు పుట్టి చర్మము పలచగనుండిన నది స్ఫోటకకుష్ఠ మనంబడును.

పిత్తశ్లేష్మప్రకోపంబుచేత చెమ్మనుస్రవింపక చర్మమున మచ్చలుపుట్టిన నయ్యది మహాకుష్ఠమనఁబడును. ఇది చర్మకుష్ఠమనియు, గజచర్మకుష్ఠమనియు చెప్పఁబడును.

పిత్తశ్లేష్మప్రకోపంబుచేత చర్మము రక్తవర్ణంబుగను, దురదగను, పోటుగను, ఉండు ట్రయుగాక యందలికుఱుపులు స్పృశించిన వేదనగలిగియుండిన చర్మదళకుష్ఠ మనంబడును.

పిత్తశ్లేష్మప్రకోపంబుచేత చర్మ మధ్యప్రదేశంబు తెల్లగను, తామరాకువలె చుట్టు నెఱ్ఱగను, ఉన్నతముగను నుండిన నయ్యది పుండరీకకుష్ఠ మనఁబడును.

చర్మమున ననేకవ్రణములు జనించి వేదన, తాపము గలిగియుండిన శతారుకుష్ఠ మనంబడును.

చర్మము నల్లనై గురిగింజలవంటికుఱుపులుపుట్టి పాకము నొందునపుడు మిగుల వేదన గలిగియుండిన కాకణకుష్ఠ మనంబడును.

వాతాదిదోషప్రకోపముచేత చర్మము ఎఱ్ఱగగాని, తెల్లగగాని యుండిన నయ్యది చిత్రకుష్ఠ మనంబడును.

### క్షుద్రరోగవివరణము.

క్షుద్రరోగాష్షష్టిసంఖ్యాస్తేష్వాదౌ శర్కరార్బుదం,
ఇంద్రవిద్ధాపనసికా వివృతాంత్రాలజీ తథా. 91
వారాహదంష్ట్రో వల్మీకం కచ్ఛపీ తిలకాలకః,
గర్దభీరకసాచైవ యవప్రఖ్యా విదారికా. 92
కదరం మశకశ్చైవ నీలికా జాలగర్దభః,
ఇరివేల్లి జతుమణిర్గుదభ్రంశోఽగ్నిరోహిణీ. 93
సన్నిరుద్ధగుదః కోశః కునఖోఽనుశయీ తథా,
పద్మినీకంటకశ్చిప్యమలసో ముఖదూషికా. 94
కక్షావృషణకచ్ఛూశ్చ గంధః పాషాణగర్దభః,
రాజికా చ తథా వ్యంగాశ్చత్వారః పరికీర్తితాః. 95
వాతాత్పిత్తాత్కఫాద్రక్తాదిత్యుక్తం వ్యంగలక్షణం,
విస్ఫోటాః క్షుద్రరోగేషు తేఽష్టధా పరికీర్తితాః. 96
పృథగ్దోషైస్త్రయో ద్వంద్వై స్త్రివిధః సప్తమోఽసృజః,
అష్టమస్సన్నిపాతేన క్షుద్రరుక్షుమసూరికా. 97
చతుర్దశప్రకారేణ త్రిదోషైశ్ త్రిధా చ సా,
ద్వంద్వజా త్రివిధా ప్రోక్తా సన్నిపాతేన సప్తమీ. 98
అష్టమీ త్వగ్గతా జ్ఞేయా రక్తజా నవమీ స్మృతా,
దశమీ మాంససంజాతా చతస్రోఽన్యాశ్ దుస్తరాః. 99
మేదోఽస్థిమజ్జాశుక్రస్థాః క్షుద్రరోగా ఇతీరితాః,

క్షుద్రరోగములు, శర్కరార్బుదము, ఇంద్రసిద్ధ, పనసికము, వివృతాంఘ్రి, అలజి, వరాహదంష్ట్రము, వల్మీకము, కచ్ఛపికము, తిలకాలకము, గర్దభము, రకసము, యవప్రఖ్య,

విదారిక, కదరము, మశకము, నీలిక, జాలగర్దభము, ఇరివెల్లిక, జతుమణి, గుదభ్రంశము, అగ్నిరోహిణి, సన్నిరుద్ధగుదము, కోశము, కునఖము, అనుశయి, పద్మినీకంటకము, చిప్పము, అలసము, ముఖదూషిక, కక్షము, వృషణకచ్ఛము, గంధము, పాషాణగర్దభము, రాజిక, వ్యంగము, విస్ఫోటము, మసూరిక, అను భేదంబులచే నుండును. అందు వ్యంగము-వాత, పిత్త, శ్లేష్మ, రక్తములచే నుత్పన్నంబై నాల్గువిధంబులు. విస్ఫోటము-వాత, పిత్త, శ్లేష్మ, వాతశ్లేష్మ, వాతపిత్త, పిత్తశ్లేష్మ, సన్నిపాత, రక్తములచే నుత్పన్నంబై ఎనిమిదివిధములు. మసూరిక-వాత, పిత్త, శ్లేష్మ, వాతశ్లేష్మ, వాతపిత్త, పిత్తశ్లేష్మ, సన్నిపాత, చర్మ, రక్త, మాంస, మేదో, అస్థి, మజ్జా, శుక్రంబులచే నుత్పన్నంబై పదునాల్గు విధంబులు. అన్నియుం కలసి క్షుద్రరోగంబులు అఱువదివిధంబులం బరఁగు.

సిరలు, స్నాయువులు, కఫము, మేదస్సు, వాతము ఇవి మాంసాశ్రితంబులై గ్రంథులను జనింపఁజేయును. ఇట్లుజనించిన గ్రంథులు వృద్ధిఁజెంది పగిలి తేనె నేయి వీనివంటి చీమును స్రవించును. పిమ్మట వాతము ప్రకోపమునొంది యాగ్రంథులను కఠినంబులుగను, అనేకవర్ణములు కలవిగాను చేయును. ఇయ్యది శర్కరార్బుద మనఁబడును.

మధ్యభాగమున తామరమొగ్గవలె నొక్కకుఱుపు జనించి దానిచుట్టును చిన్నకుఱుపులు పుట్టిన నయ్యది ఇంద్రవిద్ధ మనంబడును.

వాతశ్లేష్మప్రకోపంబుచే కర్ణములయందు కుఱుపులు జనించి అధికముగా బాధగల్గి కఠినంబుగానుండిన నయ్యది పనసికయనంబడును.

మిగులబాధగలిగించుచు పుండు గుండ్రముగనుండి దానిముఖము పండినఅత్తిపండువలె నుండిన నయ్యది విపృతాంఘ్రి యనఁబడును.

వాతశ్లేష్మప్రకోపంబుచే కఠినంబుగను, ముఖములేక ఉన్నతంబుగను, గుండ్రముగను, స్వల్పముగా చీము స్రవించుచుండు కుఱుపు పుట్టిన నయ్యది అలజియనంబడును.

శరీరమున వాపు జనించి యయ్యది కఠినంబుగను, తాపము, దురద, వేదన వీనిని గల్గించుచుండి చర్మము పాకము నొందిన నయ్యది వరాహదంష్ట్రి మనంబడును.

వాతాది దోషప్రకోపముచేత గొంతు, మెడ, చేతులు, కాళ్లు, సంధులు వీనియందు గంభీరస్థలము నాశ్రయించి, అనేక ముఖములనుండి స్రవించుచు గ్రంథులు జనించి తాపము, దురద, వీనిని జనింపఁజేసి విసర్పమువలె శరీరము నంతను వ్యాపించిన నయ్యది వల్మీకమనంబడును.

రెండు కుఱుపులు జంటగ జనించి మధ్యభాగంబు తాఁబేటి వీపువలె నున్నతంబుగను, కఠినంబుగను నుండిన నయ్యది కచ్ఛపిక యనఁబడును.

త్రిదోషప్రకోపంబుచేత శరీరంబున నువ్వుపిత్తులంబోలి కుఱుపులు జనించి బాధలేకుండిన నయ్యది తిలకాలకం బనఁబడును.

వాతపిత్తప్రకోపంబుచే నెఱ్ఱనివర్ణంబుగల కుఱుపులు జనించి శరీరంబంతఁ వ్యాపించి వేదనను గలుగఁజేయుచుండిన నయ్యాది గర్దభిక యనఁబడును.

స్రావరహితంబు లగుకుఱుపులు జనించి దురదమాత్రము గలిగియుండిన రక బనంబడును.

వాతప్రకోపంబుచే గోధూమాకారంబుగల కుఱుపులుపుట్టి మాంసాశ్రితంబు కఠినంబుగ నుండిన నయ్యాది యవప్రఖ్యమనంబడును.

సంధులయందు నేలగుమ్ముడు గడ్డవలె కుఱుపులు జనించిన నయ్యాది విదాః యనంబడును.

ముల్లు, ఱాల్లు, మొదలగునవి పాదంబులయందు గ్రుచ్చుకొనుటచేత రేగుపంః లోని గుజ్జువలె బంకగలిగినకుఱుపు జనించిన నయ్యాది కదరమని జెప్పఁబడును.

వాతప్రకోపంబుచేత మినుములవంటియాకారము గలకుఱుపులు జనించి కఠిన ములై వేదనారహితంబులై యుండిన నయ్యాది మశక మనంబడును.

క్రోధాయాసంబులచే వాతము ప్రకోపమునొంది పిత్తముతోఁగలసి ముఖంబు నైనను, శరీరంబుననైనను, నల్లనిమండలంబులం గలుగజేయును. అయ్యాది నీలిక యన బడును.

పిత్తము ప్రకోపముజెంది శరీరంబున నెచ్చటనైనను వాపుగలిగించును. ఆవాః శరీరంబున నిలకడలేక సంచరించుచు జ్వరము, తాపము, దప్పి మొదలగువానిని గల్గించును ఇయ్యాది జాలగర్దభ మనంబడును.

శిరంబున వర్తులంబై తీవ్రమైన వేదనతోఁగూడి బొబ్బజనించిన నయ్యాది ఇరివేల్లిక యనంబడును. ఇది త్రిదోషోద్భవంబు.

నునుపుగలిగి శరీరమున కొంచె మున్నతంబైన మచ్చ జనించిన నయ్యాది జతుమణి యనంబడును. ఇయ్యాది కఫవాతములచే జనించును. దీనినే కొందఱు పుట్టుమచ్చయని వ్యవహరించెదరు.

పురీషమును విసర్జించునపుడు మిక్కిలిబలాత్కారముగ ముక్కుటచేతను, అతిసారముచేతను, గుదము బైటకి వచ్చిన నయ్యాది గుదభ్రంశమనంబడును. ఇది బలహీనుఁడై రూక్షుఁడగువానికి జనించును.

మాంసమును పగులఁగొట్టి లోన తీవ్రమైనమంటను జ్వరమును గలిగించునవియు, జ్వలించు అగ్నికణంబువోలె రక్తవర్ణంబు లైయుండిన బొబ్బలు చంకలయందుజనించిన నయ్యాది అగ్నిరోహిణి యనంబడును. ఇయ్యాది త్రిదోషోత్థం బగుటచే నసాధ్యంబు. ఇందు వాతోద్భవంబు ఏడుదినములకు పిమ్మటను, పిత్తోద్భవంబు పదిదినములకుపిమ్మటను, కఫోద్భవంబైనది పదునైదుదినములకు పిమ్మటను రోగిని చంపును.

పురీషము, వాతము—వీనివేగమును నిరోధించుటచేత అపానవాతము ప్రకోపము జెంది గుదద్వారము నడ్డగించి పురీషమార్గమును మిగుల సూక్ష్మముజేయును. దానంజేసి పురీషము మిగుల కొద్దిగ కష్టముచేఁ బోవుచుండును. ఇయ్యది సన్నిరుద్ధగుద మనంబడును.

వాత, రక్త, పిత్తప్రకోపంబులచే శరీరము దద్దులు బైలుదేరి తత్క్షణమే నశించుచుండిన నయ్యది కోఠమనంబడును.

నఖములకు అభిఘాతము గల్గుటచేత నయ్యవి నల్లబడిన నయ్యది కునఖమనంబడును.

మీఁగాలిమీద మిక్కిలిలోఁతున దోషముగల్గి శరీరమునకు సమానమైనవర్ణముంగలిగి లోననే పాకమునొంది వాపు బైలువెడలిన నయ్యది అనుశయి అనంబడును.

తామరకాఁడయందలి ముండ్లవలెనుండు ముండ్లు గలిగి పాండువర్ణంబై దురదతోఁగూడియుండి వర్తులాకారంబైన పొడలుగల్గిన నయ్యది పద్మినీకంటక మనంబడును.

వాతపిత్తములు నఖములయందలి మాంసమునందు ప్రకోపముజెంది మంటను గలుగఁజేసి పాకము నొందించును. అయ్యది చిప్య మనంబడును. ఇయ్యదియే గోఱుచుట్టు అని వ్యవహరింపఁబడును.

దుష్టమగుబురదను త్రొక్కుటచేత పాదములయందలి రక్తముచెడి వ్రేళ్లమధ్యమున నీరుకారుట, దురద, మంట, నొప్పి గలిగిన నయ్యది అలస మనంబడును.

కఫవాతరక్తప్రకోపంబులచే యౌవనవంతులగు స్త్రీపురుషులకు ముఖమునందు బూరుగముండ్లవలె కఠినంబులైనపొక్కులు గల్గును. ఇయ్యది ముఖదూషికయనియు యౌవనపిడకమనియు ననంబడును. దీనినే మొటిమలందురు.

బాహువులయందును, పార్శ్వములయందును, భుజశిరస్సులయందును, చంకలయందును నల్లనిబొబ్బలతోఁగూడి అధికమైన వేదనగలపిడక జనించిన నయ్యది "కక్ష" యనంబడును. ఇయ్యది పిత్తప్రకోపముచే జనించును.

స్నానముచేయునపుడు బాగుగాతోమకయున్నయెడ వృషణములయందు మురికిజేరి చెమ్మటబట్టిన నామురికి తడిసి దానంజేసి దురదగలుగును. గోకినయెడల బొబ్బగలిగి స్రవించును. ఇయ్యది వృషణకచ్ఛువు అనంబడును.

కక్షయనురోగంబునంబోలె నొక్కపిడకజనించిన నయ్యది గంధమనియు, గంధమాలయనియుఁ జెప్పఁబడును.

తాలువులయొక్క సంధియందు కఠినంబై అల్పంబుగ వేదనగలిగి స్నిగ్ధమైన శోఫ (ఉబ్బు) జనించును. ఇయ్యది ఱాయింబోలె కఠినముగ నుంటచే పాషాణగర్దభ మనంబడును. ఇయ్యది వాతశ్లేష్మములచే జనించును.

క్రోధముచేతను, ఆయాసముచేతను, వాతము ప్రకోపమునొంది పిత్తముతోఁగూడి ముఖమునందు వేదనారహితంబై, సూక్ష్మంబుగను, శ్యామవర్ణంబుగను నుండు పొడను గల్గించును. ఇయ్యది వ్యంగమనంబడును. దీనినే లోకంబున మంగు అని వ్యవహరించెదరు. ఈవ్యంగము వాత, పిత్త, కఫ, రక్తములచే నుత్పన్నంబై యాదోషలక్షణంబులను గలిగియుండును.

కటురసంబును, అమ్లరసంబును గల పదార్థములను భుజించుట, తీక్ష్ణము, ఉష్ణము, సంతాపకము, రూక్షము, క్షారము గలపదార్థములను భుజించుట, జీర్ణముగాకుండ మరల భుజించుట, ఎండం దిరుగుట, ఋతుధర్మములగు శీతోష్ణాదులను అధికముగా సేవించుట; ఈకారణములచే వాతము ప్రకోపముజెంది రక్తము, మాంసము, అస్థులు, వీని నాశ్రయించి జ్వరముతోఁగూడ భయంకరములగు బొబ్బలను జనింపఁ జేయును. దేహమునందెచటనైనను రక్తపిత్తములచే నిప్పునకాలినట్లు జ్వరముతోఁ గూడియుండు పొక్కులు జనించుట విస్ఫోటకసామాన్యలక్షణమని యెఱుంగునది.

వాతవిస్ఫోటకంబున తలనొప్పి, శూల, జ్వరము, దప్పి, కీళ్లనొప్పులు, నల్లబారుట ఈలక్షణంబులు చూపట్టును.

పిత్తవిస్ఫోటకంబున జ్వరము, మంట, నొప్పి, స్రావము, పక్వముఁజెందుట, దప్పి, బొబ్బలుపచ్చగను, ఎఱ్ఱగనునుండుట ఈలక్షణంబులు చూపట్టును.

కఫవిస్ఫోటకంబున వాంతి, అరోచకము, జాడ్యము, దురద, కాఠిన్యము, తెల్లబాఱుట, బాధలేమి, చిరకాలమునకు పాకముజెందుట, ఈలక్షణంబులు చూపట్టును.

వాతపిత్తవిస్ఫోటకంబున తీవ్రంబగువేదనయు, కఫవాతికవిస్ఫోటకంబున దురద జాడ్యము, గురుత్వముగల్గుటయు, కఫపిత్తవిస్ఫోటకంబున దురద, మంట, జ్వరము, వాంతి గల్గుటయు చూపట్టును.

సన్నిపాతవిస్ఫోటకంబున బొబ్బలు మధ్యమున పల్లముగను, చుట్టును ఉన్నతంబుగను, మిగులకాఠిన్యముగను నుండుట, స్వల్పపాకము నొందుట, మంట, ఎఱుపు, దప్పి, ఇంద్రియజ్ఞానము నశించుట, వాంతి, మూర్ఛ, నొప్పి, జ్వరము, ప్రలాపము, వణఁకు, కునికిపాటు ఈలక్షణంబులు చూపట్టును.

రక్తజవిస్ఫోటకంబున గురిగింజలను పవడములను బోలు బొబ్బలు రక్తవర్ణంబులై జనించును. ఇయ్యది పిత్తసహాయముచేఁ గూడ జనించును. ఇయ్యది ఎట్టిచికిత్సలచేతను అసాధ్యము.

చేదు, పులుసు, ఉప్పు, కారము - ఈరసములు గలపదార్థములను మిక్కుటముగ భుజించుట, పరస్పరవిరుద్ధంబులగు క్షీరమత్స్యాద్యాహారము, జీర్ణము కాకుండ మరల

భుజించుట, విషసంబంధము గల పుష్పములు మొదలగువానినుండి వచ్చు గాలిని పీల్చుట, శనైశ్చరాది క్రూరగ్రహములచే దేశంబునకు వీక్షణంబుకలుగుట - వీనిచే వాతాదిదోషములు ప్రకోపముజెంది దుష్టంబైన రక్తముతోగూడి మసూరంబులం (చిఱుసెనగల) బోలుబొబ్బలను శరీరంబున జనించును. ఇయ్యది మసూరిక యనంబడును.

వాతజమసూరికయందు బొబ్బలు శ్యామారుణవర్ణంబులై రూక్షంబులై, మిగుల వేదనగలిగి, కఠినంబులై, చిరకాలమువఱకు పాకమునొందక యుండును. ఇందు అవయవ సంధులందును, ఎముకలసంధులయందును నొప్పి, దగ్గు, వణఁకు, మాంద్యము, బడలిక, తాలువులు, పెదవులు, నాలుక, ఇవి యెండుట, దప్పి, అరుచి, ఈలక్షణంబులు చూపట్టును.

పిత్తజమసూరికయందు బొబ్బలు రక్తవర్ణంబులై, పీతంబులై, మంటతోడను, మిగుల వేదనతోడను గూడి శీఘ్రముగ పాకము నొందినవై యుండును. ఇందు అతిసారము, ఒడలినొప్పులు, అరుచి, తాపము, దప్పి, నోరు పుండగుట, కన్నులెఱ్ఱబారుట, తీక్ష్ణంబగు జ్వరము ఈచిహ్నంబులు చూపట్టును.

కఫజమసూరికయందు బొబ్బలు శ్వేతవర్ణంబులై నునుపుగల్గి స్థూలంబులై దురదగల్గి, స్వల్పవేదనాసహితంబులై చిరకాలమునకు పాకము నొందునవై యుండును. ఇందు నోట కఫము స్రవించుట, జాడ్యము, తలనొప్పి, శరీరము బరువుగానుండుట, అరుచి, నిద్ర ఈలక్షణంబులు చూపట్టును.

సన్నిపాతమసూరికయందు బొబ్బలు నీలవర్ణంబులై, అడుకులవలె విస్తీర్ణంబులై చిరపాకంబుగలిగి దుర్గంధముతోడ చీముగాఱుచు నుండును. ఇందు మాటాడుటకు శక్తి లేక కంఠము క్రుంగిపోవుట, అరుచి, శరీరము స్తంభించుట, అనర్థముగ మాటాడుట ఈ చిహ్నంబులు చూపట్టును. ఇయ్యది అసాధ్యము.

రక్తజమసూరికయందు పిత్తజమసూరికయందలి లక్షణంబులు చూపట్టును.

మఱియు నీమసూరికారోగము సప్తధాతువుల నాశ్రయించి కూడ జనించును. ప్రత్యేకము వానిలక్షణంబులను గ్రంథాంతరంబులందుఁ జూడందగును.

## విసర్పరోగవివరణము.

విసర్పరోగో నవధా వాతపిత్తకఫైస్త్రిధా. 100
త్రిధా చ ద్వంద్వభేదేన సన్నిపాతేన సప్తమః,
అష్టమో వహ్నిదాహేన నవమశ్చాభిఘాతజః. 101

విసర్పరోగము—వాత, పిత్త, శ్లేష్మ, వాతపిత్త, వాతశ్లేష్మ, పిత్తశ్లేష్మ, సన్నిపాత, వహ్నిదాహ, అభిఘాతములవలన నుత్పన్నంబై తొమ్మిదివిధంబులం బరఁగు.

ఉప్పు, పులుసు, కారము, ఉష్ణపదార్థములు వీనిని మిక్కుటముగ భుజించుటచేత

వాతాదిదోషములు ప్రకోపముజెంది విసర్పరోగంబును గలిగించును. "వివిధం సర్పతి యతో విసర్పస్తేన స స్మృతః, పరిసర్పోఽథవా నామ్నా సర్వతః పరిసర్పణాత్" శరీరంబున ననేకప్రదేశంబుల సంచరించుటచే పరిసర్పమనియుఁ జెప్పఁబడును. అనఁగా వాతాది దోషములు ప్రకోపముఁ జెంది త్వక్ మాంసరక్తముల నాశ్రయించి దేహంబున నొక్కచోట నిల్కడలేక సకలావయవంబులందును సంచరించునదియు, వాతాదిలక్షణంబులతోఁ గూడినదియు, విస్తీర్ణంబును, ఉన్నతంబునునైన వాపును గల్గించును. దీనిని ఒక్కచోటనైనను నిల్కడలేక శరీరంబంతయు వ్యాపించుటంజేసి విసర్పంబని వ్యవహరింతురు.

అందు వాతవిసర్పంబున వాతజ్వరముతో సమానమైనచిహ్నంబులు గలుగుట, వాపు, అదరుట, సూదులంగ్రుచ్చినట్లుండుట, పగులదీసినట్లుండుట, నొప్పి, ఆయాసము, రోమాంచము ఈచిహ్నంబులు గానంబడును.

పిత్తవిసర్పంబున నావాపు శీఘ్రంబుగ నొక్కచోటనుండి మఱియొకచోటుకు వ్యాపించుట, పిత్తజ్వరలక్షణంబులు గల్గియుండుట, ఆవాపు రక్తవర్ణంబైయుండుట ఈ లక్షణంబులు గానంబడియెడి.

శ్లేష్మవిసర్పంబున దురద, నునుపు, కఫజ్వరలక్షణంబులు చూపట్టును.

వాతపిత్తవిసర్పంబున జ్వరము, వాంతి, మూర్ఛ, అతిసారము, దప్పి, భ్రమము, అగ్నిమాంద్యము, తమకము, అరోచకము ఈచిహ్నంబులు గలిగి శరీరమంతయు అగ్నితో గాల్చినవిధంబున బాధగల్గియుండును. ఈవాపు ఎచ్చటసంచరించునో యాస్థలంబు నల్లబాఱి బొగ్గువలె నుండును. అయ్యది శీఘ్రగమనంబు గల్గియుంటంజేసి త్వరలో హృదయాది మర్మస్థానంబులంజేరును. అట్టితఱి వాతము బలిష్ఠంబై జ్ఞానమును నశింపఁజేసి నిద్రను నశింపఁజేయును. అట్టియవస్థలో శ్వాసము, ఎక్కిళ్లు ప్రారంభమగును. రోగి ఒకదానియందు నిచ్చగింపక ఇటునటుకొట్టుకొనుచుండును. ఇట్టియుపద్రవగ్రస్తుఁడై శీఘ్రకాలంబున మరణముజెందును. ఇయ్యదియే "అగ్నివిసర్ప" మనంబడును.

కఫవాతవిసర్పంబున ప్రకోపమునొందిన కఫముచే వాతమార్గము నిరోధింపఁబడి యావాతము ప్రకోపము జెందును. అట్టికఫము రక్తవృద్ధి గలమనుజునియొక్క చర్మ, సిరా, స్నాయువుల నాశ్రయించి యుండురక్తమును దుష్టముగఁజేసి దీర్ఘంబులై, సూక్ష్మాకారంబులై, వర్తులంబులై, కఠినంబులై యుండుగ్రంథులను గల్గించును. ఆగ్రంథిమాల రక్తవర్ణంబై తీవ్రవేదనాయుతంబైన జ్వరంబును గల్గించును. అట్టితఱి శ్వాసము, కాసము, అతిసారము, నోరెండుట, ఎక్కిళ్లు, వాంతి, భ్రమము, ఇంద్రియసమ్మోహము, శరీరవర్ణము మాఱియుండుట, మూర్ఛ, అగ్నిమాంద్యము ఈచిహ్నంబులు గానంబడియెడి. ఇయ్యది "గ్రంథివిసర్ప" మనంబడును.

కఫపిత్తవిసర్పంబున కఫపిత్తములు స్వస్థానంబైన ఆమాశయముగుండ శరీరంబున ్యాపించి పచ్చనిరంగుగలిగి, పాండురవర్ణంబై స్నిగ్ధంబుతై స్వల్పవేదనాసహితంబులైన ొబ్బలను గలిగించును. అట్టిబొబ్బలు లోన పాకమునొంది హస్తంబులచే స్పృశించిన ేషల అడుసువలె చలించుచుండెడి మాంసముగలిగి, మాంసదోషముచే స్పష్టముగ దృష్టి ోచరంబులగు సిరాస్నాయుసంఘాతముగల్గి పీనుఁగువలె దుర్గంధము గల్గియుండును. ందు జ్వరము, నిద్ర, తలనొప్పి, శరీరకృశత్వము, శరీరము జిగటగల్గియుండుట, అరుచి, ్రమము, అగ్నిమాంద్యము, అస్థులు భిన్నంబులగుట, భుక్తంబగునాహారము పాకము ందకుండుట ఈ చిహ్నంబులు చూపట్టెడిని, ఇయ్యది "కర్దమవిసర్ప" మనంబడును.

త్రిదోషలక్షణంబులు గనంబడిన నయ్యది సన్నిపాతవిసర్ప మనంబడును. ఇయ్యది సాధ్యము.

అగ్నిదాహముచే గల్గిన విసర్పము "అగ్నిదాహవిసర్ప" మనంబడును. ఇందు పిత్త ర్పలక్షణంబులు చూపట్టును.

శస్త్రప్రహారాదులచే వాతము ప్రకుపితంబై రక్తపిత్తములను ప్రేరేపించి ఉలవల ్సమానంబగు బొబ్బలను గల్గించును. ఇందు జ్వరము, నొప్పి, మంట ఈలక్షణంబుల డ శ్యామారుణవర్ణంబు చూపట్టును. ఇయ్యది "అభిఘాతవిసర్ప" మనంబడును.

## ఉదర్దరోగము, శీతపిత్తము-వీనివివరణము.

తథైకశ్లేష్మపిత్తాభ్యాముదర్దః పరికీర్తితః,
వాతపిత్తేన చైకస్తు శీతపిత్తామయస్స్మృతః. 102

ఉదర్దరోగము శ్లేష్మపిత్తములచే నుత్పన్నంబై యొక్కవిధంబై యుండును. శీత త్తరోగము వాతపిత్తములచే నుత్పన్నంబై యొుండువిధంబు.

చర్మముపైన కణితిరీగలుకుట్టినవిధంబున దురదగల్గి దద్దురుపుట్టి సూదులు గ్రుచ్చిన ి పోటుగల్గి వాంతి, జ్వరము, మంట గల్గినయెడల నయ్యది "ఉదర్ద"మనంబడును.

దేహంబున చల్లనిగాలి సోఁకుటచే కఫవాతములు ప్రకోపమునొంది పిత్తమును ్రకోపింపఁజేసి చర్మమునందును, శరీరమునకు లోపక్క రక్తమాంసాదులయందును ్యాపించి ఉదర్దరోగమందలి కొన్నిచిహ్నంబులను గానంబఱచును. ఇయ్యది శీతపిత్త నంబడును.

## ఆమ్లపిత్తము, వాతరక్తము-వీనివివరణము.

ఆమ్లపిత్తం త్రిధా ప్రోక్తం వాతేన శ్లేష్మణా తథా,
తృతీయం శ్లేష్మవాతాభ్యాం వాతరక్తం తథాఽష్టధా. 103
వాతాధిక్యేన పిత్తాచ్చ కఫాద్దోషత్రయేణ చ,

రక్తాధిక్యేన దోషాణాం ద్వంద్వేన త్రివిధస్స్మృతః. 104

అమ్లపిత్తము వాత, శ్లేష్మ, వాతశ్లేష్మములచే నుత్పన్నంబై త్రివిధంబు. వాతరక్త రోగము వాత, పిత్త, శ్లేష్మ, వాతశ్లేష్మ, వాతపిత్త, పిత్తశ్లేష్మ, సన్నిపాత, రక్తములచే నుత్పన్నంబై యెనిమిదివిధంబుల నుండును. పరస్పరవిరుద్ధంబులైన పదార్థములు, చెడిన యన్నము, పులుసువస్తువులు, తాపకరపదార్థములు-వీనిచే పిత్తము ప్రకోపించిన నయ్యది అమ్లపిత్త మనంబడును. అయ్యది అధోగతమనియు, ఊర్ధ్వగతమనియు ద్వివిధంబు. అధోగతామ్లపిత్తంబున దప్పి, తాపము, మూర్ఛ, భ్రమము, మనోవికారము, నోట నీరుగాఱుట, శరీరమున దద్దులుగల్గుట, అగ్నిమాంద్యము, చెమ్మటబట్టుట, శరీరము పచ్చగ నుండుట, మలము నానావిధంబులుగ పోవుట ఈచిహ్నములు చూపట్టును. ఊర్ధ్వగతామ్లపిత్తంబున పచ్చగను, పసుపుగను, నీలంబుగను, కృష్ణవర్ణంబుగను, రక్తముకలిసియు, మాంసపునీటివలెను, అమ్లరసముగను వాంతియగును. చేదును, పులుసుగల తేన్పులువచ్చును. కంఠము, హృదయము, కుక్షి వీనియందు తాపము, మంట, జ్వరము, అరోచకము, జ్వరము, బొబ్బలు, పొడలు ఈలక్షణంబులు గానఁబడును. అందు వాతజామ్లపిత్తమున వణఁకు, ప్రలాపము, మూర్ఛ, ఒడలు చిమచిమలాడుట, శరీరము కృశించుట, నొప్పిగలుగుట, చీఁకటిలోనున్నరీతిగ నుండుట, గగురుపాటు ఈలక్షణంబులు చూపట్టును. కఫజామ్లపిత్తంబున కఫము నుమియుట, శరీరముబరువై మొద్దుబాఱియుండుట, అరోచకము శరీరము చల్లనైయుండుట, కృశత్వము, వాంతి, కంఠమును కఫము నిరోధించుట, అగ్నిమాంద్యము, దురద, నిద్ర ఈచిహ్నంబులు చూపట్టును. శ్లేష్మవాతజామ్లపిత్తంబున శ్లేష్మ, వాతలక్షణంబులు చూపట్టును. ఏనుఁగులు, గుఱ్ఱములు, ఒంటెలు, మొదలగు వానిపై నెక్కిపోవువారికిని, విదాహకరపదార్థములను భుజించువారికిని, శరీరమందలి రక్తము దుష్టంబై ప్రకోపముజెందినవాతముతోఁగూడి పాదములకు దిగినయెడల వాతరక్తరోగ మనంబడును. వాతజవాతరక్తంబున శూల, అవయవములందు మంట, నొప్పి, వాపు, మిక్కిలి రూక్షంబైయుండుట, ఒకసమయమున వృద్ధి, ఒకసమయము క్షైణ్యము గానంబడుట, ధమనులయొక్కయు, వ్రేళ్లయొక్కయు సంధులు ముడుచుకొనుట. అధికముగా నొప్పిగల్గియుండుట, అవయవములను ఈడ్చిపట్టియుండుట, శీతలపదార్థములయం దనిష్టము, శీతలపదార్థములను భుజించుటచేత రోగము బలిష్ఠంబగుట, అవయవములు స్తంభించియుండుట, వణఁకు, స్పర్శజ్ఞానము నశించుట, ఈలక్షణంబులు చూపట్టును. పిత్తవాతరక్తంబున సంతాపము, మూర్ఛ, మోహము, చెమ్మట, దప్పి, హస్తములచే స్పృశించిన నోర్వలేమి, పోట్లు, రక్తవర్ణముగల వాపు, పుండు అగుట, వేఁడిగనుండుట, ఈచిహ్నంబులు చూపట్టును. కఫజవాతపిత్తరక్తంబున శరీరము మొద్దు

బాఱియుండుట, చేష్ట నశించుట, శరీరము స్నిగ్ధంబుగను, శీతలంబుగను నుండుట, కొంచెమునొప్పి ఈచిహ్నంబులు చూపట్టును. రక్తజవాతరక్తంబున అధికమైనవాపు, పోట్లు, వాపు ఎఱ్ఱగను, చిమచిమలాడుచుండుట, దురద ఈ మున్నగు చిహ్నంబులు గానంబడు. ద్విదోషజంబునందు ద్విదోషలక్షణంబులును, త్రిదోషజంబున త్రిదోష లక్షణంబులును చూపట్టును. ఈవాతరక్తరోగము పాదమూలంబునను, హస్తమూలంబు నను నాశ్రయించి ఎలుక విషంబువోలె మెల్లమెల్లగ శరీరమున వ్యాపించును. మోకాలి వఱకు వ్యాపించి పగిలి నీరుగాఱుచున్నను, ఉపద్రవంబులతోఁ గూడియుండినను, బల మాంసములు క్షీణించినను, అసాధ్యంబై యుండును. సంవత్సరమునకు పూర్వము జనించి నది యాప్యంబై యుండు. సంవత్సరమునకు లోఁబడి పూర్వము చెప్పఁబడిన స్ఫోటనాది చిహ్నంబులు లేకున్న నావాతరక్తరోగంబు సాధ్యంబగును.

## వాతరోగ వివరణము.

అశీతిర్వాతజా రోగాః కథ్యంతే మునిభాషితాః,
ఆక్షేపకో హనుస్తంభ ఊరుస్తంభశ్శిరోగ్రహః. 105
బాహ్యాయామోంతరాయామః పార్శ్వశూలం కటిగ్రహః,
దండాపతానకః ఖల్లీ జిహ్వాస్తంభస్తథార్దితమ్. 106
పక్షాఘాతః క్రోష్టుశీర్షమన్యాస్తంభశ్చ పంగుతా,
కలాయఖంజతాతూనీ ప్రతితూనీ చ ఖంజతా. 107
పాదహర్షో గృధ్రసీ చ విశ్వాచీ చాపబాహుకః,
అపతానో వ్రణాయామో వాతకంఠోఽపతంత్రకః. 108
అంగభేదోఽంగశోషశ్చ మిన్మిణత్వం చ గద్గదః,
ప్రత్యష్ఠీలాష్ఠీలికా చ వామనత్వం చ కుబ్జతా. 109
అంగపీడాంగశూలశ్చ సంకోచః స్తంభరూక్షతా,
అంగభంగోఽంగవిభ్రంశో విడ్గ్రహో బద్ధవిట్కతా. 110
మూకత్వమతిజృంభా స్యాదత్యుద్గారోఽంత్రకూజనం,
వాతప్రవృత్తిస్స్ఫురణం సిరాణాం పూరణం తథా. 111
కంపః కార్శ్యం శ్యావతా చ ప్రలాపః క్షిప్రమూత్రతా,
నిద్రానాశస్స్వేదనాశో దుర్బలత్వం బలక్షయః. 112
అతిప్రవృత్తిశ్శుక్రస్య కార్శ్యం నాశశ్చ రేతసః,
అనవస్థితచిత్తత్వం కాఠిన్యం విరసాస్యతా. 113

కషాయవక్త్రతాధ్మానం ప్రత్యాధ్మానం చ శీతతా,
రోమహర్షశ్చ భీరుత్వం తోదః కండూ రసాజ్ఞతా. 114
శబ్దాజ్ఞతా ప్రసుప్తిశ్చ గంధాజ్ఞత్వం దృశః క్షయః,

వాతరోగము-ఆక్షేపక, హనుస్తంభాది భేదంబులచే నెనుబదివిధంబు లగును. వాని వివరణము ఈ క్రింద క్రమమున చెప్పఁబడును. వాతము కఫపిత్తములతోఁగూడిగాని, కేవలవాతముగాని, ప్రకుపితంబై దేహమందలి సిరలను వ్యాపించి శరీరమును మాటి మాటికి కంపింపఁజేసిన నారోగము ఆక్షేపక మనంబడును. నాలుకను మిక్కుటముగ గీచుట, ద్రవములేని కఠినపదార్థములను భుజించుట ఈకారణంబులచే దవడల క్రింది ప్రక్క వాతముచేరి దౌడకీళ్లను సడలింపఁజేసి నోరు తెఱచిన మూసికొనఁజాలకను మూసికొనిన దెఱవఁజాలకుండునటులను జేయును. ఇందు మాటాడుట, నమలుట చాల కష్టముగా నుండును. ఇయ్యది హనుగ్రహ మనంబడును. వాతము ప్రకుపితంబై ఊరువు (తొడ)ల నాశ్రయించి తొడలను స్తంభింపఁజేసి కదల శక్యముగాకుండఁ జేసిన నారోగము ఊరుస్తంభ మనంబడును. వాతము ప్రకుపితంబై రక్తముతోఁగూడి శిరంబునందలి సిరల నాశ్రయించి శిరంబును వేదనాయుక్తంబుగను, జ్ఞానశూన్యంబుగను జేసిన నారోగము శిరోగ్రహ మనంబడును. వాతము ప్రకుపితంబై శరీరమునకు వెలి ప్రక్కనుండు వీపును, మెడను ఆశ్రయించిన స్నాయుసిరాకండరంబుల నాశ్రయించి శోషింపఁజేసి వెలిప్రక్కకు శరీరమును వంచిన నావాతము బాహ్యాయామ మనంబడును. వాతము ప్రకుపితంబై వ్రేళ్లు, చీలమండ, జఠరము, హృదయము, ఱొమ్ము, కంఠము వీని నాశ్రయించి వేగముతోఁగూడి శరీరమందలి స్నాయు, సిరా, కండరంబులం జెఱచి శరీర మధ్యభాగమును ధనుస్సువలె లోప్రక్కకు వంచును. ఇందు నేత్రములు స్తంభించి యుండుట, పార్శ్వములయందు నొప్పి, నురుఁగు వాంతియగుట ఈలక్షణంబులు చూపట్టును. ఇయ్యది అంతరాయామ మనంబడును. కోష్ఠగతంబగు వాతము ప్రకుపితంబై పార్శ్వములయందు శూలను గలుగఁజేసిన నయ్యది పార్శ్వశూలమనంబడును. వాతము ప్రకుపితంబై కటి (నడుము) స్థానము నాశ్రయించి స్తంభింపఁజేసిన నారోగము కటిగ్రహమనంబడును. ప్రకుపితంబైన వాతము కఫముతోఁగూడి సిరలయందు వ్యాపించి దేహమును దండమువలె స్తంభింపఁజేసిన నయ్యది దండాపతానక మనంబడును. వాతము ప్రకుపితంబై మోకాళ్లు, తొడలు మొదలగువానియందు శూలమును గల్గించిన నయ్యది ఖల్లీవాత మనంబడును. వాతము ప్రకుపితంబై వాక్కుప్రవహించు సిరల నాశ్రయించి నాలుకను కదలకుండఁ జేయును. ఇందు అన్నము భుజించుట, నీరుద్రావుట కష్టముగా నుండును. ఇయ్యది జిహ్వాస్తంభ మనంబడును. గట్టిగ మాటాడుట, కఠినమగుపదార్థము

లను నమలుట, అధికముగ నవ్వుట, భారముమోయుట, నిమ్నోన్నతస్థలంబుల శయనించుట ఈకారణంబుచే శిరస్సు, ముక్కు, పెదవులు, గడ్డము, నుదుఱు, నేత్రమధ్యము వీనియందలి వాతము ప్రకుపితంబై ముఖమునందు నొప్పిగలిగించును. దానంజేసి నోరు సగమువక్రంబగును. కంఠము వంకరగును. తలవణఁకును, నోటమాటరాదు. కన్నులు, కనుబొమలు మొదలగునవికూడ వంకరగును. ఇయ్యది అర్దితవాత మనంబడును. వాతము ప్రకుపితంబై అర్థశరీరంబున వ్యాపించి యాభాగమందలి సిరాస్నాయువులను శోషింపఁజేసి సంధులను శిథిలముజేసి స్పర్శజ్ఞానమును నశింపఁజేసి చలనాది వ్యాపారములందు సామర్థ్యములేనట్లు జేయును. ఇయ్యది కుడి, ఎడమప్రక్కలలో నెందైన సంభవింపవచ్చును. ఇయ్యది పక్షాఘాత మనంబడును. వాతరక్తవ్యాధివలన మోకాలునందు నక్కతలవలె వాపు జనించి మిగుల వేదన గలుగఁజేయుచుండిన నయ్యది క్రోష్టుకశీర్ష మనంబడును. వాతము ప్రకుపితంబై కఫముతోఁగూడి శిరమునకు వెనుకనున్న పెద్దనరమును స్తంభింపఁజేసిన నయ్యది మన్యాస్తంభమనంబడును. కటిప్రదేశము నాశ్రయించువాతము ప్రకుపితంబై తొడల రెంటియందుండు కండరముల వ్యాపించి రెండుకాళ్లను కుంటిగఁజేసిన నయ్యది పంగువాత మనంబడును. నడచుటకు ప్రారంభించునపుడు వణఁకుట, కుంటుచు నడచుట, సంధులన్నియు శిథిలంబులగుట, ఈలక్షణంబులుండిన నయ్యది కలాయఖంజమనంబడును. మలమూత్రాశయములయందు వేదన జనించి గుదోపస్థంబులను భేదించునటుల నధోభాగంబున వ్యాపించినయెడల నయ్యది తూనీవాత మనంబడును. గుదోపస్థంబులందు వేదనజనించి వాతవేగముచే నూర్ధ్వముగ సంచరించి పక్వాశయంబునం జేరినయెడ నయ్యది ప్రతితూనీవాత మనంబడును. కటిప్రదేశము నాశ్రయించియందు వాతము ప్రకుపితంబై ఒకతొడయందలి కండరములను వ్యాపించి యొక్కకాలును కుంటిగఁ జేసిన నయ్యది ఖంజవాత మనంబడును. చిరకాలము కూర్చుండి లేచి కాళ్లను క్రిందబెట్టునపుడు కాళ్లయందు సూదులు గ్రుచ్చినటుల వేదనగల్గి స్పర్శజ్ఞానము లేకున్నయెడ నయ్యది పాదహర్ష మనంబడును. పిఱుఁదులకుపైన నడుము, పృష్ఠభాగము, తొడలు, మోకాళ్లు, పిక్కలు, పాదములు వీనియందు వాతము ప్రకుపితంబై వరుసగ స్తంభమును, నొప్పిని, పోటును గల్గించి కంపము నొందించినయెడల నయ్యది గృధ్రసీవాత మనంబడును. భుజములయొక్క పైభాగము మొదలుచేసి మోచెయ్యివఱకు వెలిప్రక్కను వ్యాపించి వ్రేళ్లకు సంకోచవికాసములను గలుగజేయు కండరములను వాతము దుష్టంబై హస్తములను ముడుచుట, చాపుట మొదలగు వ్యాపారములను లేకుండఁజేసిన నయ్యది విశ్వాచీవాత మనంబడును. భుజశిరస్సులయందలి వాతము ప్రకుపితంబై బాహుమూలములందలి సిరలను ముడుచునట్లుచేసిన నయ్యది అపబాహుకవాత మనంబడును.

వాతము ప్రకుపితంబై హృదయమునఁజేరి దృష్టిని స్తంభింపఁజేసి జ్ఞానమును నశింపఁజేసి కంఠమున ధ్వనిని గలుగఁజేయును. అట్టివాతము హృదయస్థానమును వదలినపుడు స్వస్థత నొందును. మరల నావాతము హృదయము నాశ్రయించినపుడు మూర్ఛనొందును. ఇది అపతానకవాత మనంబడును. ప్రకుపితంబగువాతము వ్రణము నాశ్రయించి వేదనను గలుగజేసిన నయ్యది వ్రణాయామవాత మనఁబడును. విషమస్థలంబుల నడచుటచేనైనను, శ్రమచేనైనను, వాతము ప్రకుపితంబై కాలిమడమ నాశ్రయించి బాధను కల్గజేయును. ఇయ్యది వాతకంటక మనంబడును. వాతము ప్రకోపముజెంది హృదయస్థానమున నిలచి శిరస్సునందును కణతలయందును, నొప్పిని గలిగించి శరీరమందలి సకలావయవములను ధనుస్సువలె నొంచును. అందు కంపము, మూర్ఛగలుగును. అట్టివాఁడు నిశ్చలంబులైన నేత్రములు గలవాఁడై నిట్టూర్పును కష్టముచే నిగిడించును. ఇయ్యది అపతంత్రకవాత మనంబడును. వాతము శరీరమంతటను వేదనలను గలుగఁజేసిన నయ్యది అంగభేదవాత మనఁబడును. వాతము ప్రకుపితంబై శరీరమందలి ధాతువులను శోషింపఁజేసిన నయ్యది అంగశోషవాత మనంబడును. ప్రకుపితంబగు వాతము కఫముతోఁగూడి శబ్దవాహినులగు ధమనుల నడ్డగించిన మనుజులు మూగవారును, నత్తివారును, డగ్గుత్తికతో మాటాడు వారును నగుదురు. అయ్యవి క్రమముగా మూకవాతము, మిమ్మిణవాతము, గద్గదవాతము అనంబడును. నాభికిక్రింద కమసాలివాని యినుపడాగలవలె కఠినంబును, ఉన్నతంబును, విస్తీర్ణంబును, వర్తులంబునగు గ్రంథిజనించి చలించుచుగాని నిశ్చలంబుగగాని నున్న నయ్యది వాతప్రకోపముచేజనించిన అష్ఠీల యనంబడును. ఈగ్రంథియే జఠరమునందు అడ్డముగ వ్యాపించి వాతమూత్ర పురీషముల నడ్డగించియున్నయెడ నయ్యది ప్రత్యష్ఠీల వాత మనంబడును. వాతప్రకోపముచే మనుజుఁడు పొట్టివాఁడైన నయ్యది వామనవాత మనంబడును. వాతప్రకోపము శరీరము వెనుక భాగమున గూను గలిగిన నయ్యది కుబ్జవాత మనంబడును. ఇట్లు వాతప్రకోపముచే శరీరమున పీడగలిగిన అంగపీడయనియు, శూలము గలిగిన అంగశూల మనియు, శరీరమందలి అవయవము సంకోచమునొందిన సంకోచవాత మనియు, అవయవము స్తంభించి చేష్టదక్కియున్న స్తంభవాతమనియు, శరీరమందు స్నేహము నశించి రూక్షంబైయున్న రూక్షవాతమనియు, అవయవములందు పోట్లుగలిగిన అంగభంగవాతమనియు, అవయవంబులు చేతనారహితంబులైన అంగవిభ్రంశవాత మనియు, వాతము ప్రకోపము నొంది పక్వాశయమందు మలమును బంధించిన నయ్యది విడ్గ్రహవాత మనియు, వాతప్రకోపము మలము గట్టిపడి ముక్కినను వెడలకుండిన నయ్యది బద్ధవిట్కవాత మనియు, వాతప్రకోపముచే నేరోగంబునందైన ఆవలింతలు విశేషముగా వచ్చుచుండిన నయ్యది అతిజృంభవాతమనియు, ఆమాశయమందు వాతము ప్రకుపితంబై

శేషముగా త్రేనుపులను గలిగించిన నయ్యది అత్యుద్గారవాత మనియు, వాతప్రకోప
చే ప్రేవులు అధికముగా ధ్వనిచేయుచుండిన నయ్యది అంత్రకూజనవాతమనియు,
తప్రకోపముచే నపానవాతము అధికముగా పోవుచుండిన నయ్యది వాతప్రవృత్తి
నియు, అవయవములను అదరునట్లుజేసిన నయ్యది స్ఫురణవాతమనియు, వాతము సిర
ఉబ్బునట్లుచేసిన నయ్యది సిరాపూరణవాతమనియు, శరీరమునకు కంపమును గల్గిం
నయ్యది కంపవాతమనియు, వాతప్రకోపముచే శరీరము చిక్కిపోయిన నయ్యది
ర్శ్యవాతమనియు, శరీరము నల్లబాఱిన నయ్యది శ్యావవాతమనియు, వాతప్రకోప
చే సన్నిపాతములందు జ్ఞానశూన్యతచే విరుద్ధముగా మాటాడుచుండిన నయ్యది
లాపవాతమనియు, మూత్రము అధికముగాను, పలుమాఱులును పోవుచుండిన నయ్యది
ప్రమూత్రవాత మనియు, నిద్రను నశింపఁజేసిన నయ్యది నిద్రానాశవాతమనియు,
ష్టటను నశింపఁజేసిన నయ్యది స్వేదనాశవాతమనియు, శరీరమందలి బలమును నశింపఁ
న నయ్యది దౌర్బల్యోత్పాదకవాతమనియు, శక్తిని నశింపఁజేసిన నయ్యది బలక్షయ
తమనియు, శుక్రమును విశేషముగా ప్రవర్తింపఁజేసిన 'నయ్యది శుక్రాతిప్రవర్తకవాత
యు, శుక్రధాతువు క్షీణించిన నయ్యది శుక్రకార్శ్యవాతమనియు, శుక్రధాతువు
ంచిన నయ్యది శుక్రక్షయవాతమనియు, మనస్సునకు స్థైర్యములేమి అనవస్థితచిత్తవాత
యు, శరీరము కఠినంబైన కాఠిన్యవాతమనియు, జిహ్వకు రుచిలేకుండిన విరసాస్య
మనియు, నోరు కషాయ(ఒగరు)రసముతోఁ గూడియుండిన నయ్యది కషాయవక్త్రతా
తమనియు, పక్వాశయంబున గుడగుడయను శబ్దంబును మిగుల తీవ్రమైననొప్పియు
గి గాలిచే నిండియున్న తోలుతిత్తివలె వాతపూరితమైయున్న ఆధ్మానవాతమనియు,
తము కఫముతోఁగూడ ఆమాశయంబున ఆటోపాదిలక్షణంబులను గలుగఁజేయు
ండిన నయ్యది ప్రత్యాధ్మాతవాతమనియు, శరీరము శీతలంబైయున్న శీతవాతమనియు,
ద్రుకలకు గగుర్పాటుగలిగిన రోమహర్ష వాతమనియు, మనంబునకు భయము గలి
భీరువాతమనియు, అవయవంబు లాగుచుండిన నయ్యది తోదవాతమనియు, అవ
వములందు దురద విశేషముగాఁగలిగిన కండూవాతమనియు, జిహ్వకు రసజ్ఞానము
ంచిన రసాజ్ఞతయనియు, మాట వినిపింపకపోయినయెడల నయ్యది శబ్దాజ్ఞతయనియు,
ర్శజ్ఞానము నశించిన నయ్యది ప్రసుప్తవాతమనియు, వాసన తెలియరాకుండిన నయ్యది
ఘ్రాజ్ఞతయనియు, వాతప్రకోపముచే దృష్టి (చూపు) నశించిన నయ్యది దృక్క్షయ
యు, చెప్పఁబడును. ఈ ఎనుబదిరోగములు ప్రకోపమునొందినవాతముచేఁ బుట్టు
గములు.

## పిత్తరోగ వివరణము.

అథ పిత్తభవా రోగా శ్చత్వారింశదిహోదితాః. 115
ధూమోద్గారో విదాహస్స్యాదుష్ణాంగత్వం మతిభ్రమః,
కాంతిహానిః కంఠశోషో ముఖశోషోఽల్పశుక్రతా. 116
తిక్తాస్యతామ్లవక్త్రత్వం స్వేదస్రావోఽంగపాకతా,
క్లమో హరితవర్ణత్వమతృప్తిః పీతకాయతా. 117
రక్తస్రావోఽంగదరణం లోహగంధాస్యతా తథా,
దౌర్గంధ్యం పీతమూత్రత్వమరతిః పీతవిట్కతా. 118
పీతావలోకనం పీతనేత్రతా పీతదంతతా,
శీతేచ్ఛా పీతనఖతా తేజో ద్వేషోఽల్పనిద్రతా. 119
కోపశ్చ గాత్రసాదశ్చ భిన్నవిట్కత్వమంధతా,
ఉష్ణోచ్ఛ్వాసత్వముష్ణత్వం మూత్రస్య చ మలస్య చ. 120
తమసోఽదర్శనం పీతమండలానాం చ దర్శనం,
నిస్సరత్వం చ పిత్తస్య చత్వారింశద్రుజస్స్మృతాః. 121

ప్రకోపమునొందిన పిత్తముచే ధూమోద్గారము మొదలగు నలుబది రోగములు జనించును. పొగతోడ త్రేనుపులు వచ్చిన ధూమోద్గార మనియు, శరీరమునకు తాపము గలిగిన విదాహ మనియు, శరీరమంతయు వేడిగనున్న నది ఉష్ణాంగపిత్తమనియు, మతిభ్రమము గలిగిన మతిభ్రమపిత్త మనియు, శరీరమందలి కాంతి దరిగిన నయ్యది కాంతిహీనపిత్త మనియు, కంఠము ఎండిపోవుచుండిన నయ్యది కంఠశోషమనియు, ముఖము శోషించిన ముఖశోష మనియు, శుక్రధాతువు అల్పమైన అల్పశుక్రపిత్తమనియు, నోరు చేదుగానుండిన తిక్తాస్య మనియు, నోరు పుల్లగానుండిన అమ్లవక్త్రత యనియు, చెమ్మట అధికముగా స్రవించుచుండిన స్వేదస్రావ మనియు, శరీరము పగిలినయెడల అంగదరణ మనియు, పాచకపిత్తముచే శరీరము పాకము నొందిన అంగపాక మనియు, శరీరము వాడిపోయిన క్లమపిత్త మనియు, శరీరము పచ్చగానుండిన హరితపిత్త మనియు, భోజనమునందు తృప్తిలేకుండిన అతృప్తియనియు, శరీరము పీతవర్ణము గలిగియుండిన పీతకాయపిత్త మనియు, శరీరమందలి రక్తము ఊర్ధ్వాధోముఖములగుండ అధికముగా స్రవించుచుండిన రక్తస్రావ పిత్తమనియు, శరీరమందలి చర్మముపగిలినయెడల అంగదరణ మనియు, ముఖము ఇనుమువాసనవేయుచుండిన లోహగంధాస్యపిత్త మనియు, శరీరము నందు దుర్వాసనగలిగిన దౌర్గంధ్యపిత్త మనియు, మూత్రము పచ్చగవెడలుచుండిన పీతమూత్రపిత్తమనియు, పదార్థములయం దిచ్ఛలేమి అరతిపిత్త మనియు, నేత్రములు

పచ్చగానుండిన పీతనేత్రపిత్త మనియు, మలము పచ్చగానుండిన పీతవిట్కపిత్త మనియు, చూచునట్టిపదార్థములు పచ్చగా కనుపించిన నయ్యది పీతావలోకపిత్తమనియు, దంతములు పచ్చగానుండిన పీతదంత మనియు, చల్లనిపదార్థములయం దిచ్చవొడమిన శీతేచ్ఛ యనియు, గోళ్లు పచ్చగనుండిన పీతనఖపిత్త మనియు, ఉష్ణపదార్థములయందు ఇచ్చలేమి తేజోద్వేష మనియు, నిద్ర అల్పమైన అల్పనిద్రయనియు, కోపము అధికమైన కోపపిత్త మనియు, అవయవములు కృశించిన గాత్రసాదమనియు, మలము విశేషముగాపోవుచుండిన భిన్నవిట్కత యనియు, దృష్టినశించిన అంధత యనియు నిట్టూరుపు వెచ్చగనున్న ఉష్ణోచ్ఛ్వాసమనియు, మూత్రము ఉష్ణముగనున్న ఉష్ణమూత్రపిత్త మనియు, మలము ఉష్ణముగనున్న ఉష్ణమల మనియు, కండ్లకు చీకటికమ్మిన తమోదర్శనమనియు, శరీరమునందు పచ్చనిమచ్చలుగలిగిన పీతమండలపిత్తమనియు, పిత్తము ఊర్ధ్వముఖముగాఁగాని, అధోముఖముగాఁగాని ప్రకోపమునొందిన నిస్సరపిత్త మనంబడును. ఇయ్యవి పిత్తజరోగంబులు.

### కఫరోగవివరణము.

కఫస్య వింశతిః ప్రోక్తా రోగాస్తంద్రాతినిద్రతా,
గౌరవం ముఖమాధుర్యం ముఖలేపః ప్రసేకతా. 122
శ్వేతావలోకనం శ్వేతవిట్కత్వం శ్వేతమూత్రతా,
శ్వేతాంగవర్ణతా శైత్యముష్ణేచ్ఛా తిక్తకామితా. 123
మలాధిక్యం చ శుక్రస్య బాహుళ్యం బహుమూత్రతా,
ఆలస్యం మందబుద్ధిత్వం తృప్తిర్ఘుర్ఘురవాక్యతా. 124
అచైతన్యం చ గదితా వింశతిః శ్లేష్మజా గదాః,

ప్రకోపమునొంది శ్లేష్మముచే నిరువది రోగములు జనించును. కఫప్రకోపముచే నేత్రములయందు మసిగలిగిన నయ్యది తంద్ర యనియు, కఫప్రకోపముచే నిద్ర అధికముగా సంభవించిన అతినిద్ర యనియు, కఫప్రకోపముచే శరీరము బరువుగానుండిన గౌరవ మనియు, కఫప్రకోపముచే ముఖమునందు తీయఁదనముగలిగిన నయ్యది ముఖమాధుర్య మనియు, కఫాధిక్యముచే ముఖము స్రవించుచుండిన నయ్యది ముఖప్రసేకమనియు, నాలుక జిగురుగానుండిన నయ్యది ముఖలేప మనియు, పదార్థములు తెల్లగానుండిన శ్వేతావలోకనం బనియు, మలము తెల్లగనుండిన శ్వేతవిట్కత్వ మనియు, మూత్రము తెల్లగానుండిన నయ్యది శ్వేతమూత్రత్వ మనియు, శరీరమంతయు తెల్లఁబాఱిన శ్వేతవర్ణాంగత్వ మనియు, ఉష్ణమునం దిచ్ఛగలిగిన ఉష్ణేచ్ఛ యనియు, చేదుపదార్థములయం దిచ్ఛబుట్టిన తిక్తకామిత్వ మనియు, మలము అధికముగాఁ బోవు

చుండిన "మలాధిక్యత" యనియు, శుక్రము అధికముగా స్రవించుచుండిన "శుక్రాధిక్యత" యనియు, మూత్రము అధికముగా స్రవించుచుండిన "బహుమూత్రత్వ" మనియు, కార్యములందు మాంద్యముగలిగిన "ఆలస్య" మనియు, బుద్ధికి మాంద్యముగలిగిన "బుద్ధిమాంద్య" మనియు, భోజనముచేయకుండినను భోజనముచేసిన యట్లుండినను "తృప్తి" యనియు, మాటాడునపుడు ఘుర్ఘురధ్వని గల్గిన "ఘుర్ఘురవాక్యత్వ" మనియు, చేష్టనశించిన "చైతన్యనాశ" మనియు చెప్పఁబడును. ఇయ్యవి ఇరువదియు శ్లేష్మప్రకోపముచేఁ గలుగువికారములు.

## రక్తవికారరోగ వివరణము.

రక్తస్య చ దశ ప్రోక్తా వ్యాధయస్తేషు గౌరవమ్. 125
రక్తమండలతా రక్తనేత్రత్వం రక్తమూత్రతా,
రక్తష్ఠీవనతా రక్తపిటికానాం చ దర్శనమ్. 126
ఔష్ణ్యం చ పూతిగంధత్వం పీడాపాకశ్చ జాయతే,

ప్రకోపముజెందినరక్తము పది వికారములు జనించును. రక్తప్రకోపముచే శరీరము బరువుగానుండిన గౌరవరక్తమనియు, శరీరంబున ఎఱ్ఱనిమండలం (మచ్చలు) బులుగల్గిన రక్తమండలత్వమనియు, ఎఱ్ఱబారిన రక్తనేత్రత్వమనియు, మూత్రము ఎఱ్ఱగానుండిన రక్తమూత్రత్వమనియు, రక్తప్రకోపముచే రక్తము వాంతియగుచుండిన రక్తనిష్ఠీవనత్వమనియు, శరీరంబున ఎఱ్ఱనిబొబ్బలు జనించిన రక్తపిటికతయనియు, శరీరమునందు ఔష్ణ్య మధికముగా నుండిన ఔష్ణ్యమనియు, శరీరము దుర్గంధముగానుండిన పూతిగంధత్వమనియు, రక్తప్రకోపముచే నోరుపొక్కి పాకము జెందిన రక్తపాకమనియు, శరీరంబున పీడజనించిన రక్తపీడ యనియు చెప్పఁబడును. ఇందు వాతరోగము మొదలుకొని ఆయాదోషంబులచే నాయావికారములు జనించునని చెప్పఁబడియుండెను. అట్టి వికారంబులలోఁ గొన్ని స్వతంత్రరోగంబులైనను, కొన్ని తత్తద్రోగంబులకు లక్షణంబులుగానున్నవి. దానంజేసి ఏదోషప్రకోపమువలన నేవికారంబులు పుట్టునో చెప్పియుండుటచే కార్యమగులక్షణంబుచే కారణమగు దోషములయొక్క ప్రకోపంబును తెలిసికొనవలయునని తాత్పర్యము.

## ముఖరోగాంతర్గతౌష్ఠరోగవివరణము.

చతుస్సప్తతిసంఖ్యాకా ముఖరోగాః ప్రకీర్తితాః. 127
తేష్వోష్ఠరోగా గదితా ఏకాదశమితా బుధైః,
వాతపిత్తకఫైస్త్రేధా త్రిదోషైరసృజా తథా. 128
క్షతాన్మాంసార్బుదం చైవ ఖండోష్ఠం చ జలార్బుదం,

మేదోర్బుదం చార్బుదం చ రోగా ఏకాదశౌష్ఠజాః. 129

ముఖరోగంబులు డెబ్బదినాలుగు విధంబులు. అందు ఓష్ఠ (పెదవులు) గతరోగం
లు వాతజ, పిత్తజ, శ్లేష్మజ, సన్నిపాతజ, రక్తజ, క్షతజ, మాంసార్బుద, ఖండోష్ఠ,
ార్బుద, మేదోర్బుద, అర్బుద, భేదంబులచే పదునొక్కవిధంబు. వాతప్రకోపంబుచే
దవులు మిగుల కర్కశంబులై, పరుషంబులై స్తంభించి, వాతవేదనగల్గియుండిన
తముచే జనించిన ఓష్ఠవ్యాధియని తెలియవలయును. పిత్తప్రకోపముచేత పెదవుల
ందు పిత్తజనితవేదనతోఁగూడిన బొబ్బలు జనించి మంటతోగూడియుండి పీతవర్ణ
ాా నుండిన పిత్తముచే జనించిన ఓష్ఠరోగమని తెలియందగును. కఫప్రకోపముచే
దవులకు సమానమైన వర్ణముగల్గిన బొబ్బలతోగూడియుండి పెదవుల పిచ్ఛిలంబుగను,
లంబుగను, భారముగను నున్నయెడ నయ్యది శ్లేష్మరోగము అని తెలియందగును.
దవులు ఒకపుడు నల్లగను, ఒకపుడు పచ్చగను, ఒకపుడు తెల్లగనుండి యనేకవ్రణము
ై వ్యాప్తంబైయున్న నయ్యది సన్నిపాతముచే జనించిన ఓష్ఠరోగమని తెలియందగును.
ప్రకోపంబుచే పెదవులు ఖర్జూరపుపండ్లతో సమానమైనపుండ్లుగలిగి రక్తవర్ణముగలిగి
క్తమును స్రవించుచుండిన నయ్యది రక్తమువలన జనించిన ఓష్ఠరోగమని తెలియందగును.
ఘాతముచే పెదవులు రక్తమునకు సమానమైన వర్ణముగలిగి వ్రయ్యలగుచు గ్రంథిరూ
బులైనదురదతోగూడి యుండును. ఇయ్యది అభిఘాతముచే గల్గిన(క్షతజ) ఓష్ఠరోగ
తెలియందగును. మాంసముచే పెదవులు దుష్టంబులై మిగుల భారముగల్గియుండి స్థూ
బులై మాంసపుముద్దలవలె నున్నతంబులైయుండును. మఱియు నోటికిరుప్రక్కలనుండు
ములయందు క్రిములుపుట్టును. ఇది మాంసార్బుదమనంబడును. పెదవులు పగిలి రక్త
ు స్రవించినయెడల నయ్యది ఖండోష్ఠమనంబడును. పెదవులు పొడుగై లావుగ
డి నీళ్లుకాఱుచుండిన నయ్యది జలార్బుదమనంబడును. మేదోదోషంబుచే పెదవులు
ిననెయ్యినంటి వర్ణముగలిగి దురదతోఁగూడియుండి గురుత్వముగల్గి స్ఫటికమువలె
చ్ఛంబైన చీముగాఱుచుండిన నయ్యది మేదోజార్బుద మనంబడును. మఱియు నిందు
ించిన వ్రణములు మానవు. ఒకవేళ మానినను, మార్దవములేక కఠినముగనుండును.
తాదిదోషములచే నెద్దానిచేనైన పెదవులయందు గ్రంథులు జనించిన నయ్యది
్బుదమనంబడును.

## దంతరోగవివరణము.

దంతరోగా దశాఖ్యాతా దాలనః కృమిదంతకః,
దంతహర్షః కరాళశ్చ దంతచాలశ్చ శర్కరా. 130
అధిదంతశ్చాప్యవదంతో దంతభేదః కపాలికా,

ముఖరోగాంతర్గత దంతరోగములు దాలనము, కృమిదంతకము, దంతహర్షము, కరాళము, దంతచాలనము, శర్కర, అధిదంతము, శ్యావదంతము, దంతభేదము, కపాలిక, అని పదివిధంబులు. దంతములయందు పగలదీయునటుల బాధజనించిన నయ్యది దాలనమనంబడును. ఇయ్యది వాతప్రకోపముచే జనించును. నల్లని రంధ్రములుగలిగి దంతమూలములయందు వాపుజనించి చలించుచు కారణములేకయే వేదనగల్గి పూయాదులను స్రవించుచుండిన కృమిదంతకము అనంబడును. ఇది వాతజన్యము, శీతలపదార్థములను, రూక్షపదార్థములను, గాలి, పులుసు, వీనియొక్క స్పర్శమును దంతములు సహింపలేకుండిన నయ్యది దంతహర్ష మనంబడును. ఇయ్యది వాతపిత్త ప్రకోపముచే జనించును. వాతము ప్రకోపమునొంది దంతముల నాశ్రయించి వికృతాకారములఁ జేయును. ఇది కరాళమనంబడును. ఇయ్యది అసాధ్యము. వాతప్రకోపముచే దంతములు కదలుచు వేదనాసహితంబులై యుండిన నయ్యది దంతచాలనమనంబడును. దంతములయందలి మలము పిత్తవాతములచే శోషింపఁబడి కఠినంబై సున్నపురాయివలె గరగరలాడుచుండిన శర్కర యనంబడును. వాతప్రకోపముచే తీవ్రమైన వేదనతోఁగూడిన ఒక దంతము అధికముగపుట్టిన నయ్యది అధిదంత మనంబడును. రక్తముతోఁగూడిన పిత్తముచే దంతము దగ్ధంబై శ్యామవర్ణంబుగఁగాని, నీలవర్ణంబుగఁగాని యుండిన శ్యావదంతమనంబడును. కఫవాతప్రకోపంబుచే నోరువక్రంబై దంతములుండిన నయ్యది దంతభేదమనంబడును. పూర్వము చెప్పఁబడిన దంతశర్కర పెంకువలె పగిలి యూడిపోవుచుండిన నయ్యది కపాలిక యనంబడును.

### దంతమూలరోగవివరణము.

తథా త్రయోదశమితా దంతమూలామయాః స్మృతాః. 131
శీతాదోపకుశౌ ద్వౌ తు దంతవిద్రధిపుప్పుటౌ,
అధిమాంసో విదర్భశ్చ మహాసౌషిరసౌషిరౌ. 132
తేష్వేవ గతయః పంచ వాతాత్పిత్తాత్కఫాదపి,
సన్నిపాతాద్గతిశ్చాన్యా రక్తనాడీ చ పంచమీ. 133

ముఖరోగాంతర్గత దంతమూలరోగంబులు శీతాదము, ఉపకుశము, దంతవిద్రధి, పుప్పుటము, అధిమాంసము, వైదర్భము, మహాసౌషిరము, సౌషిరము, వాతనాడి, పిత్తనాడి, శ్లేష్మనాడి, సన్నిపాతనాడి, రక్తనాడి అని పదిమూఁడు విధంబులు. దంతములయొక్క చిగుళ్లనుండి అభిఘాతము మొదలగు కారణంబులచే రక్తము స్రవించును. పిమ్మట నాచిగుళ్లు దుర్గంధముతోఁగూడి యున్నసీటెని స్రవించుచు మెత్తనై శిథిలంబులై యొకటితోనొక్కటి కలసి వుండగును. ఇది కఫరక్తప్రకోపంబుచే జనించిన శీతాదము

బడును. దంతముల కాధారంబైన మాంసమునందు మంటయు, పుండును గలిగి, ములు కదలుచుండిన నయ్యాది ఉపకుశ మనంబడును. దంతముల కాశ్రయంబైన సంబునందు మలముతోడను, పూయముతోడను, బైటను, లోపలను వాపుగలిగి, ల భారమై పగిలి మంటయు, నొప్పియుంగల్గి చీమును, నెత్తురును స్రవించుచుం . ఇది దంతవిద్రధి యనంబడును. దంతములలో రెంటియొక్కగాని, మూటి క్కగాని, మాంసమునందు వాపుజనించినయెడల నయ్యాది కఫరక్తములచే జనించిన ట మనంబడును. తాలువులయందు కడదంతమునందు వాపుజనించి వేదనా రంబై జొల్లుకాఱుచుండిన నయ్యాది అధిమాంస మనంబడును. దంతధావనము చేయం ప గలిగిన యభిఘాతముచే దంతమాంసములందు వాపుజనించి దంతములు కదలు యెడ నయ్యాది అభిఘాతముచే జనించిన వైదర్భమనంబడును. దంతములయొక్క స్థ కదలుచు, తాలువులు పగిలినయెడల నయ్యాది సన్నిపాతముచే జనించిన మహా ర మనంబడును. 'ఇయ్యాది అసాధ్యము. ఈవ్యాధి గలవాఁడు ఏడుదినములలో నొందును. దంతమూలములయందు వాపుగల్గి నొప్పితోగూడియుండి జొల్లుగాఱు ంన యెడల నయ్యాది సౌషిర మనంబడును. ఇయ్యాది కఫరక్తప్రకోపముచే జనిం . దంతమూలములయందు జనించు నాడీరోగంబులు నాడీవ్రణంబువలె వాత, కఫ, సన్నిపాత, రక్తములచే నుత్పన్నంబై యాయాదోషలక్షణంబులు గలిగి ండును.

### జిహ్వారోగము, తాలురోగము - వీనివివరణము.

తథా జిహ్వాసు యాష్షట్స్యుర్వాతపిత్తకఫైస్త్రిధా,
అలసశ్చ చతుర్థస్స్యాదధిజిహ్వాశ్చాపి పంచమః. 134
షష్ఠశ్చైవోపజిహ్వాస్స్యుస్తథాష్టౌ తాలుజా గదాః,
అర్బుదం తాలుపిటికా కచ్ఛపీ తాలుసంహతిః. 135
గళశుండీ తాలుశోషస్తాలుపాకశ్చ పుప్పుటః,

ముఖరోగాంతర్గత జిహ్వారోగములు వాత, పిత్త, శ్లేష్మజంబులనియు, అలస వ, అధిజిహ్వా, ఉపజిహ్వాములనియు నాఱువిధంబులు. తాలురోగంబులు అర్బు , తాలుపిటిక, కచ్ఛపి, తాలుసంహతి, గళశుండి, తాలుశోషము, తాలుపాకము, ప్పుటము లన నెన్మిదివిధంబులు. వాతప్రకోపముచేత నాలుకపగిలి రసమును నెఱుంగ కుండిన వాతజజిహ్వారోగ మనంబడును. పిత్తప్రకోపంబుచే దహింపఁబడి నిడుదలై వర్ణంబులైన ముండ్లచే వ్యాప్తంబైయుండిన పిత్తజజిహ్వారోగ మనంబడును. కఫ ోపముచే మిగుల లావెక్కి బూరుగముండ్లవలెనుండు మాంసాంకురములచే వ్యాప్తమై

యుండిన కఫజజిహ్వారోగం బనంబడును. కఫరక్తప్రకోపంబుచే నాలుకయందు మిగుల క్రూరంబైన వాపుజనించి నాలుకను గదలనీయక స్తంభింపఁజేయును. నాలుకయొక్క మొదట పుండగును. ఇయ్యది అలసమనంబడును. కఫరక్తప్రకోపంబుచే నాలుకయందు వాపుమాత్రముగలిగిన నయ్యది అధిజిహ్వ యనంబడును. కఫరక్తప్రకోపంబుచే నాలుక క్రింద నాలుక కొనవలెనుండు వాపుజనించి జొల్లుగారుచు, దురదయు, నిప్పున కాలిన విధంబున తాపంబుగలిగించును. ఇయ్యది ఉపజిహ్వక యనంబడును. తాలువులకు మధ్య భాగంబున రక్తప్రకోపముచే తామరపువ్వువలె గుండ్రముగనుండు వాపుజనించినయెడల నయ్యది తాల్వర్బుద మనంబడును. రక్తప్రకోపముచే తాలుమూలంబులందు మృదువై రక్తవర్ణంబైన వాపుజనించి జ్వరము, వేదన పీనిని గలుగజేయును. అయ్యది తాలుపిటిక యనంబడును. శ్లేష్మప్రకోపంబుచే తాలుమూలంబున తాబేలువలెనున్నతంబై వేదనారహితంబునైన వాపు చిరకాలమునకు జనించును. ఇయ్యది కచ్ఛపి యనంబడును. కఫముచే మాంసము దుష్టంబై తాలుమధ్యమున వేదనారహితంబైన వాపుజనించిన నయ్యది తాలు సంహతి యనంబడును. శ్లేష్మరక్తములు ప్రకుపితంబులై తాలుమూలమున గాలిచేనిండిన తిత్తివలెనుండు వాపుజనింపఁజేయును. అట్టివాపు వృద్ధినొంది దప్పి, శ్వాసము, కాసము పీనిని గల్గించును. ఇయ్యది గళశుండి యనంబడును. వాతప్రకోపంబుచే తాలువులు శుష్కంబులై పగిలి తీవ్రంబైనశ్వాసము జనించును. ఇయ్యది తాలుశోషమనంబడును. పిత్తప్రకోపముచే తాలువులయందు క్రూరంబైన పుండుగలుగును. ఇయ్యది తాలుపాక మనంబడును. తాలుదేశమునందు రేగుపండువంటి పరిమాణముగల వాపుగల్గి యయ్యది వేదనలేక స్థిరముగ నుండును. ఇయ్యది పుప్పుట మనంబడును. ఇది మేదస్సుతోఁగూడిన కఫముచేఁ బుట్టును.

## గళరోగవివరణము.

గళరోగా స్తథాఖ్యాతా అష్టాదశమితా బుధైః. 136
వాతరోహిణికా పూర్వా ద్వితీయా పిత్తరోహిణీ,
కఫరోహిణికా ప్రోక్తా త్రిదోషైరపి రోహిణీ. 137
మేదోరోహిణికాబృందో గళౌఘో గళవిద్రధిః,
స్వరహా తుండికేరీ చ శతఘ్నీ తాలుకోర్బుదమ్. 138
గలాయుర్వలయశ్చాపి వాతాద్గండః కఫాత్తథా,
మేదోగండ స్తథైకస్స్యాదిత్యష్టాదశకంఠకః. 139

ముఖరోగాంతర్గత గళరోగములు వాతరోహిణి, పిత్తరోహిణి, శ్లేష్మరోహిణి, సన్నిపాతరోహిణి, మేదోరోహిణి, గళౌఘముగలవిద్రధి, స్వరఘ్నము, తుండికేరి,

శతఘ్ని, తాలుకము, అర్బుదము, గళాయువు, వలయము, వాతగండము, కఫగండము, మేదోగండము అన పదునెనిమిది విధంబులు. మిక్కిలి వేదనతోఁ గూడ కంఠరంధ్రము నడ్డగించు మాంసపు మొలకలు నాలుకయందు జనించిన నయ్యది వాతజరోహిణి యనం బడును. పూర్వము చెప్పినటుల మాంసాంకురంబులు జనించి శీఘ్రముగ పాకమునొంది జ్వరమును గల్గించిన నయ్యది పిత్తజరోహిణి యనంబడును. అట్టి మాంసాంకురంబులు నాలుకయందు జనించి నిశ్చలంబులై కఠినంబులై కంఠద్వారము నడ్డగించిన నయ్యది కఫజరోహిణి యనంబడును. నాలుకయందు మాంసాంకురములు జనించి మిగులలోఁతుగ పాకమునొంది త్రిదోషలక్షణంబులు జూపట్టిన సన్నిపాతరోహిణి యనంబడును. మేదో దోషంబుచే మాంసాంకురములు పుట్టి తెల్లనివర్ణంబు గలిగియుండిన మేదోరోహిణి యనంబడును. రక్తపిత్త ప్రకోపంబుచే కంఠద్వారమున ఉన్నతంబును, వర్తులంబును నైన వాపుజనించి అధికమైన మంటయు, తీవ్రమైన జ్వరముచు గలిగించిన నయ్యది బృంద మనంబడును. రక్తముతోఁ గూడిన కఫముచే కంఠమునందు వాపుజనించి తీవ్రమైన జ్వరముతోఁ గూడి అన్నము, జలము, వాతము వీనిమార్గముల నడ్డగించియున్నయెడల నయ్యది గళౌఘ మనంబడును. త్రిదోషప్రకోపంబుచే కంఠమునందు వాపు జనించి కంఠమంతయు వ్యాపించి నొప్పి, మంట - ఇవి గల్గియుండిన గళవిద్రధి యనంబడును. వాతమును వహించునాడులు కఫముచే నావరింపఁ బడినయెడల మూర్ఛ, నిట్టూరుపు నిగుడించుట, స్వరభేదము, నోరెండుట, భుజించుటకు స్వాధీనములేకుండుట ఈలక్ష ణంబులు గానంబడును. ఇయ్యది స్వరఘ్న మనంబడును. తాలుదేశంబున ప్రత్తికాయ వలె వాపు జనించి పోటు, మంటకల్గి యుండగును. ఇయ్యది కఫరక్త ప్రకోపంబుచే గల్గిన తుండికేరి యనంబడును. త్రిదోషప్రకోపంబుచే కంఠమున మిక్కిలి ఘనంబును, మాంసాంకురములచే వ్యాప్తంబైనదియు, పోటు, నొప్పి, మంట, వీనిని గలుగజేయుచు వర్తివలె నొక్కటి కంఠద్వారమున కడ్డుపడి ప్రాణంబుల సయితము హరించును. ఇయ్యది శతఘ్ని యనంబడును. కంఠబిలంబునందు మంటయు, పోటునుంగల్గి దుర్గంధంబై శిథిల మైన మాంసముతోఁగూడినవాపు పిత్తప్రకోపముచే జనించును. ఇయ్యది మనుజుఁడే ప్రక్కపరుండునో యాప్రక్కజనించును. ఇయ్యది తాలుక మనంబడును. కంఠబిలము నకులోన వర్తులంబును, ఉన్నతంబును, దురదతోఁ గూడినదియు, మంట కొంచెముగాఁ గల్గినదియునై, పాకమునొందక కఠినంబైన వాపుజనించును. ఇయ్యది అర్బుద మనం బడును. కఫరక్తప్రకోపంబుచే కంఠబిలంబునందు ఉసిరికకాయలోని విత్తనమంత పరి మాణముగల్గి కఠినంబై అధికమైన బాధతోడ గ్రంథి జనించును. దానంజేసి కంఠమున అన్నపుముద్ద చిక్కినట్లుండును. ఇయ్యది గళాయు వనంబడును. కఫప్రకోపంబుచే కంఠ

మునందు విశాలంబును, ఉన్నతంబును నైన వాపుజనించి ఆహారము లోనఁ బ్రవేశించు బిలము నడ్డగించును. ఇయ్యది వలయ మనంబడును. ఇది అసాధ్యము. పోటుతోఁగూడిన బొబ్బలు ముఖమునం దంతటను జనించిన వాతజగండ మనియు, రక్తవర్ణంబులై మంటతోఁ గూడియుండిన బొబ్బలు జనించిన పిత్తజగండ మనియు, వేదనలేక దురద గల్గి, దేహముతో సమానమైన వర్ణముగల బొబ్బలు జనించిన నయ్యది శ్లేష్మజగండమనియు, మేదోదోషంబున గ్రంథులు జనించిన మేదోజగండ మనియు జెప్పంబడును.

## ముఖాంతరోగవివరణము.

ముఖాంతస్సంభవా రోగా అష్టౌ ఖ్యాతా మహర్షిభిః,
ముఖపాకో భవేద్వాతాత్పిత్తాత్తద్వత్కఫాదపి. 140
రక్తాచ్చ సన్నిపాతాచ్చ పూత్యాస్యోర్ధ్వగుదావపి,
అర్బుదం చేతి ముఖజాశ్చతుస్సప్తతి రామయాః. 141

ముఖాంతర్గతరోగములు, వాతజ, పిత్తజ, శ్లేష్మజ, రక్తజ, సన్నిపాత, పూత్యాస్య, ఊర్ధ్వగుద, అర్బుదములన నెనిమిదివిధంబులు. ముఖములో వాత పిత్త, కఫ, రక్త, సన్నిపాతములచే బొబ్బలు జనించి యాదోషలక్షణంబులు గలిగియున్నయెడ నాయా నామంబులచే వ్యవహరింపఁబడును. దుర్గంధముతోఁ గూడిన పొక్కులు జనించిన పూత్యాస్య మనంబడును. పొక్కులు జనించి పగిలి యామాంసము గుదాకారముగా నుండిన ఊర్ధ్వగుద మనంబడును. నోటిలో ఉన్నతంబును, లావును, గలగ్రంధి జనించిన నయ్యది అర్బుద మనంబడును. ఇయ్యవి అన్నియు కలసి డెబ్బదినాలుగు విధంబులగు ముఖరోగములు.

## కర్ణరోగవివరణము.

కర్ణరోగాస్సమాఖ్యాతా అష్టాదశమితా బుధైః,
వాతాత్పిత్తాత్కఫాద్రక్తాత్సన్నిపాతాచ్చ విద్రధిః. 142
శోథోర్బుదం ఘ్రాతికర్ణః కర్ణార్శగికర్ణహాల్లికా,
బాధిర్యం తంత్రికాకండూశ్శష్కులీ కృమికర్ణకః. 143
కర్ణనాదః ప్రతీనాహా ఇత్యష్టాదశకర్ణజాః,

కర్ణము (చెవు) లందు గలుగురోగములు వాతజ, పిత్తజ, శ్లేష్మజ, రక్తజ, సన్నిపాతజ, విద్రధి, కర్ణశోథ, అర్బుద, పూతికర్ణ, కర్ణార్శః, కర్ణహాల్లిక, బాధిర్య, తంత్రిక, కండు, శష్కులి, కృమికర్ణ, కర్ణనాద, ప్రతినాహ భేదంబులచే పదునెనిమిది విధంబులు. చెవులయందు కారణము లేకయే ధ్వనివినంబడుట, అధికమైనపోటు, కర్ణముల

యందలి మలను శుష్కించియుండుట, స్వల్పమైన స్రావము గలిగియుండుట, ఇయ్యవి వాతజకర్ణరోగలక్షణంబులు. కర్ణమందలివాపు ఎఱ్ఱగనుండుట, పగులుట, అధికమైన మంట, దుర్గంధముతోగూడ పచ్చనిచీముగాఱుట, ఇయ్యవి పిత్తజకర్ణరోగలక్షణంబులు. చెవులు విరుద్ధముగ వినంబడుట, దురద, కఠినమైనవాపు, స్నిగ్ధంబై తెల్లగనున్న చీము గాఱుట, బాధ స్వల్పముగనుండుట, ఇయ్యవి శ్లేష్మజకర్ణరోగలక్షణంబులు. పిత్తజ కర్ణ రోగలక్షణంబులతోగూడి రక్తము స్రవించుచుండిన నయ్యది రక్తజకర్ణరోగ మనం బడును. వాతాదిదోషములయొక్క లక్షణంబులు చూపట్టెనేని యయ్యది సన్నిపాతకర్ణ రోగ మనంబడును. కర్ణములయందు అభిఘాతాదులచే విద్రధి జనించి రక్తవర్ణంబైన స్రావము గలిగియుండును. అది కర్ణవిద్రధి యనంబడును. వాతాదిదోషంబులచే కర్ణ ములందు వాపుమాత్రము జనించిన నయ్యది కర్ణశోథ మనంబడును. వాతాదిదోషంబు లచే వేర్వేఱుగ కర్ణములయందు అర్బుదము జనించి పూర్వము ముఖరోగాదులయందు చెప్పఁబడిన లక్షణంబులు గలిగియుండిన నయ్యది అర్బుద మనంబడును. కర్ణరంధ్రముల లోనుండు శ్లేష్మము పిత్తముయొక్క తేజస్సుచే తపింపఁబడి వేదనగల్గిగాని, వేదనలేక గాని, మిగుల గట్టిగనుండు దుర్గంధముతోఁగూడి చీముగాఱుచుండును. ఇయ్యది పూతి కర్ణ మనంబడును. వాతాదిదోషప్రకోపంబుచే కర్ణములయందు మాంసాంకురములు జనించి శూల, మంట, దురద, స్రావముగల్గిన నయ్యది కర్ణార్శ స్సనంబడును. మిడ తలు, జెఱ్ఱులు మొదలగునవి కర్ణరంధ్రములయందు ప్రవేశించినయెడల మనోవ్యా కులత, మిగుల వేదన గల్గును. ఇట్టి క్రిములు చెవులయందు కదలునపుడు పోటు, పర పరలాడుట, తీవ్రమైన బాధ సంభవించును. ఇయ్యది కర్ణహల్లిక యనంబడును. కేవల వాతముగాని, శ్లేష్మముతోఁగూడిన వాతము గాని ప్రకోపమునొంది కర్ణములయందు శబ్దవహాస్రోతస్సులను ఆవరించినచో చెవులు వినంబడకుండును. అయ్యది బాధిర్య మనం బడును. వాతము ప్రకుపితంబై కఫ, రక్త, పిత్తములంగలసి వేణునాదము (వెదురుబొంగుల ధ్వని) తో సమానమైన ధ్వనిని కర్ణములయందు గల్గించును. ఇయ్యది తంత్రిక యనం బడును. కర్ణములయందు దురద గల్గిన నయ్యది కర్ణకండువు అనంబడును. శిరస్స్నానం దభి ఘాతము గల్గుట, జలమునందు మునుఁగుట, విద్రధి జనించి పగులుట, ఈకారణంబులచే కర్ణము వాతపీడితంబై చీముగార్చును. ఇయ్యది కర్ణశష్కులి యనంబడును. కర్ణముల యందలి మాంసము, రక్తము కుళ్లి, క్రిములు జనించి యనేకవిధంబులగు వేదనలను గలుగ జేయుచుండిన నయ్యది కృమికర్ణ మనంబడును. వాతము ప్రకుపితంబై కర్ణరంధ్రము లందుఁ జేరి భేరి, మద్దెల శంఖము, మొదలగు వానియొక్క ధ్వనులంబోలె ధ్వనులు వినంబడును. ఇయ్యది కర్ణనాదం బనంబడును. కర్ణనాదమునందు నానావిధంబులగు

ధ్వనులు వినంబడుననియుఁ, తంత్రికయందు వేణునాదం బొక్కటియే వినంబడుననియు నీరెంటికి భేదంబు తెలియందగును. వాతము కఫముతోఁ గలసి చెవులయందు దురదను బుట్టించును. పిత్తోష్మముచే కఫము శోషించి కర్ణములయందు కర్ణగూథమను వ్యాధిని గల్గించును. ఆమలము కఱగి ద్రవభూతంబై నాసారంధ్రమును, ముఖమును పొందినపుడు చెవులయందు ప్రతిధ్వని గలుగును. శిరమునందు సగపాలు బాధగల్గును. ఇయ్యది కర్ణప్రతీనాహ మనంబడును. ఇయ్యవి కర్ణరోగంబులు.

## కర్ణపాలీరోగవివరణము.

కర్ణపాలీసముద్భూతా రోగాస్సప్త ఇహోదితాః. 144
ఉత్పాతః పాలిశోషశ్చ విదారీదుఃఖవర్ధనః,
పరిపోటశ్చ లేహీ చ పిప్పలీచేతి సంస్మృతాః. 145

కర్ణపాళుల (చెవితమ్మ) యందు పుట్టు రూపములు ఉత్పాతము, పాలిశోషము, విదారి, దుఃఖవర్ధనము, పరిపోటము, లేహి, పిప్పలి అన నేడువిధంబులు. బరువైన ఆభరణములుంచుటచేతను కొట్టుటచేతను అధికముగ తోముటచేతను, కర్ణమునందు మంటగలిగి పుండైయుండును. ఇయ్యది ఉత్పాతమనంబడును. ఇది రక్తపిత్తములచే జనించును. వాతప్రకోపంబుచే చెవులతమ్మలు శోషించి ముడుచుకొనిపోయిన నయ్యది పాలిశోష మనంబడును. కర్ణపాళులుపగిలి దురదగలిగి స్రవించుచుండిన విదారి యనంబడును. చెవులను బలాత్కారముగ పెంచినయెడల వాతము ప్రకుపితంబై కఫముతోఁగూడి స్తబ్ధంబై వేదనారహితంబై నదురదతోఁగూడినవాపును జనింపఁజేయును. ఇయ్యది పిప్పలియనంబడును. చెవులను విరుద్ధస్థలంబున కుట్టినయెడల దురదయు, మంటయు గలవాపు జనించును. ఇయ్యది దుఃఖవర్ధన మనంబడును. శరీరము సుకుమారంబై యుండుటవలన కుట్టినచెవులను పెంచక చిరకాలముండి మరల శీఘ్రముగ పెంచుటచేత చెవితమ్మ పగిలి కృష్ణవర్ణంబుతు అరుణవర్ణంబును నైనవాపును కల్గించును. దానంజేసి మిగుల తీవ్రమైన బాధ గల్గును. ఇయ్యది పరిపోటమనంబడును. కర్ణపాళియందు కఫము రక్తము వృద్ధినొంది, దురదయుం, మంటయుఁ, నొప్పియుఁ గల్గి ఆవాలవంటి పొక్కులు లేచి చెవులయందంతట వ్యాపించును. ఇయ్యది చెవియందు వ్యాపించి మాంసమును తినును. ఇయ్యది పరిలేహి యనంబడును.

## కర్ణమూలరోగము, నాసారోగము - వీనివివరణము.

కర్ణమూలామయాః పంచ వాతాత్పిత్తాత్కఫాదపి,
సన్నిపాతాచ్చ రక్తాచ్చ తథా నాసాభవా గదాః. 146
అష్టాదశైవ సంఖ్యాతాః ప్రతిశ్యాయాస్తు తేష్వపి,
వాతాత్పిత్తాత్కఫాద్రక్తాత్సన్నిపాతేన పంచమః. 147

అపీనసః పూతినాసో నాసార్శోభ్రంశథుః క్షవః,
నాసానాహః పూతిరక్తమర్బుదం దుష్టపీనసమ్. 148
నాసాశోషో ఘ్రాణపాకః పూయస్రావశ్చ దీప్తకః,

కర్ణమూలముల యందు జనించురోగములు వాత, పిత్త, కఫ, సన్నిపాత, రక్తములచే నుత్పన్నంబై యైదువిధంబులు. వీనిలక్షణంబులను దోషలక్షణానుసారంబుగా నెఱుంగునది. నాసా (ముక్కు) రోగంబులు వాతప్రతిశ్యాయము, పిత్తప్రతిశ్యాయము, శ్లేష్మప్రతిశ్యాయము, రక్తప్రతిశ్యాయము, సన్నిపాతప్రతిశ్యాయము, అపీనసము, పూతినాసము, నాసార్శము, భ్రంశథువు, నాసానాహము, పూతిరక్తము, అర్బుదము, దుష్టపీనసము, నాసాశోషము, ఘ్రాణపాకము, పూయస్రావము, దీప్తకము అన పదునెనిమిదివిధంబులు. నాసారంధ్రములు బిగిసి మూయఁబడిన ట్లుండును. పలుచనైనశ్లేష్మము స్రవించుట, కంఠము తాలువులు పెదవులు ఎండుట, కణతలయందు పోటు, అధికముగ తుమ్ములు, కంఠస్వరము హీనంబగుట, ఇయ్యవి వాతజ ప్రతిశ్యాయలక్షణంబులు. నాసారంధ్రములనుండి ఉష్ణంబును, కొంచెము పచ్చగనునుండు శ్లేష్మము వెడలుట, శరీరము చిక్కి పాండువర్ణము గలిగియుండుట, సంతాపమునొందుట, నోటనుండి అగ్నిని గ్రక్కునట్లుండుట, ఇయ్యవి పిత్తజప్రతిశ్యాయలక్షణంబులు. నాసారంధ్రములనుండి శీతలంబును, తెల్లనివర్ణంబు గల్గినట్టియు, కఫము అధికముగ స్రవించుట, దేహము తెల్లబాఱుట, శిరోభారము, కంఠము, తాలువులు, శిరంబు వీనియందు మిగులదురద, ఇయ్యవి కఫజప్రతిశ్యాయ లక్షణంబులు. నాసారంధ్రములనుండి రక్తముస్రవించుట, కన్నులెఱ్ఱబాఱుట, ఉరఃక్షతము, శ్వాసము దుర్గంధముగానుండుట, వాసన దెలియకుండుట, ఇయ్యవి రక్తజప్రతిశ్యాయలక్షణంబులు. ప్రతిశ్యాయము పక్వంబైనను, పక్వముగాకున్నను, మాటిమాటికిజనించి చికిత్సజేయకున్నను, నశించి మరలం జనించుచుండిన నయ్యది సన్నిపాతజప్రతిశ్యాయమనంబడును. ఇయ్యది అసాధ్యంబు. ముక్కులయందు వాతము ప్రకోపమునొంది కఫమును శుష్కింపఁజేసి శ్వాసము వెడలకయుండుట, ముక్కులయందు ద్రవముగల్గియుండుట, మంటఁబుట్టుట, ఇంద్రియములకు స్వస్వవిషయజ్ఞానము నశించుట, ఇయ్యది పీనసమనంబడును. ఉష్ణముచే పరిపక్వంబులై పిత్త, కఫ, రక్తములు మూడింటిచేతను కంఠము, తాలువులు, వీనియందలి వాతము వృద్ధినొంది నాసారంధ్రములనుండియు, ముఖమునుండియు, దుర్గంధముతో గూడిన స్రావమును గల్గించును. ఇయ్యది పూతినాస మనంబడును. నాసారంధ్రములయందు మాంసాంకురములు పుట్టి దోషభేదంబుచే మూలరోగంబున చెప్పఁబడిన లక్షణంబులను గలిగియుండును. ఇయ్యది నాసార్శ మనంబడును. కఫము శిరంబునందు వృద్ధినొంది ఘనీభూతంబై

పరిపక్వంబై లవణరూపమునొంది నాసాద్వారమునుండి వెలువడును. ఇయ్యది భ్రంశథు వనంబడును. నాసికామర్మంబున వాతము దుష్టంబై కఫముతోఁగూడి నాసారంధ్రము నుండి మిగుల తీవ్రంబైన శబ్దమును గల్గించిన నయ్యది క్షవథువు అనంబడును. ఇయ్యది దోషజక్షవథువనంబడును. కారము మొదలగు పదార్థములు లోన ప్రవేశించి నపుడు గలుగుతుమ్ములు ఆగంతుకక్షవథువు అనంబడును. కఫము వాతముతోఁగూడి నాసిక యందలి శ్వాసమార్గంబు నడ్డగించిన నయ్యది నాసానాహ మనంబడును. పిత్తరక్త ములు వృద్ధినొందిగాని, నుదుటియందు దెబ్బతగిలిగాని, వాతాదిదోషములను వృద్ధినొం దించిన, పరిపాకమునొంది నాసారంధ్రమునుండి రక్తముతోఁగూడిన చీము దుర్గంధ యుక్తమై స్రవించును. ఇయ్యది పూతిరక్త మనంబడును. వాతాదిదోషప్రకోపంబుచేత ముక్కునందు కురుపులు జనించి అర్బుదముతో సమానలక్షణంబులను గలిగియుండిన నయ్యది నాసార్బుదమనంబడును. ప్రతిశ్యాయవ్యాధి జనించినపుడు నాసారంధ్రము లొకప్పుడు ఆర్ద్రంబులుగను, ఒకప్పుడు శుష్కంబులై శ్లేష్మంబుచే నడ్డగింపఁబడి దుర్గంధ ముతోఁగూడిన నిశ్వాసము బైలు వెడలుచుండి గంధాదులం దెలియకున్న నట్టి ప్రతిశ్యా యమే దుష్టపీనస మనంబడును. నాసిక నాశ్రయించిన స్రోతస్సు వాతప్రకోపంబుచే శోషించి పిత్తముచే తపింపఁబడినయెడల నాసికయందలికఫము శోషించును. దానంజేసి ఉచ్ఛ్వాసనిశ్వాసములు కష్టముచే గల్గుచుండును. ఇయ్యది నాసాశోష మనంబడును. పిత్తప్రకోపంబుచే నాసికయందు వ్రణములు గల్గును. అట్టిపుండ్లు ఆర్ద్రంబులై దుర్గంధ ముతో గూడియుండిన ఘ్రాణపాక మనంబడును. నాసాద్వారమునుండి మిగుల చిక్క గను, పీత, శ్వేతవర్ణములు గల్గినదియు నైన కఫము స్రవించుచుండిన నయ్యది నాసా స్రావ మనంబడును. నాసికయందు అధికమైన మంట జనించి పొగలుబోవు చందంబున నిట్టూరుపులు బోవుచుండి నాసిక అగ్నిజ్వాలలంబోలె మండుచున్న నయ్యది దీప్తకమనం బడును. ఇయ్యవి నాసారోగంబులు.

## శిరోరోగవివరణము.

తథా దశ శిరోరోగా వాతేనార్ధావభేదకః. 149
శిరస్తాపశ్చ వాతేన పిత్తాత్పీడా తృతీయకా,
చతుర్థీ కఫజా పీడా రక్తజా సన్నిపాతజా. 150
సూర్యావర్తశ్శిరఃపాకాత్క్రిమిభిశ్శంఖకేన చ,

శిరస్సున జనించురోగంబులు అర్ధావభేదకము, వాతజశిరస్తాపము, పిత్తజ శిర స్తాపము, శ్లేష్మజశిరస్తాపము, రక్తజశిరస్తాపము, సన్నిపాతజ శిరస్తాపము, సూర్యావర్తము, రశిపాకము, క్రిమిజశిరస్తాపము, శంఖకము అన పదివిధంబులు. రూక్షపదార్థములను

భుజించుట, అజీర్ణముగ నున్నపుడు భుజించుట, అధికముగ భుజించుట, తూర్పుగాలి సేవించుట, మంచులోనుండుట, స్త్రీసంభోగము అధికముగ చేయుట, మలమూత్రవేగం బును నిరోధించుట, ఈకారణంబులచే కేవలవాతముగాని, కఫసహితంబగు వాతముగాని, ప్రకోపమునొంది శిరస్సున నగపాలుజేరి, మన్యలు, సిరలు, కనుబొమ్మలు, కణతలు, చెవులు, కన్నులు, నుదురు వీనియొక్క నగపాలునందు శస్త్రములచే ఛేదించినచందంబు నను, మథించినచందంబునను తీవ్రమైన బాధను గలిగించును. ఇయ్యది అర్ధావభేదక మనంబడును. దీనిని ఉపేక్షించిన కన్నుగాని, చెవిగాని, నశించును. వాతప్రకోపముచే తలనొప్పిగలిగి రాత్రులయందు అధికమై వస్త్రాదులచే గట్టినను, స్నేహస్వేదాదులం జేసినను, శాంతినొందకున్న నయ్యది వాతజశిరస్తాప మనంబడును. పిత్తప్రకోపంబుచే తల నొప్పిగల్గి శిరస్సునందు నిప్పుచల్లినట్లుండుట, కన్నులయందు, ముక్కులోను, పొగనిండి నట్లుండుట, రాత్రులయందును, శతక్రియలం జేసినపుడును శమించుట, ఈలక్షణంబులు గల్గియుండును. ఇయ్యది పిత్తజశిరస్తాప మనంబడును. కఫప్రకోపంబుచే తలనొప్పిగలిగి శిరస్సు కఫముచే పూర్ణంబై భారముగనుండుట, చల్లగనుండుట, నాసామూలంబున వాపు గల్గుట, ఈలక్షణంబులు చూపట్టును. ఇయ్యది శ్లేష్మజశిరస్తాప మనంబడును. రక్తప్రకో పంబుచే తలనొప్పిగల్గి పిత్తలక్షణంబులు చూపట్టి స్పృశించుటకు శక్యముగాకుండును. ఇయ్యది రక్తజశిరస్తాపమనంబడును. త్రిదోషప్రకోపంబుచే గల్గిన తలనొప్పియందు వాతాదిలక్షణంబు లన్నియుం జూపట్టును. ఇయ్యది సన్నిపాతశిరస్తాప మనంబడును. సూర్యోదయకాలంబున కనుబొమలయందు నొప్పిగల్గి సూర్యుడు వృద్ధినొందునపుడు క్రమక్రమముగా వృద్ధినొంది మధ్యాహ్నంబున తీవ్రంబై వారల సూర్యవృద్ధి తగ్గ కొలదిని క్రమముగా తగ్గుచు సూర్యాస్తమయంబగువఱకు నిశ్శేషముగ హరించును. ఇయ్యది సూర్యావర్త మనంబడును. ఇది త్రిదోషప్రకోపంబుచే బుట్టును గాన కష్ట సాధ్యంబు. శిరస్సునందలి కఫరక్తములు క్షీణించి దానంజేసి తల బరువుగానుండుట' తుమ్ములువచ్చుట గలిగెనేని శిరఃపాక మనంబడును. శిరస్సునందు సూదులంబొడిచినట్లు పోటు, లోన క్రిములచే తినబడునట్లుండుట, శిరంబునం దంతర్భాగమున చలించు నట్లుండుట, ముక్కునుండి నీరు చీముతో స్రవించుట గలిగిన నయ్యది క్రిమిజశిరస్తాప మనంబడును. రక్త, పిత్త, వాతములు ప్రకుపితంబులై కణతలయందు నొప్పి, మంట, రక్తవర్ణముగలవాపు వీనిని గల్గించును. ఈవ్యాధి విషమువోలె శిరంబున వ్యాపించి కంఠ ద్వారము నడ్డగించి మూడుదినములలో ప్రాణంబులం దీయును. ఇయ్యది శంఖక మనం బడును.

### కపాలరోగవివరణము.

తథా కపాలరోగాస్స్యుర్నవ తేషూపశీర్షకమ్. 151
అరూంషికా విద్రధిశ్చ దారుణం పిటికార్బుదం,
ఇంద్రలుప్తం చ ఖాలిత్యం పలితం చేతి తే నవ. 152

శిరఃకపాలంబున జనించురోగంబులు ఉపశీర్షకము, అరూంషికము, విద్రధి, దారుణము, పిటిక, అర్బుదము, ఇంద్రలుప్తము, ఖాలిత్యము, పలితము అన తొమ్మిదివిధంబులు. వాతాది దోషంబులచే శిరంబునందు వాపుజనించిన నయ్యది ఉపశీర్షక మనంబడును. శిరస్సునందు కఫము, రక్తము, క్రిములు వీనియొక్క ప్రకోపంబుచే అనేకముఖంబులై, అనేకవిధంబులైన స్రావములు గలుగును. ఇయ్యది అరూంషిక యనంబడును. వాతాదిదోషంబులచే శిరంబునందు పుండ్లుగలిగి విద్రధిరోగంబునఁ జెప్పఁబడిన లక్షణంబులు గానంబడిన నయ్యది విద్రధి యనంబడును. శిరస్సునందలి చర్మము కఠినంబై రూక్షంబై దురదతోఁగూడియుండి పగులును. ఇయ్యది దారుణక మనంబడును. శిరస్సునందు దోషప్రకోపంబుచే పొక్కులుపుట్టి వేదనగలుగఁజేయుచుండిన పిటిక యనంబడును. శిరస్సునందు వాతాదిదోషప్రకోపంబుచే పెద్దదియగుకురుపుపుట్టి అర్బుదలక్షణంబులను గలిగియున్న నయ్యది అర్బుద మనంబడును. పిత్తము వాతసహితంబై ప్రకోపించి రోమముల మొదళ్లనాశ్రయించి రోమంబులనురాల్చును. పిమ్మట శ్లేష్మము రక్తముతోఁ గూడి రోమద్వారంబుల నడ్డగించును. దానంజేసి యచ్చోట మరల రోమంబులు మొలవకుండును. ఇయ్యది ఇంద్రలుప్త మనంబడును. క్రోధము, దుఃఖము, శ్రమము, శరీరమందు పిత్తము వృద్ధినొంది శరీరమందలి వెండ్రుకలనన్ని తెల్లగఁజేయును. ఇయ్యది ఖాలిత్య మనంబడును. పైకారణంబులచే శిరస్సునందలి వెండ్రుకలుమాత్రము తెల్లఁబాఱిన నయ్యది పలిత మనంబడును. ఇయ్యవి శిరఃకపాలరోగంబులు.

### నేత్రరోగాంతర్గత వర్త్మరోగవివరణము.

తథా నేత్రభవాఖ్యాతాశ్చతుర్నవతిరామయాః,
తేషు వర్త్మగదాః ప్రోక్తాశ్చతుర్వింశతిసంజ్ఞితాః. 153
కృచ్ఛ్రోన్మీలః పక్ష్మఘాతః కఫోత్క్లిష్టశ్చ లోహితః,
అరుజ్నిమేషః కథితో రక్తోత్క్లిష్టః కుకూణకః. 154
పక్ష్మార్శః పక్ష్మరోధశ్చ పిత్తోత్క్లిష్టశ్చ పోథకీ,
శ్లిష్టవర్త్మా చ బహళః పక్ష్మోత్సంగ స్తథాఽర్బుదః. 155
కుంభికా సికతావర్త్మా లగణోఽంజననామికా,
కర్దమశ్శ్యావవర్త్మా చ బిసవర్త్మా తథాఽలజీ. 156

ఉత్క్లిష్టవర్త్మేతి గదాః ప్రోక్తా వర్త్మ సముద్భవాః,

నేత్రములయందు పుట్టురోగంబులు తొంబదినాలుగు విధంబులు. అందు కనుఱెప్పలయందుబుట్టు రోగములు కృచ్ఛ్రోన్మీలనము, పక్ష్మఘాతము, కఫోత్క్లిష్టము, లోహితము, అరుజ్నిమేషము, రక్తోత్క్లిష్టము, కుకూనకము, పక్ష్మార్శము, పక్ష్మరోధము, పిత్తోత్క్లిష్టము, పోథకి, శ్లిష్టవర్త్మము, బహళము, పక్ష్మోత్సంగము, అర్బుదము, కుంభికము, సికతావర్త్మము, లగణము, అంజననామిక, కర్దమము, శ్యావవర్త్మము, బిసవర్త్మము, అలజి, ఉత్క్లిష్టవర్త్మము అన నిరువదినాలుగు విధంబులు. వాతాదిదోషంబులు ప్రకుపితంబై కనుఱెప్పలను ముడుచుకొను నట్లుచేయును. దానంజేసి చూచుటకు సాధ్యము గాకుండును. ఇయ్యది కృచ్ఛ్రోన్మీలన మనంబడును. పిత్తము ప్రకుపితంబై వర్త్మయందలి వెండ్రుకల కుదుళ్లయందు జేరి దురదను, మంటను గలిగించి ఱెప్పవెండ్రుకలను నూడఁబెఱుకును. ఇయ్యది పక్ష్మఘాత మనంబడును. బాధలేకుండ కనుఱెప్పలలోని భాగమున ఆర్ద్రమగువాపుజనించిన నయ్యది కఫోత్క్లిష్ట మనంబడును. ఱెప్పమధ్యభాగమున రక్తవర్ణంబై మృదువైనమాంసాంకురము జనించి శస్త్రకర్మ జేయుచుండినను మరల నయ్యది పుట్టుచునేయుండును. ఇయ్యది లోహిత మనంబడును. ప్రకుపితంబగువాతము కనుఱెప్పల లోభాగమునకును, తెల్లగ్రుడ్డునకునుమధ్య సంధినాశ్రయించి కనుఱెప్పలను చలింపఁజేసి సిరలయందుజేరి కనుఱెప్పలను మాటిమాటికి చలింపఁజేయును. ఇయ్యది అరుజ్నిమేష మనంబడును. త్రిదోషకోపంబుచే కఠినంబును, కర్కశంబునునగు పొడవగు మాంసాంకురము ఱెప్పలోభాగమున జనించి వేదనాసహితంబైయుండును. ఇయ్యది రక్తోత్క్లిష్ట మనంబడును. దోషప్రకోపంబుచే ఱెప్పలయందు దురద, మంట గల్గి స్రవించుచుండిన నయ్యది కుకూనక మనంబడును. త్రిదోషప్రకోపంబుచే కనుఱెప్పల లోప్రక్కను దోసవిత్తులవంటియాకారము గల్గినవియు, స్వల్పమైన వేదన గల్గినవియు, శ్లక్ష్ణంబులై కఠినంబులైన పొక్కులు జనించును. అయ్యది పక్ష్మార్శ మనంబడును. ఱెప్పలయందు కొద్దిగా బాధయు, దురదయుంగలిగి కనులు తెఱవరాకున్న నయ్యది పక్ష్మరోధ మనంబడును. వాతప్రకోపంబుచే ఱెప్పవెండ్రుకలు చలించి నేత్రంబులం బ్రవేశించి ఒరయుటచేత నేత్రమందలి తెల్లగ్రుడ్డు, నల్లగ్రుడ్డు వీనియందు వాపు జనించును. ఇయ్యది పిత్తోత్క్లిష్ట మనంబడును. ఱెప్పయందు మిగులస్రావముతో గూడినవియు, దురదతోగూడినవియు, గౌరవము గల్గినవియు, ఎఱ్ఱనియావాలవంటి యాకారము గల్గినవియునైన పొక్కులు జనించిన నయ్యది పోథకి యనంబడును. కనుఱెప్పలలోన బాధలేకయే ఆర్ద్రంబై వెలిప్రక్క వాపుగల్గినచో నయ్యది శ్లిష్టవర్త్మ మనంబడును. చర్మమునకు సమానమైన వర్ణము గల్గినవియు, కఠినంబులైనవియు నైన బొబ్బలచే ఱెప్ప వ్యాపింపఁబడినయెడల నయ్యది

బహుళవర్త్మ మనంబడును. కనుఱెప్పలలోఁ బ్రక్క అంతర్భాగముగనే ముఖము గల్గి రక్తవర్ణంబై వెలిప్రక్కనున్నతంబైన బొబ్బగల్గి స్థూలంబై దురదగల్గియున్నయెడల నయ్యది పక్ష్మోత్సంగ మనంబడును. త్రిదోషప్రకోపంబుచే విషంబై గ్రంథివోలె స్వల్ప వేదన గలిగి రక్తవర్ణంబైన వాపు జనించిన నయ్యది అర్బుద మనంబడును. సన్నిపాత ముచే ఱెప్పకొనలయందు నేపాళపుగింజలబోలిన యాకారము గల బొబ్బలుకల్గి పగిలి పూయంబును స్రవించును. మరల తనంతనే పైకి ఉబ్బును. ఇయ్యది కుంభీక మనం బడును. సన్నిపాతంబుచే కర్కశంబును, కఠినంబును, స్థూలంబును నైన పొక్కు ఱెప్ప యందు జనించి చుట్టును సూక్ష్మంబులైనపొక్కులచే వ్యాప్తంబైయుండిన నయ్యది సికతా వర్త్మ మనంబడును. కఫప్రకోపంబుచే కఠినంబై స్థూలంబై పాకము నొందనిగ్రంథి ఱెప్పలయందు జనించి బాధలేకున్న నయ్యది లగణ మనంబడును. రక్తప్రకోపంబుచే కను ఱెప్పలయందు మంటయు, పోటును గల్గి తామ్రవర్ణంబు గలిగి, మృదువై స్వల్పవేదన గల్గియుండి సూక్ష్మంబైన పొక్కుజనించిన నయ్యది అంజననామిక యనంబడును. పిత్త ప్రకోపంబుచే రక్తము దుష్టంబై ఱెప్పలయందు పాకము గలిగించును. ఇయ్యది కర్దమ మనంబడును, త్రిదోషంబులచే ఱెప్పలోపలి భాగంబును, వెలుపలప్రక్కను, నీలవర్ణ ముగల్గి నొప్పి, వేదనయు గల్గును. ఇయ్యది శ్యావవర్త్మ మనంబడును. త్రిదోష ప్రకో పంబుచే ఱెప్పలో వెలిప్రక్క వాపుగల్గి లోపలిప్రక్క రంధ్రములు గల్గించును. ఆరం ధ్రములు తామరకాఁడలరంధ్రములనుండి నీరుకాఱు చందంబున జలమును స్రవించును. ఇయ్యది బిసవర్త్మ మనంబడును. ఱెప్పలయొక్క ఊర్ధ్వాధోభాగంబులు రెండును, సమ కాలమున కారణములేకయే మృదువుగను, స్వల్పవేదనాసహితంబై, తామ్రవర్ణంబై గాని రక్తవర్ణంబై గాని యున్నయెడ ఉత్క్లిష్టవర్త్మ మనంబడును. ఇయ్యది వర్త్మగత రోగంబులు.

## నేత్రసంధిరోగ వివరణము.

నేత్రసంధిసముద్భూతా నవరోగాః ప్రకీర్తితాః. 157
జలస్రావః కఫస్రావో రక్తస్రావశ్చ పర్వణీ,
పూయస్రావః క్రిమిగ్రంథిరుపనాహ స్తథాలజీ. 158
పూయాలసఇతి ప్రోక్తా రోగా నయనసంధిజాః.

నేత్రసంధియందు జనించురోగములు జలస్రావము, కఫస్రావము, రక్తస్రా వము, పర్వణి, పూయస్రావము, క్రిమిగ్రంథి, ఉపనాహము, అలజి, పూయాలసము, అన తొమ్మిది విధంబులు. నేత్రముయొక్క సంధుల(కెలకులు)నుండి వచ్చుగాని, ఉదక మువలెగాని యుష్ణంబైననీరు కారుచుండిన నయ్యది పిత్తజన్యమగు జలస్రావ మనంబడును.

నేత్రములయొక్క సంధులనుండి శ్వేతవర్ణంబును, పిచ్ఛిలంబును నైన చిక్కని స్రావము గలిగిన నయ్యది శ్లేష్మస్రావ మనంబడును. రక్తప్రకోపంబుచే నేత్రసంధులనుండి రక్తము స్రవించిన నయ్యది రక్తస్రావ మనంబడును. రక్తప్రకోపంబుచే నేత్రములయొక్క శుక్ల, కృష్ణ మండలములయొక్క సంధులయందు రక్తవర్ణంబును, సూక్ష్మంబును, వర్తులంబును నైన వాపు జనించి మంట, నొప్పి, పీనిం జనింపఁజేసిన నయ్యది పర్వణి యనంబడును. సన్నిపాతంబుచే నేత్రములయొక్క సంధులయందు పుండుజనించి చీమును స్రవించుచున్న నయ్యది పూయస్రావ మనంబడును. ఇయ్యది అసాధ్యము. వాతశ్లేష్మప్రకోపంబుచే కనుపాపకును, నల్లగ్రుడ్డునకును మధ్యనుండు సంధియందు గొప్పనూకారముగల్గి, స్వల్పమైన పాకముగల్గి మిగుల దురదగల్గి స్వల్పవేదనతోఁగూడిన గ్రంథి జనించును. ఇయ్యది ఉపనాహ మనంబడును. సన్నిపాతంబుచే కనుఱెప్పలకు లోపలిభాగమునకును, తెల్లగ్రుడ్డునకును మధ్యనుండు సంధియందు క్రిములు పురుగులు జనించి ఱెప్పలోపలిభాగమునకు వ్యాపించి దురదనుగల్గించును. మఱియు నీక్రిములు నానాఁట కన్నును తినును. ఇయ్యది క్రిమిగ్రంథి యనంబడును. ఇయ్యది అసాధ్యము, నేత్రసంధియందు పైనజెప్పఁబడిన పర్వణిలక్షణంబులు గలిగి బొబ్బ జనించిన నయ్యది అలజి యనంబడును. సన్నిపాతంబుచే నాసికామూలమునకు సమీపమునసుండు సంధియందు వాపుజనించి పరిపక్వమై పోటుతోఁగూడ దుర్గంధముతో గూడియుండు చీమును స్రవించుచుండిన నయ్యది పూయాలసక మనంబడును. ఇయ్యవి సన్నిపాతజన్యంబైనను సాధ్యంబు. ఇయ్యవి నేత్రసంధిగతరోగంబులు.

### కంటి తెల్లగుడ్డునందు జనించురోగవివరణము.

తథా శుక్లగతా రోగా బుధైః ప్రోక్తాస్త్రయోదశ. 159
సిరోత్పాతస్సిరాహర్షస్సిరాజాలం చ శుక్తికా,
శుక్లార్మ చాధిమాంసార్మప్రస్తార్యర్మ చ పిష్టకః. 160
సిరాజః పిటికా చైవ కఫగ్రంథితకోఽర్జునః,
స్నాయ్వర్మ శోణితార్మస్యాదితి శుక్లగతా గదాః. 161

కంటియొక్క శుక్లమండలము (తెల్లగ్రుడ్డు)న జనించురోగములు సిరోత్పాతము, సిరాహర్షము, సిరాజాలము, శుక్తిక, శుక్లార్మ, అధిమాంసార్మ, ప్రస్తార్యర్మ, పిష్టకము, సిరాజపిటిక, కఫగ్రంథికము, అర్జునము, స్నాయ్వర్మ, శోణితార్మ అన పదిమూఁడు విధంబులు. కన్నులయందు రక్తవర్ణంబులైన రేఖలుపుట్టి వేదనతోగూడిగాని వేదనలేక గాని యుండిన నయ్యది సిరోత్పాతమనంబడును. పైజెప్పిన సిరోత్పాతమును చికిత్సజేయక నుపేక్షించిన ఎఱ్ఱనినీరు కన్నులనుండి స్రవించి చూడశక్యము

గాకుండును. ఇయ్యది సిరాహర్ష మనంబడును. తెల్లగ్రుడ్డునందు పలుతెఱంగుల సిరలు వ్యాపించి గవాక్షింబోలె కఠినంబులై రక్తమును స్రవించుచుండిన నయ్యది సిరాజాల మనంబడును. ఇయ్యది రక్తప్రకోపముచే జనించును. పిత్తప్రకోపంబుచే శ్యావవర్ణంబులై మాంసపుముద్దలవంటి యాకారముగల్గి ముత్యపుచిప్పలంబోలిన వర్ణము గల చుక్కలు తెల్లగ్రుడ్డునందు జనించిన నయ్యది శుక్తిక యనంబడును. తెల్లగ్రుడ్డునందు కొంచెము శ్వేతవర్ణము గలిగి మృదువైన మాంసపుపొరగల్గి చిరకాలమునకు వృద్ధినొందును; ఇయ్యది శుక్లార్శ యనంబడును. సన్నిపాతంబుచే తెల్లగ్రుడ్డునందు విస్తీర్ణంబై మృదువై యకృత్తుతుంబోలి రక్తవర్ణమైన మాంసము జనించిన నయ్యది అధిమాంసార్శ యనంబడును. సన్నిపాతంబుచే తెల్లగ్రుడ్డునందు సూక్ష్మంబై విస్తీర్ణంబై రక్తవర్ణముగ గాని, శ్యామవర్ణముగ గాని యుండిన పొర జనించి యుండిన నయ్యది ప్రస్తార్యర్శ మనంబడును. కఫవాత ప్రకోపంబుచే తెల్లగ్రుడ్డునందు పిండివలె తెల్లనై ఉన్నతంబైన మలినము గ్రమ్మి యద్దంబువోలె జూపట్టిన నయ్యది పిష్టక మనంబడును. సన్నిపాతంబుచే నల్లగ్రుడ్డు సమీపమున తెల్లగ్రుడ్డునందు తెల్లని బొబ్బలు జనించి సిరలచే గప్పఁబడియుండిన నయ్యది "సిరాజపిటిక" యనంబడును. కఫవాతప్రకోపంబుచే తెల్లగ్రుడ్డునందు కంచువలె కొంచెము పచ్చనై కఠినంబై యుదకబిందువుంబోలె వర్తులంబైన బొబ్బకల్గిన నయ్యది కఫగ్రథిత మనంబడును. రక్తప్రకోపంబుచే తెల్లగ్రుడ్డునందు కుందేటినెత్తురుంబోలి రక్తవర్ణంబైన చుక్కయొక్కటి జనించిన నయ్యది అర్జున మనంబడును. సన్నిపాతంబుచే తెల్లగ్రుడ్డునందు కఠినంబై యధికమైనమాంసముతోఁ గూడియుండి స్రావములేక శుష్కంబైయున్న నయ్యది స్నాయ్వర్శ యనంబడును. రక్తప్రకోపంబుచే ఎఱ్ఱదామరరేకులంబోలె రక్తవర్ణంబుగలిగి మృదువైనమాంసము తెల్లగ్రుడ్డునంజనించి వృద్ధినొందిన నయ్యది శోణితార్శ యనంబడును.

## కంటినల్లగ్రుడ్డునందు జనించురోగములవివరణము.

తథా కృష్ణసముద్భూతాః పంచరోగాః ప్రకీర్తితాః,
శుద్ధశుక్లం సిరాశుక్లం క్షతశుక్లం తథాజికా. 162
సిరాసంగశ్చ సర్వేఽపి ప్రోక్తాః కృష్ణగతామయాః,

నల్లగ్రుడ్డునందు జనించురోగములు.—శుద్ధశుక్లము, సిరాశుక్లము, క్షతశుక్లము, అంజనకము, సిరాసంగము అను నైదువిధంబులు. అభిష్యందవ్యాధిచే నల్లగ్రుడ్డునందు శంఖము, చందురుఁడు, మొల్లమొగ్గలు-వీనింబోలినకాంతిగల్గి ఆకసంబున నడుమనుండు తెల్లనిమబ్బువోలె సూక్ష్మంబైన తెల్లనిచుక్కపుట్టి చోషముతోఁ గూడియుండిన నయ్యది శుద్ధశుక్ల మనంబడును. నల్లగ్రుడ్డునందు యెఱ్ఱని యావగింజవలె గుండ్రముగనుండి

హదితో పొడిచినవిధంబున ప్రణముకల్గి నీరు గాఱుచున్న యెడల నయ్యది క్షతశుక్ల మనం
డును. నల్లగుడ్డునందు సిరలు వ్యాపించి దృష్టికి ప్రతిబంధించుచున్న నయ్యది సిరా
క్ల మనంబడును. ఎండిన మేంక పెంటివలెనుండి వేదనతోఁగూడి పిచ్ఛిలంబై కన్నీళ్లు
గాఱుచు పుట్టిన నయ్యది అజికయనంబడును. సన్నిపాతంబుచే నేత్రములయందు తెలుపు
నించి నల్లగుడ్డునంతయు వ్యాపించిన సిరాసంగ మనంబడును.

## కాచబిందురోగవివరణము.

కాచం తు షడ్విధం జ్ఞేయం వాతాత్పిత్తాత్కఫాదపి. 163
సన్నిపాతాచ్చ రక్తాచ్చ షష్ఠం సంసర్గసంభవం,

కాచబిందురోగము.—వాత, పిత్త, కఫ, రక్త, సన్నిపాత సంసర్గములచే నుత్ప
న్నంబై యైదువిధంబులు. నేత్రములయొక్క మూఁడవపటలము నాశ్రయించిన రోగము
కాచబిందురోగ మనంబడును. రూపముతోఁగూడియుండు వస్తువులన్నియుఁ దిరుగు
చుండునట్లును, మలినంబులై యరుణవర్ణంబు గలిగి వంకరగా నుండునట్లును గానంబడిన
నయ్యది వాతజకాచబిందు వనంబడును. నేత్రములకు సూర్యునియొక్కయు, మిణుగురు
పురుగుయొక్కయు, ఇంద్రధనుస్సుయొక్కయు, నాట్యము చేయుచున్న నెమిలియొక్కయు
రూపంబులు గానంబడును. మిగిలిన వస్తువులన్నియు నల్లగ గానంబడును. ఇయ్యది పిత్తజ
కాచబిందు వనంబడును. ద్రవ్యములన్నియు స్నిగ్ధంబుగను, తెల్లగను, నీటితోఁ దడిసి
నట్లును గానంబడును. మఱియు ఆకసంబున మేఘములేకున్నను మేఘముతోఁ గూడి
యుండునట్లు గానంబడును. ఇయ్యది కఫజకాచబిందు వనంబడును. నేత్రములకు చీఁకటి
గూడ ఎఱ్ఱగను, అన్నిద్రవ్యములు ఎఱ్ఱగను గానంబడును. ఇయ్యది రక్తజకాచబిందు
వనంబడును. నేత్రములకు సమస్తవస్తువులు నానావిధంబుగను, ఒకటిరెంటిక్రిందను,
అనేకభేదంబులుగను గానంబడిన నయ్యది సన్నిపాతజకాచబిందు వనంబడును. పిత్తము
రక్తముతోఁగూడి వస్తువులన్నిటిని పచ్చగను, సూర్యుఁడు పచ్చగనుండునట్లును, వృక్షము
లన్నియు మిణుగురుపురుగులచే వ్యాప్తమైనట్లును కాన్పింపఁజేయును. ఇయ్యది సంసర్గజ
కాచబిందు వనంబడును.

## తిమిరరోగవివరణము.

తిమిరాణి షడేవ స్యుర్వాతపిత్తకఫైస్త్రిధా. 164
సంసర్గేణ చ రక్తేన షష్ఠం స్యాత్సన్నిపాతతః,

తిమిరరోగము.—వాత, పిత్త, శ్లేష్మ, రక్త, సంసర్గ, సన్నిపాతములచే నుత్ప
న్నంబై ఆఱువిధంబులుగ నుండు. వీని లక్షణంబులను దోషానుసారంబుగా, కాంచబిందు
లక్షణంబులను బోలె తెలియందగును.

### లింగనాశరోగవివరణము.

లింగనాశస్తు షడ్ధా స్యాద్వాతాత్పిత్తాత్కఫేన చ. 165
త్రిదోషైరుపసర్గేణ సంసర్గేణాసృజా తథా,

లింగనాశరోగము.—వాత, పిత్త, కఫ, సన్నిపాత, ఉపసర్గ, సంసర్గ, రక్తములచే నుత్పన్నంబై యేడువిధంబులుగ నుండును. రూపాదుల దెలియుటకు సాధనమైన తేజస్సు లింగమనంబడును. అయ్యది నశించుటచే గల్గురోగము లింగనాశరోగ మనంబడును. అందు దృష్టిమండలము అరుణంబై కఠినమై చంచలమైయుండిన వాతజలింగనాశ మనంబడును. దృష్టిమండలము నల్లగఁగాని, పచ్చగఁగాని యుండిన పిత్తజలింగనాశ మనంబడును. దృష్టిమండలము బరువుగను, తెల్లగను స్నిగ్ధంబుగను నున్న కఫజలింగనాశ మనంబడును. అన్నిరంగులును గల్గియుండిన సన్నిపాతజలింగనాశ మనంబడును. దృష్టిమండలము ఎఱ్ఱగనుండిన రక్తజలింగనాశ మనంబడును. దృష్టి పచ్చగను, ఎఱ్ఱగను నుండిన సంసర్గజలింగనాశ మనంబడును. ఉపసర్గజలింగనాశము కారణజము నిష్కారణజము అన ద్వివిధంబు. విషసంబంధము గల పుష్పాదుల నాఘ్రాణించుటచే కండ్లు కానిపింపకపోయిన నయ్యది కారణజము. దేవర్షిగంధర్వాదివీక్షణంబుచే గల్గినది నిష్కారణజము అని యెఱుంగునది.

### దృష్టిరోగవివరణము.

అష్టధా దృష్టిరోగాస్స్యుస్తేషు పిత్తవిదగ్ధకమ్. 166
అమ్లపిత్తం విదగ్ధం చ తథైవోష్ణవిదగ్ధకం,
నకులాంధ్యం ధూమరాంధ్యం రాత్ర్యాంధ్యం హ్రస్వదృష్టికః.
గంభీరదృష్టిరిత్యేతే రోగా దృష్టిగతా మతాః,

దృష్టిరోగములు.—పిత్తవిదగ్ధము, అమ్లపిత్తవిదగ్ధము, ఉష్ణవిదగ్ధము, నకులాంధ్యము, ధూమరాంధ్యము, రాత్ర్యాంధ్యము, హ్రస్వదృష్టి, గంభీరదృష్టి అన నెనిమిదివిధంబులుగ నుండును. నేత్రములలోని నల్లగ్రుడ్డులో చిఱుసెనగబద్దయంత పరిమాణముగల్గి పంచభూతాత్మకమైన దృష్టియుండును. ఆదృష్టియందు నాలుగుపటలము లుండును. ఆనాల్గుపటలములలో పైపటలము తేజోజలంబుల నాశ్రయించి యుండును. రెండవపటలము మాంసము నాశ్రయించి యుండును. మూడవపటలము మేదస్సు నాశ్రయించియుండును. నాల్గవపటలము అస్థి నాశ్రయించి యుండును. ఈపటలంబులలో నొక్కొకటి దృష్టియొక్క ఐదవభాగము పరిమాణము గల్గియుండును. అట్టిదృష్టియందు గల్గురోగంబులు దృష్టిరోగంబు లనంబడును. పిత్తప్రకోపంబుచే దృష్టి పచ్చగనుండును. దానంజేసి అట్టి మనుజుఁడు పదార్థములనన్నింటిని పచ్చగాఁజూచును. ఈవ్యాధి నేత్రములయందలి మూఁ

డవపటలమున నాశ్రయించియుండునపుడు పగటియందు కన్నులు గానరాకుండును. రాత్రియందు శీతముచే పిత్తము శాంతినొందుటచే కొంచము స్వస్థతనొంది పదార్థంబులం జూచును. ఇయ్యది పిత్తవిదగ్ధ మనంబడును. పైఁజెప్పఁబడిన పిత్తవిదగ్ధరోగంబున అమ్లపిత్తరోగంబున చెప్పఁబడిన లక్షణములు గానంబడిన నయ్యది అవస్థాభేదంబుచే అమ్లపిత్తవిదగ్ధ మనంబడును. ఉష్ణాధిక్యముచే కన్నులు పగటిపూటఁ గానరాక రాత్రియందు చక్కఁగా గానవచ్చిన నయ్యది ఉష్ణవిదగ్ధ మనంబడును. వాతాదిదోషంబులచే దుష్టంబైన దృష్టి ముంగిస కన్నులువోలె చిత్రవర్ణంబై పగటియందు సమస్తవస్తువులు చిత్రాకారంబుగ గానంబడిన నయ్యది నకులాంధ్య మనంబడును. దుఃఖము, జ్వరము, దేహపరిశ్రమ, శిరస్తాపము, ఈకారణంబులచే పిత్తము ప్రకోపమునొంది దృష్టిని చెఱచును. దానంజేసి సమస్త వస్తుసముదాయము పొగగ్రమ్మినట్లు గానంబడును, ఇయ్యది ధూమశాంధ్య మనంబడును. ప్రకోపమునొందిన శ్లేష్మముచే దృష్టి దుష్టంబై పదార్థములన్నియు తెల్లగఁ గానంబడును. అట్టికఫము నేత్రముల మూఁడవపటలము నాశ్రయించియుండునపుడు పగలు సూర్యకిరణసంతాపముచే కఫము విలీనంబగుటచే కన్నులు గానంబడును. రాత్రియందు శైత్యముచే కఫము సాంద్రంబగుట కన్నులు గానరాకుండును, ఇయ్యది రాత్ర్యాంధ్య మనంబడును. దృష్టిమధ్యగతం బగుదోషంబుచే పగటియందు మిగుల గొప్పవిగానుండువస్తువులు సయితము చిన్నవిగాఁ గానంబడును. ఇయ్యది హ్రస్వదృష్టియనంబడును. దృష్టివాతముచే వికృతంబై లోపలనే యణంగి అంతర్భాగమున బాధగలిగించును. ఇయ్యది గంభీరదృష్టి యనంబడును. ఇయ్యది దృష్టియందలి నాల్గవపటలము నాశ్రయించియు వాతముచే జనించుటంజేసి యసాధ్యము. ఇయ్యవి దృష్టిరోగంబులు.

## అభిష్యందరోగవివరణము.

అభిష్యందాశ్చ చత్వారో రక్తాద్దోషైస్త్రిభిస్తథా. 168

అభిష్యందరోగము.— వాత, పిత్త, కఫ రక్తములచే నుత్పన్నంబై నాలుగు విధంబులు. ఈ యభిష్యందరోగము సాధారణముగా నేత్రరోగంబులకన్నిటికిని కారణంబగుటంజేసి మిగుల కఠినమైయుండును. అందు కన్నులయందు సూదులం బొడిచినట్లుండుట, జడముగనుండుట, రోమాంచము, కన్నులు మిరమిరలాడుట, పరుషముగనుండుట, తలనొప్పి, చల్లనినీరుగారుట, ఈ లక్షణంబులుగల్గిన వాతాభిష్యంద మనంబడును. కన్నులయందు మంటగల్గి పుండగుట, చలవగోరుట, పొగలు వెడలునట్లుండుట, వెచ్చని నీరుగాఱుట, కన్నులు పచ్చగనుండుట, ఈలక్షణంబులు గలిగిన పిత్తాభిష్యంద మనంబడును. ఉష్ణస్పర్శంబునుగోరుట, కన్నులు బరువుగానుండుట, ఱెప్పలయందు వాపు

జనించుట, దురదపుట్టుట, పిచ్ఛిలంబైన కన్నీరుగారుట, ఈ లక్షణంబులు గానంబడిన కఫాభిష్యంద మనంబడును. కన్నులు రక్తవర్ణంబులై రక్తమైన నాడులు వ్యాపించి ఎఱ్ఱని నీరు స్రవించుచుండిన నయ్యది రక్తాభిష్యంద మనంబడును.

## అధిమంథరోగవివరణము.

చత్వారశ్చాధిమంథాస్స్యుర్వాతపిత్తకఫాసృజః,

పైజెప్పిన అభిష్యందమును చికిత్సజేయక ఉపేక్షించినచో నానాఁట వృద్ధినొంది వాతాభిష్యందముచే వాతాధిమంథము, పిత్తాభిష్యందముచే పిత్తాధిమంథము, కఫాభిష్యందముచే కఫాధిమంథము, రక్తాభిష్యందముచే రక్తాధిమంథము జనించును. ఈయధిమంథములయందు తీవ్రమైన బాధకల్గును. కన్నులు పెకలించువిధంబుననుండి శిరస్సునందు సగపాలు మిక్కుటమైనవేదన గల్గియుండును. శ్లేష్మాధిమంథమున నేడుదినములకు దృష్టి నశించును. రక్తాధిమంథమున నైదుదినములకు దృష్టి నశించును. వాతాధిమంథమున నాఱుదినములలో దృష్టి నశించును. పిత్తాధిమంథమున తత్కాలము దృష్టి నశించును.

## సర్వాక్షిరోగవివరణము.

సర్వాక్షిరోగాశ్చాష్టౌ స్యుస్తేషు వాతవిపర్యయః. 169
అల్ప శోఫోఽన్యతో వాతస్తథా పాకాత్యయః స్మృతః,
శుష్కాక్షిపాకశ్చ తథా శోఫోఽధ్యుషిత ఏవ చ. 170
హతాధిమంథ ఇత్యేతే రోగాస్సర్వాక్షిసంభవాః,

కండ్లయందంతటను గల్గురోగములు.—వాతవిపర్యయము, అల్పశోఫము, అన్యతోవాతము, పాకాత్యయము, శుష్కాక్షిపాకము, శోఫము, అధ్యుషితము, వాతాధిమంథము - అన నెనిమిదివిధంబులు. పెడతల, చెవులు, శిరస్సు, అంకిళ్లు, పెడతలయందలి నరము—వీనియందు వాతము ప్రకుపితంబై కనుబొమలయందైనను, కన్నులయందైనను బాధను గలిగించును. పిమ్మట కన్నులయందు నొప్పి, పోటు గలుగును. ఇయ్యది అన్యతోవాత మనంబడును. వాతము ప్రకోపమునొంది ఒకపుడు కనుబొమ్మలయందును, ఒకపుడు కన్నులయందును, మిగుల తీవ్రంబైన పోటుగల్గించును. ఇయ్యది వాతవిపర్యయ మనంబడును. నేత్రములయందు దురదయు, దుర్మాంసంబును, పండిన మేడిపండువంటిరంగు గలిగిన వాపుజనించి పుండైయుండిన అల్పశోఫ మనంబడును. దోషప్రకోపంబుచే నేత్రములు పొగగమ్మినట్లుండి నల్లగ్రుడ్డు తెల్లబాఱి వేదన గల్గించుచుండిన నయ్యది పాకాత్యయ మనంబడును. కన్నులు మూయునపుడు కనుఱెప్పలు రూక్షంబులై కఠినంబులైయున్నను, చూచుటకు శక్యముగాక నొప్పిగల్గియుండినను, అయ్యది శుష్కాక్షిపాక మనంబడును. కండ్లయందు వాపుజనించి దురద, స్రావము గలిగిన నయ్యది శోఫ

మనంబడును. ఉష్ణపదార్థములను భుజించుటచే నేత్రములు శ్యామవర్ణంబై, ఎఱ్ఱనిసిరలు వ్యాపించి వాపు, స్రావముగలిగి పాకమునొందిన నయ్యది అధ్యుషిత మనంబడును. వాతముచేజనించిన అధిమంథమును చికిత్సజేయక ఉపేక్షించినయెడల తీక్ష్ణమైనపోటు, నొప్పి మొదలగుబాధ జనించి దృష్టిఁజెరిచి నేత్రమును నశింపఁజేయును. ఇయ్యది వాతాధిమంథ మనంబడును. ఇది నేత్రరోగ వివరణము.

## షండరోగము.

పుంస్త్వదోషాస్తు పంచైవ ప్రోక్తాస్తత్రేర్ష్యకస్మృతః. 171
ఆసేక్యశ్చైవ కుంభీకస్సుగంధిష్షండసంజ్ఞికః,

పుంస్త్వదోషంబులు, ఈర్ష్యకము, ఆసేక్యము, కుంభీకము, సుగంధి, షండకము- అని ఐదువిధంబులు. వీని లక్షణంబులను ఇచ్చట వివరించుట యనవసరము గాన సుశ్రుత శారీరస్థానమున చూడందగును.

## శుక్రదోషవివరణము

శుక్రదోషాస్తథాష్టౌ స్యుర్వాతాత్పిత్తాత్కఫేన చ. 172
కుణపం చాస్రపిత్తాభ్యాం పూయాభం శ్లేష్మపిత్తతః,
క్షీణం చ వాతపిత్తాభ్యాం గ్రంథిలం శ్లేష్మవాతతః. 173
మలాభం సన్నిపాతాశ్చ శుక్రదోషా ఇతీరితాః,

పురుషునియొక్క శుక్రమునందలి రోగములు ఎనిమిదివిధంబులు. అందు వాతజ శుక్రదోషము, పిత్తజశుక్రదోషము, శ్లేష్మజశుక్రదోషము కుణపము (ఇది రక్త పిత్త సంయోగముచే జనించును.) పూయాభము (ఇయ్యది శ్లేష్మపిత్త సంయోగముచే జనించును.) క్షీణము (ఇది వాతపిత్త సంయోగంబుచే జనించును.) గ్రంథిలము (ఇది శ్లేష్మవాతసంయోగంబుచే జనించును.) మలాభము (ఇది సన్నిపాతంబుచే జనించును.) వీని లక్షణంబులను ప్రత్యేకముగా సుశ్రుతంబున జూడందగును.

## స్త్రీరోగాంతర్గతార్తవదోషము.

అథ స్త్రీరోగనామాని ప్రోచ్యంతే పూర్వశాస్త్రతః. 174
అష్టావార్తవదోషాస్స్యుర్వాతపిత్తకఫైస్త్రిధా,
పూయాభం కుణపం గ్రంథిః క్షీణం మలసమం తథా.

స్త్రీలయొక్క ఆర్తవదోషంబులు ఎనిమిది విధంబులు. వాతజ, పిత్తజ, శ్లేష్మజ, పూయాభ, కుణప, గ్రంథిక్షీణ, మలసమము లనుపేరం బరఁగు. ఇయ్యవి క్రమముగా శుక్రదోషంబున చెప్పఁబడిన దోషంబులచేఁ బుట్టును.

### ప్రదరరోగవివరణము.

తథా చ రక్తప్రదరం చతుర్విధముదాహృతం,
వాతపిత్తకఫైస్త్రేధా చతుర్థం సన్నిపాతతః, 176

ప్రదరరోగము.—వాత, పిత్త, కఫ, సన్నిపాతంబులచే నుత్పన్నంబై నాల్గు విధంబులు. పరస్పరవిరుద్ధపదార్థములను సేవించుట, మద్యపానము చేయుట, జీర్ణము కాకుండునపుడు భుజించుట, గర్భస్రావము గలుగుట, అధికసంభోగము చేయుట, ఉపవాసాదులచే ధాతువు క్షీణించుట, పగటియందు నిదురించుట, ఈకారణంబుల వాతాది దోషములు ప్రకోపమునొంది ప్రదరరోగమును గలిగించును. యోనిమార్గమునుండి రక్తము అధికముగ స్రవించుట, ఒడలినొప్పులు, శూలము, దౌర్బల్యము, ఒడలుతిరుగుట, మూర్ఛ దప్పి, పాండుత్వము ఇయ్యవి ప్రదరరోగంబునం గల్గు సామాన్యలక్షణంబులు. అరుణ వర్ణముగలిగి రూక్షంబై నురుగుతో గూడి మాంసముకలిగిన నీటివలెనుండు రక్తము స్రవించు చుండిన నయ్యది వాతప్రదర మనంబడును. పచ్చగగాని, నల్లగగాని, ఎఱ్ఱగగాని యుండి యుష్ణంబై పిత్తజనిత బాధలం గల్గియుండిన నయ్యది పిత్తజప్రదర మనం బడును. పక్వముగానిరసముతో గూడి బూరుగబంకవలె పాండరమై స్రవించుచుండిన నయ్యది కఫప్రదర మనంబడును. తేనె, నేయి, హారిదళము - వీనిచాయగల్గి మజ్జిగవలె చిక్కగను, పీనుఁగువలె దుర్గంధముగను, రక్తము స్రవించుచుండిన నయ్యది సన్నిపాత ప్రదర మనంబడును.

### యోనిరోగవివరణము.

వింశతిర్వ్యోనిరోగాస్స్యుర్వాతాత్పిత్తాత్కఫాదపి,
సన్నిపాతాచ్చ రక్తాచ్చ లోహితక్షయత స్తథా. 177
శుష్కా చ వామినీచైవ షండితాఽంతర్ముఖీ తథా,
సూచీముఖీ విప్లుతా చ జాతఘ్నీ చ పరిప్లుతా. 178
ఉపప్లుతా ప్రాక్చరణా మహాయోనిశ్చ కర్ణినీ,
స్యాన్నందా చాతిచరణా యోనిరోగా ఇతీరితాః. 179

స్త్రీలకు యోనియందుఁ గల్గురోగంబులు - వాత, పిత్త, కఫ, సన్నిపాత, రక్తములచే నుత్పన్నంబై యైదువిధంబులును, రక్తక్షయ, శుష్క, వామిని, షండిత, అంతర్ముఖి, సూచీముఖి, విప్లుత, జాతఘ్ని, పరిప్లుత, ఉపప్లుత, ప్రాక్చరణ, మహాయోని, కర్ణిని, నంద, అతిచరణ అనునామంబులచే పదునైదువిధంబులును కలిసి ఇరువది విధంబులు. వాత ప్రకోపముచే యోని కర్కశంబై కఠినంబుగనుండి వాతబాధలం గలిగియుండును. ఇయ్యది వాతయోని యనంబడును. పిత్తప్రకోపంబుచే యోనియందు తాపము, పాకము,

జ్వరముకల్గిన నయ్యది పిత్తయోని యనంబడును. కఫము ప్రకోపమునొందిన యోని యందు దురదను గల్గించును. మఱియు నాయోని పిచ్ఛిలంబై చల్లనై యుండును. ఇయ్యది కఫదుష్టయోని యనంబడును. త్రిదోషముల లక్షణంబులు గానంబడిన నయ్యది సన్నిపాత దుష్టయోని యనంబడును. పిత్తలక్షణంబులు గలిగి రక్తస్రావముగల్గిన నయ్యది రక్తదుష్టయోని యనంబడును. రక్తము అధికముగ స్రవించుటచేత యోనియందు మంటగలిగి రక్తము నశించును. ఇయ్యది లోహితక్షయ మనంబడును. వాత ప్రకోపంబుచే యోని ఎండిపోయి ముడుచుకొనిపోయిన నయ్యది శుష్క యనంబడును. వాతప్రకోపముచే శుక్రము గర్భకోశంబున నిలువక రక్తముతోడ బైటికివచ్చిన నయ్యది వామిని యనంబడును. ఋతుమతిగాక స్తనములు జనింపకుండి సంభోగకాలమున యోని మిగుల కర్కశమైయుండిన నయ్యది షండిక యనంబడును. యోనిద్వారము మిగుల సూక్ష్మంబుగనున్న సూచీముఖి యనంబడును. యోనియందు ఎల్లపుడును వాతవేదనలు గలిగియుండిన నయ్యది విప్లుత యనంబడును. సంభోగము చేయునపుడు యోనియందు మిగుల బాధజనించిన నయ్యది పరిప్లుత యనంబడును. యోనిద్వారమునుండి నురుగుతోగూడిన రజస్సు మిగుల కష్టముచే వెడలిన నయ్యది ఉపప్లుత యనంబడును. వాతముచే పీడితంబై మిగుల కష్టముగ స్రవించునదియైన అంతర్ముఖి యనంబడును. గర్భము పలుమాఱు నిలచి జాఱిపోవుచునుండిన నయ్యది జాతఘ్ని యనంబడును. స్త్రీ మైథునక్రియనుండి పురుషునికంటె ముందు విరమింపకున్న నయ్యది ప్రాక్చరణ యనంబడును. పురుషునికంటె మైథునేచ్ఛ ఎక్కువగా గలిగియుండిన అతిచరణ యనంబడును. యోనిద్వారము మిగుల విశాలమైయున్న మహాయోని యనంబడును. యోని మధ్యంబున కఫరక్తములచే గ్రంథి జనించిన నయ్యది కర్ణిక యనంబడును. మైథునముచే సంతోషము కల్గకున్న నయ్యది నంద యనంబడును.

### యోనికందరోగము, గర్భజరోగము—వీనివివరణము.

చతుర్విధం యోనికందం వాతపిత్తకఫైస్త్రిధా,
చతుర్థం సన్నిపాతేన తథాష్టౌ గర్భజా గదాః. 180
ఉపవిష్టకగర్భస్స్యాత్తథా నాగోదరస్స్మృతః,
మక్కల్లో మూఢగర్భశ్చ విష్టంభో గూఢగర్భకః. 181
జరాయుదోషో గర్భస్య పాతశ్చాష్టమకస్స్మృతః,

యోనికందరోగము.—వాత, పిత్త, కఫ, సన్నిపాతంబులచే నుత్పన్నంబై నాలుగు విధములు. గర్భరోగంబులు-ఉపవిష్టకగర్భము, నాగోదరము, మక్కల్లము, మూఢగర్భము, విష్టంభము, గూఢగర్భము, జరాయుదోషము, గర్భపాతము-అన నెనిమిదివిధంబులు. పగటి

యందు నిదురించుట, అతిక్రోధము, దేహపరిశ్రమ, అధికసంభోగము, గోళ్లు, దంతములు- వీనిచే గాయములు తగులుట, ఈకారణంబులచే వాతాదిదోషములు ప్రకుపితంబులై చీము, నెత్తురు, వీనితోఁగూడియుండు గజనిమ్మకాయంబోలిన గడ్డను యోనియందు జనింపఁజేయును. ఇయ్యది యోనికంద మనంబడును. అందు రూక్షంబై వికృతంబై పగిలియున్న వాతికమనియు, మంట, జ్వరము, ఎఱ్ఱనివర్ణంబును గలిగియున్న పైత్తికమనియు, నల్ల అగిసెపువ్వుంబోలి దురదగల్గిన శ్లైష్మికమనియు, త్రిదోషలక్షణంబులుఁగల్గిన సాన్నిపాతికమనియుఁ దెలియందగును. గర్భధారణానంతరమున ఉష్ణపదార్థములను భుజించుటచే రక్తస్రావముగలిగి గర్భము వృద్ధిజెందకయున్న నయ్యది ఉపవిష్టకగర్భ మనంబడును. శుక్రార్తవసంయోగమున వాతము ప్రకోపమునొంది సర్పాకారముగ గర్భాశయమునకు బోవును. దానంజేసి గర్భము ఒకానొకప్పుడు పతనంబగుటయు, లోన జీర్ణంబగుటయు సంభవించును. ఇయ్యది నాగోదర మనంబడును. గర్భిణియై యుండునపుడుగాని, ప్రసవించినపిమ్మటగాని, స్త్రీకి శూలముజనించి యద్దానిచే మరణము గలుగును. అయ్యది మక్కల్లరోగ మనంబడును. ప్రసవకాలమున వాతప్రకోపంబుచే నియమితమార్గమున శిశువు జనింపక యనేకవిధములైన బాధల గల్గించును. ఇయ్యది మూఢగర్భ మనంబడును. గర్భిణిస్త్రీ రూక్షాదిపదార్థములను భుజించుటచేత వాతము ప్రకోపంబునొందును. దానంజేసి శరీరము శుష్కంబై బలము నశించి గర్భపాతముగాని, గర్భమువృద్ధిజెందకుండుటగాని సంభవించును. ఇయ్యది విష్టంభ మనంబడును. మొదట గర్భధారణమై పిమ్మట నాగర్భము లోన జీర్ణంబైన నయ్యది గూఢగర్భ మనంబడును. గర్భాశయంబున శిశువుం జుట్టుకొని యున్న జరాయువు దుష్టంబై శిశువునకు వికారంబుగలిగించిన నయ్యది జరాయుదోష మనంబడును. దుష్టపదార్థసేవచే గర్భము బతనంబైన నయ్యది గర్భపాత మనంబడును.

### స్తనరోగము, స్త్రీదోషము, బాలింతరోగము - వీనివివరణము.

పంచైవ స్తనరోగాస్స్యుర్వాతాత్పిత్తాత్కఫాదపి. 182
సన్నిపాతాత్క్షతాచ్చైవ తథా స్తనోద్భవా గదాః,
బాలరోగేషు కథితా స్త్రీదోషాశ్చ త్రయస్స్మృతాః. 183
అదక్షపురుషోత్పన్నస్సక్త్నివిహిత స్తథా,
దైవాజ్జాత స్తృతీయస్తు తథా యే సూతికాగదాః. 184
జ్వరాదయశ్చికిత్స్యాస్తే యథాదోషం యథాబలం,

స్తనరోగంబులు - వాత, పిత్త, కఫ, సన్నిపాత, క్షతములచే నుత్పన్నంబై యైదు విధములు. స్తన్య (పాలు) దోషంబులుగూడ వాత, పిత్త, కఫ, సన్నిపాత, క్షతములచే నుత్పన్నంబులై యైదువిధంబులు. స్త్రీదోషంబులు అదక్షపురుషోత్పన్నము,

సపత్నీవిహితము, దైవాజ్ఞాతము అన మూడువిధంబులు. మఱియు బాలింతలకుఁ గలుగు సూతికాజ్వరాదులకు దోషబలానుసారంబుగ చికిత్సచేయందగును. వాతాదిదోషములు ప్రకుపితంబులై స్తనముల నాశ్రయించి రక్తమాంసములం జేరిచి స్తనరోగంబులఁ గలిగించును. ఇయ్యవి యైదును బాహ్యవిద్రధితో సమానమైన లక్షణంబులు గలిగియున్నవి గాన దానింబోలె యెఱుఁగునది, సంభోగముచేయ శక్తిలేనిపురుషునితో సంభోగించుటచే స్త్రీసంతాపము నొందును. అందుచే గలుగురోగము అదక్షపురుషోత్పన్నమనంబడును. తనభర్తకు రెండవస్త్రీయందు ప్రేమయుండుటచే తనకు గలిగెడిసంతాపముచేఁ బుట్టు రోగము సపత్నీవిహిత మనంబడును. దురదృష్టముచేఁగలుఁగురోగము దైవాజ్ఞాత మనంబడును. అజీర్ణకరపదార్థమును భుజించుటచేత వాతాదులు ప్రకోపమునొంది తల్లియొక్క స్తనములయందలి పాలను దూషించును. దానంజేసి బాలురకు నానావిధంబులగు రోగంబులుజనించును.అందు కషాయరసముగల్గి నీటిలోవైచిన తేలుచుండినచో వాతదుష్టంబనియు, చేదును, పులుసునుగల్గి ఉష్ణమైనీటిలో వైచిన పచ్చనిరేఖలు తేలుచుండిన పిత్తదుష్టంబనియు, మిక్కిలిచిక్కనై జిడ్డుగలిగి నీటిలోవైచిన చీమునిండిన నయ్యది కఫదుష్టంబనియు, ద్విదోషలక్షణంబులుగలిగిన ద్విదోషజంబనియు, త్రిదోషలక్షణంబులు గానంబడిన త్రిదోషజంబనియుఁ దెలియందగును.

## బాలరోగవివరణము.

ద్వావింశతిర్బాలరోగాస్తేషు క్షీరభవాస్త్రయః. 185
వాతాత్పిత్తాత్కఫాచ్చైవ దంతోద్భేదశ్చతుర్థకః,
దంతఘాతో దంతశబ్దోఽకాలదంతోఽహిపూతనమ్. 186
ముఖపాకో ముఖస్రావో గుదపాకోపశీర్షకే,
పద్మారుణస్తాలుకంఠో విచ్ఛిన్నం పరిగర్భికః. 187
దౌర్బల్యం గాత్రశోషశ్చ శయ్యామూత్రం కుకూనకః,
రోదనం చాజగల్లీ స్యాదితి ద్వావింశతిస్స్మృతాః. 188

తా. బాలరోగంబులు - వాతజ, పిత్తజములు, కఫజము, ఇవి పాలదోషంబుచే గల్గును. దంతోద్భేదము, దంతఘాతము, దంతశబ్దము, కాలదంతము, అహిపూతనము, ముఖపాకము, ముఖస్రావము, గుదశీర్షకము, ఉపశీర్షకము, పద్మారుణము తాలుకంఠము, విచ్ఛిన్నము, పారిగర్భికము, దౌర్బల్యము, గాత్రసాదము, శయ్యామూత్రము, కుకూనకము, రోదనము, అజగల్లి అన నిరువదిరెండు విధంబులు. వాతదుష్టంబగు స్తన్యము త్రావిన శిశువునకు కంఠస్వరమునశించుట, శరీరము కృశించుట, మలమూత్రబంధము ఈలక్షణంబులు చూపట్టును. పిత్తదుష్టమగు స్తన్యముచే శిశువునకు చెమ్మటబట్టుట, మలము

శుష్కంబై ఖండఖండములుగా వెడలుట, కామలారోగము, దప్పి, శరీరము ఉష్ణమై యుండుట ఈలక్షణంబులు చూపట్టును. కఫదుష్టంబగు స్తన్యంబుచే జొల్లుగాఱుట, అతినిద్ర, మాంద్యము, కన్నులువాచుట, త్రాగినపాలు కక్కుట ఈలక్షణంబులు గానంబడును. శిశువులకు దంతములు పుట్టునపుడు జ్వరము, వాంతి, విరేచనము, దగ్గు, తలనొప్పి ఈచిహ్నంబులు గానంబడును. అయ్యది దంతోద్భేదమనంబడు. బాలురకు ౫, ౭, ౮ వత్సరంబులందు దంతములూడునపుడు జ్వరము, వాంతి మొదలగుచిహ్నంబులు చూపట్టును. అయ్యది దంతఘాత మనంబడును. బాలుఁడు నిద్రించునపుడు దంతములను పటపట గొఱుకును. ఇయ్యది దంతశబ్దమనంబడును. శిశువులకు పండ్లుడూడుటకు నియమింపఁబడిన కాలమునకు పూర్వమే దంతములూడి జ్వరాద్యుపద్రవంబులు జనించును. అయ్యది అకాలదంత మనంబడును. శిశువులు మలమూత్రములను విసర్జించినపిమ్మట నాగుదస్థానమును కడిగి శుభ్రపఱుపకుండిన నచ్చట దురదపుట్టి గోకిన పుండగును. అయ్యది అహిపూతన మనంబడును. శిశువులనోటియందు వాపుజనించి యయ్యది పాకమునొందిన ముఖపాక మనంబడును. శిశువుల నోటనుండి అధికముగా జొల్లుకాఱుచుండిన నయ్యది ముఖస్రావ మనంబడును. శిశువుల గుదంబున వాపు జనించి పాకమునొందిన నయ్యది "గుదపాక" మనంబడును. బాలుర శిరంబుపై వాపుగల్గి జ్వరాదులం గలిగించిన నయ్యది "ఉపశీర్షక" మనంబడును. శిశువుయొక్క వస్తియందును శిరంబునందును గడ్డలేచిన ప్రాణహరంబై యుండును. అవి ఎఱ్ఱదామరరేకువలె రక్తవర్ణంబై యున్న యెడ మహాపద్మంబని చెప్పఁబడును. ఇయ్యది దోషత్రయప్రకోపంబుచే జనించును. అందు శిరంబున జనించినది కణతనుండి హృదయంబునకు జేరును. వస్తియందు జనించినది హృదయముఁ జేరి అచ్చటనుండి మరల గుదంబునకుఁ జేరును. ఇయ్యది "పద్మారుణ"మనంబడును. శ్లేష్మప్రకోపంబుచే శిశువుయొక్క తాలువునందును, మాంసమునందును గుంతపడియుండును. ఈవ్యాధియందు తాలువులు పడినట్లుండును. స్తన్యపానమునం దిచ్ఛలేక యుండును. మిగుల కష్టముచే పాలుఁద్రావును. మలము ద్రవయుక్తంబై యుండును. కన్నులయందు కంఠమునందు నొప్పి గల్గును. మెడనిలువక వ్రేలఁబడియుండును, వాంతియగును. ఇయ్యది విచ్ఛిన్న మనంబడును. శిశువులదవుడలయందు గరగరలాడుపళ్లముపడిన నయ్యది తాలుకంఠ మనంబడును. గర్భవతియై యున్నతల్లియొక్క స్తన్యమును శిశువు తఱచుగ ద్రావినచో అగ్నిమాంద్యము, వాంతి, కునికిపాటు, చిక్కుట, అరోచకము, భ్రమము, కడుపు పెరుగుట ఈలక్షణంబులు పుట్టును. ఇయ్యది పారిగర్భిక మనంబడును. శిశువులయొక్క ధాతువులకు పోషణములేనిచో శరీరము దుర్బలంబగును. ఇయ్యది దౌర్బల్యమనంబడును. దోషాధిక్యముచే శరీరము కృశించిన నయ్యది గాత్రశోష

మనంబడును. వాతదోషంబుచే శిశువు ప్రక్కమీఁదనే మూత్రమును పలుమాఱువిడుచుట శయ్యామూత్రము అనంబడును. శిశువులయొక్క కన్నులు దురదగలిగి కన్నీరు పలుమాఱు గార్చుచుండును. దానంజేసి శిశువునుదురు, కన్నులు, నాసికలు వీనిని మాటిమాటికి నలుచుచుండును. సూర్యకాంతిం జూచుటకును, కనుఱెప్పల నెత్తుటకును సమర్థుఁడుగాకుండును. ఇయ్యది కుకూనక మనంబడును. శిశువు ఎల్లప్పుడు ఏడ్చుచుండుట 'రోదన' మనంబడును. శ్లేష్మవాత ప్రకోపంబుచే శరీరమున పెసరవిత్తులవంటి పొక్కులు పుట్టి వేదనం గలుగఁజేయుచు శరీరమును వైవర్ణ్యముగాఁ జేసిన నయ్యది "అజగల్లిక" యనంబడును.

## బాలగ్రహవివరణము.

తథా బాలగ్రహాః ఖ్యాతా ద్వాదశైవ మునీశ్వరైః,
స్కందగ్రహో విశాఖస్స్యాత్స్వగ్రహాశ్చ పితృగ్రహః. 189
నైగమేయగ్రహా స్తద్వచ్ఛకునిశ్శీతపూతనా,
ముఖమండినికా తద్వత్పూతనా చాంధపూతనా. 190
రేవతీ చైవ సంఖ్యాతా తథా స్యాచ్ఛుష్కరేవతీ,

బాలురకు గ్రహావేశముచే జనించురోగములు - స్కందగ్రహము, విశాఖగ్రహము, స్వగ్రహము, పితృగ్రహము, నైగమేయగ్రహము, శకునిగ్రహము, శీతపూతనాగ్రహము, ముఖమండినికాగ్రహము, పూతనాగ్రహము, అంధపూతనాగ్రహము, రేవతీగ్రహము, శుష్కరేవతీగ్రహము-అన పదిరెండువిధములు. వీని లక్షణంబులను తంత్రాంతరంబులందు సవిస్తరముగా చూడందగును.

## అనుక్తరోగసంగ్రహము.

తథా చరణభేదాస్తు వాతరక్తాదికాశ్చ యే. 191
ద్విచత్వారింశదుక్తాస్తే రోగేష్వేవ మునీశ్వరైః,

పాదసంబంధమైన రోగంబులు అతిరిక్తము పూర్వాచార్యులచే నలుబదిరెండు చెప్పబడియుండినవి. అయ్యవి పూర్వము శ్లీపదాదిరోగంబులయందు వివరింపఁబడియుండినవి గాన ప్రత్యేకముగా వివరింపఁబడియుండలేదు.

ద్విషష్టిర్దోషభేదాస్స్యుస్సన్నిపాతాదికాశ్చ యే. 192
తేఽపి రోగేషు గణితాః పృథక్ప్రోక్తా న తే క్వచిత్,

సన్నిపాతము మొదలైనరోగములు అఱువదిరెండు ప్రత్యేకముగా చెప్పఁబడియుండినను రోగంబులయందు గణింపఁబడియుండినవి గాన ప్రత్యేకముగా వివరింపఁబడియుండలేదు.

### అపథ్యజనితరోగములు.

హీనమిథ్యాతియోగానాం భేదైః పంచదశోదితాః. 19
పంచకర్మభవా రోగా రోగేష్వేవ ప్రకీర్తితాః,

వమనము, విరేచనము, అనువాసనము, నిరూహము, నస్యము-వీనియొక్క హీన మిథ్యాతియోగంబులచే పదుమైదురోగంబులు జనించును. ఇవియు రోగంబులయంద వివరింపఁబడియే యుండెను.

స్నేహస్వేదౌ తథా ధూమో గండూషోఽంజనతర్పణే. 19
అష్టాదశైవ తాః పీడాస్తాశ్చ రోగేషు లక్షితాః,

స్నేహకర్మము, స్వేదకర్మము, ధూమపానము, గండూషము, అంజనము, తర్పణము వీనియొక్క హీనమిథ్యాతియోగంబులచే పదునెనిమిదిరోగంబులు జనించును ఇయ్యవికూడ రోగంబులందు వివరింపఁ బడియుండెను.

### శీతాదులచేఁ గలుగు నుపద్రవముల వివరణము.

శీతోపద్రవ ఏకస్స్యాదేకశ్చోష్ణోద్భవో మతః. 19
శల్యోపద్రవకశ్చ క్షారశ్చైకస్స్మృతస్తథా,

చలిచేఁ గలఁగుబాధ శీతోపద్రవమనియు, వేఁడిచేఁగలుగుపీడ ఉష్ణోపద్రవమనియు, గోళ్లు, వెండ్రుకలు, ఱాళ్లు, ముండ్లు, ఎముకలు, కొమ్ము మొదలైనవి శరీరంబుప్రవేశించుటచే గల్గు నుపద్రవములు శల్యోపద్రవము లనంబడును. క్షారకర్మముచే జనించు రోగంబులు క్షారోపద్రవము లనియు చెప్పఁబడును.

### విషరోగవివరణము.

స్థావరం జంగమం చైవ కృత్రిమం చ త్రిధా విషమ్. 19
తేషాం చ కాలకూటాద్యైర్నవధా స్థావరం విషం,
జంగమం బహుధా ప్రోక్తం తత్ర లూతా భుజంగమాః.
వృశ్చికా మూషికాః కీటాః ప్రత్యేకం తు చతుర్విధాః,
దంష్ట్రావిషం నఖవిషం వాలశృంగాస్థిభిస్తథా. 19
మూత్రాత్పురీషాచ్ఛుక్రాచ్చ దృష్టేర్నిశ్వాసతస్తథా,
లాలాయాః స్పర్శతస్తద్వత్తథా శంకావిషమ్మతమ్. 19
కృత్రిమం ద్వివిధం ప్రోక్తం గరదూషీవిభేదతః,

స్థావరము, జంగమము, కృత్రిమము అన విషములు త్రివిధంబులు. అందు కాలకూటము మొదలైన తొమ్మిది స్థావరవిషంబులు. సాలెపురుగు, పాములు, తేళ్లు, ఎలుకలు, పురుగులు వీనియొక్క విషము జంగమవిష మనంబడును. ఈజంగమవిషము నాలుగు విధంబులు. దంష్ట్రావిషము (కోఱలయందుండువిషము), నఖవిషము (గోళ్లయందుండు విషము), వాలవిషము (వెండ్రుకలయందువిషము), శృంగవిషము (కొమ్ములయందుండు విషము), అస్థివిషము (ఎముకలయందుండువిషము), మూత్రవిషము (మూత్రమునందుండువిషము), పురీషవిషము (మలమునందుండువిషము), శుక్రవిషము (శుక్రమునందుండువిషము), దృష్టివిషము (చూపునందుండువిషము), నిశ్వాసవిషము (నిట్టూరుపునందుండువిషము), లాలా (జొల్లు)విషము, స్పర్శవిషము, శంకా (తనకు మనంబున విషముతగిలినదని యనుమానంబుచే గల్గురోగంబులు.) విషము. ఇయ్యవి ఆయా జంతువుల యొక్క భేదంబును బట్టి యాయాప్రదేశంబుల నుండును. అకృత్రిమవిషము-గరవిష మనియు, దూషీవిషమనియు ద్వివిధంబు. దుష్టజంతువులయొక్క చెమ్మట, రక్తము, స్త్రీల రజస్సు వీనిని పదార్థములలో గలపి భర్తను స్వాధీనపఱచుకొఱకునిడిన నయ్యది గరవిష మనంబడును. దేశము, కాలము, అన్నము, పగటినిద్ర ఇయ్యవి రసాదిధాతువులను దూషింపఁ జేయుఁగాన నయ్యది దూషీవిషమనంబడును.

## విషభేదవివరణము.

సప్తధాతువిషం జ్ఞేయం తథా సప్తోపధాతుజమ్. 200
తథైవోపవిషేభ్యశ్చ జాతం సప్తవిధం మతం,

అశుద్ధంబులగు సువర్ణాది ధాతువులు ఏడును విషతుల్యంబులు. అట్లనే అశుద్ధంబులగు ఉపధాతువులు ఏడును, జిల్లేడు మొదలగునవియు విషతుల్యంబులు.

దుష్టనీరవిషం చైకం తథైకం దిగ్ధజం విషమ్. 201

దుష్టమగునీటిలోస్నానముచేసినను, పానముచేసినను అయ్యది విషతుల్యంబై రోగంబులను గలిగించును. అయ్యది దుష్టనీరవిషరోగ మనంబడును. విషముపూసినశస్త్రాదులచే నభిఘాతముగల్గి దానిచే పుట్టురోగము దిగ్ధజవిషరోగ మనంబడును.

## ఆగంతుకోపద్రవవివరణము.

కపికచ్ఛుభవా కండూర్దుష్టనీరభవా తథా,
తథా సూరణకండూశ్చ శోఫో భల్లాతజస్తథా. 202

దురదగొండివిత్తులు, చెడిననీళ్లు, దురదకంద-వీనిం దాకుటచే పుట్టుదురద ఆగంతు

కోపద్రవ మనంబడును. మఱియు నల్లజీడివిత్తులచేగల్గు వాపు ఆగంతుకోపద్రవ మనంబడును.

మదశ్చతుర్విధశ్చాన్యః పూగభంగాక్షకోద్రవైః,
చతుర్విధోఽన్యో ద్రవ్యాణాం ఫలత్వఙ్మూలపత్రజః. 203

వక్కలు, బంగియాకు, తానికాయవిత్తులు, కోద్రవములు-వీని భక్షించుటచే గల్గు మదరోగంబులు నాలుగువిధములు. ఓషధులయొక్క ఫలము, వేళ్లు, పట్ట, ఆకులు వీనిని భక్షించుటచే గల్గు మదరోగంబులు నాలుగువిధములు.

ఇతి ప్రసిద్ధా గదితా యే కిలోపద్రవా భువి,
అసంఖ్యాశ్చాపరే ధాతుమూలజీవాదిసంభవాః. 204

ఇతి శ్రీదామోదరసూనుశార్ఙ్గధరాచార్యవిరచితాయాం సంహితాయాం పూర్వఖండే, రోగగణనంనామ సప్తమోఽధ్యాయః.

ఇట్లు ప్రసిద్ధముగనుండురోగములయొక్క నిదానము, సంఖ్యమొదలగునవి చెప్పఁబడినవి. ఇవిగాక ధాతువులు, ఉపధాతువులు, మూలములు, జీవులు వీనిచే గల్గురోగములు లెక్కిడ నలవిగావు.

ఇట్లు శ్రీదామోదరసూను శార్ఙ్గధరాచార్యవిరచిత ద్విసహస్రషట్చతపరిమిత
సంహితయందు సూత్రస్థానమందలి పూర్వఖండంబున
రోగగణనమను సప్తమాధ్యాయము.
పూర్వఖండము సమాప్తము.

శ్రీ ర స్తు.

శ్రీమద్ధన్వంతరయే నమః.

# శార్ఙ్గధరసంహిత, మధ్యమఖండము

## ఆంధ్రతాత్పర్యసహితము.

## ప్రథమాధ్యాయము

### కషాయపంచకము.

అథాత స్స్వరసః కల్కః క్వాథశ్చ హిమఫాంటకౌ,
జ్ఞేయాః కషాయాః పంచైతే లఘవస్స్యు ర్యథోత్తరమ్. 1

స్వరసము, కల్కము, క్వాథము, హిమము, ఫాంటము, అనునైదును కషాయము లనంబడు. అందొకటికన్న నొకటి క్రమంబుగ తక్కువగుణము గలదిగ నుండును.

### స్వరసకల్పనము.

అహతాత్తత్క్షణాకృష్టాద్ద్రవ్యాత్క్షుణ్ణాత్సముద్ధరేత్,
వస్త్రనిష్పీడితో యస్స రసస్స్వరస ఉచ్యతే. 2

ఓషధిద్రవ్యమును పచ్చిగనున్నపుడే పురుగులు మున్నగువానిని లేకుండ విదిలించి ఱోటిలోవేశి దంచి గుడ్డలోవేసి పిడిచినచో క్రిందస్రవించురసము స్వరసమని చెప్పందగును.

(అన్యచ్చ)

### మఱియొక స్వరసము.

కుడవం చూర్ణితం ద్రవ్యం క్షిప్తం చ ద్విగుణే జలే,
అహోరాత్రస్థితం తస్మాద్భవేద్వా రస ఉత్తమః. 3

ఎండినయోషధిచూర్ణమును ఒకకుడవము గ్రహించి, యందు రెండింతలు నీరు పోసి ఒకరేయింబవ లునిచి మఱునాడు నాయుదకమును వడియగట్టిన మఱియొక స్వరసమని తెలియందగును.

(అన్యచ్చ)

### మఱియొక స్వరసము.

ఆదాయ శుష్కద్రవ్యం వా స్వరసానామసంభవే,
జలేఽష్టగుణితే సాధ్యం పాదశిష్టం చ గృహ్యతే. 4

స్వరసస్య గురుత్వాచ్చ పలమర్ధం ప్రయుజ్యతే,
నిశోషితం చాగ్నిసిద్ధం పలమాత్రం రసం పిబేత్. 5

పచ్చిగనుండు యోషధిద్రవ్యములు దొరకనియెడ ఎండినద్రవ్యముల గ్రహించి వానికెనిమిదింతలు నీరుపోసి నాలవపాలు మిగులునట్లు కాచవలయు. ఇటులకాచిన స్వరసము గురుత్వము గలిగియుండునుగాన అర్ధపలము సేవింపందగు. లేక, రాత్రియందు నోషధిద్రవ్యమును నీటిలోనానవైచి ప్రొద్దున కషాయముగాచి ఒకపలముసేవింపందగును.

స్వరసమందు వేయఁదగినయౌషధప్రమాణము.

మధుశ్వేతాగుడక్షారాన్ జీరకం లవణం తథా,
ఘృతం తైలం చ చూర్ణాదీన్ కోలమాత్రాన్ రసే క్షిపేత్. 6

తేనె, శర్కర, బెల్లము, క్షారములు, జీలకఱ్ఱ, సైంధవలవణము, నెయ్యి, నూనె, చూర్ణాదులు, మొదలగువానిని స్వరసమునఁ జేర్చునెడ కోలప్రమాణము జేర్చందగు.

ప్రమేహముల కమృతాదిస్వరసము.

అమృతాయాః రసః క్షౌద్రయుక్తస్సర్వప్రమేహజిత్,
హారిద్రాచూర్ణయుక్తో వా రసో ధాత్ర్యాస్సమాక్షికః. 7

తిప్పతీఁగెరసంబున తేనెకలిపిగాని, ఉసిరికపండ్లరసంబున పసుపుపొడిగలిపిగాని, సేవించిన ప్రమేహంబులన్నియు నశించును.

రక్తపిత్తమునకు వాసకాద్యంగరసము.

వాసకస్స్వరసః పేయో మధునా రక్తపిత్తజిత్,
జ్వరకాసక్షయహరః కామిలాశ్లేష్మపిత్తహా, 8
త్రిఫలాయా రసః క్షౌద్రయుక్తో దార్వీరసోఽథవా,
నింబస్య వా గుడూచ్యా వా పీతో జయతి కామలామ్. 9

అడ్డసరపుఆకుస్వరసంబున తేనెగలిపి సేవించిన, రక్తపిత్తము, జ్వరము, దగ్గు, క్షయరోగము, కామిల, శ్లేష్మపిత్తము నశించును. మఱియు త్రిఫలాస్వరసంబుననైనను, మ్రానిపసుపుఅంగరసంబుననైనను, వేపచెక్కస్వరసంబుననైనను, తిప్పతీఁగెస్వరసంబుననైనను తేనెగలిపి సేవించిన కామల నశించును.

విషమజ్వరములకు తులస్యాద్యంగరసము.

పీతో మరిచచూర్ణేన తులసీపత్రజో రసః,
ద్రోణపుష్పీ రసోవాఽపి నిహంతి విషమజ్వరాన్. 10

తులసిమూకు రసంబుననైనను, పెద్దతుమ్మిపూలరసంబుననైనను, మిరియాలచూర్ణము సేవించిన విషమజ్వరములు నశించును.

రక్తాతిసారమునకు జంబ్వాద్యంగరసము.

జంబ్వామ్రామలకీనాం చ పల్లవోత్థో రసో జయేత్,
మధ్వాజ్యక్షీరసంయుక్తో రక్తాతీసారముల్బణమ్. 11

నేరేడు, మామిడి, ఉసిరిక వీనిచిగుళ్లరసములలో దేనియందైనను, తేనె, నెయ్యి గలిపి సేవించిన ప్రబలములగురక్తాతిసారములు నశించును.

సర్వాతిసారములకు బబ్బూలికాపత్రాద్యంగరసము.

స్థూలబబ్బూలికాపత్రరసః పానాద్వ్యపోహతి,
సర్వాతిసారాన్ శ్యోనాకకుటజత్వగ్రసో యథా. 12

ముండ్లు లేనినల్లతుమ్మయాకులరసమునుగాని, దుందిలపుపట్టరసమునుగాని, కొడిసెపట్టరసమునుగాని సేవించిన అతిసారము లన్నియు నశించును.

వృషణవాతము, ఉబ్బసము-వీనికి అల్లపురసము.

ఆర్ద్రికస్వరసః క్షౌద్రయుక్తో వృషణవాతజిత్,
శ్వాసకాసారుచిర్హంతి ప్రతిశ్యాయం వ్యపోహతి. 13

అల్లపురసంబున తేనెగలిపి సేవించిన వృషణవాతము, దగ్గు, ఉబ్బసము, అరుచి, ము నశించును.

పార్శ్వాదిశూలలకు మాదీఫలాంగరసము.

బీజపూరరసః పానాన్మధుక్షారయుతో జయేత్,
పార్శ్వహృద్వస్తిశూలాని కోష్ఠవాయుం చ దారుణమ్. 14

మాదీఫలరసంబున తేనె, యవక్షారము వీని గలిపిసేవించిన పార్శ్వము, రొమ్ము, , వీనియందు జనించెడి శూలలు, కోష్ఠవాతము నశించును.

పిత్తశూలలకు శతావర్యంగరసము.

శతావర్యాశ్చ మధునా పిత్తశూలహరో రసః,

పిల్లిపీచరగడ్డలరసంబున తేనెగలిపి సేవించిన పిత్తశూల నశించును.

ప్లీహము, అపచి-వీనికి కన్యారసము.

నిశాచూర్ణయుతః కన్యారసః ప్లీహాపచీహరః. 15

కలబందరసంబున పసుపుపొడినిగలిపిసేవించిన, ప్లీహము (కడుపు కెడమభాగమున డెడిప్లీహము నాశ్రయించి జనించెడిరోగము), అపచి నశించును.

అపచి, గండమాల, కామిల-వీటికి అలంబుషాస్వరసము.

అలంబుషాయాస్స్వరసః పీతో ద్విపలమాత్రయా,
అపచీగండమాలానాం కామిలాయాశ్చ నాశనః. 16

రెండుపలములబోడతరము స్వరసమును సేవించిన, అపచి, గండమాల, కామిల, ఇవి నశించును.

సూర్యావర్తమునకు శశముండరసము.

శశముండరసః కోష్ణో మరిచైరవధూళితః,
జయేత్సప్తదినాభ్యాసాత్సూర్యావర్తార్ధభేదకౌ. 17

కుందేలుతలను దంచి రసముదీసి కించిదుష్ణముగ గాచి యందు మిరియాలచూర్ణము వైచి 7 దినములు సేవించిన సూర్యావర్తము, అరతలనొప్పి నశించును.

ఉన్మాదిరోగములకు బ్రాహ్మ్యాదిస్వరసము.

బ్రాహ్మీకూశ్మాండషడ్గ్రంథా శంఖినీస్వరసాః పృథక్,
మధుకుష్ఠయుతాః పీతాస్సర్వోన్మాదాపహారిణః. 18

సరస్వతియాకు (వల్లారి), బూడిదగుమ్మడు, వస, కడిలచెట్టు, వీనిస్వరసంబులో నెద్దానియందైన తేనె, చెంగల్వకోష్టు కలిపి సేవించిన, ఉన్మాదంబులన్నియు నశించును.

మదరోగములకు కూశ్మాండస్వరసము.

కూశ్మాండకస్య స్వరసో గుడేన సహ యోజితః,
దుష్టకోద్రవసంజాతమదం పానాద్వ్యపోహతి. 19

బూడిదగుమ్మడు స్వరసంబున బెల్లముగలిపి సేవించిన, దుష్టమగు నాళ్ల సేవనచే జనించిన మదము నశించును.

వ్రణములకు గాంగేరుకీస్వరసము.

ఖడ్గాదిఛిన్నగాత్రస్య తత్కాలం పూరితో వ్రణః,
గాంగేరుకీమూలరసైర్జాయతే గతవేదనః. 20

ఖడ్గాద్యాయుధములచే నభిఘాతము జనించునెడ నాగబల వేర్ల రసమును గాయము నిండ పూరించిన వేదన నశించును.

పుటపాకములు.

పుటపాకస్య కల్కస్య స్వరసో గృహ్యతే యతః,
అతస్తు పుటపాకానాం యుక్తిరత్రోచ్యతే మయా. 21

పుటపాకమున పక్వముఁ జేయబడినకల్కమునుండి తీయఁబడిన స్వరసము ఔషధములయందు గ్రహింపఁ బడునుగాన పుటపాకవిధిం జెప్పెద.

## పుటపాకవిధి.

పుటపాకస్య మాత్రేయం లేపస్యాంగారవర్ణతా,
లేపం చ ద్వ్యంగుళం స్థూలం కుర్యాద్వాఽంగుష్ఠమాత్రకమ్.
కాశ్మరీవటజంబ్వాదిపత్రైర్వేష్టనముత్తమం,
పలమాత్రరసో గ్రాహ్యః కర్షమాత్రం మధు క్షిపేత్. 23
కల్కచూర్ణద్రవాద్యాస్తు దేయాస్స్వరసవద్బుధైః,

పుటపాకము జేయఁదగిన ద్రవ్యములను మెత్తగ నూరి ముద్దజేసి గుమ్మడు, మఱ్ఱి, నేరేడు మొదలగువాని యాకులలో దేనిచేనైనను జుట్టి దానిపై రెండంగుళముల ప్రమాణంబైనను, అంగుళ ప్రమాణంబైనను మట్టిని లేపనము జేసి నది యెఱ్ఱగ కాలువఱకు పుటంబున నుంచి పిదప దానియందుండి తీసి పైమంటిని ఆకులను ఊడదీసి లోపలిముద్దను పిండికొనిన రసమును ఒకపల ప్రమాణము సేవింపఁదగు. ఎండినయౌషధద్రవ్యముల నీటిచే నూరి పుటపాక మొనర్చి గ్రహించిన రసమునుగాని ఆయాయోగములయందు చెప్పెడిద్రవద్రవ్యములచే నూరి పుటపాకముగావించి గైకొనిన రసమునుగాని, పైప్రకార మొకపలమును సేవింపఁదగు. అందు తేనె చేర్చునెడ యర్ధపలమును చేర్చవలెను.

## సర్వాతిసారములకు కుటజపుటపాకము.

తత్కాలాకృష్టకుటజత్వచం తండులవారిణా. 24
పిష్టాం చతుష్పలమితాం జంబూపల్లవవేష్టితాం,
సూత్రేణ బద్ధాం గోధూమపిష్టేనోపరి వేష్టితామ్. 25
లిప్తాం చ ఘనపంకేన గోమయైర్వహ్నినా దహేత్,
అంగారవర్ణాం చ మృదం దృష్ట్వా వహ్నేస్సముద్ధరేత్. 26
తతో రసం గృహీత్వా చ శీతం క్షౌద్రయుతం పిబేత్,
జయేత్సర్వానతీసారాన్ దుస్తరాన్ సుచిరోత్థితాన్. 27

అప్పుడు తేబడినపచ్చికొడిశపాలపట్టను నాలుగుపలములు బియ్యపుకడుగుతో నూరి ముద్దజేసి దానిపై నేరేడాకులను జుట్టి దారముతో బిగియఁగట్టి దానిపైన నూరిన గోధూమపుపిండిని లేపనముగావించి దానిపై గట్టిగనుండుబురదను లేపనముగావించి పిడకలపుటములో నెఱ్ఱగ కాలునట్లుచేసి, దానినుండి తీసి చల్లారినపిదప మంటిని యాకులను ఊడదీసి లోపలిముద్దను పిండికొని రసమును గ్రహించి సాంగశీతలమగుదానియందు తేనె గలిపి సేవించిన చాలకాలమున జనించి దుస్తరమగునవియైనను అన్నియతిసారంబులు నశించును.

### బియ్యపుకడుగు వివరణము.

కండితం తండులపలం జలేఽష్టగుణితే క్షిపేత్,
భావయిత్వా జలం గ్రాహ్యం దేయం సర్వత్ర కర్మసు. 28

దంచినబియ్యమును నొకపలము గ్రహించి యందెనిమిదిపలములు నీరుబోసి చక్కగ పిసికి చేకొనంబడినయుదకమును నాయాకర్మల నుపయోగింపఁ జను.

### అరళుపుటపాకము.

అరళుత్వక్కృతశ్చైవ పుటపాకోఽగ్నిదీపనః,
మధుమోచరసాభ్యాం చ యుక్తస్సర్వాతిసారజిత్. 29

పచ్చిదుందిలపుపట్టను నూరి పైప్రకారము పుటపాక మొనర్చి యందుండి స్వరసమును గ్రహించి యందు తేనె, బూరుగుబంక చేర్చి సేవించిన సర్వాతీసారములు నశించును. అగ్నిదీప్తి గలుగును.

### న్యగ్రోధాదిపుటపాకము.

న్యగ్రోధాదేశ్చ కల్కేన పూరయేద్గౌరతిత్తిరేః,
నిరంత్రముదరం సమ్యక్పుటపాకేన తత్పచేత్. 30
తత్కల్కస్వరసః క్షౌద్రయుక్తస్సర్వాతిసారజిత్,

న్యగ్రోధాదిగణమునందు చెప్పఁబడినవానిపట్టల కల్కమును గౌరవర్ణముగలిగి తిత్తిరిపక్షిగర్భమున నరములు లేకుండతీసి ఆగర్భమున పైకల్కమును బోసి నిండించి పైప్రకారము పుటపాక మొనర్చి గ్రహించిన రసమునందు తేనె గలిపి సేవించిన సర్వాతిసారములు నశించును.

### దాడిమీపుటపాకము.

పుటపాకేన విపచేత్సుపక్వం దాడిమీఫలమ్. 31
తద్రసో మధుసంయుక్తస్సర్వాతీసారనాశనః,

దానిమ్మపండును పైచెప్పినప్రకారము పుటపాకమొనర్చి పిదప దానిరసమును బిండికొని యందు తేనె గలిపి సేవించిన అతిసారము లన్నియు నశించును.

### వాంతులకు బీజపూరాదిపుటపాకము.

బీజపూరామ్రజంబూనాం పల్లవాని జటాః పృథక్. 32
విపచేత్పుటపాకేన క్షౌద్రయుక్తశ్చ తద్రసః,
ఛర్దిం నివారయేద్ఘోరాం సర్వదోషసముద్భవామ్. 33

మాదీఫలపుచెట్టు, మామిడి, నేరేడు వీనిలో నెద్దానిచిగుళ్లనైనను, వేళ్లనైనను

ని మెత్తగనూరి పైచెప్పినప్రకారము పుటపాకము గావించి యందలి రసమును
ంచి తేనెగలిపి సేవించిన సమస్తదోషములవలన జనించిన ఘోరమగు వాంతులు
మను.

## రక్తపిత్తకాసజ్వరములకు వృషపత్రపుటపాకము.

పిష్టానాం వృషపత్రాణాం పుటపాకరసో హిమః,
మధుయుక్తో, జయేద్రక్తపిత్తకాసజ్వరక్షయాన్. 34

పచ్చియడ్డసరపు ఆకులను నూరి పైచెప్పినప్రకారము పుటపాకమొనర్చియందుండి
ను పిడిచికొని యందు తేనె గలిపి సేవించిన రక్తపిత్తము, కాసము, జ్వరము,
ము నశించును.

## కాసశ్వాసములకు కంటకారిపుటపాకము.

పచేత్క్షుద్రాంగపంచాంగాన్ పుటపాకేన తద్రసః,
పిప్పలీచూర్ణసంయుక్తః కాసశ్వాసకఫాపహః. 35

సమూలముగ వాకుడుచెట్టును నూరి, పైప్రకారము పుటపాకమొనర్చి యందుండి
ను పిండికొని యందు పిప్పలిచూర్ణమును గలిపి సేవించినచో కాసము, శ్వాసము,
ు నశించును.

## శ్వాసకాసాదులకు విభీతకపుటపాకము.

విభీతకఫలం కించిద్ఘృతేనాభ్యజ్య లేపయేత్,
గోధూమపిష్టేనాంగారైర్విపచేత్పుటపాకవత్. 36
తతః పక్వం సముద్ధృత్య త్వచం తస్య ముఖే క్షిపేత్,
కాసశ్వాసప్రతిశ్యాయస్వరభంగాన్ జయేత్తతః. 37

తానికాయకు కొంచముగ నేయిబూసి దానిపైన గోధూమపిండిని లేపనము
ంచి పైప్రకారము పుటపాకమును నిప్పులయందొనర్చి, పిదప యందలివిత్తనమును
ాఅవైచి పైబెరడునుమాత్రము నోటియందుంచుకొనిన కాసము, శ్వాసము, జలుబు,
భంగము నశించును.

## ఆమాతీసారములకు శుంఠీపుటపాకము.

చూర్ణం కించిద్ఘృతాభ్యక్తం శుంఠ్యా ఏరండజైర్దలైః,
వేష్టితం పుటపాకేన విపచేన్మందవహ్నినా. 38
తత ఉద్ధృత్య తచ్చూర్ణం గ్రాహ్యం ప్రాతస్సితాసమం,
తేన యాంతి శమం పీడా ఆమాతీసారసంభవాః. 39

సొంటిని చూర్ణముగావించి యందు నేయిచేర్చి ముద్దజేసి ఆముదపు ఆకులతోఁ జుట్టి పై ప్రకారము మందాగ్నిచే పుటపాక మొనర్చి పిదప నాముద్దను చూర్ణముచేసి దీనికి సమముగ శర్కరఁగలిపి ప్రాతఃకాలమున సేవించిన ఆమాతీసారములు నశించును.

ఆమవాతములకు శుంఠీపుటపాకము.

శుంఠీకల్కం వినిక్షిప్య రసై రేరండమూలజైః,
విపచేత్పుటపాకేన తద్రసః క్షౌద్రసంయుతః 40
ఆమవాతసముద్భూతాం పీడాం జయతి దుస్తరాం,

సొంటిని ఆముదపువేళ్ళ రసముతోనూరి ముద్దజేసి పైప్రకారము పుటపాకము గావించి యందుండి రసము పిండికొని యందలి తేనెగలిపి సేవించిన ఆమవాతములు నశించును.

అర్శోరోగములకు సూరణపుటపాకము.

సౌరణం కందమాదాయ పుటపాకేన పాచయేత్. 41
సతైలలవణస్తస్య రసశ్చార్శోవికారనుత్,

కందగడ్డను దంచియందు నువ్వులనూనె, సైంధవలవణము గలిపి నూరి ముద్దజేసి పైప్రకారము పుటపాక మొనర్చి యందలిరసమును సేవించిన అర్శోరోగము నశించును.

హృదయశూలలకు మృగశృంగపుటపాకము.

శరావసంపుటే దగ్ధం శృంగం హారిణజం పిబేత్. 42
గవ్యేన సర్పిషా యుక్తం హృచ్ఛూలం నశ్యతి ధ్రువమ్.

ఇతి శ్రీదామోదరసూను శార్ఙ్గధరేణ విరచితాయాం
సంహితాయాంసూత్రస్థానే మధ్యమఖండే స్వర
సాదికల్పనంనామ ప్రథమోఽధ్యాయః.

దుప్పికొమ్ము తునకలను మంటిమూకుడులోవైచి దానిపై మఱియొకమూకుడు బోరగించి చీలమన్నునిచ్చి పుటముబెట్టి పిదప దానిని జక్కగనూరి ఆవునేతితో పుచ్చుకొనిన బొమ్ముశూల నశించును.

ఇది శ్రీదామోదరసూను శార్ఙ్గధరవిరచిత సంహితయందు సూత్రస్థానమున
మధ్యమఖండమందు స్వరసాదికల్పనమను
ప్రథమాధ్యాయము.

# ద్వితీయాధ్యాయము.

## కషాయవిధి.

సీయం షోడశగుణం క్షుణ్ణే ద్రవ్యపలే క్షిపేత్,
ృత్పాత్రే క్వాథయేద్గ్రాహ్యమష్టమాంశావశేషితమ్. 1
లం పాయయేద్ధీమాన్ కోష్ణమృద్వగ్నిసాధితం,
తః క్వాథః కషాయశ్చ నిర్యూహస్స నిగద్యతే. 2
హారరసపాకే చ సంజాతే ద్విపలోఽన్వితం,
ద్ధవైద్యోపదేశేన పిబేత్క్వాథం సుపాచితమ్. 3

యద్రవ్యము నొకపలము గ్రహించి మట్టికుండలోనుంచి యందు పదునాఱు రుపోసి మందాగ్నిచే ఎనిమిదవపాలు మిగులునట్లు కషాయముగాచి దానిని కొంచెము ఉష్ణముగనుండునపుడే రోగిచే త్రాగించవలెను. ఇట్లు సేవించునెడ యాజ్ఞవలన భుజించినయాహారపదార్థము జీర్ణమైనదని తెలిసికొని రెండు మాణము సేవింపందగు. ఈకషాయమునకు, శృతము, క్వాథము, కషాయము ము అనిపేరు.

పిధానముఖే పాత్రే జలం దుర్జలతాం వ్రజేత్,
స్మాదావరణం త్యక్త్వా క్వాథాదీనాం వినిశ్చయః. 4

యము కుండలో కాచవలయును. అట్టుకాచునెడ పైన మూఁతవేయం ంసిన నాకషాయము జెడును.

## కషాయమునంగలుపందగుశర్కరాదులప్రమాణము.

్వాథే క్షిపేత్సితా మంశై శ్చతుర్థాష్టమషోడశైః,
ాతపిత్తకఫాతంకే విపరీతం మధు స్మృతమ్. 5

యమందు శర్కర గలుపవలసియుండునేని వాతరోగమునందు కషాయ లవభాగమును, పిత్తరోగమునకు నెనిమిదవభాగమును, శ్లేష్మరోగమునకు పది గమును జేర్పవలయును. తేనె జేర్చునెడ, వాతరోగమునందు కషాయమునకు భాగమును, పిత్తరోగమునందు నెనిమిదవభాగమును, శ్లేష్మరోగమునందు మును గలుపవలయును.

కషాయమందుఁ జేర్చుజీలకఱ్ఱ మొదలగువానిప్రమాణము.

జీరకం గుగ్గులుక్షారం లవణంచ శిలాజతు,
హింగుత్రికటుకం చైవ క్వాథే శాణోన్మితం క్షిపేత్. 6
క్షీరం ఘృతం గుడం తైలం మూత్రం చాన్యద్ద్రవం తథా,
కల్కం చూర్ణాదికం క్వాథే నిక్షిపేత్కర్షసమ్మితమ్. 7

జీలకఱ్ఱ, గుగ్గిలము, యవక్షారము, సైంధవలవణము, శిలాజితు, ఇంగువ, త్రికటుకములు వీనిని కషాయమునందుఁజేర్చునెడ శాణపరిమితిగఁ జేర్పవలయుఁను. పాలు, నెయ్యి, బెల్లము, నువ్వులనూనె, మూత్రము, కల్కము, చూర్ణము నితరమగు ద్రవద్రవ్యములు వీనిని కర్షప్రమాణంబును జేర్పవలయును.

సర్వజ్వరములకు గుడూచ్యాదికషాయము.

గుడూచీ ధాన్యకారిష్ట పద్మకారక్తచందనైః,
గుడూచ్యాదిగణక్వాథస్సర్వజ్వరహరః స్మృతః. 8
దీపనోదాహహృల్లాస తృష్ణాచ్ఛర్ద్యరుచీర్జయేత్,

తిప్పతీఁగె, దనియాలు, వేము, పద్మకములు, రక్తచందనము వీనిని కషాయముగాచి సేవించిన సర్వజ్వరములు నశించును. అగ్నిదీపనముఁ గలుగును. తాపము, నోటనీళ్లూరుట, దప్పి, వాంతులు, అరుచి నశించును. ఇదియే గుడూచ్యాదిగణమని చెప్పంబడు.

సర్వజ్వరములకు నాగరాదిపాచనము.

నాగరం దేవకాష్ఠం చ ధాన్యకం బృహతీద్వయమ్. 9
దద్యాత్పాచనకం పూర్వం జ్వరితానాం జ్వరాపహం,

సొంటి, దేవదారు, ధనియములు, పెద్దములక, వాకుడు వీనిని కషాయముగాచి జ్వరారంభమున సేవించిన సర్వజ్వరములు నశించును.

అష్టవిధజ్వరములకు క్షుద్రాదికషాయము.

క్షుద్రా కిరాతతిక్తం చ శుంఠీ ఛ్ఛిన్నాచ పౌష్కరమ్. 10
కషాయ ఏషాం శమయేత్ప్రీతశ్చాష్టవిధం జ్వరం,

వాకుడు, నేలవేము, కటుకరోహిణి, సొంటి, తిప్పతీఁగె, పుష్కరమూలము వీనిని కషాయముగాచి సేవించిన యెనిమిది విధములగు జ్వరములు నశించును.

వాతజ్వరములకు గుడూచ్యాదిపాచనము.

గుడూచీపిప్పలీమూలనాగరైః పాచనం స్మృతమ్. 11
దద్యాద్వాతజ్వరే పూర్ణలింగే సప్తమవాసరే,

తిప్పతీఁగె, మోడి, సొంటి వీనిని కషాయముగాచి వాతజ్వరమునందు సంపూర్ణలక్షణములు గలిగియున్నను ఏడుదినంబులు గడచిన పిదప సేవించిన వాతజ్వరము నశించును.

వాతజ్వరములకు శాలిపర్ణ్యాది కషాయము.

శాలిపర్ణీ బలా ద్రాక్షా గుడూచీ సారిబా తథా. 12
ఆసాం క్వాథం పిబేత్కోష్ణం తీవ్ర వాతజ్వరచ్ఛిదం,

నక్కతోఁకపొన్న, ముత్తవపులగము, ద్రాక్ష, తిప్పతీఁగె, సుగంధిపాల వీనిని సేవించిన తీవ్రమగు వాతజ్వరము నశించును.

కాశ్మర్యాదికషాయము.

కాశ్మరీ శారిబా ద్రాక్షా త్రాయమాణా మృతాభవః. 13
కషాయస్సగుడః పీతో వాతజ్వరవినాశనః,

పెగ్గుమ్మడు, సుగంధిపాల, ద్రాక్ష, కలుక్రానుగు, తిప్పతీఁగె వీనిని కషాయముగాచి యందు బెల్లము గలిపి సేవించిన వాతజ్వరములు నశించును.

పిత్తజ్వరములకు కట్ఫలాదిపాచనము.

కట్ఫలేంద్రయవాంబష్ఠా తిక్తా ముస్తైః శృతం జలమ్. 14
పాచనం దశమేఽహ్ని స్యాత్తీవ్రే పిత్తజ్వరే నృణాం,

కాయఫలము, కొడిశపాలవిత్తులు, విషబొద్ది, కటుకరోహిణి, తుంగగడ్డలు వీనిని కషాయముగాచి, జ్వరముగలిగిన పదిరోజులకు పిదప సేవించిన పిత్తజ్వరములు నశించును.

పర్పటాదికషాయము.

పర్పటో వాసకస్తిక్తా కైరాతో ధన్వయాసకః. 15
ప్రియంగుశ్చ కృతః క్వాథ ఏషాం శర్కరయా యుతః,
పిపాసా దాహపిత్తాస్రయుతం పిత్తజ్వరం జయేత్. 16

పర్పాటకము, అడ్డసరపాకు, కటుకరోహిణి, నేలవేము, దురదగొండి, ప్రేంకణము వీనిని కషాయముగాచి, యందు పంచదారగలిపి సేవించిన దప్పి, తాపము, రక్తపిత్తము వీనితోఁగూడిన పిత్తజ్వరము నశించును.

ద్రాక్షాదికషాయము.

ద్రాక్షాహారీతకీముస్తం కటుకాకృతమాలకః,
పర్పటశ్చ కృతః క్వాథ ఏషాం పిత్తజ్వరాపహః. 17
తృణ్మూర్ఛాదాహపిత్తాసృక్భ్రమనో భేదనస్మృతః,
ఏకః పర్పటకశ్శ్రేష్ఠః పిత్తజ్వరవినాశనః. 18
కింపునర్యది యుజ్యేత చందనోశీరవాలకైః,

ద్రాక్షపండు, కరకపిందెలు, తుంగగడ్డలు, కటుకరోహిణి, రేలగుజ్జు, పర్పాటకము వీనిని కషాయముగాచి సేవించినచో పిత్తజ్వరము, దప్పి, మూర్ఛ, తాపము, రక్తపిత్తము నశించును. మలమును జక్కగ బైట వెడలునటుల జేయును.

### శ్లేష్మజ్వరములకు బీజపూరాదిపాచనము.

బీజపూరశిఫాపథ్యానాగరగ్రంథికైశ్శృతమ్. 19
సక్షారం పాచనం శ్లేష్మజ్వరే ద్వాదశవాసరే,

మాదీఫలపువ్రేళ్లు, కరకకాయలు, సొంటి, గ్రంథితగరము వీనిని కషాయముగాచి యందు యవక్షారము గలిపి జ్వరముతగిలిన పండ్రెండవదినమున సేవించిన శ్లేష్మజ్వరము నశించును.

### శ్లేష్మజ్వరములకు భూనింబాదికషాయము.

భూనింబనింబపిప్పల్యః స్సటీ శుంఠీ శతావరీ. 20
గుడూచీ బృహతీ చేతి క్వాథో హన్యాత్కఫజ్వరం,

నేలవేము, వేము, పిప్పళ్లు, కచోరములు, సొంటి, పిల్లపీచర, తిప్పతీఁగ, ములక వీనిని కషాయముగాచి సేవించిన శ్లేష్మజ్వరము నశించును.

### శ్లేష్మజ్వరమునకు పటోలాదికషాయము.

పటోలత్రిఫలాతిక్తా సటీవాసామృతాభవః. 21
క్వాథో మధుయుతః పీతో హన్యాత్కఫకృతం జ్వరం,

చేదుపొట్ల, త్రిఫలములు, కటుకరోహిణి, కచోరములు, అడ్డసరము, తిప్పతీఁగె వీనిని కషాయముగాచి యందు తేనెగలిపి సేవించిన శ్లేష్మజ్వరము నశించును.

### వాతపిత్తజ్వరములకు పర్పటాదికషాయము.

పర్పటాబ్దామృతావిశ్వా కైరాతైస్సాధితం జలమ్. 22
పంచభద్రమిదం జ్ఞేయం వాతపిత్తజ్వరాపహం,

పర్పాటకము, తుంగగడ్డలు, తిప్పతీఁగె, సొంటి, నేలవేము వీనిని కషాయముగాచి సేవించిన వాతపిత్తజ్వరము నశించును. ఇదియ పంచభద్రకషాయ మనంబడును.

### శ్లేష్మవాతజ్వరములకు లఘుక్షుద్రాదికషాయము.

క్షుద్రాశుంఠీ గుడూచీనాం కషాయః పౌష్కరస్య చ. 23
కఫవాతాధికే పేయో జ్వరే వాపి త్రిదోషజే,
కాసశ్వాసారుచికరే పార్శ్వశూలవిధాయినీ. 24

కంటకారి, సొంటి, తిప్పతీఁగ, పుష్కరమూలము వీనిని కషాయముగాచి సేవించిన

కాసము, శ్వాసము, అరుచి, పార్శ్వశూలము ఇవికలిగియున్నను, శ్లేష్మవాతజ్వరము, త్రిదోష జ్వరము నశించును.

వాతశ్లేష్మజ్వరములకు ఆరగ్వధాదికషాయము.

ఆరగ్వధకణామూలముస్తాతిక్తాభయాకృతః,
క్వాథశ్శమయతి క్షిప్రం జ్వరం వాతకఫోద్భవమ్. 25
ఆమశూలప్రశమనో భేదీ దీపనపాచనః,

రేలగుజ్జు, మోడి, తుంగముస్తలు, కటుకరోహిణి, కరకకాయలు వీనిని కషాయముగాచి సేవించిన వాతశ్లేష్మజ్వరము నశించుటయగాక ఆమశూలను నశింపజేసి విరేచనము చేయును. ఆహారమును జీర్ణము జేయును. అగ్నిదీపనముగలుగును.

శ్లేష్మజ్వరములకు అమృతాష్టకకషాయము.

అమృతారిష్టకటుకా ముస్తేంద్రయవనాగరైః. 26
పటోలచందనాభ్యాం చ పిప్పలీచూర్ణయుక్శృతం,
అమృతాష్టకమేతచ్చ పిత్తశ్లేష్మజ్వరాపహమ్ 27
ఛర్ద్యరోచకహృల్లాసదాహతృష్ణానివారణం,

తిప్పతీగ, వేము, కటుకరోహిణి, తుంగముస్తలు, కొడిసపాలవిత్తులు, సొంటి, చేదుపొట్ల, రక్తచందనము వీనిని కషాయముగాచి యందు పిప్పలిచూర్ణమును గలిపిసేవించిన పిత్తశ్లేష్మజ్వరము, వాంతులు, అరోచకము, జొల్లుకారుట, తాపము నశించును. (ఇదియే అమృతాష్టకగణ మనంబడును.)

పిత్తశ్లేష్మజ్వరమునకు పటోలాదిగణకషాయము.

పటోలం చందనం మూర్వా తిక్తాపాఠామృతాగణః. 28
పిత్తశ్లేష్మజ్వరచ్ఛర్దిదాహకండూవిషాపహః,

చేదుపొట్ల, రక్తచందనము, చాగనార, కటుకరోహిణి, విషబొద్ది, తిప్పతీగ వీనిని కషాయముగాచి సేవించిన, పిత్తశ్లేష్మజ్వరము, ఛర్ది, తాపము, దురద, విషబాధనశించును.

సర్వజ్వరములకు కంటకార్యాదికషాయము.

కంటకారీద్వయం శుంఠీ ధాన్యకం సురదారు చ. 29
ఏభిశ్శృతం పాచనం స్యాత్సర్వజ్వరవినాశనం,

వాకుడు, పెద్దములక, సొంటి, దనియాలు, దేవదారు వీనిని కషాయముగాచి సేవించిన సర్వజ్వరములు నశించును.

వాతశ్లేష్మజ్వరములకు దశమూలకషాయము.

శాలిపర్ణీ పృష్టిపర్ణీ బృహతీద్వయగోక్షురైః. 30

బిల్వాగ్నిమంథస్యోనాకకాశ్మరీపాటలాయుతైః,
దశమూలమితి ఖ్యాతం క్వథితం తజ్జలం పిబేత్. 31
పిప్పలీచూర్ణసంయుక్తం వాతశ్లేష్మజ్వరాపహం,
సన్నిపాతజ్వరహరం సూతికాదోషనాశనమ్. 32
శోషశైత్యభ్రమస్వేదకాసశ్వాసవికారనుత్,
హృత్కంఠగ్రహపార్శ్వార్తితంద్రామస్తకశూలహృత్. 33

ముయ్యాకుపొన్న, కోలపొన్న, వాకుడు, పెద్దములక, పల్లేరు, మారేడు, తక్కిలి, దుండిలము, పెగ్గుమ్ముడు, కలిగొట్టు వీనివ్రేళ్లను కషాయమునుగాచి యందు పిప్పలిచూర్ణమును జేర్చి సేవించిన వాతశ్లేష్మజ్వరము, సన్నిపాతజ్వరము, బాలింతదోషములు, శోషము, శైత్యము, భ్రమ, చెమట, శ్వాస, కాసము, ఱొమ్మునొప్పి, గొంతునొప్పి, పార్శ్వశూలము, తంద్ర, తలనొప్పి నశించును.

## సన్నిపాతజ్వరములకు అభయాదికషాయము.

అభయాముస్తధాన్యాకరక్తచందనపద్మకైః,
వాసకేంద్రయవోశీరాగుడూచీకృతమాలకైః. 34
పాఠానాగరతిక్తాభిః పిప్పలీచూర్ణయుక్శృతం,
పిబేత్త్రిదోషజ్వరజిత్పిపాసాదాహకాసనుత్. 35
ప్రలాపశ్వాసతంద్రాఘ్నం దీపనం పాచనం పరం,
విణ్మూత్రానిలవిష్టంభవమీశోషారుచిచ్ఛిదమ్. 36

కరకకాయలు, తుంగముస్తలు, దనియాలు, రక్తచందనము, పద్మకములు, అడ్డసరము, కొడిశపాలవిత్తులు, వట్టివేళ్లు, తిప్పతీఁగ, రేలగుజ్జు, విషబొద్ది, సొంటి, కటుకరోహిణి వీనిని కషాయముగాచి యందు పిప్పలిచూర్ణమును గలిపి సేవించిన సన్నిపాతజ్వరము, దప్పి, తాపము, దగ్గు, ప్రలాపము, ఉబ్బసము, తంద్ర, మలబద్ధము, మూత్రబంధము, అపానవాతనిరోధము, వాంతులు, శోషము, అరుచి నశించును. ఆహారమును జీర్ణముజేయును. అగ్నిదీపనము గలుగును.

## అష్టాంగదశాంగకషాయము.

కైరాతకటుకీముస్తాధాన్యేంద్రయవనాగరైః,
దశమూలమహాదారుగజపిప్పలికాయుతైః. 37
కృతః కషాయః పార్శ్వార్తిసన్నిపాతజ్వరం జయేత్,
కాసశ్వాసవమీహిక్కాతంద్రాహృద్గ్రహనాశనః. 38

నేలవేము, కటుకరోహిణి, తుంగముస్తలు, దనియాలు, కొడిశపాలవిత్తులు, సొంటి,

ములు, దేవదారు, గజపిప్పళ్లు, వీనిని కషాయముగాచి సేవించినచో పార్శ్వ
సన్నిపాతజ్వరము, కాసము, శ్వాసము, వాంతులు, ఎక్కిళ్లు, తంద్ర, అరోచకము
ంచును.

కాసజ్వరమునకు కట్ఫలాదికషాయము.

కట్ఫలాంబుదభార్గీభిర్ధాన్యరోహిషపర్పటైః,
వచా హరీతకీ శృంగీ దేవదారుమహౌషధైః. 39
క్వాథః కాసజ్వరం హంతి శ్వాసశ్లేష్మగళగ్రహాన్,

కాయఫలము, తుంగముస్తలు, గంటుభారంగి, దనియాలు, కామంచిగడ్డి, పర్పా
వస, కరకకాయలు, కర్కాటశృంగి, దేవదారు, సొంటి వీనిని కషాయము
ించిన, కాసతోగూడిన జ్వరము, శ్వాసము, శ్లేష్మరోగము, కంఠావరోధము
ు.

జీర్ణజ్వరములకు గుడూచ్యాదికషాయము.

క్వాథో జీర్ణజ్వరం హంతి గుడూచ్యాః పిప్పలీయుతః. 40
తథా పర్పటజః క్వాథః పిత్తజ్వరహరః పరః,
కింపునర్యది యుజ్యేత చందనోదీచ్యనాగరైః. 41

తిప్పతీగకషాయంబున పిప్పలిచూర్ణమునుగలిపి సేవించిన జీర్ణజ్వరము నశించును.
కకషాయంబున పిప్పలిచూర్ణమును గలిపి సేవించిన పిత్తజ్వరము నశించును.

శ్వాసకాసాదులకు నిదిగ్ధికాదికషాయము.

నిదిగ్ధికామృతాశుంఠీకషాయం పాయయేద్భిషక్,
పిప్పలీచూర్ణసంయుక్తం శ్వాసకాసార్దితాపహమ్. 42
పీనసారుచివైస్వర్యశూలాజీర్ణజ్వరచ్ఛిదం,

వాకుడు, తిప్పతీగ, సొంటి వీనిని కషాయముగాచి యందు పిప్పలిచూర్ణమును
వించిన శ్వాసము, కాసము, అర్దితవాతము, పీనసము, అరుచి, స్వరభంగము,
, అజీర్ణ జ్వరము నశించును.

ప్రసూతిదోషములకు దేవదార్వాదికషాయము.

దేవదారువచాకుష్ఠం పిప్పలీవిశ్వభేషజమ్. 43
కట్ఫలం ముస్తభూనింబ తిక్తాధాన్యాహరీతకీ,
గజకృష్ణాచ దుస్స్పర్శా గోక్షురధన్వయాసకమ్. 44
బృహత్యతివిషాచ్ఛిన్నా కర్కటం కృష్ణజీరకం,

క్వాథమష్టావశేషం తు ప్రసూతాం పాయయేత్త్స్త్రియమ్. 45
శూలకాసజ్వరశ్వాసమూర్ఛాకంపశిరో_ర్తిజిత్,

దేవదారు, వస, చెంగల్వకోష్ఠు, పిప్పళ్లు, సొంటి, కాయఫలము, తుంగముస్తలు, నేలవేము, కటుకరోహిణి, దనియాలు, కరకకాయలు, గజపిప్పళ్లు, దురదగొండి, పల్లేరు, పెద్దములక, అతివస, తిప్పతీఁగ, కర్కాటశృంగి, నల్లజీలకఱ్ఱ వీనికి నాలుగింతలు నీరుబోసి ఎనిమిదవపాలు మిగులునట్లు కషాయముగాచి ప్రసవించినస్త్రీలకు నిచ్చిన, వారికిగలబాలింతదోషములు, శూలము, కాసము, జ్వరము, శ్వాసము, మూర్ఛ, కంపవాతము, తలపోటు నశించును.

సర్వశీతజ్వరములకు క్షుద్రాదికషాయము.

క్షుద్రాధాన్యకశుంఠీభిర్గుడూచీముస్తపద్మకైః. 46
రక్తచందనభూనింబపటోలావృషపౌష్కరైః,
కటుకేంద్రయవారిష్టభార్ఙ్గిపర్పటకైస్సమైః. 47
క్వాథం ప్రాతర్నిషేవేత సర్వశీతజ్వరచ్ఛిదం,

వాకుడు, దనియాలు, సొంటి, తిప్పతీఁగ, తుంగముస్తలు, పద్మకములు, రక్తచందనము, నేలవేము, చేదుపొట్ల, అడ్డసరము, పుష్కరమూలము, కటుకరోహిణి, కొడిశపాలవిత్తులు, వేము, గంటుభారంగి, పర్పాటకము వీనిని సమభాగములుగ గ్రహించి కషాయముగాచి నిత్యము ప్రాతఃకాలమున సేవించిన సర్వశీతజ్వరములు నశించును.

విషమజ్వరములకు ముస్తాకషాయము.

ముస్తాక్షుద్రామృతాశుంఠీధాత్రీ క్వాథస్సమాక్షికః. 48
పిప్పలీచూర్ణసంయుక్తో విషమజ్వరనాశనః,

తుంగముస్తలు, వాకుడు, తిప్పతీఁగ, సొంటి, ఉసిరికయొలుపు వీనిని కషాయముగాచి యందు పిప్పలిచూర్ణము, తేనె గలిపి సేవించిన విషమజ్వరముఖు హరించును.

ఐకాహికజ్వరమునకు పటోలాదికషాయము.

పటోల త్రిఫలానింబాద్రాక్షాశమ్యాకవాసకైః. 49
క్వాథస్సితామధుయుతో జయేదైకాహికం జ్వరం,

చేదుపొట్ల, త్రిఫలములు, వేప, ద్రాక్ష, రేలగిజురు, అడ్డసరము వీనిని కషాయముగాచి యందు పంచదారయు, తేనెయు గలిపి సేవించిన ఐకాహికజ్వరము నశించును.

తృతీయకజ్వరమునకు గుడూచ్యాదికషాయము.

గుడూచీధాన్యముస్తాభిశ్చందనోశీరనాగరైః. 50

కృతం క్వాథం పిబేత్క్షౌద్రసితాయుక్తం జ్వరాతురః,
తృతీయజ్వరనాశాయ తృష్ణాదాహనివారణమ్. 51

తిప్పతీఁగ, దనియాలు, తుంగముస్తలు, రక్తచందనము, వట్టివేళ్లు, సొంటి, వీనిని
షాయముగాచి యందు, తేనె, పంచదార గలిపి సేవించిన తృతీయకజ్వరమునశించును.
తాపము హరించును.

చాతుర్థికజ్వరమునకు దేవదార్వాదికషాయము.

దేవదారుశివావాసా శాలిపర్ణీమహౌషధైః,
ధాత్రీయుతం శృతం శీతం దద్యాన్మధుసితాయుతమ్. 52
చాతుర్థికజ్వరే శ్వాసే కాసే మందానలే తథా,

దేవదారు కరకకాయలు, అడ్డసరపాకు, ముయ్యాకుపొన్న, సొంటి, ఉసిరిక
ప్ప వీనినికషాయముగాచి, చల్లారినపిదప, యందు తేనె, పంచదార గలిపి సేవించిన
కజ్వరము, శ్వాసము, కాసము, అగ్నిమాంద్యము నశించును.

జ్వరాతిసారములకు గుడూచ్యాదికషాయము.

గుడూచీధాన్యకోశీరశుంఠీవాలకపర్పటైః. 53
బిల్వప్రతివిషాపాఠా రక్తచందనవత్సకైః,
కిరాతముస్తేంద్రయవైః క్వథితం శిశిరం పిబేత్. 54
సక్షౌద్రం రక్తపిత్తఘ్నం జ్వరాతీసారనాశనం,

తిప్పతీఁగ, దనియాలు, వట్టివేరు, సొంటి, కురువేరు, పర్పాటకము, మారేడు,
, విషబొద్ది, రక్తచందనము, కొడిశపాల, నేలవేము, తుంగముస్తలు, కొడిశపాల
వీనిని కషాయముగాచి యందు చల్లారినపిదప తేనె గలిపి సేవించిన రక్తపిత్తము,
తిసారము నశించును.

జ్వరాతీసారములకు నాగరాదికషాయము.

నాగరం కుటజోముస్తమమృతాతివిషా తథా. 55
ఏభిః కృతం పిబేత్క్వాథం జ్వరాతీసారనాశనం,

సొంటి, కొడిశపాల, తుంగముస్తలు, తిప్పతీఁగ, అతివస వీనిని కషాయముగాచి
చిన జ్వరాతీసారము నశించును.

ఆమశూలకు ధాన్యపంచకకషాయము.

ధాన్యవాలకబిల్వాబ్దనాగరైస్సాధితం జలమ్. 56
ఆమశూలహరం గ్రాహి దీపనం పాచనం పరం,

దనియాలు, కురువేరు, మారేడు, తుంగముస్తలు సొంటి, వీనిని కషాయముగఁ గాచి సేవించిన ఆమశూల నశించును. ఎక్కుడుగ మలము జాఱుచుండిన దానిఁగట్టును. దీపనము, పాచనము గలుగును.

దీపనపాచనములకు ధాన్యాదికషాయము.

ధాన్యానాగరజః క్వాథః పాచనో దీపనస్తథా. 57
ఏరండమూలయుక్తశ్చ జయేదామానిలవ్యథాం,

దనియాలు, సొంటి వీనిని కషాయముగాచి సేవించిన దీపనము, పాచనము గలుగును. మఱియు దనియాలు, సొంటి, ఆముదపువేరు వీనిని కషాయముగాచి సేవించిన ఆమవాతము నశించును.

ఆమరక్తాతీసారములకు వత్సకాదికషాయము.

వత్సకాతివిషాబిల్వ ముస్తవాలకజశ్శృతః. 58
అతీసారం జయేదామం చిరజం రక్తశూలజిత్,

కొడిశపాల, అతివస, మారేడు, తుంగముస్తలు, వట్టివేళ్లు వీనిని కషాయముగాచి సేవించిన దీర్ఘకాలముగనుండెడి ఆమాతీసారము, పోటుతోఁగూడిన రక్తాతీసారము నశించును.

అతీసారములకు కుటజాష్టకకషాయము.

కుటజాతివిషాపాఠా ధాతకీలోధ్రముస్తకైః. 59
హ్రీబేరదాడిమయుతైః కృతః క్వాథస్సమాక్షికః,
పేయో మోచరసేనైవ కుటజాష్టకసంజ్ఞితః. 60
అతిసారాన్ జయేద్ధాహరక్తశూలామదుస్తరాన్,

కొడిశపాల, అతివస, విషబొద్ది, ఆరెపువ్వు, లొద్దుగపట్ట, తుంగముస్తలు, కురువేరు, దానిమ్మబెరడు వీనిని కషాయము గాచి యందు తేనె, బూరుగబంక గలిపి సేవించిన, తాపముతోగూడిన రక్తాతీసారము, శూలతోగూడిన ఆమాతీసారము దుస్తరమైనను నశించును. ఇదియె కుటజాష్టకమనఁబడు.

అతీసారములకు హ్రీబేరాదికషాయము.

హ్రీబేరధాతకీలోధ్రపాఠాలజ్జాళువత్సకైః. 61
ధాన్యకాతివిషాముస్తాగుడూచీబిల్వనాగరైః,
కృతః కషాయశ్శమయేదతీసారం చిరోత్థితమ్. 62
అరోచకామశూలాస్రజ్వరఘ్నః పాచనస్స్మృతః,

కురువేరు, ఆరెపువ్వు, లొద్దుగపట్ట, విషబొద్ది, అత్తపత్తియాకు, కొడిశపాల,

దనియాలు, అతివస, తుంగముస్తలు, తిప్పతీఁగ, మారేడు, సొంటి వీనిని కషాయము గాచి సేవించిన, చిరకాలముగనుండెడియతిసారము, అరుచి, ఆమశూల, రక్తాతీసారము, జ్వరము వీనిని శమింపఁజేసి పాచనము గలుగఁజేయును.

శిశువులసర్వాతిసారములకు ధాతక్యాదికషాయము.

ధాతకీబిల్వలోధ్రాణి పాఠాలజ్జాళువత్సకైః. 64
ధాన్యకాతివిషా ముస్తా వాలకం గజపిప్పలీ,
ఏభిః కృతం శృతం శీతం శిశుభ్యః క్షౌద్రసంయుతమ్. 65
ప్రదద్యాదవలేహం వా సర్వాతీసారశాంతయే,

ఆరెపువ్వు, మారేడు, లొద్దుగు, విషబొద్ది, అత్తిపత్తియాకు, కొడిశపాల, దనియాలు, అతివస, తుంగముస్తలు, వట్టివేళ్లు, గజపిప్పళ్లు వీనిని కషాయముగాచి చల్లారిన పిదప యందు తేనె గలిపియైనను, లేక, పైవస్తువులను అవలేహము జేసియైనను శిశువుల కొసంగిన సర్వాతీసారములు నశించును.

సర్వగ్రహణులకు శాలిపర్ణ్యాదికషాయము.

శాలిపర్ణీబలాబిల్వాధాన్యం శుంఠీకృతశ్శృతః. 66
ఆధ్మానశూలసహితాం వాతజాం గ్రహణీం జయేత్,

ముయ్యాకుపొన్న, ముత్తవపులగము, మారేడు, దనియాలు, సొంటి వీనిని కషాయముగాచి సేవించిన కడుపుబ్బరము, శూల వీనితోఁగూడి వాతముచే జనించిన గ్రహణి నశించును.

గ్రహణులకు చతుర్భద్రకషాయము.

గుడూచ్యతివిషాశుంఠీముస్తైః క్వాథః కృతో జయేత్. 67
ఆమానుషక్తాం గ్రహణీం గ్రాహీ పాచనదీపనః,

తిప్పతీఁగ, అతివస, సొంటి, తుంగముస్తలు వీనిని కషాయముగాచి సేవించిన ఆమముతోఁగూడినగ్రహణి, మలబద్ధము నశించును. ఆహారమును జీర్ణముచేయును. అగ్ని దీపనము గలుగును.

సర్వాతీసారములకు ఇంద్రయవాదికషాయము.

యవధాన్యపటోలానాం క్వాథస్సక్షౌద్రశర్కరః. 68
యోజ్యస్సర్వాతిసారేషు బిల్వామ్రాస్థిభవస్తథా,

కొడిశపాలవిత్తులు, దనియాలు, చేదుపొట్ల వీనినైనను, లేక మారేడు, మామిడి జీడి వీనినైనను కషాయము పెట్టి యందు తేనె, పంచదార గలిపి సేవించిన సర్వాతీసారములు నశించును.

క్రిమిరోగములకు త్రిఫలాదికషాయము.

త్రిఫలా దేవదారుశ్చ ముస్తామూషకకర్ణికా. 69
శిగ్రు రేతైః కృతః క్వాథః పిప్పలీచూర్ణసంయుతః,
విడంగచూర్ణయుక్తశ్చ క్రిమిఘ్నః క్రిమిరోగహా. 70

త్రిఫలములు, దేవదారు, తుంగముస్తలు, ఎలుకచెవియాకు, మునగ వీనిని కషాయముకాచి యందు పిప్పలిచూర్ణమును, వాయువిళంగములచూర్ణమును గలిపి సేవించిన క్రిములు, క్రిమిరోగములు నశించును.

కామిలాదులకు త్రిఫలాదికషాయము.

ఫలత్రికామృతాతిక్తానింబకైరాతవాసకైః,
జయేన్మధుయుతః క్వాథః కామలాం పాండుతాం తథా. 71

త్రిఫలములు, తిప్పతీఁగె, కటుకరోహిణి, వేము, నేలవేము, అడ్డసరము వీనిని కషాయముగాచి యందు తేనె గలిపి సేవించిన కామెర్లు, పాండువు నశించును.

పాండుశోఫాదులకు పునర్నవాదికషాయము.

పునర్నవాభయానింబదార్వీతిక్తాపటోలకైః,
గుడూచీనాగరయుతైః క్వాథో గోమూత్రసంయుతః. 72
పాండుకాసోదరశ్వాసశూలసర్వాంగశోఫహా,

గలిజేరు, కరకకాయలు, వేము, మ్రానిపసుపు, కటుకరోహిణి, చేదుపొట్ల, తిప్పతీఁగ, సొంటి వీనిని కషాయముగాచి యందు గోమూత్రమునుగలిపి సేవించిన పాండురోగము, కాసము, ఉదరరోగము, శ్వాసము, శూలము, శరీరమందంతట గలిగెడువాపు నశించును.

రక్తపిత్తమునకు వాసాదికషాయము.

వాసాద్రాక్షాభయాక్వాథః పీతస్సక్షౌద్రశర్కరః. 73
నిహంతి రక్తపిత్తార్తిం శ్వాసకాసౌ సుదారుణౌ,

అడ్డసరము, ద్రాక్ష, కరకకాయలు వీనిని కషాయముగాచి యందు తేనె, పంచదార గలిపి సేవించిన రక్తపిత్తము, మిక్కిలి దారుణమైన శ్వాసకాసములు హరించును.

రక్తపిత్తాదులకు కేవలవాసకకషాయము.

రక్తపిత్తక్షయం కాసం శ్లేష్మపిత్తజ్వరం తథా. 74
కేవలో వాసకక్వాథః పీతః క్షౌద్రేణ నాశయేత్,

అడ్డసరమొక్కటియే సమూలముగ గ్రహించి కషాయముగాచి యందు తేనె,
ంచిన రక్తపిత్తము, క్షయరోగము, కాసము, శ్లేష్మపిత్తజ్వరము నశించును.

కాసజ్వరములకు వాసాదికషాయము.

వాసాక్షుద్రామృతాక్వాథః క్షౌద్రేణ జ్వరకాసహా. 75

అడ్డసరము, వాకుడు, తిప్పతీగె వీనిని కషాయముగాచి యందు తేనె గలిపి కాసజ్వరములు నశించును.

కాసములకు క్షుద్రాదికషాయము.

కాసఘ్నః పిప్పలీచూర్ణయుక్తః క్షుద్రాశృతస్తథా,

వాకుడుకషాయంబున పిప్పలిచూర్ణముగలిపి సేవించిన కాసము నశించును.

కాసశ్వాసములకు క్షుద్రాదికషాయము.

క్షుద్రాకులుత్థవాసాభిర్నాగరేణ చ సాధితః. 76
క్వాథః పౌష్కరచూర్ణాఢ్యశ్శ్వాసకాసౌ నివారయేత్,

వాకుడు, ఉలవలు, అడ్డసరము, సొంటి వీనిని కషాయముగాచి యందు పుష్కర ర్ణమును గలిపి సేవించిన శ్వాసము, కాసము నశించును.

ఎక్కిళ్లకు రేణుకాదికషాయము.

రేణుకాపిప్పలీక్వాథో హింగుకల్కేన సంయుతః. 77
పానాదేవ హి పంచాపి హిక్కా నాశయతి క్షణాత్,

రేణుకలు, పిప్పళ్లు వీనిని కషాయముగాచి యందు వేయించిన ఇంగువకల్కమును ంచిన నైదువిధములగు ఎక్కిళ్లు శమించును.

గృధ్రసీవాతములకు దశమూలకషాయము.

హింగుపుష్కరచూర్ణాఢ్యో దశమూలశృతో జయేత్. 78
గృధ్రసీం కేవలక్వాథః శేఫాలీపత్రజస్తథా,

శమూలముల కషాయంబున వేయించిన యింగువ, పుష్కరమూలములు వీని ను గలిపియేని, కేవలము నల్లవావిలిఆకుకషాయమును గాని సేవించిన గృధ్రసీ హరించును.

వాంతులకు బిల్వాదికషాయము.

బిల్వత్వచో గుడూచ్యా వా క్వాథః క్షౌద్రేణ సంయుతః. 79
జయేత్త్రిదోషజం ఛర్దిం పర్పటః పిత్తజం తథా,

మారేడుపట్టనేని, తిప్పతీఁగెనేని కషాయముగాచి యందు తేనె గలిపి సేవించిన వాతపిత్తశ్లేష్మములవలన గలిగినవాంతులును, పర్పాటకకషాయములో తేనెగలిపి సేవించిన పిత్తమువలన జనించినవాంతులును హరించును.

వాతములకు రాస్నాపంచకకషాయము.

రాస్నామృతామహాదారునాగరైరండజం శృతమ్. 80
సప్తధాతుగతే వాతే సామే సర్వాంగజే పిబేత్,

సన్నరాస్నము, తిప్పతీఁగ, దేవదారు, సొంటి, ఆముదపువ్రేళ్లు వీనిని కషాయము గాచి సేవించిన, సప్తధాతుగతమైనవాతము, ఆమవాతము, సర్వాంగవాతము నశించును.

కటిగ్రహాదివాతములకు రాస్నాసప్తకకషాయము.

రాస్నాగోక్షురకైరండదేవదారుపునర్నవా. 81
గుడూచ్యారగ్వధశ్చైవ క్వాథమేషాం విపాచయేత్,
శుంఠీచూర్ణేన సంయుక్తం పిబేజ్జంఘాకటిగ్రహే. 82
పార్శ్వపృష్ఠోరుపీడాయామామవాతే సుదుస్తరే,

సన్నరాస్నము, పల్లేరు, ఆముదపువ్రేళ్లు, దేవదారు, గలిజేరు, తిప్పతీఁగ, రేలగుజ్జు వీనిని కషాయముగాచి యందు శుంఠిచూర్ణమును గలిపి సేవించిన, పిక్కలు, నడుము, ప్రక్కలు, వీపు, తొడలు వీనియందు గలిగెడివాతము, దుస్తరమగు ఆమవాతము నశించును.

సంతతాదిజ్వరములకు పటోలాదికషాయము.

పటోలేంద్రయవాదారుత్రిఫలాముస్తగోస్తనైః. 83
మధుకామృతవాసానాం క్వాథం క్షౌద్రయుతం పిబేత్,
సంతతే సతతే చైవ ద్వితీయకతృతీయకే. 84
ఐకాహికే వా విషమే దాహపూర్వే నవజ్వరే,

చేదుపొట్ల, కొడిశపాలవిత్తులు, దేవదారు, త్రిఫలములు, తుంగముస్తలు, ద్రాక్ష, అతిమధురము, తిప్పతీఁగ, అడ్డసరము వీనిని కషాయముగాచి యందు, తేనె గలిపి సేవించిన సంతతజ్వరము, సతతజ్వరము, ద్వ్యాహికజ్వరము, తృతీయకజ్వరము, ఐకాహికజ్వరము, దాహపూర్వమగువిషమజ్వరము, నవజ్వరము నశించును.

సన్నిపాతజ్వరములకు పిప్పల్యాదికషాయము.

పిప్పలీ పిప్పలీమూలం చవ్యచిత్రకనాగరైః. 85
వచాపాతివిషాజాజీపాఠావత్సకరేణుకైః,
కిరాతతిక్తకం మూర్వా సర్షపామరిచాని చ, 86

కటుకం పుష్కరం భార్ఙీ విడంగం కర్కటాహ్వయం,
అర్కమూల బృహత్సింహీ శ్రేయసీ సదురాలభా. 87
దీప్యకం చాజమోదా చ శుకనాసాదిహింగుభిః,
ఏతాని సమభాగాని గణోఽష్టావింశకో మతః. 88
కషాయముపభుంజీత వాతశ్లేష్మజ్వరాపహం,
హంతి వాతం తథా శీతం చ్ఛేదజం ప్రబలం కఫమ్. 89
ప్రలాపం చాతినిద్రాం చ రోమహర్షారుచీ తథా,
మహావాతేఽపతంత్రే చ సర్వగాత్రే చ శూన్యతామ్. 90
అయం సర్వజ్వరాన్ హంతి సన్నిపాతాంస్త్రయోదశ,

పిప్పళ్లు, మోడి, చవ్యము, చిత్రమూలము, సొంటి, వస, అతివస, జీలకఱ్ఱ, విష బొద్ది, కొడిశపాలవిత్తులు, రేణుకలు, నేలవేము, చాగనార, ఆవాలు, మిరియములు, కటుకరోహిణి, పుష్కరమూలము, గంటుభారంగి, వాయువిళంగములు, కర్కాటకశృంగి, జిల్లేడువేరు, పెద్దములక, కరకకాయలు, దురదగొండివిత్తులు, ఓమము, అజామోదము, దుండిలము, ఇంగువ అనునీఇరువదెనిమిది ద్రవ్యములను సమభాగములుగ నలియగొట్టి కషాయముగాచి సేవించిన వాతశ్లేష్మజ్వరము, వాతము, శైత్యము, ప్రబలమగుకఫము, ప్రలాపము, అతినిద్ర, గగుర్పాటు, అరుచి, మహావాతము, అపతంత్రకవాతము, అవయవములయందు స్పర్శజ్ఞానము లేకుండుట, సర్వజ్వరములు, పదిమూఁడుసన్నిపాతజ్వరములు నశించును.

## సర్వాంగకంపవాతాదులకు మహారాస్నాదికషాయము.

రాస్నా ద్విగుణభాగా స్యాదేకభాగాస్తతః పరే. 91
ధన్వయాసబలైరండ దేవదారుసటీవచా,
వాసకో నాగరం పథ్యా చవ్యాముస్తా పునర్నవా. 92
గుడూచీ వృద్ధదారుశ్చ శతపుష్పా చ గోక్షురః,
అశ్వగంధా ప్రతివిషా కృతమాలశ్శతావరీ. 93
కృష్ణాసహచరశ్చైవ ధాన్యకం బృహతీద్వయం,
ఏభిః కృతం పిబేత్క్వాథం శుంఠీచూర్ణేన సంయుతమ్. 94
కృష్ణాచూర్ణేన వా యోగరాజగుగ్గులునాఽథవా,
అజమోదాదినావాఽపి తైలేనైరండజేన వా. 95
సర్వాంగకంపే కుబ్జత్వే పక్షాఘాతేఽపబాహుకే,
గృధ్రస్యామామవాతే చ శ్లీపదే చాపతానకే. 96

అంత్రవృద్ధౌ తథాఽఽఢ్మానే జంఘాజానుగతేర్దితే,
శుక్రామయే మేఢ్రరోగే వంధ్యాయోన్యామయేషు చ,
మహారాస్నాదిరాఖ్యాతో బ్రహ్మణా గర్భకారణం,

సన్నరాస్నము రెండుభాగములు, దురదగొండి, ముత్తవపులగము, ఆముదపు దేవదారు, కచోరములు, వస, అడ్డసరము, సొంటి, కరకకాయలు, చవ్యము, ముస్తలు, గలిజేరు, తిప్పతీఁగ, వృద్ధదారు (పెద్దసోపు), పెద్దసదాప, పల్లేరు, పె గడ్డ, అతివస, రేలగుజ్జు, పిల్లపీచరగడ్డలు, పిప్పళ్లు, పచ్చములుగోరింట, దనియ ములక, వాకుడు ఇవన్నియు నొక్కొకభాగముచేర్చి కషాయముగాచి యందు సొ చూర్ణమునుగాని, పిప్పలిచూర్ణమును గాని, యోగరాజగుగ్గులుగాని, అజామోదము ఆముదమునుగాని, రోగము ప్రకృతిననుసరించి చేర్చి సేవించిన సర్వాంగకంపవాత కుబ్జత్వము, పక్షాఘాతము, అపబాహుకము, నడుము మొదలు కాళ్లవఱకు బాధనుగ జేసెడి గృధ్రసీవాతము, ఆమవాతము, బోదకాలు, ఱొమ్మునకు నెగతట్టెడి అపత వాతము, అంత్రవృద్ధి, కడుపుబ్బరము గలుగజేసెడి వాతము, పిక్కలు మోకా ఆశ్రయించిన అర్దితవాతము, శుక్రరోగము, మేఢ్రరోగము, వంధ్యలగుస్త్రీలక యోనిరోగములు నశించును. మఱియు బ్రహ్మచే చెప్పంబడిన నీ మహారాస్నాదికషాయ గర్భధారణము గలుగంజేయుంను.

## స్తనాదిగతవాతములకు ఏరండసప్తకకషాయము.

ఏరండో బీజపూరశ్చ గోక్షురో బృహతీద్వయమ్.
అశ్మభేదస్తథాబిల్వ ఏతన్మూలైః కృతశ్శృతః,
ఏరండతైలహింగ్వాఢ్యస్సయవక్షారసైంధవః.
స్తనస్కంధకటీమేఢ్రహృదయోత్థాం వ్యథాం జయేత్,

ఆముదపువేళ్లు, మాదీఫలపువేళ్లు, పల్లేరువేళ్లు, వాకుడువేళ్లు, పెద్దములకవే పాషాణభేది (కొండపిండివేరు), మారేడు వీనిని కషాయముగాచి యందు ఆముదమ గాని, ఇంగువపొడిచేసిగాని, యవక్షారమునుగాని, సైంధవలవణమునుగాని, గలిపి సేవిం స్తనములు, భుజశిరస్సులు, నడుము, మేఢ్రము, హృదయము వీనియందు గలిగిన వాత యొక్కబాధ నశించును.

## వాతశూలలకు నాగరాదికషాయము.

నాగరైరండయోః క్వాథః క్వాథ ఇంద్రయవస్య వా. 1
హింగుసౌవర్చలోపేతో వాతశూలనివారణః,

సొంటి, ఆముదపువేళ్లు వీనికషాయమునగాని, కొడిశపాలవిత్తుల కషాయంబ

గాని వేయించిన ఇంగువచూర్ణము, సౌవర్చలవణము వీనిని గలిపి సేవించిన వాతశూల నివారించును.

పిత్తశూలకు త్రిఫలాదికషాయము.

త్రిఫలారగ్వధక్వాథశ్శర్కరాక్షౌద్రసంయుతః. 101
రక్తపిత్తహరో దాహపిత్తశూలనివారణః,

త్రిఫలములు, రేలగుజ్జు వీనికషాయంబున తేనె, పంచదారగలపి సేవించిన రక్తపిత్తము, తాపము, పిత్తశూల నివారించును.

శ్లేష్మశూలకు ఏరండాదికషాయము.

ఏరండమూలం ద్విపలం జలేష్టగుణితే పచేత్. 102
తత్క్వాథో యావశూకాఢ్యః పార్శ్వహృత్కఫశూలహా,

ఆముదపువేరు రెండుపలములు దెచ్చి, యందెనిమిదింతలు నీరుబోసి కషాయము గాచి యందు యవక్షారమును గలిపి సేవించిన, ప్రక్కలు, హృదయము వీనియందు శ్లేష్మముచే జనించుశూలలు హరించును.

హృద్రోగాదులకు దశమూలాదికషాయము.

దశమూలకృతః క్వాథస్సయవక్షారసైంధవః. 103
హృద్రోగగుల్మశూలాని కాసశ్వాసం చ నాశయేత్,

దశమూలములు కషాయముగాచి యందు యవక్షారము, సైంధవలవణము గలిపి సేవించిన హృద్రోగము, గుల్మము, శూల, కాసము, శ్వాసము నశించును.

మూత్రకృచ్ఛ్రములకు హరీతక్యాదికషాయము.

హరీతకీ దురాలంభా కృతమాలకగోక్షురైః. 104
పాషాణభేదసహితైః క్వాథో మాక్షికసంయుతః,
విబంధే మూత్రకృచ్ఛ్రే చ సదాహే సరుజే హితః. 105

కరకకాయలు, దూలగొండి, రేలగుజ్జు, పల్లేరు, కొండపిండివేరు వీనిని కషాయము గాచి యందు తేనెగలపి సేవించిన మలబద్ధము, తాపము పోటుతోగూడినమూత్రకృచ్ఛ్రము నశించును.

మూత్రాఘాతాదులకు వీరతర్వాదికషాయము.

వీరతరుర్వృక్షాదనీ కాశస్సహాచరత్రయం,
కుశద్వయనలోగుంద్రా బకపుష్పోఽగ్నిమంథకః. 106
మూర్వాపాషాణభేదశ్చ స్యోనాకో గోక్షురస్తథా,

అపామార్గశ్చ కమలం బ్రాహ్మీ చేతి గణో వరః. 107
వీరతర్వాదిరిత్యుక్తశ్శర్కరాశ్మరికృచ్ఛ్రిహా,
మూత్రాఘాతం వాయురోగాన్నాశయేన్నిఖిలానపి. 108

నల్లజీడి, బదనిక, జెల్లు, తెల్లగోరింట, పచ్చగోరింట, నల్లగోరింట, కుశదర్భ, ముంజదర్భ, కిక్కసగడ్డి, తుంగముస్తలు, లింగదొండ, పాదిరి, చాగనార, కొండపిండి వేరు, దుండిలపువ్రేళ్లు, పల్లేరు, ఉత్తరేణి, తామరపూలు, సరస్వతియాకు వీనిని కషాయముగాచి సేవించిన మూత్రమునవెడలుశర్కర, మూత్రద్వారమున రాళ్లుండుటచే జనించెడి రోగములు, మూత్రకృచ్ఛ్రము, మూత్రాఘాతము, సమస్తవాతరోగములు నశించును.

శర్కరాశ్మరికి ఏలాదికషాయము.

ఏలామధుకగోరంటరేణుకైరండవాసకాః,
కృష్ణాశ్మభేదసహితః క్వాథ ఏషాం సుసాధితః. 109
శిలాజతుయుతః పేయశ్శర్కరాశ్మరికృచ్ఛ్రిహా,

ఏలకులు, అతిమధురము, పల్లేరు, రేణుకలు, ఆముదపువేళ్లు, అడ్డసరము, పిప్పళ్లు, కొండపిండివేళ్లు వీనిని కషాయముగాచి యందు శిలాజతుచూర్ణమును గలిపి సేవించిన మూత్రద్వారమున శర్కర వెడలుట, మూత్రాశ్మరి, మూత్రకృచ్ఛ్రము నశించును.

మూత్రకృచ్ఛ్రములకు గోక్షురాదికషాయము.

సమూలగోక్షురక్వాథస్సితామాక్షికసంయుతః. 110
నాశయేన్మూత్రకృచ్ఛ్రాణి తథా చోష్ణసమీరణం,

పల్లేరును సమూలముగ కషాయముగాచి యందు తేనె, పంచదారగలపి సేవించిన మూత్రకృచ్ఛ్రము, ఉష్ణవాతము నశించును.

ప్రమేహములకు త్రిఫలాదికషాయము.

వరాదార్వ్యబ్దదారూణాం క్వాథః క్షౌద్రేణ మేహహా. 111

త్రిఫలములు, మ్రానిపసుపు, తుంగముస్తలు, దేవదారు వీనిని కషాయముగాచి, యందు తేనె గలిపి సేవించిన ప్రమేహములు నశించును.

వత్సకాదికషాయము.

వత్సకత్రిఫలాదార్వీ ముస్తకో బీజకస్తథా,

కొడిశపాలవిత్తులు, త్రిఫలములు, మ్రానిపసుపు, తుంగముస్తలు, వేగిసపుపట్ట వీనిని కషాయముగాచి సేవించిన ప్రమేహములు నశించును.

## త్రిఫలాదికషాయము.

ఫలత్రికాబ్దదార్వీణాం విశాలాయాశ్శృతం పిబేత్. 112
నిశాకల్కయుతం సర్వప్రమేహవినివృత్తయే,

త్రిఫలములు, తుంగముస్తలు, మ్రానిపసుపు, పెద్దపాపర వీనిని కషాయముగాచి యందు పసుపు కల్కమునుగలిపి సేవించిన సమస్తప్రమేహములు నశించును.

## ప్రదరరోగములకు దార్వ్యాదికషాయము.

దార్వీరసాంజనం ముస్తం భల్లాతశ్శ్రీఫలం వృషః. 113
కైరాతశ్చ పిబేదేషాం క్వాథం శీతం సమాక్షికం,
జయేత్సశూలం ప్రదరం పీతశ్వేతాసితారుణమ్. 114

మ్రానిపసుపు, రసాంజనము, తుంగముస్తలు, నల్లజీడిగింజలు, మారేడు, అడ్డసరము, నేలవేము వీనిని కషాయముగాచి చల్లారినపిదప నందు తేనెగలిపి సేవించిన పోటుతోఁగూడి పసుపు ఎఱుపు నలుపు తెలుపువర్ణములుగ స్రవించెడి స్త్రీలప్రదరరోగములు హరించును.

## యోనిరోగవ్రణాదికములకు న్యగ్రోధాదిగణకషాయము.

న్యగ్రోధప్లక్షకోశామ్రవేతసో బదరీతుణిః,
మధుయష్టిప్రియాళశ్చ లోధ్రద్వయముదుంబరః 115
పిప్పలశ్చ మధూకశ్చ తథాపారిసపిప్పలః,
సల్లకీలిందుకీజంబూద్వయమామ్రతరుశ్శివా. 116
కదంబకకుభౌ చైవ భల్లాతకఫలాని చ,
న్యగ్రోధాదిగణక్వాథం యథాలాభం చ కారయేత్.
అయంక్వాథో మహాగ్రాహీ వ్రణోర్వ్య భగ్నం చ నాశయేత్,
యోనిదోషహరో దాహమేదో మేహవిషాపహః. 118

మఱ్ఱి, జువ్వి, తుమ్మెదమామిడి, ప్రబ్బలి, రేగు, నందివృక్షము, అతిమధురము, మొగలి, ఎఱ్ఱలొద్దుగు, అత్తి, రావి, ఇప్ప, గంగరావి, అందుగు, నల్లతుమికి, చిన్న నేరేడు, పెద్దనేరేడు, మామిడి, కరకకాయలు, కడిమిచెట్టు, మద్ది, జీడివిత్తులు అనునీ న్యగ్రోధాదిగణమునంతయుగాని, అందు దొరకినంతయుగాని కషాయముగాచి సేవించిన మలనిరోధము, వ్రణరోగము, అస్థిభంగము, యోనిదోషము, తాపము, మేదోరోగము, మేహరోగము, విషదోషము నశించును.

## మేదోరోగములకు బిల్వాదికషాయము.

బిల్వోగ్నిమంథస్స్యోనాకః కాశ్మరీ పాటలా తథా,

క్వాథ ఏషాం జయేన్మేదో దోషం క్షౌద్రేణ సంయుతః.

మారేడువ్రేళ్లు, కూరసెన్నెల్లివ్రేళ్లు, దుండిలపువ్రేళ్లు, గుమ్ముడువ్రేళ్లు, పాది వీనిని కషాయముగాచి యందు తేనె గలిపి సేవించిన శరీరమునకు మేదోవృద్ధిచే మేదోరోగము నశించును.

త్రిఫలాదికషాయము.

క్షౌద్రేణ త్రిఫలాక్వాథః పీతో మేదోహరస్మృతః,
శీతీభూతం తథోష్ణాంబు మేదోహృత్క్షౌద్రసంయుతమ్.

త్రిఫలములకషాయముగాచి యందుగాని, చల్లారిన యుష్ణోదకమందుగాని గలిపి సేవించిన మేదోరోగము హరించును.

ఉదరరోగములకు చవ్యాదికషాయము.

చవ్యచిత్రకవిశ్వానాం సాధితో దేవదారుణా,
క్వాథస్త్రివృచ్చూర్ణయుతో గోమూత్రేణోదరాన్ జయేత్

చవ్యము, చిత్రమూలము, సొంటి, దేవదారు వీనిని కషాయముగాచి ఁ తెగడచూర్ణము, గోమూత్రము గలిపి సేవించిన ఉదరరోగము లన్నియు నశించున

శోఫోదరములకు పునర్నవాదికషాయము.

పునర్నవామృతాదారు పథ్యానాగరసాధితః,
గోమూత్రగుగ్గులుయుతః క్వాథశ్శోఫోదరాపహః.

గలిజేరు, తిప్పతీఁగె, దేవదారు, కరకకాయలు, సొంటి వీనిని కషాయమ యందు గుగ్గులుచూర్ణము, గోమూత్రము గలిపి సేవించిన శోఫోదరములు హరించు

యకృత్ప్లీహములకు పథ్యాదికషాయము.

పథ్యారోహితకక్వాథం యవక్షారకణాయుతమ్,
ప్రాతః పిబేద్యకృత్ప్లీహగుల్మోదరనివృత్తయే.

కరకకాయలు, ములుమోదుగ వీనిని కషాయముగాచి యందు యవక్షా పిప్పలిచూర్ణము గలిపి ప్రాతఃకాలమునసేవించిన యకృత్తు, ప్లీహము, గుల్మము, ఉద నశించును.

వాపులకు పునర్నవాదికషాయము.

పునర్నవాదారునిశా నిశాశుంఠీ హరీతకీ,
గుడూచీ చిత్రకో భార్ఙ్గీ దేవదారుచతైశ్శృతః.
పాణిపాదోదరముఖప్రాప్తం శోఫం వినాశయేత్,

గలిజేరు, మ్రానిపసుపు, పసుపు, సొంటి, కరకకాయలు, తిప్పతీగె, చిత్రమూలము, గంటుభారంగి, దేవదారు వీనిని కషాయముగాచి సేవించిన చేతులు, కాళ్లు, ఉదరము, ముఖము వీనియందు జనించెడువాపులు నశించును.

## వృషణశోఫలకు త్రిఫలాదికషాయము.

ఫలత్రికోద్భవం క్వాథం గోమూత్రేణైవ పాయయేత్,
వాతశ్లేష్మకృతం హంతి శోఫం వృషణసంభవమ్. 125

త్రిఫలములను కషాయముగాచి యందు గోమూత్రమును గలిపి సేవించిన వాతశ్లేష్మములవలన వృషణములయందు గలిగెడివాపులు హరించును.

## ఆంత్రవృద్ధులకు రాస్నాది కషాయము.

రాస్నామృతాబలాయష్టిగోకంటైరండజశ్శృతః,
ఏరండతైలసంయుక్తో వృద్ధిమంత్రోద్భవాం జయేత్. 126

సన్నరాస్న, తిప్పతీగ, ముత్తవపులగము, యష్టిమధుకము, పల్లేరు, ఆముదపువ్రేళ్లు, వీనిని కషాయముగాచి యందు ఆముదముగలిపి సేవించిన ఆంత్రవృద్ధి నశించును.

## గండమాలలకు చందనాదికషాయము.

కాంచనారత్వచః క్వాథశ్శుంఠీచూర్ణేన నాశయేత్,
గండమాలాం తథా క్వాథః క్షౌద్రేణ వరణత్వచః. 127

దేవకాంచనపుపట్టను కషాయముగాచి యందు సొంటిచూర్ణమును గలిపియైనను లేక, ఉలిమిడిపట్టను కషాయముగాచి యందు తేనెగలిపియైనను సేవించిన గండమాలలు హరించును.

## శ్లీపదాదిరోగములకు శాఖోటకకషాయము.

శాఖోటవల్కలక్వాథం గోమూత్రేణ యుతం పిబేత్,
శ్లీపదానాం వినాశాయ మేదోదోషనివృత్తయే. 128

పెద్దబేనపట్టను కషాయముగాచి యందు గోమూత్రమును గలిపి సేవించిన బోదకాలు, మేదోరోగములు నశించును.

## అంతర్విద్రధులకు పునర్నవాదికషాయము.

పునర్నవావరుణయోః క్వాథోఽంతర్విద్రధీన్జయేత్,
తథా శిగ్రుభవక్వాథో హింగుసైంధవసంయుతః. 129

తెల్లగలిజేరు, ఉలిమిడిపట్ట వీనిని కషాయముగాచి సేవించినను, లేక మునగపట్టను కషాయముగాచి యందు ఇంగువచూర్ణము, సైంధవలవణము వీనిని గలిపి సేవించినను అంతర్విద్రధులు హరించును.

మధ్యవిద్రధులకు వరుణాదికషాయము.

వరుణాదిగణక్వాథమపక్వే మధ్యవిద్రధౌ,
ఊషకాదిరజోయుక్తం పిబేచ్ఛమనహేతవే.

వరుణాదిగణమును కషాయముగాచి యందూషకాదిగణచూర్ణమును గలిపి చిన అపక్వముగనుండెడి మధ్యవిద్రధులు హరించును.

వరుణాదిగణము.

వరుణో బకపుష్పశ్చ బిల్వాపామార్గచిత్రకాః,
అగ్నిమంథద్వయం శిగ్రుద్వయం చ బృహతీద్వయమ్.
సైరేయకత్రయం మూర్వా మేషశృంగీ కిరాతకః,
అజశృంగీ చ బింబీచ కరంజశ్చ శతావరీ.
వరుణాదిగణక్వాథః కఫమేదోహరస్స్మృతః,
హంతి గుల్మం శిరశ్శూలం తథాభ్యంతరవిద్రధీన్.

ఉలిమిడి, లింగదొండ, మారేడు, ఉత్తరేణు, చిత్రమూలము, చిన్నకారు పెద్దకారనెల్లి, చేదుమునగ, తీపిమునగ, వాకుడు, పెద్దములక, నల్లగోరింట, పచ్చగో తెల్లగోరింట, చాగపట్ట, వద్దిపట్ట, నేలవేము, దుష్టపుతీగ, దొండవేరు, కానుగపట్ట పీచరగడ్డ, అనునీవరుణాదిగణమును కషాయముగాచి సేవించిన శ్లేష్మరోగము, రోగము, గుల్మములు, తలపోటులు, అంతర్విద్రధులు నశించును.

ఊషకాదిగణము.

ఊషకస్తుత్థకం హింగు కాసీసద్వయసైంధవమ్,
సశిలాజితు కృచ్ఛ్రాశ్మగుల్మమేదఃకఫాపహమ్.

చౌటిమన్ను, శుద్ధిచేసిన మైలతుత్థము, వేయించిన ఇంగువ, ధాతుకాసీసము, కాసీసము, సైంధవలవణము, శిలాజతు; వీనిని చూర్ణముగావించి సేవించిన మూ కృచ్ఛ్రము, అశ్మరి, గుల్మములు, మేదోరోగము, శ్లేష్మరోగము హరించును.

భగందరములకు ఖదిరాదికషాయము.

ఖదిరత్రిఫలాక్వాథో మహిషీఘృతసంయుతః,
విడంగచూర్ణయుక్తశ్చ భగందరవినాశనః.

చంద్రచేవ, త్రిఫలములు, వీనిని కషాయముగాచి యందు బఱ్ఱెనెయ్యి, వా విడంగముల చూర్ణము, వీనిని గలిపిసేవించిన భగందరములు నశించును.

ఉపదంశములకు పటోలాదికషాయము.

పటోలత్రిఫలానింబకిరాతఖదిరాసనైః,

క్వాథః పీతో జయేత్సర్వానుపదంశాన్సగుగ్గులుః. 136

చేదుపొట్ల, త్రిఫలములు, వేపచెక్క, నేలవేము, చంద్రచేవ, వేగిసపట్ట వీని కషాయంబున శుద్ధిచేసిన గుగ్గులుచూర్ణమునుగలిపి సేవించిన ఉపదంశరోగము లన్నియు నశించును.

వాతరక్తములకు అమృతాదికషాయము.

అమృతైరండవాసానాం క్వాథా ఏరండతైలయుక్,
పీతస్సర్వాంగసంచారి వాతరక్తం జయేద్ధ్రువమ్. 137

తిప్పతీఁగ, ఆముదపువ్రేళ్లు, అడ్డసరము వీనిని కషాయముగాచి యందు ఆముదమును గలిపి సేవించిన శరీరమునందంతట వ్యాపించెడివాతరక్తము నశించును.

పటోలాదికషాయము.

పటోలం త్రిఫలా తిక్తా గుడూచీ చ శతావరీ,
ఏతత్క్వాథో జయేత్పీతో వాతాస్రం దాహసంయుతమ్. 138

చేదుపొట్ల, త్రిఫలములు, కటుకరోహిణి, తిప్పతీఁగ, పిల్లపీచరగడ్డ వీనిని కషాయముకాచి సేవించిన తాపముతోఁగూడిన వాతరక్తము నశించును.

శ్వేతకుష్ఠములకు అవల్గుజాదికషాయము.

క్వాథోఽవల్గుజచూర్ణాఢ్యో ధాత్రీఖదిరసారయోః,
జయేత్సుసేవితో నిత్యం కుష్ఠం పథ్యాశినాం నృణామ్. 139

ఉసిరికయొలుపు, చంద్రచేవ వీని కషాయముగాచి యందు బావంచివిత్తుల చూర్ణమునుగలిపి పథ్యంబుగనుండి దీర్ఘకాలము సేవించిన శ్వేతకుష్ఠువులు (బొల్లులు) నశించును.

వాతరక్తములకు లఘుమంజిష్ఠాదికషాయము.

మంజిష్ఠాత్రిఫలాతిక్తా వచాదారునిశామృతాః,
నింబశ్చైషాం కృతః క్వాథో వాతరక్తవినాశనః. 140
పామాకాపాలికాకుష్ఠరక్తమండలజిన్మతః,

మంజిష్ఠ, త్రిఫలములు, కటుకరోహిణి, వస, మ్రానిపసుపు, తిప్పతీఁగ, వేపచెక్క వీనిని కషాయముగాచి సేవించిన, వాతరక్తము, గజ్జి, కురుపులు, కపాలికాకుష్ఠము, రక్తమండలము హరించును.

సర్వకుష్ఠములకు బృహన్మంజిష్ఠాదికషాయము.

మంజిష్ఠాముస్తకుటజగుడూచీకుష్ఠనాగరైః. 141
భార్గీక్షుద్రావచానింబనిశాద్వయఫలత్రికైః,

పటోలకటుకామూర్వా విడంగాసనచిత్రకైః,
శతావరీత్రాయమాణాకృష్ణేంద్రయవవాసకైః,
భృంగరాజమహాదారుపాఠాఖదిరచందనైః.
త్రివృద్వరుణకైరాతవాకుచీకృతమాలకైః,
శాఖోటకమహానింబకరంజాతివిషాజలైః.
ఇంద్రవారుణికానంతాసారిబాపర్పటైస్సమైః,
ఏభిః కృతం పిబేత్క్వాథం కృష్ణాగుగ్గులుసంయుతమ్.
అష్టాదశసు కుష్ఠేషు వాతరక్తార్దితే తథా,
ఉపదంశే శ్లీపదే చ ప్రసుప్తౌ పక్షఘాతకే.
మేదోదోషే నేత్రరోగే మంజిష్ఠాదిః ప్రశస్యతే,

మంజిష్ఠ, తుంగముస్తలు, కొడిశపాల, తిప్పతీఁగ, చంగల్వకోష్ఠు, సొంటి, భారంగి, వాకుడు, వస, వేప, పసుపు, మ్రానిపసుపు, త్రిఫలములు, చేదుపొట్ల, కరోహిణి, చాగ, వాయువిడంగములు, వేగిసచెక్క, చిత్రమూలము, పిల్లిపీఁచరగడ్డ, క్రానుగ, పిప్పళ్లు, కొడిశపాలవిత్తులు, అడ్డసరము, గుంటగలగర, దేవదారు, విషచంద్రచెక్క, రక్తచందనము, తెగడ, ఉలిమిడిపట్ట, నేలవేము, బావంచివిత్తులు, గుజ్జు, పెద్దచేదుపట్ట, పెద్దవేము, క్రానుగచక్క, అతివస, కురువేరు, పెద్దపాపరదురదగొండివ్రేళ్లు, సుగంధివ్రేళ్లు, పర్పాటకము వీనిని సమభాగములుగ గ్రహించి యమునుగాచి యందు, పిప్పలిచూర్ణమును, గుగ్గులుచూర్ణమును గలిపి సేవించిన పదుమిదికుష్ఠములు, వాతరక్తము, ఉపదంశము, బోదకాలు, శరీరమును స్పర్శజ్ఞానము లేకుజేసెడి రోగము, పక్షఘాతవాతము, మేదోరోగము, నేత్రరోగము నశించును.

### శిరోనేత్రరోగములకు పథ్యాదికషాయము.

పథ్యాక్షధాత్రీభూనింబనిశానింబామృతాయుతైః.
కృతః క్వాథషడంగోయం సగుడశ్శీర్షశూలహా,
భ్రూశంఖకర్ణశూలాని తథాఽర్ధశిరసో రుజమ్.
సూర్యావర్తం శంఖకం చ దంతపాతం చ తద్రుజం,
నక్తాంధ్యం పటలం శుక్రం చక్షుఃపీడాం వ్యపోహతి.

త్రిఫలములు, నేలవేము, పసుపు, వేపచెక్క, తిప్పతీఁగ వీనిని కషాయముయందు బెల్లమునుగలిపి సేవించిన తల, కనుబొమలు, శంఖస్థానము, చెవులు, వీనియందు పోట్లు, అరతలనొప్పి, సూర్యావర్తము, శంఖశూల, పండ్లూడుటచే గలుగుపోట్లు, దంతశూల, రేజీఁకటి, కండ్లపొరలు, కంటిపూలు, కండ్లనొప్పులు నశించును.

### నేత్రరోగములకు వాసాదికషాయము.

వాసావిశ్వామృతాదార్వీ రక్తచందనచిత్రకైః,
భూనింబనింబకటుకా పటోలత్రిఫలాంబుదైః. 150
యవ కాలింగకుటజైః క్వాథస్సర్వాక్షిరోగహా,
వైస్వర్యం పీనసం శ్వాసం నాశయేదురసః క్షతమ్. 151

అడ్డసరము, సొంటి, తిప్పతీఁగ, మ్రానిపసుపు, రక్తచందనము, చిత్రమూలము, ము, వేపచెక్క, కటుకరోహిణి, చేదుపొట్ల, త్రిఫలములు, తుంగముస్తలు, లు, పుచ్చవేరు, కొడిశపాలవిత్తులు వీనికషాయముగాచి సేవించిన సమస్తనేత్ర రోగ, స్వరభంగము, పీనసము, శ్వాస, ఉరఃక్షతము నశించును.

### అమృతాదికషాయము.

అమృతాత్రిఫలాక్వాథః పిప్పలీచూర్ణసంయుతః,
సక్షౌద్రశ్శీలితో నిత్యం సర్వనేత్రవ్యథాం జయేత్. 152

తిప్పతీఁగ, త్రిఫలములు వీనికషాయముగాచి యందు పిప్పలిచూర్ణమును, తేనెను సేవించిన సమస్తనేత్రరోగములు హరించును.

### వ్రణాదులకు అశ్వత్థాదికషాయము.

అశ్వత్థోదుంబురప్లక్షవటవేతసజశ్శృతః,
వ్రణశోఘోపదంశానాం నాశనః క్షాళనాత్మృతః. 153

రావిపట్ట, అత్తిపట్ట, జువ్విపట్ట, మఱ్ఱిపట్ట, ప్రబ్బలి వీనిని కషాయముగాచి యా మంబుచే గడిగిన వ్రణములు, వాపు, లింగరోగములు నశించును.

### ప్రమథ్యవిధానము.

ప్రమథ్యా ప్రోచ్యతే ద్రవ్యపలకల్కీకృతాచ్ఛృతాత్,
తోయేఽష్టగుణితే తస్యాః పానమాహుః పలద్వయమ్. 154

పలప్రమాణము పచ్చిద్రవ్యములను నూరుటచేఁగాని, ఎండినద్రవ్యములను నీటితో పటచేగాని కల్కముగావించి యందెనిమిదింతల నీరుఁబోసి రెండుపలములు మిగులు కాచుటయె ప్రమథ్యమనంబడు. నియ్యది రెండుపలములు సేవింపందగు.

### రక్తాతిసారములకు ముస్తాదిప్రమథ్యము.

ముస్తకేంద్రయవైస్సిద్ధా ప్రమథ్యా ద్విపలోన్మితా,
సుశీతా మధుసంయుక్తా రక్తాతీసారనాశనీ. 155

తుంగముస్తలు, కొడిశపాలవిత్తనములు వీని నొకపలము కల్కముజేసి యందు దెని మిదిపలముల నీరుబోసి రెండుపలములు మిగులునట్లు ప్రమథ్యమునుగాని బాగుగ చల్లారిన పిదప నందు తేనెఁ గలిపి సేవించిన రక్తాతిసారములు హరించును.

యవాగు లక్షణము.

సాధ్యం చతుష్పలం ద్రవ్యం చతుష్షష్టిపలే జలే,
తత్క్వాథే నార్ధశిష్టేన యవాగూం సాధయేద్ఘనామ్. 156

ఔషధయోగ్యద్రవ్యములను నాలుగుపలములు గ్రహించి నలియగొట్టి యందు అఱువదినాలుగుపలముల నీరుఁబోసి సగము మిగులునట్లు గాచి వడియగట్టి, యందు బియ్యము మొదలగు వైద్యోక్తద్రవ్యములచేర్చి గట్టియగునటుల మరల గాచుటయ యవాగువనంబడు.

సంగ్రహణులకు ఆమ్రాదియవాగువు.

ఆమ్రామ్రాతకజంబూత్వక్కషాయే విపచేద్బుధః,
యవాగూం శాలిభిర్యుక్తాం తాం భుక్త్వా గ్రహణీం జయేత్.

మామిడిపట్ట, అంబాళపుపట్ట, నేరేడుపట్ట వీనిని నాలుగుపలములయెత్తు గ్రహించి నలియగొట్టి యందు అఱువదినాల్గుపలముల నీరుబోసి సగము మిగులునట్లుకాచి వడియ గట్టి పిదప నందు నాలుగుపలములబియ్యమువేసి చిక్కగకాచుటయ ఆమ్రాదియవాగు వనంబడు. దీనిని సేవించిన సంగ్రహణులు నశించును.

యూషలక్షణము.

కల్కద్రవ్యపలం శుంఠీ పిప్పలీచార్ధకార్షకీ,
వారిప్రస్థేన విపచేత్స ద్రవో యూష ఉచ్యతే. 158

కల్కమున నొకప్రస్థము నీళ్లుఁబోసి కొంచెము చిక్కగ కాచుటయే యూష మనంబడు. అందు సాధారణద్రవ్యములను కల్కముఁజేసి గలుపునెడల కర్షప్రమాణం బును, సొంటి, పిప్పళ్లు వీనిని కల్కముజేసి గలుపునెడ అర్ధకర్షప్రమాణంబును కలుప వలయును.

సన్నిపాతాదులకు సప్తముష్టియూషము.

కులుత్థయవకోలైశ్చ ముద్గైర్మూలకగ్రంథికైః,
శుంఠీధాన్యకయుక్తైశ్చ యూషశ్శ్లేష్మానిలాపహః. 159
సప్తముష్టిక ఇత్యేషస్సన్నిపాతజ్వరాఞ్జయేత్,
ఆమవాతహరః కంఠహృద్వక్త్రాణాం విశోధనః. 160

ఉలవలు, యవలు, రేగుపండ్లు, పెసలు, ముల్లంగిగడ్డలు, గ్రంథితగరము, సొంటి, ధనియాలు వీనిని యూషముగాచి సేవించిన శ్లేష్మవాతము, సన్నిపాతజ్వరము,

ఆమవాతము, నశించుటయేగాక కంఠము, హృదయము, ముఖము వీనిని శుద్ధిచేయును. ఇదియే, సప్తముష్టికయూష మనఁబరఁగు.

పానకల్పనము.

క్షుణ్ణం ద్రవ్యపలం సాధ్యం చతుష్షష్టిపలే జలే,
అర్ధశిష్టం చతుర్దేయం పానే భక్తాదిసంవిధౌ. 161

సాధ్యద్రవ్యముల నొకపలముదెచ్చి కొంచెముగ దంచి యందు అఱువదినాలుగు పలములనుదకముఁబోసి సగముమిగులునట్లుకాచి వడియఁగట్టి దప్పియగునపుడు కొంచము కొంచముగ సేవింపఁదగు. ఇట్లే అన్నాదిక్రియలయందును జేయందగు.

పిపాసాజ్వరములకు ఉశీరాదిపానము.

ఉశీరపర్పటోదీచ్యాముస్తనాగరచందనైః,
జలం శృతం హిమం పేయం పిపాసాజ్వరనాశనమ్. 162

వట్టివేళ్లు, పర్పాటకము, కురువేరు, తుంగముస్తలు, సొంటి, రక్తచందనము వీనిని పలప్రమాణములుగ గ్రహించి కొంచముగ దంచి యందు అఱువదిపలముల నుదకము బోసి సగముమిగులునట్లుకాచి వడియగట్టి చల్లారినపిదప సేవించిన దప్పితోఁగూడినజ్వరము నశించును.

ఉష్ణోదకలక్షణము.

అష్టమేనాంశశేషేణ చతుర్థేనార్ధకేన వా,
అథవా క్వథితేనైవ సిద్ధముష్ణోదకం వదేత్. 163

ఎనిమిదవపాలు మిగులునట్లుగాని, నాలవపాలుమిగులునట్లుగాని, సగము మిగులు నట్లుగాని, తెర్లునట్లుగాని, కాచఁబడినయుదకము యుష్ణోదక మనంబడును.

శ్లేష్మానువాతమేదోఘ్నం వస్తిశోధనదీపనం,
కాసశ్వాసజ్వరహరం పీతముష్ణోదకం నిశి. 164

రాత్రులయం దుష్ణోదకమునుత్రాగిన, శ్లేష్మము, ఆమవాతము, మేదోరోగము, శ్వాసము, కాసము, జ్వరము హరించును. వస్తిశోధనము, అగ్నిదీపనము కలుగును.

ఆమశూలలకు క్షీరపాకలక్షణము.

క్షీరమష్టగుణం ద్రవ్యాత్ క్షీరాన్నీరం చతుర్గుణం,
క్షీరావశేషం తత్పీతం శూలమామోద్భవం జయేత్. 165

ద్రవ్యమున కెనిమిదింతలుపాలు, పాలకునాలుగింతలు నుదకముఁ బోసి, పాలు మిగులునటులకాచి చల్లారినపిదప, యాపాలనుత్రాగిన ఆమశూలలు హరించును.

సర్వజీర్ణజ్వరములకు పంచమూలీక్షీరపాకము.

సర్వజ్వరాణాం జీర్ణానాం క్షీరం భైషజ్యముత్తమం,
శ్వాసాత్కాసాచ్ఛిరశ్శూలాత్పార్శ్వశూలాత్సపీనసాత్. 166
ముచ్యతే జ్వరితః పీత్వా పంచమూలీశృతం పయః,

కోలపొన్న, ముయ్యాకుపొన్న, వాకుడు, పెద్దములక, పల్లేరు వీనివ్రేళ్లను నలియఁగొట్టి యందు ఎనిమిదింతలపాలు, నాలుగింతలనీరుబోసి పాలుమిగులునట్లు కాచి సేవించిన జీర్ణజ్వరము, శ్వాసము, కాసము, తలపోటు, పార్శ్వశూల, పీనసము నశించును. మఱియు సంపూర్ణ జీర్ణజ్వరములకు పాలుత్తమమగునౌషధము.

శ్లేష్మజ్వరమునకు త్రికంటకాదిక్షీరపాకము.

త్రికంటకబలావ్యాఘ్రీగుడనాగరసాధితమ్. 167
వర్చోమూత్రవిబంధఘ్నం కఫజ్వరహరం పయః,

పల్లేరు, చిట్టాముట్టి, వాకుడు, బెల్లము, సొంటి వీనికెనిమిదింతలుపాలు, నాలుగింతలు నీరుబోసి పాలు మిగులువఱకుకాచి సేవించిన మలబద్ధము, మూత్రబంధము, శ్లేష్మజ్వరము నశించును.

అన్నస్వరూపయవాగువు.

అథాన్నప్రక్రియాఽత్రైవ ప్రోచ్యతే నాతివిస్తరా. 168
యవాగూ షడ్గుణజలే సిద్ధాస్యాత్కృసరాఘనా,
తండులైర్మాషముద్గైశ్చ తిలైర్వా సాధితా హితా. 169
యవాగూర్గ్రాహిణీ బల్యా తర్పణీ వాతనాశినీ,

అన్నప్రక్రియ యన నన్నరూప (గంజి) మగు విలేపి, పేయ అనువానిక్రియల నీగ్రంథమునందు సంక్షేపముగ జెప్పుచున్నాడు. బియ్యము, మినుములు, పెసలు, నువ్వులు, వీనిలో నెయ్యేకాలంబున దేని గంజికావలెనో దానింగొని అందున కాఱుభాగంబుల నీళ్లుబోసి గట్టి బడునట్లు కాచుటయె అన్నయవాగు వనంబడు. ఇది కృసరమనియు, ఘనమనియు కూడ జెప్పంబడును. ఇది అతిసారములయందు మలస్తంభనమును, శరీరమునకు బలమును గలుగంజేయును. వాతమును నశింపఁజేయును.

విలేపీలక్షణము.

విలేపీ చ ఘనాసిక్థా సిద్ధా నీరే చతుర్గుణే. 170
విలేపీ తర్పణీ హృద్యా మధురా పిత్తనాశినీ,

ద్రవ్యమునకు నాలుగింతలు నీళ్లుబోసి గట్టిగను, జిగురుగను కాచిన నదియ విలేపి యనంబడు. ఇది ధాతువృద్ధి, శరీరపుష్టి, హృదయమునకు హితము గలుగంజేయును. ఇది తియ్యగనుండెనేని పిత్తమును నశింపఁజేయును.

### పేయా లక్షణము.

ద్రవాదికా స్వల్పసిక్థా చతుర్దశగుణే జలే. 171
సిద్ధా పేయా బుధైర్జ్ఞేయా యూషః కించిద్ఘనస్స్మృతః,
పేయాం లఘుతరా జ్ఞేయా గ్రాహిణీ ధాతుపుష్టికా. 172
యూషో బల్య స్తతః కంఠ్యో లఘుపాకః కఫాపహః,

ద్రవ్యమునకు పదునాలుగింతలు నీళ్లుబోసి పలచగను కొంచెము జిగురుగను కాచిన నది పేయయనియు, అదియే కొంచెము గట్టిగనుండిన యూషజమనియుఁ బరఁగు. పేయ యందు మిక్కిలి లఘుత్వమును, మలస్తంభనమును, ధాతుపుష్టియును గలిగియుండును. యూషముచే బలమును కంఠమునకు హితంబును శ్లేష్మనాశనంబును గలుగును.

### అన్నపక్వలక్షణము.

జలే చతుర్దశగుణే తండులానాం చతుఃపలమ్. 173
విపచేత్స్రావయేన్మండం స భక్తో మధురో లఘుః.

నాలుగుపలములబియ్యమునకు పదునాలుగుపలముల నీళ్లుబోసి యుడికించి గంజి వార్చఁబడిన యన్నము మధురముగను తేలికగను నుండును.

### సిద్ధమండము.

నీరే చతుర్దశగుణే సిద్ధో మండ స్త్వసిక్థకః. 174
శుంఠీ సైంధవసంయుక్తః పాచనో దీపనః పరః,

బియ్యమునకు పదునాలుగుభాగములు నీళ్లుబోసి బిరుసుగ నుడికించి గంజివార్చుటయే సిద్ధమండమనంబడు. ఇందు సొంటి చూర్ణము, సైంధవలవణము గలిపి సేవించిన దీపనము పాచనము గలుగును.

### అష్టగుణమండము.

ధాన్యత్రికటుసింధూత్థముద్గతండులయోజితః. 175
భ్రష్టశ్చ హింగుతైలాభ్యాం స మండోఽష్టగుణస్స్మృతః,
దీపనః ప్రాణదో వస్తిశోధనో రక్తవర్ధనః. 176
జ్వరజిత్సర్వదోషఘ్నో మండోఽష్టగుణ ఉచ్యతే,

ఇంగువను వేయించి నూనెలోఁగలిపి దానిలో పలప్రమాణము పెసలు, రెండుపలముల బియ్యమును వేయించి యందు దనియాలు, సొంటి, పిప్పళ్లు, మిరియాలు, సైంధవలవణము వీనిని నలియగొట్టి వైచి, పదునాలుగు భాగములు నీళ్లుబోసి కాచి, వడియగట్టి సేవించిన జ్వరము, వాతాదిదోషములు హరించుటయేగాక, అగ్నిదీపనము, ప్రాణములకు తేజస్సు, వస్తిశోధనము, రక్తవృద్ధి గలుగును. ఇందు ఎనిమిది గుణంబు లుండుటవలన అష్టగుణమండ మనఁబరఁగు.

### శ్లేష్మపిత్తాదులకు వాద్యమండము.

సుఖండితై స్తథా భ్రష్టైర్వాద్యమండో యవైర్భవేత్. 177
కఫపిత్తహరః కంఠ్యో రక్తపిత్తప్రసాదనః,

యవలను చక్కగదంచి వేయించి యందు పదునాలుగుభాగముల నీళ్లుబోసి యుండికించి వడియగట్టుటయ వాద్యమండమనంబడు. దీనిని సేవించిన శ్లేష్మపిత్తముల ప్రకోపము, రక్తపిత్తము హరించును. కంఠమునకు హితంబుగ నుండును.

### శ్లేష్మజ్వరములకు లాజమండము.

లాజైర్వా తండులైర్భ్రష్టైర్లాజమండః ప్రకీర్తితః. 178
శ్లేష్మపిత్తహరో గ్రాహీ పిపాసాజ్వరజిన్మతః,

ఇతి శ్రీదామోదరసూను శార్ఙ్గధరేణ విరచితాయాం సంహితాయాం
సూత్రస్థానే మధ్యమఖండే క్వాథాదికల్పనంనామ
ద్వితీయోఽధ్యాయః.

వరిపేలాలయందైనను, వేయించిన బియ్యమునందైనను పదునాలుగు భాగముల నీళ్లుబోసికాచి వడియగట్టుటయ లాజమండ మనంబడు. దీని సేవించుటచేత, శ్లేష్మపిత్తముల ప్రకోపము, దప్పితోఁగూడిన జ్వరము, నశించుటయేగాక అతిసారముల బంధించును.

ఇది శ్రీదామోదరసూను శార్ఙ్గధరవిరచిత సంహితయందు సూత్రస్థానమున
మధ్యమఖండమందు క్వాథాదికల్పనమను
ద్వితీయాధ్యాయము ముగిసెను.

# తృతీయాధ్యాయము.

## ఫాంటకల్పనము.

ఉష్ణే ద్రవ్యపలే సమ్యగ్జలముష్ణం వినిక్షిపేత్,
మృత్పాత్రే కుడవోన్మానం తతస్తు స్రావయేత్పటాత్. 1
సస్యాచ్చూర్ణద్రవః ఫాంటస్తన్మానం ద్విపలోన్మితం,
మధుశ్వేతాగుడాదీంశ్చ క్వాథవత్తత్ర నిక్షిపేత్. 2

ఒకపలము నౌషధద్రవ్యమును మెత్తగదంచి చూర్ణముచేసి యొక కుండలోవైచి యందు వేడినీరు నొకకుడవముబోసి బాగుగఁగలిపి వడిగట్టిన నదియ ఫాంటమనియు, చూర్ణద్రవమనియుం చెప్పంబడు. మఱియు నీఫాంటము రెండుపలములు సేవింపదగు. ఇందు, తేనె, పంచదార, బెల్లము మొదలగువానిని గలుపునెడ కషాయమునకు చెప్పం బడిన ప్రమాణముగనే కలుపందగు.

## వాతపిత్తజ్వరములకు మధుకాదిఫాంటము.

మధూకపుష్పం మధుకం చందనం సపరూషకం,
మృణాలం కమలం లోధ్రం గంభారీం నాగకేసరమ్. 3
త్రిఫలాం సారిబాం ద్రాక్షాం లాజానుష్ణే జలే క్షిపేత్,
సితామధుయుతః పేయః ఫాంటో వాసో హిమోఽథవా. 4
వాతపిత్తజ్వరం దాహం తృష్ణామూర్ఛారతిభ్రమాన్,
రక్తపిత్తం మదం హన్యాన్నాత్ర కార్యా విచారణా. 5

ఒక కుండలో నాలుగుపలముల వేడినీళ్లుబోసి యందు ఇప్పపూలు, యష్టిమధుకము, రక్తచందనము, చిట్టీతపండ్లు, తామరకాడలు, తామరపూలు, లొద్దుగు, గుమ్మడు, నాగకేసరములు, త్రిఫలములు, సుగంధిపాలవేరు, ద్రాక్షపండు, వరిపేలాలు ఇవన్నియుం నొకపలముదెచ్చి మెత్తగచూర్ణము గావించివైచి చక్కగ గలియునట్లుచేసి వడియ గట్టి, యందు పంచదార, తేనె గలిపి సేవించిన గాని, పైదానిని హిమముగ జేసి సేవించినగాని వాతపిత్తజ్వరము, దాహము, దప్పి, మూర్ఛ, పదార్థములయందు ద్వేషము, భ్రమము, రక్తపిత్తము, మదరోగము ఇవన్నియు నశించును. ఇదియ మధుకాదిఫాంట మనఁబడు.

## దప్పి మొదలగువానికి ఆమ్రాదిఫాంటము.

ఆమ్రజంబూకిసలయైర్వటశృంగప్రరోహకైః,

ఉశీరేణ కృతః ఫాంటస్సక్షౌద్రో జ్వరనాశనః. 6
పిపాసాఛర్ద్యతీసారాన్ మూర్ఛాం జయతి దుస్తరాం,

మామిడిచిగుళ్లు, నేరేడుచిగుళ్లు, మఱ్ఱిమొగ్గలు, (లేక, మఱ్ఱియూడలకొనలు) వట్టివేళ్లు వీనిని పైజెప్పినప్రకారము ఫాంటముఁజేసి యందు తేనె గలిపి సేవించిన జ్వరము, పిత్తవాంతులు, అతిసారము, ప్రబలముగనుండెడి మూర్ఛ నశించును.

పిత్తతృష్ణాదులకు మధుకాదిఫాంటము.

మధూకపుష్పగంభారీచందనోశీరధాన్యకైః. 7
ద్రాక్షయా చ కృతః ఫాంటస్సితశ్శర్కరయా యుతః,
తృష్ణాపిత్తహరః ప్రోక్తో దాహమూర్ఛాభ్రమాన్ జయేత్. 8

ఇప్పపూలు, గుమ్ముడు, రక్తచందనము, వట్టివేళ్లు, దనియాలు, ద్రాక్షపండు వీనిని పైజెప్పినప్రకారము ఫాంటముగావించి చల్లారిన పిదప యందు శర్కరగలిపి సేవించిన దప్పి, పిత్తము, తాపము, మూర్ఛ భ్రమము నశించును.

మంథలక్షణము.

మంథోఽపి ఫాంటభేదస్స్యాత్తేన చాత్రైవ కథ్యతే,

ఫాంటభేదంబగు మంథవివరణమును నిక్కడ వచించెద.

మంథవిధానము.

జలే చతుఃపలే శీతే క్షుణ్ణం ద్రవ్యపలం క్షిపేత్. 9
మృత్పాత్రే మంథయేత్సమ్యక్తస్మాచ్చ ద్విపలం పిబేత్,

ఒకకుండయందు నాలుగుపలములచల్లనీరునుబోసి యందొకపలము నౌషధద్రవ్యమును చూర్ణముగావించి వైచి బాగుగ చిలికి వడియగట్టిన నదియ మంథమనంబరఁగు. మఱియుం దీని రెండుపలములు సేవింపందగు.

సర్వమద్యవికారములకు ఖర్జూరాదిమంథము.

ఖర్జూరదాడిమద్రాక్షా తిత్తిడీకామ్లికామలైః. 10
సపరూషైః కృతో మంథస్సర్వమద్యవికారనుత్,

ఖర్జూరపుపండు, దానిమ్మగింజలు, ద్రాక్షపండు, చింతపండు, చింతపట్ట, ఉసిరికవరుగు, చిట్టీతపండ్లు, ఇవన్నియు నొకపలము గ్రహించి యొకకుండలో వైచి, నాలుగు పలముల శీతోదకముబోసి పైఁజెప్పినప్రకారము మంథముజేసి సేవించిన, మద్యపానముచే జనించిన పలువికారములు నశించును. వక్కలసొక్కు, కోద్రవధాన్యభక్షణముచే జనించినమత్తు నశించును.

వాంతులకు మసూరాదిమంథము.

క్షౌద్రయుక్తా మసూరాణాం సక్తవో దాడిమాంభసా. 11
మథితా వారయంత్యాశు ఛర్దిం దోషత్రయోద్భవాం,

చిఱుసెనగలను వేయించి పిండిచేసి దానిని దాడిమగింజలరసములో నానబెట్టి మంథముజేసి యందు తేనెగలిపి సేవించిన, వాతపిత్తశ్లేష్మములచే జనించెడు వాంతులు నశించును.

దప్పికి యవమంథము.

ప్లావితైశ్శీతనీరేణ సఘృతైర్యవసక్తుభిః,
నాతిసాంద్రద్రవైర్మంథస్తృష్ణాదాహాస్రపిత్తహా. 12

ఇతి శ్రీదామోదరసూను శార్ఙ్గధరేణ విరచితాయాం సంహితాయాం మధ్యమఖండే చికిత్సాస్థానే ఫాంటాదికథనం నామ తృతీయోఽధ్యాయః.

యవలను వేయించి పిండిజేసి యందు శీతోదకమును వైచి పలచగ మంథముఁజేసి యందు నెయ్యిఁజేర్చి సేవించిన దప్పి, తాపము, రక్తపిత్తము నశించును.

ఇది శ్రీదామోదరసూను శార్ఙ్గధరవిరచితసంహితయందు మధ్యమఖండమున జికిత్సాస్థానమునందు ఫాంటాదికల్పనమను తృతీయాధ్యాయము ముగిసెను.

---

# చతుర్థాధ్యాయము.

హిమకల్పనము.

క్షుణ్ణం ద్రవ్యపలం సమ్యక్షడ్భిర్నీరపలైః ప్లుతం,
నిశోషితం హిమస్సస్యాత్తథా శీతకషాయకః. 1
తన్మానం ఫాంటవద్జ్ఞేయం సర్వత్రైష వినిశ్చయః,

ఒకపలము ఔషధద్రవ్యమును జక్కఁగ దంచి యొకకుండలో వైచి యం దాఱు పలముల నీరు బోసి బాగుగ కలియునట్లు చేసి యొకరాత్రి యునిచి మఱుదిన ముదయకాలంబున ఆనీరును వడియగట్టుటయ హిమమనియు, శీతకషాయంబనియు పరఁగు. దీనిని ఫాంటమువలెనే రెండుపలములు సేవింపందగును.

రక్తపిత్తములకు ఆమ్రాదిహిమము.

ఆమ్రం జంబుం చ కకుభం చూర్ణీకృత్య జలే క్షిపేత్. 2
హిమం తస్య పిబేత్ప్రాతస్సక్షౌద్రం రక్తపిత్తజిత్,

మామిడిపట్ట, నేరేడుపట్ట, మద్దిపట్ట వీనినొకపలము చూర్ణముచేసి, నొకభాండమున వైచి యందాఱుపలముల నుదకమునుబోసి యొకరాత్రి నానబెట్టి, మఱుదినము ఉదయమున వడియగట్టి యందు తేనెగలిపి సేవించిన రక్తపిత్తము నశించును.

తృష్ణాదులకు మరీచ్యాదిహిమము.

మరీచం మధుయష్టీ చ కాకోదుంబరపల్లవాః. 3
నీలోత్పలం హిమస్తజ్జస్తృష్ణాఛర్దినివారణః,

మిరియాలు, యష్టిమధుకము, బ్రష్మ మేడిచిగుళ్లు, నల్లకలువపూలు వీనినొకపలము గ్రహించి దంచి యొకకుండలోవైచి యం దాఱుపలముల నుదకమునుబోసి యొకరాత్రి నానబెట్టి, మఱుదినము ఉదయము వడియగట్టి సేవించిన, దప్పి, వాంతులు నశించును.

వాతపిత్తజ్వరములకు నీలోత్పలాదిహిమము.

నీలోత్పలం బలా ద్రాక్షా మధూకం మధుకం తథా. 4
ఉశీరం పద్మకం చైవ కాశ్మరీ చ పరూషకం,
ఏతచ్ఛీతకషాయశ్చ వాతపిత్తజ్వరాఞ్జయేత్. 5
సప్రలాపభ్రమచ్ఛర్దిమోహతృష్ణానివారణః,

నల్లకలువ, చిట్టాముట్టి, ద్రాక్షపండు, ఇప్పపట్ట, యష్టిమధుకము, వట్టివేరు, పద్మకములు, గుమ్ముడు, చిట్టీత వీనిని పైజెప్పినప్రకారము హిమమునుజేసి సేవించిన వాతపిత్తజ్వరము, ప్రలాపములు, భ్రమ, వాంతులు, మూర్ఛ, దప్పి నశించును.

జీర్ణజ్వరములకు అమృతాహిమము.

అమృతాయా హిమః పేయో జీర్ణజ్వరహరస్స్మృతః. 6
తిప్పతీఁగను పైజెప్పినప్రకారము హిమముగావించి సేవించిన జీర్ణజ్వరమునశించును.

రక్తపిత్తజ్వరములకు వాసాహిమము.

వాసాయాశ్చ హిమః కాసరక్తపిత్తజ్వరాఞ్జయేత్,

ఆడ్డసరపాకును పైజెప్పినప్రకారము హిమమునుజేసి సేవించిన దగ్గు, రక్తపిత్తము, జ్వరము నశించును.

### అంతర్దాహములకు ధాన్యకహిమము.

ప్రాతస్సశర్కరః పేయో హిమో ధాన్యకసంభవః. 7
అంతర్దాహం తథా తృష్ణాం జయేత్స్రోతోవిశోధనః,

దనియాలను పైజెప్పినప్రకారము హిమముగావించి యందు పంచదారను గలిపి ప్రాతఃకాలంబున సేవించిన, అంతర్దాహము, దప్పి నశించును, మూత్రోత్సర్జనము బాగుగ నగును.

### రక్తపిత్తాదులకు ధాన్యాకాదిహిమము.

ధాన్యాకధాత్రీవాసానాం ద్రాక్షాపర్పటయోర్హిమః. 8
రక్తపిత్తజ్వరం దాహం తృష్ణాం శోషం చ నాశయేత్,

ఇతి శ్రీదామోదరసూనుశార్ఙ్గధరవిరచితాయాం సంహితాయాం
మధ్యమఖండే చికిత్సాస్థానే హిమకల్పనా
నామ చతుర్థోఽధ్యాయః.

దనియాలు, ఉసిరికయొలుపు, అడ్డసరపాకు, ద్రాక్షపండు, పర్పాటకము వీనిని పైజెప్పినప్రకారము హిమముగావించి సేవించిన, రక్తపిత్తము, జ్వరము, తాపము, దప్పి, శోషము నశించును.

శ్రీదామోదరసూను శార్ఙ్గధరవిరచితసంహితయందు మధ్యమఖండమున
చికిత్సాస్థానమందలి హిమకల్పనయను
చతుర్థాధ్యాయము.

---

# పంచమాధ్యాయము.

### కల్కకల్పన.

ద్రవ్యమార్ద్రం శిలాపిష్టం శుష్కం వా సజలం భవేత్,
ప్రక్షేపావాపకల్కాస్తే తన్మానం కర్షసమ్మితమ్.
కల్కే మధుఘృతం తైలం దేయం ద్విగుణమాత్రయా,
సితాం గుడం సమం దద్యాద్ద్రవా దేయాశ్చతుర్గుణాః. 2

పచ్చిగనుండు ద్రవ్యములను మెత్తగనూరిరియైనను, ఎండిన ద్రవ్యములను నీటిచే మెత్తగ నూరియైనను ముద్దచేసిన, నది ప్రక్షేపమనియు, ఆవాపమనియుఁ బరఁగు. మఱియు, నీకల్కమును కర్షప్రమాణము సేవింపందగు. ఇందు తేనె, నెయ్యి, నూనె వీనినిగలుపవలయు నేని కల్కమునకు రెట్టింతలుగను, చక్కెర, బెల్లము గలుపవలయు నేని సమంబుగను, పాలు, నీరు మొదలగు ద్రవద్రవ్యముల గలుపవలయు నేని నాలుగింత లధిక ముగను గలుపందగు.

## పాండుజ్వరాదులకు వర్ధమానపిప్పలి.

త్రివృద్ధ్యా పంచవృద్ధ్యా వా సప్తవృద్ధ్యాఽథవా కణాః,
పిబేత్పిష్ట్వా దశదినం తాస్తథైవాపకర్షయేత్. 3
ఏవం వింశద్దినైస్సిద్ధం పిప్పలీవర్ధమానకం,
అనేన పాండువాతాస్రకాసశ్వాసారుచిజ్వరాః. 4
ఉదరార్శః క్షయశ్లేష్మవాతానశ్యంత్యురోగ్రహాః,

పిప్పళ్లను మొదటిరోజున 3 లేక 5 లేక 7 చొప్పునను, రెండవరోజున 6 లేక 10 లేక 14 చొప్పునను, మూఁడవదినంబున 9 లేక 15 లేక 21 చొప్పునను ఈప్రకారము పదిరోజులవఱకెచ్చించుచు నాపిప్పళ్లను నీటితో నూరి కల్కము జేసి యందు నాలుగింతలయుదకంబైనను పాలైననుగలిపి సేవింపందగు. పిదప మరల పదిదినములవఱకు పిప్పళ్ల సంఖ్యను పైన ఎచ్చించిన ప్రకారము తగ్గించుచు పైక్రమప్రకారము కల్కముగావించి సేవించిన పాండురోగము, వాతరక్తము, కాసము, శ్వాసము, అరుచి, జ్వరము, ఉదర రోగము, మూలవ్యాధి, క్షయరోగము, శ్లేష్మరోగములు, సమస్తవాతరోగములు ఱొమ్మునొప్పి నశించును. ఇదియే, వర్ధమానపిప్పలియనంబడు. (ఈకల్కమునందు నీళ్లకన్నను పాలు గలుపుట శ్రేష్ఠము).

## వ్రణములకు నింబకల్కము.

లేపాన్నింబదలైః కల్కో వ్రణశోధనరోపణః. 5
భక్షణాచ్ఛర్దికుష్ఠాని పిత్తశ్లేష్మక్రిమీఞ్జయేత్,

వేపచిగుళ్లను నుదకముతో నూరి కల్కము జేసి వ్రణములకు లేపనము జేసిన, వ్రణములకు శోధనము, రోపణము గలుగును. మఱియు నీకల్కమును సేవించిన వాంతులు, కుష్ఠము, పిత్తశ్లేష్మములచే జనించినపురుగులు నశించును.

## గృధ్రసీవాతములకు మహానింబకల్కము.

మహానింబజటాకల్కో గృధ్రసీనాశనస్స్మృతః. 6

తురకవేపచెట్టువేళ్లను నుదకముతో నూరి కల్కము జేసి పుచ్చుకొనిన గృధ్రసీ వాతము నశించును.

వాతరోగములకు రసోనకల్కము.

శుద్ధః కల్కో రసోనస్య తిలతైలేన మిశ్రితః. 7
వాతరోగాన్ జయేత్తీవ్రాన్ విషమజ్వరనాశనః,

వెల్లుల్లిపాయలను కల్కముజేసి దానిని నువ్వులనూనెలోఁగలిపి సేవించిన దారుణమగు వాతరోగములు, విషమజ్వరములు నశించును.

వాతరోగములకు రసోనకల్కము.

పర్వకందరసోనస్య గులికా నిస్తుషీకృతా. 8
పాటయిత్వా చ మధ్యస్థం దూరీకుర్యాత్తదంకురం,
తదుగ్రగంధనాశాయ రాత్రౌ తక్రే వినిక్షిపేత్. 9
అపనీయ చ తన్మధ్యాచ్ఛిలాయాం పేషయేత్తతః,
తన్మధ్యే పంచమాంశేన చూర్ణమేషాం వినిక్షిపేత్. 10
సౌవర్చలం యవానీ చ భర్జితం హింగుసైంధవం,
కటుత్రికం జీరకం చ సమభాగాని చూర్ణయేత్. 11
ఏకీకృత్య తతస్సర్వం కల్కం కర్షప్రమాణతః,
ఖాదేదగ్నిబలాపేక్షీ ఋతుదోషాద్యపేక్షయా. 12
అనుపానం తతః కుర్యాదేరండశ్శృతమన్వహం,
సర్వాంగైకాంగజం వాతమర్దితం చాపతంత్రకమ్. 13
అపస్మారమథోన్మాదమూరుస్తంభం చ గృధ్రసీం,
ఉరఃపృష్ఠకటీపార్శ్వకుక్షిపీడాం క్రిమీన్ జయేత్. 14
అజీర్ణమాతపం రోషమతినీరం పయోగుడం,
రసోనమశ్నన్ పురుషస్త్యజేదేతన్నిరంతరమ్. 15
మద్యం మాంసం తథామ్లం చ రసం సేవేత నిత్యశః,

చక్కగ పక్వమైన వెల్లుల్లిగడ్డల పైపొట్టుదీసి చీల్చి మధ్యభాగమందలి యంకురములు దీసిపాఱవైచి రాత్రి మజ్జిగలో నానవేసి యుదయమునదీసి మెత్తగనూరి కర్షప్రమాణము కల్కమును గ్రహించి యందు సౌవర్చలవణము, ఓమము, వేయించిన ఇంగువ, సైంధవలవణము, త్రికటుకములు, జీలకఱ్ఱ వీనిని సమభాగములుగ చూర్ణముచేసి కల్కమున కైదవభాగముగలిపి పిదప ఆముదపుచెట్టికషాయము ననుపానముగ వైరసోన కల్కమును, అగ్నిబలము, ఋతువుదోషము మొదలగువానినెఱిఁగి సేవించిన సర్వాంగవాతము, ఏకాంగవాతము, అర్దితవాతము, అపతంత్రకవాతము, అపస్మారము, ఉన్మా

దము, ఊరుస్తంభవాతము, గృధ్రసీవాతము, ఱొమ్ము, వీఁపు, నడుము, ప్రక్క కడుపు వీనియందుగల పోట్లు, జంతువికారము, అజీర్ణము నశించును. మఱియు నీరస కల్కమును సేవించువారు ఎండలో సంచరించుట, కోపమును జెందుట, నధికముగ నీ ద్రావుట, పాలంద్రావుట, బెల్లమును సేవించుట వీనివర్జింపందగు. మద్యము, మాంస పులుసు వీని సేవింపందగు.

ఊరుస్తంభమునకు పిప్పల్యాదికల్కము.

పిప్పలీ పిప్పలీమూలం భల్లాతకఫలాని చ.
ఏతత్కల్కశ్చ సక్షౌద్ర ఊరుస్తంభనివారణః,

పిప్పళ్లు, మోడి, జీడిగింజలు వీనిని నుదకముతో నూరి, కల్కముచేసి యందు తే గలిపి సేవించిన ఊరుస్తంభవాతము నశించును.

పరిణామశూలలకు విష్ణుక్రాంతకల్కము.

విష్ణుక్రాంతజటాకల్కస్సితాక్షౌద్రఘృతైర్యుతః.
పరిణామభవం శూలం నాశయేత్సప్తభిర్దినైః,

విష్ణుక్రాంతవ్రేళ్లను కల్కముగావించి యందు చక్కెర, తేనె, నెయ్యి గ ఏడుదినములు సేవించిన పరిణామశూలలు నశించును.

శుంఠీకల్కము.

శుంఠీతిలగుడైః కల్కం దుగ్ధేన సహ యోజయేత్. 1
పరిణామభవం శూలమామవాతం చ నాశయేత్,

సొంటి, నువ్వులు, బెల్లము వీనిని కల్కముగావించి యందు ఆవుపాలుగ సేవించిన పరిణామశూల, ఆమవాతము నశించును.

రక్తార్శస్సులకు అపామార్గాదికల్కము.

అపామార్గస్య బీజానాం కల్కం తండులవారిణా. 1
పీతో రక్తార్శసాం నాశం కురుతే నాత్ర సంశయః,

ఉత్తరేణివిత్తుల నుదకముతో నూరి కల్కముగావించి యందు బియ్యపుకడిలి గ సేవించిన, రక్తార్శస్సు నిస్సంశయముగ నశించును.

రక్తాతిసారములకు బదరీమూలకల్కము.

బదరీమూలకల్కేన తిలకల్కశ్చ యోజితః. 2
మధుక్షీరయుతః కుర్యాద్రక్తాతీసారనాశనః,

చిన్నరేగువ్రేళ్ల కల్కమునకు సగముగ నువ్వులకల్కముగలిపి యందు తేనె, పాలు పైచి సేవించిన రక్తాతీసారము నశించును.

రక్తక్షయాదులకు లాక్షాకల్కము.

కూశ్మాండకరసైః పిష్టాం లాక్షాకర్షద్వయం పిబేత్. 21
రక్తక్షయమురోఘాతం క్షయరోగం చ నాశయేత్,

లక్కను నీటితో నూరి, కల్కముగావించి యందు బూడిదగుమ్మడికాయరసము గలిపి రెండుకర్షముల కల్కమునుసేవించిన రక్తక్షయము, ఉరఃక్షతము, క్షయరోగము నశించును.

రక్తప్రదరములకు తండులీయకల్కము.

తండులీయజటాకల్కస్సక్షౌద్రస్సరసాంజనః. 22
తండులోదకసంపీతో రక్తప్రదరనాశనః,

చిర్రికూరవ్రేళ్లను కల్కముగావించి యందు తేనె, రసాంజనము, బియ్యపుకుడితి గలిపి సేవించిన స్త్రీలరక్తప్రదరములు నశించును.

అతిసారములకు అంకోలకల్కము.

అంకోలమూలకల్కశ్చ సక్షౌద్రస్తండులాంబునా. 23
అతిసారహరః ప్రోక్తస్తథా విషహరస్స్మృతః,

ఊడుగువ్రేళ్లకల్కమున తేనె, బియ్యపుకుడితి గలిపి సేవించిన అతిసారము, వసనాభి, సర్పములు మొదలగువానిచే జనించెడువిషములు హరించును.

విషములకు కర్కోటకీకల్కము.

వంధ్యాకర్కోటికామూలం పాటలాయా జటా తథా. 24
ఘృతేన బిల్వమూలం వా ద్వివిధం నాశయేద్విషం,

వంధ్యాకర్కోటికామూలము (గొడ్డుబీరవ్రేళ్లు), మారేడువ్రేళ్లు వీనిలో దేనినైనను కల్కము గావించి యందు నెయ్యిగలిపి సేవించిన వసనాభిమొదలగువాని భక్షణచే జనించినవిషములు సర్పాదిదంష్ట్రవిషములు నశించును.

త్రిదోషాదులకు అభయాదికల్కము.

అభయా సైంధవకణా శుంఠీకల్కస్త్రిదోషహా. 25
పథ్యా సైంధవశుంఠీభిః కల్కో దీపనపాచనః,

కరకకాయలు, సైంధవలవణము, పిప్పళ్లు, సొంటి వీనినుదకముతోనూరి కల్కము గావించి సేవించిన వాతపిత్తశ్లేష్మముల ప్రకోపము నశించును. మఱియు కరకకాయలు, సైంధవలవణము, సొంటి వీనినికల్కముగావించి సేవించిన దీపనము, పాచనము గలుగును.

జంతువికారములకు త్రివృతాదికల్కము.

త్రివృత్పలాశబీజాని పారసీయయవానికా. 26
కంపిల్లకం విడంగం చ గుడశ్చ సమభాగికః,
తక్రేణ కల్కమేతేషాం పిబేత్క్రిమిగణాపహమ్. 27

తెగడ, మోదుగవిత్తులు, పారసీకీమము, కంపిల్లము, వాయువిడంగములు వీనిని చూర్ణముగావించి యందు చూర్ణమునకు సమముగ బెల్లముగలిపి కల్కముగావించి, మజ్జిగతో సేవించిన జంతువికారములు నశించును.

రక్తార్శస్సులకు నవనీతకల్కము.

నవనీతతిలైః కల్కో జేతా రక్తార్శసాం స్మృతః,
నవనీతసితానాగకేసరైశ్చాపి తద్విదః. 28

నువ్వులనునూరి కల్కముజేసి యందావువెన్నగలిపి సేవించినను, లేక నాగకేసరములను కల్కముజేసి యందు వెన్న పంచదారగలిపి సేవించినను రక్తార్శస్సులు నశించును.

సంగ్రహణులకు మసూరకల్కము.

పీతో మసూరయూషేణ కల్కశ్శుంఠీశలాటుజః,
జయేత్సంగ్రహణీం తద్వత్తక్రేణ బృహతీభవః. 29

ఇతి శ్రీదామోదరసూనుశార్ఙ్గధరేణ విరచితాయాం
సంహితాయాం మధ్యమఖండే చికిత్సాస్థానే
కల్కకథనంనామ పంచమోఽధ్యాయః.

సొంటి, మారేడుపిందెలు వీనికల్కమునుజేసి యందు చిఱుసెనగలయూషమును గలిపి సేవించినను, లేక, చిన్నములకను కల్కమునుజేసి, అందు మజ్జిగగలిపి సేవించినను సంగ్రహణులు నశించును.

ఇది శ్రీదామోదరసూను శార్ఙ్గధరవిరచితసంహితయందు
మధ్యమఖండమున చికిత్సాస్థానమునందు కల్కకథనమను
పంచమాధ్యాయము.

# షష్ఠాధ్యాయము.

## చూర్ణకల్పన.

అత్యంతశుష్కం యద్ద్రవ్యం సుపిష్టం వస్త్రగాలితం,
తత్స్యాచ్చూర్ణం రజఃక్షోద స్తన్మాత్రా కర్షసమ్మితా. 1
చూర్ణేగుడస్సమో దేయ శ్శర్కరా ద్విగుణా భవేత్,
చూర్ణేషు భర్జితం హింగు దేయం నోత్క్లేదకృద్భవేత్. 2
లిహేచ్చూర్ణం ద్రవైస్సర్వై ర్ఘృతాద్యై ర్ద్విగుణోన్మితైః,
పిబేచ్చతుర్గుణై రేవ చూర్ణమాలోడితం ద్రవైః. 3
చూర్ణావలేహగుటికాకల్కానామనుపానకం,
పిత్తవాతకఫాతంకే త్రిద్వ్యేకపలమాహరేత్. 4
యథా తైలం జలే ప్రాప్తం క్షణేనైవ ప్రసర్పతి,
అనుపానబలాదంగే తథా సర్పతి భేషజమ్. 5
ద్రవేణ యావతా సమ్యక్చూర్ణం సర్వప్లుతం భవేత్,
భావనాయాః ప్రమాణం తు చూర్ణే ప్రోక్తం భిషగ్వరైః. 6

చక్కఁగ నెండిన యౌషధద్రవ్యములను దంచి చూర్ణముచేసి వస్త్రగాలిత మొన
ర్చిన నదియె చూర్ణమనియు, రజమనియు, క్షోదమనియు బరఁగు. మఱియు, నీచూర్ణ
మును కర్షప్రమాణముగ సేవింపందగు. ఇందు బెల్లము కలుపవలయునెడ సమభాగంబు
గను, పంచదారను ద్విగుణంబుగను గలుపందగు. ఇంగువను గలుపవలసి యుండునెడ,
వేయించి గలుపవలెను. నెయ్యి, మొదలగు స్నేహద్రవ్యములను జేర్చునెడ చూర్ణము
నకు రెండింతలు గలుపవలయును. పాలు, నీళ్లు, గోమూత్రము మొదలగు ద్రవద్రవ్య
ములను జేర్చునెడ చూర్ణమునకు నాలుగింతలు కలుపందగు. చూర్ణము, అవలేహము,
ఘుటికలు, కల్కము వీనికిఁ జెప్పంబడియుండెడి యనుపానములను పిత్తరోగంబున
మూఁడుపలములు, వాతరోగంబున రెండుపలంబులు, శ్లేష్మరోగంబున ఒకపలము చొప్పు
నను జేర్చుకొనందగు. ఇటులం జేసిన, ఉదకంబునందుంచిన నూనెబిందువు అందంతటను
వ్యాపించుభంగి నాయౌషధము శరీరంబంతయు వ్యాపించు. చూర్ణము మునుగునటుల నిమ్మ
పండ్లరసము మొదలగువాని బోసియుంచుటయ భావనయనంబడు.

సర్వజ్వరములకు ఆమలక్యాదిచూర్ణము.

ఆమలం చిత్రకః పథ్యా పిప్పలీ సైంధవం తథా,
చూర్ణితోఽయం గణో జ్ఞేయస్సర్వజ్వరవినాశనః. 7
భేదీ రుచికరశ్శ్లేష్మజేతా దీపనపాచనః,

ఉసిరికయొలుపు, చిత్రమూలము, కరకకాయలు, పిప్పళ్లు, సైంధవలవణము వీనిని చూర్ణముగావించి సేవించిన సమస్తజ్వరములు, మలబద్ధకము, అరుచి, శ్లేష్మరోగము నశించును. దీపనము, పాచనము గలుగును. ఇదియే ఆమలక్యాదిగణము.

జ్వరములకు పిప్పలిచూర్ణము.

మధునా పిప్పలీచూర్ణం లిహేత్కాసజ్వరాపహమ్. 8
హిక్కాశ్వాసహరం కంఠ్యం ప్లీహఘ్నం బాలకోచితం,

పిప్పలిచూర్ణమును తేనెలోఁగలిపి సేవించిన కాసము, జ్వరము, ఎక్కిళ్లు, శ్వాసము, ప్లీహము నశించుటయేగాక, కంఠమునకు హితంబుగను, శిశువులకు నుచితంబుగను నుండును.

మేహాదులకు త్రిఫలాదిచూర్ణము.

ఏకా హరీతకీ యోజ్యా ద్వౌ చ యోజ్యౌ విభీతకౌ. 9
చత్వార్యామలకాన్యేవ త్రిఫలా సా ప్రకీర్తితా,
త్రిఫలా మేహశోథఘ్నీ నాశయేద్విషమజ్వరాన్. 10
దీపనశ్శ్లేష్మపిత్తఘ్నీ కుష్ఠహన్త్రీ రసాయనీ,
సర్పిర్మధుభ్యాం సంయుక్తా సైవ నేత్రామయాన్ జయేత్. 11

ఒక కరకకాయయొలుపు, రెండు తానికాయలయొలుపు, నాలుగు ఉసిరికకాయలయొలుపు ఇవియె త్రిఫలములనంబడు. వీనిచూర్ణము సేవించిన ప్రమేహము, వాపు, విషమజ్వరము, శ్లేష్మరోగము, పిత్తరోగము, కుష్ఠము నశించును. అగ్నిదీపనము గలుగును. మఱియు, త్రిఫలచూర్ణమున నెయ్యి, తేనె గలిపిన నది రసాయన మనంబడు. దీని సేవించిన సమస్తనేత్రరోగములు నశించును.

కఫాదులకు త్ర్యూషణచూర్ణము.

పిప్పలీ మరిచం శుంఠీ త్రిభిస్త్ర్యూషణముచ్యతే,
దీపనం శ్లేష్మమేదోఘ్నం కుష్ఠపీనసనాశనమ్. 12
జయేదరోచకం సామం మేహగుల్మగళామయాన్,

పిప్పళ్లు, మిరియములు, సొంటి ఇమ్మూడును త్ర్యూషణమనంబడు. దీనిచూర్ణ సేవించిన, అగ్నిదీపనము గలుగును. కఫము, మేదస్సు, కుష్ఠము, పీనస, అరుచి, షము, మేహము, గుల్మము, గళరోగము నశించును.

అరుచ్యాదులకు పంచకోలచూర్ణము.

పిప్పలీ చవ్యవిశ్వాహ్వా పిప్పలీమూలచిత్రకైః. 13
పంచకోలమితి ఖ్యాతం రుచ్యం పాచనదీపనం,
ఆనాహప్లీహగుల్మఘ్నం శూలశ్లేష్మోదరాపహమ్. 14

పిప్పళ్లు, చవ్యము, సొంటి, మోడి, చిత్రమూలము ఈ ఐదును పంచకోల మనం వీని చూర్ణముచేసి సేవించిన దీపనము, పాచనము గలుగును. అరుచి, కడుపుబ్బ ప్లీహము, గుల్మము, శూలము, శ్లేష్మము, ఉదరము నశించును.

త్రిగంధచాతుర్జాతచూర్ణము.

త్రిగంధమేలాత్వక్పత్రైశ్చతుర్జాతం సకేసరైః,
త్రిగంధం స చతుర్జాతం రూక్షోష్ణం లఘుపిత్తకృత్. 15
వర్ణ్యం రుచికరం తీక్ష్ణం పిత్తశ్లేష్మామయాఞ్జయేత్,

ఏలకులు, లవంగపుపట్ట, లవంగపుపత్రి ఇమ్మూడును త్రిగంధమనియు, అందు కేసరములుజేరిన, చతుర్జాతకమనియుఁ పరఁగు. మఱియు నీత్రిగంధ, చతుర్జాత ములు రూక్షగుణమును, వీర్యముచే నుష్ణంబును గలిగి, పాకకాలంబున చులకనగ పిత్తమును వృద్ధిజేయుచు పిత్తకఫరోగములను నశింపఁజేయును. తీక్ష్ణగుణముగలిగి మును. కాంతి రుచి వీనిని గలుగంజేయును.

శిశువుల జ్వరాతిసారములకు కృష్ణాదిచూర్ణము.

కృష్ణారుణాముస్తకశృంగికానాం తుల్యేన చూర్ణేన సమాక్షికేణ,
జ్వరాతిసారః ప్రశమం ప్రయాతిసశ్వాసకాసస్సవమిశ్శిశూనామ్.

పిప్పళ్లు, అతివస, తుంగముస్తలు, కర్కాటకశృంగి వీనిని సమభాగములుగ ముజేసి యందు తేనెగలపి శిశువులకొసంగిన వారికిగలజ్వరాతిసారములు, శ్వాసము, ము, వాంతులు హరించును.

గర్భాదికములకు జీవనీయగణచూర్ణము.

కాకోలీ క్షీరకాకోలీ జీవకర్షభకౌ తథా. 17
మేదాచాన్యా మహామేదా జీవంతీ మధుకం తథా,

ముద్గపర్ణీ మాషపర్ణీ జీవనీయో గణ స్త్వయమ్. 18
జీవనీయో గణస్స్వాదుర్గర్భసంధానకృద్గురుః,
స్తన్యకృద్బృంహణో వృష్యస్స్నిగ్ధశ్శీతాతృషాపహః. 19
రక్తపిత్తం క్షతం శోషం జ్వరదాహానిలాన్ జయేత్,
ద్వే మేదే ద్వే చ కాకోల్యౌ జీవకర్షభకౌ తథా. 20
ఋద్ధిర్వృద్ధీ చ తైస్సర్వైరష్టవర్గ ఉదాహృతః,
అష్టవర్గో బుధైః ప్రోక్తో జీవనీయసమో గుణైః. 21

కాకోలి, క్షీరకాకోలి, జీవకము, ఋషభకము, మేద, మహామేద, పాలకూర, యష్టిమధుకము, అడవిపెసర, అడవిమినుము ఇవి జీవనీయగణంబనఁబడు. ఈగణము మధురముగ నుండుటచే గర్భధారణంబును, గురుత్వముగ నుండుటచే స్తనములయందు క్షీరవృద్ధిని, శరీరమునకు బలమును గలుగంజేసి వృష్యమునుగలుగంజేయును. మఱియు, స్నిగ్ధగుణముగలదిగ నుండుటచే శైత్యము, దప్పి, రక్తపిత్తము, గాయములు, ధాతుక్షయము, జ్వరము, తాపము, వాతరోగములు వీనిని నశింపంజేయును. (మఱియుం మేద, మహామేద, కాకోలి, క్షీరకాకోలి, జీవకము, ఋషభకము, ఋద్ధి, వృద్ధి అనునవియే అష్టవర్గమని వైద్యవేత్తలు వచించెదరు. ఈ యష్టవర్గగుణము జీవనీయగణగుణముతో తుల్యంబుగ నుండును. ఇది మధురాదిగుణములు గలదిగ నుండుటచే గర్భధారణాదులను గలుగజేయును. స్నిగ్ధగుణము గలదగుటచే శైత్యాదిరోగంబులను నశింపఁజేయును.

## మలమూత్రబంధములకు లవణపంచకచూర్ణము.

సింధుసౌవర్చలే చైవ బిడం సాముద్రికం గడం,
ఏకద్విత్రిచతుః పంచ లవణాని క్రమాద్విదుః. 22
తేషు ముఖ్యం సైంధవం స్యాదనుక్తే తత్ప్రయోజయేత్,
మధురం సృష్టవిణ్మూత్రం స్నిగ్ధం సూక్ష్మబలాపహమ్. 23
వీర్యోష్ణం దీపనం తీక్ష్ణం కఫపిత్తవివర్ధనం,

సైంధవలవణము, సౌవర్చలవణము, బిడాలవణము, సముద్రలవణము, సాంబరలవణము ఈయైదునుజేరి పంచలవణము లనంబడు. మఱియు, వీనిలో నొకటి ఏకలవణమనియు, రెండు ద్విలవణమనియు, మూఁడు త్రిలవణమనియు, నాలుగు చేరినచో చతుర్లవణమనియు క్రమముగ నెఱుంగవలయును. అందు సైంధవలవణము మిగులశ్రేష్ఠంబుగ నుండుటచే లవణమని జెప్పంబడియుండెడి ఎల్లస్థలంబులయందును సైంధవలవణమునే చేర్చుకొనందగు. మఱియు, నీలవణపంచకము మధురముగ నుండుటవలన, మల

మూత్రోత్సర్జనము స్నిగ్ధముగను సూక్ష్మముగను నుండుటచే దౌర్బల్యంబునిచ్చు. ఉష్ణవీర్యము గలదగుటచే అగ్నిదీపనము గలిగించును. తీక్ష్ణముగనుండుటవలన కఫపిత్తముల వృద్ధిజెందునటులం జేయును.

### గుల్మాదులకు క్షారకథనము.

స్వర్జికాయావశూకశ్చ క్షారయుగ్మముదాహృతమ్. 24
జ్ఞేయా వహ్నిసమా క్షారా స్వర్జికాయావశూకజౌ,
క్షారాశ్చాన్యేఽపి గుల్మార్శోగ్రహణీరుక్ఛిదస్సరాః. 25
పాచనాః కృమిపుంస్త్వఘ్నాః శర్కరాశ్మరినాశనాః,

సర్జక్షారము, యవక్షారము, నీరెండునుజేరి క్షారయుగ్మమనంబడు. ఇది యగ్నితుల్యముగనుండుటచే అగ్నిదీపనము గలుగంజేయును. మఱియు, జిల్లేడు మొదలగునితర క్షారములు, గుల్మము, మూలవ్యాధి, సంగ్రహణి, జంతువికారము, పుంస్త్వము, అశ్మరి, వీనిని నశింపంజేయును. అగ్నిదీపనమును గలిగించును.

### సర్వజ్వరములకు సుదర్శనచూర్ణము.

త్రిఫలారజనీయుగ్మం కంటకారీయుగం సటీ,
త్రికటుగ్రంథికం మూర్వా గుడూచీ ధన్వయాసకః. 26
కటుకా పర్పటో ముస్తం త్రాయమాణా చ వాలకం,
నింబగ పుష్కరమూలం చ మధుయష్టీ చ వత్సకః. 27
యవానీంద్రయవో భార్గీ శిగ్రుబీజం సురాష్ట్రజాః,
వచాత్వక్పద్మకోశీరచందనాతివిషాబలాః. 28
శాలిపర్ణీ పృష్ణిపర్ణీ విడంగం తగరం తథా,
చిత్రకో దేవకాష్ఠం చ చవ్యం పత్రపటోలజమ్. 29
జీవకర్షభకౌ చైవ లవంగం వంశలోచనా,
పుండరీకం చ కాకోలీపత్రకం జాతిపత్రకమ్. 30
తాలీసపత్రం చ తథా సమభాగాని చూర్ణయేత్,
సర్వచూర్ణస్య చార్ధాంశం కైరాతం ప్రక్షిపేత్సుధీః. 31
ఏతత్సుదర్శనం నామ చూర్ణం దోషత్రయాపహం,
జ్వరాంశ్చ నిఖిలాన్ హన్యాన్నాత్ర కార్యా విచారణా. 32
పృథక్ద్వంద్వాగంతుకాంశ్చ ధాతుస్థాన్ విషమజ్వరాన్,

సన్నిపాతోద్భవాంశ్చాపి మానసానపి నాశయేత్. 33
శీతజ్వరైకాహికాదీన్ మోహం తంద్రాం భ్రమం తృషాం,
శ్వాసం కాసం పాండుతాంచ హృద్రోగం హంతి కామలామ్. 34
త్రికపృష్ఠకటీజానుపార్శ్వశూలనివారణం,
శీతాంబునా పిబేద్ధీమాన్ సర్వజ్వరనివృత్తయే. 35
సుదర్శనం యథా చక్రం దానవానాం వినాశనం,
తద్వజ్జ్వరాణాం సర్వేషామిదం చూర్ణం వినాశనమ్. 36

త్రిఫలములు, పసుపు, మ్రానిపసుపు, వాకుడు, పెద్దములక, కచోరములు త్రికటుకములు, మోడి, చాగమట్ట, తిప్పతీఁగ, దురదగొండి, కటుకరోహిణి, పర్పాటకము తుంగముస్తలు, కలుత్రాసుగు, కురువేరు, వేప, పుష్కరమూలము, యష్టిమధుకము కొడిశపాల, ఓమము, కొడిశపాలవిత్తులు, గంటుభారంగి, మునగవిత్తులు, తువ్వరిమన్ను వస, లవంగపుపట్ట, పద్మకములు, వట్టివేరు, చందనము, అతివస, చిట్టాముట్టి, కోలపొన్న ముయ్యాకుపొన్న, వాయువిళంగములు, గ్రంథితగరము, చిత్రమూలము, దేవదారువు చవ్యము, చేదుపొట్లమాకులు, జీవకము, ఋషభకము, లవంగము, తవాతీరి, తెల్ల తామరపూలు, కాకోలి, లవంగపుపత్రి, జాపత్రి, తాలీసపత్రి వీనిని సమభాగములు చూర్ణముచేసి వస్త్రకాళితముగావించి, చూర్ణమునకు సగము నేలవేముచూర్ణమునుగలి బలానుసారముగసేవించిన, వాతపిత్తశ్లేష్మజన్యరోగములు, సర్వజ్వరములు, వాతాదిదోషమ లచే ప్రత్యేకముగ జనించెడిజ్వరములు, ద్వంద్వజ్వరములు, సన్నిపాతజ్వరము, ఆగంతు జ్వరము, ధాతుగతజ్వరములు, విషమజ్వరములు, మానసికజ్వరములు, శీతజ్వరములు, ఏక హికజ్వరములు, మోహము, తంద్ర, భ్రమ, దప్పి, శ్వాసము, కాసము, పాండురోగము హృద్రోగములు, కామెర్లు, ముడ్డిపూస, వీపు, నడుము, మోకాళ్లు, ప్రక్కలు, తొడల వీనియందలిపోట్లు నశించును. మఱియు, విష్ణువుయొక్క సుదర్శనమనుచక్రము, దానవ లను హతం బొనర్చునట్లు నీసుదర్శనచూర్ణము సమస్తజ్వరములను నశింపఁజేయును.

## కాసశ్వాసజ్వరములకు త్రిఫలాపిప్పలీచూర్ణము.

కాసశ్వాసజ్వరహరా త్రిఫలా పిప్పలీయుతా,
చూర్ణితా మధునా లీఢా భేదినీ చాగ్నిబోధినీ. 37

త్రిఫలములు, పిప్పళ్లు వీనిని చూర్ణముగావించి, యందు తేనె గలిపి సేవించిన కాస, శ్వాస, జ్వరములు నశించును. మలమును బైటవెడలగొట్టును. అగ్నిదీపనమ గలిగించును.

## జ్వరాదులకు కట్ఫలాదిచూర్ణము.

కట్ఫలం ముస్తకం తిక్తా శుంఠీ శృంగీ చ పౌష్కరం,
చూర్ణమేషాం చ మధునా శృంగబేరరసేన వా. 38
లిహేజ్జ్వరహరం కంఠ్యం కాసశ్వాసారుచీర్జయేత్,
వాయుం ఛర్దిం తథా శూలం క్షయం చైవ వ్యపోహతి. 39

కాయఫలము, తుంగముస్తలు, కటుకరోహిణి, సొంటి, కర్కాటశృంగి, పుష్కరమూలము వీనిని చూర్ణముజేసి తేనెతోనైనను, అల్లపురసముతోనైనను సేవించిన, జ్వరములు, కాసము, శ్వాసము, అరుచి, వాతరోగము, వాంతులు, శూల, క్షయరోగము నశించును. కంఠమునకు హితంబుగనుండు.

## కఫశూలాదులకు కట్ఫలాదిచూర్ణము.

కట్ఫలం పౌష్కరం శృంగీ ముస్తకం కటుకంసటీ,
సమస్తాన్యేకశోవాఽపి సూక్ష్మచూర్ణాని కారయేత్. 40
ఆర్ద్రికస్వరసక్షౌద్రైర్లిహ్యాత్కఫవినాశనం,
శూలానిలారుచిఛర్దికాసశ్వాసక్షయాపహమ్. 41

కాయఫలము, పుష్కరమూలము, కర్కాటశృంగి, తుంగముస్తలు, సొంటి, మిరియములు, పిప్పళ్లు, కచోరములు వీనిని ప్రత్యేకముగగాని అన్నిటినిగాని చూర్ణముగావించి వస్త్రగాళితముచేసి, అల్లపురసముతోనైనను, తేనెతోనైనను సేవించిన కఫరోగము, శూల, వాతరోగము, అరుచి, వాంతులు, కాస, శ్వాస, క్షయరోగములు నశించును.

## శ్వాసకాసలకు కట్ఫలాదిచూర్ణము.

కట్ఫలం పౌష్కరం కృష్ణా శృంగీ చ మధునా సహ,
శ్వాసకాసజ్వరహరశ్శ్రేష్ఠో లేహకఫాంతకృత్. 42

కాయఫలము, పుష్కరమూలము, పిప్పళ్లు, కర్కాటశృంగి వీనిని చూర్ణముగావించి యందు తేనె గలిపి సేవించిన శ్వాస, కాస, జ్వరములు నశించును. మఱియు, కఫమును హరించుటయందు నిది యుత్తమమైనది.

## శిశువులపంచకాసలకు యవక్షారాదిచూర్ణము.

యవక్షారవిషా శృంగీ మాగధీ పౌష్కరోద్భవం,
చూర్ణం క్షౌద్రయుతం లీఢం పంచకాసాన్ జయేచ్ఛిశోః. 43

యవక్షారము, అతివస, కర్కాటశృంగి, పిప్పళ్లు, పుష్కరమూలము వీనిని చూర్ణము గావించి యందు తేనె గలిపి, శిశువులకొసంగిన వారికి గల పంచకాసలు నశించును.

శిశువులకాసజ్వరములకు శృంగ్యాదిచూర్ణము.

శృంగీ ప్రతివిషా కృష్ణా చూర్ణితా మధునా లిహేత్,
శిశోః కాసజ్వరచ్ఛర్ది శాంత్యై త్వవా కేవలావిషా. 44

కర్కాటశృంగి, అతివస, పిప్పళ్లు వీనిచూర్ణంబున సైనను, లేక, అతివసచూర్ణంబునసైనను, తేనె గలిపి శిశువుల కొసంగిన వారికి గల దగ్గు, జ్వరము, వాంతులు నశించును.

ఆమాతిసారములకు శుంఠ్యాదిచూర్ణము.

శుంఠీప్రతివిషాహింగుముస్తాకుటజచిత్రకైః,
చూర్ణముష్ణాంబునా పీతమామాతీసారనాశనమ్. 45

సొంటి, అతివస, ఇంగువ, తుంగముస్తలు, కొడిశపాలవిత్తులు, చిత్రమూలము వీనిని చూర్ణము గావించి యుష్ణోదకముచే సేవించిన ఆమాతీసారములు నశించును.

హరీతక్యాదిచూర్ణము.

హరీతకీ ప్రతివిషా సింధుసౌవర్చలం వచా,
హింగు చేతి కృతం చూర్ణం పిబేదుష్ణేన వారిణా. 46
ఆమాతీసారశమనం గ్రాహి చాగ్ని ప్రబోధనం,

కరకకాయలు, అతివస, సైంధవలవణము, సౌవర్చలవణము, వస, ఇంగువ వీనిని చూర్ణముచేసి యుష్ణోదకముచే సేవించిన ఆమాతీసారముల నశింపఁజేసి, మలమును బంధించి, అగ్నిదీపనము గలిగించును.

సర్వాతిసారములకు లఘుగంగాధరచూర్ణము.

ముస్తమింద్రయవాః బిల్వం లోధ్రం మోచరసం తథా. 47
ధాతకీం చూర్ణయేత్తక్రగుడాభ్యాం పాయయేత్సుధీః,
సర్వాతీసారశమనం నిరుణద్ధి ప్రవాహికామ్. 48
లఘుగంగాధరం నామ చూర్ణం సంగ్రాహకం పరం,

తుంగముస్తలు, కొడిశపాలవిత్తులు, మారేడు, లొద్దుగుచెక్క, బూరుగుబంక, ఆరెపువ్వు వీనిని చూర్ణముచేసి, యందు మజ్జిగ, బెల్లము గలిపి సేవించిన సర్వాతీసార

ములు, ప్రవాహిక ఇవి నశించుటయేగాక మలావష్టంభమును గలిగించును. దీనికి లఘుగంగాధరచూర్ణ మనిపేరు.

### వృద్ధగంగాధరచూర్ణము.

ముస్తారలుకశుంఠీభిర్ధాతకీలోధ్రవాలకైః. 49
బిల్వమోచరసాభ్యాం చ పాఠేంద్రయవవత్సకైః,
ఆమ్రబీజం ప్రతివిషాలజ్జాళురితి చూర్ణితైః. 50
క్షౌద్రతండులపానీయైః పీతైర్యాతి ప్రవాహికా,
సర్వాతిసారం గ్రహణీ ప్రశమం యాతి వేగతః. 51
వృద్ధగంగాధరం చూర్ణం సరిద్వేగవిబంధనం,

తుంగముస్తలు, దుందిలము, సొంటి, ఆరెపువ్వు, లొద్దుగపట్ట, వట్టివేళ్లు, మారేడు, బూరుగబంక, విషబొద్ది, కొడిశపాలవిత్తులు, కొడిశపాలపట్ట, మామిడిజీడి, అతివస, అత్తపత్తియాకు వీనిని చూర్ణముచేసి యందు, తేనె బియ్యపుకడిత గలిపి సేవించిన ప్రవాహిక, సర్వాతిసారములు, సంగ్రహణి వీనిని శీఘ్రముగ నశింపజేయును. ఇది వృద్ధగంగాధరచూర్ణ మనంబడును. నదితో సమానవేగము గల అతిసారమును కూడ నశింపఁజేయును.

### అజమోదాచూర్ణము.

అజమోదామోచరసం సశృంగబేరం సధాతకీకుసుమమ్. 52
గోదధిమంథితయుక్తం గంగామపి వాహినీం రుంధ్యాత్,

అజామోదము, బూరుగుబంక, అల్లము, ఆరెపూలు వీనిని చూర్ణముచేసి ఆవుపెరుఁగుతో సేవించిన గంగాప్రవాహవేగముగల అతిసారములనైన నశింపఁజేయును.

### సంగ్రహణులకు మరీచాదిచూర్ణము.

తక్రేణ యః పిబేన్నిత్యం చూర్ణం మరిచసంభవమ్. 53
చిత్రసౌవర్చలోపేతం గ్రహణీ తస్య నశ్యతి,
ఉదరప్లీహమందాగ్నిగుల్మార్శోనాశనం భవేత్. 54

మిరియములు, చిత్రమూలము, సౌవర్చలవణము వీనిని చూర్ణముజేసి మజ్జిగలో గలిపి సేవించిన గ్రహణి, ఉదరరోగము, ప్లీహరోగము, అగ్నిమాంద్యము, గుల్మము, మూలవ్యాధి నశించును.

—— సంగ్రహణులకు కపిత్థాష్టకచూర్ణము. ——

అష్టౌ భాగాః కపిత్థస్య షడ్భాగా శర్కరా మతా,
దాడిమం తింతిడీకం చ శ్రీఫలం ధాతకీ తథా. 55

అజమోదా చ పిప్పల్యః ప్రత్యేకం స్యుస్త్రిభాగకాః,
మరీచం జీరకం ధాన్యం గ్రంథికం వాలకం తథా. 56
సౌవర్చలం యవానీచ చాతుర్జాతం సచిత్రకం,
నాగరం చైకభాగాస్స్యుః ప్రత్యేకం సూక్ష్మచూర్ణితమ్. 57
కపిత్థాష్టకసంజ్ఞస్స్యాచ్చూర్ణమేతద్గలామయాన్,
అతిసారం క్షయం గుల్మం గ్రహణీ చ వ్యపోహతి. 58

వెలగపండు ఎనిమిదిభాగములు, పంచదార ఆఱుభాగములు, దానిమ్మకాయల బెరడు, చింతపట్ట, మారేడుపిందెలు, ఆరెపూలు, అజామోదము, పిప్పళ్లు, ఇవి ప్రత్యేకముగ మూఁడేసిభాగములు, మిరియములు, జీలకఱ్ఱ, దనియాలు, మోడి, కురువేరు, సౌవర్చలవణము, ఓమము, లవంగపుపట్ట, ఏలకులు, లవంగపుపత్రి, నాగకేసరములు, చిత్రమూలము, సొంటి వీనిని ప్రత్యేకముగ నొక్కొకభాగము వీని నన్నిటిని దంచి చూర్ణముచేసి వస్త్రగాళితమొనర్చి సేవించిన కంఠరోగము, అతిసారము క్షయరోగము, గుల్మము, సంగ్రహణి నశించును. ఇది కపిత్థాష్టకచూర్ణ మనంబడు.

—— గ్రహణ్యాదులకు దాడిమాష్టకచూర్ణము. ——

దాడిమా ద్విపలం గ్రాహ్యం ఖండా చాష్టపలాపి చ,
త్రిగన్ధస్య పలం చైకం త్రికటుస్స్యాత్పలత్రయమ్. 59
ఏతదేకీకృతం సర్వం చూర్ణం స్యాద్దాడిమాష్టకం,
రుచికృద్దీపనం కణ్ఠ్యం గ్రాహీ కాసజ్వరాపహమ్. 60

దానిమ్మకాయలబెరడు రెండుపలములు, చక్కెర ఎనిమిదిపలములు, లవంగపుపట్ట, ఏలకులు, లవంగపుపత్రి ఇవియొకపలము, సొంటి, పిప్పళ్లు, మిరియాలు ఇవిమూఁడు పలములు, ఇటుల వీనినెల్లదంచి చూర్ణముచేసి సేవించిన జిహ్వకు రుచి, అగ్నిదీపనము, కంఠమునకుహితము, అతిసారముల బంధించుట గలదిగనుండును. కాసము, జ్వరము నశించును. ఇది దాడిమాష్టకచూర్ణ మనంబడు.

—— అతిసారాదులకు వృద్ధదాడిమాష్టకచూర్ణము. ——

దాడిమస్య పలాన్యష్టౌ శర్కరాయాః పలాష్టకం,
పిప్పలీ పిప్పలీమూలం యవానీమరిచం తథా. 61

ధాన్యకం జీరకం శుంఠీ ప్రత్యేకం పలసమ్మితం,
కర్షమాత్రాతుగాక్షీరిత్వక్పత్త్రైలాశ్చ కేసరమ్. 61
ప్రత్యేకం కోలమాత్రాస్స్యుస్తచ్చూర్ణం దాడిమాష్టకం,
అతిసారం క్షయం గుల్మం గ్రహణీం చ గళగ్రహమ్. 62
మన్దాగ్నిం పీనసం కాసం చూర్ణమేతద్వ్యపోహతి,

దానిమ్మకాయలబెరడు ఎనిమిదిపలములు, చక్కెర ఎనిమిదిపలములు, పిప్పళ్లు, మోడి, ఓమము, మిరియాలు, దనియాలు, జీలకఱ్ఱ, సొంటి ఇవి ప్రత్యేకమొక్కొక పలము, తవాక్షీరి ఒకకర్షప్రమాణము, లవంగపుపట్ట, ఏలకులు, లవంగపుపత్రి, నాగకేసరములు ఇవి ప్రత్యేకము కోలప్రమాణము, ఇటుల వీనినెల్లదంచి చూర్ణముచేసి వస్త్రగాళిత మొనర్చి సేవించిన అతిసారములు, క్షయరోగము, గుల్మము, సంగ్రహణి, కంఠరోగము, అగ్నిమాంద్యము, పీనస, కాసము నశించును. ఇది వృద్ధదాడిమాష్టకచూర్ణమనంబడు.

## అరోచకాదులకు తాళీసాదిచూర్ణము.

తాళీసం మరిచం శుంఠీ పిప్పలీ వంశలోచనమ్. 63
ఏకద్విత్రిచతుఃషఞ్చ కర్షైర్భాగాన్ప్రకల్పయేత్,
ఏలాత్వచోస్తు కర్షార్ధం ప్రత్యేకం భాగమాహరేత్. 64
మృతం వఙ్గం మృతం తామ్రం సమభాగాని కారయేత్,
ద్వాత్రింశత్కర్షతులితా ప్రదేయా శర్కరా బుధైః. 65
తాళిసాద్యమిదం చూర్ణం రోచనం పాచనం స్మృతం,
కాసశ్వాసజ్వరహరం ఛర్ద్యతీసారనాశనమ్. 66
శోషాధ్మానహరం ప్లీహగ్రహణీపాణ్డురోగజిత్,

తాళీసపత్రి ఒకకర్షప్రమాణము, మిరియములు రెండుకర్షములు, సొంటి మూడు కర్షములు, పిప్పళ్లు నాలుగుకర్షములు, తవాక్షీరి ఐదుకర్షములు, ఏలకులు అర్ధకర్షము, లవంగపుపట్ట అర్ధకర్షము వీనినన్నిటిని దంచి చూర్ణముచేసి వస్త్రగాళిత మొనర్చి యందు వంగభస్మము ఒకకర్షము, తామ్రభస్మము ఒకకర్షము, చక్కెర ముప్పదిరెండుకర్షములు, గలిపి సేవించిన జిహ్వాకురుచి, అన్నము జీర్ణమగుట కలుగును. కాస, శ్వాస, జ్వరములు వాంతులు, అతిసారము, శోషము, కడుపుబ్బరము, ప్లీహరోగము, సంగ్రహణి, పాండురోగము నశించును. ఇదియె తాళీసాది చూర్ణమనంబడు.

క్షయాదులకు లవంగాదిచూర్ణము.

లవఙ్గం శుద్ధకర్పూర మేలాత్వఙ్నాగకేసరమ్, 67
జాతీఫలముశీరం చ నాగరం కృష్ణజీరకం,
కృష్ణాగరుస్తుగాక్షీరీ మాంసనీలోత్పలంకణా. 68
చన్దనం తగరం వాలం కంకోలం చేతి చూర్ణయేత్,
సమభాగాని సర్వాణి సర్వేభ్యోఽర్ధసితా భవేత్. 69
లవఙ్గాద్యమిదం చూర్ణం రాజార్హం వహ్నిదీపనం,
రోచనం తర్పణం వృష్యం త్రిదోషఘ్నం బలప్రదమ్. 70
హృద్రోగం కంఠరోగం చ కాసం హిక్కాం చ పీనసం,
యక్ష్మాణం తమకశ్వాసమతీసారమురఃక్షతమ్. 71
ప్రమేహారుచిగుల్మాదీన్గ్రహణీమపి నాశయేత్,

లవంగములు, పచ్చకర్పూరము, ఏలకులు, లవంగపుపట్ట, నాగకేసరములు, జాజికాయ, వట్టివేళ్లు, సొంటి, నల్లజీలకఱ్ఱ, కృష్ణాగరు, తవాక్షీరి, జటామాంసి, నల్లకలువపూలు, పిప్పళ్లు, శ్రీగంధము, గ్రంధితగరము, కురువేరు, కంకోలము వీనిని సమభాగములుగ చూర్ణముచేసి, దీనికి అర్ధాంశము చక్కెరగలిపి సేవించిన అగ్నిదీపనము, నోటికి రుచి, శరీరమునకు బలము, వీర్యవృద్ధి గలుగుటయే గాక, వాతపిత్త కఫప్రకోపములు, హృద్రోగము, కంఠరోగము, కాసము, ఎక్కిళ్లు, పీనస, క్షయరోగము, తమకశ్వాసము, అతిసారము, ఉరఃక్షతము, ప్రమేహము, అరుచి, గుల్మములు, సంగ్రహణి నశించును. ఇదియె లవంగాదిచూర్ణ మనంబడు.

గ్రహణ్యాదులకు జాతీఫలాదిచూర్ణము.

జాతీఫలలవఙ్గైలాపత్రత్వఙ్నాగకేసరైః. 72
కర్పూరచన్దనతిలైస్త్వక్షీరీతగరామలైః,
తాళీసపిప్పలీపథ్యాస్థూలజీరకచిత్రకైః. 73
శుంఠీవిడఙ్గమరిచైస్సమభాగవిచూర్ణితైః,
యావన్త్యేతాని సర్వాణి కుర్యాద్భఙ్గాం చ తావతీమ్ 74
సర్వచూర్ణసమాదేయా శర్కరా చ భిషగ్వరైః,
కర్షమాత్రం తతః ఖాదేన్మధునా ప్లావితం సుధీః. 75
అస్య ప్రభావాద్గ్రహణీ కాసశ్వాసారుచిక్షయాః,
వాతశ్లేష్మప్రతిశ్యాయాః ప్రశమం యాంతి వేగతః. 76

జాజికాయ, లవంగములు, ఏలకులు, లవంగపుపత్రి, లవంగపుపట్ట, నాగకేసరములు, పచ్చకర్పూరము, చందనము, నువ్వులు, తవాక్షీరి, గ్రంథితగరము, ఉసిరికయొలుపు, తాళీసపత్రి, పిప్పళ్లు, కరకకాయలు, పెద్దజీలకఱ్ఱ, చిత్రమూలము, సొంటి, వాయువిళంగములు, మిరియములు-వీనిని సమభాగములుగ దంచి చూర్ణముచేసి, దీనికి సమముగ జనపవిత్తులచూర్ణంబును, నీరెండుచూర్ణములకు సమముగ చక్కెరయును కలిపి కర్షప్రమాణము తేనెలో సేవించిన సంగ్రహణి, కాసము, శ్వాసము, అరుచి, క్షయరోగము, వాతశ్లేష్మ వికారములు, పీనస వీనిని శీఘ్రముగ నశింపఁజేయును.

## అరుచ్యాదులకు మహాభాండవచూర్ణము.

మరిచం నాగపుష్పాణి తాళీసం లవణాని చ,
ప్రత్యేకమేకభాగాస్స్యుః పిప్పలీమూలచిత్రకైః,
త్వక్కణాతిత్తిడీకం చ జీరకం చ ద్విభాగకమ్. 77
ధాన్యామ్లవేతసౌ విశ్వం భద్రైలాబదరాణి చ,
అజమోదాజలధరః ప్రత్యేకం స్యుస్త్రిభాగికాః. 78
సర్వౌషధచతుర్థాంశం దాడిమస్య ఫలం భవేత్,
ద్రవ్యేభ్యో నిఖిలేభ్యశ్చ సితా దేయార్ధమాత్రయా. 79
మహాభాణ్డవసంజ్ఞం స్యాచ్చూర్ణమేతత్సురోచనం,
అగ్నిదీప్తికరం హృద్యం కాసాతీసారనాశనమ్. 80
హృద్రోగకణ్ఠజఠరముఖరోగప్రణాశనం,
విషూచికాం తథాఽఽధ్మానమర్శో గుల్మకృమీనపి. 81
ఛర్దిం పఞ్చవిధాం శ్వాసం చూర్ణమేతద్వ్యపోహతి,

మిరియాలు, నాగకేసరములు, తాళీసపత్రి, సైంధవలవణము, సౌవర్చలవణము, బిడాలవణము, సముద్రలవణము, సాంబరలవణము వీనిని ప్రత్యేకమొక్కొకభాగము, మోడి, చిత్రమూలము, లవంగపట్ట, పిప్పళ్లు, చింతపట్ట, జీలకఱ్ఱ ఇవి ప్రత్యేకము రెండేసి భాగములు, దనియాలు, పుల్లప్రబ్బలి, సొంటి, పెద్దఏలకులు, రేగుపండ్లు, అజామోదము, తుంగముస్తలు ఇవి ప్రత్యేకము మూఁడేసిభాగములు, దానిమ్మపండు పైద్రవ్యములకన్నిటికి నాలవభాగము, వీనినెల్లదంచి చూర్ణముచేసి చూర్ణమునకు సగము చక్కెర గలిపి సేవించిన నోటికి రుచి, అగ్నిదీపనము, హృదయమునకు హితము గలుగును. కాసము, అతిసారము, హృద్రోగము, కంఠరోగము, ఉదరరోగము, ముఖరోగము, విషూచి, కడుపుబ్బరము, మూలవ్యాధి, గుల్మము, జంతువికారము, ఐదువిధములగువాంతులు, శ్వాసము నశించును. ఇదియే మహాభాండవచూర్ణం బనఁబడు.

### సర్వరోగములకు నారాయణచూర్ణము.

చిత్రకస్త్రిఫలావ్యోషం జీరకం హాపుషా వచా. 82
యవానీ పిప్పలీమూలం శతపుష్పాఽజగన్ధికా,
అజమోదాశఠీధాన్యం విడఙ్గం స్థూలజీరకమ్. 83
హేమాహ్వా పౌష్కరం మూలం క్షారో లవణపఞ్చకం,
కుష్ఠం చేతి సమాంశాని విశాలాస్యాద్విభాగికా. 84
త్రివృత్త్రిభాగా విజ్ఞేయా దన్త్యా భాగత్రయం భవేత్,
చతుర్భాగా సాతలా స్యాత్సర్వాణ్యేకత్ర చూర్ణయేత్. 85
పాచనస్నేహనాద్యైశ్చ స్నిగ్ధకోష్ఠస్య రోగిణః,
దద్యాచ్చూర్ణం విరేకాయ సర్వరోగప్రణాశనమ్. 86
హృద్రోగే పాణ్డురోగే చ కాసే శ్వాసే భగన్దరే,
మన్దేఽగ్నౌ చ జ్వరే కుష్ఠే గ్రహణ్యాం చ గళగ్రహే. 87
దద్యాద్యుక్తానుపానేన తథాఽఽఢ్మానే సురాదిభిః,
గుల్మే బదరనీరేణ విడ్భఙ్గే దధిమస్తునా. 88
ఉష్ణామ్బుభిరజీర్ణే చ వృక్షామ్లైః పరికర్తిషు,
ఉష్ట్రదుగ్ధేనోదరేషు తథా తక్రేణ వా గవామ్. 89
ప్రసన్నయా వాతరోగే దాడిమామ్భోభిరర్శసి,
ద్వివిధేచ విషే దద్యాద్ఘృతేన విషనాశనమ్. 90
చూర్ణం నారాయణం నామ దుష్టరోగగణాపహం,

చిత్రమూలము, త్రిఫలములు, త్రికటుకములు, జీలకఱ్ఱ, బోడతరము, వస, ఓమము, మోడి, పెద్దసదాప, అడవితులసి, అజామోదము, కచోరములు, దనియాలు, వాయువిళంగములు, పెద్దజీలకఱ్ఱ, ఉమ్మెత్త, పుష్కరమూలము, యవక్షారము, సర్జక్షారము, సైంధవలవణము, సౌవర్చలవణము, బిడాలవణము, సముద్రలవణము, సాంబరలవణము, చెంగల్వకోష్ఠు వీనిని ప్రత్యేక మొక్కొకభాగము, పెద్దపాపఱ్ఱ రెండుభాగములు, తెగడ మూడుభాగములు, నేపాళము మూడుభాగములు, సంబరేణి నాలుగుభాగములు ఇటుల వీనినెల్లదంచి చూర్ణముచేసి, దీనిని రోగి కొసంగుటకుముందు, రోగికి పాచనస్నేహనాదులచే కోష్ఠము స్నిగ్ధముగజేసి ఈయౌషధమునొసఁగి విరేచనముచేయించిన, సర్వరోగములు, హృద్రోగము, పాండురోగము, శ్వాసము, కాసము, భగందరము, అగ్నిమాంద్యము, జ్వరము, కుష్ఠు, సంగ్రహణి, గళగ్రహము మొదలగునవి నశించును. మఱియు,

ముపుబ్బరమునందు మద్యము మొదలగువానితోడను, గుల్మరోగంబున రేగుపండ్లకషాయంబుతోడను, మలబద్ధకమునందు పెరుఁగుమీఁది తేటతోడను, అజీర్ణంబున ఉష్ణోదకముతోడను, గుదమునందలి పరికర్తనరోగంబునందు చింతచెక్క కషాయముతోడను, ఉదరరోగంబునందు ఒంటెపాలతోడను, లేక ఆవుపజ్జిగతోడను, వాతరోగంబున ప్రసన్నమను మద్యముతోడను, మూలవ్యాధియందు దానిమ్మవిత్తుల రసముతోడను సేవించిన సమస్తరోగంబులు నశించును. మఱియు నీ చూర్ణమును నేతితో సేవించిన స్థావరజంగమవిషములు నశించును. ఇదియె నారాయణచూర్ణ మనంబడు. ఇది కుష్ఠరోగంబులన్నింటిని నశింపఁజేయును.

## అజీర్ణాదులకు హపుషాదిచూర్ణము.

హపుషా త్రిఫలా చైవ త్రాయమాణా చ పిప్పలీ. 91
హేమక్షీరీ త్రివృచ్చైవ పాతలా కటుకా వచా,
నీలినీ సైన్ధవం కృష్ణా లవణంచేతి చూర్ణయేత్. 92
ఉష్ణోదకేన మూత్రేణ దాడిమత్రిఫలారసైః,
తథా మాంసరసేనాపి యథాయోగ్యం పిబేన్నరః. 93
అజీర్ణే ప్లీహ్ని గుల్మేషు శోఫార్శోవిషమాగ్నిషు,
హలీమకామలాపాణ్డుకుష్ఠాధ్మానోదరేష్వపి. 94

భోడతరము, త్రిఫలములు, కలుక్రానుగ, పిప్పళ్లు, హేమక్షీరి, తెగడ, సంబరేణు, కటుకరోహిణి, వస, నీలిమాకు, సైంధవలవణము, సౌవర్చలవణము వీనిని చూర్ణముచేసి ఉష్ణోదకముతోనైనను, గోమూత్రముతోనైనను, దానిమ్మపండ్లరసముతోనైనను, త్రిఫలారసముతోనైనను, అడవిజింక మొదలగువాని మాంసరసముతోనైనను, ఆయారోగములకుఁ దగినయనుపానముతో సేవించిన అజీర్ణము, ప్లీహరోగము, గుల్మము, వాపు, మూలవ్యాధి, అగ్నిమాంద్యము, హలీమకమనుకామిల, కామెర్లు, పాండురోగము, కుష్ఠము, ముపుబ్బరము, ఉదరరోగము వీనిని నశింపఁజేయును.

## శూలాదులకు పంచసమచూర్ణము.

శుణ్ఠీ హరీతకీ కృష్ణా త్రివృత్సౌవర్చలం తథా,
సమభాగాని సర్వాణి సూక్ష్మచూర్ణాని కారయేత్. 95
జ్ఞేయం పఞ్చసమం చూర్ణ మేతచ్ఛూలహరం పరం,
ఆధ్మానజఠరార్శోఘ్న మామవాతహరం స్మృతమ్. 96

సొంటి, కరకకాయలు, పిప్పళ్లు, తెగడ, సౌవర్చలవణము వీనిని సమభాగములుగ చూర్ణముచేసి సేవించిన, శూల, కడుపుబ్బరము, అగ్నిమాంద్యము, మూలవ్యాధి, ఆమవాతము నశించును. ఇది పంచసమచూర్ణ మనంబడు.

## ఆధ్మానాదులకు నారాచచూర్ణము.

కర్షమాత్రా భవేత్కృష్ణా త్రివృతా స్యాత్పలోన్మితా,
ఖణ్డాపలం చ విజ్ఞేయం చూర్ణమేకత్ర కారయేత్. 97
కర్షోన్మితం లిహేదేతత్క్షౌద్రేణాధ్మాననాశనం,
గాఢవిట్కోదరకఫాన్పిత్తశూలం చ నాశయేత్. 98

పిప్పళ్లు, ఒకకర్షము, తెగడ ఒకపలము వీనిచూర్ణములో చక్కెర ఒకపలము గలిపి కర్షము ప్రమాణచూర్ణమును తేనెలో సేవించిన కడుపుబ్బరము, గాఢమగు మలబద్ధకము, ఉదరరోగము, కఫరోగము, పిత్తశూల వీనిని నశింపఁజేయును.

## యకృత్ప్లీహాదులకు లవణత్రితయాదిచూర్ణము.

లవణత్రితయం క్షారౌ శతపుష్పాద్వయం వచా,
అజమోదా చ గన్ధా చ హపుషా జీరకద్వయమ్. 99
మరీచం పిప్పలీమూలం పిప్పలీ గజపిప్పలీ,
హిఙ్గుళ్చ హిఙ్గుపత్రీ చ శఠీపాఠోపకుఞ్చికా. 100
శుణ్ఠీచిత్రకచవ్యాని విడఙ్గం చామ్లవేతసం
దాడిమం తిన్త్రిణీకం చ త్రివృద్దన్తీ శతావరీ. 101
ఇన్ద్రవారుణికా భార్గీ దేవదారుర్యవానికా,
కుస్తుమ్బురుస్తుమ్బురుణీ పుష్కరం బదరాణి చ. 102
శివాచేతి సమాంశానాం చూర్ణమేకత్ర కారయేత్,
భావయేదార్ద్రకరసైర్బీజపూరరసైస్తథా. 103
తత్పిబేత్సర్పిషాజీర్ణమద్యేనోష్ణోదకేనవా,
కోలామ్భసా వా తక్రేణ దుగ్ధేనాప్త్రేణ మస్తునా. 104
యకృత్ప్లీహాకటీశూలగుదకుక్షిహృదామయాన్,
అర్శోవిష్టమ్భమన్దాగ్నిగుల్మాష్ఠీలోదరాణిచ. 105

హిక్కాధ్మానశ్వాసకాసాన్జయేదేతాన్న సంశయః,
ఏతై రేవౌషధైస్సమ్యగ్ఘృతం వా సాధయేద్భిషక్.

సైంధవలవణము, సౌవర్చలవణము, బిడాలవణము, సర్జక్షారము, యవక్షారము, పెద్దసోపు, బాలింతసోపు, వస, అజామోదము, అడవితులసి, బోడతరము, జీలకఱ్ఱ, పిన్న జీలకఱ్ఱ, మిరియములు, మోడి, పిప్పళ్లు, గజపిప్పళ్లు, వేయించినఇంగువ, హింగుపత్రి, కచోరములు, విషబొద్ది, నల్లజీలకఱ్ఱ, సొంటి, చిత్రమూలము, చవ్యము, వాయువిడంగములు, పుల్లప్రబ్బలి, దానిమ్మబెరడు, చింతపట్ట, తెగడ, నేపాళపువ్రేళ్లు, పిల్లిపీచరగడ్డ, చేదుపుచ్చ, గంటుభారంగి, దేవదారు, ఓమము, దనియాలు, తుంబురులు, పుష్కరమూలము, రేగుపండ్లు, కరకకాయలు వీనిని సమభాగములుగ చూర్ణముచేసి, ఈచూర్ణమును అల్లపురసముతోడను, మాదీఫలపురసముతోడను భావనచేసి ఎండనెండించి నెయ్యి, ప్రాతమద్యము, ఉష్ణోదకము, రేగుపండ్లకషాయము, ఆవుమజ్జిగ, ఒంటెపాలు, పెరుగుమీఁదితేట వీనిలో నెద్దానిచేనైనను రోగానుసారముగ సేవించినను, లేక పైచెప్పిన ద్రవ్యములనుదంచి కషాయముగాచి యందు నెయ్యిగలిపి నెయ్యిమిగులునట్లు మరల కాచి యాఘృతమును సేవించినను, కడుపుకుడిభాగమున జనించెడి యకృత్తురోగము, ఎడమభాగమున జనించెడి ప్లీహరోగము, నడుమునొప్పులు, గుదరోగము, కుక్షిశూల, హృద్రోగము, మూలవ్యాధి, మలబంధము, అగ్నిమాంద్యము, గుల్మము, అష్ఠీలకవాతము, ఉదరరోగము, ఎక్కిళ్లు, కడుపుబ్బరము, శ్వాసము, కాసము నశించును.

## శూలాదులకు తుంబుర్వాదిచూర్ణము.

తుమ్బురూణి త్రిలవణం యవానీపుష్కరాహ్వయమ్. 106
యవక్షారాభయాహిఙ్గువిడఙ్గాని సమాని చ,
త్రివృత్త్రిభాగా విజ్ఞేయా సూక్ష్మచూర్ణాని కారయేత్. 107
పిబేదుష్ణేన తోయేన యవక్వాథేన వా పిబేత్,
జయేత్సర్వాణి శూలాని గుల్మాధ్మానోదరాణి చ. 108

తుంబురులు, సైంధవలవణము, సౌవర్చలవణము, బిడాలవణము, ఓమము, పుష్కరమూలము, యవక్షారము, కరకకాయలు, వేయించిన ఇంగువ, వాయువిళంగములు వీనిని సమభాగములుగను తెగడ మూఁడుభాగములు వీనిని చూర్ణంబుగావించి ఉష్ణోదకముచేనైనను, యవలగంజితోనైనను, సేవించిన సమస్తశూలలు, గుల్మములు, కడుపుబ్బరము, ఉదరరోగము నశించును.

మందాగ్న్యాదులకు చిత్రకాదిచూర్ణము.

చిత్రకో నాగరం హిఙ్గుపిప్పలీ పిప్పలీజటా,
చవ్యాజమోదామరిచం ప్రత్యేకం కర్షసమ్మితమ్. 109
స్వర్జికాచయవక్షారస్సిన్ధు సౌవర్చలం బిడం,
సాముద్రకం రోమకం చ కోలమాత్రాణి కారయేత్. 110
ఏకీకృత్యాఖిలం చూర్ణం భావయేన్మాతులుఙ్గజైః,
రసైర్దాడిమజైర్వాఽపి శోషయేద్వాతపేన చ. 111
ఏతచ్చూర్ణం జయేద్గుల్మం గ్రహణీమామజాం రుజం,
అగ్నిం చ కురుతే దీప్తం రుచికృత్కఫనాశనమ్. 112

చిత్రమూలము, సొంటి, వేయించినఇంగువ, పిప్పళ్లు, మోడి, చవ్యము, అజామోదము, మిరియములు ఇవి ప్రత్యేక మొక్కొకకర్షము, సర్జక్షారము, యవక్షారము, సైంధవలవణము, సౌవర్చలవణము, బిడాలవణము, సముద్రలవణము, సాంబరలవణము వీనిని ప్రత్యేక మొకకోలప్రమాణములుగ జేర్చి, అన్నిటిని చూర్ణముగావించి మాదీఫలరసముతోనైనను దాడిమపండ్ల రసముతోనైనను భావనముచేసి ఎండనెండించి, సేవించిన గుల్మము, సంగ్రహణి, ఆమవాతములు, కఫరోగము నశించుటయేగాక, అగ్నిదీపనము, నోటికి రుచి కలుగును.

మందాగ్న్యాదులకు బడబానలచూర్ణము.

సైన్ధవం పిప్పలీమూలం పిప్పలీచవ్యచిత్రకం,
శుంఠీహారీతకీచేతి క్రమవృద్ధాని చూర్ణయేత్. 113
బడబానలనామైతచ్చూర్ణం స్యాదగ్నిదీపనం,

సైంధవలవణము ఒకభాగము, మోడి రెండుభాగములు, పిప్పళ్లు మూడుభాగములు, చవ్యము నాలుగుభాగములు, చిత్రమూలము ఐదుభాగములు, సొంటి ఆఱుభాగములు, కరకకాయలు ఏడుభాగములు ఈప్రకారము వీనిని చూర్ణముచేసి బలానుసారముగ సేవించిన అగ్నిదీపనము గలుగును. ఇదియే బడబానల చూర్ణ మనంబడు.

వాతాదులకు అజమోదాదిచూర్ణము.

అజమోదావిడఙ్గాని సైన్ధవం దేవదారు చ. 114
చిత్రకః పిప్పలీమూలం శతపుష్పా చ పిప్పలీ,
మరిచం చేతి కర్షాంశం ప్రత్యేకం కారయేద్బుధః. 115
కర్షాస్తు పఞ్చపథ్యాయాః దశస్యుర్వృద్ధదారుకాత్,

నాగరాచ్చ దశైవస్యుస్సర్వాణ్యేకత్ర కారయేత్. 116
పిబేత్కోష్ణజలేనైవ చూర్ణం శ్వయథునాశనం,
ఆమవాతరుజం హన్తి సన్ధిపీడాం చ గృధ్రసీమ్. 117
కటిపృష్ఠగుదస్థాం చ జఙ్ఘయోశ్చ రుజం జయేత్,
తూనీప్రతూనీ విశ్వాచీ కఫవాతామయాన్జయేత్. 118
సమేన వా గుడేనాస్య వటకాన్కారయేత్సుధీః,

అజామోదము, వాయువిళంగములు, సైంధవలవణము, దేవదారుపట్ట, చిత్రమూలము, మోడి, పెద్దసోపు, పిప్పళ్లు, మిరియములు వీనిని ప్రత్యేక మొక్కొక కర్ష ప్రమాణముగను, కరకకాయ 5 కర్షములు, వృద్ధదారువు 10 కర్షములు, సొంటి 10 కర్షములు, ఇటుల వీనినెల్ల చూర్ణముగావించి ఉష్ణోదకముచే సేవించినను, లేక పైజెప్పిన చూర్ణమునకు సమముగ బెల్లముగలిపి మర్దించి యుండలుజేసి సేవించినను, వాపు, ఆమవాతము, సంధులయందలినొప్పులు, గృధ్రసీవాతము, నడుము, వీఁపు, గుదము, పిక్కలు వీనియందలిశూల, తూనీవాతము, ప్రతూనీవాతము, విశ్వాచీవాతము, శ్లేష్మవాతవికారములు నశించును.

## శూలాదులకు హింగ్వాదిచూర్ణము.

హిఙ్గు పాఠాభయాధాన్యం దాడిమం చిత్రకం శఠీ. 119
అజమోదా త్రికటుకం హపుషా చామ్లవేతసం,
అజగన్ధాతిన్తిడీకం జీరకం పౌష్కరం వచా. 120
చవ్యం క్షారద్వయం పఞ్చలవణానీతి చూర్ణయేత్,
ప్రాగ్భోజనస్య మధ్యే వా చూర్ణమేతత్ప్రయోజయేత్. 121
పిబేద్వా జీర్ణమద్యేన తక్రేణోష్ణోదకేన వా,
గుల్మే వాతకఫోద్భూతే హృద్గ్రహేఽష్ఠీలికాసు చ. 122
హృద్వస్తిపార్శ్వశూలేషు శూలే చ గుదయోనిజే,
మూత్రకృచ్ఛ్రే తథాఽఽధ్మానే పాణ్డురోగేఽరుచౌ తథా. 123
హిక్కాయాం చ యకృత్ప్లీహ్నికాసే శ్వాసే గలగ్రహే,
గ్రహణ్యర్శోవికారేషు చూర్ణమేతత్ప్రశస్యతే. 124
భావితం మాతులుఙ్గస్య బహుశస్స్వరసేన వా,
కుర్యాచ్చ గుటికా బహ్వ్యో వాతశ్లేష్మామయాపహాః. 125

వేయించిన ఇంగువ, విషబొద్ది, కరకకాయలు, దనియాలు, దానిమ్మకాయలతోలు, చిత్రమూలము, కచోరములు, అజామోదము, త్రికటుకములు, బోడతరము, పుల్లప్రబ్బలి, వామింటాలు, చింతపండు, జీలకఱ్ఱ, పుష్కరమూలము, వస, చవ్యము, సర్జిక్షారము, యవక్షారము, సైంధవలవణము, సౌవర్చలవణము, బిడాలవణము, సముద్రలవణము, సాంబరలవణము. వీటినెల్ల చూర్ణముగావించి బలానుసారముగ భోజనమునకు ముందు ప్రాతమద్యము, ఆవుమజ్జిగ, ఉష్ణోదకము, వీనిలో దేనితోనైనను సేవింపందగు. భోజనమధ్యమునందు సేవించునెడ అన్నముతోనైన సేవింపదగు. ఇటుల సేవించుటచే వాతకఫములచే జనించిన గుల్మరోగములు, హృద్రోగము, అష్ఠీలికవాతము, హృదయము, వస్తి, ప్రక్కలు వీనియందు గలిగెడుశూల గుదశూల, యోనిశూల, మూత్రకృఛ్రము, కడుపుబ్బరము, పాండురోగము, అరుచి, ఎక్కిళ్లు, యకృత్ప్లీహారోగములు, శ్వాసము, కాసము, కంఠరోగము, సంగ్రహణి, మూలవ్యాధులు నశించును. లేక ఈచూర్ణమును మాదీఫలరసముతో 7 మాఱులు భావనచేసి మాత్రలుజేసి సేవించిన వాతశ్లేష్మములచే జనించినరోగములు నశించును.

## అరోచకాదులకు యవానీభాండవచూర్ణము.

యవానీదాడిమం శుణ్ఠీ తిత్తిడీకామ్లవేతసౌ,
బదరామ్లం చ కుర్వీత చతుశ్శాణమితాని చ. 126
సార్ధద్విశాణం మరిచం పిప్పలీ దశశాణికా,
త్వక్సౌవర్చలధాన్యాకం జీరకం ద్విద్విశాణకమ్. 127
చతుష్షష్టిమితైశ్శాణైశ్శర్కరామత్ర యోజయేత్,
చూర్ణితం సర్వమేకత్ర యవానీఖాణ్డవాభిధమ్. 128
చూర్ణం జయేత్పాణ్డురోగం హృద్రోగం గ్రహణీం జ్వరం,
ఛర్దిశోషాతిసారాంశ్చ ప్లీహానాహవిబన్ధతామ్. 129
అరుచిం శూలమన్దాగ్నిమర్శోజిహ్వాగలామయాన్,

ఓమము, దానిమ్మబెరడు, సొంటి, చింతపండు, పుల్లప్రబ్బలి, పుల్లరేగు ఇవి ప్రత్యేకము నాలుగు శాణములు, మిరియములు రెండున్నరశాణము, పిప్పళ్లు పదిశాణములు, లవంగపుపట్ట, సౌవర్చలవణము, దనియాలు, జీలకఱ్ఱ ఇవి ప్రత్యేకము రెండు శాణములు, ఇటుల వీనినెల్లచూర్ణముచేసి, ఇందు చక్కెర 64 శాణములు గలిపి సేవించిన పాండురోగము, హృద్రోగము, సంగ్రహణి, జ్వరము, వాంతులు, శోషము, అతిసారము, ప్లీహరోగము, ఆనాహవాతము, అరుచి, మలబద్ధకము, శూల, మందాగ్ని, మూలవ్యాధి, జిహ్వారోగములు, కంఠరోగములు నశించును. ఇది, యవానీభాండవచూర్ణమనంబడు.

### అరోచకాదులకు తాళీసాదిచూర్ణము.

తాళీసం మరిచం శుణ్ఠీ పిప్పలీ వంశరోచనా. 130
ఏకద్విత్రిచతుఃపఞ్చ కర్షైర్భాగాన్ ప్రకల్పయేత్,
ఏలాత్వచోస్తు కర్షార్థం ప్రత్యేకం భాగమావహేత్. 131
ద్వాత్రింశత్కర్షతులితా ప్రదేయా శర్కరా బుధైః,
తాళీసాద్యమిదం చూర్ణం రోచనం పాచనం స్మృతమ్. 132
కాసశ్వాసజ్వరహరం ఛర్ద్యతీసారనాశనం,
శోషాధ్మానహరం ప్లీహగ్రహణీపాణ్డురోగజిత్. 133
పక్త్వా వా శర్కరాం చూర్ణం క్షిపేత్స్యాద్గుటికా తతః,

తాళిసపత్రి ఒకకర్షము, మిరియములు రెండుకర్షములు, సొంటి 3 కర్షములు, ప్పళ్లు 4 కర్షములు, వెదురుప్పు 5 కర్షములు, ఏలకులు అర్ధకర్షము, లవంగపుపట్ట అర్ధ ర్షము ఇటుల వీనినెల్ల చూర్ణముచేసి యందు ముప్పదిరెండు కర్షముల చక్కెరగలిపి వించినను, లేక చక్కెరనుపాకుపట్టి యందీచూర్ణమునువైచి బాగుగకలియునట్లుచేసి టికలుగావించి సేవించినను నోటికి రుచి, పాచనము గలుగును. మఱియు కాసము, ్వాసము, జ్వరము, వాంతులు, అతిసారము, శోషము, కడుపుబ్బరము, ప్లీహరోగము, గ్రహణి, పాండురోగము నశించును. ఇదియె తాళీసాద్యచూర్ణ మనంబడు.

### కాసక్షయాదులకు సితోపలాదిచూర్ణము.

సితోపలాషోడశస్స్యాదష్టౌ స్యాద్వంశరోచనా. 134
పిప్పలీ స్యాచ్చతుఃకర్షా స్యాదేలా చ ద్వికార్షికీ,
ఏకకర్షస్త్వచః కార్యం చూర్ణయేత్సర్వమేకతః. 135
సితోపలాదికం చూర్ణం మధుసర్పిర్యుతం లిహేత్,
శ్వాసకాసక్షయహరం హస్తపాదాఙ్గదాహజిత్. 136
మన్దాగ్నిం సుప్తజిహ్వాత్వం పార్శ్వశూలమరోచకం,
జ్వరమూర్ధ్వగతం రక్తం పిత్తమాశు వ్యపోహతి. 137

ఖండశర్కర పదియాఱుకర్షములు, తవక్షీరి యెనిమిదికర్షములు, పిప్పళ్లు, 4 కర్ష ులు, ఏలకులు 2 కర్షములు, లవంగపుపట్ట 1 కర్షము ఇటుల వీనిని చూర్ణముచేసి

ఈచూర్ణమును తేనె, నెయ్యి-వీని యనుపానముతో సేవించిన శ్వాసము, కాసము, క్షయ రోగము, చేతులు, కాళ్లు వీనియందలి తాపము, అగ్నిమాంద్యము, నాలుక మొద్దుగ నుండుట, పార్శ్వశూల, అరుచి, జ్వరము, ఊర్ధ్వగత రక్తపిత్తము శీఘ్రముగ నశించును.

### గ్రహణీగుల్మాదులకు భాస్కరలవణచూర్ణము.

సాముద్రలవణం కార్యమష్టకర్షమితం బుధైః,
పఞ్చ సౌవర్చలం గ్రాహ్యం బిడం సైన్ధవధాన్యకమ్. 138
పిప్పలీపిప్పలీమూలం కృష్ణజీలకపత్రకం,
నాగకేసరతాలీసమమ్లవేతసకం తథా. 139
ద్వికర్షమాత్రాణ్యేతాని ప్రత్యేకం కారయేద్బుధః,
మరీచం జీరకం విశ్వమేకైకం కర్షమాత్రజమ్. 140
దాడిమం స్యాచ్చతుఃకర్షం త్వగేలాచార్ధకార్షికీ,
ఏతచ్చూర్ణీకృతం సర్వం లవణం భాస్కరాభిధమ్. 141
శాణప్రమాణం దేయం తు మస్తుతక్రసురాసవైః,
వాతశ్లేష్మభవం గుల్మం ప్లీహానముదరం క్షయమ్. 142
అర్శాంసి గ్రహణీం కుష్ఠం విబన్ధం చ భగన్దరం,
శోఫం శూలం శ్వాసకాసమామదోషం చ హృద్రుజమ్. 143
మన్దాగ్నిం నాశయేదేతద్దీపనం పాచనం పరం,
సర్వలోకహితార్థాయ భాస్కరేణోదితం పురా. 144

సముద్రలవణము ఎనిమిదికర్షములు, సౌవర్చలవణము ఐదుకర్షములు, బిడాలవణము, సైంధవలవణము, దనియాలు, పిప్పళ్లు, మోడి, నల్లజీలకఱ్ఱ, లవంగపుపత్రి, నాగకేసరములు, తాళిసపత్రి, పుల్లప్రబ్బలి ఇవి ప్రత్యేకము రెండుకర్షములు, మిరియాలు, జీలకఱ్ఱ, సొంటి ఇవి ప్రత్యేక మొక్కొకకర్షము, దానిమ్మబెరడు నాలుగుకర్షములు, లవంగపుపట్ట, ఏలకులు ఇవి ప్రత్యేకము అర్థకర్షము. ఇటుల వీనినెల్ల దంచి చూర్ణము చేసి పెరుగుమీఁది తేటమజ్జిగ, కల్లు, మద్యము వీనిలో దేనితోనైనను శాణప్రమాణము సేవించిన వాతకఫములచే జనించిన గుల్మరోగములు, ప్లీహరోగము, ఉదరరోగము, క్షయరోగము, మూలవ్యాధులు, సంగ్రహణి, కుష్ఠరోగము, మలబద్ధకము, భగందరము, వాపు, శూల, శ్వాస, కాస, ఆమవాతము, హృద్రోగము, అగ్నిమాంద్యము నశించుటయె గాక పాచనము, దీపనము కలుగును. భాస్కరుఁడు జనులహితంబుకై వచించె. ఇదియె భాస్కరలవణచూర్ణ మనంబడు.

## వాంతులకు ఏలాదిచూర్ణము.

ఏలా ప్రియఙ్గుముస్తాని కోలమజ్జా చ పిప్పలీ,
శ్రీచన్దనం తథా లాజా లవఙ్గం నాగకేసరమ్. 145
ఏతచ్చూర్ణీకృతం సర్వం సితాక్షౌద్రయుతం లిహేత్,
వాతపిత్తకఫోద్భూతాం ఛర్దిం హన్త్యతివేగతః. 146

ఏలకులు, ప్రేంకణపువేరు, కోల, తుంగముస్తలు, (కొఱ్ఱలు) రేగుపండ్లలోనిపప్పు, పిప్పళ్లు, శ్రీగంధము, వరిపేలాలు, లవంగములు, నాగకేసరములు వీనిని చూర్ణముచేసి, ఈచూర్ణమును చక్కెర, తేనె వీని యనుపానముతో సేవించిన, వాతపిత్తకఫములవలన జనించిన వాంతు లతివేగంబున నశించును.

## కుష్ఠములకు పంచనింబచూర్ణము.

మూలం పత్రం ఫలం పుష్పం త్వచం నిమ్బాత్సమాహరేత్,
సూక్ష్మచూర్ణమిదం కుర్యాత్పలైః పఞ్చదశోన్మితైః. 147
లోహభస్మహరీతక్యౌ చక్రమర్దనచిత్రకౌ,
భల్లాతకవిడఙ్గాని శర్కరామలకం నిశా. 148
పిప్పలీమరిచం శుణ్ఠీ వాకుచీ కృతమాలకః,
గోక్షురశ్చ పలోన్మానమేకైకం కారయేద్బుధః. 149
సర్వమేకీకృతం చూర్ణం భృఙ్గరాజేన భావయేత్,
అష్టభాగావశిష్టేన ఖదిరాసనవారిణా. 150
భావయిత్వా చ సంశుష్కం కర్షమాత్రం తతః పిబేత్,
ఖదిరాసనతోయేన సర్పిషా పయసాఽథవా. 151
మాసేన సర్వకుష్ఠాని వినిహన్తి రసాయనం,
పఞ్చనిమ్బమిదం చూర్ణం సర్వరోగప్రణాశనమ్. 152

వేపచెట్టుయొక్క వేరు, ఆకులు, పండ్లు, పూలు, పట్ట వీనిచూర్ణము పదునైదు పలములు, లోహభస్మము, కరకకాయలు, తగిరిసవిత్తులు, చిత్రమూలము, శుద్ధిజేసిన జీడిగింజలు, వాయువిళంగములు, చక్కెర, ఉసిరికయొలుపు, పసుపు, పిప్పళ్లు, మిరియములు, సొంటి, భావంచివిత్తులు, రేలగుజ్జు, పల్లేరు వీనిని ప్రత్యేక మొక్కొకపలము, ఇటుల వీనినిచూర్ణముచేసి పైవేపచూర్ణముతో కలిపి, పిదప దానిని గుంటగలగరాకు రసముచేతను, అష్టమాంశముగ కాచిన చండ్ర, వేగిస పట్టల కషాయముచేతను, భావనచేసి ఎండించి,

యందొకకర్ష ప్రమాణచూర్ణమును, చంద్ర, వేగిస పట్టలకషాయముసైనను, నేతితో సైనను, ఆవుపాలతోనైనను ఈరసాయనమును నొకమాసము సేవించిన పదునెనిమిది కుష్ఠములు నశించును. ఇదియే సర్వరోగహరపంచనింబచూర్ణ మనంబడును.

## వాజీకరణమునకు శతావరీచూర్ణము.

శతావరీ గోక్షురశ్చ బీజం చ కపికచ్ఛుజం,
గాఙ్గేరుకీ చాతిబలా బీజమిక్షురకోద్భవమ్. 153
చూర్ణితం సర్వమేకత్ర గోదుగ్ధేన పిబేన్నిశి,
న తృప్తిం యాతి నారీభిర్నరశ్చూర్ణప్రభావతః. 154

పిల్లిపీచరగడ్డలు, పల్లేరువేళ్లు, దూలగొండివిత్తులు, నాగబల, అతిబల, నీరుగొబ్బివిత్తులు వీనిని చూర్ణముచేసి రాత్రులయం దావుపాలతో సేవించిన ననేకస్త్రీలతోరమించినను తృప్తిగలుగక యుండును.

## వీర్యపుష్టికి అశ్వగంధాదిచూర్ణము.

అశ్వగన్ధా దశపలా తన్మాత్రో వృద్ధదారుకః,.
చూర్ణీకృతో ఽథ యం విద్వాన్ ఘృతభాణ్డే నిధాపయేత్. 155
కర్షైకంపయసా పీత్వా నారీభిర్నైవ తృప్యతి,
అగత్వా ప్రమదాం భూయో వలీపలితవర్జితః. 156

పెన్నేరుగడ్డ పదిపలములు, వృద్ధదారు పదిపలములు వీనిని చూర్ణముచేసి నేతితో మాగినకుండయం దునిచి యందొక కర్షప్రమాణము ఆవుపాలతో సేవించిన ననేక స్త్రీలతో రమించినను తృప్తిగలుగకయుండును. మఱియు నీచూర్ణమును సేవించిన స్త్రీలతో రమింపకుండిన ముసలితనముబోయి మిగుల బలము గలిగియుండును.

## ధాతువృద్ధికి ముసలీచూర్ణము.

ముసలీకన్దచూర్ణం తు గుడూచీసత్వసంయుతం,
వానరీగోక్షురాభ్యాం చ శాల్మలీశర్కరామలైః. 157
ఆలోడ్య ఘృతదుగ్ధేన పాయయేత్కామవర్ధనం,

నేలతాడి గడ్డలు, తిప్పసత్తు, దురదగొండివిత్తులు, పల్లేరువేళ్లు, బూరుగవేళ్లు, ఉసిరికయొలుపు వీనినిచూర్ణముచేసి యందు శర్కరగలిపి, నెయ్యి, ఆవుపాలు వీనియనుపానముతో సేవించిన కామోద్రేకము గలుగును.

ధాతువృద్ధికి నవాయసాదిచూర్ణము.

చిత్రకం త్రిఫలాముస్తం విడంగం త్ర్యూషణాని చ. 158
సమభాగాని కార్యాణి నవభాగా హతాయసః.
ఏతదేకీకృతం చూర్ణం మధుసర్పిర్యుతం లిహేత్. 159
గోమూత్రమథవా తక్రమనుపానే ప్రశస్యతే,
పాణ్డురోగం జయత్యుగ్రం త్రిదోషం చ భగన్దరమ్. 160
శోఫకుష్ఠోదరార్శాంసి మన్దాగ్నిమరుచిం కృమీన్,

చిత్రమూలము, త్రిఫలములు, తుంగముస్తలు, వాయువిళంగములు, త్రికటుకములు వీనిని సమభాగములుగ చూర్ణముచేసి, దీనికి తొమ్మిదవపాలు లోహభస్మముగలిపి, తేనె, నెయ్యి, గోమూత్రము, ఆవుమజ్జిగ వీనిలో దేనినైన యనుపానముగఁజేసి బలానుసారము సౌషధముసేవించిన ప్రబలమగు పాండురోగము, త్రిదోషవికారములు భగందరము, వాపు, కుష్ఠము, ఉదరరోగము, మూలవ్యాధి, అగ్నిమాంద్యము, అరుచి, కృములు నశించును.

స్తంభనమునకు ఆకారకరభాదిచూర్ణము.

ఆకారకరభశ్శుణ్ఠీ కఙ్కోలం కుఙ్కుమం కణా. 161
జాతీఫలం లవంగం చ చన్దనం చేతి కార్షికాన్,
చూర్ణానిమాంస్తతః కుర్యాదహిఫేనం పలోన్మితమ్. 162
సర్వమేకీకృతం చూర్ణం మాషైకం మధునా లిహేత్,
శుక్రస్తంభకరం చూర్ణం పుంసామానన్దకారకమ్. 163
నారీణాం ప్రీతిజననం సేవేత నిశి కాముకః,

ఇతి శ్రీదామోదరసూను శార్ఙ్గధరేణ విరచితాయాం
సంహితాయాం మధ్యమఖండే చికిత్సాస్థానే
చూర్ణకల్పనానామ షష్ఠోఽధ్యాయః.

అక్కలకర్ర, సొంటి, కంకోలము, కుంకుమపువ్వు, పిప్పళ్లు, జాజికాయ, లవంగములు, శ్రీగంధము ఇవి ప్రత్యేక మొక్కొకకర్షము, నల్లమందు ఒకపలము, ఇటుల వీని నెల్లఁ జక్కగ చూర్ణముచేసి మాషప్రమాణము రాత్రియందు తేనెతో సేవించిన ధాతుస్తమ్భనమై పురుషులకానందంబును, స్త్రీలకతిప్రీతియు గలుగు.

ఇది శ్రీదామోదరసూను శార్ఙ్గధరవిరచిత సంహితయందు మధ్యమఖండమున
చికిత్సాస్థానమున చూర్ణకల్పన యనియెడు
నాఱవయధ్యాయము సంపూర్ణము.

# సప్తమాధ్యాయము.

## వటకకల్పన.

శ్లో. వటకాశ్చాథ కథ్యంతే తన్నామగుటికావటీ,
మోదకోవటికాపిండీ గుడోవర్తిస్తథోచ్యతే. 1
లేహవత్సాధ్యతే వహ్నౌ గుడో వా శర్కరాఽథవా,
గుగ్గులుర్వా క్షిపేత్తత్ర చూర్ణం తన్నిర్మితావటీ. 2
కుర్యాదవహ్నిసిద్ధేన క్వచిద్గుగ్గులునా వటీ,
ద్రవేణ మధునా వాఽపి గుటికాం కారయేద్బుధః. 3
సితా చతుర్గుణా దేయా వటీషు ద్విగుణో గుడః,
చూర్ణాచ్చూర్ణసమః కార్యో గుగ్గులుర్మధు తత్సమమ్. 4
ద్రవం చ ద్విగుణం దేయం మోదకేషు భిషగ్వరైః,
కర్షప్రమాణా తన్మాత్రా బలం దృష్ట్వా ప్రయుజ్యతే. 5

గుటిక, వటి, మోదకము, వటిక, పిండి, గుడము, వర్తి అనునవి వటకమునకు పర్యాయశబ్దంబులుగనుండు. బెల్లము, చక్కెర, గుగ్గిలము వీనిచే వటకములు జేయుచోనెడ లేహపాకముగ పచనముచేసి యందౌషధచూర్ణమును గలిపి వటకములు చేయవలయును. లేక పాకము చేయకనే వటకములు జేయునెడ, శుద్ధిజేసిన గుగ్గులుచూర్ణమును ఔషధద్రవ్యచూర్ణముతో గలిపి గుటికలు జేయవలయును. లేక నీళ్లు, పాలు, తేనె మొదలగు ద్రవద్రవ్యములనైనను చూర్ణములోగలిపి వటకములు జేయందగు. శర్కరతో గుటికములు జేయునెడ, యౌషధచూర్ణమునకు నాలుగింతలు చక్కెర చేర్చుకొనందగు. అందు బెల్లమును జేర్చునెడ, రెండింతలు జేర్చుకొనందగు. గుగ్గిలము, తేనె వీనిని గలిపి జేయునెడ చూర్ణమునకు సమంబుగను, నీళ్లు, పాలు మొదలగు ద్రవపదార్థములను జేర్చునెడ చూర్ణమునకు రెండింతలును జేర్చుకొని మోదకములు జేయందగు. వటికలను కర్షప్రమాణమునవైనను లేక రోగియొక్క బలానుసారముగనైనను సేవింపందగు.

## అర్శఆదులకు బాహుశాలగుడము.

ఇన్ద్రవారుణికాముస్తం శుణ్ఠీద న్తీహరీతకీ,
త్రివృచ్ఛటీవిడఙ్గాని గోక్షురశ్చిత్రకస్తథా. 6
తేజోహ్వా చ ద్వికర్షాణి పృథగ్ద్రవ్యాణి కారయేత్,

సూరణస్య పలాన్యష్టౌ వృద్ధదారు చతుఃపలమ్. 7
చతుఃపలం స్యాద్భల్లాతం క్వాథయేత్సర్వమేకతః,
జలద్రోణే చతుర్థాంశం గృహ్ణీయాత్క్వాథముత్తమమ్. 8
క్వాథ్యద్రవ్యాత్త్రిగుణితం గుడం క్షిప్త్వా పునః పచేత్,
సమ్యక్పక్వం చ విజ్ఞాత్వా చూర్ణమేతత్ప్రదాపయేత్. 9
చిత్రకస్త్రివృతా దన్తీ తేజోహ్వాపలికా పృథక్,
పృథక్త్రిపలికాః కార్యా వ్యోషైలామలకత్వచః. 10
నిక్షిపేన్మధుశీతే చ తస్మిన్ ప్రస్థప్రమాణితం,
ఏవం సిద్ధో భవేచ్ఛ్రీమాన్ బాహుశాలగుడశ్శుభః. 11
జయేదర్శాంసి సర్వాణి గుల్మం వాతోదరం తథా,
ఆమవాతం ప్రతిశ్యాయం గ్రహణీక్షయపీనసాన్. 12
హాలీమకం పాణ్డురోగం ప్రమేహం చ రసాయనం,

చేదుపుచ్చ, తుంగముస్తలు, సొంటి, నేపాళము, కరకకాయలు, తెగడ, కచోరములు, వాయువిళంగములు, పల్లేరు, చిత్రమూలము, మాల్కంగినీవిత్తులు ఇవి ప్రత్యేకము రెండుకర్షములు, అడవికంద ఎనిమిదిపలములు, వృద్ధదారు నాలుగుపలములు, శుద్ధిచేసిన నల్లజీడిగింజలు నాలుగుపలములు, వీనినెల్ల దంచి యందొక ద్రోణప్రమాణ ముదకముబోసి, నాలవపాలుమిగులునట్లు కషాయముగాచి, కషాయమునకు మూడింతలు బెల్లము వైచి మరల కాచి, యందు చిత్రమూలము, తెగడ, నేపాళపువ్రేళ్లు, మాల్కంగినీవిత్తులు ఇవి ప్రత్యేక మొక్కొకపలము, త్రికటుకములు, ఏలకులు, ఉసిరికరొలుపు, లవంగపుపట్ట ఇవి ప్రత్యేకము మూడుపలములు ఇటుల వీనినెల్ల చూర్ణముచేసి పైపాకములో గలిపి చల్లారినపిదప యందొక ప్రస్థము తేనె గలిపి చక్కగా గలియునట్లుజేసి గుటికలుజేసి సేవించిన సమస్త మూలవ్యాధులు, గుల్మము, వాతోదరము, ఆమవాతము, జలుబు, గ్రహణి, క్షయరోగము, పీనసము, హాలీమకమనుకామిల, పాండురోగము, ప్రమేహము నశించును. ఇదియే బాహుశాలగుడరసాయన మనంబడు.

కాసాదులకు మరీచాదిగుటికలు.

మరీచం కర్షమాత్రం స్యాత్పిప్పలీ కర్షసమ్మితా. 13
అర్ధకర్షో యవక్షారః కర్షయుగ్మం చ దాడిమం,
ఏతచ్చూర్ణీకృతం యుఞ్జ్యాదష్టకర్షగుడేన హి. 14

శాణప్రమాణాం గుటికాం కృత్వా వక్త్రే విధారయేత్,
అస్యాః ప్రభావాత్సర్వేఽపి కాసా యాన్త్యేవ సంక్షయమ్. 15

మిరియము లొకకర్షము, పిప్పళ్లు ఒకకర్షము, యవక్షారము అర్ధకర్షము, దానిమ్మ బెరడు రెండుకర్షములు వీనిని చూర్ణముజేసి యందు ఎనిమిది కర్షముల బెల్లముగలిపి శాణప్రమాణముగ గుటికలుజేసి సేవించిన కాసలన్నియు నశించును.

ఊర్ధ్వవాతములకు వ్యాఘ్రీజీరకాదిగుటికలు.

వ్యాఘ్రీజీరకధాత్రీణాం చూర్ణం మధుయుతం లిహేత్,
ఊర్ధ్వవాతమహాశ్వాసతమకైర్ముచ్యతే క్షణాత్. 16

వాకుడు, జీలకఱ్ఱ, ఉసిరికయొలుపు వీనినిచూర్ణముచేసి, యందు తేనెగలిపి గుటికలుజేసి సేవించిన ఊర్ధ్వవాతము, మహాశ్వాసము, తమకశ్వాసము ఇవి యొకక్షణములో నశించును.

శ్వాసకాసములకు గుడాదిగుటికలు.

గుడశుణ్ఠీశివాముస్తైర్గుటికాం ధారయేన్ముఖే,
శ్వాసకాసేషు సర్వేషు కేవలం వా విభీతకమ్. 17

సొంటి, కరకపిందెలు, తుంగముస్తలు వీనిని చూర్ణముచేసి, యందు బెల్లమును గలిపి గుటికలు జేసియైనను, లేక తానికాయలబెరడును పుక్కిట నుంచికొని దానిరసమును మ్రింగుచుండినను శ్వాసములు, కాసనులు నశించును.

తృష్ణాదులకు ఆమలక్యాదిగుటికలు.

ఆమలం కమలం కుష్ఠం లాజాశ్చ వటరోహకం,
ఏతచ్చూర్ణస్య మధునా గుటికాం ధారయేన్ముఖే. 18
తృష్ణాం ప్రవృద్ధాం హన్త్యేషా ముఖశోషం చ దారుణం,

ఉసిరికయొలుపు, తామరపూలు, చెంగల్వకోష్ఠు, వరిపేలాలు, మఱ్ఱియూడల చిగుళ్లు వీనినిచూర్ణముచేసి, యందు తేనెగలిపి, గుటికలుగావించి, పుక్కిలియందుంచికొని రసము మ్రింగుచుండిన విశేషమగుదప్పి, దారుణమగు ముఖశోషము నశించును.

సన్నిపాతాదులకు సంజీవనీగుటికలు.

విడఙ్గం నాగరం కృష్ణా పథ్యామలవిభీతకా. 19

వచాగుడూచీభల్లాతం సద్విషం చాత్ర యోజయేత్,
ఏతాని సమభాగాని గోమూత్రేణైవ పేషయేత్. 20
గుఞ్జాభా గుటికా కార్యా దద్యాదార్ద్రికజైరసైః,
ఏకామజీర్ణగుల్మేషు ద్వే విషూచ్యాం చ దాపయేత్. 21
తిస్రశ్చ సర్పదష్టే తు చతస్రస్సన్నిపాతకే,
వటీసఞ్జీవనీ నామ్నా సఞ్జీవయతి మానవమ్. 22

వాయువిళంగములు, సొంటి, పిప్పళ్లు, కరకకాయలు, ఉసిరికయొలుపు, తానికాయలు, వస, తిప్పతీఁగ, శుద్ధిజేసిన నల్లజీడిగింజలు, శుద్ధిజేసినవత్సనాభి వీనిని సమభాగములుగ చూర్ణముచేసి గోమూత్రముతో మర్దించి గురిగింజలంతమాత్రలుజేసి యందొకమాత్రను అల్లపురసముతో సేవించిన అజీర్ణము, గుల్మములు నశించును. మఱియు విషూచియందు రెండుమాత్రలును, సర్పదష్టముచే విషమెక్కినపుడు మూఁడుమాత్రలును, సన్నిపాతమున నాలుగుమాత్రలును సేవింపందగు. మఱియు నీమాత్రలు మనుజులకు ప్రాణం బొసంగుటచే సంజీవనీగుటిక లనఁబరఁగు.

## పీనసాదులకు వ్యోషాదిగుటికలు.

వ్యోషామ్లవేతసం చవ్యం తాళీసం చిత్రకస్తథా,
జీరకం తిన్త్రిడీకంచ ప్రత్యేకం కర్షభాగికమ్. 23
త్రిసుగన్ధం త్రిశాణం స్యాద్గుడస్స్యాత్కర్షవింశతిః,
వ్యోషాదిగుటికానామ పీనసశ్వాసకాసజిత్. 24
రుచిస్వరకరాఖ్యాతా ప్రతిశ్యాయప్రణాశినీ,

సొంటి, మిరియములు, పిప్పళ్లు, పుల్లప్రబ్బలి, చవ్యము, తాళిసపత్రి, చిత్రమూలము, జీలకఱ్ఱ, చింతపట్ట ఇవి ప్రత్యేకమొక్కొకకర్షము, లవంగపుపట్ట, ఏలకులు, లవంగపుపత్రి ఇవిప్రత్యేకమొకశాణము ఇటుల వీనినెల్లచూర్ణముచేసి యందు ఇరువది కర్షములబెల్లముగలిపి మాత్రలుజేసి సేవించిన, పీనసము, శ్వాసము, కాసము, అరుచి, స్వరభంగము, పడిసెము నశించును. ఇవియే వ్యోషాదిగుటిక లనంబడు.

## ఆమాదులకు గుడచతుష్టయవటకములు.

ఆమేషు సగుడాం శుంఠీమజీర్ణే గుడపిప్పలీమ్. 25
కృచ్ఛ్రే జీరగుడం దద్యాదర్శస్సు సగుడాభయాం,

సొంటిచూర్ణమున బెల్లముగలిపి సేవించిన ఆమము, పిప్పలిచూర్ణమున బెల్లము గలిపి సేవించిన అజీర్ణము, జీలకఱ్ఱచూర్ణమున బెల్లముగలిపిసేవించిన మూత్రకృచ్ఛ్రములు, కరకపిందెలచూర్ణములో బెల్లముగలిపిసేవించిన మూలవ్యాధులును నశించును.

అర్శోరోగములకు వృద్ధదారు మోదకములు.

వృద్ధదారుకభల్లాత శుంఠీచూర్ణేన యోజితః. 26
మోదకస్సగుడో హన్యాత్షడ్విధార్శాంసి కృతాం రుజం,

వృద్ధదారు, శుద్ధిజేసినజీడిగింజలు, సొంటి వీనినిచూర్ణముచేసి, యందు రెండింతలబెల్లముగలిపి గుటికలుచేసి సేవించిన, ఆఱువిధములగు మూలవ్యాధులు నశించును.

అర్శోరోగములకు సూరణవటకములు.

శుష్కసూరణచూర్ణస్య భాగాన్ ద్వాత్రింశదాహరేత్. 27
భాగాన్ షోడశచిత్రస్య శుంఠ్యా భాగచతుష్టయం,
ద్వౌ భాగౌ మరిచస్యాపి సర్వాణ్యేకత్ర కారయేత్. 28
గుడేన పిండికాం కుర్యాదర్శసాం నాశనీం పరాం,

ఎండిన కందగడ్డలచూర్ణము ముప్పదిరెండుభాగములు, చిత్రమూలపు చూర్ణము పదియాఱుభాగములు, సొంటిచూర్ణము నాలుగుభాగములు, మిరియాలచూర్ణము రెండు భాగములు ఈప్రకారము వీనిని గ్రహించి యందు రెండింతల ప్రాతబెల్లముగలిపి వటకములుచేసి సేవించిన ఆఱువిధములగు మూలవ్యాధులు నశించును.

అర్శఆదులకు బృహత్సూరణవటకములు.

సూరణో వృద్ధదారుశ్చ భాగైష్షోడశభిః పృథక్. 29
ముసలీచిత్రకౌ జ్ఞేయావష్టభాగమితౌ పృథక్,
శివా విభీతకీ ధాత్రీ విడఙ్గం నాగరం కణా. 30
భల్లాతః పిప్పలీమూలం తాలీసం చ పృథక్పృథక్,
చతుర్భాగప్రమాణాని త్వగేలామరిచం తథా. 31
ద్విభాగమాత్రాణి పృథక్తతస్త్వేకత్రచూర్ణయేత్,
ద్విగుణేన గుడేనాథ వటకాన్ కారయేద్బుధః. 32
ప్రబలాగ్నికరా ఏతే తథార్శోనాశనాః పరాః,
గ్రహిణీం వాతకఫజాం శ్వాసం కాసం క్షయామయమ్. 33

ప్లీహానం శ్లీపదం శోఫం హిక్కాం మేహం భగన్దరం,
నిహన్త్యః పలితం వృష్యా స్తథా మేధ్యా రసాయనాః. 34

ఎండినకందగడ్డలు పదియాఱుభాగములు, వృద్ధదారు పదియాఱుభాగములు, నేల తాడిగడ్డలు ఎనిమిదిభాగములు, చిత్రమూలము ఎనిమిదిభాగములు, కరకకాయలు, తాని కాయలు, ఉసిరికకాయలు, వాయువిళంగములు, సొంటి, పిప్పళ్లు, నల్లజీడిగింజలు, మోడి, తాళిసపత్రి ఇవి ప్రత్యేకముగ నాలుగుభాగములు, ఏలకులు, లవంగపుపట్ట, మిరియములు ఇవి ప్రత్యేకముగ రెండుభాగములు ఇటుల వీనినెల్లచూర్ణముచేసి చూర్ణ మునకు రెండింతలు ప్రాతబెల్లమునుగలిపి వటకములుగావించి సేవించిన మిగుల అగ్నిదీప నము గలుగును. మూలవ్యాధి వాతకఫములవలన జనించిన సంగ్రహణి, శ్వాసము, కాసము, క్షయరోగము, ప్లీహము, బోదకాలు, వాపు, ఎక్కిళ్లు, ప్రమేహము, భగంద రము, నరయుట నశించును. మఱియు వీర్యవృద్ధి గలుగును. ఇది రసాయనమనంబడు.

కామిలాదులకు మండూరవటకములు.

త్రిఫలాత్ర్యూషణం చవ్యం పిప్పలీమూలచిత్రకౌ,
దారుమాక్షికధాతు స్త్వగ్దార్వీము స్తం విడఙ్గకమ్. 35
ప్రత్యేకం కర్షమాత్రాణి సర్వం ద్విగుణితం తథా,
మణ్డూరం చూర్ణయేత్సర్వం గోమూత్రేఽష్టగుణే క్షిపేత్. 36
పక్త్వా చ వటకాన్ కృత్వా దద్యాత్తక్రానుపానతః,
కామలాపాణ్డుమేహార్శశ్శోఫకుష్ఠకఫామయాన్. 37
ఊరు స్తమ్భమజీర్ణం చ ప్లీహానం నాశయన్తి చ,

త్రిఫలములు, త్రికటుకములు, చవ్యము, మోడి, చిత్రమూలము, దేవదారుపట్ట, హేమమాక్షికభస్మము, లవంగపుపట్ట. మ్రానిపసపు, తుంగముస్తలు, వాయువిళంగములు వీనిని ప్రత్యేక మొక్కొకకర్షము చొప్పున చూర్ణముచేసి యందు ముప్పదికర్షముల లోహ మండూరచూర్ణముగలిపి పిదప, దీనిని మూండువందల అఱువదికర్షముల గోమూ త్రంబునవైచివండి, వటకములుజేసి, మజ్జిగ యనుపానముతో సేవించిన కామిల, పాండు రోగము, ప్రమేహము, మూలవ్యాధి, వాపు, కుష్ఠము, కఫవికారము, ఊరుస్తంభవాతము అజీర్ణము, ప్లీహము నశించును.

ప్రమేహములకు చంద్రప్రభాదిగుటికలు.

చంద్రప్రభావచాము స్తం భూనిమ్బామృతదారుకమ్. 38
హరిద్రాఽతివిషాదార్వీ పిప్పలీమూలచిత్రకౌ,

ధాన్యకం త్రిఫలాచవ్యం విడఙ్గం గజపిప్పలీ.
వ్యోమం మాక్షికధాతుశ్చ ద్వౌ క్షారౌ లవణత్రయం,
ఏతాని శాణమాత్రాణి ప్రత్యేకం కారయేద్పృథః.
త్రివృద్దన్తీపత్రకం చ త్వగేలావంశలోచనా,
ప్రత్యేకం కర్షమాత్రంచ కుర్యాదేతాని బుద్ధిమాన్.
ద్వికర్షం హతలోహస్స్యాచ్చతుఃకర్షా సితా భవేత్,
శిలాజత్వష్టకర్షం స్యాదష్టౌ కర్షాస్తు గుగ్గులోః.
ఏభిరేకత్ర సంక్షుణ్ణైః కర్తవ్యా గుటికా శుభా,
చన్ద్రప్రభేతి విఖ్యాతా సర్వరోగప్రణాశినీ. 4
ప్రమేహం వింశతిం కృచ్ఛ్రం మూత్రాఘాతం తథాశ్మరీం,
విబన్ధానాహశూలాని మేహనగ్రన్థిమర్బుదమ్ 4
అణ్డవృద్ధిం తథా పాణ్డుం కామలాం చ హలీమకం,
అన్త్రవృద్ధిం కటీశూలం శ్వాసం కాసం విచర్చికామ్. 4
కుష్ఠాన్యర్శాంసి కణ్డూం చ ప్లీహోదరభగన్దరం,
దన్తరోగం నేత్రరోగం స్త్రీణామార్తవజాం రుజమ్. 4
పుంసాం శుక్లగతాన్ దోషాన్ మన్దాగ్నిమరుచిం తథా,
వాయుం పిత్తం కఫం హన్యాద్బల్యా వృష్యా రసాయనీ. 4
చన్ద్రప్రభాయాం కర్షస్తు చతుశ్శాణో విధీయతే,

కచోరములు, వస, తుంగముస్తలు, నేలవేము, తిప్పతీఁగ, దేవదారు, పసుపు అతివస, మ్రానిపసుపు, మోడి, చిత్రమూలము, దనియాలు, త్రిఫలములు, చవ్యము వాయువిళంగములు, గజపిప్పళ్లు, త్రికటుకములు, హేమమాక్షికభస్మము, యవక్షారము సర్జక్షారము, సైంధవలవణము, సౌవర్చలవణము, బిడాలవణము ఇవి ప్రత్యేక మొక్కొక శాణము, శుద్ధిజేసిన తెగడ, నేపాళపువ్రేళ్లు, లవంగపుపత్రి, లవంగపుపట్ట, ఏలకులు తవాక్షీరి ఇవి ప్రత్యేక మొక్కొకకర్షము, లోహభస్మము రెండుకర్షములు, చక్కెర నాలుగుకర్షములు, శిలాజితు ఎనిమిది కర్షములు, శుద్ధిచేసినగుగ్గిలము ఎనిమిదికర్షముల ఇటుల వీనినెల్ల చూర్ణముగావించి ఏకముజేసి, యుదకముతో ఖల్వమున మర్దించి కర్ష ప్రమాణముగ గుటికలుజేసి సేవించిన ఇరువదిప్రమేహములు, మూత్రకృచ్ఛ్రములు మూత్రాఘాతములు, అశ్మరులు, మలబద్ధకము, ఆనాహవాతము, శూలలు, ప్రమేహపిటి కలు, అర్బుదములు, అండవృద్ధి, పాండురోగము, కామెర్లు, హలీమకము, అంత్రవృద్ధి నడుముశూల, శ్వాసము, కాసము, విచర్చిక, కుష్ఠము, మూలవ్యాధులు, దురద, ప్లీహ

రోగము, ఉదరరోగములు, భగందరరోగము, దంతరోగములు, నేత్రరోగములు, స్త్రీలకు గలిగెడి ప్రదరాదిరోగములు, శుక్రధాతుగతరోగములు, అగ్నిమాంద్యము, అరుచి, వాత, పిత్త, కఫ రోగములు నశించును. వీర్యవృద్ధిగలుగును. ఇదియె చంద్రప్రభాదిరసాయన మనఁబడును. దీని సేవించిన సమస్తరోగంబులు నశించును. ఈచంద్రప్రభాదిరసాయనంబున కర్షమన నాలుగు శాణములని యెఱుంగవలయు.

గుల్మములకు కాంకాయనగుటికలు.

యవానీ జీరకం ధాన్యం మరీచం గిరికర్ణికా. 48
అజమోదోపకుఞ్చీ చ చతుశ్శాణాః పృథక్పృథక్,
హిఙ్గు షట్ఛాణికం కార్యం క్షారౌ లవణపఞ్చకమ్. 49
త్రివృచ్చాష్టమితశ్శాణైః ప్రత్యేకం కల్పయేత్సుధీః,
దన్తీశఠీ పౌష్కరం చ విడఙ్గం దాడిమం శివా. 50
చిత్రోమ్లవేతసశ్శుణ్ఠీ శాణైష్షోడశభిః పృథక్,
బీజపూరరసేనైషాం గుటికాం కారయేద్బుధః. 51
ఘృతేన పయసా మద్యైరమ్లైరుష్ణోదకేన వా,
పిబేత్కాఙ్కాయనప్రోక్తాం గుటికాం గుల్మనాశనీమ్. 52
మద్యేన వాతికం గుల్మం గోక్షీరేణ చ పైత్తికం,
మూత్రేణ కఫగుల్మం చ దశమూలైస్త్రిదోషజమ్. 53
ఉష్ట్రీదుగ్ధేన నారీణాం రక్తగుల్మం నివారయేత్,
హృద్రోగం గ్రహణీం శూలం క్రిమీనర్శాంసి నాశయేత్. 54

ఓమము, జీలకఱ్ఱ, దనియాలు, మిరియములు, విష్ణుక్రాంతము, అజామోదము, నల్లజీలకఱ్ఱ ఇవి ప్రత్యేకముగ నాలుగుశాణములు, వేయించిన ఇంగువ ఆఱుశాణములు, సర్జక్షారము, యవక్షారము, సైంధవలవణము, సౌవర్చలవణము, బిడాలవణము, సముద్రలవణము, కాచలవణము, తెగడ ఇవి ప్రత్యేకముగ ఎనిమిదిశాణములు, నేపాళపువ్రేళ్లు, కచోరములు, పుష్కరమూలము, వాయువిళంగములు, దానిమ్మబెరడు, కరకకాయలు, చిత్రమూలము, పుల్లప్రబ్బలి, సొంటి ఇవి ప్రత్యేకముగ పదియాఱుశాణములు వీనినన్నిటిని చూర్ణముచేసి మాదీఫలపురసముతో మర్దించి గుటికలుచేసి, నేతితోనైనను, ఆవుపాలతోనైనను, పులిసినమద్యముతోనైనను, ఉష్ణోదకముతోనైనను సేవించిన గుల్మరోగములన్నియుం నశించును. మఱియుం నీగుటికలను మద్యముతో సేవించిన వాతగుల్మంబును, ఆవుపాలతో సేవించిన పిత్తగుల్మంబును, గోమూత్రముతో సేవించిన శ్లేష్మగుల్మంబును, దశమూలకషాయముతో సేవించిన సన్నిపాతగుల్మంబును, ఒంటెపాలతో సేవించిన

జలమర్ధశృతం జ్ఞాత్వా గృహ్ణీయాద్వస్త్రగాలితం,
క్వాథే క్షిపేత్తు శుద్ధం చ గుగ్గులుం ప్రస్థసమ్మితమ్. 70
పునఃపచేదయఃపాత్రే దర్వ్యా సంఘట్టయేన్ముహుః,
సాన్ద్రీభూతం చ తం జ్ఞాత్వా గుడపాకసమాకృతిమ్. 71
చూర్ణీకృత్య తతస్తత్ర ద్రవ్యాణీమాని నిక్షిపేత్,
త్రిఫలార్ధపలా జ్ఞేయా గుడూచీ పలికా మతా. 72
షడక్షం త్ర్యూషణం ప్రోక్తం విడఙ్గానాం పలార్ధకం,
దన్తీ కర్షమితా కార్యా త్రివృత్కర్షమితా స్మృతా. 73
తతః పిణ్డీకృతం సర్వం ఘృతపాత్రే వినిక్షిపేత్,
గుటికాశ్శాణికాః కార్యా యుంజ్యాద్దోషాద్యపేక్షయా. 74
అనుపానే భిషగ్దద్యాత్కోష్ణనీరం పయోఽథవా,
మఞ్జిష్ఠాదిశృతం వాఽపి యుక్తియుక్తమతఃపరం. 75
జయేత్సర్వాణి కుష్ఠాని వాతరక్తం త్రిదోషజం,
సర్వవ్రణాంశ్చ గుల్మాంశ్చ ప్రమేహపిటికాస్తథా. 76
ప్రమేహోదరమన్దాగ్నికాసం శ్వయథుపాణ్డుతాం,
హన్తిసర్వామయాన్నిత్యముపయుక్తో రసాయనః. 77
కైశోరకాభిధానోఽయం గుగ్గులుః కాన్తికారకః,
వాసాదినా నేత్రగదాన్ గుల్మాదీన్ వరుణాదినా. 78
క్వాథేన ఖదిరస్యాపి వ్రణకుష్ఠాని నాశయేత్,
అమ్లం తీక్ష్ణమజీర్ణం చ వ్యవాయం శ్రమమాతపమ్. 79
మద్యం రోషం త్యజేత్సమ్యగ్గుణార్థీ పురసేవకః,

త్రిఫలములు మూఁడుప్రస్థములు, తిప్పతీఁగె యొకప్రస్థము వీని నలియగొట్టి ఇనుపపాత్రలోవైచి యందు ఒకటిన్నరద్రోణప్రమాణ ముదకముఁబోసి సగము మిగులునట్టు కషాయమునుగాచి, వడియగట్టి, యందొకప్రస్థము శుద్ధిచేసినగుగ్గులపు చూర్ణమువైచి, దీని మరల నినుపపాత్రలోఁబోసి ఇనుపగరిటెతో కలియబెట్టుచు, బెల్లపుపాకమువలె గట్టిబడువఱకు కాచి, యందు త్రిఫలములు ప్రత్యేకముగ అర్ధపలము, తిప్పఁతీఁగె చూర్ణము ఒకపలము, త్రికటుకములు ఆఱుఅక్షములు, వాయువిళంగముల చూర్ణము అర్ధపలము నేపాళపువేరు చూర్ణము ఒకకర్షము, శుద్ధిచేసినతెగడచూర్ణము ఒకకర్షము వైచి కలియబెట్టి, నేతితో మాగినకుండయందునిచి, శాణప్రమాణముగఁగాని, దోషాది

బలానుసారముగ గాని గుటికలు గావించి, వేడినీరు, ఆవుపాలు, మంజిష్ఠాదికషాయము వీనిచేఁగాని, లేక రోగానుసారముగ నుచితమగుయనుపానముచేఁ గాని బలానుసారముగ సేవించిన పదునెనిమిది కుష్ఠములు, త్రిదోషజనితవాతరక్తము, సమస్తవ్రణములు, గుల్మములు, ప్రమేహపిటికలు, ప్రమేహములు, ఉదరరోగములు, అగ్నిమాంద్యము, కాసము, వాపు, పాండురోగములు నశించును. మఱియు ప్రతిదినము దీనిసేవించుచుండిన సమస్త రోగములు నశించి, శరీరకాంతినిగలుగఁజేయును. ఇదియే కైశోరగుగ్గులు రసాయన మనఁబరఁగు. మఱియు దీనిని వాసాదికషాయముతో సేవించిన నేత్రరోగములు, వరుణాది కషాయముతో సేవించిన గుల్మాదిరోగంబులును, ఖదిరకషాయముతో సేవించిన వ్రణ రోగంబులును, కుష్ఠరోగంబులును నశించును. మఱియు, పులుసు, కారము, అజీర్ణపదార్థములు, స్త్రీసంభోగం బొనర్చుట, ఆయాసముఁగలుగఁజేసికొనుట, ఎండలోఁదిరుగుట, మద్యపానముసేయుట, ఆగ్రహించుట వీనిని వర్జించి పథ్యంబుగనుండి సేవించుచుండవలయును.

భగందరాదులకు త్రిఫలాగుగ్గులువు.

త్రిపలం త్రిఫలాచూర్ణం కృష్ణాచూర్ణం పలోన్మితమ్. 80
గుగ్గులుః పఞ్చపలికః క్షోదయేత్సర్వమేకతః,
తతస్తు గుటికాం కృత్వా ప్రయుఞ్జ్యాదగ్నిసాపేక్షయా. 81
భగన్దరం గుల్మశోఫమర్శాంసి చ వినాశయేత్,

త్రిఫలములు మూఁడుపలములు, పిప్పలిచూర్ణము ఒకపలము చక్కఁగ నూరి శుద్ధి చేసిన గుగ్గులుచూర్ణము ఐదుపలములు ఇటుల వీనినెల్ల నేకముచేసి ద్రవ్యముచేఁ జక్కఁగ మర్దించి గుటికలుగావించి అగ్నిబలానుసారముగ సేవించిన భగందరము, గుల్మము, వాపు, మూలవ్యాధి నశించును.

ప్రమేహాదులకు గోక్షురాదిగుగ్గులువు.

అష్టావింశతిసఙ్ఖ్యాని పలాన్యాసీయ గోక్షురాత్. 82
విపచేత్షడ్గుణే నీరే క్వాథో గ్రాహ్యోఽర్ధశేషితః,
తతః పునః పచేత్తత్ర పురం సప్తపలం క్షిపేత్. 83
గుడపాకసమాకారం జ్ఞాత్వా తత్ర వినిక్షిపేత్,
త్రికటుత్రిఫలాముస్తం చూర్ణితం పలసప్తకమ్. 84
తతః పిణ్డీకృతం చాస్య గుటికాముపయోజయేత్,
హన్యాత్ప్రమేహం కృచ్ఛ్రం చ ప్రదరం మూత్రఘాతకమ్. 85
వాతాస్రం వాతరోగాంశ్చ శుక్రదోషం తథాఽశ్మరీం,

పల్లేరును ఇరువదియెనిమిది పలములుదెచ్చి కొంచెముగ నలియఁగొట్టి, కాతింత లుదకముబోసి సగము మిగులునట్లు కషాయముగాచి యందు శుద్ధిచేసిన గ చూర్ణము ఏడుపలములు వైచి, బెల్లమువలెపాకువచ్చువఱకు మరలకాచి, పిదప త్రికటుకములు, త్రిఫలములు, తుంగముస్తలు వీనిచూర్ణమును ప్రత్యేకముగ నొక వంతునవైచి పక్వముగావించి నేతితోమాగినకుండయందునిచి బలానుసారముగ సే చుండిన ప్రమేహములు, మూత్రకృఛ్రములు, స్త్రీలప్రదరరోగములు, మూత్రా ములు, వాతరక్తము, వాతరోగములు, శుక్రదోషము, అశ్మరి నశించును.

కుష్ఠాదులకు త్రిఫలామోదకము.

త్రిఫలాష్టపలా కార్యా భల్లాతానాం చతుఃపలమ్.
వాకుచీ పఞ్చపలికా విడఙ్గానాం చతుఃపలం,
హృతలోహం త్రివృచ్చైవ గుగ్గులుశ్చ శిలాజతు.
ఏకైకం పలమాత్రం స్యాత్పలార్ధం పౌష్కరం భవేత్,
చిత్రకస్య పలార్ధం స్యాద్ద్విశాణం మరిచం భవేత్.
నాగరం పిప్పలీముస్తం త్వగేలాపత్రకుఙ్కుమం,
శాణోన్మితం స్యాదేకైకం చూర్ణయేత్సర్వమేకతః.
తతస్తత్ప్రిక్షిపేచ్చూర్ణం పక్వఖణ్డే చ తత్సమే,
మోదకాన్పలికాన్ కృత్వా ప్రయుఞ్జీత యథోచితాన్.
హన్యుస్సర్వాణి కుష్ఠాని త్రిదోషప్రభవామయాన్,
భగన్దరప్లీహగుల్మాన్ జిహ్వాతాలుగలామయాన్.
శిరోక్షిభ్రూగతాన్ రోగాన్ మన్యాపృష్ఠగతానపి,
ప్రాగ్భోజనస్య దేయం స్యాదధఃకాయస్థితే గదే.
భేషజం భక్తమధ్యే చ రోగే జఠరసంస్థితే,
భోజనస్యోపరి గ్రాహ్యమూర్ధ్వజత్రుగదేషు చ.

త్రిఫలములు ఎనిమిదిపలములు, శుద్ధిజేసినజీడిగింజలు నాలుగుపలములు, బ విత్తులు ఐదుపలములు, వాయువిళంగములు నాలుగుపలములు, లోహభస్మము, శుద్ధ తెగడ, శుద్ధిజేసినగుగ్గిలము, శిలాజతు ఇవి ప్రత్యేకమొకపలము, పుష్కరము అర్ధపలము, చిత్రమూలము అర్ధపలము, మిరియాలు రెండుశాణములు, సొంటి, పి తుంగముస్తలు, లవంగపుపట్ట, ఏలకులు, లవంగపుపత్రి, కుంకుమపువ్వు వీనిని ప్ర మొకశాణప్రమాణము, ఇటుల వీనినెల్లదంచి చూర్ణముచేసి వస్త్రగాళితమొనర్చి,

చూర్ణమునకు సమంబుగ శర్కర గ్రహించి పాకుబట్టి యందాచూర్ణమునువైచి, కలియఁ బెట్టి, పల ప్రమాణముగ మోదకములు చేసి సేవించిన పదునెనిమిది కుష్ఠములు, త్రిదోష జనితరోగములు, భగందరము, ప్లీహరోగము, గుల్మము, నాలుక, తాలువు, కంఠము, శిరము, నేత్రములు, కనుబొమలు, పెడతల పెద్దనరము, వీఁపు వీనియందు జనించురోగ ములు నశించును. మఱియు నీయౌషధమును నడుము మొదలు కాళ్లవఱకు జనించెడి రోగములకు భోజనముచేయుటకు ముందుగను, గర్భమున జనించినరోగములకు భోజన మధ్యంబునను, కంఠము మొదలు శిరస్సువఱకు జనించినరోగంబులకు భోజనముచేసిన పిద పను సేవింపవలయును.

## గండమాలాదులకు కాంచనారగుగ్గులువు.

కాఞ్చనారత్వచో గ్రాహ్యం పలానాం దశకం బుధైః,
త్రిఫలా షట్పలా కార్యా త్రికటుస్స్యాత్పలత్రయమ్. 94
పలైకం వరుణం కుర్యాదేలాత్వక్పత్రకం తథా,
ఏకైకం కర్షమాత్రం స్యాత్సర్వాణ్యేకత్ర చూర్ణయేత్. 95
యావచ్చూర్ణమిదం సర్వం తావన్మాత్రస్తు గుగ్గులుః,
సఙ్కుట్య సర్వమేకత్ర పిణ్డం కృత్వా చ ధారయేత్. 96
గుటికాశ్శాణికాః కార్యాః ప్రాతర్గ్రాహ్యా యథోచితాః,
గండమాలాం జయత్యుగ్రామపచీమర్బుదాని చ. 97
గ్రన్థీన్ వ్రణాంశ్చ గుల్మాంశ్చ కుష్ఠాని చ భగన్దరం,
ప్రదేయశ్చానుపానార్థం క్వాథో ముణ్డినికాభవః. 98
క్వాథః ఖదిరసారస్య పథ్యా క్వాథోష్ణకం జలం,

దేవకాంచనపు పట్ట పదిపలములు, త్రిఫలములు ఆఱుపలములు, త్రికటుకములు మూఁడుపలములు, ఉలిమిడిపట్ట ఒకపలము, ఏలకులు, లవంగపుపట్ట, లవంగపుపత్రి ఇవి ప్రత్యేక మొకకర్షము, ఇటుల వీనినెల్ల చూర్ణముచేసి దీనికిసమముగ శుద్ధిచేసిన గుగ్గులు చూర్ణమును గలిపి చక్కగమర్దించి ముద్దగఁజేసి నేతితోమాగినకుండయందునిచి, శాణ ప్రమాణముగ వటికలుచేసి ప్రాతఃకాలమున, బోడతరముకషాయము, చండ్రచేవకషా యము, కరకకాయల కషాయము, వేడినీరు వీనిలో నెద్దానిచేనైన సేవించిన భయంకర మగు గండమాలలు, అపచి, అర్బుదము, గ్రంథులు, వ్రణములు, గుల్మములు, కుష్ఠములు, భగందరము నశించును.

## ధాతుపుష్టికి మాషాదిమోదకము.

నిస్తుషం మాషచూర్ణం స్యాత్తథా గోధూమసమ్భవమ్. 99

వాకుడు, నూఱుపలములుదెచ్చి నలియగొట్టి యందు ద్రోణప్రమాణ ముదకము పోసి నాలవపాలుమిగులునట్లు కషాయముగాచి వడగట్టి యందు తిప్పతీఁగె, చవ్యము, చిత్రమూలము, తుంగముస్తలు, కరకపువ్వు సొంటి, పిప్పళ్లు, మిరియాలు, దురదగొండివేళ్లు, గంటుభారంగి, సన్నరాస్న, కచోరములు వీని చూర్ణము ప్రత్యేక మొకొ్కక పలము, చక్కెర ఇరువదిపలములు, ఆవునెయ్యి ఎనిమిదిపలములు, నూనె ఎనిమిదిపలములు వైచి లేహముపక్వమగువఱకు మరలవండి, చల్లారినపిదప ఎనిమిదిపలముల తేనె, నాలుగు పలములు తవక్షీరి, నాల్గుపలములపిప్పలి చూర్ణముకలిపి కలియబెట్టి గట్టికుండలోనునిచి బలానుసారముఁగ సేవించుచుండిన ఎక్కిళ్లు, శ్వాసము, కాసము నశించును.

### క్షయాదులకు చ్యవనప్రాశావలేహము.

పాటలారణికాశ్మర్యబిల్వారలుకగోక్షురాః,
పర్ణ్యౌ బృహత్యౌ పిప్పల్యః శృఙ్గీద్రాక్షామృతాభయాః. 10
బలాభూమ్యామలీవాస ఋద్ధిర్జీవన్తికాశఠీ,
జీవకర్షభకౌ ముస్తం పౌష్కరం కాకనాసికా. 11
ముద్గపర్ణీ మాషపర్ణీ విదారీ చ పునర్నవా,
కాకోల్యౌ కమలం మేదే సూక్ష్మైలాగురుచన్దనమ్. 12
ఏకైకం పలసమ్మానం స్థూలచూర్ణితమౌషధం,
ఏకీకృత్య బృహత్పాత్రే పఞ్చామలశతాని చ. 13
పచేద్ద్రోణజలే క్షిప్త్వా గ్రాహ్యమష్టాంశశేషితం,
తతస్తు తాన్యామలాని నిష్కులీకృత్య వాససా. 14
దృఢహస్తేన సమ్మర్ద్య క్షిప్త్వా తత్ర తతో ఘృతం,
పలసప్తమితం తాని కించిద్భృష్ట్వాఽల్పవహ్నినా. 15
తతస్తత్ర క్షిపేత్క్వాథం ఖణ్డాం చార్ధతులోన్మితం,
లేహవత్సాధయిత్వా చ చూర్ణానీమాని దాపయేత్. 16
పిప్పలీ ద్విపలా దేయా తుగాక్షీరీ చతుష్పలా,
ప్రత్యేకం చ త్రిశాణాస్స్యుస్త్వగేలాపత్రకేసరాః. 17
తతస్త్వేకీకృతే తస్మిన్ క్షిపేత్క్షౌద్రం చ షట్పలం,
ఇత్యేవం చ్యవనప్రోక్తం చ్యవనప్రాశసంజ్ఞితమ్. 18
లిహేద్వహ్నిబలం దృష్ట్వా ఖాదేత్క్షీణో రసాయనం,
బాలవృద్ధాః క్షతక్షీణా నారీక్షీణాశ్చ శోషిణః. 19
హృద్రోగేణ స్వరక్షీణా యే నరాస్తేషు యుజ్యతే,

కాసం శ్వాసం పిపాసాం చ వాతాస్రమురసో గ్రహమ్. 20
వాతపిత్తం శుక్రదోషం మూత్రదోషంచ నాశయేత్,
మేధాం స్మృతిం స్త్రీషు హర్షం కాన్తిం వర్ణం ప్రసన్నతామ్. 21
అస్యాత్ప్రయోగాదాప్నోతి నరో జీర్ణవివర్జితః,

పాదిరివేళ్లు కూరచెల్లివేళ్లు గుమ్ముడువేళ్లు, మారేడువేళ్లు, దుందిలపువేళ్లు, పల్లేరువేళ్లు, కోలపొన్న, నక్కతోకపొన్న, వాకుడు, పెద్దములక, పిప్పళ్లు, కర్కాటక శృంగి, ద్రాక్షపండు, తిప్పతీఁగ, కరకకాయలు, చిట్టాముట్టి, నేలయుసిరిక, అడ్డసరపాకు, ఋద్ధి, వృద్ధి, పాలకూర, కచోరములు, జీవకము, ఋషభకము, తుంగముస్తలు, పుష్కర మూలము, కాకిదొండ, అడవిపెసర, అడవిమినుము, నేలగుమ్ముడు, గలిజేరు, కాకోలి, క్షీరకాకోలి, కమలము, మేద, మహామేద, సన్నవిలకులు, కృష్ణాగరు, చందనము వీనిని ప్రత్యేకమొకపలము చొప్పున గ్రహించి కొంచెముగ నలియగొట్టి, పిదప పెద్దవియగు ఐదువందల ఉసిరికకాయలను నొకపెద్దకుండయందు వైచి యందుపై నలియగొట్టిన చూర్ణమునువైచి ఒకద్రోణము జలముంపోసి ఎనిమిదవపాలు మిగులునట్లు కషాయముగాచి వడియగట్టి, పిదప నాభాండమందలి యుసిరికకాయలను బైటికిదీసి వాసనగట్టినకళాయి పాత్రయందునిచి చక్కగరుద్ది గుజ్జుదీసి యందు ఏడుపలములనెయ్యిబోసి మందాగ్నియం దునిచి కొంచముగ వేగునట్లు గలియబెట్టి పిదప నీగుజ్జును పైకషాయముతోఁ గలిపి యందు చక్కెర ఏబదిపలములువైచి గట్టియగునట్లు పాకముగావించి యందు పిప్పలి చూర్ణము రెండుపలములు, తవక్షీరి నాలుగుపలములు, లవంగపుపట్ట, ఏలకులు, లవంగపు పత్రి, నాగకేసరములు వీనిని ప్రత్యేకముగ మూఁడుశాణములు, తేనె ఆఱుపలములు వైచి బాగుగ గలియునట్లొనర్చిన లేహమగు. చ్యవనమహామునిచే చెప్పంబడిన నీలేహ మును అగ్నిబలానుసారముగ సేవించిన క్షీణత్వము, శ్వాసము, కాసము, దప్పి, వాత రక్తము, ఉరోగ్రహము, వాతపిత్తవికారములు, శుక్రదోషము, మూత్రదోషము నశించును. మఱియు, బాలురు, వృద్ధులు, శస్త్రాభిఘాతముచే క్షీణించెడివారు, అధికముగ స్త్రీసంభోగం బొనర్చుటచే ధాతుక్షయముగలవారు, శోషగలవారు, ఱొమ్మునొప్పిచే స్వర క్షీణులు దీనినిసేవింపదగు. ఇటులసేవించిన రోగాదులచేగలిగినక్షీణత్వమునశించి శరీరపుష్టి, కుశాగ్రబుద్ధి, స్మృతి, స్త్రీలయందిచ్ఛ, శరీరకాంతి, వర్ణము, ముఖప్రసన్నత గలుగును.

### రక్తపిత్తములకు కూశ్మాండావలేహము.

నిష్కులీకృతకూశ్మాణ్డఖణ్డం పలశతం పచేత్. 22
నిక్షిప్య ద్వితులం నీరమర్ధశిష్టం చ గృహ్యతే,
తాని కూశ్మాణ్డఖణ్డాని పీడయేద్దృఢవాససా. 23

ఆతపే శోషయేత్కించిచ్ఛూలాగ్రైర్బహుశో వ్యధేత్,
క్షిప్త్వా తామ్రకటాహే చ దద్యాదష్టపలం ఘృతమ్. 24
తేన కించిద్భర్జయిత్వా పూర్వోక్తం తజ్జలం క్షిపేత్,
ఖణ్డాత్పలశతం దత్వా సర్వమేకత్ర పాచయేత్. 25
సుపక్వే పిప్పలీశుణ్ఠీ జీరాణాం ద్విపలం పృథక్,
పృథక్పలార్ధం ధాన్యాకం పత్త్రైలామరిచత్వచమ్. 26
చూర్ణీకృత్య క్షిపేత్తత్ర ఘృతార్ధం క్షౌద్రమావహేత్,
ఖాదేదగ్నిబలం దృష్ట్వా రక్తపిత్తక్షయీ జ్వరీ. 27
శోషస్తృష్ణాతమచ్ఛర్దికాసశ్వాసక్షతాతురః,
కూశ్మాణ్డకావలేహోఽయం బాలవృద్ధేషు యుజ్యతే. 28
ఉరస్సన్ధానకృద్వృష్యో బృంహణో బలకృన్మతః,

పైబెరడుదీసిన బూడిదగుమ్మడికాయను ముక్కలుగకోసి దానిని నూఱుపలములు గ్రహించి యందురెండువందల పలములనీరుబోసి సగము ఇంకునట్లుకషాయముగాచి యా నీరును వడియగట్టి, ప్రత్యేకమునునిచి, పిదప నాగుమ్మడిబద్దలనుగట్టి గుడ్డలోవేసి పిడిచి కొంతసేపు ఎండనిచ్చి శూలాగ్రముచే ననేకరంధ్రములుబొడిచి పిదప రాగిపాత్రయం దెనిమిదిపలములనెయ్యిబోసి యందాగుమ్మడు ముక్కలనువైచి కొంచముగ వేయించి యందుపైవడిగట్టిన కషాయమునుబోసి యందునూఱు పలముల శర్కరవైచి గట్టిగ పాకముచేసి, యాపాకమునందు పిప్పలిచూర్ణము, సొంటిచూర్ణము, జీలకఱ్ఱచూర్ణము, ఇవి ప్రత్యేకము రెండుపలములు, దనియాలు, లవంగపుపత్రి, మిరియాలు, ఏలకులు, లవంగపుపట్ట, వీనిచూర్ణము ప్రత్యేకమర్ధపలము, తేనె నాలుగుపలములు, వీనినివైచి చక్కగ కలియబెట్టి, అగ్నిబలానుసారముగ సేవించిన రక్తపిత్తము, క్షయరోగము, జ్వరము, శోషము, దప్పి, పిత్తమువలనగన్నులు దిరుగుట, వాంతులు, కాసము, శ్వాసము, శస్త్రాభిఘాతమువలన గలిగినవ్యథ నశించును. మఱియు, నీకూశ్మాండలేహము, బాలురకు వృద్ధులకు మిగుల నుపయోగంబుగనుండును. మఱియు అన్నరసము ఱొమ్మున కెగతట్టినదాని క్రిందికి దింపును. స్త్రీసంగమమునం దిచ్ఛ, ధాతువృద్ధి, బలము వీనిని గలుగం జేయును.

## అర్శోరోగములకు ఖండకూశ్మాండావలేహము.

యుక్త్యా కూశ్మాండఖణ్డస్య సూరణం విపచేత్సుధీః. 29
అర్శసాం మూఢవాతానాం మన్దాగ్నినాం చ శస్యతే,

పైచెక్కుదీసినబూడిదగుమ్మిడికాయ ముక్కలను, సన్నముగతరిగినకందబద్దలను సమభాగములుగ గ్రహించి నేతిలో వేయించి, వీనికి ద్విగుణితమగు శర్కరపాకమునందు

పైవేయించినబద్దలనువైచి లేహపాకముగావించి బలానుసారముగ సేవించిన, మూలవ్యాధులు, మూఢవాతములు నశించును. అగ్నిదీపనము గలుగును.

### క్షయాదులకు అగస్త్యహరీతక్యవలేహము.

హరీతకీశతం భద్రం యవానామాఢకం తథా. 30
పలాని దశమూలస్య వింశతిశ్చ నియోజయేత్,
చిత్రకః పిప్పలీమూలమపామార్గస్సటీ తథా. 31
కపికచ్ఛుశ్శంఖపుష్పీ భార్జీ చ గజపిప్పలీ,
బలాపుష్కరమూలం చ పృథగ్ద్వి పలమాత్రయా. 32
పచేత్పఞ్చాఢకే నీరే యవైస్స్విన్నైశ్శృతం నయేత్,
తచ్చాభయాశతం దద్యాత్క్వాథే తస్మిన్విచక్షణః. 33
సర్పిస్తైలాష్టపలకం క్షిపేద్గుడతులాం తథా,
పక్త్వా లేహత్వమానీయ సిద్ధే శీతే పృథక్పృథక్. 34
క్షౌద్రం చ పిప్పలీచూర్ణం దద్యాత్కుడవమాత్రయా,
హరీతకీద్వయం ఖాదేత్తేన లేహేన నిత్యశః 35
క్షయం కాసం జ్వరం శ్వాసం హిక్కార్శోరుచిపీనసాన్,
గ్రహణీం నాశయేదేష వలీపలితనాశనః. 36
బలవర్ణకరః పుంసామవలేహో రసాయనః,
విహితోఽగస్త్యమునినా సర్వరోగప్రణాశనః, 37

ఆఢకప్రమాణముయవలను కొంచముగదంచి దానికినాలుగింతలు నీళ్లుబోసి నాలవపాలు మిగులునట్లు కషాయముగాచి వడగట్టియుంచి, పిదప దశమూలములను ఇరువదిపలములు, చిత్రమూలము, మోడి, ఉత్తరేణి, కచోరములు, దురదగొండివిత్తులు, శంఖపుష్పి, గంటుభారంగి, గజపిప్పళ్లు, ముత్తవపులగము, పుష్కరమూలము వీనిని ప్రత్యేకము రెండుపలములు; ఇటుల వీనినెల్లకొంచముగ నలియగొట్టి, యందు ఐదుఆఢకముల నీళ్లుబోసి నాలవపాలు మిగులునట్లు కషాయముగాచి వడియగట్టి దీనినిపైవడియగట్టియుంచిన యవ, కషాయములో గలిపి అందు నూరతుకరకకాయలు నూఱు, నెయ్యి ఎనిమిదిపలములు నువ్వులనూనె ఎనిమిదిపలములు, బెల్లము, నూఱుపలములు వైచి లేహపాకముగవండి చల్లారినపిదప తేనె యొకకుడవము, పిప్పలిచూర్ణము ఒకకుడవము కలిపి, అగస్త్యమహాముని చే చెప్పంబడిన అగస్త్యహరీతకియను నీయవలేహముతోడ, రెండు కరకకాయలచొప్పున ప్రతిదినము సేవించుచుండిన, క్షయరోగము, కాసము, జ్వరము, శ్వాసము, ఎక్కిళ్లు

మూలవ్యాధి, అరుచి, పీనస, గ్రహణి, ముసలితనము నశించును. శరీరమునకు బలమును, కాంతియు గలుగజేయును. ఇది రసాయనం బగుటచే సర్వరోగములను నశింపఁ జేయును.

## అర్శోరోగములకు కుటజాదిలేహము.

కుటజత్వక్తులాం ద్రోణే జలస్య విపచేత్సుధీః,
కషాయం పాదశేషం చ గృహ్ణీయాద్వస్త్రగాలితమ్. 38
త్రింశత్పలం గుడస్యాత్ర దత్వా చ విపచేత్పునః,
సాన్ద్రత్వమాగతం జ్ఞాత్వా చూర్ణానీమాని దాపయేత్. 39
రసాఞ్జనం మోచరసం త్రికటుం త్రిఫలాం తథా,
లజ్జాళుం చిత్రకం పాఠాం బిల్వమిన్ద్రయవాన్వచామ్. 40
భల్లాతకం ప్రతివిషాం విడఙ్గాని చ వాలకం,
ప్రత్యేకం పలసమ్మానం ఘృతస్య కుడవం తథా. 41
సిద్ధే శీతే తతో దద్యాన్మధునః కుడవం తథా,
జయేదేషోఽవలేహస్తు సర్వాణ్యర్శాంసి వేగతః. 42
దుర్నామప్రభవాన్ రోగానతీసారమరోచకం,
గ్రహణీం పాణ్డురోగం చ రక్తపిత్తం చ కామలామ్. 43
అమ్లపిత్తం తథా శోఫం కార్శ్యం చైవ ప్రవాహికాం,
అనుపానే ప్రయోక్తవ్యమాజం తక్రం పయో దధి. 44
ఘృతం జలం వాజీర్ణే చ పథ్యభోజీ భవేన్నరః,

కొడిశపాలపట్ట నూఱుపలములు దెచ్చి నలియగొట్టి యందొక ద్రోణము నీళ్లుబోసి నాలవపాలుమిగులునట్లు కషాయముగాచి వడియగట్టి, యందు ముప్పదిపలముల బెల్లము వైచి చిక్కగపాకమగువఱకు మరలకాచి, యందు రసాంజనము, బూరుగబంక, సొంటి, మిరియాలు, పిప్పళ్లు, త్రిఫలములు, అత్తపత్తియాకు, చిత్రమూలము, విషబొద్ది, మారేడు, కొడిశపాలవిత్తులు, వస, శుద్ధిజేసిన నల్లజీడిగింజలు, అతివస, వాయువిళంగములు, కురువేరు, వీనిని ప్రత్యేకముగ పలప్రమాణము చూర్ణముచేసి వైచి, పిదప యందావునెయ్యి ఒకకుడవప్రమాణముబోసి దానిని లేహపక్వముగ దించుకొని చల్లారినపిదప తేనె ఒకకుడవముబోసి చక్కగ కలియునట్లొనర్చి అన్నము జీర్ణమైనపిదప నీయవలేహమును, మేకమజ్జిగ, పాలు, పెరుగు, నెయ్యి, కాగిచల్లారిననీరు వీనిలో నెద్దానిచేనైన సేవించుచు పథ్యంబుగనుండిన మూలవ్యాధులు, మూలవ్యాధివలన జనించెడి రోగములు, అతిసారము, అరోచకము, గ్రహణి, పాండురోగము, రక్తపిత్తము, కామెర్లు, అమ్లపిత్తము, వాపు, కృశించుట, ప్రవాహిక నశించును.

సర్వాతిసారములకు కుటజాష్టకావలేహము.

కుటజత్వక్తులామార్ద్రాం ద్రోణనీరే విపాచయేత్. 45
పాదశేషం శృతం నీత్వా చూర్ణాన్యేతాని దాపయేత్,
లజ్జాళుర్ధాతకీబిల్వం పాఠామోచరసస్తథా. 46
ముస్తం ప్రతివిషా చైవ ప్రత్యేకం స్యాత్పలం పలం,
తతస్తు విపచేద్భూయో యావద్దర్వీప్రలేపనమ్. 47
జలేన ఛాగదుగ్ధేన పీతో మండేన వా జయేత్,
సర్వాతిసారాన్ ఘోరాంస్తు నానావర్ణాన్ సవేదనాన్. 48
అసృగ్దరం సమస్తం చ సర్వార్శాంసి ప్రవాహికామ్,

ఇతి శ్రీదామోదరసూను శార్ఙ్గధరేణ విరచితాయాం
సంహితాయాం మధ్యమఖండే చికిత్సాస్థానే
అవలేహకల్పనానామాష్టమోఽధ్యాయః.

నూఱుపలములు కొడిశపాలపట్ట పచ్చిదిగ్రహించి నలియగొట్టి, యందొకద్రోణ ప్రమాణమునీళ్లుబోసి నాలవపాలుమిగులునట్లు కషాయముగాచివడియగట్టి, యందు అత్తపత్తిమాను, ఆరెపూలు, మారేడు, విషబొద్ది, బూరుగుబంక, తుంగముస్తలు, అతివస, వీనినిప్రత్యేక మొక్కొకపలప్రమాణము చూర్ణముచేసివైచి గరిటెకు అంటుకొనునటుల మరలకాచి, నీరు, మేకపాలు, మండము, వీనిలోదేనితోనైన సేవించిన, నీలపీతాదివర్ణములు గలిగి వేదనతోగూడిభయంకరముగనుండెడిఅతీసారములు, స్త్రీలకుగలపలువిధములగు ప్రదరరోగములు, సమస్తమూలవ్యాధులు, ప్రవాహికారోగము నశించును.

ఇది శ్రీదామోదరసూను శార్ఙ్గధరవిరచిత సంహితయందు మధ్యమఖండమున
చికిత్సాస్థానమున నవలేహకల్పన యనియెడు
నష్టమాధ్యాయము సంపూర్ణము.

---

# నవమాధ్యాయము.

స్నేహద్రవ్యకల్పన.

కల్కాచ్చతుర్గుణీకృత్య ఘృతం వా తైలమేవ వా,
చతుర్గుణే ద్రవే సాధ్యం తస్య మాత్రాపలోన్మితా. 1

క్షీనిష్య క్వాథయేత్తోయం క్వాథ్యద్రవ్యాచ్చతుర్గుణం,
పాదశిష్టం గృహీత్వా చ స్నేహం తేనైవ సాధయేత్.
చతుర్గుణం మృదుద్రవ్యే కఠినేఽష్టగుణం జలం,
తథాచ మధ్యమద్రవ్యే దద్యాదష్టగుణం పయః.
అత్యన్తకఠినద్రవ్యే నీరం షోడశకం మతం,
కర్షాదితః పలం యావత్క్షిపేత్షోడశకం జలమ్.
తదూర్ధ్వం కుడవం యావత్క్షిపేదష్టగుణం పయః,
ప్రస్థాదితః క్షిపేన్నీరం ఖారీ యావచ్చతుర్గుణమ్.
అమ్బుక్వాథరసైర్యత్ర పృథక్స్నేహస్య సాధనం,
కల్కస్యాంశం తత్ర దద్యాచ్చతుర్థం షష్ఠమష్టమమ్
దుగ్ధే దధ్ని రసే తక్రే కల్కో దేయోఽష్టమాంశకః,
కల్కస్య సమ్యక్పాకార్థం తోయమత్ర చతుర్గుణమ్.
ద్రవాణి యత్ర స్నేహేషు పఞ్చాదీని భవన్తి హి,
తత్ర స్నేహసమాన్యాహుర్యథాపూర్వం చతుర్గుణమ్
ద్రవేణ కేవలేనైవ స్నేహపాకో భవేద్యది,
తత్రాంబుపిష్టః కల్కస్స్యాజ్జలం చాత్ర చతుర్గుణమ్.
క్వాథేన కేవలేనైవ పాకో యత్రేరితః క్వచిత్,
క్వాథద్రవ్యస్య కల్కోఽపి తత్ర స్నేహే ప్రయుజ్యతే.
కల్కహీనస్తు యస్స్నేహస్తత్ర తోయం చతుర్గుణం,
పుష్పకల్కస్తు యస్స్నేహస్తత్ర తోయం చతుర్గుణమ్.
స్నేహేస్నేహాష్టమాంశశ్చ పుష్పకల్కః ప్రయుజ్యతే,
వర్తివత్స్నేహకల్కస్స్యాద్యదాఽఙ్గుల్యా విమర్దితః.
శబ్దహీనోఽగ్నినిక్షిప్తస్స్నేహసిద్ధో భవేత్తదా,
యదా ఫేనోఽద్గమస్తైలే ఫేనశాన్తిశ్చ సర్పిషి.
గన్ధవర్ణరసోత్పత్తిస్స్నేహసిద్ధిస్తదా భవేత్,
స్నేహపాకస్త్రిధా ప్రోక్తో మృదుర్మధ్యః ఖరస్తథా.
ఈషత్సరసకల్కస్తు స్నేహపాకో మృదుర్భవేత్,
మధ్యపాకస్య సిద్ధశ్చ కల్కే నీరసకోమలే.
ఈషత్కఠినకల్కశ్చ స్నేహపాకో భవేత్ఖరః

తదూర్ధ్వం దగ్ధపాకస్స్యాద్దాహకృన్నిష్ప్రయోజనః. 16
ఆమపాకశ్చ నిర్వీర్యో వహ్నిమాంద్యకరో గురుః,
నస్యార్థే స్యాన్మృదుః పాకో మధ్యమస్సర్వకర్మసు. 17
అభ్యఙ్గార్థే ఖరః ప్రోక్తో యుఞ్జ్యాదేవం యథోచితం,
ఘృతతైలగుడాదీంశ్చ సాధయేన్నైకవాసరే. 18
ప్రకుర్వన్త్యుషితా హ్యేతే విశేషాద్గుణసఞ్చయం,

నెయ్యి, నూనె, మొదలగుస్నేహద్రవ్యములను పక్వముజేయునపుడు కల్కమునకంటె తైలాదులను నాలుగింతలును, పాలు, గోమూత్రము మొదలగు ద్రవద్రవ్యములను తైలాదులకు నాలుగింతలును, గలిపి యందలి ద్రవ్యములును, కల్కమును, ఇగురునట్లును, తైలమమాత్రము మిగులునట్లునుగాచి స్నేహద్రవ్యములను గ్రహింపవలయును. ఈస్నేహద్రవ్యమును వాతాదిరోగంబులయందు సేవించునెడ నొకపలము చొప్పున సేవింపవలయును. కషాయముచే స్నేహద్రవ్యమును సాధించునెడ కషాయద్రవ్యములకు నాలుగింతలుగనీళ్లుపోసి నాలవపాలుమిగునట్లు కషాయముగాచి అందునాలవపాలు నూనె మొదలగునవి జేర్చి కషాయము ఇగిరి తైలమమాత్రము మిగులునట్టులుకాచి స్నేహద్రవ్యమును గ్రహింపవలెను. తీప్పతీఁగె మొదలగు మృదుద్రవ్యములచే కషాయముగాచునెడ కషాయద్రవ్యమునకు నాలుగింతలుగా నీళ్లుచేర్చి కాచవలెను, దశమూలములు మొదలగు మధ్యమద్రవ్యములను కషాయము గాచునెడ, కషాయద్రవ్యమునకు ఎనిమిదింతలుగ నీళ్లుబోసి కషాయమును గాచవలెను. దేవదారు మొదలగు మిక్కిలి కఠిన ద్రవ్యములజేర్చి కషాయము గాచునెడ కషాయద్రవ్యమునకు పదునాఱింతలుగ నీళ్లు బోసి కషాయము కాచవలెను. మృదుద్రవ్యములును కఠినద్రవ్యములును రెంటిని జేర్చి కషాయమునుగాచు నెడ కషాయద్రవ్యమునకన్న ఎనిమిదింతలు నీళ్లుబోసి కషాయముఁ గాచవలెను. కర్షప్రమాణము మొదలు, పలప్రమాణమువఱకు కషాయద్రవ్యమునుజేర్చి కషాయమును గాచునెడ నాద్రవ్యమునకు పదునాఱింతలు నీళ్లు కలుపవలెను. పలము మొదలు కుడువప్రమాణమువఱకు నౌషధద్రవ్యములకు నుదకము ఎనిమిదింతలుగను. ప్రస్థప్రమాణము మొదలు ఖారీప్రమాణము వఱకు ఔషధద్రవ్యములకు నుదకము నాలుగింతలును బోయవలయును. కేవలము ఉదకముతో స్నేహమును సాధింపవలసియుండిన కల్కమును స్నేహమునకు నాలవభాగమును, కషాయమును గలిపి స్నేహమును పక్వము జేయవలయునేని, తైలమునకు ఆఱవపాలుకల్కంబును, గుంటగలగర మొదలగువాని పచ్చియాకుల రసములతో స్నేహమును పక్వముజేయునెడ తైలమునకు ఎనిమిదవపాలు కల్కంబును, పాలు పెరుఁగు, మాంసరసము, మజ్జిగ, వీనిలో నెద్దానిచేనైన స్నేహమును పక్వముజేయుంతటి స్నేహద్రవ్యమునకు ఎనిమిదవ పాలు కల్కంబును కలిపి కల్కము చక్కగ పక్వమగుటకై

తైలమునకు నాలుగింతలు జలమునుబోసి కాచవలయును. స్నేహద్రవ్యమును పక్వము జేయునపుడు, పాలు, పెరుఁగు మొదలగు ద్రవద్రవ్యములను అయిదింటి కన్నన ధికముగ జెప్పియున్నచో ద్రవద్రవ్యములు స్నేహమునకు సమభాగముగ నుండవలెను. అటుగాక అయిదుద్రవ్యములకన్న తక్కువగానున్న యెడ తైలాదులకన్న నాల్గింతలు ద్రవద్రవ్యములగలిపి తైలమును కాచవలెను. కొన్నియోగములయందు కషాయమును మాత్రము జెప్పి కల్కద్రవ్యములను జెప్పకయుండినచో నయ్యెడ కషాయద్రవ్యములనే కల్కము జేసి తైలాదులలోజేర్చి తైలమునకన్న నాల్గింతలు నీళ్లుగలిపి తైలమును పక్వము జేయ నగును. మఱియు పుష్పములను కల్కముగాజేర్చుకొను నెడ తైలమునకు నాల్గింతలు జలమును ఎనిమిదవపాలు పుష్పకల్కమునుగలిపి తైలముకాచవలెను. తైలమును పక్వము జేయు నెడ అందుగలకల్కద్రవ్యమును వ్రేళ్లతో నలిపినచో నయ్యది వ్రేలికంటుకొనక వత్తిపలెనుండి స్నేహద్రవ్యమును నిప్పులోనుండినయెడ చిటచిటయను శబ్దము లేకున్నచో తైలమున్నగు స్నేహద్రవ్యములు పక్వములైనవని తెలియవలెను. మఱియు, తైలము పక్వమగు సమయమున విశేషముగనురుఁగుకట్టి మంచిసువాసనయు, మంచివర్ణంబును రసంబునుకల్గును. ఘృతము పక్వమగునపుడు నురుఁగునిలిచి గంధము, వర్ణము. రసము గల్గును. స్నేహపాకము మృదుపాకమనియు, మధ్యపాకమనియు, ఖరపాకమనియు మూఁడువిధంబులనుండు. ఇందలి కల్కద్రవ్యము కొంచెము ద్రవయుక్తముగ నుండెనేని మృదుపాకమనియు, ద్రవవిహీనమై కోమలముగనుండెనేని మధ్యపాకమనియు, కొంచెము కఠినముగనుండెనేని ఖర (కఠిన) పాకమనియు నెఱుంగవలెను. ఇమ్మూఁడు పాకంబుల కంటె నధికముగ పాకమయ్యెనేని దగ్ధపాకమని ఎఱుంగవలెను. ఇయ్యది నిష్ప్రయోజనముగనుండును, మఱియు, పైజెప్పిన మూఁడుపాకములుగాక, ఆమ (పచ్చి) పాకమయ్యెనేని నదిశక్తిహీనంబై అగ్నిమాంద్యమును, జడత్వమును గలుగంజేయు. నస్యమునకుపయోగించెడితైలము మృదుపాకంబుగను, సర్వకర్మలయందు నుపయోగించెడితైలము మధ్యపాకంబుగను, శరీరలేపనమున కుపయోగించెడి తైలము ఖరపాకంబుగను నుండవలయు. ఘృతతైలాదులను సాధించునెడ వానికి వలయు నౌషధంబులను గ్రహించి యొకరాత్రి నానబెట్టి మఱుదినంబున ఘృతతైలాదులయందు చేర్పందగు. ఇటులంజేసిన గుణమెక్కుడు గలిగియుండును.

### ప్లీహాదులకు క్షీరషట్పలఘృతము.

పిప్పలీపిప్పలీమూలచవ్యచిత్రకనాగరైః. 19
ససైన్ధవైశ్చ పలికైర్ఘృతప్రస్థం విపాచయేత్,
క్షీరం చతుర్గుణం దత్వా తత్సిద్ధం ప్లీహనాశనమ్. 20
విషమజ్వరమన్దాగ్నిహరం రుచికరం పరం,

పిప్పళ్లు, మోడి, చవ్యము, చిత్రమూలము, సొంటి, సైంధవలవణము వీనిని ప్రత్యేక మొకపలముచొప్పున కల్కముజేసి యందొకప్రస్థము ఆవునెయ్యి, దానికి నాలుగింతలు ఆవుపాలు, కల్కము చక్కగ పక్వమగుటకై నేతికినాలుగింతలు నీళ్లుబోసి, పాలు, నీళ్లు ఇగురువఱకు పాకముచేసి యానేతిని వడియగట్టి సేవించిన ప్లీహరోగము, విషమజ్వరము, అగ్నిమాంద్యము నశించును. రుచికలుగును.

### అతిసారసంగ్రహణులకు చాంగేరీఘృతము.

పిప్పలీపిప్పలీమూలం చిత్రకో హస్తిపిప్పలీ. 21
శ్వదష్ట్రానాగరం ధాన్యం పాఠా బిల్వం యవానికా,
ద్రవ్యైశ్చ పలికై రేతై శ్చతుష్షష్టిపలం ఘృతమ్. 22
ఘృతాచ్చతుర్గుణం దద్యాచ్చాంగేరిస్వరసం బుధః,
తథా చతుర్గుణం దత్వా దధిసర్పిర్విపాచయేత్. 23
శనై శ్శనై ర్విపక్వం చ చాంగేరీఘృతముత్తమం,
తద్ఘృతం కఫవాతఘ్నం గ్రహణ్యర్శోవికారనుత్. 24
హన్త్యానాహంగుదభ్రంశం మూత్రకృచ్ఛ్రం ప్రవాహికాం,

పిప్పళ్లు, మోడి, చిత్రమూలము, గజపిప్పళ్లు, పల్లేరు, సొంటి, ధనియములు, విషబొద్ది, మారేడు, ఓమము వీనిని ప్రత్యేక మొకపలముచొప్పున కల్కము గావించి యందు అఱువదినాలుగుపలముల ఆవునెయ్యిబోసి, దానికి నాలుగింతలు పులిచింతాకు రసము, అప్రకారమే పెరుఁగుమీఁది తేటనీళ్లుబోసి యందలి నీరిగిరి ఘృతముమాత్రము మిగులునట్లు మందాగ్నిచే పాకముచేసి వడియగట్టి సేవించిన, కఫము, వాతము, సంగ్రహణి, మూలవ్యాధి, మలబద్ధకము, గుదభ్రంశము, మూత్రకృచ్ఛ్రము, ప్రవాహికా రోగము నశించును. ఇయ్యది చాంగేరీఘృత మనంబడు.

### అతిసారాదులకు మసూరఘృతము.

మసూరాణాం పలశతం నీరద్రోణే విపాచయేత్. 25
పాదశేషం శృతం నీత్వా దత్వా బిల్వపలాష్టకం,
ఘృతప్రస్థం పచేత్తేన సర్వాతీసారనాశనమ్. 26
గ్రహణీభిన్నవిట్కం చ నాశయేచ్చ ప్రవాహికాం,

నూఱుపలముల చిఱుసెనగలు ఒకద్రోణము జలమునందువైచి నాలవపాలు మిగులునట్లు కషాయముగాచి వడగట్టి యందు ఎనిమిదిపలముల మారేడుపిందెలను సన్నముగ నలియఁగొట్టి వైచి, పిదప యందొకప్రస్థము ఆవునెయ్యిబోసి నెయ్యిమాత్రము మిగులు

నట్లు కాచి వడగట్టి సేవించిన సర్వాతిసారములు, సంగ్రహణి, మలమును గట్టిగఁజేసెడి రోగము, ప్రవాహికరోగము నశించును.

### రక్తపిత్తాదులకు కామదేవఘృతము.

అశ్వగన్ధా తులైకాస్యాత్తదర్ధో గోక్షురస్మృతః. 27
బలామృతా శాలిపర్ణీ విదారీ చ శతావరీ,
పునర్నవాఽశ్వత్థశుణ్ఠీ కాశ్మర్యాస్తు ఫలాన్యపి. 28
పద్మబీజం మాషబీజం దద్యాద్దశపలం పృథక్,
చతుర్ద్రోణేఽమ్భసా పక్త్వా పాదశేషం శృతం నయేత్. 29
జీవనీయగణః కుష్ఠం పద్మకం రక్తచన్దనం,
పత్రకం పిప్పలీ ద్రాక్షా కపికచ్ఛుఫలం తథా.. 30
నీలోత్పలం నాగపుష్పం సారిబే ద్వే బలా తథా,
పృథక్కర్షసమాభాగా శర్కరాద్యాః పలద్వయమ్. 31
రసస్తు పౌణ్డ్రకేక్షూణామాఢకైకం సమాహరేత్,
ఘృతస్య చాఢకం దత్త్వా పాచయేన్మృదునాఽగ్నినా. 32
ఘృతమేతన్నిహన్త్యాశు రక్తపిత్తమురఃక్షతం,
హలీమకం పాణ్డురోగం వర్ణభేదం స్వరక్షయమ్. 33
వాతరక్తం మూత్రకృచ్ఛ్రం పార్శ్వశూలం చ కామిలాం,
శుక్రక్షయమురోదాహం కార్శ్యమోజఃక్షయం తథా. 34
స్త్రీణాం చైవాప్రజాతానాం గర్భదం శుక్రదం నృణాం,
కామదేవఘృతం నామ హృద్యం బల్యం రసాయనమ్. 35

పెన్నేరుగడ్డ నూఱుపలములు, పల్లేరు ఏబదిపలములు, ముత్తవపులగము, తిప్పతీఁగ, ముయ్యాకుపొన్న, నేలగుమ్ముడుగడ్డ, పిల్లిపీచరగడ్డలు, గలిజేరు, అశ్వత్థమూలము, సొంటి, పెగ్గుమ్ముడుపండ్లు, తామరవిత్తులు, మినుములు ఇవి ప్రత్యేకము పదిపలములు వీనిని నలియగొట్టి, యందు నాలుగుద్రోణముల ఉదకముబోసి నాలవపాలు మిగులునట్లు కషాయముగాచి వడగట్టి, యందు కాకోలి, క్షీరకాకోలి, జీవకము, ఋషభకము, మేద, మహామేద, తిప్పతీఁగ, యష్టిమధుకము, అడవిపెసలు, అడవిమినుములు, అను నీజీవనీయ గణము, చంగల్వకోష్ఠు, పద్మకములు, రక్తచందనము, లవంగపుపత్రి, పిప్పళ్లు, ద్రాక్ష, దూలగొండివిత్తులు, నల్లకలువ, నాగకేసరములు, నల్లసుగంధిపాల, తెల్లసుగంధిపాల జిబిలిక అను నౌషధద్రవ్యములను, ప్రత్యేక మొక్కొకకర్షప్రమాణము కల్కముచేసి

ై చి, యందు చక్కెర రెండుపలములు, తెల్లచెఱకురసము అఢకప్రమాణము, నెయ్యి
ఢకప్రమాణము బోసి మందాగ్నియందు నెయ్యిమాత్రము మిగులునటుల పాకముచేసి
ానివడియగట్టి సేవించిన రక్తపిత్తము, ఉరఃక్షతము, హాలీమకము, పాండురోగము, శరీర
మునకు వైవర్ణ్యమును గలిగించెడిరోగము, స్వరక్షయము, వాతరక్తము, మూత్ర
ృచ్ఛ్రము, ప్రక్కశూల, కామెర్లు, శుక్రధాతుక్షయము, ఒళ్లుమంటమంట, శరీరము
ృశించుట, ఓజఃక్షయము నశించును. మఱియు నీఘృతమును, వంధ్యాస్త్రీలు సేవించిన
ారికి సంతానంబును, పురుషులు సేవించిన వారికి వీర్యవృద్ధియు, శరీరబలంబును గలుఁగు.
దియే కామదేవఘృతరసాయన మనఁబరఁగు.

అపస్మారాదులకు కల్యాణఘృతము.

త్రిఫలా ద్వేనిశే కా న్తీ సారిబే ద్వే ప్రియఙ్గుకా,
శాలిపర్ణీ పృశ్నిపర్ణీ దేవదార్వేలవాలుకమ్. 36
నతంవిశాలాదన్తీచ దాడిమం నాగకేసరం,
నీలోత్పలైలామఞ్జిష్ఠా విడఙ్గం కుష్ఠపద్మకమ్. 37
జాతీపుష్పం చన్దనం చ తాళిసం బృహతీ తథా,
ఏ తైః కర్షసమైః కల్కైర్జలం దత్వా చతుర్గుణమ్. 38
ఘృతప్రస్థం పచేద్ధీమానపస్మారే జ్వరే క్షయే,
ఉన్మాదే వాతరక్తే చ కాసే మన్దానలే తథా. 39
ప్రతిశ్యాయే కటీశూలే తృతీయకచతుర్థకే,
మూత్రకృచ్ఛ్రే విసర్పే చ కణ్డూపాణ్డ్వామయే తథా. 40
విషద్వయే ప్రమేహేషు సర్వథై వోపయుజ్యతే,
వన్ధ్యానాం పుత్రదం భూతయక్షరక్షోహరం స్మృతమ్. 41

త్రిఫలములు, పసుపు, మ్రానిపసుపు, రేణుకలు, నల్లసుగంధిపాల, తెల్లసుగంధి
పాల, ప్రేంకణము, ముయ్యాకుపొన్న, నక్కతోఁకపొన్న, దేవదారు, కూతురుబుడమ,
గ్రంథితగరము, పెద్దపాపరవ్రేళ్లు, నేపాళపువ్రేళ్లు, దానిమ్మబెరడు, నాగకేసరములు,
నల్లకలువ, ఏలకులు, మంజిష్ఠ, వాయువిళంగములు, చెంగల్వకోష్ఠు, పద్మకములు, జాజి
పూలు, శ్రీగంధము, తాళిసపత్రి, పెద్దములక వీనిని ప్రత్యేకముగ కర్షప్రమాణము
కల్కముజేసి, యందొకప్రస్థము నెయ్యివైచి, దానికి నాలుగింతలు నీళ్లుబోసి నెయ్యి
మిగులునటులకాచి వడియగట్టి సేవించిన, అపస్మారము, జ్వరము, క్షయరోగము, ఉన్మా
దము, వాతరక్తము, కాసము, అగ్నిమాంద్యము, పడిశము, కటిశూల, తృతీయకజ్వరము,

చతుర్థికజ్వరము, మూత్రకృచ్ఛ్రము, విసర్పము, దురద, పాండురోగము, స్థావరవిష
జంగమవిషము, ప్రమేహము, పిశాచములు, యక్షగ్రహములు, రాక్షసగ్రహములు న
చును. వంధ్యాస్త్రీలు దీని సేవించిన సంతానము గలుగును.

### వాతరక్తములకు అమృతాఘృతము.

అమృతాక్వాథకల్కాభ్యాం సక్షీరం విపచేద్ఘృతం,
వాతరక్తం జయత్యాశు కుష్ఠం జయతి దుస్తరమ్.

తిప్పతీగను కొంచెముగ నలియగొట్టి, దానికి నాలుగింతలు ఉదకముబోసి నా
పాలు మిగులునట్లు కషాయముగాచి దానికి నాలవపాలు నెయ్యి, నేతికి నాలవపా
తిప్పతీగ కల్కము, నేతికి నాలుగుభాగము లధికముగ పాలువైచి నెయ్యిమాత్ర
మిగులునటుల పక్వముఁజేసి దాని వడియగట్టి సేవించిన వాతరక్తము, దుస్తరమగుకుష్ఠ
శీఘ్రముగ నశించును.

### వాతరక్తాదులకు మహాతిక్తకఘృతము.

సప్తచ్ఛదః ప్రతివిషా శమ్యాకః కటురోహిణీ,
పాఠాముస్తముశీరం చ త్రిఫలాపర్పటస్తథా.
పటోలనిమ్బమఞ్జిష్ఠా పిప్పలీ పద్మకం సఠీ,
చన్దనం ధన్వయాసశ్చ విశాలేద్వే నిశే తథా.
గుడూచీ సారిబేద్వేచ మూర్వావాసా శతావరీ,
త్రాయన్తీన్ద్రయవా యష్టిభూనిమ్బాశ్చైతుభాగికాః.
ఘృతం చతుర్గుణం దద్యాద్ఘృతాదామలకీరసః,
ద్విగుణస్సర్పిషశ్చాత్ర జలమష్టగుణం భవేత్.
తత్సిద్ధం పాయయేత్సర్పిర్వాతరక్తేషు సర్వదా,
కుష్ఠాని రక్తపిత్తం చ రక్తార్శాంసి చ పాణ్డుతామ్.
హృద్రోగం గుల్మం విసర్పం ప్రదరం గణ్డమాలికాం,
క్షుద్రరోగాన్ జ్వరాంశ్చైవ మహాతిక్తమిదం జయేత్.

ఏడాకులపొన్న, అతివస, రేలగుజ్జు, కటుకరోహిణి, విషబొద్ది, తుంగము
వట్టివేళ్లు, త్రిఫలములు, పర్పాటకము, చేదుపొట్ల, వేము, మంజిష్ఠ, పిప్పళ్లు, పద్మకప
కచోరములు, శ్రీగంధము, దురదగొండి, పెద్దపాపర, పసుపు, మ్రానిపసుపు, తిప్ప
నల్లసుగంధిపాల, తెల్లసుగంధిపాల, చాగమట్ట, అడ్డసరపాకు, పిల్లిపీచరగడ్డలు,
త్రాయుగ, కొడిశపాలవిత్తులు, అతిమధురము, నేలవేము వీనిని సమభాగములుగ కర్ష

ణము చొప్పున గ్రహించి కల్కముచేసి దీనికి నాలుగింతలు నెయ్యి, నేతికి రెండింతలు ఉసిరికాయలరసము, నేతికంటె నెనిమిదిభాగము లధికముగ నీళ్లుబోసి నెయ్యిమిగులునట్లు కాచి వడగట్టి సేవించిన వాతరక్తము, కుష్ఠరోగము, రక్తపిత్తము, రక్తార్శస్సు, పాండు రోగము, హృద్రోగము, గుల్మము, విసర్పి, స్త్రీలప్రదరరోగము, గండమాల, క్షుద్రరోగ ములు, జ్వరము నశించును. ఇదియే మహాతిక్తకఘృత మనంబడు.

### కుష్ఠాదులకు సూర్యపాకకాసీసాద్యఘృతము.

కాసీసం ద్వే నిశే ముస్తం హరితాలం మనశ్శిలాం,
కంపిల్లకం గన్ధకం చ విడఙ్గం గుగ్గులుం తథా. 49
సిక్థకం మరిచం కుష్ఠం తుత్థకం గౌరసర్షపాన్,
రసాఞ్జనం చ సిన్దూరం శ్రీవాసం రక్తచన్దనమ్. 50
ఇరిమేదం నిమ్బపత్రం కరఞ్జం సారిబాం వచాం,
మఞ్జిష్ఠాం మధుకం మాంసీం శిరీషం లోధ్రపద్మకమ్. 51
హరీతకీం ప్రపున్నాటం చూర్ణయేత్కార్షికాన్ పృథక్,
తతస్తచ్చూర్ణమాలోడ్య త్రింశత్పలమితే ఘృతే. 52
స్థాపయేత్తామ్రపాత్రే చ ఘర్మే సప్తదినాని చ,
అస్యాభ్యఙ్గేన కుష్ఠాని దద్రుపామావిచర్చికాః. 53
శూకదోషా విసర్పాశ్చ విస్ఫోటా వాతరక్తజాః,
శిరస్ఫోటోపదంశాశ్చ నాడీదుష్టవ్రణాని చ. 54
శోఫో భగన్దరశ్చైవ లూతాశ్శామ్యన్తి దేహినాం,
శోధనం రోపణం చైవ సవర్ణకరణం ఘృతమ్. 55

పుష్పకాసీసము, వాలుకాసీసము, పసుపు, మ్రానిపసుపు, తుంగముస్తలు, హరి తాళకము, మణిశిల, కంపిల్లకము, గంధకము, వాయువిళంగములు, గుగ్గిలము, మైనము, మిరియములు, చెంగల్వకోష్ఠు, మైలతుత్తము, తెల్లఆవాలు, రసాంజనము, సిందూరము, శ్రీవాసము, రక్తచందనము, కంపుతుమ్మపట్ట, వేపాకు, కానుగవిత్తులు, సుగంధిపాల, వస, మంజిష్ఠ, అతిమధురము, జటామాంసి, దిరిసెనపుపట్ట, లొద్దుగుచెక్క, పద్మకములు, కరక కాయలు, తగిరిసవిత్తులు వీనిని ప్రత్యేక మొకకర్షప్రమాణముగ చూర్ణముచేసి, దీనిని ముప్పదిపలముల నెయ్యిగల రాగిపాత్రయందువైచి ఏడుదినములు ఎండలోనునిచి యా నేతిని శరీరమునకు లేపనముజేసికొనిన సర్వకుష్ఠములు, దద్దురులు, గజ్జి, విచర్చిక, శూక దోషములు, విసర్పములు, వాతరక్తముచే జనించెడి విస్ఫోటములు, తలకుఱుపులు, ఉప దంశరోగములు, నాడీవ్రణములు, వాపు, భగందరము, లూతరోగము నశించును. వ్రణ

నేత్రములదురద, నేత్రరోగభేదంబగు పిల్లరోగము, నేత్రములనీరుకాఱునట్టిరోగము, కంటిపొరలు, కంటి తిమిరములు, నేత్రంబున ముత్యములవలె జనించెడి చుక్కలు, నేత్రరోగభేదంబగు అజకరోగము, మిక్కిలి భయంకరమగు నితరనేత్రరోగములన్నియు నశించును. మఱియు నీఘృతమును పానమునందును, నస్యాదులయందునుకూడ నుపయోగింపనగు. ఇదియే త్రిఫలాదిఘృతమనంబడును.

### వ్రణాదులకు గౌర్యాద్యఘృతము.

ద్వే హరిద్రే స్థిరా మూర్వా సారిబా చన్దనద్వయమ్,
మధుపర్ణీ చ మధుకం పద్మకేసరపద్మకైః. 70
ఉత్పలోశీర మేధాభిస్త్రిఫలాపఞ్చవల్కలైః,
కల్కైః కర్షమితైరేతైర్ఘృతప్రస్థం విపాచయేత్. 71
విసర్పలూతా విస్ఫోటవిషకుష్ఠవ్రణాపహం,
గౌర్యాద్యమితి విఖ్యాతం సర్పిర్విషహరం పరమ్. 72

పసుపు, మ్రానిపసుపు, ముయ్యాకుపొన్న, చాగమట్ట, సుగంధిపాల, శ్రీగంధము, రక్తచందనము, అడవిమినుములు, అతిమధురము, పద్మకేసరములు, కలువ, వట్టివేళ్లు, మేద, త్రిఫలములు, మఱ్ఱిపట్ట, అత్తిపట్ట, రావిపట్ట, జువ్విపట్ట, మామిడిపట్ట వీనిని ప్రత్యేకముగ కర్షప్రమాణము కల్కముచేసి యందొక ప్రస్థము నెయ్యి కలిపి దానికి నాలుగింతలు నీళ్లుబోసి, ఘృతపక్వముగ గాచి వడియగట్టి సేవించిన విసర్పము, వాతము, విస్ఫోటకము, విషదోషము, కుష్ఠము, వ్రణములు నశించును. ఇదియే గౌర్యాద్యఘృతమనంబడు. దీనిచే సర్పి, విషదోషము, ముఖ్యముగ నశించును,

### శిరోరోగాదులకు మయూరఘృతము.

బలామధుకరాస్నాభిర్దశమూలఫలత్రికైః,
పృథగ్ద్విపలకైరేభిర్ద్రోణినీరేణ పాచయేత్. 73
మయూరం పక్షపిత్తాంత్రయకృత్పాదాస్యవర్జితం,
పాదశేషం శృతం నీత్వా క్షీరం దత్వా చ తత్సమమ్. 74
ఘృతప్రస్థం పచేత్సమ్యగ్జీవనీయైః పిచూన్మితైః,
తత్సిద్ధం శిరసః పీడాం మన్యాగ్రీవాగ్రహాం తథా. 75
అర్దితం కర్ణనాసాక్షిజిహ్వాగళశిరుజో జయేత్,
పానే నస్యే తథాఽభ్యఙ్గే కర్ణపూరేషు యుజ్యతే. 76
హేమన్తకాలే శిశిరే వసన్తేషు చ శస్యతే,

చిట్టాముట్టి, ఇప్పపట్ట, సన్నరాస్నము, దశమూలములు, త్రిఫలములు వీనిని ప్రత్యేకము రెండుపలముల చొప్పున నలియగొట్టి యందొక ద్రోణ ముదకముబోసి పిదప మేక లిని జంపి దానిచెక్కలు, బొమ్మ లోపలనుండు పిత్తము, ప్రేగులు, మలము, కాళ్లు, నోరు వీనిని వర్జించి దానిమాంసమును మాత్రముజేకొని పై టియందువైచి నాలవపాలు మిగులునటుల కషాయముగాచి వడియగట్టి దానికి సమముగ ఆవుపాలు, ఒకప్రస్థము నెయ్యిబోసి, యందు కర్షప్రమాణములుగ జీవనీయగణద్రవ్యములను కల్కముజేసి వైచి ఘృతపక్వముగకాచి వడియగట్టి, పానము, నస్యము, అభ్యంగము, కర్ణములయందుంచుట యను నీకర్మలయం దుచితమగునట్లు సేవించిన తలనొప్పి, పెడతలనరము, కంఠము వీని యందుగల వేదన అర్దితవాతము, చెవిపోటు, నాసిక, నేత్రములు, నాలుక, దవడలు వీని యందలిపీడ నశించును. దీనిని సేవించునెడ హేమంత, శిశిర, వసంతఋతువులయందు సేవింపందగు.

## వంధ్యాదులకు ఫలఘృతము.

త్రిఫలామధుకం కుష్ఠం ద్వే నిశే కటురోహిణీ. 77
విడఙ్గం పిప్పలీముస్తం విశాలా కట్ఫలం వచా,
ద్వే మేదే ద్వే చ కాకోల్యౌ సారిబే ద్వే ప్రియఙ్గుకా. 78
శతపుష్పా హింగురాస్నా చన్దనం రక్తచన్దనం,
జాతీపుష్పం తుగాక్షీరీ కమలం శర్కరా తథా. 79
అజమోదాచ దంతీచ కల్కై రేతైశ్చ కార్షికైః,
జీవద్వత్సైకవర్ణాయా ఘృతప్రస్థం చ గోః క్షిపేత్. 80
చతుర్గుణేన పయసా పచేదారణ్యగోమయైః,
సుతిథౌ పుష్యనక్షత్రే మృద్భాణ్డే తామ్రజే తథా. 81
తతః పిబేచ్ఛుభదినే నారీ వా పురుషోఽథవా,
ఏతత్సర్పిర్నరః పీత్వా స్త్రీషు నిత్యం వృషాయతే. 82
పుత్రానుత్పాదయేద్ధీమాన్ వన్ధ్యాపి లభతే సుతం,
అనాయుషం యా జనయేద్యాచసూతాపురః స్థితా. 83
పుత్రం ప్రాప్నోతి సా నారీ బుద్ధిమన్తం శతాయుషం,
ఏతత్ఫలఘృతం నామ భారద్వాజేన భాషితమ్. 84
అనుక్తం లక్ష్మణామూలం క్షిపేత్తత్ర చికిత్సకః,

త్రిఫలములు, యష్టిమధుకము, చెంగల్వకోష్టు, పసుపు, మ్రానిపసుపు, కటుకరోహిణి, వాయువిళంగములు, పిప్పళ్లు, తుంగముస్తలు, పెద్దపాపరపేళ్లు, కాయఫలము,

వస, మేద, మహామేద, కాకోలి, క్షీరకాకోలి, నల్లసుగంధిపాల, తెల్లసుగంధిపాల, ప్రేంకణము, పెద్దసదాప, వేయించినఇంగువ, సన్నరాస్నము, చందనము, రక్తచందనము, జాజిపూలు, తవాక్షీరి, కమలము, చక్కెర, అజామోదము, నేపాళపువ్రేళ్లు వీనిని ప్రత్యేకము కర్ష ప్రమాణము గ్రహించి కల్కముజేసి, శరీరంబంతయు నేకవర్ణమును జీవించినదూడయుంగల ఆవునెయ్యి ఒకప్రస్థము, నేతికి నాలుగింతలు ఆవుపాలు, పై కల్కముచేర్చి యొక మంటిపాత్రలోనైనను, రాగిపాత్రలోనైనను బోసి పుష్యనక్షత్రముతోకూడిన సుదినంబున అడవియేరుపిడకల నిప్పుచే ఘృతపక్వముగ పాకముజేసి, వడియగట్టి, సుదినంబున పురుషులు సేవించిన వీర్యవృద్ధిగలిగి సంతానము గలుగును. వంధ్యలగు స్త్రీలుసేవించిన సంతానము గలుగును. మఱియు నేస్త్రీలు సంతానము జనించినతోడనే సంతానము మృతిబొందుచుండునో వారుసేవించిన దీర్ఘాయుష్యము గలిగినట్టియు, బుద్ధిమంతుఁడగునట్టి సంతానము గలుగును. ఇది భారద్వాజమునిచే చెప్పంబడిన ఫలఘృతం బనఁబరఁగు. ఇందు గర్భధారణము గలుగజేసెడి లక్ష్మణమూలము (తెల్లకాయలఁగలమునగవేరు) చెప్పంబడక యుండుటచే దానిని చేర్చుకొనందగు.

## విషజ్వరములకు పంచతిక్తకఘృతము.

వృషనిమ్బామృతవ్యాఘ్రీ పటోలానాం కృతేనచ. 85
కల్కేన పక్వం సర్పిస్తు నిహన్యాద్విషమజ్వరాన్,
పాణ్డుకుష్ఠం విసర్పంచ క్రిమీనర్శాంసి నాశయేత్. 86

అడ్డసరము, వేపపట్ట, తిప్పతీఁగ, వాకుడు, చేదుపొట్ల వీనిని కల్కముచేసి దీనికి నాలుగింతలు నెయ్యి, కల్కము చక్కగపాకమగుటకై నేతికి నాలుగింతలు నీళ్లుబోసి ఘృతపక్వముగకాచి, వడియగట్టి సేవించిన విషమజ్వరములు, పాండురోగము, కుష్ఠము, విసర్పి, కృమిరోగము, మూలవ్యాధులు నశించును.

## యోనిరోగములకు లఘుఫలఘృతము.

సహచరే ద్వే త్రిఫలాం గుడూచీం సపునర్నవాం,
శుకనాసాం హరిద్రే ద్వే రాస్నాం మేదాం శతావరీమ్. 87
కల్కీకృత్య ఘృతప్రస్థం పచేత్క్షీరే చతుర్గుణే,
తత్సిద్ధం పాయయేన్నారీం యోనిశూలనిపీడితామ్. 88
పీడితా చలితాయాచ నిస్సృతా వివృతాచ యా,
పిత్తయోనిశ్చ విభ్రాన్తా షణ్డయోనిశ్చ యా స్మృతా. 89
ప్రపద్యన్తే హి తాః స్థానం గర్భం గృహ్ణాతి చాసకృత్,
ఏతత్ఫలఘృతం నామ యోనిదోషహరం పరమ్. 90

పచ్చపూలుగలములుగోరింట, నల్లపూలుగలములుగోరింట, త్రిఫలములు, తిప్పతీఁగ, గలిజేరు, దుందిలపువ్రేళ్లు, పసుపు, మ్రానిపసుపు, సన్నరాస్నము, మేద (అతిమధురము), పిల్లిపీచరగడ్డలు వీనిని కల్కముజేసి యందొకప్రస్థము నెయ్యి నేతికినాలుగింతలు ఆవుపాలు, నేతికినాలుగింతలు నీళ్లుబోసి, ఘృతపక్వముగ కాచి వడియగట్టి, యోనిశూలగలస్త్రీలును, మైథునాదులచే పీడితమగుయోని గలస్త్రీలును, యోనిచలించి కమలముచెడి బైలువెడలి వివృతమగుస్త్రీలును, పిత్తయోని, విభ్రాంతయోని, షండయోని గలస్త్రీలును, గర్భధారణముగాక యుండెడిస్త్రీలును సేవించిన యోనిరోగములన్నియు నశించి యోని స్వస్థానంబునచేరి యతిశీఘ్రంబుగ గర్భధారణమును గలుగంజేయును. ఇదియే లఘు ఫలఘృత మనంబరఁగు. ఇది యోనిదోషంబులన్నిటిని నశింపజేయుటయం దతిశ్రేష్ఠంబుగ నున్నయది.

---

# తైలకల్పన.

## సర్వజ్వరములకు అంగారకతైలము.

మూర్వాలాక్షాహరిద్రే ద్వే మంజిష్ఠా సేంద్రవారుణీ,
బృహతీ సైంధవం కుష్ఠం రాస్నా మాంసీశతావరీ. 91
ఆరనాళాఽఽఢకే తత్ర తైలప్రస్థం విపాచయేత్,

ఆఢకప్రమాణముగల గంజిలో ఒకప్రస్థము నువ్వుల నూనెబోసి యందు సాగనార, లాక్ష, పసుపు, మ్రానిపసుపు, మంజిష్ఠ, చేదుపుచ్చ, పెద్దములక, సైంధవలవణము, చెంగల్వకోష్టు, సన్నరాస్నము, జటామాంసి, పిల్లపీచర వీనినన్నిటిని తైలములో నాలవపాలు కల్కముగాఁజేసి తైలము మిగులునట్లు స్నేహపాకంబున పచనము గావించి సేవించిన సర్వజ్వరములు హరించును.

## సమస్తవిషమజ్వరాదులకు లాక్షాతైలము.

లాక్షాఢకం క్వాథయిత్వా జలస్య చతురాఢకైః. 92
చతుర్థాంశం శృతం నీత్వా తైలప్రస్థం వినిక్షిపేత్,
మస్త్వాఢకం చ గోదధ్న స్తత్రైవ వినియోజయేత్. 93
శతపుష్పామశ్వగంధాం హరిద్రాం దేవదారు చ,
కటుకీం రేణుకాం మూర్వాం కుష్ఠం చ మధుయష్టికామ్. 94
చన్దనం ముస్తకం రాస్నాం పృథక్కర్షప్రమాణతః,
చూర్ణయేత్తత్ర నిక్షిప్య సాధయేన్మృదువహ్నినా. 95
అస్యాభ్యఙ్గాత్ప్రశామ్యన్తి సర్వేఽపి విషమజ్వరాః,

కాసశ్వాసప్రతిశ్యాయత్రికపృష్ఠగ్రహాస్తథా.
వాతం పిత్తమపస్మారమున్మాదం యక్షరాక్షసాన్,
కణ్డూం దౌర్గన్ధ్యశూలం చ గాత్రాణాం స్ఫురణం జయేత్.
పుష్టగర్భా భవేదస్య గర్భిణ్యభ్యఙ్గతో భృశం,

లక్కను ఒకఆఢకము గ్రహించి దానియందు నాలుగు ఆఢకముల నీరుబోసి నా
పాలు మిగులునట్లు కషాయముగాచి వడియగట్టి, యందు నువ్వులనూనె ఒక ప్రస్థ
పెరుంగుమీఁదితేట ఒకప్రస్థము, పెద్దసదాప, పెన్నేరుగడ్డ, పసుపు, దేవదారు, క
రోహిణి, రేణుకలు, చాగమట్ట, చెంగల్వకోష్టు, అతిమధురము, చందనము, తుంగముస్త
సన్నరాస్నము వీనికల్కమును ప్రత్యేకము కర్షప్రమాణముగను వైచి, మందాగ్నిచే
పక్వముగ గాచి అభ్యంగముచేసికొనిన విషమజ్వరములు, కాసము, శ్వాసము, పడిసె
ముడ్డిపూస, వీపు, వీనినాశ్రయించినశూల, వాతము, పిత్తము, అపస్మారము, ఉన్మాద
యక్షరాక్షసాదిగ్రహపీడ, దురద, శరీరమందలిదుర్గంధము, శూల, ఒడలుపగులుట న
చును. మఱియు దీనిని గర్భిణీస్త్రీలు అభ్యంగముచేసికొనిన గర్భమునందలి శిశువు
వృద్ధి గలుగును.

## వాతరోగములకు నారాయణతైలము.

అశ్వగంధా బలాబిల్వం పాటలా బృహతీద్వయమ్.
శ్వదంష్ట్రాఽతిబలానింబస్యోనాకం చ పునర్నవా,
ప్రసారిణీమగ్నిమన్థం కుర్యాద్దశపలం పృథక్
చతుర్ద్రోణే జలే పక్త్వా పాద శేషం శృతం నయేత్,
తైలాఢకేన సంయోజ్య శతావర్యా రసాఢకమ్. 1
క్షిపేత్తత్ర చ గోక్షీరం తైలాత్తస్మాచ్చతుర్గుణం.
శనైర్విపాచయేదేభిః కల్కైర్ద్విపలికైః పృథక్. 1
కుష్ఠైలాచందనం మూర్వా వచామాంసీససైంధవైః,
అశ్వగంధాబలారాస్నా శతపుష్పేంద్రదారుభిః. 1
వర్ణిచతుష్టయేనైవ తగరేణైవ సాధయేత్,
తత్తైలం నావనేభ్యఙ్గే పానే వస్తౌ చ యోజయేత్. 1
పక్షాఘాతం హనుస్తమ్భం మన్యాస్తమ్భం గళగ్రహం,
ఖల్లిత్వం బధిరత్వం చ గతిభఙ్గం కటిగ్రహమ్. 1
గాత్రశోషేన్ద్రియధ్వంసౌ వసృక్ఛుక్రే జ్వరక్షయే,
అంత్రవృద్ధిం కురణ్డం చ దంతరోగం శిరోగ్రహమ్. 1

పార్శ్వశూలం చ పాఙ్గుల్యం బుద్ధిహానిం చ గృధ్రసీం,
అన్యాంశ్చ విషమాన్వాతాన్ జయేత్సర్వాఙ్గసంశ్రయాన్. 106
అస్య ప్రభావాద్వన్ధ్యాపి నారీ పుత్రం ప్రసూయతే,
మర్త్యో గజో వా తురగ స్తైలాభ్యఙ్గాత్సుఖీ భవేత్. 107
యథా నారాయణో దేవో దుష్టదైత్యవినాశనః,
తథైవ వాతరోగాణాం నాశనం తైలముత్తమమ్. 108

పెన్నేరుగడ్డ, చిట్టాముట్టి, మారేడువేళ్లు, పాదిరివేళ్లు, వాకుడు, పెద్దములక, పల్లేరు, అతిబల, వేప, దుందిలపువేళ్లు, గలిజేరు, గొంతెమగోరు, కూరనెల్లివేళ్లు, వీనిని ప్రత్యేకము పదిపలములవంతున గ్రహించి నలియగొట్టి యందు నాలుగుద్రోణముల నీరు బోసి నాలవపాలుమిగులునట్లు కషాయముగాచి వడియగట్టి యందునువ్వులనూనె ఒకఆఢకము, పిల్లపీచరగడ్డలరసము ఒకఆఢకము, ఆవుపాలు నాలుగు ఆఢకములు, చెంగల్వకోష్టు, ఏలకులు, చందనము, చాగమట్ట, వస, జటామాంసి, సైంధవలవణము, పెన్నేరుగడ్డ, చిట్టాముట్టి, సన్నరాష్ట్రము, పెద్దసదాప, దేవదారు, ముయ్యాకుపొన్న, కోలపొన్న, అడవిమినుము, అడవిపెసర, గ్రంథితగరము, వీనికల్కమును ప్రత్యేకము రెండుపలములు వైచి మందాగ్నిచే తైలపక్వముగకాచి వడియగట్టి, నస్యమునకును, శరీరలేపనమునకును, పానమునకును, వస్తియందును ఉపయోగించిన పక్షఘాతము, హనుస్తంభము, మన్యాస్తంభము, గళగ్రహము, ఖల్లివాతము, బధిరత్వము, గతిభంగవాతము, కటిగ్రహవాతము, హస్తపాదములను శోషింపజేసెడివాతము, నేత్రాదీన్ద్రియములను నశింపచేసెడివాతము, రక్తవికారము, శుక్రధాతుక్షయము, జ్వరము, క్షయరోగము, అండవృద్ధి, కురండములు, దంతరోగము, శిరోగ్రహవాతము, పార్శ్వశూలలు, పంగుత్వము, బుద్ధిభ్రంశము, గృధ్రసీవాతము, సర్వాంగములయందైనను, అర్ధాంగములయందైనను, గలసమస్తవిషమవాతములు నశించును. దీనిని సేవించెడి వంధ్యాస్త్రీలకు నీతైలప్రభావముచే సంతానము కలుగును. పురుషులు, ఏనుఁగులు గుఱ్ఱములు మొదలగు శరీరములకు లేపనముజేసిన సుఖంబును గల్గును. శ్రీమన్నారాయణుండు దానవుల హతంబొనర్చు భంగి నిది సర్వవాతములను నశింపజేయును. ఇదియే నారాయణతైల మనంబడును.

వాతరోగములకు వారుణ్యాదితైలము.

వారుణ్యా ఔత్తరం మూలం కుట్టితం తు పలత్రయం,
పలద్వాదశకం తైలం క్షణం ఏహస్నా విపాచితమ్. 109
నిష్కత్రయం భక్త్యయుక్తం సేవేతాస్మాద్వినశ్యతి,
హస్తకంపశ్శిరఃకంపః కంపో మన్యాసిరాభవః. 110

ఉత్తరపుదిక్కుగాపాఱిన చేలిపుచ్చవేరు తెచ్చి మూఁడుపలములు నలియగొట్టి యందు పదిరెండుపలములు నీరుబోసి పిమ్మట పదిరెండుపలములు నువ్వులనూనెబోసి నూనెమిగులునట్లు మందాగ్నియందు పచనముగావించి యాతైలమును మూఁడునిష్కముల ప్రమాణముగా అన్నముతో సేవించిన చేయివణఁకు, తలవణఁకు, మన్యాస్తంభమునశించును.

## సర్వవాతాదులకు బలాదితైలము.

బలామూలకషాయేణ దశమూలశృతేన చ,
కుళుత్థయవకోలానాం క్వాథేన పయసా తథా. 111
అష్టాష్టభాగయుక్తేన భాగమేకంచ తైలకం,
గణేన జీవనీయేన శతావర్యేన్ద్రిదారుణా. 112
మఞ్జిష్ఠాకుష్ఠశైలేయతగరాగరుసైన్ధవైః,
వచాపునర్నవామాంసీ సారిబాద్వయపత్రకైః. 113
శతపుష్పాశ్వగంధాభ్యామేలయా చ విపాచయేత్,
గర్భార్థినీనాం నారీణాం పుంసాంచ క్షీణరేతసామ్. 114
వ్యాయామక్షీణగాత్రాణాం సూతికానాం చ యుజ్యతే,
రాజయోగ్యమిదం తైలం సుఖినాంచ విశేషతః. 115
బలాతైలమితి ఖ్యాతం సర్వవాతభయాపహం,

ఎనిమిదిప్రస్థముల చిట్టాముట్టి వ్రేళ్లనుదంచి యందు ముప్పదిరెండు ప్రస్థముల యుదకముబోసి నాలవభాగముమిగులునట్లు కషాయముగాచి వడగట్టి, మఱియు, ఎనిమిది ప్రస్థముల దశమూలములను దంచి యందు ముప్పదిరెండు ప్రస్థములయుదకముబోసి నాలవపాలు మిగులునట్లు కషాయముగాచి వడియగట్టి, మఱియు, ఇదేప్రకారము ఉలవలు, యవలు, రేగుపండ్లు, ఈమూఁటిని ప్రత్యేకము ఎనిమిదెనిమిది ప్రస్థములువంతున గ్రహించి ప్రతిదానియందునుముప్పదిరెండు ప్రస్థములయుదకముబోసి నాలవపాలు మిగులునట్లు కషాయముగాచి వడగట్టివేర్వేఱుగనుంచి, పిదప నీయైదు కషాయములను ఏకముచేసి యందు ఎనిమిదిప్రస్థముల ఆవుపాలు, ఒక ప్రస్థము నువ్వులనూనె, జీవనీయ గణ ఔషధద్రవ్యములు, పిల్లిపీచరగడ్డలు, దేవదారు, మంజిష్ట, చెంగల్వకోష్టు, రాతిపువ్వు, గ్రంథితగరము, అగరు, సైంధవలవణము, వస, గలిజేరు, జటామాంసి, నల్లసుగంధిపాల, తెల్లసుగంధిపాల, లవంగపుపత్రి, పెద్దసదాప, పెన్నేరుగడ్డ, ఏలకులు, వీనిని నూనెకు నాలవభాగముగ గ్రహించి కల్కముజేసి యందు వైచి తైలపక్వముగకాచి వడియగట్టి దీని గర్భము ధరింపవలెనను ఇచ్ఛగలస్త్రీలు అభ్యంజనముచేసికొనినవారికి గర్భధారణంబును, శుక్రధాతుక్షయముగల పురుషులు అభ్యంజనము చేసికొనినవారికి శుక్రధాతువృద్ధియు, వ్యాయామాదులచే శరీరము కృశించినవారు అభ్యంజనము చేసికొనిన

వారికి శరీరపుష్టియు, బాలింతలగుస్త్రీలు అభ్యంజనము చేసికొనిన వారికి బాలింతదోష నివృత్తియు గలుగు. మఱియు, నిది విశేషముగ రాజులకును, సుఖవంతులకును యోగ్యం బుగనుండు. ఈ బలా తైలము సమస్తవాతవ్యాధులను నశింపఁజేయును.

వాతకఫజన్యవికారములకు ప్రసారిణీతైలము.

ప్రసారిణీపలశతం జలద్రోణే చ పాచయేత్. 116
పాదశిష్టశ్శృతో గ్రాహ్యస్తైలం దధి చ తత్సమం,
కాఞ్జికం చ సమం తైలాత్క్షీరం తైలాచ్చతుర్గుణమ్. 117
తైలాత్తథాఽష్టమాంశేన సర్వకల్కాని యోజయేత్,
మధుకం పిప్పలీమూలం చిత్రకస్సైన్ధవం వచా. 118
ప్రసారిణీదేవదారు రాస్నా చ గజపిప్పలీ,
భల్లాతశ్శతపుష్పా చ మాంసీచైభిర్విపాచయేత్. 119
ఏతత్తైలం వరం పక్వం వాతశ్లేష్మామయాన్ జయేత్,
కౌబ్జత్వం ఖఞ్జపఙ్గుత్వం గృధ్రసీమర్దితం తథా, 120
హనుపృష్ఠశిరోగ్రీవా కటిస్తమ్భం చ నాశయేత్,
అన్యాంశ్చ విషమాన్వాతాన్ సర్వానాశు వ్యపోహతి. 121

నూఱుపలముల గొంతెమగోరుదీఁగెలనుదంచి యందొక ద్రోణప్రమాణ ముదకము బోసి నాలవపాలు మిగులునట్లు కషాయముగాచి వడియగట్టి దానికి నూనె, పెరుగు, కాంజికములను వైచి పిదప నూనెకు నాలుగుభాగము లధికములుగ పాలుబోసి, అందు అతిమధురము, మోడి, చిత్రమూలము, సైంధవలవణము, వస, గొంతెమగోరు, దేవదారు, సన్నరాస్నము, గజపిప్పళ్లు, శుద్ధిజేసినజీడిగింజలు, పెద్దసదాప, జటామాంసి, వీనికల్క మును నూనెకు ఎనిమిదవపాలుగవైచి తైలపక్వముగ కాచి వడియగట్టి శరీరమునకు లేప నముజేసికొనిన వాతశ్లేష్మజన్యరోగములు, కుబ్జవాతము, ఖంజవాతము, పంగుత్వము, గృధ్రసీవాతము, అర్దితవాతము, చెక్కిళ్లు, వీపు, శిరస్సు, మెడ, కటిప్రదేశము వీనిని బిగ తీయునట్టివాతము, ఇతరములగు సమస్త విషమవాతములు నశించును.

సర్వవాతములకు మాషాదితైలము.

మాషాయవాతసీతుద్రా మర్కటీ చ కురండకః,
గోకంటటుణ్డుకశ్చైషాం కుర్యాత్సప్తపలం పృథక్. 122
చతుర్గుణామ్బునాపక్త్వా పాదశేషం శృతం నయేత్,

కార్పాసాస్థీని బదరం శాణబీజం కులిత్థకమ్. 1
పృథక్చతుర్దశపలం చతుర్గుణజలే పచేత్,
చతుర్థాంశావశిష్టం చ గృహ్ణీయాత్క్వాథముత్తమమ్. 1
ప్రస్థైకం ఛాగమాంసస్య చతుష్షష్టిపలే జలే,
నిక్షిప్య పాచయేద్ధీమాన్ పాదశేషం రసం నయేత్. 1
తైలప్రస్థే తతః క్వాథాన్సర్వానేతాన్వినిక్షిపేత్,
కల్కైరేభిశ్చ విపచేదమృతాకుష్ఠనాగరైః. 1
రాస్నాపునర్నవైరండైః పిప్పల్యా శతపుష్పయా,
బలాప్రసారిణీభ్యాం చ మాంసీకటుకయా తథా. 1
పృథగర్ధపలైరేతైస్సాధయేన్మృదువహ్నినా,
హన్యాత్తైలమిదం శీఘ్రం గ్రీవాస్తమ్భాపబాహుకౌ. 1
అర్ధాఙ్గశోషమాక్షేపమూరుస్తమ్భాపతానకౌ,
శాఖాకమ్పం శిరఃకమ్పం విశ్వాచీమర్దితం తథా. 1
మాషాదికమిదం తైలం సర్వవాతవికారనుత్,

మినుములు, యవలు, అగిసివిత్తులు, వాకుడు, దూలగొండివిత్తులు, గోరింట, పల్లె దుండిలపువ్రేళ్లు, వీనిని ప్రత్యేకముగ ఏడుపలములచొప్పున గ్రహించి దానికి నాల తలు నీరుబోసి నాలవపాలుమిగులునట్లు కషాయముకాచి వడగట్టియుంచి, మఱిం ప్రత్తివిత్తులు, రేగుపండ్లు, జనపవిత్తులు, ఉలవలు వీనిని ప్రత్యేకము పదునాల్గుపలః చొప్పున గ్రహించి దానికి నాలుగింతలు నీరుబోసి నాలవపాలుమిగులునట్లు కషాయ గాచి వడియగట్టి యుంచి, మఱియు మొగమేకమాంసము ఒకప్రస్థముగ్రహి యందు అఱువదినాల్గుపలముల యుదకముబోసి నాలవపాలుమిగులునట్లు కషాయ గాచి వడగట్టియుంచి యందొకప్రస్థము నువ్వులనూనెను పైజెప్పిన రెండు కషాయ లనువైచి యందు తిప్పతీఁగ, చెంగల్వకోష్టు, సొంటి, సన్నరాస్నము, గలిజేరు, ఆ దపువేరు, పిప్పళ్లు, పెద్దసదాప, చిట్టాముట్టి, గొంతెమగోరు, జటామాంసి, కటుకరోహి వీనికల్కమును, ప్రత్యేకమర్ధపలము వంతునవైచి మందాగ్నిచే తైలపక్వముగగాచి వడి గట్టి సేవించిన గ్రీవాస్తంభవాతము, అపబాహుకము, అర్ధాంగవాతము, ఆక్షేపకవాత ఊరుస్తంభవాతము, అపతానకవాతము, హస్తపాదాదులకు కంపనమును గలిగించెఁ తము, విశ్వాచీవాతము, అర్దితవాతము నశించును. ఇదియే మాషాదితైలమనంబడు.

వాతాదిరోగములకు శతావరీతైలము.

శతావరీబలాయుగ్మం పర్ణ్యో గన్ధర్వహస్తకః. 130
అశ్వగన్ధాశ్వదంష్ట్రా చ బిల్వః కాశః కురణ్టకః,
ఏషాం సార్ధపలాన్ భాగాన్ కల్కయేచ్చ విపాచయేత్. 131
చతుర్గుణేన నీరేణ పాదశేషం శృతం నయేత్,
నియోజ్య తైలప్రస్థే చ క్షీరప్రస్థం వినిక్షిపేత్. 132
శతావరీరసప్రస్థం జలప్రస్థం చ యోజయేత్,
శతావరీదేవదారుర్మాంసీ తగరచన్దనమ్. 133
శతపుష్పాబలాకుష్ఠ మేలాశైలేయముత్పలం,
ఋద్ధిర్మేదాచ మధుకం కాకోలీ జీవకస్తథా. 134
ఏషాం కర్షసమైః కల్కైస్తైలం గోమయవహ్నినా,
పచేత్తేనైవతైలేన స్త్రీషు నిత్యం వృషాయతే. 135
నారీ చ లభతే పుత్రం యోనిశూలం చ నశ్యతి,
అఙ్గశూలం శిరశ్శూలం కామలాం పాణ్డుతాంగరమ్. 136
గృధ్రసీప్లీహాశోషాంశ్చ మేహాన్ దండాపతానకం,
సదాహం వాతరక్తం చ వాతపిత్తగదార్దితమ్. 137
అసృగ్దరం తథాఽఽఢ్మానం రక్తపిత్తం చ నశ్యతి,
శతావరీతైలమిదం కృష్ణాత్రేయేణ భాషితమ్. 138
శతావరీం 'నారాయణ్యైస్వాహా' ఇతి నత్వా
ఉత్తరాభిముఖో భూత్వా ఖనేత్ఖదిరశఙ్కునా,
'సర్వవ్యాధినాశిన్యై స్వాహా' ఇతి ఉత్పాటనమంత్రః.
'కుమారజీవనీయైస్వాహా' ఇతి పాచనమంత్రః.

పిల్లపీచరగడ్డలు, చిట్టాముట్టి, పేరాముట్టి, కోలపొన్న, ముయ్యాకుపొన్న, ఆముదపువేళ్లు, పెన్నేరుగడ్డ, పల్లేరు, మారేడువేళ్లు, రెల్లు, గోరింట వీనిని ప్రత్యేకము ఒకటిన్నర పలముచొప్పున గ్రహించి నూరి కల్కముజేసి దానికి నాలుగింతలు నీరుబోసి నాలవపాలు మిగులునట్లు కషాయముగాచి వడియగట్టి యందు ఒకప్రస్థము నువ్వులనూనె, ఒకప్రస్థము ఆవుపాలు, ఒకప్రస్థము పిల్లిపీచరగడ్డలరసము, ఒకప్రస్థము నీళ్లుబోసి పిదప యందు పిల్లపీచరగడ్డలు, దేవదారు, జటామాంసి, గ్రంథితగరము, శ్రీగంధము, పెద్దసదాప, చిట్టాముట్టి, చెంగల్వకోష్టు, ఏలకులు, తాళిపువ్వు, నల్లకలువ, ఋద్ధి (దీని

అభావంబున నేలతాడిగడ్డలు), మేద (దీని అభావంబున యష్టిమధుకము), ఇప్పపట్ట, కాకోళి (దీని అభావంబున పెన్నేరుగడ్డలు), జీవకము, (దీని అభావంబున గుమ్ముడు గడ్డలు) వీనిని ప్రత్యేకము కర్షప్రమాణముగ్రహించి కల్కముజేసివైచి ఆవుపేడచేఁ జేయంబడిన పిడకలచే తైలపక్వముగగాచి వడియగట్టి, సేవించిన కామోద్రేకము గలిగి ప్రతిదినము స్త్రీలతో రమించెడి శక్తిగలుగును. స్త్రీలుసేవించిన యోనిశూలలు నశించి పుత్రులంగనియెదరు. అంగశూలలు, శిరశ్శూలలు, కామెర్లు, పాండురోగము, విష బాధ, గృధ్రసీవాతము, ప్లీహము, శోషము, మేహములు, దండాపతానకవాతము, తాపముంతోఁ గూడిన వాతరక్తము, వాతపిత్తములచే జనించెడిరోగములు, అర్దితవాతము, అసృగ్దరము, కడుపుబ్బరము, రక్తపిత్తము నశించును. ఈశతావరీతైలము కృష్ణాత్రేయమునిచే చెప్పం బడినది. మఱియు అడవిలోనుండి పిల్లపీచరగడ్డనుదెచ్చునెడ "నారాయణ్యైస్వాహా" అనుమంత్రమును పఠించి దానికి నమస్కరించి యుత్తరముఖంబుగనుండి చంద్ర మేకుతో పిల్లపీచరగడ్డలను త్రవ్వి "సర్వవ్యాధినాశిన్యైస్వాహా" అనుమంత్రము పఠించి పీకవల యును. పాకమునుజేయునెడ "కుమారజీవనీయైస్వాహా" అనుమంత్రమును పఠించి నమ స్కరించి పాకమును జేయవలయును.

### అర్శోవ్యాధులకు కాసీసాద్యతైలము.

కాసీసం లాఙ్గలీ కుష్ఠం శుంఠీ కృష్ణా చ సైన్ధవం,
మనశ్శిలాశ్వమారశ్చ విడఙ్గం చిత్రకో వృషః. 139
దన్తీ కోశాతకీబీజం హేమాహ్వా హరితాలకం,
కల్కైః కర్షమితై రేతైస్తైలప్రస్థం విపాచయేత్. 140
సుధార్కపయసీ దద్యాత్పృథగ్ద్విపలసమ్మితే,
చతుర్గుణం గవాం మూత్రం దత్వా సమ్యక్ప్రసాధయేత్. 141
కథితం ఖరనాదేన తైలమర్శోవినాశనం,
క్షారవత్పాతయత్యేతదర్శాంస్యభ్యఙ్గితో భృశమ్. 142
వలిం న దూషయత్యేతత్క్షారకర్మకరం స్మృతం,

అన్నభేది, నీరుపిప్పలి, చెంగల్వకోష్టు, సొంటి, పిప్పళ్లు, సైంధవలవణము, మణి శిల, వాడగన్నేరువ్రేళ్లు, వాయువిళంగములు, అడ్డసరము, చిత్రమూలము, నేపాళపు వ్రేళ్లు, చేదుబీరవిత్తులు, ఉమ్మెత్తవ్రేళ్లు, హరితాలకము వీనిని ప్రత్యేక మొక్కొకకర్ష ము చొప్పున కల్కముచేసి యందు నువ్వులనూనె ఒకప్రస్థము, జెముడుపాలు రెండుపల ములు, జిల్లేడుపాలు రెండుపలములు వైచి, చక్కగ కలిపి, నూనెకు నాలుగింతలు గోమూత్రము గలిపి తైలపక్వముగ పాకముజేసి వడియగట్టి ఖరనాదముని ప్రోక్తంబగు

నీకాసీసాదితైలమును మూలవ్యాధియందలి మొలకలకు లేపనముజేసిన నది పాషాణాది క్షారములవలె లోపలనుండెడి మొలకలను నశింపజేసి త్రివళులకు బాధ గలుగకుండును.

### వాతరక్తములకు పిండతైలము.

మఞ్జిష్ఠాసారిబాసర్జయష్టీసిక్థైః పలోన్మితైః. 143
పిణ్డాఖ్యం సాధయేత్తైలమైరణ్డం వాతరక్తనుత్,

మంజిష్ఠ, సుగంధిపాల, అందుగబంక, యష్టిమధుకము, మైనము వీనిని ప్రత్యేక మొక పలమువంతున కల్కముజేసి యందాముదముబోసి కల్కము పాకమగుటకై ఆముదమునకు నాలుగింతలు నీళ్లుపోసి ఆముదముమాత్రము మిగులునట్లు కాచి వడియగట్టి అట్టి దానిని వాతరక్తముచే పీడితుఁడగు మనుష్యుఁడు శరీరమునకు లేపనము జేసికొనిన వాతరక్తము నశించును.

### గజ్జి, కుఱుపులు మున్నగువానికి అర్కతైలము.

అర్కపత్రరసే పక్వం హరిద్రాకల్కసంయుతమ్. 144
నాశయేత్సార్షపం తైలం పామాం కచ్ఛూం విచర్చికాం,

పసుపుకల్కముజేసి దీనికినాలుగింతలు తెల్లఆవాలనూనె, నూనెకు నాలుగింతలు జిల్లేడాకులరసము బోసి తైలపక్వముగకాచి వడియగట్టి శరీరమునకు లేపనముజేసిన గజ్జి, కుఱుపులు, దురద, విచర్చిక నశించును.

### కుష్ఠాదులకు మరీచాదితైలము.

మరీచం హరితాళం చ త్రివృతం రక్తచన్దనమ్. 145
ముస్తం మనశ్శిలామాంసీ ద్వే నిశే దేవదారుచ,
విశాలా కరవీరం చ కుష్ఠమర్కపయస్తథా. 146
తత్రైవ గోమయరసం కుర్యాత్కర్షమితాన్పృథక్,
విషం చార్ధపలం దేయం ప్రస్థం చ కటుతైలకమ్. 147
గోమూత్రం ద్విగుణం దద్యాజ్జలం చ ద్విగుణం భవేత్,
మరీచాద్యమిదం తైలం సిధ్మకుష్ఠహరం పరమ్. 148
జయేత్కుష్ఠాని సర్వాణి పుణ్డరీకం విచర్చికాం,
పామాం చిత్రాణి రక్తం చ కణ్డూం కచ్ఛూం ప్రణాశయేత్.

మిరియాలు, హరితాళకము, తెగడ, రక్తచందనము, తుంగముస్తలు, మణిశిల, జటామాంసి, పసుపు, మ్రానిపసుపు, దేవదారు, పెద్దపాపరవ్రేళ్లు, వాడగన్నేరువ్రేళ్లు, చెంగల్వకోష్టు, జిల్లేడుపాలు, ఆవుపేండరసము ఇవి ప్రత్యేక మొకకర్షము, శుద్ధిజేసిన

వసనాభి అర్ధపలము, ఇటుల వీని నెల్ల కల్కముగావించి యందు తెల్లఆవాలనూనె ఒక ప్రస్థము, నూనెకు రెండింతలు గోమూత్రంబును, జలంబును వైచి తైలపక్వముగ కాచి వడియగట్టి శరీరమునకు లేపనము జేసికొనిన, సిధ్మకుష్ఠము, పుండరీకకుష్ఠము, విచర్చిక, పామ, చిత్రకుష్ఠము, రక్తకుష్ఠము మొదలగు సమస్తకుష్ఠములు, దురద, కురుపులు నశించును. ఇదియే మరీచాది తైలమనంబడు.

వ్రణములకు త్రిఫలాతైలము.

త్రిఫలారిష్టభూనిమ్బం ద్వే నిశే రక్తచన్దనం,
ఏతైస్సిద్ధమరుంషీణాం తైలమభ్యఙ్గనే హితమ్. 150

త్రిఫలములు, వేపపట్ట, నేలవేము, పసుపు, మ్రానిపసుపు, రక్తచందనము వీనిని కల్కముజేసి దీనికి నాలుగింతలు నువ్వులనూనె, కల్కము చక్కగపాకమగుటకై నూనెకు నాలుగింతల నీళ్లుబోసి తైలపక్వముగగాచి వడియగట్టి వ్రణములకు లేపనముజేసిన నవి మానును.

పలితరోగమునకు నింబబీజతైలము.

భావయేన్నిమ్బబీజాని భృఙ్గరాజరసేన హి,
తథాసనస్య తోయేన తత్తైలం హన్తి నస్యతః. 151
అకాలపలితం సద్యః పుంసాం దుగ్ధాన్నభోజినాం,

వేపవిత్తులను గుంటగలగరాకు రసముతోడను, వేగిసపట్టరసముతోడను భావనచేసి యావేపవిత్తులలో నూనెదీసి నస్యముజేసి పాలు అన్నమును భుజించుచు వచ్చినయెడల అకాలమున తెల్లబడినవెండ్రుకలు నల్లబడును.

వెండ్రుకలుమొలుచుటకు యష్టిమధుకతైలము.

యష్టీమధుకక్షీరాభ్యాం నవధాత్రీఫలైశ్శృతమ్. 152
తైలం నస్యకృతం కుర్యాత్కేశాన్ శ్మశ్రూణి సర్వశః,

అతిమధురము, క్రొత్తగదెచ్చిన యుసిరికకాయలు వీనిని కల్కముజేసి దీనికి నాలుగింతలు నువ్వులనూనె, నూనెకునాలుగింతలు ఆవుపాలు, నూనెకునాలుగింతలు నీళ్లు బోసి తైలపక్వముగ కాచి వడియగట్టి, నస్యముజేసిన రాలిపోయినతల, గడ్డము మీసిమీఁది వెండ్రుకలును, మీసములును మరల మొలచును.

ఇంద్రలుప్తమునకు కరంజాదితైలము.

కరఞ్జశ్చిత్రకోజాతీకరవీరశ్చ పాచితమ్. 153
తైలమేభిశ్శృతం హన్యాదభ్యఙ్గాదింద్రలుప్తకం,

కానుగపట్ట, చిత్రమూలము, జాజిఆకులు, వాడగన్నేరువ్రేళ్లు వీనిని కల్కముఁజేసి దీనికి నాలుగింతలు నువ్వులనూనె, కల్కము చక్కగ పాకమగుటకై నూనెకు నాలుగింతలు నీళ్లుబోసి తైలపక్వముగకాచి, తల, గడ్డము, మీసములు వీనియందు వెంట్రుకలు రాలి పురుగులు జనించి గులగులలాడుచుండెడి వానికి లేపనముజేసిన మరల వెంట్రుకలు మొలచును.

పలితాదులకు నీలికాదితైలము.

నీలికాకేతకీకన్దం భృఙ్గరాజశ్చ కురణ్టకః. 154
తథాఽర్జునస్య పుష్పాణి బీజకాకుసుమాన్యపి,
కృష్ణాస్తిలాశ్చ తగరం సమూలం కమలం తథా. 155
అయోరజః ప్రియఙ్గుశ్చ దాడిమత్వగ్గుడూచికా,
త్రిఫలాపద్మపఙ్కశ్చ కల్కైరేభిః పృథక్పృథక్. 156
కర్షమాత్రం పచేత్తైలం త్రిఫలాక్వాథసంయుతం,
భృఙ్గరాజరసేనైవ సిద్ధం కేశస్థిరీకృతమ్. 157
అకాలపలితం హన్తి దారుణం చోపజీవికాం,

నీలియాకు, మొగలిగడ్డలు, గుంటగలగర, పచ్చపూలగోరింట, మద్దిపూలు, వేగిస పూలు, నల్లనువ్వులు, గ్రంథితగరము, దుంపగలకమలము, లోహచూర్ణము, ప్రేంకణపువేళ్లు, దానిమ్మబెరడు, తిప్పతీఁగ, త్రిఫలములు, తామరదుంపక్రిందిబురద వీనిని ప్రత్యేకమొకకర్షముఁచొప్పున కల్కముజేసి దీనికి నాలుగింతలు నువ్వులనూనె, నూనెకు నాలుగింతలు త్రిఫలాకషాయము, నూనెకునాలుగింతలు గుంటగలగరాకు రసముబోసి తైలపక్వముగగాచి వడియగట్టి, వెంట్రుకలకు లేపనముజేసిన నవి స్థిరమై బలంబుగనుండుటయకాక అకాలమున తెల్లనైన వెంట్రుకలు నల్లనగును. మఱియు శిరస్సునందు పోట్లును, ఉపజీవికారోగములును నశించును.

పలితాదులకు భృంగరాజతైలము.

భృఙ్గరాజరసేనైవ లోహకిట్టం ఫలత్రికమ్. 158
సారిబాం చ పచేత్కల్కైస్తైలం దారుణనాశనం,
అకాలపలితం కణ్డూమిన్ద్రలుప్తం చ నాశయేత్. 159

ఇనుపచిట్టెము, త్రిఫలములు, సుగంధిపాల వీనిని కల్కముజేసి దీనికి నాలుగింతలు నువ్వులనూనె, నూనెకు నాలుగింతలు గుంటగలగరాకు రసముబోసి తైలపక్వముగగాచి వడియగట్టి శిరస్సునందు మర్దనచేసిన శిరస్సునందలిజనించెడిపోట్లు, అకాలమందు పలితము, దురద, ఇంద్రలుప్తము నశించి వెంట్రుకలు నల్లగనుండును.

### ముఖదంతాదిరోగములకు ఇరిమేదాదితైలము.

ఇరిమేదత్వచం క్షుణ్ణాం పచేచ్ఛతపలోన్మితాం,
జలద్రోణేన తత్క్వాథం గృహ్ణీయాత్పాదశేషితమ్. 160
తైలస్యార్ధాఢకం దత్వా కర్షైః కర్షమితైః పచేత్,
ఇరిమేదలవఙ్గాభ్యాం గైరికాగరుపద్మకైః. 161
మఞ్జిష్ఠాలోధ్రమధుకైర్లాక్షాన్యగ్రోధముస్తకైః,
త్వగ్జాతీఫలకర్పూరం కఙ్కోలఖదిరైస్తథా. 162
పతఙ్గధాతకీపుష్పం సూక్ష్మైలానాగకేసరైః,
కట్ఫలేన చ సంసిద్ధం తైలం ముఖరుజం జయేత్. 163
ప్రదుష్టమాంసం చలితం శీర్ణం దంతం చ సౌషిరం,
శ్యావదంతం ప్రహర్షం చ విద్రధిం క్రిమిదంతకమ్ 164
దన్తస్ఫుటం చ దౌర్గన్ధ్యం జిహ్వాతాల్వోష్ఠజాం రుజామ్,

నూఱుపలముల కంపుతుమ్మపట్టను నలియగొట్టి యందొక ద్రోణముదకముబోసి నాలవపాలు మిగులునట్లు కషాయము గాచి వడియగట్టి యందు నువ్వులనూనె అర్ధాఢకము, కంపుతుమ్మపట్ట, లవంగములు, కావిరాళ్లు, అగరుచెక్క, పద్మకము, మంజిష్ఠ, లొద్దుగుచెక్క, అతిమధురము, లక్క, మఱ్ఱిపట్ట, తుంగముస్తలు, లవంగపుపట్ట, జాజికాయ, పచ్చకర్పూరము, తక్కోలములు, తెల్లచంద్రపట్ట, పతంగపుచెక్క, ఆరెపూలు, సన్న ఏలకులు, నాగకేసరములు, కాయఫలము వీనిని ప్రత్యేకము ఒకకర్షప్రమాణము గ్రహించి కల్కముచేసి వైచి తైలపక్వముగ కాచి వడియగట్టి, ముఖమునకు లేపనము జేసిన ముఖరోగంబులును, దంతములయందు జనించెడి దుర్మాంసములకు లేపనము జేసిన దంతరోగంబులును నశించును. కదలుచుండెడి దంతములు దృఢములుగనుండెడి దంతములయందు పోట్లును పైనవాపు గలిగి జొల్లుకాఱెడి దంతరోగములును నల్లనిపండ్లరోగము, శీతదంతరోగములు, దంతహర్షము, దంతవిద్రధి, కృమిదంతకరోగము, దంతములకు దౌర్గంధ్యమును గలిగించెడిరోగము మొదలగు సమస్తదంతరోగములును, నాలుక, దౌడలు, ఓష్ఠము వీనియందు జనించెడిరోగములును నశించును.

### నాడీవ్రణాదులకు జాత్యాదితైలము.

జాతీనింబపటోలానాం నక్తమాలస్య పల్లవాః. 165
సిక్థం సమధుకం కుష్ఠం ద్వే నిశే కటురోహిణీ,
మంజిష్ఠాపద్మకం లోధ్రమభయానీలముత్పలమ్. 166

తుత్థకం సారిబాబీజం నక్తమాలస్య దాపయేత్,
ఏతాని సమభాగాని పిష్ట్వా తైలం విపాచయేత్. 167
నాడీవ్రణే సముత్పన్నే స్ఫోటకే కచ్ఛురోగిషు,
సద్యశ్శస్త్రప్రహారేషు దగ్ధవిద్ధేషు చైవ హి 168
నఖదంతక్షతే దేహే వ్రణే దుష్టే ప్రశస్యతే,

జాజి, వేము, చేదుపొట్ల, చీకటిమ్రాను వీనిచిగుళ్లు, మైనము, యష్టిమధుకము, చెంగల్వకోష్టు, పసుపు, మ్రానిపసుపు, కటుకరోహిణి, మంజిష్ఠ, పద్మకములు, లొద్దుగచెక్క, కరకకాయలు, నల్లకలువ, మయూరతుత్థము, సుగంధిపాల, చీకటిమ్రాను విత్తులు వీనిని సమభాగంబులుగ కల్కముగావించి కల్కముకంటె నాలుగింతలు నూనె బోసి నూనెకంటె నాలుగింతలు నీరుబోసి తైలముగాచి యాతైలమును లేపనముచేసిన నాడీవ్రణము, స్ఫోటకము, తీట, సద్యోవ్రణము, కాలినపుండు, నఖక్షతము, దంతక్షతము, దుష్టవ్రణము నశించును.

కర్ణశూలములకు హింగ్వాదితైలము.

హిఙ్గుతుమ్బురుశుణ్ఠీభిః కటుతైలం విపాచయేత్. 169
తస్య పూరణమాత్రేణ కర్ణశూలః ప్రశామ్యతి,

ఇంగువ, తుంబురుల్లు, సొంటి వీనిని కల్కముజేసి దీనికి నాలుగింతలు ఆవనూనె, కల్కము బాగుగ పక్వమగుటకై నూనెకు నాలుగింతల నీళ్లు బోసి తైలపక్వముగ కాచి వడియగట్టి చెవిలో బోసిన కర్ణశూలలు నశించును.

బధిరరోగములకు బిల్వాదితైలము.

బాలబిల్వాని గోమూత్రే పిష్ట్వా తైలం విపాచయేత్. 170
సాజక్షీరం చ నీరం చ బాధిర్యే కర్ణపూరణాత్,

మారేడుపిందెలను గోమూత్రముతో నూరి కల్కముజేసి యందు నాలుగింతలు నువ్వులనూనె, నూనెకు నాలుగింతలు మేకపాలు కల్కము చక్కగపాకమగుటకై నూనెకు నాలుగింతల నీళ్లుబోసి తైలపక్వముగకాచి వడియగట్టి చెవిలోబోసిన చెవుడు నశించును.

కర్ణస్రావాదులకు క్షారతైలము.

బాలమూలకశుణ్ఠీనాం క్షారఃక్షారయుగం తథా. 171
లవణానిచ పఞ్చైవ హిఙ్గుశిగ్రుమహౌషధం,
దేవదారువచాకుష్ఠం శతపుష్పారసాంజనమ్ 172
గ్రన్థికం భద్రముస్తంచ కల్కైః కర్షమితైః పృథక్,
తైలప్రస్థం చ విపచేత్కదళీబీజపూరయోః. 173

రసాభ్యాం మధుసూక్తేన చాతుర్గుణ్యమితేన చ,
పూయస్రావం కర్ణనాదం శూలం బధిరతాం కృమి
అన్యాంశ్చ కర్ణజాన్ రోగాన్ ముఖరోగాంశ్చ నాశ
జమ్బీరాణాం ఫలరసః ప్రస్థైకః కుడవోన్మితమ్.
మాతుళకం తత్ర దాతవ్యం పలైకా పిప్పలీ స్మృతా
ఏతదేకీకృతం సర్వం మృద్భాణ్డేచ నిధాపయేత్.
ధాన్యరాశౌ స్థితం మాసం మధుసూక్తముదాహృ

శేతముల్లంగి, సొంటి వీనిక్షారము, సర్జక్షారము, యవక్షారము,
సౌవర్చలవణము, బిడాలవణము, సముద్రలవణము, కాచలవణము, ఇంగ
సొంటి, దేవదారు, వస, చెంగల్వకోష్టు, పెద్దసదాప, రసాంజనము, గ్రంథి
ముస్తలు వీనిని ప్రత్యేక మొకకర్షము చొప్పున కల్కముచేసి యం
నువ్వులనూనె, నూనెకు నాలుగింతలు అరటిదుంపరసము, నూనెకు నా
ఫలరసము, నూనెకు నాలుగింతలు*మధుసూక్తముబోసి తైలపక్వముగ కా
చెవిలోపోసిన చీముకాఱుట, కర్ణనాదము, చెవిలోపోటు, చెవుడు, పురు
మొదలగు సమస్తకర్ణరోగంబులును, ముఖరోగములును నశించును.

## పీనసములకు పాఠాదితైలము.

పాఠా ద్వే చ నిశే మూర్వా పిప్పలీజాతిపల్లవైః.
దన్త్యా చ తైలం సంసిద్ధం నస్యం స్యాద్దుష్టపీనసే,

విషబొద్ది, పసుపు, మ్రానిపసుపు, చాగమట్ట, పిప్పళ్లు, జాజి ఆ
ప్రేళ్లు వీనిని సమభాగములుగ కల్కముఁజేసి, కల్కమునకు నాలుఁగింత
బోసి, కల్కము బాగుగ పక్వమగుటకై తైలమునకు నాలుగింతలు నీళ్లు
ముగకాచి వడియగట్టి నస్యముచేసిన ప్రబలమగు పీనసలు నశించును.

## పూతిపీనసలకు వ్యాఘ్రీతైలము.

వ్యాఘ్రీదన్తీవచాశిగ్రు తులసీవ్యోషసైన్ధవైః.
కల్కైశ్చ పాచితం తైలం పూతినాసాగదాపహం,

---

* మధుసూక్తమును చేయుక్రమము:—నిమ్మపండ్లరసము నొక ప్ర
కుండలోవైచి యందొకకుడవప్రమాణము తేనెబోసి, ఒకపలము పిప్పలి
యాకుండమూతిని వాసెనగట్టి నెలదినములవఱకు ధాన్యరాశియం దుని
సూక్త మనంబడు.

వాకుడు, నేపాళపువ్రేళ్లు, వస, మునగపట్ట, తులసి, త్రికటుకములు, సైంధవ ణము వీనిని కల్కముచేసి కల్కమునకు నాలుగింతలు నువ్వులనూనె, కల్కము చక్కగ కమగుటకై తైలమునకు నాలుగింతలు నీళ్లుబోసి తైలపక్వముగఁ గాచి వడియగట్టి స్యము చేసిన ముక్కులో చీముకారెడి పీనసరోగము నశించును.

తుమ్ములకు కుష్ఠతైలము.

కుష్ఠబిల్వకణా శుణ్ఠీ ద్రాక్షాకల్కకషాయవత్. 179
సాధితం తైలమాజ్యం వా నస్యాత్క్షవథునాశనం,

చెంగల్వకోష్టు, మారేడుపిందెలు, పిప్పళ్లు, సొంటి, ద్రాక్షపండు వీనిని కల్కము సి వీనికి నాలుగింతలు నువ్వులనూనెగాని, నెయ్యిగాని బోసి కల్కము చక్కగ పాక గుటకై స్నేహమునకు నాలుగింతలు నీళ్లుబోసి తైలపక్వముగ గాచి వడియగట్టి నస్యము సిన యధికమగు తుమ్ములు నశించును.

నాసార్శస్సులకు గృహధూమతైలము.

గృహధూమకణాదారుక్షారనక్తాహ్వసైన్ధవైః. 180
సిద్ధం శిఖరిబీజైశ్చ తైలం నాసార్శసాం హితం,

కరిదూపము, పిప్పళ్లు, దేవదారు, యవక్షారము, క్రానుగుపట్ట, సైంధవలవణము, త్తరేణివిత్తులు వీనిని సమభాగములుగ కల్కము జేసి దీనికి నాలుగింతలునువ్వులనూనె, ల్కము పక్వమగుటకై నూనెకు నాలుగింతలనీళ్లు బోసి తైలపక్వముగకాచి వడియగట్టి స్యముఁజేసిన నాసికయందలి మాంసరూపమగు మొలకలు నశించును. ఈమొలకలే నా సార్శస్సు అని చెప్పంబడును.

సర్వకుష్ఠములకు వజ్రతైలము.

వజ్రీక్షీరం రవిక్షీరం ద్రవం దుత్తూరచిత్రకమ్. 181
మహిషీవిడ్భవం ద్రావం సర్వాంశం తిలతైలకం,
పచేత్తైలావశేషం చ గోమూత్రేఽథ చతుర్గుణే. 182
తైలావశేషం పక్త్వా చ తత్తైలం ప్రస్థమాత్రకం,
గన్ధకాగ్నిశిలాతాలం విడఙ్గాతివిషావిషమ్. 183
తిక్తకోశాతకీ కుష్ఠం వచామాంసీ కటుత్రయం,
పీతదారు చ యష్ట్యాహ్వం సర్జికాక్షారజీరకమ్. 184
దేవదారుచ కర్షాంశం చూర్ణం తైలే వినిక్షిపేత్,
వజ్రతైలమితి ఖ్యాతమభ్యఙ్గాత్సర్వకుష్ఠనుత్. 185

జెముడుపాలు, జిల్లేడుపాలు, ఉమ్మెత్తరసము, చిత్రమూలరసము, బత్తాపేడ రసము వీనిని సమభాగములుగ గ్రహించి, వీనికన్నిటికి సమముగ నువ్వులనూనెబోసి యానూనె మిగులునట్లుకాచి పిదప దీనికి నాలుగింతలు గోమూత్రముబోసి తైలపక్వముగ కాచి పడియగట్టి యందు, గంధకము, చిత్రమూలము, మణిశిల, హరితాళకము, వాయువిళంగములు, అతివస, శుద్ధిజేసినవసనాభి, చేదుబీర, చెంగల్వకోష్టు, వస, జటామాంసి, త్రికటుకములు, మ్రానిపసుపు, అతిమధురము. సర్జక్షారము, జీలకఱ్ఱ, దేవదారు వీనిని ప్రత్యేకము కర్ష ప్రమాణములుగ చూర్ణముచేసి వస్త్రగాలితమొనర్చివైచి యానూనెను శరీరమునకు లేపనము జేసికొనిన సర్వకుష్ఠములు నశించును. ఇదియే వజ్రతైల మనంబడు.

### లోమశాతనమునకు కరవీరాదితైలము.

కరవీరశిఫాదన్తీ త్రివృతోక్తశాతకీఫలం,
రమ్భాక్షారోదకే తైలం ప్రశస్తం లోమశాతనమ్. 186

వాడగన్నేరువేళ్లు, నేపాళపువేళ్లు, తెగడ, చేదుబీరపండ్లు వీనిని కల్కము జేసి దీనికి నాలుగింతలు నువ్వులనూనె, నూనెకు నాలుగింతలు నీళ్లుబోసి యందు, అరటి ఆకులనుగాల్చి చేసినక్షారమునువైచి తైలపక్వముగగాచి పడియగట్టి, వెండ్రుకలు రాలవలెనను ఇచ్ఛగలస్థలమున లేపనముజేసిన నందలివెండ్రుకలు రాలిపోవును.

### అపస్మారాదులకు చందనాదితైలము.

చందనాంబునఖైర్వ్యాఘ్ర్యం యష్టిశైలేయపద్మకం,
మంజిష్ఠాసరళం దారు సేవ్యైలాపూతికేసరమ్. 187
పత్రకైలసురామాంసీ కంకోలం వనితాంబుదం,
హరిద్రా సారివా తిక్తా లవంగాగరుకుంకుమమ్. 188
త్వగ్రేణునలికా చేతి తైలమస్తు చతుర్గుణం,
లాక్షారససమం సిద్ధం గ్రహఘ్నం బలవర్ధనమ్. 189
అపస్మారజ్వరోన్మాదకృత్యాలక్ష్మీ వినాశనం,
ఆయుఃపుష్టికరం చైవ వశీకరణముత్తమమ్. 190
విశేషాత్క్షయరోగఘ్నం రక్తపిత్తకరం పరం,

మంచిగంధము, కురువేరు, పులిగోరుచెట్టు, యష్టిమధుకము, రాంబువ్వ, పద్మకములు, మంజిష్ఠ, సరళదేవదారు, వట్టివేరు, క్రానుగు, పెద్దఏలకులు, నాగకేసరములు, ఆకుపత్రి, చిన్నయేలకులు, సుర, జటామాంసి, తక్కోలములు, పిప్పళ్లు, తుంగముస్తలు, పసుపు, సుగంధిపాల, కటుకరోహిణి, లవంగములు, అగరు, కుంకుమపువ్వు, లవంగపట్ట, రేణుకలు, తామరతూండ్లు వీనిని సమభాగంబులుగా కల్కముగావించి కల్కమునకు నాలుగిం

౹ నువ్వులనూనెబోసి నూనెకు నాలుగింతలు పెరుఁగుమీఁదినీరు, నూనెకు సమముగా
_నీరు బోసి తైలముగాచి సేవించిన అపస్మారము, జ్వరము, ఉన్మాదము, క్షయము
౦చును. బలమును గలుగజేయు గ్రహములను బోగొట్టును.

## గండమాలలకు వచాదితైలము.

వచాశుంఠీహరిద్రే ద్వే దేవదారుమహౌషధీ. 191
హరీతకీ మతివిషాము స్తకేంద్రయవాః సమాన్,
ఏతాః దశపలాః భాగాంశ్చతుర్ద్రోణేఽంభసః పచేత్. 192
చక్రమర్దరసైస్తైలం కటుకం మృదునాఽగ్నినా,
పాదశేషే వినిక్షిప్య సిందూరమవతారయేత్. 193
ఏతత్తైలం నిహంత్యాశు గండమాలాం సుదారుణాం,

వస, సొంటి, పసుపు, మ్రానుపసుపు, దేవదారు, సొంటి, కరకకాయలు, అతి
౹, ముస్తలు, కొడిసెపాలవిత్తులు వీనిని పదింటిని పదిపలములు గ్రహించి నాలుగుద్రోణ
౹లనీటియందు నాలవపాలుమిగులునట్లు కషాయముగాచి యందు కషాయములో నాలవ
౹లు ఆవనూనెబోసి నూనెకుసమముగా తగిరిసెరసముపోసి పచనము గావించునపుడు
౹దు రససిందూరముగలిపి పిమ్మట నాతైలమును లేపనముచేసిన గండమాల నశించును.

## గండమాలలకు నిర్గుండ్యాదితైలము.

నిర్గుండీస్వరసే తైలం లాంగులీమూలకల్కితమ్. 194
తైలం నస్యాన్నిహంత్యాశు గండమాలాం సుదారుణాం,

ఇతి శ్రీదామోదరసూనుశార్ఙ్గధరేణ విరచితాయాం
సంహితాయాం మధ్యమఖండే చికిత్సాస్థానే
ఘృతతైలకల్పనా నామ నవమోఽధ్యాయః.

వావిలియాకురసములో తైలముబోసి పొత్తినంపను కల్కముగా నొనరించి పచ
ముచేసి యాతైలమును నస్యముచేయించిన గండమాల హరించును.

ఇది శ్రీదామోదరసూను శార్ఙ్గధరవిరచితసంహితయందు మధ్యమఖండమున
చికిత్సాస్థానమున ఘృతతైలకల్పన యనియెడు
నవమాధ్యాయము సంపూర్ణము.

# దశమాధ్యాయము.

## ఆసవారిష్టకల్పన.

ద్రవేషు చిరకాలస్థం ద్రవ్యం యత్సన్ధితం భవేత్,
ఆసవారిష్టభేదైస్తత్ప్రోచ్యతే భేషజోచితమ్. 1
యదపక్వౌషధామ్బుభ్యాం సిద్ధం మద్యం స ఆసవః,
అరిష్టః క్వాథసిద్ధస్స్యాత్తయోర్మానం పలోన్మితమ్. 2
అనుక్తమానారిష్టేషు ద్రవ ద్రోణే తులాంగుడం,
క్షౌద్రం క్షిపేద్గుడాదర్ధం ప్రక్షేప్యం దశమాంశకమ్. 3
జ్ఞేయశ్శీతరసశ్శీధురపక్వమధురద్రవైః,
సిద్ధపక్వరసశ్శీధుస్సంపక్వమధురద్రవైః. 4
పరిపక్వాన్న సన్ధానసముత్పన్నాం సురాం జగుః,
సురామణ్డః ప్రసన్నా స్యాత్తతః కాదమ్బరీ ఘనా. 5
తదధో జగలో జ్ఞేయో మేదకో జగలాద్ఘనః,
పక్వోఽసౌ హృతసారస్స్యాత్సురాబీజం చ కిణ్వకమ్. 6
యత్తాలఖర్జూరరసైస్సన్ధితా సా హి వారుణీ,
కన్దమూలఫలాదీని సస్నేహలవణాని చ. 7
యత్ర ద్రవేఽభిషూయన్తే తత్సూక్తమభిధీయతే,
వినష్టమమ్లతాం యాతం మధుం వా మధురద్రవః. 8
వినష్టస్సన్ధితో యస్తు తచ్చుక్రమభిధీయతే,
గుడామ్బునా సతైలేన కన్దమూలఫలైస్తథా. 9
సన్ధితం చామ్లతాం యాతం గుడసూక్తం తదుచ్యతే,
ఏవమేవేక్షుసూక్తం స్యాన్మృద్వీకాసమ్భవం తథా. 10
తుషామ్బుసన్ధితం జ్ఞేయమామైర్విదలితైర్యవైః,
యవైస్తు నిస్తుషైః పక్వైస్సౌవీరం సన్ధితం భవేత్. 11
కుల్మాషధాన్యమణ్డాదిసన్ధితం కాంజికం విదుః,
సండాకీసన్ధితా జ్ఞేయా మూలకైస్సర్షపాదిభిః. 12

ఉదకము మొదలగు ద్రవపదార్థములయం దౌషధద్రవ్యములను గలిపి భాండంబున వైచి, దానిపైమూఁతబెట్టి చీలమన్ను లేపనముఁ జేసి యొకమాసంబైనను లేక పక్షం

ర నది యొయుత్కృష్టమైన యౌషధంబగు. ఇది ఆసవమనియుం, అరిష్టమనియుం
నుండు. అందు ఉదకమును ఔషధములను పక్వము జేయకయే పైజెప్పిన
ండంబున వైచి చీలమన్ను వేసి యుంచుటయ ఆసవమనియుం, కషాయము
షధద్రవ్యములనువైచి పైజెప్పినచొప్పున చీలమన్ను వేసి ఉంచుటయ అరిష్ట
గు. ఆసవారిష్టముల నొకపలప్రమాణముగ సేవింపందగు. అరిష్టప్రయోగ
దకాది ప్రమాణములం జెప్పకయుండెనేని, ఉదకాదిద్రవపదార్థముల నొక
ముగ గ్రహించి యందొకతులాప్రమాణము బెల్లము గలిపి బెల్లమునకు
సి యందౌషధచూర్ణమును బెల్లమునకు పదియవపాలు వేయందగు. ఇక
నంబును వివరించెద. అపక్వమైనచెఱకురసము మొదలగు మధురద్రవపదార్థ
యినమద్యము శీతరససింధువనిపరంగు. మఱియు, సంపక్వమైన మధురద్రవ
సిద్ధమయినమద్యము పక్వరససింధువని పరఁగు. ఇక సురాప్రసన్నాది మద్య
రించెద. తండులాదులనువండి అగ్నిసంయోగముచే యంత్రమూలముగ మద్య
నది సురయని పరంగు. మఱియు సురయొక్కనురుఁగును ప్రసన్నమనియుం,
ండుదానిని కాదంబరియనియు సురాధోభాగముననుండెడి ద్రవభాగమును
, అందు జగలమునకంటె గట్టిగనుండుదానిని మేదకమనియుం, ఆమేదక
జేసి అందు సారముదీసినపిదప మిగిలియుండెడిదానిని సురాబీజమనియుం,
ం జెప్పుదురు. మఱియు, తాటికల్లు, ఈతకల్లు, ఖర్జూరపుకల్లు వీనిని అగ్నిసం
యంత్రమూలముగ గలుగంజేయం మద్యమును వారుణియనియుం, కంద
ఫలాదులు, తైలము, సైంధవలవణము మొదలగువానిని ఉదకాదిద్రవపదా
చి అగ్నిసంధానముజేసి యంత్రమూలముగ దీయునట్టి మద్యమును సూక్త
పుల్లనైనమద్యమునైనను, చెడి పుల్లగనుండు మధురద్రవపదార్థములనైనను
సి యొపాత్రనోటికి చీలమన్ను లేపనముజేసి మాసముగాని పక్షముగాని
సిద్ధము జేయంబడినదానిని శుక్రమనియుం, బెల్లము, నీళ్లు, నూనె, కంద
పలు వీనిని యొకపాత్రలోవైచి మూంతబెట్టి చీలమన్నులేపనముంజేసి మాస
క్షముగాని యుంచుటచే పులియుదానిని గుడసూక్తమనియుం చెప్పుదురు.
మే చెఱకుపాలను, ద్రాక్షపండును సూక్తము జేయవలయు. మఱియు పచ్చి
లియగొట్టి యందు నీళ్లుబోసి మైనమూంతబెట్టి చీలమన్నులేపనముంజేసి యొకటి
సులుంచిన నది తుషాంబు వనియు, యవలపై పొట్టుదీసి యుడికించి యందు
మైన మూసి చీలమన్ను లేపనముంజేసి యొకటిరెండు దినములుంచిన నది
యుం, ఉలవలయందైనను బియ్యముపందైనను నీళ్లుబోసి యుడికించి గంజి
దు సొంటి, ఆవాలు, జీలకఱ్ఱ, ఇంగువ, సైంధవలవణము, పసుపు మొదలగు

వానిని వైచి పైనమూఁతబెట్టి చీలమన్ను లేపనముజేసి మూఁడు నాలుఁగు దినములుంచిన నది కాంజికమనియు, మూలకములనుదెచ్చి యందు నీళ్లుబోసి పసుపు, ఇంగువ, తెల్ల ఆవాలు, సైంధవలవణము, జీలకఱ్ఱ, సొంటి మొదలగువానిని చూర్ణముచేసి యందు కలిపి పాత్రకు పైన మూఁతబెట్టి చీలమన్ను లేపనముఁజేసి మూఁడు, లేక నాలుగు దినములుంచిన నది నందాది యనియు జెప్పంబడును.

## రక్తపిత్తాదులకు ఉశీరాసవము.

ఉశీరం వాలకం పద్మం కాశ్మరీనీలముత్పలం,
ప్రియఙ్గుపద్మకం లోధ్రం మఞ్జిష్ఠా ధన్వయాసకమ్. 13
పాఠా కిరాతతిక్తం చ న్యగ్రోధోదుమ్బరం సఠీ,
పర్పటం పుణ్డరీకం చ పటోలం కాఞ్చనారకమ్. 14
జమ్బ్వాశాల్మలినిర్యాసః ప్రత్యేకం పలసమ్మితాః,
భాగాః సుచూర్ణితాః కృత్వా ద్రాక్షాయాః పలవింశతిః. 15
ధాతకీం షోడశపలాం జలద్రోణద్వయే క్షిపేత్,
శర్కరాయాస్తులాం దత్వా క్షౌద్రస్యైకతులాం తథా. 16
మాసం చ స్థాపయేద్భాణ్డే మాంసీమరిచధూపితే,
ఉశీరాసవ ఇత్యేష రక్తపిత్తనివారణః. 17
పాణ్డుకుష్ఠప్రమేహార్శః క్రిమిశోషాపహస్తథా,

వట్టివేళ్లు, కురువేరు, ఎఱ్ఱతామరపూలు, గుమ్ముడు, నల్లకలువలు, ప్రేంకణపు వ్రేళ్లు, పద్మకములు, లొద్దుగు, మంజిష్ఠ, దురదగొండి, విషబొద్ది, నేలవేము, మఱ్ఱిపట్ట, అత్తిపట్ట, కచోరములు, పర్పాటకము, తెల్లతామరపూలు, చేదుపొట్ల, దేవకాంచనపు పట్ట, నేరేడుపట్ట, బూరుగబంక ఇవి ప్రత్యేకమొక్కొకపలము, ద్రాక్షపండు ఇరువది పలములు, ఆరెపూలు పదియాఱుపలములు, ఇటుల వీనినెల్ల చూర్ణముచేసి రెండుద్రోణములనీటిలోఁగలిపి యందు శర్కర నూఱుపలములు, తేనె నూఱుపలములు వైచి జటామాంసి, మిరియములు వీనిచే ధూపము వేయఁబడిన కుండయందు వైచి దానిమూతిని మూసి చీలమన్ను లేపనముచేసి యొకమాసం బుంచవలయు. ఇదియే ఉశీరాసవ మనంబడు. దీనిసేవించిన రక్తపిత్తము, పాండువు, కుష్ఠము, ప్రమేహము, మూలవ్యాధి, క్రిమి రోగము, శోష నశించును.

## ప్రమేహములకు కుమార్యాసవము.

సుపక్వరససంశుద్ధం కుమార్యాః పత్రమాహరేత్. 18
యత్నేన రసమాదాయ పాత్రే పాషాణమృణ్మయే,

ద్రోణే గుడతులాం దత్వా ఘృతభాండే నిధాపయేత్. 19
మాక్షికం పక్వలోహం చ తస్మిన్నర్ధతులాం క్షిపేత్,
కటుత్రికం లవంగం చ చాతుర్జాతకమేవ చ. 20
చిత్రకం పిప్పలీమూలం విడంగం గజపిప్పలీ,
చవికం హాపుషా ధాన్యం క్రముకం కటురోహిణీ. 21
ముస్తాఫలత్రికం రాస్నా దేవదారునిశాద్వయమ్,
మూర్వా మధురసా దంతీ మూలం పుష్కరసంభవమ్. 22
బలా చాతిబలా చైవ కపికచ్ఛుస్త్రికంటకం,
శతపుష్పా హింగుపత్రీ ఆకల్లకముటుంగణమ్. 23
పునర్నవాద్వయం లోధ్రం ధాతుమాక్షికమేవ చ.
ఏషాం చార్ధపలం దత్వా ధాతక్యాస్తు పలాష్టకమ్. 24
పలం చార్ధపలం చైవ పలద్వయముదాహృతం,
వపుర్వయః ప్రమాణేన బలవర్ణాగ్నిదీపనమ్. 25
బృంహణం రోచనం వృష్యం పక్తిశూలనివారణం,
అష్టావుదరజాన్ రోగాన్ క్షయముగ్రం చ నాశయేత్. 26
వింశతిం మేహజాన్ రోగానుదావర్తమపస్మృతిం,
మూత్రకృచ్ఛ్రమపస్మారం శుక్రదోషం తథాఽశ్మరీమ్. 27
కృమిజం రక్తపిత్తం చ నాశయేత్తు న సంశయః,

బాగుగాముదిరి రసముగలిగియుండ్న కలబందమట్టనుండి ద్రోణప్రమాణము రసము తీసి యారసమును ఒక నేయిపూసిన మంటిపాత్రమునఁబోసి యందునూఱుపలములు ప్రాతబెల్లమువైచి ఏబదిపలములు తేనె, ఏబదిపలములు లోహభస్మమువైచి త్రికటుకములు, లవంగములు, చాతుర్జాతకములు, చిత్రమూలము, మోడి, వాయువిళంగములు, గజపిప్పళ్లు, చవ్యము, ప్రబ్బి, దనియములు, పోకలు, కటుకరోహిణి, ముస్తలు, త్రిఫలములు, సన్నరాస్న, దేవదారు, పసుపు, మ్రానుపసుపు, సాగనార, ఇప్పపువ్వు, నేపాళపువేరు, పుష్కరమూలము, ముత్తసపులగము, పేరాముట్టి, దురదగొండి, పెద్దపల్లేరు, పెద్దసదాప, ఇంగుపత్రి, ఆకల్లకము, ముటుంగణము, తెల్లగలిజేరు, ఎఱ్ఱగలిజేరు, లొద్దుగ, హేమమాక్షికము వీనిని చూర్ణముగావించి ప్రత్యేకముగా అర్ధపలప్రమాణముగాను, ఆరెపువ్వును ఎనిమిదిపలములుగాను వైచి సంబధింధముగావించి ధాన్యరాశియందుంచి మాసానంతరమున అరపలము, పలము, రెండుపలములు ప్రమాణముగా సేవించిన ఉదరములు,

క్షయ, ప్రమేహములు, ఉదావర్తము, అపస్మారము, పరిణామశూల, మూత్రకృచ్ఛ్రము, అశ్మరి, కృమిరోగము నశించును. బలమును, కాంతి, ఆయుష్యమును వృద్ధినొందించును.

క్షయాదులకు పిప్పల్యాసవము.

పిప్పలీమరిచం చవ్యం హారిద్రాచిత్రకో ఘనః. 28
విడఙ్గం క్రముకో లోధ్రః పాఠాధాత్రై్యలవాలుకం,
ఉశీరం చందనం కుష్ఠం లవంగం తగరం తథా. 29
మాంసీత్వగేలాపత్రం చ ప్రియఙ్గుర్నాగకేసరం,
ఏషామర్ధపలాన్ భాగాన్ సూక్ష్మచూర్ణీకృతాన్ శుభాన్. 30
జలద్రోణద్వయే క్షిప్త్వా దద్యాద్గుడతులాద్వయం,
పలాని దశ ధాతక్యాః ద్రాక్షాషష్టిపలా భవేత్. 31
ఏతాన్యేకత్ర సంయోజ్య మృద్భాణ్డే చ వినిక్షిపేత్,
జ్ఞాత్వా గతరసం సర్వం పాయయేదగ్న్యపేక్షయా. 32
క్షయం గుల్మోదరం కార్శ్యం గ్రహణీం పాణ్డుతాం తథా,
అర్శాంసి నాశయేచ్ఛీఘ్రం పిప్పల్యాద్యాసవస్త్వయమ్. 33

పిప్పళ్లు, మిరియాలు, చవ్యము, పసుపు, చిత్రమూలము, తుంగముస్తలు, వాయువిళంగములు, పోకలు, లొద్దుగ, విషబొద్ది, ఉసిరికయొలుపు, కూతురుబుడము, వట్టివేళ్లు, శ్రీగంధము, చెంగల్వకోష్టు, లవంగములు, గ్రంథితగరము, జటామాంసి, లవంగపట్ట, ఏలకులు, లవంగపత్రి, ప్రేంకణపువేళ్లు, నాగకేసరములు, వీనిని ప్రత్యేకము అర్ధపలము చొప్పున చూర్ణముచేసి రెండుద్రోణముల యందకముబోసి పిదప మూండువందల పలముల బెల్లమును, పదిపలముల ఆరెపువ్వును, అఱువది పలములద్రాక్షపండ్లను మొత్తగనూరి యందు గలపి మట్టియందు వైచి కుండమూతిని బిగించి చీలమన్నులేపనముజేసి యొకమాసంబైనను పక్షంబైనను యునిచి పైచీలమన్నుదీసి యౌషధరసము అందలి నీటిలోకలసినటుల తెలిసికొని అగ్నిబలానుసారముగ సేవించిన క్షయరోగము, గుల్మము, ఉదరరోగము, కృశత్వము, సంగ్రహణి, పాండురోగము, మూలవ్యాధి నశించును. ఇదియే పిప్పల్యాసవమనంబడు.

పాండురోగాదులకు లోహాసవము.

లోహచూర్ణం త్రికటుకం త్రిఫలాం చ యవానికాం,
విడఙ్గం ముస్తకం చిత్రం చతుస్సంఖ్యాపలం పృథక్.
ధాతకీకుసుమానాం తు ప్రక్షిపేత్పలవింశతిం,

చూర్ణీకృత్య తతః క్షౌద్రం చతుష్షష్టిపలం క్షిపేత్. 35
దద్యాద్గుడతులాం తత్ర జలద్రోణద్వయం తథా,
ఘృతభాణ్డే వినిక్షిప్య నిదధ్యాన్మాసమాత్రకమ్. 36
లోహాసవమముం మర్త్యః పిబేదగ్నికరం పరం,
పాణ్డుశ్వయథుగుల్మాని జఠరాణ్యర్శసాం రుజమ్. 37
కుష్ఠం ప్లీహామయం కణ్డూం కాసం శ్వాసం భగన్దరం,
అరోచకం చ గ్రహణీం హృద్రోగం చ వినాశయేత్. 38

లోహచూర్ణము, సొంటి, మిరియాలు, పిప్పళ్లు, త్రిఫలములు, అజామోదము, వాయువిళంగములు, తుంగగడ్డలు, చిత్రమూలము ఇవి ప్రత్యేకము నాలుగుపలములు, ప్రాలు ఇరువదిపలములు ఇటుల వీనినెల్ల చూర్ణముచేసి యందు అఱువదినాలుగుపల తేనె, నూఱుపలములబెల్లము, రెండుద్రోణముల యుదకము బోసి వీనినన్నిటిని ఘృతలోలిప్తమైనకుండయందునిచి దానిమూతిని బిగించి చీలమన్ను లేపనముజేసి యొక మాసం బుంచవలయు. ఇదియె లోహాసవ మనంబడు. దీని సేవించుటచే అగ్నిదీపనము గలుగుటయే గాక పాండురోగము, వాపు, గుల్మము, ఉదరరోగము, మూలవ్యాధి, కుష్ఠము, ప్లీహరోగము, దురద, దగ్గు, ఉబ్బసము, భగందరము, అరుచి, గ్రహణి, హృద్రోగము నశించును.

## అర్శోరోగంబులకు మృద్వీకారిష్టము.

మృద్వీకాయాః పలశతం చతుర్ద్రోణేఽంభసః పచేత్,
ద్రోణశేషే సుశీతే చ పూతే తస్మిన్ ప్రదాపయేత్. 39
తులే ద్వే క్షౌద్రఖండాభ్యాం ధాతక్యాః ప్రస్థమేవ చ,
కంకోలకం లవంగం చ ఫలం జాత్యాస్తథైవ చ, 40
పలాంశకం చ మరిచత్వగేలాపత్రకేసరాః,
పిప్పలీచిత్రకం చవ్యం పిప్పలీమూలరేణుకే. 41
ఘృతభాండే వినిక్షిప్య చందనాగరుధూపితే,
కర్పూరవాసితో హ్యేష గ్రహణ్యాదీపనఃపరః. 42
అర్శసాం నాశనే శ్రేష్ఠ ఉదావర్తస్య గుల్మనుత్,
జఠరక్రిమికుష్ఠాని వ్రణాని వివిధాని చ. 43
అక్షిరోగశిరోరోగగళరోగాంశ్చ నాశయేత్,

నూఱుపలములద్రాక్షపండు నాలుగుద్రోణముల నీటియందు నాలవపాలు మిగులు కషాయముగా గాచి వడబోసి చల్లారినపిదప నందు నూఱుపలములు తేనె, నూఱుపల

ములు ఖండశర్కర వైచి ఒకప్రస్థము ఆరెపువ్వు, తక్కోలములు, లవంగములు, జాజికాయ, మిరియములు, లవంగపట్ట, ఏలకులు, ఆకుపత్రి, నాగకేసరములు, పిప్పళ్లు, చిత్రమూలము, చవ్యము, మోడి, రేణుకలు వీనిని ప్రత్యేకముగా చూర్ణముచేసి యొక్కొక్కపలమువైచి నేయిపూసినపాత్రంబునబోసి ఒకమాసమునకుపిమ్మట సేవించిన మూలరోగము, ఉదావర్తము, గుల్మము. ఉదరరోగము, కృమిరోగము, కుష్ఠము, వ్రణములు, నేత్రరోగము, శిరోరోగము కంఠరోగము నశించును.

### సర్వజ్వరములకు కుటజారిష్టము.

తులాం కుటజమూలస్య మృద్వీకార్ధతులాం తథా. 44
మధూకపుష్పకాశ్మర్యో భాగాన్ దశపలోన్మితాన్,
చతుర్ద్రోణేఽమ్భసః పక్త్వా క్వాథే ద్రోణావశేషితే. 45
ధాతక్యా వింశతిపలం గుడస్య చ తులాం క్షిపేత్,
మాసమాత్రం స్థితో భాణ్డే కుటజారిష్టసంజ్ఞితః. 46
జ్వరాన్ ప్రశమయేత్సర్వాన్ కుర్యాత్తీక్ష్ణం ధనంజయం,

కొడిసెవేరు నూఱుపలములు, ద్రాక్షపండ్లు ఏబదిపలములు, ఇప్పపూలు, గుమ్ముడువేళ్లు ఇవి ప్రత్యేకముగ పదిపలములు, ఇటుల వీనిని నలియగొట్టి నాలుగుద్రోణముల యందకముగల యొకకుండయందు వైచి నాలవపాలు మిగులునట్లు కషాయముగాచి వడియగట్టి యందు ఆరెపూలచూర్ణము ఇరువదిపలములు, బెల్లము నూఱుపలములువైచి యాకుండమూతిని బిగించి చీలమన్ను లేపనముజేసి యొకమాసంబుంచవలయును. ఇదియ కుటజారిష్ట మనంబడు. దీని సేవించిన సమస్తజ్వరములు నశించుటయగాక అగ్నిదీపనము గలుగును.

### విద్రధులకు విడంగారిష్టము.

విడఙ్గం గ్రంథికం రాస్నా కుటజత్వక్ఫలాని చ. 47
పాఠైలావాలుకం ధాత్రీభాగాన్పంచపలాన్పృథక్,
అష్టద్రోణేఽమ్భసః పక్త్వా కుర్యాద్ద్రోణావశేషితమ్. 48
పూతశీతే క్షిపేత్తత్ర క్షౌద్రం పలశతత్రయం,
ధాతకీ వింశతిపలం త్రిజాతం ద్విపలం తథా. 49
ప్రియఙ్గుకాఞ్చనారాణాం సలోధ్రాణాం పలం పలం,
వ్యోషస్య చ పలాన్యష్టౌ చూర్ణీకృత్య ప్రదాపయేత్. 50
ఘృతభాణ్డే వినిక్షిప్య మాసమేకం విధారయేత్,
తతః పిబేద్యథాగ్నిం చ జయేద్విద్రధిముచ్ఛ్రితమ్. 51

ఊరుస్తమ్భాశ్మరీమేహాన్ ప్రత్యష్ఠీలాభగన్దరాన్,
గణ్డమాలాన్ హనుస్తమ్భం విడఙ్గారిష్టసంజ్ఞితః. 52

వాయువిళంగములు, మోడి, సన్నరాస్న, కొడిశపాలపట్ట, కొడిశపాలవిత్తులు, విషబొద్ది, కూంతురుబుడమ, ఉసిరికయొలుపు వీనిని ప్రత్యేకము ఐదుపలముల చొప్పున గ్రహించి నలియఁగొట్టి యందు ఎనిమిదిద్రోణముల నీరుఁబోసి ఎనిమిదవభాగము మిగులునట్లు కషాయముగాచి వడియగట్టి చల్లారినపిదప యందు తేనె మున్నూఱుపలములు, ఆతెపూలచూర్ణము ఇరువదిపలములు, లవంగపుపట్ట, ఏలకులు, లవంగపుపత్రి వీనిచూర్ణము ప్రత్యేకము రెండుపలములు, ప్రేంకణపువేళ్లు, దేవకాంచనపట్ట, లొద్దుగపట్ట వీనిచూర్ణము ప్రత్యేకమొకపలము, సొంటి, పిప్పలి, మిరియాలు వీనిచూర్ణము ప్రత్యేక మెనిమిదిపలములు వైచి వీనినంతయుఁ నేతితో మాగిన కుండయందు బోసి దానిమూంతిని బిగించి చీలమన్ను లేపనముచేసి యొకమాసం బుంచవలయును. ఇదియ విడంగారిష్టమనంబడు. దీనిని అగ్నిబలానుసారముగ సేవించిన ప్రబలమగు విద్రధిరోగము, ఊరుస్తంభవాతము, అశ్మరి, ప్రమేహము, ప్రత్యష్ఠీలవాతము, భగందరము, గండమాల, హనుస్తంభవాతమునశించును.

## ప్రమేహములకు దేవదార్వాద్యరిష్టము.

తులార్ధం దేవదారుస్స్యాద్వాసా చ పలవింశతిః,
మఞ్జిష్ఠేన్ద్రయవా దన్తీ తగరం రజనీద్వయమ్. 53
రాస్నాక్రిమిఘ్నం ముస్తం చ శిరీషం ఖదిరార్జునౌ,
భాగాన్ దశపలాన్ దద్యాద్యవాన్యా వత్సకస్య చ. 54
చన్దనస్య గుడూచ్యాశ్చ రోహిణ్యాశ్చిత్రకస్య చ,
భాగానష్టపలానేతానష్టద్రోణేఽమ్భసః పచేత్. 55
ద్రోణశేషకషాయే చ పూతే శీతే ప్రదాపయేత్,
ధాతక్యాష్షోడశపలం మాక్షికస్య తులాత్రయమ్. 56
వ్యోషస్య ద్విపలం దద్యాత్త్రిజాతం చ చతుఃపలం,
చతుఃపలం ప్రియఙ్గుశ్చ ద్విపలం నాగకేసరమ్. 57
సర్వాణ్యేతాని సంచూర్ణ్య ఘృతభాణ్డే విధారయేత్,
మాసాదూర్ధ్వం పిబేదేతం ప్రమేహం హన్తి దుర్జయమ్. 58
వాతరోగాన్ గ్రహణ్యర్శోమూత్రకృచ్ఛ్రాణి నాశయేత్,
దేవదార్వాదికోరిష్టః కణ్డూకుష్ఠవినాశనః. 59

దేవదారు ఏబదిపలములు, అడ్డసరము ఇరువదిపలములు, మంజిష్ఠ, కొడిశపాలవిత్తులు, నేపాలపువేళ్లు, గ్రంధితగరము, పసుపు, మ్రానిపసుపు, సన్నరాస్న, వాయువిడం

గములు, తుంగముస్తలు, దిరిసెన, చంద్ర, మద్ది ఇవి ప్రత్యేకము పదిపలములు, ఓమము, కొడిసెపాల, శ్రీగంధము, తిప్పతీఁగ, కటుకరోహిణి, చిత్రమూలము ఇవి ప్రత్యేకము ఎనిమిదిపలములు ఇటుల వీనినెల్ల నలియఁగొట్టి యందు ఎనిమిది ద్రోణముల యుదకముఁ బోసి ఎనిమిదవపాలు మిగులునట్లు కషాయముగాచి వడియగట్టి చల్లారినపిదప ఆజెపూల చూర్ణము పదునాఱుపలములు, తేనె మున్నూఱుపలములు, సొంటి, పిప్పళ్లు, మిరియాలు ఇవి ప్రత్యేకము రెండుపలములు, లవంగపుపట్ట, ఏలకులు, లవంగపుపత్రి వీనిచూర్ణము ప్రత్యేకము నాలుగుపలములు, ప్రేంకణపువేళ్లు నాలుగుపలములు, నాగకేసరములు రెండుపలములు వీనినన్నిటిని నేతితోమాగిన కుండయందువైచి దానిమూఁతిని బిగించి చీలమన్ను లేపనముచేసి యొకమాసము ఉంచవలయును. ఇదియ దేవదార్వాద్యరిష్ట మనంబడును. దీని సేవించిన ప్రబలమగు ప్రమేహములు, వాతరోగములు, సంగ్రహణులు, మూలవ్యాధులు, మూత్రకృచ్ఛ్రము, దురద, కుష్ఠము నశించును.

## కుష్ఠాదులకు ఖదిరారిష్టము.

ఖదిరస్య తులార్ధం తు దేవదారు చ తత్సమం,
వాకుచీ ద్వాదశపలా దార్వీ స్యాత్పలవింశతిః. 60
త్రిఫలా వింశతిపలాన్యష్టద్రోణేఽమ్భసః పచేత్,
కషాయే ద్రోణశేషే చ పూతే శీతే వినిక్షిపేత్. 61
తులాద్వయం మాక్షికస్య తులైకా శర్కరా మతా,
ధాతక్యా వింశతిపలం కఙ్కోలం నాగకేసరమ్. 62
జాతీఫలలవఙ్గైలాత్వక్పత్రాణి పృథక్ పృథక్,
పలోన్మితాని కృష్ణాయా దద్యాత్పలచతుష్టయమ్. 63
ఘృతభాణ్డే వినిక్షిప్య మాసాదూర్ధ్వం పిబేత్తతః,
మహాకుష్ఠాని హృద్రోగం పాణ్డురోగార్బుదం తథా. 64
గుల్మం గ్రన్థిక్రిమీన్ శ్వాసం కాసం ప్లీహోదరం తథా.
ఏష వై ఖదిరారిష్టస్సర్వకుష్ఠనివారణః. 65

చండ్ర ఏబదిపలములు, దేవదారు యేబదిపలములు, బావంచివిత్తులు పండ్రెండు పలములు, మ్రానిపసుపు ఇరువదిపలములు, త్రిఫలములు ఇరువదిపలములు ఇటుల వీనిని నలియగొట్టి యందు ఎనిమిదిద్రోణముల యుదకముబోసి ద్రోణప్రమాణ ముదకము మిగులునటుల కషాయముగాచి వడియగట్టి చల్లారినపిదప యందు తేనె రెండువందలపలములు, పంచదార నూఱుపలములు, ఆజెపూలచూర్ణము ఇరువదిపలములు, తక్కోలములు, నాగకేసరములు, జాజికాయలు, లవంగములు, ఏలకులు, లవంగపుపట్ట, లవంగపుపత్రి

చూర్ణము ప్రత్యేకమొక్కొకపలము, పిప్పలిచూర్ణము నాల్గుపలములువైచి నేతితో
గిన కుండయందుబోసి దానిమూతిని బిగించి చీలమన్ను లేపనముజేసి యొకమాసం
చవలయు. ఇదియ ఖదిరారిష్టమనంబడు. దీనిసేవించిన మహాకుష్ఠములు, హృద్రోగము,
ండురోగము, అర్బుదము, గుల్మము, గ్రంథులు, కృమిరోగము, ఉబ్బసము, దగ్గు,
్లోదరము, సమస్తకుష్ఠములు నశించును.

క్షయాదులకు బబ్బులారిష్టము.

తులాద్వయం చ బబ్బుల్యాశ్చతుర్ద్రోణే జలే పచేత్,
ద్రోణశేషే రసే శీతే గుడస్య త్రితులాం క్షిపేత్. 66
ధాతకీం షోడశపలాం కృష్ణాం చ ద్విపలాం తథా,
జాతీఫలాని కంకోలమేలాత్వక్పత్రకేసరమ్. 67
లవఙ్గం మరిచం చైవ పలికాన్యుపకల్పయేత్,
మాసం భాణ్డే స్థితస్త్వేష బబ్బులారిష్టకో జయేత్. 68
క్షయం కుష్ఠమతీసారం ప్రమేహశ్వాసకాసనుత్,

రెండువందలపలముల నల్లతుమ్మపట్టను దెచ్చి నలియఁగొట్టి యందు నాల్గు ద్రోణ
నీళ్లుబోసి ద్రోణప్రమాణ ముదకము మిగులునట్లు కషాయముగాచి వడియగట్టి
రిన పిదప యందు బెల్లము మూఁడువందలపలములు, ఆరెపూలచూర్ణము పదియాఱు
ులు, పిప్పలిచూర్ణము రెండుపలములు, జాజికాయలు, తక్కోలములు, ఏలకులు,
గపుపట్ట, లవంగపుపత్రి, నాగకేసరములు, లవంగములు, మిరియాలు వీనిచూర్ణము
త్యేక మొకపలముచొప్పున వైచి కుండలోబోసి దానిమూఁతిని బంధించి చీలమన్ను
ముచేసి యొకమాసం బుంచవలయు. ఇదియ బబ్బులారిష్ట మనంబడు. దీనిసేవించిన
రోగము, కుష్ఠము, అతిసారము, ప్రమేహము, దగ్గు, ఉబ్బసము నశించును.

ఉరఃక్షతాదులకు ద్రాక్షారిష్టము.

ద్రాక్షాతులార్ధం ద్విద్రోణేజలస్య విపచేత్సుధీః. 69
పాదశేషే కషాయే చ పూతే శీతే వినిక్షిపేత్,
గుడస్య ద్వితులాం తత్ర త్వగేలాపత్రకేసరమ్. 70
ప్రియఙ్గుర్మరిచం కృష్ణా విడఙ్గం చేతి చూర్ణయేత్,
పృథక్పలోన్మితైర్భాగైస్తతో భాణ్డే నిధాపయేత్. 71
సమన్తతో ఘాటయిత్వా పిబేజ్జాతరసం తతః,
ఉరఃక్షతం క్షయం హన్తి కాసశ్వాసగలామయాన్. 72
ద్రాక్షారిష్టాహ్వయః ప్రోక్తో బలకృన్మలశోధనః,

ద్రాక్షను ఏబదిపలములు గ్రహించి యందు రెండుద్రోణముల యుదకముఁబోసి నాలవపాలు మిగులునట్లు కషాయముగాచి వడియగట్టి చల్లారినపిదప యందు బెల్లము రెండువందలపలములు, లవంగపుపట్ట, ఏలకులు, లవంగపుపత్రి, నాగకేసరములు, ప్రేంకణపువేరు, మిరియాలు, పిప్పళ్లు, వాయువిళంగములు వీనిచూర్ణము ప్రత్యేక మొకపలము చొప్పున వైచి కుండలోఁ బోసి దానిమూతిని బిగించి చీలమన్ను లేపనముచేసి యొక మాసంబైనను పక్షంబైనను నునిచి పక్వమైనపిదప చీలమన్నుదీసి యందలి యౌషధమును సేవించిన ఉరఃక్షతము, క్షయరోగము, దగ్గు, ఉబ్బసము, కంఠరోగము నశించుటయేకాక దేహమునకు బలము గలిగి చక్కఁగ మలము వెడలును. ఇదియే ద్రాక్షారిష్ట మనంబడును.

## అర్శఆదులకు రోహితారిష్టము.

రోహీతకతులామేకాం చతుర్ద్రోణే జలే పచేత్. 73
పాదశేషే రసే శీతే పూతే పలశతద్వయం,
దద్యాద్గుడస్య ధాతక్యాః పలషోడశికా మతా. 74
పఞ్చకోలం త్రిజాతం చ త్రిఫలాం చ వినిక్షిపేత్,
చూర్ణయిత్వా పలాంశేన తతో భాణ్డే నిధాపయేత్. 75
మాసాదూర్ధ్వం చ పిబతాం గుడజా యాన్తి సంక్షయం,
గ్రహణీపాణ్డుహృద్రోగం ప్లీహగుల్మోదరాణి చ. 76
కుష్ఠశోఫారుచిహరః రోహితారిష్టసంజ్ఞితః,

నూఱుపలములు మోదుగపట్టను గ్రహించి నలియగొట్టి యందు నాల్గుద్రోణముల యుదకముబోసి నాలవపాలు మిగులునట్లు కషాయముగాచి వడియగట్టి చల్లారినపిదప అందు బెల్లము రెండువందలపలములు, ఆరెపూలచూర్ణము పదియాఱుపలములు, పిప్పళ్లు, చవ్యము, మోడి, చిత్రమూలము, సొంటి, లవంగపుపట్ట, ఏలకులు, లవంగపుపత్రి, త్రిఫలములు వీనిచూర్ణము ప్రత్యేక మొక్కొకపలము చొప్పున వైచి కుండలోఁ బోసి దానిమూతిని బిగించి చీలమన్ను లేపనముజేసి యొకమాసంబుంచవలయు. ఇదియ రోహితారిష్ట మనంబడు. దీనిసేవించిన మూలవ్యాధి, సంగ్రహణి, పాండురోగము, హృద్రోగము, ప్లీహము, గుల్మము, ఉదరరోగము, కుష్ఠము, వాపు, అరుచి నశించును.

## క్షయప్రమేహాదులకు దశమూలారిష్టము.

పర్ణా బృహత్యౌ గోకణ్టో బిల్వోఽగ్నిమన్థశోరలుః. 77
పాటలా కాశ్మరీ చేతి దశమూలమిహోచ్యతే,
దశమూలాని కుర్వీత భాగైః పఞ్చపలైః పృథక్. 78

పఞ్చవింశత్పలం కుర్యాచ్చిత్రకం పౌష్కరం తథా,
కుర్యాద్వింశత్పలం లోధ్రం గుడూచీ తత్సమా భవేత్. 79
పలైష్షోడశభిర్ధాత్రీ రవిసఙ్ఖ్యైర్దురాలభా,
ఖదిరో బీజసారశ్చ పథ్యా చేతి పృథక్పలైః. 80
అష్టభిర్గణితా కుష్ఠం మఞ్జిష్ఠా దేవదారు చ,
విడంగం మధుకం భార్గీ కపిత్థోక్షః పునర్నవా. 81
చవ్యం మాంసీ ప్రియఙ్గుశ్చ సారిబా కృష్ణజీరకః,
త్రివృతా రేణుకా రాస్నా పిప్పలీ క్రముకస్సఠీ. 82
హరిద్రా శతపుష్పా చ పద్మకం నాగకేసరం,
ముస్తమిన్ద్రయవాశ్శృఙ్గీ జీవకర్షభకౌ తథా. 83
మేదా చాన్యా మహామేదా కాకోల్యౌ ఋద్ధివృద్ధికే,
కుర్యాత్పృథగ్ద్విపలికాన్పచేదష్టగుణే జలే. 84
చతుర్థాంశం శృతం నీత్వా మృద్భాణ్డే సన్నిధాపయేత్,
చతుష్షష్టిపలాం ద్రాక్షాం పచేన్నీరే చతుర్గుణే. 85
త్రిపాదశేషం శీతం చ పూర్వక్వాథే శృతం క్షిపేత్,
ద్వాత్రింశత్పలికం క్షౌద్రం దద్యాద్గుడచతుశ్శతమ్. 86
త్రింశత్పలాని ధాతక్యాః కఙ్కోలం జలచన్దనం,
జాతీఫలం లవఙ్గం చ త్వగేలాపత్రకేసరమ్. 87
పిప్పలీచేతి సంచూర్ణ్య భాగైర్ద్విపలికైః పృథక్,
శాణమాత్రా చ కస్తూరీ సర్వమేకత్ర నిక్షిపేత్. 88
భూమౌ నిఖాతయేద్భాణ్డం తతో జాతరసం పిబేత్,
కతకస్య ఫలం క్షిప్త్వా రసం నిర్మలతాం నయేత్. 89
గ్రహణీమరుచిం శ్వాసం కాసం గుల్మం భగన్దరం,
వాతవ్యాధిం క్షయం ఛర్దిం పాణ్డురోగం చ కామలామ్. 90
కుష్ఠాన్యర్శాంసి మేహాంశ్చ మన్దాగ్నిముదరాణి చ,
శర్కరామశ్మరీం మూత్రకృచ్ఛ్రం ధాతుక్షయం జయేత్. 91
కృశానాం పుష్టిజననో వన్ధ్యానాం గర్భదః పరః,

అరిష్టో దశమూలాఖ్యస్తేజశ్శుక్ర బలప్రదః. 92

ఇతి శ్రీదామోదరసూనుశార్ఙ్గధరవిరచితాయాం సంహితాయాం
మధ్యమఖండే చికిత్సాస్థానే ఆసవారిష్టకల్పనానామదశమోఽధ్యాయః.

కోలపొన్న, నక్కతోకపొన్న, వాకుడు, ములక, పల్లేరు, మారేడు, కూరనెల్లి, దుందిలము, పాదిరి, గుమ్ముడు ఇవి దశమూలములని పరంగు. ఇవి ప్రత్యేక మైదుపలములు, చిత్రమూలము ముప్పదైదుపలములు, పుష్కరమూలము, ముప్పదైదుపలములు, లొద్దుగ ముప్పదిపలములు, తిప్పతీగ ముప్పదిపలములు, ఉసిరికయొలుపు పదియాఱుపలములు, దురదగొండి పన్రెండుపలములు, చంద్రచేవ ఎనిమిదిపలములు, కరకకాయలు ఎనిమిది పలములు, చెంగల్వకోష్టు, మంజిష్ఠ, దేవదారుపట్ట, వాయువిళంగములు, అతిమధురము, గంటుభారంగి, వెలగపట్ట, తానికాయలు, గలిజేరు, చవ్యము, జటామాంసి, ప్రేంకణపు వ్రేళ్లు, సుగంధిపాల, నల్లజీలకఱ్ఱ, తెగడ, రేణుకలు, సన్నరాస్న, పిప్పళ్లు, పోకలు, కచోరములు, పసుపు, పెద్దసోపు, పద్మకములు, నాగకేసరములు, తుంగముస్తలు, కొడిశ పాలవిత్తులు, కర్కాటకశృంగి, జీవకము, ఋషభకము, మేద, మహామేద, కాకోలి, క్షీరకాకోలి, ఋద్ధి, వృద్ధి ఇవి ప్రత్యేకము రెండుపలములు, ఇటుల వీనినెల్ల గ్రహించి కొంచెము నలియఁగొట్టి వీనికెనిమిదిభాగములు నీళ్లుబోసి నాలవపాలు మిగులునట్లు కషాయముగాచి వడియగట్టి, పిదప అఱువదినాలుగుపలముల ద్రాక్షపండు గ్రహించి దీనికి నాలుఁగింతలు నీళ్లుబోసి మూఁడుభాగముల నీరు మిగులునట్లు కషాయముగాచి వడియగట్టి పైకషాయముతోఁ గలిపి యందు తేనె ముప్పదిరెండుపలములు, బెల్లము నాలుగువందల పలములు, ఆరెపూలచూర్ణము ముప్పదిపలములు, తక్కోలములు, వట్టివేళ్లు, శ్రీగంధము, జాజికాయలు, లవంగములు, లవంగపుపట్ట, ఏలకులు, లవంగపుపత్రి, నాగకేసరములు, పిప్పళ్లు వీనిచూర్ణము ప్రత్యేకము రెండుపలములు, కస్తూరి యొకశాణమువైచి కుండ మూతిని బిగించి చీలమన్ను లేపనముజేసి యొకమాసంబైనను, లేక పక్షంబైనను భూమి యందు పూడ్చిపెట్టి పిదప దానియందుండి దీసి పైచీలమన్నుదీసి యందు చిల్లగింజల చూర్ణము గలిపిన తేటయగు. ఇదియ దశమూలారిష్ట మనంబడును. దీనిసేవించిన సంగ్రహణి, అరుచి, ఉబ్బసము, దగ్గు, గుల్మము, భగందరము, వాతరోగము, క్షయరోగము, వమనము, పాండువు, కామెర్లు, కుష్ఠములు, సమస్తమూలవ్యాధులు, ప్రమేహములు, అగ్నిమాంద్యము, ఉదరరోగము, అశ్మరి, మూత్రకృఛ్రము, శుక్రధాతుక్షయము నశించుటయేగాక, దౌర్బల్యముగల మనుష్యులకు శరీరపుష్టిని, తేజస్సును, శుక్రవృద్ధిని, బలంబును, వంధ్యాస్త్రీలకు సంతానంబు గలుగంజేయును.

ఇది శ్రీదామోదరసూను శార్ఙ్గధరవిరచిత సంహితయందు మధ్యమఖండమున
చికిత్సాస్థానమున ఆసవారిష్టకల్పన యనియెడు దశమాధ్యాయము సంపూర్ణము.

---

# ఏకాదశాధ్యాయము.

## స్వర్ణాదిధాతుశోధనమారణవిధి.

స్వర్ణం తారం తామ్రమారం నాగం వఙ్గం చ తీక్ష్ణకం,
ధాతవస్సప్త విజ్ఞేయా స్తతస్తాఞ్ శోధయేద్బుధః. 1
స్వర్ణతారారతామ్రాణాం పత్రాణ్యగ్నౌ ప్రతాపయేత్,
నిషించేత్తప్తతప్తాని తైలే తక్రే చ కాఞ్జికే. 2
గోమూత్రే చ కులుత్థానాం కషాయే చ త్రిధాత్రిధా,
ఏవం స్వర్ణాదిలోహానాం విశుద్ధిస్సమ్ప్రజాయతే, 3
నాగవంగౌ ప్రతప్తౌ చ గలితౌ తౌ నిషేచయేత్,
త్రిధా త్రిధా విశుద్ధిస్స్యాద్రవిదుగ్ధేన చ త్రిధా. 4

బంగారు, వెండి, రాగి, ఇత్తడి, సీసము, తగరము, ఉక్కు (తీక్ష్ణలోహము), నునవి సప్తధాతువులనంబడు. అందు బంగారు, వెండి, ఇత్తడి, రాగి వీనిని పలచని కులుగఁ జేయించి పలుమాఱు నిప్పులో కాచి నూనె, మజ్జిగ, కాంజికము, గోమూ ్రము, ఉలవకషాయము వీనిలో నొక్కొకదానియందు మూఁడుసారులు ముంచిన(అనఁగా గ్నితప్తముచేసిన పిదప పైద్రవములలోముంచుచు మరల తప్తముచేయుచు మరలద్రవ ంలలోను మూఁడుసార్లుముంచిన)నవి శుద్ధియగు. ఈప్రకారము స్వర్ణము మొదలగు ోహముల శుద్ధిఁజేయవలయు. మఱియు, సీసము, తగరము వీనిని కరిగించి తైలము జ్జిగ, కాంజికము, గోమూత్రము, ఉలవకషాయము, జిల్లేడుపాలు-వీనిలో నొక్కొక ానియందును మూఁడుసారులు వరుసగబోసిన నవి శుద్ధియగు.

## స్వర్ణమారణము.

స్వర్ణస్య ద్విగుణం సూతమమ్లేన సహ మర్దయేత్,
తద్గోలకే సమం గన్ధం నిదధ్యాదధరోత్తరమ్. 5
గోలకం చ తతో రుద్ధ్వా శ్చరావే దృఢసంపుటే,
త్రింశద్వనోపలైర్దద్యాత్పుటాన్యేవం చతుర్దశ. 6
నిరుద్ధం జాయతే భస్మ గన్ధో దేయః పునః పునః,

శుద్ధిచేసినబంగారును సన్నముగ చూర్ణము గావించి దానికిరెండింతలు శుద్ధిజేసిన ాదరసమును గలిపి నిమ్మపండ్లరసముచే మర్దించి యుండఁజేసి ఎండనెండించి దానికి

సమంబుగ శుద్ధిచేసిన గంధకచూర్ణమును నొకమూఁకుడులో సగముబోసి దానిపై పైన యొనర్చియుండు గోళకమును బెట్టి దానిపై మిగిలినసగము గంధకచూర్ణమునుబోసి మఱియొకమూఁకుడును బోర్లించి రెంటికిని సంధిబంధనముకావించి, పిదప నొకపల్లము త్రవ్వి దానియందు పదునైదు అడవియేరుపిడకలను పేర్చి అందీసంపుటమును బెట్టి దానిపై మరల పదునైదు అడవిపిరుపిడకలనుచేర్చి పుటంబిడి సాంగశీతలముగ చల్లారినపిదప గ్రహింపవలయును. ఇటుల గంధకయుక్తముగ పదునాల్గుపుటంబులిడిన బంగారునిరుత్థముగ (మరలనేయోషధులచేతనైనను స్వర్ణముగపుట్టని) భస్మంబగు.

అన్యచ్చ — కాఞ్చనే గాలితే నాగం షోడశాంశేన నిక్షిపేత్. 7
చూర్ణయిత్వా తథాఽమ్లేన ఘృష్ట్వా కృత్వా చ గోలకం,
గోలకేన సమం గన్ధం దత్వా చైవాధరోత్తరమ్. 8
శరావసమ్పుటే దత్వా పుటే త్రింశద్వనోపలైః,
ఏవం సప్తపుటైర్హేమ నిరుద్ధం భస్మ జాయతే. 9

శుద్ధిజేసినబంగారును కఱగించి దానికి పదియాఱవభాగము సీసమువైచి చల్లారిన పిదప దానిని చూర్ణముగావించి నిమ్మపండ్లరసముచే మర్దించి యుంటచేసి దానిని యెండ నెండించి దానిని సమభాగముగ శుద్ధిజేసిన గంధకమును మూఁకుడులో సగముబోసి యందుగోళకమునుంచి దానిపై మిగిలిన సగము గంధకమును వైచి పైనమూఁకుడుమూసి చీలమన్నుచే సంధిబంధనముగావించి యొకపల్లములో పదునైదు అడవియేరుపిడకలను పేర్చి యందు శరావసంపుటమును బెట్టి మరల పదునైదు పిరుడుపిడకలను పేర్చి పుటము గావించి స్వాంగశీతలమయిన పిదప దాని గ్రహింపఁదగు. ఇటుల నేడుపుటంబు లిడిన నిర్జీవితముగ బంగారు భస్మంబగు.

అన్యచ. — కాఞ్చనారరసైర్ఘృష్ట్వా సమసూతకగన్ధయోః,
కజ్జలీం హేమపత్రాణి లేపయేత్సమమాత్రయా. 10
కాఞ్చనారత్వచః కల్కైర్మూషాయుగ్మం ప్రకల్పయేత్,
ధృత్వా తత్సమ్పుటే గోలం మృన్మూషాసమ్పుటే చ తత్. 11
నిధాయ సన్ధిరోధం చ కృత్వా సంశోష్య గోమయైః,
వహ్నిం ఖరతరం కుర్యాదేవం దద్యాత్పుటత్రయమ్. 12
నిరుద్ధం జాయతే భస్మ సర్వకార్యేషు యోజయేత్,
కాఞ్చనారప్రకారేణ లాఙ్గలీ హన్తి కాఞ్చనమ్. 13
జ్వాలాముఖీ తథా హన్యాత్తథా హన్తి మనశ్శిలా,

శుద్ధిజేసినరసము, గంధకము రెండును సమముగ గ్రహించి వీనిని మర్దించిన కజ్జలి ఏను. ఈకజ్జలిని, దేవకాంచనపుపట్ట రసముచే నూరి, కజ్జలికి సమభాగముగ బంగారు లను గ్రహించి సన్నగ కత్తిరించి యాకజ్జలిలో గలిపి ఉంటజేసి ఎండనెండించి, దేవకాంచనపుపట్టను నూరి దానిచే రెండుమూసలుజేసి యందాబంగరుయుండ చి రెండుమూసలకు మధ్యను సందులేకుండునటుల దేవకాంచనపుకల్కమును బూసి పై గోమయమునుబూసి యెండించి పిదప దీని మూకుళ్లలో నునిచి చీలమన్ను లేప జేసి యెండించి ఏరుకిడకలతో పైజెప్పినప్రకారము గజపుటంబిడవలయు. ఇటుల దుగజపుటంబులిడిన నిర్జీవితముగ బంగారు భస్మంబగు. దీని సర్వరోగంబులయందును యోగింపఁదగు. ఇదేప్రకారము బంగారు లాంగలియను వనస్పతిచేతను, జ్వాలాముఖి మవృక్షముచేతను, మణిశిలచేతను భస్మంబగు.

న్యచ్చ.—శిలాసిందూరయోశ్చూర్ణం సమయోరర్కదుగ్ధకైః. 14
సప్తైవ భావనా దద్యాచ్ఛోషయేచ్చ పునఃపునః,
తతస్తు గలితే హేమ్ని కల్కో౽యం దీయతే సమః. 15
పునర్ధమేదతితరాం యథాకల్కో విలీయతే,
ఏవం వేలాత్రయం దద్యాత్కల్కం హేమమృతిర్భవేత్. 16

మణిశిల, సిందూరము వీనిని సమముగ గ్రహించి చక్కగచూర్ణముచేసి దీనిని ల్లేడుపాలతో భావనఁజేసి ఎండించవలయు. ఇటుల జిల్లేడుపాలతో ఏడుమాఱులు వనజేసి ఎండించి చూర్ణముచేసి పిదప శుద్ధిజేసిన బంగారును కఱగించి దానికిసమముగ భావనజేసిన మణిశిలాసిందూరములను జిల్లేడుపాలతో కల్కముచేసి యందు వైచి ాకల్కము బంగారులో లీనమగువఱకు కొలిమితిత్తితోఁ జక్కగనూదవలయు. ఇటుల మ్మాఱుచేసిన బంగారు భస్మంబగు.

న్యచ్చ —పారావతమలైర్లిప్తాన్యథ వా కుక్కుటోద్భవైః,
హేమపత్రాణి తేషాం చ ప్రదద్యాదధరోత్తరమ్. 17
గన్ధచూర్ణం సమం దత్వా శరావయుగసమ్పుటే,
ప్రదద్యాత్కుక్కుటపుటం పంచభిర్గోమయోపలైః. 18
ఏవం నవపుటాన్ దద్యాద్దశమం చ మహాపుటం,
త్రింశద్వనోపలైర్దేయం జాయతే హేమ భస్మకమ్ 19
సువర్ణం చ భవేత్స్వాదు తిక్తం స్నిగ్ధం హిమం గురు,
బుద్ధివిద్యాస్మృతికరం విషహారి రసాయనమ్. 20

శుద్ధిజేసిన బంగారు రేకులకు పావురముయొక్క మలమునైనను, లేక కోడిమ
నైనను లేపనముజేసి యెండనెండించి .దానికి సమభాగముగ శుద్ధిజేసిన గంధకపు
మును నొకమూఁకుడులో సగముబోసి దానిపై రేకులనుబఱచి దానిపై మిగిలిన
మును వైచి యందుపై మఱియొకమూఁకుడు బోర్లించి చీలమన్ను లేపనము జేసి
యగు ఐదు ఆవుపేడయొక్క పిరుపిడకలచే కుక్కుటపుటం బిడవలయు. ఇటులఁ
మాఱులు పుటంబిడి పదియవపుటంబున పెద్దవియగు ముప్పది ఆవుపేడ పిరుపిడక
పుటంబిడవలయును. అటుల పుటంబిడిన బంగారు భస్మంబగు. ఇది మధురముగను,
ముగను, స్నిగ్ధముగను, శీతవీర్యంబుగను, గురుగుణముగలదిగను, బుద్ధి, విద్యా, స్మృతి
గలుగంజేయుచు విషబాధలను నశింపజేయుచుండు. ఇది రసాయనమని చెప్పంబడు

## రజతమారణము.

భాగైకం తాలకం మర్ద్యం యామమమ్లేన కేనచిత్.
తేన భాగత్రయం తారపత్రాణి పరిలేపయేత్.
ధృత్వా మూషాపుటే రుద్ధ్వా పుటే త్రింశద్వనోపలైః,
సముద్ధృత్య పునస్తాలం దత్వా రుద్ధ్వా పుటే పచేత్.
ఏవం చతుర్దశపుటైస్తారం భస్మ ప్రజాయతే,

శుద్ధిజేసిన తాళకమును ఒకభాగముగ్రహించి నిమ్మపండ్లరసముచే నొకజామముమర్ది
తాళకమునకు మూఁడురెట్లధికముగ శుద్ధిజేసిన వెండిరేకులను గ్రహించి పైతాళకః
వెండిరేకులకు లేపనముజేసి మూకుళ్లయందుంచి యెండనెండించి చీలమన్ను లేపనమ
పల్లముత్రవ్వి యందు పదునైదు అడవి పిరుపిడకలుపేర్చి యందు చీలమన్ను లేపః
జేసి యునిచినసంపుటము నునిచి దాని మరల పదునైదు అడవి పిరుపిడకల పేర్చి ఫ
బిడవలయు. ఇటుల పదునాలుగుపుటంబు లిడిన రజతము నిర్జీవితముగ భస్మంబగు.

అన్యచ్చ.—స్నుహిక్షీరేణ సమ్పిష్టం మాక్షీకం తేన లేపయేత్.
తాళకస్య ప్రకారేణ తారపత్రాణి బుద్ధిమాన్,
పచేచ్చతుర్దశపుటైస్తారం భస్మ ప్రజాయతే.

శుద్ధిజేసిన స్వర్ణమాక్షికమును ఒకభాగముగ్రహించి దానిని జెముడుపాల
నొకజాము మర్దించి స్వర్ణమాక్షికమునకు మూఁడురెట్లధికముగ శుద్ధిజేసిన వెండిరేకు
గ్రహించి వానికి పైమాక్షికమును లేపనముజేసి ఎండనెండించి మూకుళ్లయందునిచి స
బంధనము గావించి క్రమప్రకారముగ ముప్పది పిరుపిడకలతో పుటంబిడవలయు. ఇట
పదునాలుగు పుటంబులిడిన రజతము నిర్జీవితముగ భస్మంబగు.

## తామ్రమారణము.

సూక్ష్మాణి తామ్రపత్రాణి కృత్వా సంస్వేదయేద్బుధః.
వాసరత్రయమమ్లేన తతః ఖల్వే వినిక్షిపేత్. 25
పాదాంశం సూతకం దత్వా యామమమ్లేన మర్దయేత్,
తత ఉద్ధృత్య పత్రాణి లేపయేద్ద్విగుణేన చ. 26
గన్ధకేనామ్లఘృష్టేన తచ్చ కుర్యాచ్చ గోలకం,
తతః పిష్ట్వా చ మీనాక్షీం చాఙ్గేరీం వా పునర్నవామ్. 27
తత్కల్కేన బహిర్గోళం లేపయేదఙ్గుళోన్మితం
ధృత్వా తద్గోలకం భాణ్డే శరావేణ చ రోధయేత్. 28
వాలుకాభిః ప్రపూర్యాథ విభూతిలవణామ్బుభిః,
దత్వా భాణ్డముఖే ముద్రాం తతశ్చుల్ల్యాం విపాచయేత్. 29
క్రమవృద్ధాగ్నినా సమ్యగ్యావద్యామచతుష్టయం,
స్వాంగశీతలముద్ధృత్య మర్దయేత్సూరణద్రవైః. 30
దినైకం గోలకం కుర్యాదర్ధగన్ధేన లేపయేత్,
సఘృతేన తతో మూషాపుటే గజపుటే పచేత్. 31
స్వాఙ్గశీతం సముద్ధృత్య మృతం తామ్రం శుభం భవేత్.
వాన్తిభ్రాన్తిక్లమం మూర్ఛాం న కరోతి కదాచన. 32

శుద్ధిజేసినతామ్రమును పలచనగ రేకులుజేసి సన్నగ కత్తిరించి నిమ్మపండ్లరసంబున
మందాగ్నిచే మూఁడుదినములు ఉడికించి యందుండి యారేకులను బైటికిదీసి
ః నాలవభాగము పాదరసము వైచి ఖల్వమున నిమ్మపండ్లరసముచే నొకయామము
కలను మర్దించి పిదప వానిని బైటతీసి దీనికి రెండింతలు గంధకమును నిమ్మపండ్ల
ంచే నూరి యారేకులకు లేపనముచేసి వానిని యుండగ(చుట్టగ) చేయవలయును.
పొన్నగంటి ఆకు, పులిచింతయాకు, తెల్లగలిజేరు వీనిలో దేనినైనను నూరి నా
ంటకుపైన అంగుళప్రమాణముపూసి ఎండనెండించి కుండలోనుంచి ఉండపైన
కుఁడు బోర్లించి దానిపై కుండమూతివఱకు ఇసుకబోసి దానిపై మూఁకుడు బోర్లించి
ఁదె, ఉప్పు వీనిని నీటితో నూరినచీలమన్ను లేపనముజేసి క్రమముగ లఘు, మధ్య,
ాగ్నులచే నాలుగుజాములు వండి సాంగశీతలమున నాయుండను గ్రహించి, అడవి
రసముతో ఒకదినము మర్దించి ముద్దజేసి దీనికి సగము గంధకము గ్రహించి దానిని
తో మర్దించి ఆయుండకుపైన లేపనముఁజేసి మంటిమూకుళ్లలో నుంచి చక్కగ

చీలమన్ను జేసి అడవి పిడకలతో గజపుటంబిడి సాంగశీతలమున గ్రహింపవలయు. ఇటుల జేయబడిన తామ్రభస్మము, వాంతులు, భేదులు, ఆయాసము, మూర్ఛ వీనితో రహితంబై చాలగుణము గలుగంజేయును.

## ఆర (ఇత్తడి) మారణము.

అర్కక్షీరేణ సమ్పిష్టో గన్ధకస్తేన లేపయేత్,
సమేనారస్య పత్రాణి శుద్ధాన్యమ్లద్రవైర్ముహుః. 33
తతో మూషాపుటే ధృత్వా పుటేద్గజపుటేన చ,
ఏవం పుటద్వయేనైవ భస్మారం భవతి ధ్రువమ్, 34
ఆరవత్కాంస్యమప్యేవం భస్మతాం యాతి నిశ్చితం,
అర్కక్షీరం వటక్షీరం నిర్గుణ్డీక్షీరికా తథా. 35
తామ్రరీతిధ్వనివధే సమగన్ధకయోగతః,

ఇత్తడిని పలచనగ రేకులఁజేసి నిప్పులో కాచి నిమ్మపండ్లరసములో నేడుమాఱు లైనను లేక, మూఁడుమాఱులైనను ముంచి శుద్ధిజేసి వానికి సమముగ గంధకమును జిల్లేడు పాలతోనూరి యాయిత్తడిరేకులకు లేపనముజేసి ప్రమిదెలయందునిచి ఎండనెండించి చీలమన్ను లేపనముజేసి అడవి పిడకలతో గజపుటంబిడవలయు. ఇటుల రెండు గజ పుటంబు లిడిన ఇత్తడి నిర్జీవితముగ భస్మంబగు. ఇత్తెఱంగుననే కంచునుకూడ భస్మము చేయందగు. లేక, రాగి, ఇత్తడి, కంచు వీనిని నిమ్మపండ్లరసముతో శుద్ధిజేసి వానికి సమముగ గంధకము, జిల్లేడుపాలు, మఱ్ఱిపాలు, నల్లవావిలియాకురసము, మేకపాలు వీనిలో దేనిచేతనైనను నూరి వానికి వేర్వేఱుగ లేపనముఁజేసి అడవి పిడకలతో రెండుపుటంబు లిడిన రాగి, ఇత్తడి, కంచు ఇవి భస్మంబగు.

## సీసమారణము.

తామ్బూలీరససమ్పిష్టశ్శిలాలేపాత్పునఃపునః. 36
ద్వాత్రింశద్భిః పుటైర్నాగో నిరుద్ధో యాతి భస్మతాం,

శుద్ధిజేసిన సీసమునకు సమభాగముగ శుద్ధిజేసిన మణిశిలను గ్రహించి యామణి శిలను తమలపాకులరసముతో మర్దించి సీసపురేకులకు లేపనముజేసి ప్రమిదలయందునిచి ఎండనెండించి చీలమన్ను లేపనముఁజేసి అడవిపిడకల పుటంబిడవలయు. ఇటుల ముప్పదిరెండుపుటంబు లిడిన సీసము భస్మంబగు. ఇదియే నాగభస్మంబనఁబడు.

అన్యచ్చ —అశ్వత్థచిఞ్చాత్వక్చూర్ణం చతుర్థాంశేన నిక్షిపేత్. 37
మృత్పాత్రే ద్రావితే నాగే లోహదర్వ్యా ప్రచాలయేత్,
యామైకేన భవేద్భస్మ తత్తుల్యాం చ మనశ్శిలామ్. 38
కాఞ్జికేన ద్వయం పిష్ట్వా పచేద్దృఢపుటేన చ,
స్వాఙ్గశీతం పునః పిష్ట్వా శిలయా కాఞ్జికేన చ. 39
పునః పుటేచ్ఛరావాభ్యామేవం షష్టిపుటైర్మృతిః,

శుద్ధిజేసిన నల్లసీసమును యొకమృత్పాత్రంబునవైచి కఱగించి దానికి చతుర్థాంశముగ రావిపట్టచూర్ణమును, చింతపట్టచూర్ణమును గ్రహించి యందు గొంచెము కొంచెముగ వేయుచు ఇనుపగరిటెతో యామపర్యంతము మర్దించుచుండిన నల్లసీసము భస్మంబగు. పిదప దీనికి సమముగ శుద్ధిజేసిన మణిశిలను సీసభస్మముతో చేర్చి కాంజికముతో మర్దించి ప్రమిదెలయం దునిచి యొండనెండించి చీలమన్ను లేపనముచేసి అడవి ఏరుపిడకలతో గజపుటంబిడి సాంగశీతలమున గ్రహింపవలయు. ఇత్తెఱంగుననే సీసభస్మమునకు సమభాగముగ శుద్ధిజేసిన మణిశిలనుజేర్చి కాంజికముచే నూరి పైజెప్పినప్రకారము ప్రమిదెలయం దునిచి ఎండించి చీలమన్నులేపనముజేసి అఱువది పుటంబు లిడిన నల్లసీసము నిర్జీవితముగ భస్మంబగు.

## వంగమారణము.

మృత్పాత్రే ద్రావితే వఙ్గే చిఞ్చాశ్వత్థత్వచో రజః. 40
క్షిప్త్వా తేన చతుర్థాంశమయోదర్వ్యా ప్రచాలయేత్,
తతో ద్వియామమాత్రేణ వఙ్గభస్మ ప్రజాయతే. 41
అథ భస్మసమం తాలం క్షిప్త్వామ్లేన విమర్దయేత్,
తతో గజపుటే పక్త్వా పునరమ్లేన మర్దయేత్. 42
తాలేన దశమాంశేన యామమేకం తతః పుటేత్,
ఏవం దశపుటైః పక్వో వఙ్గస్తు మ్రియతే ధ్రువమ్. 43

శుద్ధిజేసిన తెల్లసీసమును మృత్పాత్రంబునవైచి కరిగించి దానికి చతుర్థాంశముగ చింతపట్టచూర్ణమును, రావిపట్టచూర్ణమును గ్రహించి యందు కొంచెముకొంచెముగ చల్లుచు ఇనుపగరిటెతో రెండుయామములు మర్దించుచుండిన తెల్లసీసము భస్మంబగు. ఈ భస్మమునకు సమముగ శుద్ధిజేసిన తాళకమునుచేర్చి నిమ్మపండ్లరసముతో మర్దించి ప్రమిదెలయందునిచి యొండనెండించి చీలమన్నులేపనముఁజేసి అడవి ఏరుపిడకలతో గజపుటంబిడి సాంగశీతలమున గ్రహించి యాభస్మమునకు పదియవభాగము శుద్ధిజేసిన తాళకమునుజేర్చి

మరల నిమ్మపండ్లరసముతో నొకయామము ఖల్వమున మర్దించి ప్రమిదెయందునిచియెం
డెండించి చీలమన్ను లేపనము జేసి గజపుటం బిడవలయు. ఇటుల పదిగజపుటంబు లిడిన తె
సీసము నిర్జీవితముగ భస్మంబగు (తెల్లసీసమునే వంగమనియెదరు).

## లోహమారణము.

శుద్ధం లోహభవం చూర్ణం పాతాలగరుడీరసైః,
మర్దయిత్వా పుటేద్వహ్నౌ దద్యాదేవం పుటత్రయమ్. 44
పుటత్రయం కుమార్యాశ్చ కుఠారచ్ఛిన్నకారసైః,
పుటషట్కం తతో దద్యాదేవం తీక్ష్ణమృతిర్భవేత్. 45

శుద్ధిజేసినలోహమును చూర్ణముచేసి దూసరితీఁగరసముతో నూరి ఎండించి మూ
ళ్లయం దునిచి చీలమన్ను లేపనముఁజేసి అడవి ఏరుపిడకలతో మూఁడుగజపుటంబులును
కలబందరసముతో మూఁడు గజపుటంబులును, అడవితులసిరసముతో ఆఱుగజపుటంబు
లును వేయవలయు. ఇటుల పండ్రెండుపుటము లిడిన లోహము నిర్జీవితముగ భస్మంబగు.

అన్యచ్చ.—క్షిపేచ్చ ద్వాదశాంశేన దరదం తీక్ష్ణచూర్ణతః,
మర్దయేత్కన్యకాద్రావై ర్యామయుగ్మం తతః పుటేత్. 46
ఏవం సప్తపుటైర్మృత్యుం లోహచూర్ణమవాప్నుయాత్,
రసైః కుఠారఛిన్నాయాః పాతాళగరుడీరసైః. 47
స్తన్యేన చార్కదుగ్ధేన తీక్ష్ణస్యైవ మృతిర్భవేత్,

శుద్ధిజేసిన లోహచూర్ణమునకు పండ్రెండవభాగము శుద్ధిచేసిన ఇంగిలీకమును జేర్చి
కలబందరసముతో రెండుయామములు మర్దించి ప్రమిదెలయం దునిచి ఎండనెండించి చీల
మన్ను లేపనముఁజేసి అడవి ఏరుపిడకలతో గజపుటంబిడవలయు. ఇటుల ఏడుగజపుటంబు
లిడిన లోహము నిర్జీవితముగ భస్మంబగు. లేక, లోహచూర్ణమును అడవి తులసిరసముచే
ఏడుగజపుటంబులును, దూసరితీఁగరసముచే ఏడుగజపుటంబులును, చనుబాలచే ఏడుగజ
పుటంబులును, జిల్లేడుపాలతో ఏడుగజపుటంబులును వేసిన నిర్జీవితముగ భస్మంబగు.

అన్యచ్చ—సూతకాద్ద్విగుణం గన్ధం దత్వా కుర్యాచ్చ కజ్జలీమ్. 48
ద్వయోస్సమం లోహచూర్ణం మర్దయేత్కన్యకాద్రవైః,
యామయుగ్మం తతః పిణ్డం కృత్వా తామ్రస్య పాత్రకే. 49
ఘర్మే ధృత్వోరుబూకస్య పత్త్రైరాచ్ఛాదయేద్బుధః,
యామార్ధేనోష్ణతా భూయాద్ధాన్యరాశౌ న్యసేత్తతః. 50
దత్వోపరి శరావం తు త్రిదినాన్తే సముద్ధరేత్,
పిష్ట్వా చ గాలయేద్వస్త్రాదేవం వారితరం భవేత్. 51

ఏవం సర్వాణి లోహాని స్వర్ణాదీన్యపి గాలయేత్. 52
శిలాగన్ధార్కదుగ్ధాక్తాస్స్వర్ణాద్యాస్సర్వధాతవః,
మ్రియంతే ద్వాదశపుటైస్సత్యం గురువచో యథా. 53

శుద్ధిజేసినపాదరసము ఒకభాగము, శుద్ధిజేసిన గంధకము రెండుభాగములు ఇటుల వీనిని నూరి కజ్జలిచేసి కజ్జలికిసమముగ లోహచూర్ణమునుచేర్చి కలబందరసములో రెండు యామములు మర్దించి యుంటజేసి దాని నొకరాగిపాత్రయందునిచి దానిపై మూడు, లేక నాలుగు ఆముదపుఆకులుజుట్టి నాలుగుగడియలు తీక్ష్ణమగు యెండ నెండించి యుంట ఉష్ణమైనపిదప దానిపై మూతమూసి మూడుదినములు ధాన్యరాశియందునిచి దాని నాలవదినంబున నందుండి తీసి ఖల్వమున నూరి వస్త్రగాలితమొనర్చి యాచూర్ణమును నీళ్లలోవేసిన నది నీటిపై తేలుచుండు. ఇదేప్రకారము బంగారు మొదలగు సప్తధాతువులను జేయందగు. ఇటులఁ జేసినపిదప పైలోహచూర్ణములో శుద్ధిజేసిన మణిశిలను శుద్ధిచేసిన గంధకమును సగమువైచి జిల్లేడుపాలతోనూరి ప్రమిదెలయందునిచి ఎండనెండించి చీలమన్నుపూసి అడవిపిడకలతో పండ్రెండుగజపుటంబు లిడవలయు. ఇత్తెఱంగుననే సప్తధాతువులను పండ్రెండుగజపుటంబులిడిన నవి భస్మంబగు. దీని గురువాక్యమువలెనే సత్యముగ నమ్మవలయు.

## సప్తోపధాతువుల వివరణము.

మాక్షికం తుత్థకాభ్రే చ నీలాఞ్జనశిలాలకాః,
రసకశ్చేతి విజ్ఞేయా ఏతే సప్తోపధాతవః. 54

స్వర్ణమాక్షికము, మయూరతుత్థము, అభ్రకము, నీలాంజనము (సురమాకాయి), మణిశిల, తాళకము, పాలతుత్థము (కల్కఫరి), ఈ ఏడును ఉపధాతువు లనంబడు.

## స్వర్ణమాక్షికశోధనమారణములు.

మాక్షికస్య త్రయో భాగా భాగైకం సైన్ధవస్య చ,
మాతులుఙ్గద్రవైర్వాథ జమ్బీరోత్థద్రవైః పచేత్. 55
చాలయేల్లోహజే పాత్రే యావత్పాత్రం సులోహితం,
భవేత్తతస్తు సంశుద్ధిం స్వర్ణమాక్షికమృచ్ఛతి. 56
కులుత్థస్య కషాయేణ ఘృష్ట్వా తైలేన వా పుటేత్,
తక్రేణవాఽథ గోమూత్రైర్మ్రియతే స్వర్ణమాక్షికమ్. 57

స్వర్ణమాక్షికము మూడుభాగములు, సైంధవలవణము ఒకభాగము ఇటుల వీనిని చూర్ణముచేసి ఇనుపబాణలిలోవైచి అగ్నియందునిచి యందు మాదీఫలపురసమునైనను, నిమ్మపండ్లరసమునైననుబోసి బాణలి నెఱ్ఱగనగువఱకు ఇనుపగరిటెతో కలియఁబెట్టుచుండిన

స్వర్ణమాక్షికము శుద్ధియగును. పిదప దీనిని ఉలవకషాయముతోనైనను, లేక నువ్వుల నూనెతోనైనను, లేక మజ్జిగతోనైనను, లేక గోమూత్రముతోనైనను నూరి యెండ నెండించి మూకుళ్లయందునిచి చీలమన్ను లేపనముచేసి ఏరుపిడకలతో గజపుటంబిడిన స్వర్ణమాక్షికము చక్కగ భస్మంబగు.

రౌప్యమాక్షికశోధనమారణములు.

కర్కోటీమేషశృఙ్గ్యుత్థద్రవైర్జమ్బీరజైర్దినం,
భావయేదాతపే తీవ్రే విమలా శుధ్యతి ధ్రువమ్. 58

విమలమును డావరడంగిలేఁగెరసముతో నొకదినంబును, ఒద్దికూరరసముతో నొక దినంబును, నిమ్మపండ్లరసముతో నొకదినంబును మర్దించి ప్రతిదినంబును తీవ్రమగుయెండ నెండించిన నది శుద్ధియగు. మఱియు, దీనిని స్వర్ణమాక్షికమువలెనే భస్మముచేయందగు.

మయూరతుత్థ (మైలతుత్థము) శుద్ధి.

విష్ఠయా మర్దయేత్తుత్థం మార్జారకకపోతయోః,
దశాంశం టంకణం దత్వా పచేన్మృదుపుటేతతః. 59
పుటం దధ్నః పుటం క్షౌద్రైర్దేయం తుత్థవిశుద్ధయే,

పిల్లిమలము, పావురపుమలము వీనిని మయూరతుత్థమునకు సమభాగంబులుగను, వెలిగారమును మయూరతుత్థమునకు పదియవభాగంబుగను గ్రహించి ఖల్వమునం బాగుగ మర్దించి యెండనెండించి ప్రమిదెలయందునిచి చీలమన్ను లేపనముజేసి అడవిఏరుపిడకలతో లఘుపుటంబిడి పిదప దానిని పెరుఁగుతో నూఱి పైజెప్పినప్రకారము మరల లఘుపుటం బిడవలయు. ఇదేప్రకారము తేనెతో నూఱి పుటంబిడవలయు. ఇటులఁజేసిన మయూరతుత్థము శుద్ధియగు.

కృష్ణాభ్రకశోధనమారణములు.

కృష్ణాభ్రకం ధమేద్వహ్నౌ తతః క్షీరే వినిక్షిపేత్. 60
భిన్నపత్రం తు తత్కృత్వా తణ్డులీయామ్లయోర్ద్రవైః,
భావయేదష్టయామం తదేవం శుధ్యతి చాభ్రకమ్. 61
కృత్వా ధాన్యాభ్రకం తత్తు శోషయిత్వాఽథ మర్దయేత్,
అర్కక్షీరైర్దినం ఖల్వే చక్రాకారం చ కారయేత్. 62
వేష్టయేదర్కపత్రైశ్చ సమ్యగ్గజపుటే పచేత్,
పునర్మర్ద్యం పునః పాచ్యం సప్తవారం ప్రయత్నతః. 63
తతో వటజటాక్వాథైస్తద్వద్దేయం పుటత్రయం,

మ్రియతే నాత్ర సన్దేహస్సర్వరోగేషు యోజయేత్. 64
మృతం త్వాభ్రం హరేన్మృత్యుం జరాపలితనాశనం,
అనుపానైశ్చ సంయుక్తం తత్తద్రోగహరం పరమ్. 65

కృష్ణాభ్రకమును కొలిమిలోవైచి ఎఱ్ఱగ కాలునపుడు కొలిమితిత్తితోనూది పిదప దానిని నావుపాలలోవేసి రేకులు రేకులుగ వొలిచి, చిఱ్ఱిహారరసమును, నిమ్మపండ్లరసమును నేకముజేసి యందాయభ్రకపు రేకులనువైచి యెనిమిదియామములు నిలిపిన యభ్రకము శుద్ధియగు. శుద్ధిజేసిన యభ్రకమును చూర్ణముగావించి శాలిధాన్యములోబోసి మూటగట్టి యొకచోట వ్రేలాడునట్లుచేసి ఆమూటకు సరిగ దిగువను కాంజికముబోసిన పాత్ర నొకదానినుంచి ఆమూటను మర్దించినయెడల అభ్రకము సూక్ష్మకణములుగ కాంజికములో పడును. అద్దానిని గ్రహించి ఎండ నెండించవలయును. ఇదియే ధాన్యాభ్రకమనంబడు. పిమ్మట దానిని జిల్లేడుపాలతో నొకదినము మర్దించి గుండ్రముగ బిళ్లఁజేసి యెండించి దానిపై జిల్లేడాకులఁ జుట్టి ప్రమిదెలయం దునిచి చీలమన్ను లేపనముఁజేసి అడవి పిడకలతో గజపుటంబిడవలయు. ఇటుల జిల్లేడుపాలతోనూఱి ఏడుగజపుటంబులును, పిదప మఱ్ఱియూడలకషాయముతో నొక్కొకసారిమర్దించుచు మూఁడుగజపుటంబులును ఇటుల పదిగజపుటంబులిడిన నిస్సంశయముగ అభ్రకము నిర్జీవితముగ భస్మంబగు. మఱియు నీయభ్రకభస్మమును యుక్తానుపానములచే నొసంగిన నది సర్వరోగంబులను నశింపంజేసి మృత్యువును, ముదిమిని, నరపును పారదోలును.

అన్యచ్చ—శుద్ధం ధాన్యాభ్రకం ముస్తం శుంఠీషడ్భాగయోజితం,
మర్దయేత్కాంజికేనైవ దినం చిత్రకజైరసైః. 66
తతో గజపుటం దద్యాత్తస్మాదుద్ధృత్యమర్దయేత్,
త్రిఫలావారిణా తద్వత్పుటేదేవం పుటైస్త్రిభిః, 67
బలాగోమూత్రముసలీ తులసీసూరణద్రవైః,
మర్దితం పుటితం పశ్చాత్త్రిత్రివేలం ప్రజేన్మృతిమ్. 68

అభ్రకమును మొదట శుద్ధిఁజేసి పిమ్మట దానిని పైజెప్పిన ప్రకారము ధాన్యాభ్రకముచేసి దాని కాఱవభాగము తుంగముస్తలు, సొంటి వీనిని చూర్ణమును గలిపి కాంజికముతో నొకదినంబును, చిత్రమూలరసముతో నొకదినంబును మర్దించి ఎండనెండించి మూకుళ్లయందునిచి చీలమన్నులేపనముజేసి అడవిపిరుపిడకలతో గజపుటం బిడవలయు. పిదప త్రిఫలముల కషాయముతో నొకదినంబును మర్దించి పైనజెప్పినప్రకారము మూఁడుగజపుటంబు లిడవలయు. మఱియు, ముత్తవపులగపువ్రేళ్లరసము, గోమూ

త్రము, నేలతాడిగడ్డలరసము, తులసియాకురసము, అడవికందరసము వీనిచే ప్రత్యేక ముగ నొక్కొక దానిచే నొకదినము మర్దించి గజపుటంబిడుచు, ఇటుల మూడుపర్యాయములు అన్నిటిచేతను వేర్వేఱుగ మూడుగజపుటంబు లిడిన అభ్రకము నిర్జీవితముగ భస్మంబగు.

### నీలాంజన (గైరకాది) శుద్ధి.

నీలాంజనం చూర్ణయిత్వా జంబీరద్రవభావితం,
దినైకమాతపే శుద్ధం భవేత్కార్యేషు యోజయేత్. 69
ఏవం గైరికకాసీసం టంకణాని వరాటికా,
శంఖకౌరీచ కంకుష్ఠం శుద్ధిమాయాతి నిశ్చితమ్. 70

నల్లసురమాతాళ్లను చూర్ణముచేసి యందు నిమ్మపండ్లరసముబోసి భావనచేసి యొక దినము ఎండనెండించిన నది శుద్ధియగు. ఇటుల శుద్ధిజేసినపిదప దీని నౌషధములయందు జేర్చుకొనవలయును. మఱియు, కావిరాళ్లు, అన్నభేది, టంకణక్షారము, గవ్వలు, శంఖము, పటిక, ముదారుసింగు వీనిని సురమతాళ్లవలెనే శుద్ధిజేయవలయును.

### మనశ్శిలాశుద్ధి.

పచేత్త్ర్యహమజామూత్రైర్డోలాయంత్రే మనశ్శిలాం,
భావయేత్సప్తధా పిత్తై రజాయా శుద్ధిమృచ్ఛతి. 71

మణిశిలను డోలాయంత్రమున నునిచి మేకపంచితముచే మూడుదినములువండి పిదప నామణిశిలను మేకపిత్తముతో నేడుమాఱులు భావనజేసిన నది శుద్ధియగు.

### తాళకశుద్ధి.

తాళకం కణశః కృత్వా తచ్చూర్ణం కాంజికే క్షిపేత్,
డోలాయంత్రేణ యామైకం తతః కూష్మాండజైర్ద్రవైః. 72
తిలతైలే పచేద్యామం యామం చ త్రిఫలాజలైః,
ఏవం యంత్రే చతుర్యామం పాచ్యం శుధ్యతి తాళకమ్. 73

తాళకమును రేకులుగ వలిచి చూర్ణముచేసి గుడ్డలో మూటగట్టి డోలాయంత్రమునందు కాంజికముచే నొకయామంబును, బూడిదగుమ్మడికాయ రసముచే నొకయామంబును, నువ్వులనూనెచే నొకయామంబును, త్రిఫలాకషాయముచే నొకయామంబును పచనముగావించిన శుద్ధియగు.

### రసక (కల్కఫరి) శుద్ధిః.

నృమూత్రే వాఽథ గోమూత్రే సప్తాహం రసకం క్షిపేత్,
దోలాయన్త్రేణ శుద్ధస్స్యాత్తతః కార్యేషు యోజయేత్. 74

కల్కఫరి (రసకము) ని డోలాయంత్రమున నునిచి యందు నరమూత్రమును గాని, ఆవుపంచితముగాని బోసి ఏడుదినంబులువండిన శుద్ధియగు. ఇటుల శుద్ధిజేసినపిదప దీని నౌషధములయందుఁ జేర్చుకొనందగు.

### ధాతువులనుండి సత్వము దీయువిధానము.

లాక్షామీనపయశ్ఛాగం టంకణం మృగశృంగకం,
పిణ్యాకం సర్షపాశ్శిగ్రుగుంజోర్ణా గుడసైంధవాః. 75
యవతిక్తాఘృతం క్షౌద్రం యథాలాభం విచూర్ణయేత్,
ఏభిర్విమిశ్రితాస్సర్వే ధాతవో గాఢవహ్నినా. 76
మూషాధ్మాతాః ప్రజాయంతే ముక్తసత్వా న సంశయః,

లక్క, చిన్నచేపలు, పాలు, గొఱ్ఱెమాంసము, వెలిగారము, జింకకొమ్ము, నువ్వుల గానుగపిండి, తెల్లఆవాలు, మునగవిత్తులు, గురిగింజలు, గొఱ్ఱెవెండ్రుకలు, బెల్లము, సైంధవలవణము, యవలు, కటుకరోహిణి, నెయ్యి, తేనె వీనిలో నేవిదొరకునో వానిని గ్రహించి చూర్ణము జేసి సత్వముదీయవలసిన ధాతువుతోఁ జేర్చి మూసయందునిచి గాఢాగ్నిగల కొలిమిపైనుంచి తిత్తితో నూదిన నందు సత్వము వెడలును. ఇదేప్రకారము అభ్రకము, నాగము, తామ్రము మొదలగు సప్తధాతువులయందును సత్వమును దీయవల్లయును.

### వజ్రశోధనమారణములు.

కులుత్థకోద్రవక్వాథైర్దోలాయన్త్రే విపాచయేత్. 77
వ్యాఘ్రీకందగతం వజ్రం త్రిదినం శుద్ధిమృచ్ఛతి,
తప్తం తప్తం తు తద్వజ్రం ఖరమూత్రే నిషేచయేత్. 78
పునస్తాప్యం పునస్సేచ్యమేవం కుర్యాత్త్రిసప్తధా,
మత్కుణైస్తాలకం పిష్ట్వా యావద్భవతి గోలకమ్. 79
తద్గోలే నిహితం వజ్రం తద్గోళం వహ్నినా ధమేత్,
సేచయేదశ్వమూత్రేణ తద్గోలే చ క్షిపేత్పునః. 80
రుధ్వాధ్మాతం పునస్సేచ్యమేవం కుర్యాచ్చ సప్తధా,
ఏవం చ మ్రియతే వజ్రం చూర్ణం సర్వత్ర యోజయేత్, 81

వాకుడుగడ్డను నూరి యందు వజ్రము నునిచి గుడ్డలో మూటగట్టి డోలాయంత్ర మందు ఉలవకట్టుంబోసి మూఁడుదినంబులును, ఆరికెధాన్యముయొక్క కషాయముబో మూఁడుదినంబులును వండినయెడల వజ్రము శుద్ధియగు. పిదప ఆవజ్రమును నిప్పునంద కాచి గాడిదమూత్రముతో చల్లార్చవలెను. ఇట్లు ఇరువదియొకమాఱులు చేయవలయును ఇటుల చల్లార్చినపిదప నల్లులు, తాళకము వీనిని ఉండగ నగువఱకు మర్దించి దానిమధ్య బున శుద్ధిజేసిన పైవజ్రమునునిచి మూసలోఁబెట్టి ఆమూసను కొలిమియందునిచి యంద ఉంట చక్కగ కాలినపిదప నందు గుఱ్ఱపుమూత్రమును కొంచెముగ చల్లి యావజ్రముఁ వెలికిఁదీసి మరల పైఁజెప్పినచొప్పుననే నల్లులు, తాళకము వీనినినూరి యుంటజేసి యంద వజ్రమునునిచి పైజెప్పినచొప్పుననే కొలిమియందు నూది కొంచెముగ గుఱ్ఱపుమూత్ర మునుచల్లి వజ్రమును వెలికిదీయవలయును. ఇటుల నేడుపర్యాయములుచేసిన వజ్రమ నిర్జీవితముగ భస్మంబగు. పిదప దీనిని కల్వమున చూర్ణముగనూరి సర్వరోగములయందుఁ నుపయోగింపవలయును.

అన్యచ్చ—హింగుసైంధవసంయుక్తే క్వాథే కౌలుత్థజే క్షిపేత్,
తప్తం తప్తం పునర్వజ్రం భూయశ్చూర్ణం త్రిసప్తధా. 82

వజ్రమును కాచి ఇంగువ, సైంధవలవణము, ఉలవలు వీనిని కషాయములలో ప్రత్యేకముగ కాల్చుచు, చల్లార్చుచు ఇరువదియొకమాఱులు నిట్లు చేయవలెను. ఇట్లు చేసిన వజ్రము భస్మంబగు.

అన్యచ్చ—మండూకం కాంస్యజే పాత్రే నిగృహ్య స్థాపయేత్సుధీః,
స భీతో మూత్రయేత్తత్ర తన్మూత్రే వజ్రమావపేత్. 83
తప్తం తప్తం చ బహుధా వజ్రస్యైవం మృతిర్భవేత్,

కప్పను కంచుపాత్రయందునిచి దానిపైమూసిన నది భయపడి మూత్రంబున విడుచును. పిదప ననేకమాఱులు వజ్రమునుకాచి ఆమూత్రముచే చల్లార్చిన నది భస్మంబగు.

## వైక్రాంతశోధనమారణములు.

వైక్రాంతం వజ్రవచ్ఛోధ్యం నీలం వా లోహితం తథా. 84
హయమూత్రే తు తత్సేచ్యం తప్తం తప్తం ద్విసప్తధా,
తతస్తు మేషశృంగ్యాస్తు పంచాంగే గోళకే క్షిపేత్. 85
పుటేన్మూషాపుటే రుధ్వా కుర్యాదేవం చ సప్తధా,
వైక్రాంతం భస్మతాం యాతి వజ్రస్థానే నియోజయేత్. 86

వైక్రాంతము, నీలమణి, పద్మరాగము వీనిని వజ్రమువలెనే శుద్ధిజేయవలయును. శుద్ధిజేసిన పిదప వైక్రాంతమును నిప్పులోకాచి గుఱ్ఱపుమూత్రములో చల్లార్పవలెను. ఇట్లు పదునాలుగుమాఱులు చేయవలెను. ఇటుల చల్లార్చినపిదప వద్దిచెట్టుసమూలమును దంచి యుండజేసి యందు శుద్ధిజేసిన వైక్రాంతమును పొదిగి ఎండించి మూసలో నుంచి చీల మన్నుజేసి అడవి పిడకలతో ఏడుసార్లు పుటంబిడవలయు. ఇటులఁజేసిన వైక్రాంతము భస్మంబగు. దీనిని వజ్రభస్మమునకు బదులుగ నుపయోగించంజను.

## సర్వరత్నశోధనమారణములు.

స్వేదయేద్డోలికాయంత్రే జయంత్యాస్స్వరసేన చ,
మణిముక్తాప్రవాళానాం యామైకం శోధనం భవేత్. 87
కుమార్యాస్తండులీయేన స్తన్యేన చ నిషేచయేత్,
ప్రత్యేకం సప్తవేళాం చ తప్తతప్తాని కృచ్ఛ్రశః. 88
మౌక్తికాని ప్రవాళాని తథా రత్నాన్యశేషతః,
క్షణాద్వివిధవర్ణాని మ్రియంతే నాత్ర సంశయః. 89
ఉక్తమాక్షికవస్ముక్తాప్రవాళాని చ మారయేత్,
వజ్రవత్సర్వరత్నాని శోధయేన్మారయేత్తథా. 90

సూర్యకాంతము మొదలగు సమస్తమణులు, ముత్తియములు, పవడములు వీనిని డోలాయంత్రమున నునిచి తక్కిలిరసముచే నొకయామము వండిన నవి శుద్ధియగు. శుద్ధియైనపిదప రత్నములు, ముత్తియములు, పవడములు మొదలగువానిని అగ్నియందుకాచుచు కలబందరసము, చిట్టికూరరసము, చనుబాలు వీనిలో నొక్కొకదానిచేతను ఏడేడుమాఱులు చల్లార్చిన నిస్సంశయముగ నవి భస్మంబగు, లేక, స్వర్ణమాక్షికమును భస్మముజేసిన విధముగనే ముత్తియమును, పగడమును భస్మముఁజేయవలయును. లేక, వజ్రమును శోధనము మారణము జేసినటులనే ఇతరరత్నములకూడ భస్మముఁ జేయందగు.

## శిలాజతుశుద్ధి.

హేమాద్యాస్సూర్యసంతాపాద్ద్రవంతి గిరిధాతవః,
తచ్చాంభోమృదుమృత్స్నాభం తద్భవేచ్ఛ శిలాజతు. 91
శిలాజతు సమానీయ గ్రీష్మతప్తశిలాచ్చ్యుతం,
గోదుగ్ధైస్త్రిఫలాక్వాథైర్భృంగద్రావైశ్చ మర్దయేత్. 92
ఆతపే దినమేకైకం తచ్ఛుష్కం శుద్ధతాం వ్రజేత్,

గ్రీష్మఋతువునందు సూర్యసంతాపముచే పర్వతాదులయందలి హేమాదిధాతువులు తపించి యందుండి రసముద్రవించి ఘనీభవించుటయె శిలాజతు అనంబడు. అట్టి

శిలాజతును, ఆవుపాలు, త్రిఫలాకషాయము, గుంటగలగరాకురసము వీనితో నొక్కొక దానిచేతను నొక్కొకదినముచొప్పున కల్వమున మర్దించి యొక్కొకదినము యెండనెండించిన నది శుద్ధియగు.

శిలాజతును గలుగఁజేయువిధానము.

ముష్కాభ్యాం శిలాజతుశిలాం సూక్ష్మఖండప్రకల్పితామ్. 93
విక్షిప్యాత్యుష్ణపానీయే యామైకం స్థాపయేత్సుధీః,
మర్దయిత్వా తతో నీరం గృహ్ణీయాద్వస్త్రగాలితమ్. 94
స్థాపయిత్వా చ మృత్పాత్రే ధారయేదాతపే బుధః,
ఉపరిస్థం ఘనం యత్స్యాత్తత్క్షిపేదన్యపాత్రకే. 95
ధారయేదాతపే ధీమానుపరిస్థం ఘనం నయేత్,
ఏవం పునఃపునర్నీత్వా ద్విమాసాభ్యాం శిలాజతు. 96
భూయాత్కార్యక్షమం వహ్నౌ క్షిప్తం లింగోపమం భవేత్,
నిర్ధూమం చ తతశ్శుద్ధం సర్వకర్మసు యోజయేత్. 97
అధస్థితం చ యచ్ఛేషం తస్మిన్నీరం వినిక్షిపేత్,
విమర్ద్య ధారయేద్ఘర్మే పూర్వవచ్చైవ తన్నయేత్. 98

శిలాజతుజనించెడి పాషాణముల దెచ్చి సన్నగ తునుకలుచేసి దీనిని కళకళయని కాగుచుండెడి నీటిలోవైచి యొకయామంబునిచి పిదప నాతునకలను జలయుక్తముగ మెత్తగ నూరి మిగిలిననీటిలోఁగలిపి మట్టిపాత్రయందు వడియగట్టి యెండలోనునిచిన నందు ఘనముగా నురుఁగులు జనించు. పిదప దాని మఱియొకమట్టిపాత్రలోవైచి అందు క్రొత్త నీళ్లువైచి యెండనునిచిన నది గట్టిగా మీగడవలెనగు. దీనిని వేరే మంటిపాత్రలోవైచి క్రొత్తనీళ్లు బోసి యెండలో నుంచవలయు. ఇటుల చేయుచు శిలాజతును రెండుమాసములు యెండయందు నుంచుచుండిన నది యుత్కృష్టమైనదిగానగు. ఇట్టి శిలాజతును నిప్పునందువైచిన లింగాకృతిగనై ధూమరహితంబుగా నుండును. ఇటులనుండిన దీని సర్వౌషధములయందును బ్రయోగింపందగు.

మండూరవిధానము.

అక్షాంగారైర్ధమేత్కిట్టం లోహజం తద్గవాం జలైః,
సేచయేత్తప్తతప్తం తత్సప్తవారం పునఃపునః. 99
చూర్ణయిత్వా తతః క్వాథైర్ద్విగుణైస్త్రిఫలాభవైః,
ఆలోడ్య భర్జయేద్వహ్నౌ మండూరం జాయతే పరమ్. 100

తాం(డ్ర)బొగ్గులలో నినుపచిట్టెము నునిచి నెఱ్ఱగనగువఱకు కొలిమిలి త్తితో నూది గోమూత్రముతో చల్లార్పవలయు. ఇటుల నినుపచిట్టెమును ఏడుమార్లుకాచి చల్లార్చి చూర్ణముచేసి దానికి రెండింతల త్రిఫలములను వైచి కషాయము కాచియందు ఆచిట్టెము యొక్కచూర్ణమును వైచి గట్టియగునటుల మరల కాచి పిదప నాలుండకు చీలమన్ను లేపనముజేసి అడవియేరుపిడకలతో గజపుటంబిడి సాంగశీతలమున నందలి మండూరమును గ్రహింపవలయు. ఇటులఁజేయఁబడిన మండూరము శుద్ధమండూర మగుటచే దానిని రోగంబులయం దుపయోగింపఁదగు.

## క్షారకల్పన.

క్షారవృక్షస్య కాష్ఠాని శుష్కాన్యగ్నౌ ప్రదీపయేత్,
నీత్వా తద్భస్మ మృత్పాత్రే క్షిప్త్వా నీరే చతుర్గుణే. 101
విమర్ద్య ధారయేద్రాత్రౌ ప్రాతరచ్ఛజలం నయేత్,
తన్నీరం క్వాథయేద్వహ్నౌ యావత్సర్వం విశుష్యతి. 102
తతః పాత్రాత్సముల్లిఖ్య క్షారో గ్రాహ్యస్సితప్రభః,
చూర్ణాభః ప్రతిసార్యస్స్యాత్పేయస్యాత్క్వాథవత్ఖ్రతః. 103
ఇతి క్షారద్వయం ధీమాన్ యుక్తకార్యేషు యోజయేత్.

ఇతి శ్రీదామోదరసూనుశార్ఙ్గధరవిరచితాయాం సంహితాయాం
మధ్యమఖండే చికిత్సాస్థానే ధాతుశోధనమారణం
నామ ఏకాదశోఽధ్యాయః.

క్షారముగల వృక్షముల కాష్ఠములనైనను తీఁగలనైనను కాల్చిబూడిదచేసి యొక కుండలోవైచి దానికి నాలుఁగింతలు నీళ్లుపోసి పిసికి యొకరాత్రియుంచి మరునాఁడుదయమున పైతేటనీటిని ఇనుపపాత్రలో వంచి పొయిమీదనుంచి నీరుబాగుగ నిగురువఱకు కాచి యందు తెల్లగానంటియుండెడు క్షారమును గ్రహింపవలయు. ఇటుల పాత్రనంటియుండెడిక్షారము ప్రతిసార్యమనంబడు. దీనిని శ్వాసాదులయందు బ్రయోగింపవలయు. మఱియు, కషాయమువలె తేటగనుండుక్షారము పేయమనంబడు. దీనిని గుల్మాదిరోగములయందుఁ బ్రయోగింపవలయు, ఇటుల క్షారములు రెండువిధంబులుగ నుండుటచే ఆయారోగములభేదంబు నెఱింగి యుపయోగింపవలయు.

ఇది శ్రీదామోదరసూను శార్ఙ్గధరవిరచితసంహితయందు మధ్యమఖండమున
చికిత్సాస్థానమున ధాతుశోధనమారణ మనియెడు
నేకాదశాధ్యాయము సంపూర్ణము.

# ద్వాదశాధ్యాయము.

## పారదాది నామములు.

పారదస్సర్వరోగాణాం జేతా పుష్టికరస్స్మృతః,
సుజ్ఞేన సాధితః కుర్యాత్సంసిద్ధిం దేహలోహయోః. 1
రసేంద్రః పారదస్సూతో హరజస్సూతకో రసః,
ముకుందశ్చేతి నామాని జ్ఞేయాని రసకర్మసు. 2
తామ్రతారారనాగాశ్చ హేమవంగౌ చ తీక్ష్ణకం,
కాంస్యకం వృత్తలోహం స్యాద్ధాతవో నవ యే స్మృతాః. 3
సూర్యాదీనాం గ్రహాణాం తే కథితా నామభిః క్రమాత్,

బాగుగ దెలిసినవారలచే క్రమముగ శుద్ధి జేయఁబడిన పాదరసము సర్వరోగములను హరింపంజేసి శరీరమునకు పుష్టిని గలుగఁజేయుటయగాక అది దేహమునకును స్వర్ణాది ధాతువులమారణమునకును సిద్ధిని గలుగంజేయును. మఱియు, రసేంద్రము, పారదము, సూత్రము, హరజము, సూతకము, రసము, ముకుందము అను నీయేడునామంబులు రసకర్మలయం దెచ్చటవచ్చినను, పాదరసమనియెఱుంగవలయు. మఱియు, తామ్రము, వెండి, ఇత్తడి, సీసము, బంగారు, తగరము, ఉక్కు, కంచు, లోహకాంతము అనునీ నవధాతువులును క్రమముగ సూర్యాదినవగ్రహముల నామంబులుగలవిగ నెఱుంగవలయును.

## పారదశుద్ధి.

రాజీరసోనమూషాయాం రసం క్షిప్త్వా విబంధయేత్. 4
వస్త్రేణ డోలికాయంత్రే స్వేదయేత్కాంజికే త్ర్యహం,
దినైకం మర్దయేత్సూతం కుమారీసంభవైర్ద్రవైః. 5
తథా చిత్రకజైః క్వాథైర్మర్దయేదేకవాసరం,
కాకమాచీరసైస్తద్వ ద్దినమేకం చ మర్దయేత్. 6
త్రిఫలాయాస్తతః క్వాథై రసో మర్ద్యః ప్రయత్నతః,
తతస్తేభ్యః పృథక్కుర్యాత్సూతం ప్రక్షాళ్య కాంజికైః. 7
తతః క్షిప్త్వా రసం ఖల్వే రసాదర్ధం చ సైంధవం,

మర్దయేన్నింబుకరసైర్దినమేకమనారతమ్. 8
తతో రాజీరసోనశ్చ ముఖ్యశ్చ నవసాగరః,
ఏతైరసస్మైస్తద్వత్స్నాతో మర్దయేస్తుషాంబునా. 9
తతస్సంశోష్య చక్రాభం కృత్వా లిప్త్వా చ హింగునా,
ద్విస్థాలీసంపుటే ధృత్వా పూరయేల్లవణేన చ. 10
అథ స్థాలీం తతో ముద్రాం దద్యాద్దృఢతరాం బుధః,
విశోష్యాగ్నిం విధాయాధో నిషించేదంబునోపరి. 11
తతస్తు కుర్యాత్తీవ్రాగ్నిం తదధః ప్రహరత్రయం,
ఏవం నిపాతయేదూర్ధ్వం రసో దోషవివర్జితః. 12
అధోర్ధ్వపిఠరీమధ్యే లగ్నో గ్రాహ్యో రసోత్తమః,

ఆవాలు, వెల్లుల్లి వీనినినూరి మూసజేసి అందుపాదరసముబోసి యామూసను గుడ్డలోమూటగట్టి డోలాయంత్రమునను నిచి కాంజికముతో మూఁడుదినంబులు వండి పిదప నారసమును వెలికిఁదీసి కల్వంబున వైచి కలబందరసముతో నొకదినంబును చిత్రమూల రసంబుతో నొకదినంబును కాచి ఆకురసంబుచే నొకదినంబును త్రిఫలాకషాయముచే నొకదినంబును మర్దించి పిదప నారసమును పలుమాఱు నిర్మలమగువఱకు కాంజికముతో కడిగి కల్వంబునవైచి దానికి సగపాలు సైంధవలవణమును గలిపి వేపరసముతో నొకదినము ఎడతెగక మర్దించి యందు ఆవాలను, వెల్లుల్లిని, నవాసాగరమును రసమునకు సమంబులుగవైచి వరిపొట్టుకషాయముఁబోసి యది శుష్కించువఱకు బాగుగమర్దించి ముద్దజేసి దానిపైఇంగువనునూరి లేపనముజేసి కుండలోనునిచి దానిపైఉప్పుబోసి మఱియొకకుండను మూసిబలముగచీలమన్ను లేపనముజేసి బాగుగనెండించి గాఢాగ్నియందు మూఁడుయామంబులునిచి రసముకరిగి పడకుండునటుల పైకుండకాలినపుడెల్ల దానిపైభాగమందు నీళ్లుచల్లుచుండవలెను. ఇటుల మూఁడుయామంబులు గడచినపిదప చల్లారనిచ్చి కుండకుజేసియుండెడి చీలమన్నును మెల్లగఁదీసి పైకుండలోనంటియుండెడు రసమును గ్రహింపవలయు. ఇటుల సిద్ధముజేయుచుండిన పాదరసము దోషరహితంబుగ నుండును.

## గంధకశుద్ధి.

లోహపాత్రే వినిక్షిప్య ఘృతమగ్నౌ ప్రతాపయేత్. 13
తప్తే ఘృతే తత్సమానం క్షిపేద్గంధకజం రజః,
విద్రుతం గంధకం జ్ఞాత్వా దుగ్ధమధ్యే వినిక్షిపేత్. 14
ఏవం గంధకశుద్ధిస్స్యాత్సర్వకార్యేషు యోజయేత్,

ఇనుపబాణలిలో నెయ్యిబోసి బాగుగ కాచి దానికి సమముగ గంధకమును చూర్ణముజేసి యందువైచి గంధకము కరిగి నేతితో కలిసినతోడనే దానిపాలలోబోసిపిదప నాగంధకమును గ్రహింపవలయు. ఇటుల శుద్ధిజేయఁబడిన గంధకమును సాధారణముగ ఔషధములయం దుపయోగింపఁదగు.

### ఇంగిలీకమునుండి రసముఁ దీయువిధానము.

నింబూరసైర్నింబపత్రరసైర్వా యామమాత్రకమ్ 15
పిష్ట్వా దరదమూర్ధ్వం చ పాతయేత్సూతయుక్తివత్,
తతశ్శుద్ధరసం తస్మాన్నీత్వా కార్యేషు యోజయేత్. 16

వేపరసముతోనైనను, లేక, వేపఆకు రసముతోనైనను ఇంగిలీకమును కల్వమున నొకయామము మర్దించి డమరుకయంత్రమునందునిచి పిదప మంటవేసిన పైకుండలో రసము జేరును. ఆట్టి రసమును సర్వకార్యములయందు నుపయోగింపఁదగు.

### ఇంగిలీకశుద్ధి.

మేషీక్షీరేణ దరదమమ్లవర్గైశ్చ భావితం,
సప్తవారం ప్రయత్నేన శుద్ధిమాయాతి నిశ్చితమ్. 17

ఇంగిలీకమును మేకపాలతో నేడుమాఱులును, నిమ్మపండ్లు మొదలగు పుల్లనిద్రవముల (అమ్లవర్గము)తో నేడుమాఱులును కల్వమున మర్దించి యెండించిన నది నిశ్చయముగ శుద్ధియగు.

### శుద్ధరసమునకు ముఖముఁ గలుగఁజేయువిధము.

కాలకూటో వత్సనాభశ్శృంగకశ్చ ప్రదీపనః,
హాలాహలో బ్రహ్మపుత్రో హారిద్రస్సక్తుక స్తథా. 18
సౌరాష్ట్రిక ఇతి ప్రోక్తా విషభేదా అమీ నవ,
అర్కసేహుండధుత్తూరలాంగలీకరవీరకమ్. 19
గుంజాహిఫేనావిత్యేతాస్సప్తోపవిషజాతయః,
ఏతైర్విమర్దితస్సూతశ్ఛిన్నపక్షః ప్రజాయతే. 20
ముఖం చ జాయతే తస్య ధాతూంశ్చ గ్రసతేతరాం,

కాలకూటము, వత్సనాభి, శృంగకము, ప్రదీపనము, హాలాహలము, బ్రహ్మపుత్రము, హారిద్రము, సక్తుకము, సౌరాష్ట్రికము, అనునీతొమ్మిదియు, మహావిషములు, జిల్లేడు, బొంతజెముడు, ఉమ్మెత్త, నీరుపిప్పలి, గన్నేరు, గురిగింజ, అభిని (నల్లమందు), అనునీఏడును ఉపవిషములు, అందుప్రతిదానిచేతను పాదరసమును 7 దినములు మర్దించి

పిదప దాని కడిగి రెండవదానిచే మరల మర్దించవలయు. ఇటుల ప్రతిదానిచేతను పాద రసమును ఏడేడు దినంబులు మర్దించిన నది పక్షచ్ఛేదనమై ముఖము గలిగి స్వర్ణాదిధాతువులను మిక్కుటముగ గ్రసించును.

అన్యచ్చ — అథ వా త్రికటుక్షారా రాజీలవణపంచకమ్. 21
రసోనో నవసారశ్చ శిగ్రుశ్చైకత్ర చూర్ణితైః,
సమాంశైః పారదాదేతైర్జంబీరేణ ద్రవేణ వా. 22
నింబతోయైః కాంజికైర్వా సోష్ణాఖల్వే విమర్దయేత్,
అహోరాత్రత్రయేణ స్యాద్ద్రసో ధాతుచరం ముఖమ్. 23
అథ వా బిన్దులీకీటై రసో మర్ద్యస్త్రివాసరం,
లవణామ్లైర్ముఖం తస్య జాయతే ధాతుఘస్మరమ్. 24

త్రికటుకములు, యవక్షారము, సర్జక్షారము, ఆవాలు, సైంధవలవణము, పాదర లవణము, బిడాలవణము, సముద్రలవణము, కాచలవణము, వెల్లుల్లి, నవాసాగరము, మునగపట్ట, వీనిని రసమునకు సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి, తప్తఖల్వమున నిమ్మపండ్లరసముతోనైనను, లేక, వేపరసముతోనైనను, లేక, కాంజికముతోనైనను, రేయుంబవల్లు మూఁడుదినంబులు మర్దించిన దానికి నోరుగలిగి స్వర్ణాదిధాతువులను గ్రసించును. లేక, ఆర్ద్రాకార్తికయం దుత్పన్నంబగు బిందులీకీటకములను (రోకటిబండ పురుగులను) దెచ్చి రసముతో గలిపి మూఁడుదినము లహోరాత్రములు ఖల్వమున మర్దించి పిదప సైంధవలవణమును, నిమ్మపండ్లరసమునుఁ జేర్చిమూఁడుదినములు మర్దించిన స్వర్ణాది ధాతువుల భక్షించుటకు యోగ్యమైన ముఖముగలుగు.

### రసమునకుఁ గచ్ఛపయంత్రమువలన గంధకజారణము.

అథ కచ్ఛపయంత్రేణ గంధజారణ ముచ్యతే,
మృత్కుండే నిక్షిపేన్నీరం తన్మధ్యే చ శరావకమ్. 25
మహత్కుండపిధానాభం మధ్యే మేఖలయా యుతం,
లిప్త్వా చ మేఖలామధ్యం చూర్ణేనాత్ర రసం క్షిపేత్. 26
రసస్యోపరి గంధస్య రజో దద్యాత్సమాంశకం,
దత్త్వోపరి శరావం చ భస్మముద్రాం ప్రదాపయేత్. 27
తస్యోపరి పుటం దద్యాచ్చతుర్భిర్గోమయోపలైః,
ఏవం పునఃపునర్గంధం షడ్గుణం జారయేద్బుధః. 28

గంధే జీర్ణేభవేత్సూత స్తీక్ష్ణాగ్నిస్సర్వకర్మకృత్,

ఇఁక రసమునకు కచ్ఛపయంత్రముచేఁ జేయంబడు గంధకజారణమును జెప్పెద. ఎట్లన? వెడలుపునోరుగల మంటికుండలో నీళ్లుబోసి తన్మధ్యమున మేఖలగల యొకశరావమును, ఆశరావమేఖలమునకు సున్నముపూసి నీళ్లుతగిలి తగులకుండునట్లునిచి పిదప మంటితో మూఁతఁజేసి దానికిసున్నముపూసి అందు పాదరసమునువైచి దీనికి సమముగ గంధకచూర్ణమును రసముపైవైచి నీరుఁబోసియుండెడి కుండకుపైన మఱియొకశరావమును మూసి బూడిదలో సైంధవలవణమునుగలిపి బాగుగనూరి చీలచేసి దానిపై ఆవుపేడ పూసి ఎండించి దీనిని భూమిమట్టమునకు సమముగ నొకపల్లమున పూడ్చి దానిపై ఆవుపేడతో పెద్దవిగ జేయఁబడిన నాలుగుపిడకలను పేర్చి పుటంబిడవలయు. పిదప ఆ కుండకు జేసియుండెడు చీలమన్ను దీసి, యందును గంధకమును పైక్రమప్రకారమే వైచి మరల చీలజేసి పుటంబిడవలయు. ఇత్తెఱంగున నే గంధకజారణము జేయవలయు. ఇటుల ఆఱుమాఱులు చేసిన అందలి గంధకము జీర్ణించి రసము మిగుల తీక్ష్ణముగలదై సర్వౌషధములయం దుపయోగించు.

## రసభస్మవిధానము.

ధూమసారం రసం తూరీం గంధకం నవసాగరమ్. 29
యామైకం మర్దయేదమ్లైర్భాగం కృత్వా సమం సమం,
కాచకూప్యాం వినిక్షిప్య తాం చ మృద్వస్త్రముద్రయా. 30
విలిప్య పరితో వక్త్రే ముద్రాం దత్వా చ శోషయేత్,
అథస్సచ్ఛిద్రపిఠరే మధ్యే కూపీం నివేశయేత్. 31
పిఠరీం వాలుకాపూరైర్భృత్వా చాకూపికాగళం,
నివేశ్య చుల్ల్యాం తదధః కుర్యాద్వహ్నిం శనైశ్శనైః. 32
తస్మాదప్యధికం కించిత్పావకం జ్వాలయేత్క్రమాత్,
ఏవం ద్వాదశభిర్యామైర్మ్రియతే సూతకోత్తమః. 33
స్ఫోటయేత్స్వాంగశీతం తమూర్ధ్వగం గంధకం త్యజేత్,
అధస్థ్సం మృతసూతం చ సర్వకర్మసు యోజయేత్. 34

కరుధూపము, రసము, పటికారము, గంధకము, నవాసాగరము వీనిని సమభాగములుగ గ్రహించి నిమ్మపండ్లరసముతో నొకయామము మర్దించి కాచకూపికయం దునిచి దానిమూఁతికి బిరడాబెట్టి బాగుగ చీలమన్నుఁజేసి ఎండించి లావుగనుండుసూదిదూరునటుల పెద్దకుండకు రంధ్రముపొడిచి దానిని ప్రొయిమీదనునిచి యందు కాచకూపికనుబెట్టిదాని

గొంతువఱకు నిసుకబోసి సూక్ష్మాగ్ని, కమలాగ్ని, గాఢాగ్నులచే క్రమముగ పండ్రెండు యామములవఱకు మంటఁజేసి బాగుగచల్లారినపిదప అకుప్పెను బైటికిదీసి యుక్తిగపగుల గొట్టి దానిగొంతుకు సమీపమునఁనంటియుండెడి గంధకమునుదీసి పారవైచి దాని కధో భాగమందలి రసభస్మమును గ్రహింపవలయు. ఈరసభస్మమును సర్వకార్యములయందుఁ బ్రయోగింపనగు.

అన్యచ్చ—అపామార్గస్య బీజానాం మూషాయుగ్మం ప్రకల్పయేత్,
తత్సంపుటే న్యసేత్సూతం మలయూదుగ్ధమిశ్రితమ్. 35
ద్రోణపుష్పీప్రసూతాని విడంగమరిమేదకః,
ఏతచ్చూర్ణమధశ్చోర్ధ్వం దత్వా ముద్రాం ప్రదాపయేత్. 36
తం గోళం సంధయేత్సమ్యక్ మృణ్మూషాసంపుటే సుధీః,
ముద్రాం దత్వా శోషయిత్వా తతో గజపుటే పచేత్. 37
ఏవమేకపుటేనైవ జాయతే భస్మసూతకం,

ఉత్తరేణివిత్తులను మెత్తగనూరి దానిచే రెండుమూసలుజేసి యందొక మూసలో తుమ్మిపూవులు వాయువిళంగములు నల్లతుమ్మకట్ట, వీనిచూర్ణమును సగమువైచి దానిపై బ్రహ్మమేడి పాలతో మిశ్రితముజేసిన రసమును నిచ్చి పైచూర్ణంబున మిగిలియుండెడి దానిని దానిపైవైచి రెండవమూసను మూసి చక్కగ సంధిపఱచి పిదప దీనిని తగిన మంటిమూసలో నునిచి చీలమన్నులేపనముజేసి యెండించి ఏరుపిడకలతో నొకగజపుటం బెడిన నది భస్మంబగు.

అన్యచ్చ—కాకోదుంబరికాదుగ్ధైరసం కించిద్విమర్దయేత్. 38
తద్దుగ్ధఘృష్టహింగోశ్చ మూషాయుగ్మం ప్రకల్పయేత్,
క్షిప్త్వా తత్సంపుటేత్సూతం తత్ర ముద్రాం ప్రదాపయేత్. 39
ధృత్వా తం గోళకం ప్రాజ్ఞో మృణ్మూషాసంపుటేఽధికే,
పచేన్మృదుపుటేనైవ సూతకో యాతి భస్మతామ్. 40

బ్రహ్మమేడిపాలతో పాదరసమును ఖల్వమున మర్దించి, బ్రహ్మమేడిపాలతో నూరఁబడినయింగువతోరెండు మూసలు నిర్మించి యందొకదానిలో నీపాదరసమునుబోసి రెండవమూసనుపైనఁబెట్టి గట్టిగసంధిబంధముగావించి దీనిని మఱియొకమంటిపాత్రమున నుంచి లఘుపుటమువేసిన భస్మమగును.

అన్యచ్చ.—నాగవల్లీరసైర్ఘృష్టః కర్కోటీకందగర్భితః,
మృణ్మూషాసమ్పుటే పక్త్వా సూతో యాత్యేవ భస్మతామ్. 41

డావరడంగిదుంపను రెండుమూసలుగా నిర్మించి యందు తమలపాకులరసముతో నూరఁబడిన పాదరసముబోసి పిమ్మట రెండవమూసను పైన నునిచి సంధిబంధముగావించి దీనిని మఱియొకమంటిపాత్రమున నునిచి లఘుపుటంబిడిన నయ్యది భస్మమగును.

**జ్వరాంకుశము.**

ఖండితం హారిణం శృంగం జ్వాలాముఖ్యారసైస్సమం,
రుద్ధ్వా భాండే పచేచ్చుల్యాం యామయుగ్మం తతో నయేత్. 42
అష్టాంశం త్రికటుం దద్యాన్నిష్కమాత్రం చ భక్షయేత్,
నాగవల్ల్యా రసైస్సార్ధం వాతపిత్తజ్వరాపహమ్. 43
అయం జ్వరాంకుశో నామా రసస్సర్వజ్వరాపహః,

జింకకొమ్మును సన్ననిముక్కలుగాదంచి కుండలోవైచియందు జ్వాలాముఖీరసము బోసి దానిపైన మఱియొక్క కుండమూసి సంధిబంధము గావించి రెండుజాములు గాఢాగ్నియందు పుటమువైచి స్వాంగశీతలమైనపిమ్మట దాని విప్పిచూచిన నయ్యది భస్మమగును. ఆ చూర్ణమున కెనిమిదవపాలు త్రికటుకచూర్ణముగలిపి నిష్కప్రమాణముగా తమలపాకురసముతో సేవించిన వాత, పిత్తజ్వరములు నశించును. ఇయ్యది జ్వరాంకుశమనంబడును.

**జ్వరారిరసము.**

పారదం రసకం తాళం తుత్థం టంకణగన్ధకమ్. 44
సర్వమేతత్సమం శుద్ధం కారవల్ల్యారసైర్దినం,
మర్దయేల్లేపయేత్తేన తామ్రపాత్రోదరం భిషక్. 45
అంగుళార్ధప్రమాణేన తతో రుద్ధ్వా చ తన్ముఖం,
పచేత్తం వాలుకాయంత్రే క్షిప్త్వా ధాన్యాని తన్ముఖే. 46
యదా స్ఫుటంతి ధాన్యాని తదా సిద్ధం వినిర్దిశేత్,
తతో నయేత్స్వాంగశీతం తామ్రపాత్రోదరాద్భిషక్. 47
రసం జ్వరారినామానం విచూర్ణ్య మరిచైస్సమం,
మాషైకం పర్ణఖండేన భక్షయేన్నాశయేజ్జ్వరమ్. 48
త్రిదినైర్విషమం తీవ్రమేకద్విత్రిచతుర్థకం,

శుద్ధిజేసినరసము, శుద్ధిజేసినకపరి, శుద్ధిజేసినతాళకము, శుద్ధిజేసినమైలతుత్తము, శుద్ధగంధకము వీనిని సమముగా కాకరాకురసముతో మర్దించి యాకజ్జలిని రాగిడబ్బిలోన అరంగుళముయెత్తున లేపనముచేసి దానిపైనమూఁతవైచి వాలుకాయంత్రమున నునిచి దీని మూతినిమూసి బంధముగావించి దానిపైధాన్యము పోసి ప్రొయిమీదనుంచి పాకముచేయు

చుండినపుడు ఆధాన్యము పేలాలవలె నయ్యేనేని యౌషధము పక్వమాయెనని యెఱింగి దించి స్వాంగశీతలమైనపిమ్మట నాయౌషధమునకు సమముగా మిరియములు గలిపి మర్దన చేసి మాషప్రమాణముగ తమలపాకులరసముతో సేవించిన సంతత, సతత, అన్యేద్యుష్క, తృతీయక, చాతుర్థిక జ్వరములు నశించును. ఇది జ్వరారిరస మనంబడును.

శీతజ్వరారిరసము.

తాళకం తుత్థకం తామ్రం రసం గన్ధం మనశ్శిలామ్. 49
కర్షంకర్షం ప్రయోక్తవ్యం మర్దయేత్త్రిఫలాంబుభిః,
గోలం న్యసేత్సంపుటకే పుటం దద్యాత్ప్రయత్నతః. 50
తతో నీత్వాఽర్కదుగ్ధేన వజ్రీదుగ్ధేన సప్తధా,
క్వాథేన దన్త్యాశ్శ్యామాయా భావయేత్సప్తధా పునః. 51
మాషమాత్రం రసం దేయం పఞ్చాశన్మరిచైర్యుతం,
గుడగద్యానకం చైవ తుళసీదళయుగ్మకమ్. 52
భక్షయేత్త్రిదినం భక్త్యా శీతారిర్దుర్లభః పరః,
పథ్యం దుగ్ధోదనం దేయం విషమం శీతపూర్వకమ్. 53
దాహపూర్వం హరత్యాశు తృతీయకచతుర్థకౌ,
ద్వ్యాహికం సతతం చైవ వైవర్ణ్యం చ నియచ్ఛతి. 54

శుద్ధతాళకము, శుద్ధిచేసినమయూరతుత్థము, తామ్రభస్మము, శుద్ధిచేసిన పాదరసము, శుద్ధిచేసినగంధకము, శుద్ధిచేసినమణిశిల వీనిని ఒక్కొకదాని కర్షప్రమాణముగా త్రిఫలాకషాయంబుతో మర్దనఁజేసి యుండచేసి యాయుండను శరావసంపుటమునందు గజపుటంబిడి స్వాంగశీతలమైన పిమ్మట ఖల్వములోవైచి జిల్లేడుపాలుతో నేడుమార్లును, బొంతజెముడుపాలతో నేడుమార్లును, నేపాళపువేరుకషాయమున నేడుమార్లును, నల్లతెగడ కషాయంబున నేడుమార్లును మర్దించి భావనచేసి మాషప్రమాణముగా మాత్రలుచేసి యందొకమాత్రను ఏబదిమిరియములు, ఆఱుమాషములయెత్తుబెల్లము, రెండుతులసిదళములు వీనితో సేవించి మూఁడుదినములు పాలుఅన్నము భుజించుచుండిన శీతపూర్వ, దాహపూర్వ, చతుర్థక, తృతీయక, సంతత, సతత, అన్యేద్యుష్కజ్వరములు నశించును.

జ్వరఘ్నీఘుటిక.

భాగైకస్స్యాద్రసాచ్ఛుద్ధాదేలీయః పిప్పలీ శివా,
ఆకారకరభో గన్ధః కటుతైలేన శోధితః. 55
ఫలాని చేన్ద్రవారుణ్యాశ్చతుర్భాగమితా అమీ,
ఏకత్ర మర్దయేచ్చూర్ణమిన్ద్రవారుణికారసైః. 56
మాషోన్మితాం గుటీం కృత్వా దద్యాత్సర్వజ్వరే బుధః,

ఛిన్నారసానుపానేన జ్వరఘ్నీ ఘుటికా మతా. 57

శుద్ధిచేసినరసము ఒకభాగము, బాలింతబోళము, పిప్పళ్లు, కరకకాయలు, అక్కలకఱ్ఱ, ఆవమూత్రితో శుద్ధిచేయఁబడినగంధకము, వెఱ్ఱిపుచ్చకాయ వీనిని ప్రత్యేకము నాలుగేసి భాగములుగాను కలిపి వెఱ్ఱిపుచ్చకాయరసముతో చక్కఁగ మర్దనఁజేసి మాషప్రమాణముగా మాత్రలుగావించి యందొకదానిని తిప్పతీఁగరసముతో సేవించిన సర్వజ్వరములు హరించును.

## క్షయాదులకు లోకనాథరసము.

శుద్ధో బుభుక్షితస్సూతో భాగద్వయమితో భవేత్,
తథా గన్ధస్య భాగౌ ద్వౌ కుర్యాత్కజ్జలికాం ద్వయోః. 58
సూతాచ్చతుర్గుణేష్వేవ కపర్దేషు వినిక్షిపేత్,
భాగైకం టఙ్కణం దత్వా గోక్షీరేణ విమర్దయేత్. 59
తథా శఙ్ఖస్య ఖణ్డానాం భాగానష్టౌ ప్రకల్పయేత్,
క్షిపేత్సర్వం పుటస్యాన్తశ్చూర్ణలిప్తశరావయోః. 60
గర్తే హస్తోన్మితే ధృత్వా పచేద్గజపుటేన చ,
స్వాంగశీతం సముద్ధృత్య పిష్ట్వా తత్సర్వమేకతః. 61
షడ్గుఞ్జాసమ్మితం చూర్ణమేకోనత్రింశదూషణైః,
ఘృతేన వాతజే దద్యాన్నవనీతేన పిత్తజే 62
క్షౌద్రేణ శ్లేష్మజే దద్యాదతీసారే క్షయే తథా,
అరుచౌ గ్రహణీరోగే కార్శ్యే మన్దానలే తథా. 63
కాసే శ్వాసేషు గుల్మేషు లోకనాథో రసో హితః,
తస్యోపరి ఘృతాన్నఞ్చ భుఞ్జీత కబలత్రయమ్. 64
మఞ్చే క్షణైకముత్తానం శయీతానుపధానకే,
అనమ్లమన్నం సఘృతం భుఞ్జీత మధురం దధి. 65
ప్రాయేణ జాఙ్గలం మాంసం ప్రదేయం ఘృతపాచితం,
సదుగ్ధభక్తం దద్యాచ్చ జాతేఽగ్నౌ సాన్ద్రభోజనే. 66
సఘృతాన్ముద్గవటకావ్యఞ్జనేష్వవచారయేత్,
తిలామలకకల్కేన స్నాపయేత్సర్పిషాఽథవా. 67
అభ్యంజయేత్సర్పిషా చ స్నానం కోష్ణోదకేన చ,
క్వచిత్తైలం న గృహ్ణీయాన్న బిల్వం కారవేల్లకమ్. 68

వార్తాకం శఫరీం చిఞ్చాం త్యజేద్వ్యాయామమైథునం,
మద్యం సన్ధానకం హిఙ్గుశుణ్ఠీమాషాన్మసూరికాః. 69
కూశ్మాణ్డం రాజికాం కోపం కాఞ్జికఞ్చైవ వర్జయేత్,
త్యజేదయుక్తనిద్రాఞ్చ కాంస్యపాత్రే చ భోజనమ్. 70
కకారాదియుతం సర్వం త్యజేచ్ఛాకఫలాదికం,
పథ్యోఽయం లోకనాథస్తు శుభనక్షత్రవాసరే. 71
పూర్ణాతిథౌ శుక్లపక్షే జాతే చన్ద్రబలే తథా,
పూజయిత్వా లోకనాథం కుమారీం భోజయేత్తతః. 72
దానం దద్యాద్ద్విఘటికా మధ్యే గ్రాహ్యో రసోత్తమః,
రసాత్సంజాయతే తాపస్తదా శర్కరయా యుతమ్. 73
సత్వం గుడూచ్యా గృహ్ణీయాద్వంశరోచనయా యుతం,
ఖర్జూరం దాడిమం ద్రాక్షామిక్షుఖండాని చారయేత్. 74
అరుచౌ నిస్తుషం ధాన్యం ఘృతభృష్టం సశర్కరం,
దద్యాత్తథా జ్వరే ధాన్యం గుడూచీక్వాథమాహరేత్. 75
ఉశీరవాసకక్వాథం దద్యాత్సమధుశర్కరం,
రక్తపిత్తే కఫే శ్వాసే కాసే చ స్వరసంక్షయే. 76
అగ్నిభృష్టం జయాచూర్ణం మధునా నిశి దీయతే,
నిద్రానాశేఽతిసారే చ గ్రహణ్యాం మన్దపావకే. 77
సౌవర్చలాఽభయాకృష్ణా చూర్ణముష్ణజలైః పిబేత్,
శూలేఽజీర్ణే తథా కృష్ణా మధుయుక్తా జ్వరే హితా. 78
ప్లీహోదరే వాతరక్తే ఛర్ద్యాం చైవ గుదాఙ్కురే,
నాసికాప్లుతరక్తేషు రసం దాడిమపుష్పజమ్. 79
దూర్వాయాస్స్వరసం నస్యే ప్రదద్యాచ్ఛర్కరాయుతం,
కోలమజ్జాకణాబర్హిపక్షభస్మ సశర్కరమ్. 80
మధునా లేహయేచ్ఛర్దిహిక్కాకోపస్య శాన్తయే,
విధిరేషః ప్రయోజ్యస్తు సర్వస్మిన్పోటలీరసే. 81
మృగాఙ్కే హేమగర్భే చ మౌక్తికాఖ్యే రసేషు చ,
ఇత్యేవం లోకనాథాఖ్యో రసస్సర్వరుజో జయేత్. 82

శుద్ధిచేయఁబడి బుభుక్షితంబగు పాదరసము రెండుభాగములు, శుద్ధగంధకము రెండు భాగములు వీనిని ఖల్వములో వైచి నూరి కజ్జలీఁగావించి, రసమునకు నాల్గింతలు పసుపు రంగుగల గవ్వలలో నీకజ్జలినివైచి వెలిగారమును పాలతోనూఱి యాగవ్వకుసంధిబంధము గావించి రెండుశరావములనుదెచ్చి యందొకదానికి సున్నముపూసి రసమునకు ఎనిమిదింతలు శంఖమును ముక్కలుగాచేసి యందు సగము నాశరావములోపోసి యాతునకల పైన నీగవ్వ నునిచి దానిపై మిగిలిన శంఖపుతునకలనుబోసి సున్నముతో చెరమఁబడిన రెండవ శరావమును మూఁతవైచి గట్టిగా సంధిబంధముగావించి యెండించి నలుచదర మగనుండి గజములోతుగలగోయి త్రవ్వి యందు మరల నొకమూరగలగోయిత్రవ్వి యందు నీశరావమునుంచి గజపుటంబిడి స్వాంగశీతలమైన పిమ్మట నాయౌషధమును తీసి ఖల్వముననునిచి చూర్ణముగావింపవలెను. ఇది లోకనాథరసమనంబడును. ఈలోకనాథరసమును ఆఱుగురిగింజలయెత్తును, ఇరువదితొమ్మిదిమిరియములతో వాతరోగంబునను, వెన్నతో పిత్తరోగంబునను, తేనెతో శ్లేష్మరోగంబునను నొసంగవలయును. మఱియు నీరసము అతిసారము, క్షయ, అరుచి, గ్రహణి, కార్శ్యము, అగ్నిమాంద్యము, శ్వాసము, గుల్మము ఈరోగంబులందు హితంబై యుండును. దీనిని సేవించినతోడనే ఘృతాన్నమును మూఁడు గ్రాసములుభుజించి మంచముమీఁద పఱుపులేకనే క్షణకాలము వెల్లకిల బరుండవలయును. మఱియు పులుసు వర్జించి నేయి, పెరుఁగు వీనితో నన్నమును భుజించవలెను. జింకమొదలగువాని మాంసమును నేతితో వేయించి విశేషముగా భక్షించవలయును. సాయంకాలమున ఆఁకలి యయ్యెనేని పాలయన్నమును భుజింపవచ్చును. నోటికిరుచి నిమిత్తము పెసర వడలను నేతితోఁజేసి భక్షింపవచ్చును. నువ్వులు, ఉసిరికపప్పు వీనిని నూరిగాని నేతిని గాని శరీరమునకు లేపనముచేసికొని కించిదుష్ణోదకంబున స్నానముజేయందగును. తిలతైలమును ముట్టగూడదు. మారేడు, కాకరకాయలు, వంగకాయలు, చిన్నచేపలు, చింతపండు, మద్యములు, ఇంగువ, శుంఠి, మినుములు, మసూరధాన్యము, గుమ్మడికాయ, ఆవాలు, కాంజికము, కారవల్లి మొదలగువానిని, ఆకుకూరలను, ఫలముల త్యజింపవలెను. శ్రమ నొందుట, మైథునము, ఆగ్రహము, పగటినిద్ర, కంచుగిన్నెలో భుజించుట వర్జింపవలెను. మఱియు నీలోకనాథరసమును, శుక్లపక్షమునందు శుభనక్షత్రముతోగూడిన పంచమి, దశమి, పౌర్ణమి మొదలగుతిథులయందు తనకు చంద్రతారాబలములు చూచికొని కన్యకనుపూజించి భోజనంబిడి శక్త్యనుసారంబుగ సువర్ణాదుల నొసంగి ఉదయమున రెండు గడియలలోపుననే సేవింపవలయును. దీనిని సేవించుటచే శరీరమునకు తాపము గలిగెనేని చక్కెర, తిప్పసత్తు, వెదురుప్పు వీనిని కలిపి పుచ్చుకొనవలెను. ఖర్జూరము, దానిమ్మపండు, ద్రాక్షపండు, చెఱకు వీనిని కొంచెముగ భక్షించుచుండవలెను. ఇటులంజేసిన తాపము హరించును. మఱియు నీలోకనాథరసమును ధనియములను నేతితోవేయించి యందు శర్కరగలిపి పుచ్చుకొనిన అరోచకము, దనియములు, తిప్పతీఁగ వీని కషాయం

ఋతో సేవించిన జ్వరములు, వట్టివేళ్లు, అడ్డసరపాకు కషాయంబున తేనె, చక్కెర గలిపి సేవించిన రక్తపిత్తము, కాసము, శ్వాసము, స్వరభంగము అనురోగంబులు నశించును. బంగియాకును చూర్ణముచేసి యందు కొంచెము తేనె వైచి దానితో రాత్రులయందు సేవించిన నిద్రగల్గును. మఱియు అతిసారము, గ్రహణి నశించి అగ్నిదీప్తిగల్గును. సౌవర్చలవణము, కరకకాయలు, పిప్పళ్లు వీనిచూర్ణమునుగలిపి యుష్ణోదకంబుతో సేవించిన శూల, అజీర్ణము నశించును. పిప్పలిచూర్ణమును తేనెగలిపి పుచ్చుకొనిన జ్వరములు నశించును. దానిమ్మపువ్వులరసముతో సేవించిన ప్లీహము, వాతరక్తము, వాంతి, మూలవ్యాధి, ముక్కునుండిరక్తముగాఱుట నశించు. గరికెగడ్డిరసముల శర్కరగలిపి అందు నీయౌషధమును చేర్చి నస్యముజేసిన ముక్కులో స్రవించెడి రక్తము హరించు. రేగువిత్తులలోని నిప్పుపిప్పళ్లు, నెమలిరెక్కలభస్మము వీనియందు శర్కర, తేనె గలిపి దానితో పుచ్చుకొనిన, వాంతులు, ఎక్కిళ్లు హరించు. మఱియు నీయోగంబున చెప్పఁబడిన పథ్యాహార, విహారఅనుపానములను, మృగాంకపోటలీరసము, హేమగర్భపోటలీరసము, మౌక్తికము మొదలగువానియందనుష్ఠింపఁదగును.

### క్షయరోగములకు లఘులోకనాథరసము.

వరాటభస్మమణ్డూరం చూర్ణయిత్వా ఘృతే పచేత్,
తత్సమం మరిచం చూర్ణం నాగవల్ల్యా విభావితమ్. 83
తచ్చూర్ణం మధునా లేహ్యమథవా నవనీతకైః,
మాషమాత్రం క్షయం హన్తి యామే యామే చ భక్షితమ్.
లోకనాథరసో హ్యేష మణ్డలాద్రాజయక్ష్మనుత్,

గవ్వభస్మము ఒకభాగము, మండూరము ఒకభాగము, మిరియములచూర్ణము రెండుభాగములు వీనిని ఖల్వంబున నేయి, తమలపాకులరసము వీనితోమర్దించి మాష ప్రమాణముగ మాత్రలుచేసి తేనెతోగాని, వెన్నతోగాని యామమున కొకసారి సేవించిన రాజయక్ష్మము మండలమునకు నివర్తించును.

### క్షయరోగములకు మృగాంకపోటలీరసము.

భూర్జపత్త్రనుపత్త్రాణి హేమ్నస్సూక్ష్మాణి కారయేత్. 85
తుల్యాని తాని సూతేన ఖల్వే క్షిప్త్వా విమర్దయేత్,
కాఞ్చనారరసేనైవ జ్వాలాముఖ్యా రసేన వా. 86
లాంగల్యా వా రసైస్తావద్యావద్భవతి పిష్టకః,
తతో హేమ్నశ్చతుర్థాంశం టఙ్కణం తత్ర నిక్షిపేత్. 87
పిష్టిమౌక్తికచూర్ణం చ హేమద్విగుణమావపేత్,

తేషు సర్వసమం గన్ధం క్షిప్త్వా చైకత్ర మర్దయేత్. 88
తేషాం కృత్వా తతో గోలం వాసాభిః పరివేష్టయేత్,
పశ్చాన్మృదా వేష్టయిత్వా శోచయిత్వా చ ధారయేత్. 89
శరావసమ్పుటస్యాంతే తత్ర ముద్రాం ప్రదాపయేత్,
లవణాపూరితే భాణ్డే ధారయేత్తం చ సమ్పుటమ్. 90
ముద్రాం దత్వా శోషయిత్వా బహుభిర్గోమయైః పుటేత్,
తతశ్శీతే సమాహృత్య గన్ధం సూతసమం క్షిపేత్. 91
ఘృష్ట్వా చ పూర్వవత్కల్వే పుటేద్గజపుటేన చ,
స్వాఙ్గశీతం తతో నీత్వా గుంజాయుగ్మం ప్రకల్పయేత్. 92
అష్టభిర్మరిచైర్యుక్తో కృష్ణాత్రయయుతోఽథవా,
విలోక్య దేయో దోషాదీనేకైకా రసరక్తికా. 93
సర్పిషా మధునావాపి దద్యాద్దోషాద్యపేక్షయా,
లోకనాథసమం పథ్యం కుర్యాత్స్వస్థమనాశ్శుచిః. 94
శ్లేష్మాణం గ్రహణీం కాసం శ్వాసం క్షయమరోచకం,
మృగాంకోఽయం రసో హన్యాత్కృశత్వం బలహానితామ్. 95

బంగారురేకులను భుజపత్రమువలె పలచగఁ జేసి దానికిసమముగ శుద్ధసూతంబును గలిపి దేవకాంచనపురసమునగాని, జ్వాలాముఖీరసమునగాని, చెన్నచెర్లగడ్డరసమునగాని బాగుగానూఁటి పిమ్మట బంగారమునకు నాలవపాలు వెలిగారముగలిపి, బంగారమునకురెండింతలు ముత్తియపుభస్మము గలిపి అన్నిటికిని సమముగ గంధకముగలిపి పూర్వపురసములలో నెద్దానిచే నైన మర్దించి యడ్డసరపాకులలో చుట్టి మన్నుపూసి యెండించి శరావంబుననుంచి చీలజేసి కుండలోసగమువరకు నుప్పుఁబోసి దానిపైనాశరావంబునిడి దానిపై మరలనుప్పుఁబోసి యాకుండమూఁతి కొకశరావంబునుమూసి చీలమన్నునెండించి, ఆవుయేరుపిడకలతో గజపుటంబిడి స్వాంగశీతలంబైన పిదప గ్రహింపవలయును. మరల నీరసమునకు సమముగా గంధకము, పాదరసము వీనినిగలిపి పూర్వపురసములలో నెద్దానిచే నైన మర్దించి మరల గజపుటంబిడి స్వాంగశీతలంబైన పిదప నీయౌషధమును రెండుగురిగింజల ప్రమాణమును ఎనిమిదిమిరియములచూర్ణముతోగాని, మూఁడుపిప్పళ్లచూర్ణముతోగాని, దోషతారతమ్యముచే తేనెతోగాని, నేతితోగాని, ఆయారోగంబుల కనుకూలమగు ననుపానముతోగాని యొసంగిన శ్లేష్మము, గ్రహణి, కాసము, శ్వాసము, క్షయ, అరోచకము, కార్శ్యము, దౌర్బల్యము నశించును. ఇందు లోకనాథరసంబున చెప్పఁబడిన పథ్యమును చేయందగును. ఇయ్యది ప్రసిద్ధంబగు మృగాంకపోటలీరస మనంబడును.

కఫక్షయాదులకు హేమగర్భపోటలీరసము.

సూతాత్పాదప్రమాణేన హేమ్నః పిష్టం ప్రకల్పయేత్,
తయోస్సాన్ద్విగుణో గన్ధో మర్దయేత్కాంచనారిణా. 96
కృత్వా గోలం తతః పేస్మాషాసమ్పుటే ముద్రయేత్తతః,
పచేద్భూధరయన్త్రేణ వాసరత్రితయం బుధః. 97
తత ఉద్ధృత్య తత్సర్వం దద్యాద్గంధం చ తత్సమం,
మర్దయేచ్చార్ద్రికరసైశ్చిత్రకస్వరసేన చ. 98
స్థూలపీతవరాటాంశ్చ పూరయేత్తేన యుక్తితః,
ఏతస్మాదౌషధాత్కుర్యాదష్టమాంశేన టఙ్కణమ్. 99
టఙ్కణార్ధం విషం దత్వా పిష్ట్వా సేహుండదుగ్ధకైః,
ముద్రయేత్తేన కల్కేన వరాటానాం ముఖాని చ. 100
భాణ్డే చూర్ణప్రలిప్తేఽథ ధృత్వా ముద్రాం ప్రదాపయేత్,
గర్తే హస్తోన్మితే ధృత్వా పుటేద్గజపుటేన చ. 101
స్వాంగశీతం రసం జ్ఞాత్వా ప్రదద్యాల్లోకనాథవత్,
పథ్యం మృగాఙ్కవద్దేయం త్రిదినం లవణం త్యజేత్. 102
యదా ఛర్దిర్భవేత్తస్య దద్యాచ్ఛిన్నా శృతం తథా,
మధుయుక్తం తథా శ్లేష్మకోపే దద్యాద్గుడార్ద్రికమ్. 103
విరేకే భర్జితాభఙ్గా ప్రదేయా దధిసంయుతా,
జయేత్కాసం క్షయం శ్వాసం గ్రహణీమరుచిం తథా. 104
అగ్నిం చ కురుతే దీప్తం కఫవాతం నియచ్ఛతి,
హేమగర్భః పరో జ్ఞేయో రసః పోటలికాభిధః. 105

శుద్ధిచేసిన పాదరసము ఒకభాగము, సువర్ణము పాదరసములో నాలవభాగము, ఈ రెంటెని సమముగ గంధకమును గ్రహించి దేవకాంచనపురసముతో మర్దించి యుండఁ జేసి శరావసంపుటంబుననుంచి యాశరావంబులకు సంధిబంధముగావించి భూధరయంత్రంబున మూఁడుదినంబులు పుటంబిడి పిమ్మట స్వాంగశీతలమైనతోడనే, యాయౌషధమునకు సమముగ శుద్ధగంధకమును బోసి అల్లపురసముతోడను, చిత్రమూలరసముతోడను మర్దించి యద్దానిని పసుపురంగుగల గవ్వలలోనుంచి యాగవ్వలముఖమున ఔషధమున కెనిమిదవపాలు టంకణము, టంకణమునకు అర్ధభాగము వత్సనాభి వీనిని బొ౦(?) జెముడుపాలలోమర్దించి సంధిబంధముగావించి యొకకుండకు అడుగున సున్నము

పూసి యాగవ్వల నాకుండలోనుంచి దానికి పైన నొకకుండను బోర్లించి సంధిబంధము గావించి మూర ప్రమాణము లోతుగలగోతిలో గజపుటంబిడి స్వాంగశీతలంబైన పిమ్మట నీయౌషధమును లోకనాథరసమువలెను, మృగాంకరసమువలెను పథ్యములతోడను, అనుపానంబులతోడను సేవింపందగును. ఈయౌషధసేవయందు మూండుదినములు ఉప్పును విసర్జించవలెను. ఈయౌషధంబుచే వాంతియగుచుండిన తిప్పతీఁగకషాయంబున తేనెగలిపి సేవించిన వాంతులు మానును. కఫప్రకోపంబయ్యెనేని బెల్లమును, అల్లము చేర్చి సేవింపదగును. విరేచనంబులయ్యెనేని బంగియాకునుకొంచెమువేయించి పెరుగుతో సేవింపవలెను. ఈహేమగర్భపోటలీరసమును సేవించుటచే కాసము, శ్వాసము, గ్రహిణి, అరోచకము, కఫవాతము నశించును. అగ్నిదీప్తి గలిగించును.

కఫక్షయాదులకు రెండవహేమగర్భపోటలీరసము.

రసస్య భాగాశ్చత్వారస్తావన్తః కనకస్య చ,
తయోశ్చ పిష్టికాం కృత్వా గన్ధో ద్వాదశభాగికః. 106
కుర్యాత్కజ్జలికాం తేషాం ముక్తాభాగాశ్చ షోడశ,
చతుర్వింశశ్చ శంఖస్య భాగైకం టఙ్కణస్య చ. 107
ఏకత్ర మర్దయేత్సర్వం పక్వనిమ్బూకజైరసైః,
కృత్వా తేషాం తతో గోలం మూషాసమ్పుటకే న్యసేత్. 108
ముద్రాం దత్వా తతో హస్తమాత్రే గర్తే చ గోమయైః,
పుటేద్గజపుటేనైవ స్వాఙ్గశీతం సముద్ధరేత్. 109
పిష్ట్వా గుఞ్జాచతుర్మానం దద్యాద్గవ్యాజ్యసంయుతం,
ఏకోనత్రింశదున్మానమరీచైస్సహ దీయతే. 110
రాజతే మృణ్మయే పాత్రే కాచజే వాఽవలేహయేత్,
లోకనాథసమం పథ్యం కుర్యాత్ప్రయతమానసః. 111
కాసే శ్వాసే క్షయే వాతే కఫే గ్రహణికాగదే,
అతిసారే ప్రయోక్తవ్యా పోటలీ హేమగర్భికా. 112

శుద్ధిచేసినరసము నాలుగుభాగములు, బంగారము నాలుగుభాగములు వీనిని ఖల్వముననూరి పిమ్మట గంధకమును రసమునకు పదిరెండింతలు గలిపి కజ్జలిచేసి పిమ్మట ముత్యపుభస్మమును రసమునకు పదునాఱింతలు గలిపి టంకణము ఒకభాగము, శంఖభస్మము ఇరువదినాలుగుభాగములు గలిపి ముదురు వేసచెక్కరసముతో మర్దించి పిమ్మట యుండచేసి దానిమూసలోనుంచి పైన నొకమూసయుంచి సంధిబంధముగావించి మూరెడుగోతిలో ఆవుపేరుపిడకలచే గజపుటంబిడి స్వాంగశీతలమైన పిమ్మట దానినిమెత్తగానూఱి నాలుగుగురి

గింజలప్రమాణమును పదితొమ్మిదిమిరియముల చూర్ణముతోఁ గలిపి తరువాత నావు నేయితో గలిపి వెండిపాత్రమునగాని, మంటిపాత్రమునగాని యుంచి శుద్ధాంతఃకరణముతో సేవించిన కాసము, శ్వాసము, క్షయము, వాతకఫము, గ్రహణి, అతిసారము నశించును. ఇందు లోకనాథరసంబున చెప్పఁబడిన పథ్యమును చేయవలయును. ఇయ్యది రెండవ హేమగర్భపోటలీరస మనంబడును.

విషమజ్వరములకు మహాజ్వరాంకుశము.

శుద్ధసూతో విషం గన్ధః ప్రత్యేకం శాణసమ్మితాః,
ధూర్తబీజం త్రిశాణం స్యాత్సర్వేభ్యో ద్విగుణా భవేత్. 113
హేమాహ్వా కారయేదేషాం సూక్ష్మం చూర్ణం ప్రయత్నతః,
దేయం జమ్బీరమజ్జాభిశ్చూర్ణం గుఞ్జాద్వయోన్మితమ్. 114
ఆర్ద్రకస్యరసైర్వాపి జ్వరం హన్తి త్రిదోషజం,
ఏకాహికం ద్వ్యాహికం వా త్ర్యాహికం వా చతుర్థకమ్. 115
విషమం చ జ్వరం హన్యాద్విఖ్యాతోఽయం జ్వరాఙ్కుశః,

శుద్ధిచేసినరసము ఒకశాణము, శుద్ధిచేసిన వత్సనాభి ఒకశాణము, శుద్ధిచేసిన గంధకము ఒకశాణము, శుద్ధిచేసిన ఉమ్మెత్తవిత్తులు మూఁడుశాణములు పీనికన్నిటికిని రెండింతలు నేలతంగేడువిత్తులు, ఇటుల పీనినన్నిటిని మెత్తగచూర్ణముగావించి యాచూర్ణమును రెండుగురిగింజలప్రమాణమును నిమ్మపండ్లరసముతోగాని, అల్లపురసముతోగాని సేవించిన సన్నిపాతజ్వరము, సంతతజ్వరము, సతతజ్వరము, అన్యేద్యుష్కము, తృతీయకజ్వరము, చతుర్థకజ్వరము, విషమజ్వరము నశించును. ఇయ్యది సుప్రసిద్ధంబగు జ్వరాంకుశరస మనంబడును.

అతిసారములకు ఆనందభైరవరసము.

దరదం వత్సనాభం చ మరిచం టంకణం కణామ్. 116
చూర్ణయేత్సమభాగేన రసో హ్యానందభైరవః,
గుఞ్జైకం వా ద్విగుఞ్జం వా బలం జ్ఞాత్వా ప్రయోజయేత్. 117
మధునా లేహయేచ్చాను కుటజస్య ఫలం త్వచం,
చూర్ణితం కర్షమాత్రం తు త్రిదోషోత్థాతిసారనుత్. 118
దధ్యన్నం దాపయేత్పథ్యం గవ్యాజ్యం తక్రమేవ చ,
పిపాసాయాం జలం శీతం విజయా చ హితా నిశి. 119

శుద్ధిజేసినఇంగిలీకము, శుద్ధిచేసినవత్సనాభి, మిరియములు, టంకణము, పిప్పళ్లు వీనిని సమభాగంబులుగ చూర్ణముగావించి రోగబలానుసారంబుగ ఒక గురిగింజప్రమాణముగాని, రెండుగురిగింజలప్రమాణముగాని, కర్షప్రమాణముగ కొడిసెపాలవిత్తులు, పట్ట వీనిచూర్ణమును కలిపి తేనెతో సేవించిన త్రిదోషాతీసారము నశించును. ఇయ్యది శ్రేష్ఠంబగు ఆనందభైరవరస మనంబడును. ఇందు ఆవునేయి, పెరుఁగు, మజ్జిగ వీనితో నెద్దానిచేనైన యన్నమును భుజింపవలెను. శీతోదకము పానంబుచేయఁదగును. రాత్రియందు బంగియాకును సేవించుట ఉత్తమంబు.

సన్నిపాతాదులకు లఘుసూచికాభరణరసము.

విషం పలమితం సూతశ్శాణికశ్చూర్ణయేద్ద్వయం,
తచ్చూర్ణం సమ్పుటే క్షిప్త్వా కాచలిప్తశరావయోః. 120
ముద్రాం దత్వా చ సంశోష్య తతశ్చుల్ల్యాం నివేశయేత్,
వహ్నిం శనైశ్శనైః కుర్యాత్ప్రహరద్వయసఙ్ఖ్యయా. 121
తత ఉద్ఘాట్య తన్ముద్రాముపరిస్థశరావకే,
సంలగ్నో యో భవేత్సూతస్తం గృహ్ణీయాచ్ఛనైశ్శనైః. 122
వాయుస్పర్శో యథా న స్యాత్తథా కుప్యాం నివేశయేత్,
యావత్సూచ్యాముఖే లగ్నం కుప్యా నిర్యాతి భేషజమ్. 123
తావన్మాత్రో రసో దేయో మూర్ఛితే సన్నిపాతిని,
క్షురేణ ప్రక్షిపేన్మూర్ధ్ని తత్రాంగుల్యా చ ఘర్షయేత్. 124
రక్తభేషజసమ్పర్కాన్మూర్ఛితోఽపి హి జీవతి,
తథైవ సర్పదష్టస్తు మృతావస్థోఽపి జీవతి. 125
యదా తాపో భవేత్తస్య మధురం తత్ర దీయతే,

శుద్ధిచేసినవత్సనాభి ఒకపలము, శుద్ధిచేసినపాదరసము ఒకశాణము వీనిని చూర్ణముగావించి యాచూర్ణమును గాజుపూసినమంటి శరావంబున నుంచి పిమ్మటఁ దానిపైన మరల గాజుపూసినశరావము బోర్లించి సంధిబంధము గావించి యారఁబెట్టి రెండుజాములు సూక్ష్మాగ్నిచే వండి స్వాంగశీతలమైన పిమ్మట విప్పి పైశరావంబున నంటియున్న పాదరసమును గ్రహించి దానిని గాలిసోకని గాజుకుప్పెలోనుంచవలెను. సన్నిపాతముచే మూర్ఛఁ జెందియున్న రోగియొక్క శిరంబుననున్న వెండ్రుకలను నూడదీసి యాస్థలమున నీయౌషధము సూది మొనకు వచ్చునంతవేసి యారసములోనఁ బ్రవేశించి రక్తముతోఁగలియు నటుకును వ్రేలితో మర్దించవలెను. మఱియు నాస్థలమున పాలు పోయవలెను. ఇట్లుచేసిన

వాఁడు తెలివి నొంది జీవించును. ఇట్లనే పాముగఱచినవానికిఁగూడ నీయఁదగును. ఈచికిత్సచే తాపముగలిగెనేని మధుర, శీతలపదార్థముల నీయం దగును.

సన్నిపాతములకు జలచూడామణిరసము.

భస్మసూతసమం గన్ధం గన్ధాత్పాదం మనశ్శిలామ్ 126
మాక్షికం పిప్పలీవ్యోషం ప్రత్యేకం శిలయా సమం,
చూర్ణయేద్భావయేత్పిత్తైర్మత్స్యమాయూరసమ్భవైః. 127
సప్తధా భావయేచ్ఛుష్కం దేయం గుఞ్జాద్వయం హితం;
తాలపర్ణీరసం చాను పఞ్చకోలశృతేన వా. 128
జలచూడరసో నామ సన్నిపాతం నియచ్ఛతి,
జలయోగశ్చ కర్తవ్యస్తేన వీర్యం భవేద్రసే. 129

రసభస్మము ఒకభాగము, శుద్ధగంధకము ఒకభాగము, శుద్ధిచేసిన మణిశిల నాలవభాగము, స్వర్ణమాక్షికము, పిప్పళ్లు, త్రికటుకములు ఇవి ప్రత్యేకముగా మణిశిలతో సమానభాగములు. ఇట్లు వీని చూర్ణముగావించి చేప, నెమలి వీనిపిత్తములతో నేడుమాఱులు భావనచేసి ఎండించి నేలతాడి గడ్డరసముతోగాని, పంచకోలకషాయముతోగాని, రెండు గురిగింజలప్రమాణమును సేవించిన సన్నిపాతము హరించును. మఱియుం రోగియుండెడిస్థలమున నీరుచల్లుచుండిన నీరసమునకు వీర్యము వృద్ధియగును. ఇందు పిప్పళ్లు త్రికటుకములకంటె మఱల వేఱుగా చెప్పుటచే మణిశిలకంటె రెండింతలు గ్రహింపవలెనని భావము. ఇది జలచూడామణి రసము.

సన్నిపాతములకు పఞ్చవక్త్రరసము.

శుద్ధసూతం విషం గన్ధం మరీచం టంకణం కణా,
మర్దయేద్ధూర్తజైర్ద్రావైర్దినమేకన్తు శోషయేత్. 130
పఞ్చవక్త్రో రసో నామ ద్విగుఞ్జస్సన్నిపాతహా,
అర్కమూలకషాయస్తు సత్ర్యూషమనుపాయయేత్. 131
యుక్తం దధ్యోదనం పథ్యం జలయోగం చ కారయేత్,
రసేనానేన శామ్యన్తి సక్షౌద్రేణ కఫాదయః. 132
మధ్వార్ద్రకరసం చాను పిబేదగ్నివివృద్ధయే,
యథేష్టం ఘృతమాంసాశీ శక్తో భవతి పావకః. 133

శుద్ధిచేసిన పాదరసము, శుద్ధిచేసిన వత్సనాభి, శుద్ధగంధకము, మిరియము, టంకణము పిప్పళ్లు వీనిని సమముగ ఉమ్మెత్తరసముతో నొక దినము మర్దించి, యందు రెండు గురిగింజల ప్రమాణమును త్రికటుకచూర్ణమును గలిపి జిల్లేడువేళ్లకషాయంబుతో సేవిం

చిన సన్నిపాతము హరించును. తేనెతో సేవించిన కఫరోగములు హరించును. మఱియు వీనిని అల్లపురసము, తేనె వీనితోఁగలిపి సేవించి నేయి, మాంసము వీనిని యథేష్టముగ భుజించినను అగ్నిదీప్తి గలుగును. మఱియు సన్నిపాతరోగికి పెరుఁగుతో నన్నముఁ బెట్టి, యాస్థలమున పూర్వమువలెనే నీటిని జల్లవలెను.

సన్నిపాతములకు ఉన్మత్తరసము.

రసం గంధకతుల్యాంశం ధత్తూరఫలజై రసైః,
మర్దయేద్దినమేకం చ తత్తుల్యత్రికటుం క్షిపేత్. 134
ఉన్మత్తాఖ్యో రసో నామ్నా నస్యే స్యాత్సన్నిపాతజిత్,

శుద్ధిజేసిన పాదరసము ఒక భాగము, శుద్ధగంధకము ఒక భాగము, త్రికటుకములు రెండు భాగములు వీనిని ఉమ్మెత్తకాయలరసముతో ఒకదినము మర్దించి సన్నిపాతరోగికి నస్యముగావించిన సన్నిపాతము హరించును.

సన్నిపాతములకు అంజనము.

నిస్త్వక్ జైపాలబీజం చ దశనిష్కం విచూర్ణయేత్. 135
మరీచం పిప్పలీ సూతం ప్రతినిష్కం విమిశ్రయేత్,
భావ్యో జమ్బీరజైర్ద్రావైస్సప్తాహం సమ్ప్రయత్నతః. 136
రసోఽయమంజనే దత్తస్సన్నిపాతం వినాశయేత్,

పొట్టుతీసి శుద్ధిజేసిన నేపాళపుపప్పు పది నిష్కములు, మిరియములు, పిప్పళ్లు, రసభస్మము ఇవి ప్రత్యేకముగా నొక్కొక్కనిష్కము. వీనిని నిమ్మపండ్లరసముతో నేడు దినములు భావనచేసి యెండించి దానిని అంజనముచేసిన సన్నిపాతము హరించును.

శూలాదులకు నారాచరసము.

సూతం టంకణకం తుల్యం మరీచం సూతతుల్యకమ్. 137
గన్ధకః పిప్పలీ శుంఠీ ద్వౌ ద్వౌ భాగౌ విచూర్ణయేత్,
సర్వతుల్యం క్షిపేద్దన్తి బీజం నిస్తుషితం భిషక్. 138
ద్విగుఞ్జం రేచనం సిద్ధం నారాచోఽయం మహారసః,
ఆధ్మానం శూలవిష్టంభముదావర్తం చ నాశయేత్. 139

శుద్ధిచేసిన పాదరసము ఒక భాగము, టంకణము ఒక భాగము, మిరియములు ఒక భాగము, శుద్ధగంధకము రెండు భాగములు, పిప్పళ్లు రెండు భాగములు, సొంటి రెండు భాగములు గ్రహించి వీనికన్నిటికి సమముగా శుద్ధిచేసిన నేపాళపువిత్తులను గలిపి చక్కఁగ మర్దించి రెండుగురిగింజలంత మాత్రలుచేసి యొకమాత్రను ఉష్ణోదకంబుతో

సేవించిన రేచనంబై కడుపుబ్బరము, శూలము, మలబంధము, ఉదావర్తము నశించును. ఇది నారాచరసం బనంబడును.

### శూలలకు ఇచ్ఛాభేదీరసము.

దరదం టంకణశ్శుంఠీ పిప్పలీ చేతి కార్షికాః,
హేమాహ్వా పలమాత్రా స్యాద్దన్తీబీజం చ తత్సమమ్. 140
విచూర్ణైకత్ర సర్వాణి గోదుగ్ధేనైవ పాయయేత్,
త్రిగుఞ్జం రేచనం దద్యాద్విష్టం చాధ్మానరోగిషు. 141

శుద్ధిచేసిన ఇంగిలీకము, వెలిగారము, పిప్పళ్లు, శుంఠి ఇవి ప్రత్యేకముగా నొక్కొక్క కర్షము, ఉమ్మెత్తవిత్తులు ఒక పలము, నేపాళపువిత్తులు ఒక పలము ఇటుల వీనిని చూర్ణముగావించి మూఁడు గురిగింజల ప్రమాణముగా ఆవుపాలతో సేవించిన విరేచనంబై మలబంధము, ఉబ్బరము నశించును.

### ప్రమేహములకు వసంతకుసుమాకరము.

ద్వౌ భాగౌ హేమభూతేశ్చ గగనం చాపి తత్సమం,
లోహభస్మ త్రయోభాగాశ్చత్వారో రసభస్మనః. 142
వంగభస్మత్రిభాగం స్యాత్సర్వమేకత్ర మర్దయేత్,
ప్రవాళం మౌక్తికం చైవ రససామ్యేన యోజయేత్. 143
భావనా గవ్యదుగ్ధేన రసైర్ఘృష్ట్వా చ రూషకైః,
హరిద్రా వారిణా చైవ మోచకందరసేన చ. 144
శతపత్రరసేనాపి మాలత్యాస్స్వరసేన చ,
పశ్చాన్మృగమదశ్చంద్రతులసీరసభావితః. 145
కుసుమాకరనామాఽయం వసంతపదపూర్వకః,
గుంజాద్వయం దదీతాస్య మధునా సర్వమేహజిత్. 146
సితాచందనసంయుక్తశ్శ్లేష్మపిత్తాదిరోగజిత్,

సువర్ణభస్మము రెండుభాగములు, అభ్రకభస్మము రెండుభాగములు, లోహభస్మము మూఁడుభాగములు, రసభస్మము నాలుగుభాగములు, వంగభస్మము మూఁడు భాగములు, పగడభస్మము నాల్గుభాగములు, ముత్తియములభస్మము నాల్గుభాగములు ఇటుల వీనిని అడ్డసరపాకురసముతో మర్దించి పిమ్మట ఆవుపాలు, పసుపునీరు, అరటిదుంప రసము, తామరపువ్వులరసము, మాలతీపుష్పములరసము, కస్తూరి, పచ్చకర్పూరము, తులసి

యాకురసము వీనిలో ప్రత్యేకముగా భావనచేసి రెండుగురిగింజలంత ప్రమాణముం సేవించిన సర్వప్రమేహములు నశించును. మఱియు పంచదార, మంచిగంధ యనుపానంబుతో సేవించిన అమ్లపిత్తము మొదలగు రోగంబులు నశించును. సుప్రసిద్ధంబగు వసంతకుసుమాకరరసము.

## క్షయరోగమునకు రాజమృగాంకరసము.

భస్మసూతత్రయోభాగా భాగైకం హేమభస్మకం,
మృతాభ్రస్య చ భాగైకం శిలాగన్ధకతాళకమ్.
ప్రతిభాగద్వయం శుద్ధమేకీకృత్య విచూర్ణయేత్,
వరాటాన్పూరయేత్తేన చ్ఛాగిక్షీరేణ టఙ్కణమ్.
పిష్ట్వా తేన ముఖం రుద్ధ్వా మృద్భాండే తన్నిరోధయేత్,
శుష్కం గజపుటే పక్త్వా చూర్ణయేత్స్వాఙ్గశీతలమ్.
రసో రాజమృగాఙ్కోఽయం చతుర్గుంజః క్షయాపహః,
దశపిప్పలికాక్షౌద్రైరేకోనత్రింశదూషణైః.

రసభస్మము మూడుభాగములు, సువర్ణ (బంగారు) భస్మము ఒకభాగము భస్మము ఒకభాగము, శుద్ధిచేసినమణిశిల రెండుభాగములు, శుద్ధగంధకము రెం ములు ఇటుల వీనిని ఖల్వములో మెత్తగ చూర్ణముగావించి గవ్వలలోపైచి వా మును మేకపాలతోనూరిన టంకణముతో బంధముగావించి యెండించి మం ములోనుంచి దాని ముఖమును బంధించి యెండించి గజపుటంబిడి స్వాంగశీతలమై యా యౌషధమును గ్రహించి చూర్ణముగావించి యందు నాల్గు గురిగింజల మును పది పిప్పళ్లచూర్ణము, పది తొమ్మిది మిరియములచూర్ణము వీనితోఁజేర్చి తే సేవించిన రాజయక్ష్మము నశించును.

## క్షయరోగములకు స్వయమగ్నిరసము.

శుద్ధం సూతం ద్విధా గన్ధం కుర్యాత్ఖల్వేన కజ్జలీం,
తయోస్సమం తీక్ష్ణచూర్ణం మర్దయేత్కన్యకాద్రవైః.
ద్వియామాన్తే కృతం గోలం తామ్రపాత్రే వినిక్షిపేత్,
ఆచ్ఛాద్యైరండపత్రేణ యామార్ధే తూష్ణతాం వ్రజేత్.
ధాన్యరాశౌ న్యసేత్పశ్చాదహోరాత్రాత్సముద్ధరేత్,
సంచూర్ణ్య గాలయేద్వస్త్రేస్సత్యం వారితరం భవేత్.

భావయేత్కన్యకాద్రావైస్సప్తధా భృంగజైస్తథా,
కాకమాచీకురంటోత్థద్రవైర్ముండ్యాఖ్యపునర్నవైః. 154
సహదేవమృతానీల్యా నిర్గుండ్యాశ్చిత్రకైస్తథా,
సప్తధాతు పృథగ్ద్రావైర్భావ్యం శోష్యం తథాతపే. 155
సిద్ధయోగో హ్యయం ఖ్యాతస్సిద్ధానాం చ ముఖాగతః,
అనుభూతో మయా సత్యం సర్వరోగగణాపహః. 156
త్రిఫలామధుసంయుక్తస్సర్వరోగేషు యోజయేత్,
త్రికటుత్రిఫలైరేలాభిర్జాతీఫలలవంగకైః. 157
నవభాగోన్మితైరేతైస్సమః పూర్వరసో భవేత్,
సంచూర్ణ్య లోడయేత్క్షౌద్రైర్భక్ష్యం నిష్కద్వయం ద్వయమ్.
స్వయమగ్నిరసో నామ్నా క్షయకాసనికృన్తనః,

శుద్ధిచేసినపాదరసము ఒకభాగము, శుద్ధగంధకము రెండుభాగములు వీనిని ఖల్వములో కజ్జలిగావించి వీనికి సమముగా లోహభస్మముగలిపి కలబందమట్టల రసముచే రెండుజాములు మర్దించి పిమ్మట నీముద్దను తామ్రపాత్రలో నునిచి పైన, నాముదపుఆకులచే గప్పవలెను. దానిని నాలుగు గడియలుంచిన ఔష్ణ్యముచే పాకంబగును. పిమ్మట దానిని ధాన్యరాశియందు ఒకదినముంచి పిమ్మట నూరి వస్త్రగాలితముచేసిన నయ్యది వారితరం (నీటియందు తేలునది) బగును. పిమ్మట నాచూర్ణమును కలబందరసము, గుంటగలగరాకురసము, కాచిమాకురసము, గోరింటయాకురసము, బోడతరపురసము, తెల్లగలిజేరురసము, సహదేవియాకురసము, తిప్పతీగరసము, వావిలియాకురసము, చిత్రమూలరసము వీనిలో ప్రతిదానియందును నేడుమార్లు భావనచేసి ఎండనెండించి యాసిద్ధమగురసమును రెండునిష్కములు త్రిఫలాచూర్ణము, తేనె వీనితో సేవించిన సర్వరోగములు నశించును. త్రికటుకములు, త్రిఫలములు, ఏలకులు, జాజికాయ, లవంగములు వీనిని సమముచూర్ణముచేసి వీనికన్నిటికిని సమముగా నీయౌషధము గలిపి తేనెతో రెండునిష్కములు సేవించిన క్షయకాసములు నిస్సంశయముగ హరించును. ఇయ్యది అనుభూతంబగు స్వయమగ్నిరసమను సిద్ధయోగము.

### సర్వకాసములకు అమృతార్ణవరసము.

పారదం గంధకం శుద్ధం మృతలోహం చ టంకణమ్. 159
రాస్నావిడంగత్రిఫలా దేవదారుకటుత్రయం,

అమృతాపద్మకం క్షౌద్రం విశ్వం తుల్యాంశచూర్ణితమ్. 16
త్రిగుంజం సర్వకాసార్తస్సేవయేదమృతార్ణవం,

శుద్ధిచేసిన పాదరసము, శుద్ధగంధకము, లోహభస్మము, టంకణము, సన్నరాష్ట్రమ వాయువిళంగములు, త్రిఫలములు, దేవదారు, త్రికటుకములు, తిప్పతీఁగ, పద్మకముల శొంఠి వీనిని సమభాగంబులుగా తేనెతో మర్దనచేసి మూడుగురివిందగింజ లంతప్రమాణ మును అనుపానవిశేషంబుచే సేవించిన కాసరోగములన్నియు శమించును.

## శ్వాసలకు సూర్యావర్తరసము.

సూతార్ధో గంధకో మర్ద్యో యామైకం కన్యకాద్రవైః. 16
ద్వయోస్తుల్యం తామ్రపత్రం పూర్వకల్కేన లేపయేత్,
దినైకం స్థాలికాయన్త్రే పక్త్వా చాదాయ చూర్ణయేత్. 16
సూర్యావర్తో రసో హ్యేష ద్విగుంజశ్శ్వాసజిద్భవేత్,

శుద్ధిచేసిన పాదరసము ఒకభాగము, గంధకము అర్ధభాగము వీనిని కలబందరసముచే నొక్కజాము మర్దించి శుద్ధిచేసిన పలుచని తామ్రపత్ర (రాగిరేకులు) ములపై నీకజ్జలినిపూసి మంటికుండలోనుంచి పైన సంధిబంధముగావించి ఒక అహోరాత్రవు పొయ్యిమీద పాకము గావింపవలయును. పిమ్మట స్వాంగశీతలమైన తోడనే యారేకులను మెత్తగనూరి యాచూర్ణమును రెండుగురిగింజల ప్రమాణముగ సేవించిన, శ్వాసవ హరించును.

## వాతరోగములకు స్వచ్ఛందభైరవరసము.

శుద్ధం సూతం మృతం లోహం తాప్యం గన్ధకతాలకమ్. 16
పథ్యాగ్నిమన్థనిర్గుండీ త్ర్యూషణం టంకణం విషం,
తుల్యాంశం మర్దయేత్ఖల్వే దినం నిర్గుండికాద్రవైః. 16
ముణ్డీద్రావైర్దినైకం తు ద్విగుఞ్జం వటకీకృతం,
భక్షయేద్వాతరోగార్తో నామ్నా స్వచ్ఛందభైరవమ్. 16
రాస్నామృతా దేవదారుశుణ్ఠీవాతారిజం శృతం,
సగుగ్గులుం పిబేత్కోష్ణమనుపానం సుఖావహమ్. 16

శుద్ధిచేసిన పాదరసము, లోహభస్మము, స్వర్ణమాక్షికము, శుద్ధగంధకము, శుద్ధతాళకము, కరకకాయలు, కూరనెల్లి, నల్లవావిలి, త్రికటుకములు, టంకణము, శుద్ధిచేసి వత్సనాభి వీనిని సమభాగంబులుగా ఖల్వములో వైచి వావిలియాకురసముతో నొక్క

దినంబును, బోడతరపురసముతో నొక్కదినంబును మర్దించి రెండుగురిగింజలప్రమాణము మాత్రలుచేసి యందొకమాత్రను సన్నరాస్న, తిప్పతీఁగ, దేవదారు, సొంటి, ఆముదపు వేళ్లు, వీని కషాయంబున శుద్ధిచేసిన మహిసాక్షి గుగ్గిలముచేర్చి దాని యనుపానంబున కించి దుష్ణముగ సేవించిన వాతరోగములు హరించును.

### సంగ్రహణులకు హంసపోటలీరసము.

దగ్ధాస్కపర్దికాః పిష్ట్వా త్ర్యూషణం టఙ్కణం విషం,
గన్ధకం శుద్ధసూతం చ తుల్యం జమ్బీరజైర్ద్రవైః. 167
మర్దయేద్భక్షయేన్మాషం మరిచాజ్యం లిహేదను,
నిహన్తి గ్రహణీరోగం పథ్యం తక్రోదనం హితమ్. 168

గవ్వభస్మము, త్రికటుకములు, టంకణము, శుద్ధిచేసిన వత్సనాభి, శుద్ధగంధకము, శుద్ధిచేసినరసము వీనిని సమభాగంబులుగ చూర్ణముగావించి నిమ్మపండ్లరసముతో మర్దించి మాషప్రమాణమును మిరియపు చూర్ణముతోఁగలిపి నేతితోసేవించిన గ్రహణి రోగము నశించును. ఇందు అన్నమును మజ్జిగతో భుజింపవలయును. ఇది హంసపోటలీరస మనం బడును.

### అశ్మరులకు త్రివిక్రమరసము.

మృతం తామ్రమజాక్షీరైః పాచ్యం తుల్యైర్గతద్రవం,
తత్తామ్రం శుద్ధసూతం చ గన్ధకం చ సమం సమమ్. 169
నిర్గుండీస్వరసైర్మర్ద్యం దినం తద్గోలకం కృతం,
యామైకం వాలుకాయన్త్రే పాచ్యం భోజ్యం ద్విగుఞ్జకమ్. 170
బీజపూరస్య మూలన్తు సజలం చానుపాయయేత్,
రసస్త్రివిక్రమో నామ్నా మాసైకేనాశ్మరీప్రణుత్. 171

తామ్రభస్మమునకు సమముగా మేకపాలుఁబోసి యాపాలు ఇగురువఱకుఁగాచి పిమ్మట నాభస్మమును గ్రహించి యాభస్మమునకు సమముగా శుద్ధిచేసిన పాదరసము, శుద్ధగంధకముఁగలిపి నల్లవావిలియాకురసముచే నొక్కదినము మర్దించి, వాలుకాయంత్రమున నొకజాము పాకముఁజేసి స్వాంగశీతలమైన పిదప నాయౌషధమును గ్రహించిదానిని రెండుగురిగింజల ప్రమాణమున మాదీఫలపురసముతో గాని, మాదీఫలపువేళ్ల కషాయముతోఁగాని సేవించిన నొక్కమాసములో నశ్మరిరోగము హరించును.

### కుష్ఠములకు మహాతాలేశ్వరరసము.

తాలం తాప్యం శిలా సూతం శుద్ధం సైన్ధవటఙ్కణం,
సమాంశం చూర్ణయేత్ఖల్వే సూతాద్ద్విగుణగన్ధకమ్. 172

గన్ధతుల్యం మృతం తామ్రం జంబీరైర్దినపఞ్చకం,
మర్ద్యం షడ్భిః పుటైః పాచ్యం భూధరే సమ్పుటోదరే. 173
పుటేపుటే ద్రవైర్మర్ద్యం సర్వమేతచ్చ షట్పలం,
ద్విపలం మారితం తామ్రం లోహభస్మ చతుఃపలమ్. 174
జమ్బీరామ్లేన తత్సర్వం దినం మర్ద్యం పుటేల్లఘు,
త్రింశదంశవిషం చాస్యత్ క్షిప్త్వా సర్వం విచూర్ణయేత్. 175
మాహిషాజ్యేన సంమిశ్రం నిష్కార్ధం భక్షయేత్సదా,
మధ్వాజ్యైర్వాకుచీచూర్ణం కర్షమాత్రం. లిహేదను. 176
సర్వకుష్ఠాన్నిహంత్యాశు మహాతాలేశ్వరో రసః,

శుద్ధిచేసిన తాళకము, స్వర్ణమాక్షికభస్మము, శుద్ధిచేసిన మణిశిల, శుద్ధిచేసిన పాదరసము, సైంధవలవణము, టంకణము వీనిని సమభాగంబులుగాను, గంధకమును రసమునకు రెండింతలుగాను, గంధకమునకు సమముగా తామ్రభస్మమును గ్రహించి నిమ్మపండ్ల రసముతో నైదుదినములు మర్దించి శరావసంపుటంబున నిడి సంధిబంధముగావించి భూధర పుటంబిడవలయును. ఇట్లొక్కొకమాఱును నిమ్మపండ్లరసముతో మర్దించుచు భూధర యంత్రమున నాఱుమార్లు పుటం బిడవలయును. పిమ్మట నీయౌషధంబు రెండుపలములు, తామ్రభస్మము, నాలుగుపలములు లోహభస్మము గలిపి మరల నిమ్మపండ్లరసముతో నొక్కదినము మర్దించి లఘుపుటంబిడవలయును. అనంతరంబు ఈయౌషధమునకు ముప్పది యవపాలు శుద్ధిచేసిన వత్సనాభిగలిపి బాగుగా చూర్ణముగావించి అర్ధనిష్కప్రమాణమును ఎనుమునేతితో పుచ్చుకొని తరువాత బావంచివిత్తుల చూర్ణము నొక్కకర్షము తేనె, నేయి, వీనితో గలిపి పుచ్చుకొనవలయును. ఇట్లు సేవించిన కుష్ఠరోగములన్నియు నిర్మూలం బగును.

### కుష్ఠకుఠారము.

భస్మసూతసమో గన్ధో మృతాయస్తామ్రగుగ్గులూ. 177
త్రిఫలా చ మహానింబశ్చిత్రకశ్చ శిలాజతు,
ఇత్యేతచ్చూర్ణితం కుర్యాత్ప్రత్యేకం శాణషోడశ. 178
చతుష్షష్టికరఞ్జస్య బీజచూర్ణం ప్రకల్పయేత్,
చతుష్షష్టిమృతం చాభ్రం మధ్వాజ్యాభ్యాం విలోడయేత్. 179
స్నిగ్ధభాణ్డే ఘృతం ఖాదేద్ద్వినిష్కం సర్వకుష్ఠనుత్,
రసః కుష్ఠకుఠారోఽయం గలత్కుష్ఠనివారణః. 180

రసభస్మము, శుద్ధగంధకము, లోహభస్మము, తామ్రభస్మము, శుద్ధిచేసిన మహిసాక్షిగుగ్గిలము, త్రిఫలములు, తురకవేప, చిత్రమూలము, శిలాజతు వీనిని ప్రత్యేకముగా పదునాఱు శాణములయెత్తుగను, క్రానుగువిత్తులు అఱువదినాల్గు శాణములుగను, వీనినన్నిటిని చూర్ణముగావించి యందు అఱువదినాలుగు శాణములు అభ్రకభస్మము గలిపి నేతితో మాగిన మంటిపాత్రయందుంచి యందు తేనె, నేయి గలిపి రెండునిష్కములు సేవించిన సర్వకుష్ఠరోగములు, గళకుష్ఠము నశించును.

## ⊰ శ్వేతకుష్ఠములకు ఉదయాదిత్యరసము. ⊱

శుద్ధసూతం ద్విధా గన్ధం మర్ద్యం కన్యాద్రవైర్దినం,
తద్గోలం పిఠరీమధ్యే తామ్రపాత్రేణ రోధయేత్. 181
సూతకాద్ద్విగుణేనైవ శుద్ధేనాధోముఖేన చ,
పార్శ్వే భస్మ నిధాయాథ పాత్రోర్ధ్వం గోమయం జలమ్. 182
కిఞ్చిత్కిఞ్చిత్ప్రదాతవ్యం చుల్ల్యాం యామద్వయం పచేత్,
చణ్డాగ్నినా తదుద్ధృత్య స్వాఙ్గశీతం విమూర్ఛయేత్. 183
కాకోదుంబరికాం వహ్నిం త్రిఫలాం రాజవృక్షకం,
విడఙ్గం వాకుచీబీజం క్వాథయేత్తేన భావయేత్. 184
దినైకముదయాదిత్యో రసో దేయో ద్విగుంజకః,
విచర్చికాం దద్రుకుష్ఠం వాతరక్తం చ నాశయేత్. 185
అనుపానం చ కర్తవ్యం వాకుచీఫలచూర్ణకం,
ఖదిరస్య కషాయేణ సమేన పరిపాచితమ్. 186
త్రిశాణం తద్గవాం క్షీరైః క్వాథైర్వా త్రిఫలైః పిబేత్,
త్రిదినాంతే భవేత్స్ఫోటస్సన్తాపో వా కిలాసకే. 187
నీలీగుంజాశ్చ కాసీసం ధత్తూరం హంసపాదికం,
సూర్యభక్తాం చ చాఙ్గేరీం పిష్ట్వా మూలాని లేపయేత్. 188
స్ఫోటస్థానప్రశాన్త్యర్థం సప్తరాత్రం పునఃపునః,
శ్వేతకుష్ఠాన్నిహంత్యాశు సాధ్యాసాధ్యం న సంశయః. 189
అపరశ్చిత్రలేపోఽపి కథ్యతేఽత్ర భిషగ్వరైః,
గుఞ్జాఫలాగ్నిచూర్ణం చ ప్రలేపశ్శ్వేతకుష్ఠనుత్. 190
శిలాపామార్గభస్మాపి లిప్తశ్విత్రం వినాశయేత్,

శుద్ధిచేసిన పాదరసము ఒకభాగము, శుద్ధగంధకము రెండుభాగములు, వీనిని కజ్జలి గావించి కలబందరసముచే నొకదినము మర్దించి, యుండజేసి చిన్నకుండయందుంచి, పాదరసమును ద్విగుణంబగు తామ్రముచే మూతచేసి యామూతను నాయుండపై బోర్లించి దానిచుట్టును బూడిదఁబోసి ప్రాయిమీఁదనుంచి రెండుజాములు క్రమాగ్నిచే పచనము చేయుచు నాయుంటపైన గోమయము నీళ్లనుకలిపి యానీటిచే మెల్లమెల్లన నాయుండను దడుపుచుండవలెను. పిమ్మట రెండుజాములకు గాఢాగ్నిచే పచనముగావించి స్వాంగశీతలమైనపిమ్మట నాయౌషధమును ఖల్వములో నునిచి చూర్ణముగావించి బ్రహ్మమేడిపాలు, చిత్రమూలము, త్రిఫలములు, శేలకాయలగుజ్జు, వాయువిళంగములు, బావంచివిత్తులు, వీని కషాయమున నొక్కదినము భావనచేసి యెండించి రెండుగురిగింజలప్రమాణమునుతీసి యందు మూఁడుశాణములు బావంచివిత్తుల చూర్ణమునుగలిపి చంద్రచెక్కకషాయముతో గాని, ఆవుపాలతోఁగాని, త్రిఫలాకషాయంబుతోగాని సేవించిన విచర్చిక, దద్రువు, వాతరక్తము అను కుష్ఠములు నశించును. ఈ ఔషధమును సేవించిన నాలవదినమునగాని, ఎనిమిదవదినమున గాని శ్వేతకుష్ఠము (బొల్లు) గలస్థలమునబొబ్బలు జనించును. ఈ బొబ్బలకు నీలియాకు, గురిగింజ, అన్నభేది ఉమ్మెత్త, హంసపాది, ప్రొద్దుతిరుగుడుచెట్టు, పులిచింత, వీనిమూలము (వేళ్లు) లను చక్కగనూరి నీటితోఁగలిపి ఏడుదినములు లేపనముచేసిన నవి నశించి శ్వేతకుష్ఠము హరించును. మఱియు గురిగింజ, చిత్రమూలము వీనినిగాని, మణిశిల, ఉత్తరేణిక్షారము వీనినిగాని నీటితోనూరి లేపనముచేసిన శ్విత్రకుష్ఠము హరించును. ఇది ఉదయాదిత్యరస మనంబడును.

### కుష్ఠములకు సర్వేశ్వరరసము.

శుద్ధసూతం చతుర్గంధం పలం యామం విచూర్ణయేత్. 191
మృతతామ్రాభ్రలోహానాం దరదం చ పలంపలం,
సువర్ణం రజతం చైవ ప్రత్యేకం దశనిష్కకమ్. 192
మాక్షికం మృతవజ్రం చ తాలం శుద్ధం పలద్వయం,
జమ్బీరోన్మత్తవాసాభిస్స్నుహ్యర్కవిషముష్టిభిః. 193
మర్ద్యం హయారిజైర్ద్రావైః ప్రత్యేకేన దినందినం,
ఏవం సప్తదినం మర్ద్యం తద్గోలం వస్త్రవేష్టితమ్. 194
వాలుకాయన్త్రగం స్వేద్యం త్రిదినం లఘువహ్నినా,
ఆదాయ చూర్ణయేచ్ఛ్లక్ష్ణం పలైకం యోజయేద్విషమ్ 195
ద్విపలం పిప్పలీచూర్ణం మిశ్రం సర్వేశ్వరో రసః,
ద్విగుంజో లిహ్యతే క్షౌద్రైస్సుప్తిమణ్డలకుష్ఠనుత్, 196

వాకుచీ దేవకాష్ఠం కర్షమాత్రం విచూర్ణయేత్,
లిహేదేరండతైలాక్తమనుపానం సుఖావహమ్. 197

శుద్ధిచేసిన పాదరసము ఒకపలము, శుద్ధగంధకము నాల్గు పలములు, తామ్రభస్మము, అభ్రకభస్మము, లోహభస్మము, శుద్ధిచేసిన ఇంగిలీకము, ఇవి ప్రత్యేకముగా నొక్కొక్క పలము, సువర్ణభస్మము రజతభస్మము ఇవి ప్రత్యేకముగా పది నిష్కములు, వజ్రభస్మము ఒక మాష ప్రమాణము, శుద్ధిచేసిన తాళకము రెండు పలములు, ఇటుల వీనిని ఖల్వములో నునిచి చూర్ణముగావించి నిమ్మపండ్లరసము, ఉమ్మెత్తరసము, అడ్డసరపురసము, జెముడుపాలు, జిల్లేడుపాలు, విషముష్టిరసము, గన్నేరు వేళ్లరసము వీనిచే ప్రత్యేకముగా నొక్కొక్క దినము మర్దనచేసి యుండచేసి, యాయుండను బట్టను మూటగట్టి వాలుకాయంత్రమున మందాగ్నిచే మూడుదినములు స్వేదనచేసి స్వాంగశీతలమైన పిమ్మట మెత్తగనూరి, యందు శుద్ధిజేసిన వత్సనాభిని ఒక పలము. పిప్పళ్లచూర్ణము రెండుపలములుగలిపి రెండు గురిగింజలంత మాత్రలుచేసి వానిలో నొక్కమాత్రను తేనెతో సేవించి పిమ్మట భావంచి విత్తులు, దేవదారు వీనిచూర్ణమును అర్ధప్రమాణముగ ఆముదములోఁగలిపి పుచ్చుకొనిన సుప్తికుష్ఠము, మండలకుష్ఠము నశించును.

## సుప్తికుష్ఠమునకు స్వర్ణక్షీరీరసము.

హేమాహ్వాం పఞ్చపలికాం క్షిప్త్వా తక్రఘటే పచేత్,
తక్రే జీర్ణే సమాహృత్య పునఃక్షీరఘటే పచేత్. 198
క్షీరే జీర్ణే సముద్ధృత్య క్షాలయిత్వా విచూర్ణితః,
తచ్చూర్ణం పఞ్చపలికం మరీచానాం పలద్వయమ్. 199
పలైకం మూర్ఛితం సూతమేకీకృత్య తు భక్షయేత్,
నిష్కైకం సుప్తికుష్ఠార్తస్స్వర్ణక్షీరీ రసోహ్యయమ్. 200

ఐదుపలముల హేమక్షీరి పుష్పములలో నొక్క ప్రస్థము మజ్జిగఁబోసి యామజ్జిగ యిగురువఱకుకాచి పిమ్మట నొక్కప్రస్థము పాలుపోసి యాపాలు యిగురువఱకు కాచి పిమ్మట నాపువ్వులను నీటితో శుభ్రముగ గడగి యాయైదుపలములలోను రెండుపలములు మిరియముల చూర్ణముగలిపి యందు రసభస్మము ఒకపలము గలిపి దానినుండి ఒక నిష్కప్రమాణమును సేవించిన సుప్తికుష్ఠము నశించును. ఇయ్యది శ్రేష్ఠంబగు స్వర్ణక్షీరీ రసము.

## ప్రమేహములకు మేహబద్ధరసము.

భస్మసూతం మృతం కాన్తం ముణ్డభస్మశిలాజతు,
శుద్ధం తాప్యం శిలాం వ్యోషం త్రిఫలాం కోలబీజకమ్. 201

కపిత్థం రజనీచూర్ణం భృంగరాజేన భావయేత్,
వింశద్వారం విశోష్యాథ మధుయుక్తం లిహేత్సదా. 202
నిష్కమాత్రం హరేన్మేహాన్మేహబద్ధో రసో మహాన్,
మహానిమ్బస్య బీజాని పిష్ట్వా షట్పమ్మితాని చ. 203
పలం తండులతోయేన ఘృతనిష్కద్వయేన చ,
ఏకీకృత్య పిబేచ్చాను హన్తి మేహం చిరన్తనమ్. 204

రసభస్మము, కాంతభస్మము, లోహభస్మము, శిలాజతు, స్వర్ణమాక్షికభస్మము, శుద్ధిచేసిన మణిశిల, త్రికటుకములు, త్రిఫలములు, ఓడుగువిత్తులు, వెలగపండు, పసుపు వీనినన్నిటి సమభాగంబులుగ గుంటగలగరాకు రసముతో యిరువదిమాఱులు భావనచేసి యెండించి ఒక నిష్కప్రమాణమును తేనెతో సేవించి పిమ్మట తురకవేపవిత్తుల చూర్ణమును ఆఱుపలములు ఒకపలము బియ్యపు కడుగుతోనూరి యందు రెండునిష్కములు నేయిగలిపి సేవించిన చిరకాలమునుండియున్న మేహము లన్నియు నశించును.

జలోదరమునకు వహ్నిరసము.

చతుష్పాతస్య గన్ధాష్టౌ రజనీ త్రిఫలా శివా,
ప్రత్యేకఞ్చ ద్విభాగం స్యాత్త్రివృన్నేపాలచిత్రకమ్. 205
ప్రత్యేకంచ త్రిభాగం స్యాత్త్ర్యూషణం దన్తిజీరకం,
ప్రత్యేకమష్టభాగం స్యాదేకీకృత్య విచూర్ణయేత్. 206
జయన్తీస్నుక్పయోభృంగవహ్నివాతారితైలకైః,
ప్రత్యేకేన క్రమాద్భావ్యం సప్తవారం పృథక్పృథక్. 207
మహావహ్నిరసో నామ నిష్కముష్ణజలైః పిబేత్,
విరేచనం భవేత్తేన తక్రభక్తం ససైంధవమ్. 208
దినాంతే దాపయేత్పథ్యం వర్జయేచ్ఛీతలం జలం,
సర్వోదరహరః ప్రోక్తో మూఢవాతహరః పరః. 209

శుద్ధిచేసిన రసము నాల్గుభాగములు, శుద్ధగంధకము ఎనిమిది భాగములు, పసుపు, త్రిఫలములు, కరక్కాయ ఇవి ప్రత్యేకముగా రెండేసిభాగములు, శుద్ధిచేసిన తెగడ, శుద్ధిచేసిన నేపాళము, చిత్రమూలము ఇవి ప్రత్యేకముగా మూఁడేసిభాగములు, త్రికటుకములు, నేపాళపునేరు, జీలకఱ్ఱ ఇవి ప్రత్యేకముగా ఎనిమిదేసిభాగములు, వీనినన్నిటిని చూర్ణముగావించి తక్కిలిరసము, జెముడుపాలు, గుంటగలగరరసము, చిత్రమూలరసము, ఆముదము వీనితో ప్రత్యేకముగ నొక్కొకదానియందు ఏడేసిమాఱులు భావనచేసి

ఎండఁబెట్టి నిష్క ప్రమాణము వేడినీళ్లతో సేవించిన సుఖముగా విరేచనంబగును. పిమ్మట సాయంకాలము సైంధవలవణము. మజ్జిగ వీనితో భుజింపవలయును. ఈయౌషధసేవచే ఉదరరోగము, మూఢవాతము నశించును. ఇందు శీతలజలము అపథ్యము. ఇయ్యది ఉత్తమంబగు వహ్నిరస మనంబడును.

### గుల్మాదులకు విద్యాధరరసము.

గన్ధకం తాలకం తాప్యం మృతతామ్రం మనశ్శిలాం,
శుద్ధం సూతం చ తుల్యాంశం మర్దయేద్భావయేద్దినమ్. 210
పిప్పల్యాస్తు కషాయేణ వజ్రీక్షీరేణ భావయేత్,
నిష్కార్ధం భక్షయేత్ క్షౌద్రైః గుల్మప్లీహాదికం జయేత్. 211
రసో విద్యాధరో నామ గోమూత్రం చ పిబేదను,

శుద్ధగంధకము, శుద్ధిచేసిన తాళకము, స్వర్ణమాక్షికభస్మము, తామ్రభస్మము, శుద్ధిజేసిన మణిశిల, శుద్ధిచేసిన పాదరసము, వీనినిసమభాగంబులుగ గ్రహించి మర్దించి పిప్పళ్ల కషాయంబుతో నొక్కదినంబును, బొంతజెముడుపాలుతో నొక్కదినంబును భావనచేసి అర్ధనిష్క ప్రమాణమును తేనెతోసేవించి పిమ్మట గోమూత్రమును పానముచేసిన గుల్మము, ప్లీహాద్యుదరరోగములు నశించును.

### పంక్తిశూలాదులకు త్రినేత్రరసము.

టంకణం హారిణం శృఙ్గం స్వర్ణం శుల్బం మృతం రసమ్. 212
దినైకమార్ద్రికద్రావైర్మర్ద్యం రుద్ధ్వా పుటే పచేత్,
త్రినేత్రాఖ్యరసస్యైకం మాషం మధ్వాజ్యకైర్లిహేత్. 213
సైంధవం జీరకం హింగు మధ్వాజ్యాభ్యాం లిహేదను,
పంక్తిశూలహరః ఖ్యాతో మాసమాత్రాన్న సంశయః. 214

టంకణము, జింకకొమ్ముభస్మము, సువర్ణభస్మము, రసభస్మము వీనిని సమభాగంబులుగ అల్లపురసముతోమర్దించి దానిని శరావసంపుటమునందుంచి సంధిబంధముగావించి పుటమువేసి స్వాంగశీతలమైనపిదప దానివి ఒకమాష ప్రమాణమును తేనె, నేయి వీనితో సేవించినతోడనే సైంధవలవణము, జీలకఱ్ఱ, వేయించినఇంగువ వీనిని చూర్ణముఁజేసి నేతితోఁ గలిపి పుచ్చుకొనిన ఒకమాసములో పరిణామ (అన్నము అరుగనపుడువచ్చు) శూలహరించును.

### శూలలకు గజకేసరిరసము.

శుద్ధసూతం ద్విధా గన్ధం యామైకం మర్దయేద్దృఢం,

ద్వయోస్తుల్యే శుద్ధతామ్రసమ్పుటే తన్నిరోధయేత్. 215
ఊర్ధ్వాధో లవణం దత్వా మృద్భాండే ధారయేద్భిషక్.
తతో గజపుటే పక్త్వా స్వాఙ్గశీతం సముద్ధరేత్. 216
సమ్పుటం చూర్ణయేత్సూక్ష్మం పర్ణఖండే ద్విగుంజకం,
భక్షయేత్సర్వశూలార్తో హింగుశుంఠీసజీరకమ్. 217
వచామరీచజం చూర్ణం కర్షముష్ణజలైః పిబేత్,
అసాధ్యం నాశయేచ్ఛూలం రసోఽయం గజకేసరీ. 218

శుద్ధిచేసిన పాదరసము ఒకభాగము, శుద్ధగంధకము రెండుభాగములు వీనిని ఒక జాము మర్దించి వీనికి తుల్యమగు తామ్రముతో నొక్కడబ్బిచేసి దానియందు నీయౌషధమునుంచి పైన మూతపైచి యాడబ్బిని ఉప్పుచే సగమువఱకు నిండియున్న కుండలో పెట్టి యాడబ్బిపైన పూర్తిగా మరలనుప్పుబోసి యాకుండపైన మూతవైచి సంధిబంధము గావించి గజపుటంబిడి స్వాంగశీతలమున గ్రహించి యందలి యౌషధమును మెత్తని చూర్ణముగానూరి రెండుగురిగింజల ప్రమాణమును తమలపాకులలోనుంచిసేవించి తోడనే వేయించిన ఇంగువ, శొంఠి, జీలకఱ్ఱ, వస, మిరియములు వీనిచూర్ణమును కర్షప్రమాణముగ్రహించి యుష్ణోదకంబుతో కలిపి పుచ్చుకొనిన సాధ్యాసాధ్యంబులగు సమస్త శూలలు హరించును. ఇది శూలగజకేసరి రసమనంబడును,

## మందాగ్నులకు అగ్నితుండీరసము.

శుద్ధసూతం విషం గన్ధమజమోదాఫలత్రయం,
సర్జక్షారం యవక్షారం వహ్నిసైంధవజీరకమ్. 219
సౌవర్చలం విడంగాని సాముద్రం త్ర్యూషణం సమం,
విషముష్టిం సర్వతుల్యం జమ్బీరామ్లేన మర్దయేత్. 220
మరీచాభాం వటీం ఖాదేత్సర్వాజీర్ణప్రశాన్తయే,

శుద్ధిజేసిన పాదరసము, శుద్ధిచేసిన వత్సనాభి, శుద్ధగంధకము, అజామోదము, త్రిఫలములు, సర్జక్షారము, యవక్షారము, చిత్రమూలము, సైంధవలవణము, జీలకఱ్ఱ, సౌవర్చలవణము, వాయువిడంగము, సముద్రలవణము, శొంఠి, మిరియము, పిప్పళ్లు వీనిని సమభాగంబులుగ చూర్ణముగావించి వీనికి సమముగ విషముష్టిచూర్ణమును గలిపి నిమ్మపండ్లతో నొక్కదినము మర్దనచేసి మిరియములంత మాత్రలుచేసి యొక్కమాత్రను సేవించిన అజీర్ణములన్నియుం నశించును.

### అజీర్ణమునకు అజీర్ణకంటకరసము.

శుద్ధసూతం విషం గన్ధం సమం సర్వం విచూర్ణయేత్. 221
మరిచం సర్వతుల్యాంశం కణ్టకార్యాః ఫలద్రవైః,
మర్దయేద్భావయేత్సర్వమేకవింశతివారకమ్. 222
వటీం గుంజాత్రయం ఖాదేత్సర్వాజీర్ణప్రశాంతయే,
అజీర్ణకణ్టకశ్చాయం రసో హన్తి విషూచికామ్. 223

శుద్ధిచేసిన పాదరసము, శుద్ధిచేసినవత్సనాభి, శుద్ధగంధకము వీనిని సమముగా చూర్ణముగావించి వీనికి తుల్యముగా మిరియముల చూర్ణమును గలిపి వాకుడుకాయలరసముతో చక్కగ మర్దించి యెండించి పిదప దాని రసములో ఇరువదియొకమాఱులు భావనచేసి గురిగింజలంతమాత్రలుచేసి సేవించిన అజీర్ణములు, విషూచిరోగము నశించును.

### క్షయాదులకు మంథానభైరవరసము.

మృతం సూతం మృతం తామ్రం హింగుపుష్కరమూలకం,
సైంధవం గంధకం తాలం కటుకీం చూర్ణయేత్సమమ్. 224
పునర్నవా దేవదాలీనిర్గుండీతండులీయకైః,
తిక్తకోశాతకీద్రావైర్దినైకం మర్దయేద్దృఢమ్. 225
మాషమాత్రం లిహేత్క్షౌద్రై రసం మంథానభైరవం,
కఫరోగప్రశాన్త్యర్థం నింబక్వాథం పిబేదను. 226

రసభస్మము, తామ్రభస్మము, ఇంగువ, పుష్కరమూలము, సైంధవలవణము, శుద్ధగంధకము, శుద్ధిచేసినతాళకము, కటుకరోహిణి చూర్ణము వీనిని సమభాగంబులుగఁ గలిపి తెల్లగలిజేరు, డావరడంగి, నల్లవావిలి, చిర్రికూర, చేదుబీర వీనిరసములో ప్రత్యేకముగ నొక్కొక్కదినము మర్దించి మినపగింజలంతమాత్రలుచేసి తేనెతోఁగలిపి సేవించి తోడనే వేపచెక్క కషాయమును త్రాగిన క్షయము, శ్వాసము మొదలగు రోగములు హరించును.

### వాతనాశరసము.

సూతహాటకవజ్రాణి తామ్రం లోహం చ మాక్షికం,
తాలం నీలాఞ్జనం తుత్థమహిఫేనం సమాంశకమ్. 227
పఞ్చానాం లవణానాం చ భాగమేకం విమర్దయేత్,
వజ్రీక్షీరైర్దినైకన్తు రుద్ధ్వా౽ధో భూధరే పచేత్. 228
మాషైకమార్ద్రకద్రావైర్లిహేద్వాతనాశనం,

పిప్పలీమూలజం క్వాథం సకృష్ణమనుపాయయేత్. 229
సర్వాన్వాతవికారాంస్తు నిహన్త్యాక్షేపకాదికాన్,

రసభస్మము, సువర్ణభస్మము, వజ్రభస్మము, తామ్రభస్మము, లోహభస్మము, స్వర్ణమాక్షికభస్మము, తాళకభస్మము, నీలాంజనభస్మము, మయూరతుత్థభస్మము, శుద్ధిచేసిన నల్లమందు వీనిని సమభాగంబులుగను, సముద్రలవణము, సైంధవలవణము, సౌవర్చలవణము, బిడాలవణము, కాచలవణము వీనినికలిపి యొక్కభాగంబుగను గ్రహించి కలిపి బొంతజెముడుపాలతో నొక్కదినము మర్దించి శరావసంపుటముననుంచి సంధిబంధము గావించి భూధరయంత్రమున పచనముచేసి స్వాంగశీతలమైన పిదప మాషప్రమాణమును అల్లపురసముతో సేవించి పిమ్మట మోడికషాయములో పిప్పలిచూర్ణమును గలిపి పుచ్చుకొనిన ఆక్షేపకవాతము మొదలగు సర్వవాతములు నశించును.

## సన్నిపాతాదులకు కనకసుందరరసము.

కనకస్యాష్టశాణాస్స్యుస్సూతో ద్వాదశభిర్మతః. 230
గన్ధోపి ద్వాదశప్రోక్తస్తామ్రం శాణద్వయోన్మితం,
అభ్రకస్య చతుశ్శాణం మాక్షికం చ ద్విశాణకమ్. 231
వంగో ద్విశాణస్సౌవీరం త్రిశాణం లోహమష్టకం,
విషం త్రిశాణకం కుర్యాల్లాంగలీ పలసమ్మితా. 232
మర్దయేద్దినమేకం చ రసైరమ్లఫలోద్భవైః,
దద్యాన్మృదుపుటం పశ్చా తతస్సూక్ష్మం విచూర్ణయేత్. 233
మాషమాత్రో రసో దేయస్సన్నిపాతే సుదారుణే,
ఆర్ద్రికస్వరసేనైవ రసోనస్వరసేన వా. 234
కిలాసం సర్వకుష్ఠాని విసర్పం చ భగందరం,
జ్వరం గరమజీర్ణం చ జయేద్రోగహరో రసః. 235

శుద్ధిచేసినబంగారము ఎనిమిది శాణములు, శుద్ధిచేసిన పాదరసము పదిరెండుశాణములు, శుద్ధగంధకము పదిరెండు శాణములు, తామ్రభస్మము రెండు శాణములు, అభ్రకభస్మము నాలుగుశాణములు, స్వర్ణమాక్షికభస్మము రెండుశాణములు, వంగభస్మము రెండుశాణములు, శుద్ధిచేసిన సౌవీరకపాషాణము మూడు శాణములు, లోహభస్మము ఎనిమిది శాణములు, శుద్ధిచేసిన వత్సనాభి మూడుశాణములు, పొత్తిదుంప ఒకపలము ఇట్లు వీనినన్నిటిని నిమ్మపండ్లరసముతో నొక్కదినము మర్దించి శరావసంపుటంబున నుంచి సంధిబంధముగావించి లఘుపుటమువైచి స్వాంగశీతలమైన పిదప ఖల్వములో చక్కగ

నూరి మాత్ర ప్రమాణమును అల్లపురసముతోగాని, వెల్లుల్లిరసముతోగాని సేవించిన అసాధ్యంబగు సన్నిపాతములు, కిలాసము (బొల్లి) మొదలగు సమస్తకుష్ఠరోగములు, విసర్పము, భగందరము, జ్వరము, విషదోషము, అజీర్ణము నశించు. ఇది కనకసుందరరసము అనంబడును.

సన్నిపాతభైరవరసము.

రసో గంధస్త్రిత్రికర్షో కుర్యాత్కజ్జలికాం ద్వయోః,
తారాభ్రతామ్రవంగాహిసారాశ్చైకైకకార్షికాః. 236
శిగ్రుజ్వాలాముఖీశుంఠీ బిల్వైభ్యస్తుణ్డులీయకాః,
ప్రత్యేకం స్వరసైః కుర్యాద్ద్వాభ్యామేకైకం విమర్దయేత్. 237
కృత్వా గోలం వృతం వస్త్రైర్లవణాపూరితే న్యసేత్,
కాచభాణ్డే తతస్థ్సాల్యాం కాచకూపీం నివేశయేత్. 238
వాలుకాభిః ప్రపూర్యాథ వహ్నిర్యామద్వయం భవేత్,
తత ఉద్ధృత్య తం గోలం చూర్ణయిత్వా విమిశ్రయేత్. 239
ప్రవాళచూర్ణకర్షేణ శాణమాత్రవిషేణ చ,
కృష్ణాసర్పస్య గరళైర్దివసం భావయేత్తథా. 240
తగరం ముసలీమాంసీ హేమాహ్వా వేతసః కణాః,
నీలినీపత్రకశ్చైలాశ్చిత్రకశ్చ కుఠేరకః. 241
శతపుష్పా దేవదాలీ ధత్తూరాగస్త్యముణ్డికా,
మధూక జాతిమదన రసై రేషాం విమర్దయేత్. 242
ప్రత్యేకమేకవేలం చ తతస్సంశోష్య ధారయేత్,
బీజపూరార్ద్రికద్రావైర్మరిచైష్షోడశోన్మితైః. 243
రసో ద్విగుఞ్జా ప్రమితస్సన్నిపాతస్య దీయతే,
ప్రసిద్ధోఽయం రసో నామ్నా సన్నిపాతస్య భైరవః. 244

శుద్ధిచేసిన పాదరసము మూఁడు కర్షములు, శుద్ధిచేసిన గంధకము మూఁడుకర్షములు వీనిని ఇట్లు కజ్జలియొనరించి యందు రజతభస్మము, అభ్రకభస్మము, తామ్రభస్మము, వంగభస్మము, నాగభస్మము, లోహభస్మము వీనిని ప్రతిదానిని నొక్కొక కర్షముగా గలిపి మునగచెక్కరసము, జ్వాలాముఖీరసము శుంఠిరసము, మారేడుపట్టరసము, చిర్రికూరరసము వీనిలో ప్రత్యేకముగ నొక్కజాము చొప్పున మర్దించి ముద్దజేసి దానికి బట్టచుట్టి దానిని ఒక గాజుకుప్పెలో నునిచి దానికిపైన నొక్క గాజుపాత్రమునుమూసి

సంధిబంధము గావించి యాఱుప్పెను సగమువఱకు ఉప్పుగల భాండమున నుంచి పిమ్మట పూర్తిగా నిసుకఁబోసి రెండుయామములవఱకు పచనముగావించి స్వాంగశీతలమైన పిమ్మట నా యౌషధమును గ్రహించి యందు ప్రవాళ (పగడము) భస్మము ఒకకర్షము, శుద్ధిచేసిన వత్సనాభి ఒక శాణము గలిపి నల్లత్రాచు గరళములో నొక్కదినము భావన చేసి గ్రంథితగరము, నేలతాడిగడ్డలు, జటామాంసి, హేమక్షీరి, ప్రబ్బలి, పిప్పళ్లు, సీలిచెట్టు, ఆకుపత్రి, ఏలకులు, చిత్రమూలము, అడవితులసి, పెద్దసోపు, డావరడంగి, ఉమ్మెత్త, అగసి, బోడతరము, ఇప్ప, జాజి, మ్రంగకాయ వీనిరసములతో ప్రత్యేకముగ నొక్కొక్కపగలు మర్దించి యెండించి రెండు గురిగింజలంత మాత్రలుచేసి, మాదీఫలపు రసము, అల్లపురసము వీనితోఁజేర్చి యందు పదునాఱు మిరియముల చూర్ణమును గలిపి సేవించిన సన్నిపాతము హరించును. ఇయ్యది ప్రసిద్ధంబగు సన్నిపాత భైరవరస మనంబడును.

## గ్రహణీకపాటరసము.

తారమౌక్తికహేమాని సారశ్చైకైకభాగికః,
ద్విభాగో గన్ధకస్సూతస్త్రిభాగో మర్దయేదిమాన్. 245
కపిత్థస్వరసైర్గాఢం మృగశృంగే తతః క్షిపేత్,
పుటేన్మధ్యపుటేనైవ తత ఉద్ధృత్య మర్దయేత్. 246
బలారసైస్సప్తవేలమపామార్గరసైస్త్రిధా,
లోధ్రప్రతివిషాముస్తా ధాతకీన్ద్రయవామృతాః. 247
ప్రత్యేకమేషాం స్వరసైర్భావనా స్యాత్త్రిధాత్రిధా,
మాషమాత్రో రసో దేయో మధునా మరిచైస్తథా. 248
హన్యాత్సర్వానతీసారాన్ గ్రహణీం సర్వజామపి,
కపాటో గ్రహణీరోగే రసోఽయం వహ్నిదీపనః. 249

రజతభస్మము, ముత్తియములభస్మము, స్వర్ణ (బంగారు) భస్మము, లోహభస్మము ఇవి ప్రత్యేకముగా నొక్కొకభాగములు, శుద్ధగంధకము రెండుభాగములు, శుద్ధిచేసిన పాదరసము మూఁడుభాగములు ఇటుల వీనిని ఖల్వములోవైచి వెలగకాయలరసముతో చక్కగ మర్దించి ముద్దచేసి వీనిని తొఱ్ఱగల జింకకొమ్ములో నుంచి సంధిబంధముగావించి మధ్యమపుటమువైచి స్వాంగశీతలమున గ్రహించి దానిని ఖల్వములోవైచి ముత్తవపుల గపుచెట్టురసముచే నేడుమాఱులును, ఉత్తరేణిరసముచే మూఁడుమార్లును మర్దనచేసి, లొద్దుగచెక్కరసము, అతివసరసము, తుంగముస్తలరసము, ఆఱెపువ్వురసము, కొడిసెవిత్తుల రసము, తిప్పతీఁగరసము వీనిలో ప్రత్యేకముగ మూఁడేసిమాఱులు భావనఁజేసి మాష

ప్రమాణమున మిరియపుచూర్ణము గలిపి తేనెతో సేవించిన అతిసారము, గ్రహణి నశించు. ఇయ్యది ఉత్తమంబగు గ్రహణీకపాటరస మనంబడును.

## సంగ్రహణులకు వజ్రకపాటరసము.

మృతసూతాభ్రకం గంధం యవక్షారం సటంకణం,
అగ్నిమన్థం వచాం కుర్యాత్తుల్యాంశతుల్యానిమాంత్సుధీః. 250
తతో జయంతీజమ్బీరభృంగద్రావైర్విమర్దయేత్,
త్రివాసరం తతో గోలం కృత్వా సంశోష్య ధారయేత్. 251
లోహపాత్రే శరావఙ్చ దత్వోపరి విముద్రయేత్,
అధోవహ్నిం శనైః కుర్యాద్యామార్ధం తత ఉద్ధరేత్. 252
రసతుల్యం ప్రతివిషాం దద్యాన్మోచరసం తథా,
కపిత్థవిజయాద్రావైర్భావయేత్సప్తధా భిషక్. 253
ధాతకీంద్రయవా ముస్తాలోధ్రం బిల్వం గుడూచికా,
ఏతద్రసైర్భావయిత్వా వేలైకైకం చ శోషయేత్. 254
రసం వజ్రకపాటాఖ్యం శాణైకం మధునా లిహేత్,
వహ్నిం శుంఠీబిడం బిల్వం లవణం చూర్ణయేత్సమమ్. 255
పిబేదుష్ణాంబునా చాను సర్వజాం గ్రహణీం జయేత్,

రసభస్మము, అభ్రకభస్మము, శుద్ధగంధకము, యవక్షారము, టంకణము, నెల్లి, వస వీనిని సమభాగంబులుగ తక్కలి, నిమ్మపండ్లు, గుంటగలగర వీనిరసముచే నొక్కొక్క దినము మర్దించి దానిని ఇనుపపాత్రములో నుంచి దానిపైన నొక్కమంటిశరావము బోర్లించి సంధిబంధము గావించి క్రిందయిమీదనుంచి నాలుగుగడియలు పాకముగావించి స్వాంగశీతలమైన పిదప నా యౌషధమునకు సమముగ అతివస, బూరుగబంక వీని చూర్ణము గలిపి వెలగపండు రసము, బంగియాకు రసము వీనిని ప్రత్యేకముగ నేడు మార్లును, ఆరెపువ్వులు, కొడిసెవిత్తులు, తుంగముస్తలు, లొద్దుగపట్ట, మారేడు, తిప్పతీగ వీనిరసములతో ప్రత్యేకముగ నొక్కొకమాఱును భావనచేసి యెండించి ఒకశాణమును తేనెతో సేవించి పిమ్మట చిత్రమూలము, శుంఠి, బిడాలవణము, మారేడు, సైంధవలవణము వీనిని సమముగ వేడిసీళ్లతో త్రాగిన సన్నిపాతగ్రహణిగూడ నశించును.

## వాజీకరణమునకు మదనకామదేవరసము.

తారం వజ్రం సువర్ణం చ తామ్రం సూతకగన్ధకమ్. 256
లోహం క్రమవివృద్ధాని కుర్యాదేతాని మాత్రయా,

విమర్ద్య కన్యకాద్రావైర్న్యసేత్కాచమయే ఘటే. 257
విముద్ర్య పిఠరీమధ్యే ధారయేత్రైస్సంధవావృతే,
పిఠరీం ముద్రయేత్సమ్యక్తతశ్చుల్ల్యాం నివేశయేత్. 258
వహ్నిం శనైశ్శనైః కుర్యాద్దినైకం తత ఉద్ధరేత్,
స్వాంగశీతం చ సంచూర్ణ్య భావయేదర్కదుగ్ధకైః. 259
అశ్వగన్ధాచ కాకోలీ వానరీ ముసలీక్షురా,
త్రిత్రివేలం రసైరేషాం శతావర్యాశ్చ భావయేత్. 260
పద్మకందకసేరూణాం రసైః కాశస్య భావయేత్,
కస్తూరీవ్యోషకర్పూరకంకోలైలాలవంగకమ్. 261
పూర్వచూర్ణాదష్టమాంశమేతచ్చూర్ణం విమిశ్రయేత్,
సర్వైస్సమాం శర్కరాం చ దత్వా శాణోన్మితం పిబేత్. 262
గోదుగ్ధద్విపలేనైవ మధురాహారసేవకః,
అస్య ప్రభావాత్సౌందర్యం లభతే నాత్ర సంశయః. 263
తరుణీ రమయేద్బహ్వీః శుక్రహానిర్న జాయతే,

రజతభస్మము ఒకభాగము, వజ్రభస్మము రెండుభాగములు, స్వర్ణ (బంగారు) భస్మము మూడుభాగములు, తామ్రభస్మము నాల్గుభాగములు, పాదరసము ఐదుభాగములు, శుద్ధగంధకము ఆఱుభాగములు, లోహభస్మము ఏడుభాగములు ఇటుల వీనిని ఖల్వంబున కలబందరసముచే చక్కగమర్దించి గాజుకుప్పెయందునిచి సంధిబంధముగావించి సగమువఱకు సైంధవలవణముగల కుండలో నుంచి పిమ్మట పైన నొక్కకుండను బోర్లించి సంధిబంధముగావించి ప్రొయిమీఁదనుంచి మందాగ్నిచే నొక్కదినము పచనముగావించి స్వాంగశీతలమైన పిదప దానిని చక్కఁగా నూరి జిల్లేడుపాలు, పెన్నేరుగడ్డ, కాకోలి, దురదగొండివిత్తులు, నేలతాడిగడ్డలు, పెద్దపల్లేరు, పిల్లిపీచర, తామరదుంప, తుంగముస్తలు, రెల్లు వీనిరసములో ప్రత్యేకము ముమ్మాఱు భావనచేసి యెండించి యీ యౌషధములో నెనిమిదవపాలు కస్తూరి, త్రికటుకములచూర్ణము, పచ్చకర్పూరము, తక్కోలములు, ఏలకులు, లవంగములు వీని చూర్ణములను గలిపి యొక్కకర్షప్రమాణమును ఒకకర్షము చక్కెర, రెండుపలములు ఆవుపాలు వీనితో సేవించిన శరీరకాంతి, బలము, తేజస్సు వృద్ధినొందును. అనేకమంది స్త్రీలతో రమించినను శుక్రక్షయము గలుగనేరదు. ఇందు మధురపదార్థములు పథ్యము.

## వాజీకరణమునకు కంసర్పసుందరరసము.

సూతో౽వజ్రమహిర్ముక్తా తారం హేమసితాభ్రకమ్. 264
రసైః కర్షాంశకానేతాన్మర్దయేదిరిమేదజైః,
ప్రవాళచూర్ణం గన్ధశ్చ ద్విద్వికర్షౌ విమిశ్రయేత్. 265
తతో౽శ్వగన్ధాస్వరసైర్విమర్ద్య మృగశృంగకే,
క్షిప్త్వా మృదుపుటే పక్త్వా భావయేద్ధాతకీరసైః. 266
కాకోలిమధుకంమాంసీ బలాత్రయబిసేంగుదం,
ద్రాక్షాపిప్పలివందాకం వరీపర్ణిచతుష్టయమ్. 267
పరూషకం కసేరుశ్చ మధూకం వానరీ తథా,
భావయిత్వా రసైరేషాం శోషయిత్వా విచూర్ణయేత్. 268
ఏలాత్వక్పత్రకం వంశీ లవంగాగరుకేసరం,
ముస్తం మృగమదః కృష్ణా జలం చన్ద్రశ్చ మిశ్రయేత్,
ఏతచ్చూర్ణైశ్శాణమితై రసం కందర్పసున్దరమ్. 269
ఖాదేచ్ఛాణమితం రాత్రౌ సితాధాత్రీవిదారికా,
ఏతేషాం కర్షచూర్ణేన సర్పిః కర్షేణ సమ్మితమ్. 270
తస్యానుద్విపలం క్షీరం పిబేత్సుస్థితమానసః,
రమణీరమయేద్బహ్వీశ్శుక్రహానిర్న జాయతే. 271

రసభస్మము, వజ్రభస్మము, నాగభస్మము, ముత్తియములభస్మము, రజతభస్మము, స్వర్ణభస్మము, శ్వేతాభ్రకభస్మము వీనిని ప్రత్యేకముగా కర్షప్రమాణమును వెలితుమ్మ చెక్కరసముతో మర్దనచేసి యందు పగడభస్మము రెండుకర్షములు, శుద్ధగంధకము రెండుకర్షములు వైచి పెన్నేరుగడ్డ రసముతో మర్దనచేసి రంధ్రముగల జింకకొమ్ములో నుంచి సంధిబంధము గావించి యెరుపిడకలతో మధ్యమ పుటమువైచి స్వాంగశీతలమున గ్రహించి ఖల్వములో నునిచి మెత్తగనూరి ఆరెపువ్వులు, కాకోలి, అతిమధురము, జటామాంసి, చిట్టాముదపువేళ్లు, పెద్దాముదపువేళ్లు, ముత్తవపులగమువేళ్లు, తామరతూండ్లు, ద్రాక్ష, పిప్పళ్లు, బదనిక, గారచెట్టు, పిల్లిపీచర, మయ్యూకపొన్న, కోలపొన్న, అడవిమినుము, అడవిపెసర, చిట్టీకపండు, తుంగముస్తలు, ఇప్పపువ్వు, దురదగొండి వీని రసములలో గాచి, రసాభావంబున కషాయములోగాని ప్రత్యేకముగ భావనజేసి యెండించి చూర్ణముచేసి యందు ఏలకులు, లవంగపత్రి, వెదురుప్పు, లవంగములు, అగరు, కుంకుమపువ్వు, తుంగముస్తలు, కస్తూరి, పిప్పళ్లు, వట్టివేరు, పచ్చకర్పూరము వీనిని సమభాగంబు

లుగ చూర్ణముచేసి యొక్కొక శాణప్రమాణముగఁ గలిపి యందలి యౌషధమును శాణప్రమాణముగ నేతిలో గలిపి యందు ఉసిరికపప్పు, నేలగుమ్ముడుగడ్డచూర్ణము, శర్కర వీనిని ఒక్కొక్కకర్షప్రమాణముగ గలిపి రాత్రియందు సేవించి పిమ్మట రెండుపలములు ఆవుపాలు ద్రావిన ననేకయువతులతో రమించినను శుక్రక్షయము గాకుండును.

### క్షయాదులకు లోహరసాయనము.

శుద్ధం రసేంద్రభాగైకం ద్విభాగం శుద్ధగన్ధకమ్. 272
క్షిపేత్కజ్జలికాం కుర్యాత్తత్ర తీక్ష్ణభవం రజః,
క్షిప్త్వా కజ్జలికాతుల్యం ప్రహరైకం విమర్దయేత్. 273
తత్ర కన్యాద్రవైః ఖల్వే త్రిదినం పరిమర్దయేత్,
తతస్సంజాయతే తస్య నోష్ణో ధూమోద్గమో మహాన్. 274
అత్యంతం పిండితం కృత్వా తామ్రపాత్రే నిధాయ చ,
మధ్యే ధాన్యకుసూలస్య త్రిదినం ధారయేద్బుధః. 275
ఉద్ధృత్య తస్మాత్ఖల్వే చ క్షిప్త్వా ఘర్మే నిధాయ చ,
రసైః కుఠారఛిన్నాయాస్త్రివేలం పరిభావయేత్. 276
సంశోష్య ఘర్మే క్వాథైశ్చ భావయేత్త్రికటోస్త్రిధా,
వాసామృతాచిత్రకాణాం రసైర్భావ్యం క్రమాత్త్రిధా. 277
లోహపాత్రే తతః క్షిప్త్వా భావయేత్త్రిఫలాజలైః,
నిర్గుండీదాడిమత్వగ్భిర్బిసభృంగకురంటకైః. 278
పలాశకదలీద్రావైర్బీజకస్య శృతేన వా.
నీలికాలమ్బుసాద్రావైర్బబ్బూలీఫలికారసైః. 279
భావయేత్త్రిత్రివేలం చ తతో నాగబలారసైః,
శతావరీగోక్షురీభిః పాతాళగరుడీద్రవైః. 280
త్రిత్రివేలం యథాలాభం భావయేదేభిరౌషధైః,
తతః ప్రాతర్లిహేత్ క్షౌద్రఘృతాభ్యాం కోలమాత్రకమ్. 281
పలమాత్రం వరాక్వాథం పిబేదస్యానుపానకం,
మాసత్రయం శీలితం స్యాద్వలీపలితనాశనమ్. 282
మన్దాగ్నిం శ్వాసకాసౌ చ పాణ్డుతాం కఫమారుతౌ,
పిప్పలీమధుసంయుక్తం హన్యాదేతన్న సంశయః. 283
వాతాస్రం మూత్రదోషాంశ్చ గ్రహణీం తోయజాం రుజం,

అణ్డవృద్ధిం జయేదేతచ్ఛిన్నాసత్వమధుప్లుతమ్. 284
బలవర్ణకరం వృష్యమాయుష్యం పరమం స్మృతం,
కూశ్మాండం తిలతైలం చ మాషాన్నం రాజికాం తథా. 285
మద్యమమ్లరసం చైవ త్యజేల్లోహస్య సేవకః.

శ్రీదామోదరసూను శార్ఙ్గధరేణ విరచితాయాం సంహితాయాం
ధ్యమఖండే చికిత్సాస్థానే రసకల్పనానామ ద్వాదశోఽధ్యాయః.
మధ్యమఖండశ్చ సమాప్తః.

శుద్ధిజేసిన పాదరసము ఒకభాగము, శుద్ధగంధకము ఒకభాగము ఇటుల వీనిని నేసి వీనికి సమముగ లోహభస్మమునుగలిపి యొక్కజాము మర్దనచేసి పిమ్మట కల సముచే మూఁడుదినములు మర్దించిన నందుండి పొగలు, వేడి బైలువెడలును. అపుడు ముద్దచేసి తామ్రపాత్రయందునిచి పైన మూఁతవైచి ధాన్యపుపొణకలో మూఁడు లు పూడ్చి నాలవదినమున బైటకుదీసి యా యౌషధమును ఖల్వములోనుంచి లో బెట్టి అడవితులసిరసముచేతను, శొంఠి, మిరియములు, పిప్పళ్లు వీని కషాయంబు , అడ్డసరము, తిప్పతీఁగ, చిత్రమూలము వీనిరసములచేతను ప్రత్యేకము మూఁడేసి భావనచేసి పిమ్మట నా యౌషధమును ఇనుపపాత్రలోవైచి త్రిఫలములు, నల్ల , దానిమ్మబెరడు, తామరతూండ్లు, గుంటగలగరాకు, ములంగోరింట, మోదుగపట్ట, దుంప, వేగిస, విష్ణుక్రాంతము, అలంబుష, నల్లతుమ్మకాయలు వీనిలో సంభవించిన ప్రలయొక్కగాని, అన్నిటియొక్కగాని, రసముచేగాని, కషాయముచేగాని ప్రత్యేక మూఁడేసిమాఱులు భావనచేసి యెండించి కోలప్రమాణంబుగ తేనె, నేయి దీనితో చి పిమ్మట త్రిఫలాకషాయమును ద్రాగవలయును. ఇట్లు మూఁడుమాసములు సేవిం యెడల బలముగలిగి తెల్లనివెండ్రుకలు నల్లబాఱును. మఱియు, నీ యౌషధమును లిచూర్ణము, తేనె వీనితోసేవించిన అగ్నిమాంద్యము, శ్వాసము, కాసము, పాండువు, కఫములు నశించును. తిప్పసత్తు, తేనె వీనితోసేవించిన వాతరక్తము, మూత్రదోష , గ్రహణి, జలదోషమువలన పుట్టురోగములు, అండవృద్ధి నశించును. బలమును, మును, శుక్రవృద్ధిని, చిరాయుష్యమును గలుగఁజేయును. ఈ యౌషధమునందు ుడుకాయ, నువ్వులనూనె, మినుములు, రాజనపుధాన్యము, మద్యము, పులుసు వీనిని పవలయును.

ఇది శ్రీదామోదరసూను శార్ఙ్గధరవిరచితసంహితయందు మధ్యమఖండమున చికిత్సాస్థానమున రసకల్పనయనియెడు ద్వాదశాధ్యాయము సంపూర్ణము.

మధ్యమఖండము ముగిసెను.

---

# అనుక్తసంగ్రహము.

## నేపాళశుద్ధి.

నేపాలం రహితత్వగంకురరసజ్ఞాభిర్జలే మాహిషే,
నిక్షిప్తం త్ర్యహముష్ణతోయవిమలం ఖల్వే సవాసోర్ధితమ్.
లిప్తం నూతనఖర్పరేషు విగతస్నేహం రజస్సన్నిభం,
నింబూకాంబువిభావితం చ బహుశశ్శుద్ధం గుణాఢ్యం భవేత్.

నేపాళపువిత్తులందెచ్చి పైపొట్టును తీసివైచి లోనపప్పులోని మొలకలను దీసివైసి యాపప్పును బట్టలో మూటగట్టి యామూటను మూడుదినములు బఱ్ఱెపేడలో నూడ్చి నాలవదినమునతీసి యుష్ణోదకంబున చక్కఁగఁ గడిగి శుభ్రపఱచి క్రొత్తగుడ్డలో గట్టి యావస్త్రముతోడనే ఖల్వములో బాగుగా మర్దనచేసి క్రొత్తమూఁకుడును లేపనము చేసిన నా జిడ్డు నశించి చూర్ణమువలె నగును. పిదప దానిని నిమ్మపండ్లరసములో భావన చేసిన శుద్ధంబై గుణాధిక్యత గలుగును.

## వత్సనాభిశుద్ధి.

విషం తు ఖణ్డశః కృత్వా వస్త్రఖండేన బంధయేత్,
గోమూత్రమధ్యే నిక్షిప్య స్థాపయేదాతపే త్ర్యహమ్.
గోమూత్రం తు ప్రదాతవ్యం నూతనం ప్రత్యహం బుధైః,
త్ర్యహేఽతీతే తముద్ధృత్య శోషయేన్మృదు పేషయేత్.
శుద్ధ్యత్యేవం విషం చైవ యోగ్యం భవతి చార్తిజిత్,

వత్సనాభిని ముక్కలుగ చేసి బట్టలోమూటగట్టి యొకకుండలోవైచి మునుఁగునట్లు గోమూత్రముపోసి మూఁడుదినములు ఎండలో నెండింపవలయును. ఆగోమూత్రమును ప్రతిదినము ప్రాతదానిని తీసివైచుచు క్రొత్తదానిని పోయుచుండవలెను. నాలవదినమున బైటకుదీసి యెండించిన నయ్యది శుద్ధంబగును.

అన్యచ్చ—ఖణ్డీకృత్య విషం వస్త్రపరిబద్ధం తు డోలయా,
అజాపయసి సంస్విన్నం యామతశ్శుద్ధిమాప్నుయాత్.
అజాదుగ్ధాభావతస్తు గవ్యక్షీరేణ శోధయేత్.

వత్సనాభిని ముక్కలుచేసి బట్టలోమూటగట్టి, డోలాయంత్రమున మేఁకపాలతో నొక్కయామము స్వేదనచేసిన నయ్యది శుద్ధంబగును. మేఁకపాలు సంభవింపనియెడల ఆవుపాలలోనైన స్వేదనచేయందగును.

ఇది అనుక్తసంగ్రహము.

శ్రీ రస్తు.

శ్రీమద్ధన్వంతరయే నమః.

# శార్ఙ్గధరసంహిత, ఉత్తరఖండము

ఆంధ్ర తాత్పర్యసహితము.

## ప్రథమాధ్యాయము

### స్నేహపానవిధి.

శ్లో. స్నేహాశ్చతుర్విధః ప్రోక్తో ఘృతం తైలం వసా తథా,
మజ్జాచ తం పిబేన్మర్త్యః కించిదభ్యుదితే రవౌ. 1

స్నేహము.—నేయి, నూనె, వస, మజ్జ యనుభేదంబుచే నాల్గువిధములు. ఈ స్నేహములను అరుణోదయమయిన వెంటనే పానంబుచేయఁదగును.

### స్నేహవివరణము.

స్థావరో జంగమశ్చైవ ద్వియోనిస్స్నేహ ఉచ్యతే,
తిలతైలం స్థావరేషు జంగమేషు ఘృతం వరమ్. 2

స్నేహము.—స్థావరంబనియు, జంగమంబనియు ద్వివిధంబు. అందు స్థావరస్నేహంబులలో నువ్వులనూనెయు, జంగమస్నేహంబులలో నేయియు శ్రేష్ఠమైయున్నది.

### స్నేహభేదవివరణము.

ద్వాభ్యాం త్రిభిశ్చతుర్భిస్తైర్యమకస్త్రివృతో మహాన్,

ఇట్లు స్థావరజంగమస్నేహంబులు యమక, త్రివృత మహాస్నేహంబులన త్రివిధంబు. అందు నెయ్యి, నూనె ఇవి రెండును కలిసిన యమకస్నేహమనియు, నేయి, నూనె, మాంసస్నేహము (వస) ఈమూఁడును కలసిన త్రివృతస్నేహమనియు, నేయి, నూనె, వస, మజ్జాస్నేహము ఈనాల్గునుకలిసిన మహాస్నేహమనియు చెప్పఁబడును.

### స్నేహపానక్రమము.

పిబేత్ర్యహం చతురహం పఞ్చాహం షడహం తథా. 3

అట్టి స్నేహంబులను పానంబుచేయునెడల నేయిని మూఁడుదినంబులును, నూనెను నాల్గుదినంబులును, మాంసస్నేహమును నైదుదినంబులును, మజ్జాస్నేహంబును ఆఱుదినంబులును పానంబుచేయవలెను.

### స్నేహపరిణామకాలము.

సప్తరాత్రాత్పరం స్నేహస్స్యాత్మీభవతి సేవితః,

ఘృతాదిస్నేహములను సేవించిన నవి యేడుదినములకు పిదప ఆహారమువలెనే రసాదిరూపంబులను జెందు. అవి రసరూపమును జెందుటకు మునుపు దాని గుణాగుణంబులు తెలియకయుండు.

### స్నేహసేవనప్రమాణము.

దోషకాలాగ్నివయసాం బలం దృష్ట్వా ప్రయోజయేత్. 4
హీనాం చ మధ్యమాం జ్యేష్ఠాం మాత్రాం స్నేహస్య బుద్ధిమాన్,

దోషజ్ఞానముగల వైద్యుఁడు వాతాదిదోషములను, కాలమును, జాఠరాగ్నిని, వయస్సును, వీనిబలాబలంబులను చక్కఁగా నెఱింగి హీనమాత్రగను, మధ్యమమాత్రగను, ఉత్తమమాత్రగను స్నేహమును ప్రయోగించవలెను.

### స్నేహప్రమాణవిరుద్ధసేవాదులచేఁ గలుగుదోషము.

అమాత్రయా తథాకాలే మిథ్యాహారవిహారతః. 5
స్నేహః కరోతి శోఫార్శస్తంద్రానిద్రావిసంజ్ఞితాః,

అట్లు స్నేహంబులను అధికముగఁగాని, అల్పముగఁగాని సేవించినను, అసమయమున సేవించినను, అట్టి స్నేహపానానంతరమున మిథ్యాహారవిహారములను సేవించినను, వాపు, మూలరోగము, తంద్ర, నిద్ర, మైకము ఇవి గల్గును.

### దీప్తాగ్న్యాదులయందు స్నేహప్రమాణము.

దేయా దీప్తాగ్నయే మాత్రా స్నేహస్య పలసమ్మితా. 6
మధ్యమాయ త్రికర్షా స్యాజ్జఘన్యాయ ద్వికార్షికీ,

ఘృతాదిస్నేహములను అగ్నిదీప్తిగలవాఁడు ఒకపలమును, మధ్యమాగ్నిగలవాఁడు మూఁడు కర్షములను, మందాగ్నిగలవాఁడు రెండుకర్షములను సేవింపఁదగును.

### ప్రకారాంతరస్నేహము.

అథవా స్నేహమాత్రాస్స్యుస్తిస్రోన్యాస్సర్వసమ్మతాః. 7
అహోరాత్రేణ మహతీ జీర్యత్యహ్నా తు మధ్యమా,
జీర్యత్యల్పా దినార్ధేన సా విజ్ఞేయా సుఖావహా. 8

సర్వసమ్మతంబగు స్నేహపరిమాణము త్రివిధంబై యుండును. అందు ఎనిమిదిజాములకు జీర్ణమగుమాత్ర మహత్తనియు, నాలుగుజాములకు జీర్ణమగుమాత్ర మధ్యమమాత్ర

యనియు, రెండుజాములకు జీర్ణమగుమాత్ర అల్పమాత్రయనియుం జెప్పఁబడును. ఈ ప్రకారము ఆయామాత్ర ఆయాకాలంబునకు జీర్ణమయ్యెనేని సుఖము గలుగును.

అల్పాదిక ప్రమాణఫలము.

అల్పా స్యాద్దీపనీ వృష్యా స్వల్పదోషేషు పూజితా,
మధ్యమా స్నేహనీ జ్ఞేయా బృంహణీ భ్రమహారిణీ. 9
జ్యేష్ఠాకుష్ఠవిషోన్మాదగ్రహాపస్మారనాశినీ,

స్నేహములను అల్పమాత్రగా సేవించిన నయ్యది అగ్నిదీప్తిని, శుక్రవృద్ధిని గలుగఁజేసి స్వల్పముగ ప్రకోపము జెందియుండు వాతాదిదోషములను శమింపంజేయుం. మధ్యమమాత్రగా సేవించిన నయ్యది శరీరపుష్టిని ధాతువృద్ధిని గలుగఁజేసి భ్రమనుతొలగించును. ఉత్తమమాత్రగా సేవించిన నయ్యది కుష్ఠము, విషదోషము, ఉన్మాదము, గ్రహావేశము, అపస్మారము వీనిని నశింపఁజేయును.

దోషాదులయం దనుపానవిశేషము.

కేవలం పైత్తికే సర్పిర్వాతకే లవణాన్వితమ్. 10
పేయం బహుకఫే వాపి వ్యోషక్షారసమన్వితం,

పిత్తము ప్రకోపముఁజెందెనేని నేతిని, వాతప్రకోపంబున సైంధవలవణముతోఁ గూడిన నేతిని, శ్లేష్మప్రకోపంబున త్రికటుకము, యవక్షారము వీనితోఁగూడిన నేతిని సేవింపందగును.

ఘృతసేవనకర్హులు.

రూక్షక్షతవిషార్తానాం వాతపిత్తవికారిణామ్. 11
హీనమేధాస్మృతీనాం చ సర్పిః పానం ప్రశస్యతే,

రూక్షగుణముగలవారు క్షతరోగులు, విషరోగులు, వాతపిత్తరోగులు, మేధాస్మృతిహీనులు, వీరు ఘృతపానంబున కర్హులు.

తైలసేవన కర్హులు.

కృమికోష్ఠానిలావిష్టాః ప్రవృద్ధకఫమేదసః. 12
పిబేయుస్తైలసాత్మ్యాయే తైలం దీప్తాగ్నయస్తు యే,

క్రిమిరోగము, వాతప్రకోపము, కఫవృద్ధి, మేదోవృద్ధి, నూనెఅభ్యాసము, అగ్నిదీప్తి ఇవిగలవారు తైలము పానముజేయఁదగును.

### మాంసస్నేహసేవన కర్తలు.

వ్యాయామకర్శితాశ్శుష్క రేతోరక్తా మహారుజః. 13
మహాగ్నిమారుతప్రాణా వసాయోగ్యా నరాస్సృతాః,

మల్లయుద్ధము, ధనురాద్యాకర్షణము మొదలగువానిచే కృశించిన దేహముగలవారు, శుష్కరేతస్సుగలవారు, రక్తక్షయముగలవారు, రాజయక్ష్మముగలవారు, శరీరమున ప్రబలమగు వేదనగలవారు, వాతప్రకోపంబు గలవారు, అగ్నిబలముగలవారు వసను సేవింపందగును.

### మజ్జాస్నేహసేవనకర్తలు.

క్రూరాశయాః క్లేశసహా వాతార్తా దీప్తవహ్నయః. 14
మజ్జానమాపిబేయుస్తే సర్పిర్వా సర్వతోహితం,

క్రూరకోష్ఠముగలవారు, దుఃఖించువారు, వాతబాధగలవారు, అగ్నిదీప్తిగలవారు వీరు మజ్జాస్నేహంబునుగాని, ఘృతమునుగాని సేవింపవలయును.

### స్నేహసేవనకాలము.

శీతకాలే దివా స్నేహముష్ణకాలే పిబేన్నిశి. 15
వాతపిత్తాధికే రాత్రౌ వాతశ్లేష్మాధికే దివా,

స్నేహంబులను శీతకాలంబున పగటియందును, ఉష్ణకాలంబున రాత్రియందును, వాతపిత్తప్రకోపంబున శీతకాలంబైనను రాత్రియందును, శ్లేష్మప్రకోపంబున ఉష్ణకాలంబైన పగటియందును జేయందగును.

### స్నేహమునకు స్థలశేషయోజన.

నస్యాభ్యంజనగండూషమూర్ధకర్ణాక్షితర్పణే. 16
తైలం ఘృతం వా యుంజీత దృష్ట్వా దోషబలాబలం,

నస్యము, అభ్యంజనము, గండూషము వీనిని జేయునవసరంబునను, శిరస్సు, కర్ణములు, నేత్రములు వీనికి తృప్తిని గలిగించుపట్లను, దోషబలాబలజ్ఞానము నెఱింగి తైలమునుగాని, ఘృతమునుగాని ప్రయోగింపవలెను.

### స్నేహానుపానవివరణము.

ఘృతే కోష్ణం జలం పేయం తైలే యూషః ప్రశస్యతే. 17
వసామజ్జ్ఞో పిబేన్మండమనుపానం సుఖావహం,

ఘృతపానానంతరంబున ఉష్ణోదకంబును, తైలపానానంతరంబున యూషంబును, వసాపానానంతరంబునను, మజ్జాపానానంతరంబునను మండమును అనుపానంబుగా జేసి కొనవలెను. అట్లు చేసెనేని సుఖముగల్గును.

## అన్నముతో స్నేహమును సేవించుకాలము.

స్నేహద్విషశ్శిశూన్ వృద్ధాన్ సుకుమారాన్కృశానపి. 18
తృష్ణాతురానుష్ణకాలే సహభక్తేన పాయయేత్,

ఘృతాదిస్నేహపానమునకు సమర్థులుగానివారికిని, బాలురకును, వృద్ధులకును, సుకుమారులకును, కృశించినవారికిని, దప్పిగలవారికిని ఉష్ణకాలంబున స్నేహములను అన్నముతోగూడ నియ్యవలెను.

## యవాగువుచే స్నేహమును కలుగఁజేయువిధి.

సర్పిష్మతీ బహుతిలా యవాగూ స్వల్పతండులా. 19
సుఖోష్ణా సేవ్యమానా తు సద్యస్స్నేహనకారిణీ,

నువ్వులనుదంచి యందు కొంచెముగ బియ్యము, నేయి, ఉదకముబోసి కాచిన యవాగువును కొద్దిగ వేడియుండగనే సేవించిన నయ్యది సద్యస్స్నేహమనఁబడును. అనఁగా పూర్వము జెప్పఁబడినవారికి యవాగువునిచ్చినతోడనే శరీరమునకు స్నిగ్ధతను గలుగఁ జేయును.

## ధారోష్ణగుణము.

శర్కరాచూర్ణసంసృష్టే దోహనస్థే ఘృతే తు గామ్. 20
దుగ్ధ్వా క్షీరం పిబేదుష్ణం సద్యస్స్నేహనముచ్యతే,

ఖండశర్కరను చూర్ణముఁజేసి యాచూర్ణమును నేతితోగలిపి పాలుపితికెడు పాత్రయందువేసి యాపాత్రలో నావుపాలుపితికి పితికినతోడనే వానిని పుచ్చుకొనవలెను. ఇది ధారోష్ణపానం బనంబడును. ఇది సద్యస్స్నేహము.

## స్నేహాజీర్ణమునకు ప్రతీకారము.

మిథ్యాచారాద్బహుత్వాద్వా యస్య స్నేహో న జీర్యతే. 21
విష్టభ్య చాప్యజీర్యేత వారిణోష్ణేన వామయేత్,

ఘృతాదిస్నేహంబులను సేవించి వ్యాయామంబొనర్చినను, కఫము వృద్ధిఁజెందు పదార్థములను భుజించినను, స్నేహమును అధికముగా పానంబుఁజేసినను నాస్నేహంబు జీర్ణముఁజెందక మలబంధమును గల్గించును. అట్లు మలబంధముగలిగెనేని ఉష్ణోదకంబును పానంబుఁజేసి వమనముజేయవలెను. అట్లుచేసిన అజీర్ణదోషము శమించును.

అన్యచ్చ—స్నేహస్యాజీర్ణశంకాయాం పిబేదుష్ణోదకం నరః. 22
తేనోద్గారో భవేచ్ఛుద్ధో భక్తం ప్రతిరుచస్తథా,

స్నేహపానానంతరంబున అజీర్ణమయినటుల తోఁచెనేని ఉష్ణోదకంబును పానంబు చేయవలెను. పిమ్మట త్రేనుపులు శుద్ధంబులై, అన్నమందిచ్ఛగలిగెనేని అజీర్ణదోషం బపహరించె నని తెలియందగును.

స్నేహసేవనచే ప్రకోపించెడిపిత్తమునకు ప్రతీకారము.

స్నేహేన పైత్తికస్యాగ్నిర్యదా తీక్ష్ణతరీకృతః. 23
తదాస్యోదీరయేత్తృష్ణాం విషమాం తస్య పాయయేత్,
శీతం జలం వామయేచ్చ పిపాసా తేన శామ్యతి. 24

పిత్తప్రకృతిగల పురుషుఁడు స్నేహంబును జేసిన పిదప అగ్ని తీక్ష్ణంబై దప్పిగలిగిన యెడల శీతోదకంబును పానముచేసి వమనముచేసికొనిన నాదప్పి వారించును.

స్నేహసేవన కనర్హులు.

అజీర్ణీ వర్జయేత్స్నేహముదరీ తరుణజ్వరీ,
దుర్బలోఽరోచకీ స్థూలో మూర్ఛార్తో మదపీడితః. 25
దత్తవస్తిర్విరిక్తశ్చ శాంతితృష్ణాశ్రమాన్వితః,
అకాలప్రసవా నారీ దుర్దినే చ వివర్జయేత్. 26

అజీర్ణము, ఉదరరోగము, తరుణజ్వరము, దౌర్బల్యము, అరోచకము, స్థూలరోగము, మూర్ఛ, మదము ఈరోగంబులుగలవారును, వస్తికర్మ చేయించుకొనినవారును, విరేచనములగుచుండువారును, వాంతి, దప్పి, బడలిక ఇవి గలవారును, అకాలంబున ప్రసవించిన స్త్రీలును, బాలింతరాండ్రును, సూర్యరశ్మిలేని దినంబునను, స్నేహపానంబును జేయందగదు.

స్నేహసేవన కర్హులు.

స్వేద్యసంశోధ్యమద్యస్త్రీవ్యాయామాసక్తచింతకాః,
వృద్ధబాలకృశారూక్షాః క్షీణాస్రాః క్షీణరేతసః. 27
వాతార్తితిమిరార్తా యే తేషాం స్నేహనముత్తమం,

స్వేదకర్మ చేయఁబడినవారును, శోధనకర్మ చేయఁబడినవారును, మద్యపానముచేయువారును, స్త్రీసంభోగముచేయువారును, వ్యాయామముచేయువారును, మిగుల ఆలోచన

గలవారును, వృద్ధులు, బాలురు, కృశులు, రూక్షులు, రక్తక్షయముగలవారును, శుక్రక్షయముగలవారును, వాతరోగము, తిమిరరోగము గలవారును స్నేహపానంబున కర్హులు.

## స్నేహసేవనచే రూక్షతహరించినవానిలక్షణము.

వాతానులోమ్యం దీప్తోగ్నిర్వర్చస్స్నిగ్ధమసంహితమ్. 28
మృదుస్నిగ్ధాంగతాగ్లాని స్నేహోద్వేగోథ లాఘవం,
విమలేంద్రియతా సమ్యక్స్నిగ్ధే రూక్షే విపర్యయః. 29

శరీరంబున వాతము సరిగా సంచరించుట, అగ్నిదీప్తిగలుగుట, చక్కగ మలప్రవృత్తియగుట, వాక్పటుత్వముగల్గుట, శరీరము మృదువై స్నిగ్ధంబుగ నుండుట, బడలికనశించుట, శరీరము లాఘవంబుగనుండుట, ఇంద్రియంబులు నిర్మలంబుగనుండుట ఇట్టిలక్షణములు స్నేహపానంబుచేసినవారికి గలిగెనేని శరీరమున రూక్షత హరించినదనియు, కలుగకుండిన హరింపలేదనియు నెఱుంగదగును.

## అధికస్నేహపానముచేఁ గలుగునుపద్రవము.

భక్తద్వేషో ముఖస్రావో గుదే దాహః ప్రవాహికా,
తంద్రాతిసారః పాణ్డుత్వం భృశం స్నిగ్ధస్య లక్షణమ్. 30

స్నేహములను అధికముగా సేవించినయెడల అరోచకము, జొల్లుకాఱుట, గుదస్థానంబున తాపంబు, ప్రవాహిక, నేత్రములందు మసగ, అతిసారము, దేహము పచ్చగనుండుట ఇయ్యవి గలుగును.

## రూక్షత-స్నిగ్ధతగలవారలకు చేయవలసినక్రియ.

రూక్షస్య స్నేహనం స్నేహైరతిస్నిగ్ధస్య రూక్షణం,
శ్యామాకచణకాద్యైశ్చ తక్రపిణ్యాకసక్తుభిః. 31

రూక్షతగలవారికి పెరుఁగు, నువ్వుపిండి, సక్తువులు వీనిచే స్నిగ్ధతను గలుగఁజేయవలెను. అతిస్నిగ్ధులగువారికి శ్యామాకధాన్యము, సెనగలు మొదలగువానిచే రూక్షతను గలుగఁ జేయవలెను.

## స్నేహసేవనచేఁ గల్గుగుణము.

దీప్తాగ్నిశ్శుద్ధకోష్ఠశ్చ పుష్టధాతుర్జితేంద్రియః,
నిర్జరో బలవర్ణాఢ్యస్స్నేహసేవీ భవేన్నరః. 32

స్నేహపానంబును చేసినవారు అగ్నిదీప్తి, కోష్ఠశుద్ధి, ధాతుపుష్టి, ఇంద్రియజయము, ముదిమిలేమి, కాంతి ఇవి గలవారై యుందురు.

స్నేహపానమున వర్జింపఁదగినకార్యములు.

స్నేహీ వ్యాయామసంశీతవేగాఘాతప్రజాగరాన్,
దివాస్వప్నమభిష్యందిరూక్షాన్నం చ వివర్జయేత్. 33

ఇతి శ్రీదామోదరసూను శార్ఙ్గధరవిరచితాయాం సంహితాయాం
ఉత్తరఖండే చికిత్సాస్థానే స్నేహపానాదికథనంనామ
ప్రథమోఽధ్యాయః.

స్నేహపానముచేసినవారు వ్యాయామము, శీతపదార్థసేవ, మలమూత్రధారణము, జాగరణము, పగటియందునిద్ర, కఫపదార్థములు, రూక్షాన్నము వీనిని విసర్జింపవలయు.

ఇది శ్రీదామోదరసూను శార్ఙ్గధరవిరచితసంహితయందు
చికిత్సాస్థానమున నుత్తరఖండమందు స్నేహపానాదికథన మనియెడు
ప్రథమాధ్యాయము సంపూర్ణము.

---

# ద్వితీయాధ్యాయము.

స్వేదభేదవివరణము.

స్వేదశ్చతుర్విధః ప్రోక్తస్తాపోష్మస్వేదసంజ్ఞితౌ,
ఉపనాహో ద్రవస్వేదస్సర్వే వాతార్తిహారిణః. 1

తాపము, ఊష్మము, ఉపనాహము, ద్రవము అనుభేదంబులచే నాల్గువిధంబులు. ఈనాలుగు స్వేదంబులును వాతమును హరించును.

స్వేదగుణము.

స్వేదౌ తాపోష్మజౌ ప్రాయశ్శ్లేష్మఘ్నౌ సముదీపితౌ,
ఉపనాహస్తు వాతఘ్నః పిత్తసంగే ద్రవో మతః. 2

తాపస్వేదము ఊష్మస్వేదము, ఇవిరెండును కఫమును, ఉపనాహస్వేదము, వాతమును, ద్రవస్నేహము పిత్తమును హరించును. ఇసుక మొదలగువానిని బట్టలోగట్టి, ఒత్తడమిచ్చుట, తాపస్వేదమనంబడును. కషాయమును ఆవిరిపట్టుటచే చెమ్మటనుతీయుట ఊష్మమనఁబడును. దోషముండుస్థలమున కట్టుకట్టి చెమ్మటను తీయుట ఉపనాహమనఁబడును. ద్రవద్రవ్యములచే చెమ్మటను తీయుట ద్రవస్వేద మనంబడును.

బైలువెడలం జేయతగినస్వేదపరిమితి.

లే మహావ్యాధౌ శీతే స్వేదో మహాన్ స్మృతః,
దుర్బలస్స్వేదో మధ్యే మధ్యతమో మతః. 3

వాతరోగంబునను, వాతశీతరోగంబునను, మహాస్వేదంబును, దుర్బలం
ర్బలస్వేదంబును, మధ్యమరోగంబున మధ్యమస్వేదంబును చేయందగును.

రోగవిశేషమువలన స్వేదవిశేషము.

రూక్షణస్స్వేదో రూక్షస్స్నిగ్ధం కఫానిలే,
వృతే వాతే కోష్ణం గేహం రవేః కరాత్. 4
ం మార్గగమనం గురుప్రావరణం ధుత్రివం,
వ్యాయామభారాంశ్చ సేవేతామయముక్తయే. 5

బున రూక్షస్వేదంబును, కఫవాతరోగంబున రూక్షస్నిగ్ధస్వేదంబును,
ప్పలచే నావరింపఁబడియుండునపుడు గాలిలేనిస్థలంబునఁ గూర్చుండి
పనటుల సూర్యకిరణములను కాచుకొనుటగాని, కుస్తీచేయుటగాని,
మున నడుచుటగాని, కంబళిమొదలగువానిని కప్పుకొనుటగాని, నిర్మలం
యుండుటగాని, పరిశ్రమగాని, భారమును మోయుటగాని చేసి శరీర
గలిగించవలెను.

నస్యాదికర్మలఁ జేయుటకు కాలము.

ం నస్యం విధాతవ్యం వస్తిశ్చాపి హి దేహినాం,
యాశ్చ యే కేచిత్పూర్వం స్వేద్యాశ్చ తే మతాః. 6

వస్తికర్మ, రేచనము వీని కర్హుఁడగువానిని శరీరమున మొదట చెమ్మటను
పికర్మములను జేయందగును.

శస్త్రకర్మఁజేయుటకు తగినవారు.

శ్యః పూర్వం త్రయోపీహ భగందర్యర్శసస్తథా,
శ్మచాతురో జంతుశ్శమయేచ్ఛస్త్రకర్మణా. 7

ము, మూలవ్యాధి, అశ్మరి-ఈ రోగములుగలవారికి మొదట స్వేదకర్మ
దులచే నారోగమును సాధింపవలయును.

ఉత్తరకాలమున స్వేదము తీయుటకుఁ దగినవారు.

త్స్వేద్యా గతే శల్యే మూఢగర్భగదే తథా,

కాలే ప్రజాతా కాలే వా పశ్చాత్స్వేద్యా నితంబినీ. 8

ఉదరంబున శల్యముండి యది పతనమైన స్త్రీకిని, మూఢగర్భము పతనమైనస్త్రీకిని, కాలమున ప్రసవించినస్త్రీకిని, అకాలమున గర్భపతనమైన స్త్రీకిని, పిమ్మట స్వేదకర్మమును చేయవలెను.

స్వేదముతీయవలసినప్రదేశము.

సర్వాన్స్వేదాన్నివాతే చ జీర్ణాహారే చ కారయేత్,

పూర్వము చెప్పఁబడిన నాలుగు స్వేదంబులను ఆహారము జీర్ణమైనపిదప గాలిలేని స్థలంబునఁ జేయవలెను.

దోషములు తొలఁగుట కుపాయము.

స్వేదాద్ధాతుస్థితో దోషాస్స్వేదస్విన్నస్య దేహినః. 9
ద్రవత్వం ప్రాప్య కోష్ఠాంతర్గతా యాంతి విరేకతాం,

స్వేదకర్మను చేయుటచేత స్వేదంబుచే స్విన్నంబులై ధాతుగతంబు లగుదోషంబులు ద్రవత్వముఁజెంది కోష్ఠంబునం బ్రవేశించి విరేకకోపంబునంబోవును.

స్వేదానంతరమయ్యెడు రేచనములకు చికిత్స.

స్విద్యమానశరీరస్య హృదయం శీతలైస్స్పృశేత్. 10
స్నేహాభ్యక్తశరీరస్య శీతైరాచ్ఛాద్య చక్షుషీ,

పూర్వోక్తప్రకారంబుగ స్వేదకర్మ చేసినవానికి విరేచనంబు లగుచుండెనేని నేత్రములయందు శీతలపదార్థములను గప్పి హృదయమం దశీతలపదార్థములను లేపనము చేయవలెను.

చెమట తీయుటకుఁ దగనివారు.

అజీర్ణో దుర్బలో మేహీ క్షతక్షీణః పిపాసితః. 11
అతిసారీ రక్తపిత్తీ పాండురోగీ తథోదరీ,
మదార్తో గర్భిణీ చైవ న హి స్వేద్యా విజానతా. 12
ఏతానపి మృదుస్వేదైస్స్వేదసాధ్యానుపాచరేత్,

అజీర్ణము, దౌర్బల్యము, ప్రమేహము, ఉరఃక్షతము, దప్పి, అతిసారము, రక్తపిత్తము, పాండురోగము, ఉదరరోగము, మదరోగము ఇవి గలవారును, గర్భిణీస్త్రీలును స్వేదకర్మకు అనర్హులు. కాని స్వేదకర్మకు రోగము సాధ్యంబగునేని యట్టితఱి లఘూపాయంబున స్వేదకర్మ వీరికిఁగూడఁ జేయందగును.

### లఘువుగ చెమట తీయవలసినస్థానములు.

మృదుస్వేదం ప్రయుంజీత తథా హృన్ముష్కదృష్టిషు. 13

హృదయము, వృషణములు, నేత్రములు వీనియందు మృదుస్వేదమును ప్రయోగింపవలయును.

### అధికముగ చెమటవెడలించుటచే గలుగు నుపద్రవములు.

అతిస్వేదాత్సంధిపీడా దాహత్రృష్ణాక్లమభ్రమాః,
పిత్తాసృక్పిటికాకోప స్తత్ర శీతైరుపాచరేత్. 14

అతిస్వేదంబును జేసినయెడల కీళ్లయందు నొప్పి, తాపము, దప్పి, బడలిక, భ్రమ, రక్తపిత్తము, పిటికలు పుట్టును. అట్టితఱి శైత్యోపచారంబును చేయందగును.

### తాపసంజ్ఞిక స్వేదలక్షణము.

తేషు తాపాభిధస్స్వేదో వాలుకావస్త్రపాణిభిః,
కపాలకందుకాంగారైర్యథా యోగ్యం ప్రయుజ్యతే. 15

పూర్వోక్తంబులగు చతుర్విధస్వేదంబులలో తాపస్వేదము-వాలుకా, వస్త్ర, హస్త, కపాళ, కందుక, అంగారకములచే నుత్పన్నంబగును. ధూమరహితంబులగు చంద్ర నిప్పులమీఁద ఇసుకను వేయించి దానిని ఆముదపుఆకులచేచుట్టి ఒత్తడమిచ్చుట వాలుకా స్వేదమనంబడును. వస్త్రమును నిప్పులమీఁద కాచి ఒత్తడమిచ్చుట వస్త్రస్వేద మనంబడును. హస్తమును నిప్పులమీఁద కాచి ఒత్తడమిచ్చుట హస్తస్వేదమనంబడును. చిల్లపెంకులను నిప్పులమీఁద కాచి ఒత్తడమిచ్చుట కపాలస్వేద మనంబడును. బట్టను బంతివలెచుట్టి నిప్పులమీఁదకాచి ఒత్తడమిచ్చుట కందుకస్వేద మనంబడును. కుంభికాదుల యావిరి పట్టుట అంగారస్వేద మనంబడును.

### ఊష్మసంజ్ఞికస్వేదలక్షణము.

ఊష్మాస్వేదః ప్రయోక్తవ్యో లోహపిండేష్టకాదిభిః,
ప్రతప్తైరమ్లసిక్తైశ్చ కాయే రల్లకవేష్టితే. 16
అథవా వాతనిర్నాశిద్రవ్యక్వాథరసాదిభిః,
ఉష్ణైర్ఘటం పూరయిత్వా పార్శ్వే ఛ్ఛిద్రం నిధాయ చ. 17
విముద్ర్యాస్యం త్రిఘుండాం చ ధాతుజాం కాష్ఠవంశజాం,
షడంగులాస్యాం గోపుచ్ఛసాడీం యుజ్యాద్ద్విహస్తికామ్. 18
సుఖోపవిష్టం స్వభ్యక్తం గురుప్రావరణావృతం,

హస్తిశుండికయా నాడ్యా స్వేదయేద్వాతరోగిణమ్. 19
పురుషా యామమాత్రం వా భూమిముత్కీర్య ఖాదిరైః,
కాష్ఠైర్దగ్ధ్వా తథాభ్యుక్ష్య క్షీరధాన్యామ్లవారిభిః. 20
వాతఘ్నపత్రైరాచ్ఛాద్య శయానం స్వేదయేన్నరం,
ఏవం మాషాదిభిస్స్విన్నైశ్శయానం స్వేదమాచరేత్. 21

ఇనుపగుండు, ఇటుకతాళ్లు మొదలగువానిని నిప్పులలో గాచి యందు మజ్జిగ, పులిగంజి మొదలగు పులుసుపదార్థములను చల్లి రోగికి కంబళము కప్పి ఒత్తడమిచ్చుట గాని, వాతహారంబులగు దశమూలములు మొదలగువానిని కషాయింబునుగాని, వాని రసమునుగాని వేడిగానుండఁగనే కుండలోపోసి యాపాత్రముయొక్క మూఁతినిబాగుగా బంధించి యాకుండకు ప్రక్కన రంధ్రమువేసి తామ్రము, ఇనుము మొదలగు లోహములచేగాని, వెదురుచేగాని చేయఁబడిన రెండుమూరల పొడవుగల గొట్టమును నిర్మించి దానిముఖమున మూఁడురంధ్రములనుగాని, నోరు వెడల్పుగలదాని ఆఱువేళ్ల పొడవు గలిగి ఆవుతోఁకవలె నుండునటులగాని చేసి ఆపాత్రయొక్క రంధ్రమునందు గ్రుచ్చి యా సందును బాగుగా బంధించి వాతరోగముగలవాని కూర్చుండబెట్టి యాతని శరీరంబున నేతినిగాని, నూనెగాని పూసి కంబళము కప్పి యా కంబళము పైన నాగొట్టపు రంధ్రమునుంచి స్వేదనకర్మ జేయందగును. ఇయ్యది హస్తిశుండిక యనంబడును. మఱియు మూఁడునరగాని, నాలుగుగాని మూరలలోఁతున భూమిని త్రవ్వి యందు చండ్రకట్టె, తుమ్మకట్టె మొదలగువానినిగాని, బొగ్గులనుగాని వేసి కాల్చి యా కాలినస్థలమున పాలు, ధనియములు, నీళ్లు, మజ్జిగ, కాంజికము మొదలగువానిని చల్లి వానిపై ఆముదపాకులుగాని, వావిలియాకులనుగాని, జిల్లేడు ఆకులనుగాని పఱచి యందు రోగిని పరుండఁబెట్టి స్వేదనకర్మఁ జేయందగును. ఈరీతిగనే యాకాలినప్రదేశంబున మినుములను బఱచి యందు పూర్వపుటాకులను పఱచి రోగిని పరుండఁబెట్టవలెను. ఇయ్యది ఊష్మస్వేద మనంబడును.

## ఉపనాహసంజ్ఞికస్వేదలక్షణము.

అథోపనాహస్వేదం చ కుర్యాద్వాతహరౌషధైః,
ప్రదిహ్య దేహం వాతార్తం క్షీరమాంసరసాన్వితైః. 22
అమ్లపిష్టైస్సలవణైస్సుఖోష్ణైస్స్నేహసంయుతైః,

వాతహారంబులగు దశమూలములు మొదలగు ద్రవ్యములను దంచి చూర్ణముగా వించి అందు పాలు, జింక మొదలగుదానిమాంసరసమును, స్నేహద్రవ్యములను కలిపి

వెచ్చచేసి రోగియొక్క శరీరము సుఖముగా నుండునటులపూసి వస్త్రాదులచే జుట్టి స్వేద కర్మమును చేయందగును. ఇయ్యది ఉపనాహస్వేద మనంబడును.

అన్యచ్చ—ఉప గ్రామ్యానూపమాంసైర్జీవనీయగణేన చ. 23
దధిసౌవీరకక్షారైర్వీరతర్వాదినా తథా,
కులిత్థమాషగోధూమైరతసీతిలసర్షపైః. 24
శతపుష్పా దేవదారుశేఫాలీస్థూలజీరకైః,
ఏరండమూలబీజైశ్చ రాస్నామూలకశిగ్రుభిః. 25
మిశీకృష్ణాకుశేరైశ్చ లవణైరమ్లసంయుతైః,
ప్రసారణ్యశ్వగంధాభ్యాం బలాభిర్దశమూలకైః. 26
గుడూచీవానరీబీజైర్యథాలాభం సమాహృతైః,
క్షుణ్ణైస్స్విన్నైశ్చ వస్త్రేణ బద్ధైస్సంస్వేదయేన్నరమ్. 27
మహాశాల్వణసంజ్ఞోఽయం యోగస్సర్వానిలార్తిజిత్,

కోళ్లు మేకలు మొదలగువాని మాంసము, తాఁబేలు, చక్రవాకము, చేపలు మొదలగువాని మాంసము. జీవనీయగణద్రవ్యములు.—ఆవు పెరుఁగు, సౌవీరము, సర్జక్షారము, యవక్షారము, ఉత్తరేణిక్షారము, వీరతరాది గణద్రవ్యములు.—ఉలవలు, ఉద్దులు, గోధూమములు, అగసివిత్తులు, నువ్వులు, తెల్లఆవాలు, పెద్దసోపు, దేవదారు, నల్లవావిలి, పెద్దజీలకఱ్ఱ, ఆముదపువేళ్లు, ఆముదపువిత్తులు, సన్నరాస్నము, ముల్లంగి, మునగ, బాలింతబోలు, పిప్పళ్లు, అడవితులసి, లవణపంచకము, దానిమ్మపండు, అంశెసవరపు ఆకు, పెన్నేరు, చిట్టాముదము వేళ్లు, దశమూలములు, తిప్పతీఁగ, దురదగొండి విత్తులు వీనిలో నన్నిఁటినిగాని, కొన్నిఁటినిగాని గ్రహించి దంచి, కొంచెము వెచ్చచేసి వస్త్రమున మూటగట్టి రోగశరీరంబునకు ఒత్తడమిచ్చుటకూడ ఉపనాహస్వేద మనంబడును. ఇది మహాశాల్వణప్రయోగ మనంబడును.

## ద్రవసంజ్ఞిక స్వేదలక్షణము.

ద్రవస్వేదస్తు వాతఘ్న ద్రవ్యక్వాథేన పూరితే. 28
కటాహే కోష్ఠకే వాపి సూపవిష్టోఽవగాహయేత్,
నాభేష్షడంగులం యావన్మగ్నః క్వాథస్య ధారయా. 29
కోష్ఠకే స్కంధయోస్సిక్తస్తిష్ఠేత్సిగ్ధతనుర్నరః,
ఏవం తైలేన దుగ్ధేన సర్పిషా స్వేదయేన్నరమ్ 30
ఏకాంతరే ద్వ్యంతరే వా స్నేహో యుక్తోఽవగాహనే,

సిరాముఖై రోమకూపైర్ధమనీభిశ్చ తర్పయేత్. 31
శరీరే బలమాధత్తే యుక్తస్నేహావగాహనే,
జలసిక్తస్య వర్ధంతే యథామూలేఽంకురాస్తరోః. 32
తథా ధాతువివృద్ధిర్హి స్నేహసిక్తస్య జాయతే,
నాతః పరతరః కశ్చిదుపాయో వాతనాశనః. 33

వాతహారంబులగు ద్రవ్యములను కషాయంబుగాఁచి దానిని ఒకకటాహంబునఁగాని, కోష్ఠంబునగాని పోసి రోగియొక్క నాభిపైన నాలుగంగుళముల వఱకును నుండునటులఁ జూచి యందు నారోగిశరీరమున నూనెగాని, నేయికాని అందు కూర్చుండఁబెట్టి, యంద లి కషాయమును నారోగిభుజములపైని సహ్యమగునటుల ధారగా పోయుచుండవలెను. మఱియు నిట్టే నూనె, నేయి, పాలు వీనిలో నెద్దానినైనను కాచి వానిభుజముల యందు పోయవలెను. తరువాత ఒకటిరెండు దినములు స్వేదకర్మమును మానివేసి పిమ్మట మరల నాప్రకారముగానే చేయందగును. ఇట్లుచేసిన యెడల తైలాదులు వాని సిర, ధమని, రోమకూపంబులగుండా శరీరమున ప్రవేశించి శరీరమునకు తృప్తిని, బలమును గలుగంజేయును. వృక్షముయొక్క యాలవాలంబున నుదకమును బోసిన నా జలంబు వేళ్లనుండి వృక్షమును వృద్ధినొందించు లాగున వాని ధాతువులు వృద్ధినొందును. వాతమును హరింపఁజేయుట కింతకంటె శ్రేష్ఠంబగు నుపాయంబు గానరాదు.

## స్వేదోపరతికాలము.

శీతశూలాద్యుపరమే స్తంభగౌరవనిగ్రహే,
దీప్తేఽగ్నౌ మార్దవే జాతే స్వేదనాద్విరతిర్మతా. 34

చలి, శూలము, శరీరస్తంభము, జడత్వము ఇవి నశించి అగ్నిదీప్తియు, శరీరమునకు మృదుత్వంబును గలిగినతోడనే స్వేదకర్మమును చాలించవలెను.

## స్వేదానంతరము చేయతగిన యుపచారము.

సమ్యక్స్విన్నం విమృదితం స్నాతముష్ణాంబుభిశ్శనైః,
భోజయేచ్చానభిష్యంది వ్యాయామం చ న కారయేత్. 35

ఇతి శ్రీదామోదరసూనుశార్ఙ్గధరేణ విరచితాయాం సంహితాయాం
ఉత్తరఖండే చికిత్సాస్థానే స్వేదవిధికథనంనామ
ద్వితీయోఽధ్యాయః.

స్వేదకర్మ చేయఁబడిన వానిశరీరమునకు తైలమును లేపనముచేసి కొంచెము వెచ్చగ నున్న నీటిలో స్నానంబుచేయించి కఫప్రకోపకంబులగు పదార్థములను వర్జించి లఘువుగ భుజింపఁజేయవలెను. మఱియు నట్టివాఁడు వ్యాయామము వర్జింపవలయును.

ఇది శ్రీదామోదరసూను శార్ఙ్గధరవిరచితసంహితయందు ఉత్తరఖండమున
చికిత్సాస్థానమున స్వేదవిధికథనమనియెడు
ద్వితీయాధ్యాయము సంపూర్ణము.

---

# తృతీయాధ్యాయము.

## వమనరేచనములఁ జేయింపఁదగినకాలము.

శరత్కాలే వసంతే చ ప్రావృట్కాలే చ దేహినాం,
వమనం రేచనం చైవ కారయేత్కుశలో భిషక్. 1

బుద్ధిమంతుఁ డగువైద్యుఁడు శరత్కాలంబునఁగాని, వసంతకాలంబునఁగాని, వర్ష కాలంబునఁగాని, వమన, విరేచనంబులకు నౌషధము నీయందగును.

## వమనమున కర్హులు.

బలవంతం కఫవ్యాప్తం హృల్లాసాదినిపీడితం,
తథా వమనసాత్మ్యం చ ధీరచిత్తం చ వామయేత్. 2
విషదోషే స్తన్యరోగే మన్దేఽగ్నౌ శ్లీపదేఽర్బుదే,
హృద్రోగకుష్ఠవీసర్పే మేహాజీర్ణభ్రమేషు చ. 3
విదారికాపచీకాసశ్వాసపీనసవృద్ధిషు,
అపస్మారే జ్వరోన్మాదే తథా రక్తాతిసారిషు. 4
నాసాతాల్వోష్ఠపాకేషు కర్ణస్రావే ద్విజిహ్వకే,
గలశుండ్యామతీసారే పిత్తశ్లేష్మగదే తథా. 5
మేదోగదే రుచౌ చైవ వమనం కారయేద్భిషక్,

బలవంతునకును, కఫప్రకోపము గలవానికిని, నోట జొల్లుకాఱువానికిని, వమన మభ్యాసముగాఁగల వానికిని, ధీరచిత్తముగల వానికిని, విషదోషము, స్తన్యరోగము, అగ్నిమాంద్యము, బోదకాలు, అర్బుదము, హృద్రోగము, కుష్ఠరోగము, విసర్పము, ప్రమే

హము, అజీర్ణము, భ్రమ, విదారిక, అపచి, కాసము, శ్వాసము, పీనసము, ఆంత్రవృద్ధి, అపస్మారము, జ్వరము, ఉన్మాదము, రక్తాతిసారము, నాసారోగము, తాలుపాకము, ఓష్ఠపాకము, కర్ణస్రావము, ద్విజిహ్వకము, గళశుండి, అతిసారము, పిత్తశ్లేష్మరోగము, మేదోరోగము, అరుచి, ఈరోగములుగలవానికిని వమనము చేయింపందగును.

వమనమున కనర్హులు.

న వామనీయ స్తిమిరీ న గుల్మీ నోదరీకృశః. 6
నాతివృద్ధో గర్భిణీ చ న స్థూలో న క్షతాతురః,
మదార్తో బాలకో రూక్షః క్షుధితశ్చ నిరూహితః. 7
ఉదావర్త్యూర్ధ్వరక్తీ చ దుశ్ఛర్దిః కేవలానలీ,
పాణ్డురోగీ కృమివ్యాప్తః పఠనాత్స్వరఘాతుకః. 8
ఏతేప్యజీర్ణవ్యథితా వామ్యా యే విషపీడితాః,
కఫవ్యాప్తాశ్చ తే వామ్యా మధుకక్వాథపానతః. 9

తిమిరరోగి, గుల్మరోగి, ఉదరరోగి, కృశుఁడు, అతివృద్ధుఁడు, గర్భిణిస్త్రీ, స్థూలదేహి, క్షతరోగి, మదరోగి, బాలుఁడు, రూక్షుఁడు, నిరూహవస్తి చేయఁబడినవాఁడు, ఉదావర్తరోగి, ఊర్ధ్వరక్తపిత్తరోగి, వమనము కానివాఁడు, కేవలవాతప్రకోపముగలవాఁడు, పాండురోగి, క్రిమిరోగి, వేదశాస్త్రములను గట్టిగచదువుటచే కంఠమందలి స్వరము మాఱినవాఁడు వీరలకు వమనౌషధము నీయఁదగదు. కాని వీరలకైనను అజీర్ణము, విషదోషము, కఫప్రకోపము గలిగియుండిన అతిమధురకషాయంబుతో వమనము చేయింపందగును.

అధికముగ వమనముఁజేయింపఁదగనివారు.

సుకుమారం కృశం బాలం వృద్ధం భీరుం న వామయేత్,

సుకుమారులకును, కృశించిన వారలకును, బాలురకును, వృద్ధులకును, భయపడువారలకును వమనమును చేయింపందగదు.

వమనమునకు ముందుఁజేయవలసినక్రియ.

పీత్వా యవాగూమాకంఠం క్షీరతక్రదధీని వా. 10
అసాత్మైశ్శ్లేష్మలైరోభోజ్యైర్దోషానుత్క్లేశ్య దేహినః,
స్నిగ్ధస్విన్నాయ వమనం దత్తం సమ్యక్ప్రవర్తతే. 11

వమనము జేయింపవలసినరోగిని పూర్వపుదినమున కడుపునిండునటుల యవాగువునుగాని, పాలనుగాని, మజ్జిగనుగాని, పెరుఁగునుగాని ఒసంగి పిమ్మట ప్రకృతివిరుద్ధంబు

లగు పదార్థములను, కఫప్రకోపము చేయుపదార్థములను, భుజింపంజేసినయెడల నట్టి దోషము వృద్ధిజెందును. తరువాత వమనమునకు ఔషధము నిచ్చి వమనమునుజేయించ వలెను. మఱియుం ఘృతపానము చేయించి స్వేదకర్మము చేయించి పిమ్మట వమనౌషధంబు నిచ్చిన వమనము బాగుగానగును.

## వమనసహాయద్రవ్యములు.

వమనేషుచ సర్వేషు సైంధవం మధు వాహితం,
బీభత్సం వమనం దద్యాద్విపరీతం విరేచనమ్. 12

వమనద్రవ్యయోగంబులందు సైంధవలవణమును గాని, తేనెను గాని చేర్పం దగును. నేతితోగలపి వమనంబును, నేయిని కలపకుండ విరేచనంబును చేయింపందగును. ఇయ్యది బీభత్సంబనంబడును.

## వమనమునకు కషాయద్రవ్యప్రమాణము.

క్వాథద్రవ్యస్య కుడవం శ్రపయిత్వా జలాఢకే,
అర్ధభాగావశిష్టం చ వమనేష్వవచారయేత్. 13

వమనయోగ్యంబులగు కషాయద్రవ్యములను ఒక కుడవప్రమాణముగా గ్రహించి అందు ఒక ఆఢకము నీరుపోసి సగము మిగులునట్లుగాచి వడగట్టి యద్దానిని ప్రయోగింపవలెను.

## వమనకషాయపానప్రమాణము.

క్వాథపానే నవప్రస్థా జ్యేష్ఠా మాత్రా ప్రకీర్తితా,
మధ్యమా షణ్మితా ప్రోక్తా త్రిప్రస్థా చ కనీయసీ. 14

వమనంబునకు కషాయంబు నొసంగిన తొమ్మిదిప్రస్థములు ఉత్తమమాత్రగను, ఆఱుప్రస్థములు మధ్యమమాత్రగను, మూఁడుప్రస్థములు అధమమాత్రగను ఉండవలెను.

## వమనమున కల్కాదిప్రయోగము.

కల్కచూర్ణావలేహానాం త్రిపలం జ్యేష్ఠమాత్రయా,
మధ్యమం ద్విపలం విద్యాత్కనీయస్తు పలం భవేత్. 15

కల్కము, చూర్ణము, అవలేహము దీనిని వమనార్థం బుపయోగించునట్లు మూఁడు పలములు, ఉత్తమమాత్రగను, రెండుపలములు మధ్యమమాత్రగను, ఒకపలము స్వల్పమాత్రగను నుండవలయును.

## వమనములకు ఉత్తమాదిప్రమాణములు.

వమనే చాపి వేగాస్స్యురష్టౌ పిత్తాంతముత్తమాః,
షడ్వేగా మధ్యవేగాశ్చ చత్వారస్త్వవరా మతాః. 16

వమనార్థము తీసికొనినవానికి ఏడుమార్లు వమనంబులయి దోషంబు నశించి ఎనిమిదవమాఱు పైత్యము పడెనేని ఉత్తమమనియు, ఆఱుమార్లు అయిన యెడల మధ్యమమనియు, నాలుగుమార్లు అయినయెడల కనిష్ఠమనియు చెప్పఁబడును.

### వమనౌషధప్రస్థప్రమాణము.

వమనేచ విరేకే చ తథా శోణితమోక్షణే,
సార్ధత్రయోదశపలం ప్రస్థమాహుర్మనీషిణః. 17

వమన, విరేచన, రక్తమోక్షణంబులందు పూర్వముచెప్పఁబడిన, ప్రస్థము పదిమూఁడున్నర పలమని యెఱుంగునది.

### వమనమున కఫాదులను హరించుకొనుటకు విశేషము.

కఫం కటుకతీక్ష్ణోష్ణైః పిత్తం స్వాదు హిమైర్జయేత్,
సుస్వాదు లవణామ్లోష్ణైస్సంసృష్టం వాయునా కఫమ్. 18

కటురసంబుగల తీక్ష్ణౌషధంబులచే కఫంబును, శీతవీర్యంబులగు మధురద్రవ్యంబులచే పిత్తంబును, మధుర, లవణ, అమ్ల, రసంబులు గలిగి ఉష్ణవీర్యంబు లగుద్రవ్యంబులచే వాతముతోఁ గూడిన కఫమును నశింపఁజేయవలెను.

### కఫాదులను వమనమూలంబుగ హరించుట కౌషధము.

కృష్ణారాఠఫలైస్సింధుం కఫే కోష్ణజలైః పిబేత్,
పటోలవాసానింబైశ్చ పిత్తే శీతజలం పిబేత్. 19
స్లేష్మవాతపీడాయాం సక్షీరం మదనం పిబేత్,
అజీర్ణే కోష్ణపానీయైస్సింధుం పీత్వా వమేత్సుధీః. 20

కఫప్రకోపంబున పిప్పళ్లు, మ్రంగకాయ, సైంధవలవణము వీనిచూర్ణములో కొంచము వెచ్చని నీటినిగలిపి వమనార్థము త్రాగవలెను. పిత్తప్రకోపంబున చేదుపొట్ల, అడ్డసరము, వేప వీనిచూర్ణంబులో చల్లనినీటిని గలిపి వమనార్థము సేవింపవలెను. కఫాన్వితవాతదోషంబున మ్రంగకాయ చూర్ణము పాలలో గలిపిపుచ్చుకొనవలెను. అజీర్ణంబున సైంధవలవణము వేఁడినీళ్లలో గలిపి సేవింపందగును.

### వమనమునఁ జేయఁదగినబాహ్యోపచారములు.

వమనం పాయయిత్వా చ జానుమాత్రాసనే స్థితం,
కంఠమేరండనాలేన స్పృశంతం వామయేద్భిషక్. 21
లలాటం వమతః పుంసః పార్శ్వే ద్వేచ ప్రబోధయేత్,

వమనౌషధంబును సేవించిన పిదప మోకాలు యెత్తుగల పీటపైఁ గూర్చుండి సన్నని ఆముదపువేరును కంఠములోనికిఁ జొరనిచ్చి చిఱునాలుకను నావేరుచే స్పృశించు చుండిన వమనంబగును. ఆరీతిగా వమనం బగుచుండిన నారోగియొక్క లలాటస్థలంబు నను, ఇరుప్రక్కలయందును గట్టిగా వైద్యుఁడు పట్టుకొనవలెను.

వమనవిక్రియచేఁ గలుగు లక్షణములు.

ప్రసేకో హృద్గ్రహః కోఠః కణ్డూర్దుశ్ఛర్దితో భవేత్. 22

వమనౌషధంబును గ్రహించిన పిమ్మట వమనము కాకపోవుటగాని, అధికముగా నగుటగాని సంభవించినయెడల నోట జొల్లుకాఱుట, ఱొమ్మునొప్పి, శరీరంబున నెఱ్ఱని మండలంబులు దురద గలుగును.

మిక్కుటముగ వమనమగుటచేఁ గలుగు నుపద్రవములు.

అతివాంతే భవేత్తృష్ణా హిక్కోద్గారౌ విసంజ్ఞితా,
జిహ్వా నిస్సర్పణం చాక్ష్ణో ర్వ్యావృత్తిర్హనుసంహతిః. 23
రక్తచ్ఛర్దిః ష్ఠీవనం చ కంఠే పీడా చ జాయతే,

అధికంబుగా వమనం బయ్యేనేని మిగులదాహము, ఎక్కిళ్లు, త్రేఁపులు, చేష్టా హాని, నాలుకపొరలుట, కన్నులుదిరుగుట, చెక్కిళ్లు స్తంభించుట, నోట రక్తముపడుట, ఉమియుట, కంఠంబున మిక్కుటముగబాధ ఈలక్షణంబులు చూపట్టును.

అధికవమనమునకు చికిత్స.

వమనస్యాతియోగే చ మృదు కుర్యాద్విరేచనమ్. 24

అధికముగ వమనంబైనవానికి లఘువుగ విరేచనంబున కౌషధంబు నీయవలెను.

వమనముచే లోనికేగిననాలుకకు చికిత్స.

వమనాంతః ప్రవిష్టాయాం జిహ్వాయాం కబలగ్రహాః,
స్నిగ్ధామ్లలవణైర్హృద్యైర్ఘృతక్షీరరసైర్హితః. 25
ఫలాన్యమ్లాని ఖాదేయుస్తస్య చాన్యేఽగ్రతో నరాః,

అధికముగ వమనంబై నాలుక లోని కీడ్చుకొనిపోవుచుండినయెడల మనంబున కిష్టంబులగు పులుసు కారము, తీపు, ఉప్పు గలపదార్థములను, నేయి, పాలు, మాంసరసము వీనికూడచేర్చి అన్నము భుజింపవలెను. అట్లు నాలుక లోనికిపోవునపుడు ఆరోగియెదుట పుల్లని పండ్లను భక్షించినయెడల నానాలుకలయందుద్రవము కలిగి స్వస్థానంబునఁజేరును.

వమనముచే వెలుపలికివచ్చిన నాలుకకు చికిత్స.

నిస్సృతాం తు తిలద్రాక్షాకల్కం లిప్త్వా ప్రవేశయేత్. 26

అతివమనంబుచే నాలుక పైకి వచ్చెనేని యానాలుకయందు నువ్వులు ద్రాక్షపండ్లు వీనిని కల్కముచేసి యానాలుకకు లేపనంబుచేసిన నయ్యది స్వస్థానముం జేరును.

వమనముచేఁ గలుగు నేత్రవికారమున కుపచారము.

వ్యావృత్తేఽక్ష్ణి ఘృతాభ్యక్తే పీడయేచ్చ శనైశ్శనైః,

అతివమనంబుచేత నేత్రములు సొక్కి స్తంభించియుండిన వానికి నేతినిపూసి మెల్లఁగ సరిపఱుపవలెను.

వమనముచేఁగలుగుహనుస్తంభమున కుపచారము.

హనుమోక్షే స్మృతస్స్వేదో నస్యం చ శ్లేష్మవాతహృత్. 27

హనుస్తంభము గలిగెనేని స్వేదకర్మచేసి కఫవాతహరంబులగు నస్యములను జేయింపవలెను.

వమనముతోఁ బడురక్తమున కుపచారము.

రక్తపిత్తవిధానేన రక్తచ్ఛర్దిముపాచరేత్,

రక్తవమనం బయ్యెనేని రక్త పిత్త చికిత్సం జేయందగును.

వమనానంతరము గలిగెడుదప్పి కుపచారము.

ధాత్రీరసాంజనోశీరలాజాచందనవారిభిః. 28

మన్థం కృత్వా పాయయేచ్చ సఘృతక్షౌద్రశర్కరం,

శామ్యంత్యనేన తృష్ణాద్యాః పీడాచ్ఛర్దిసముద్భవాః. 29

వాంతులవలన దప్పిగలిగెనేని ఉసిరికాయ, రసాంజనము, వట్టివేళ్లు, వరిపేలాలు, రక్తచందనము, కురువేరు వీనిని మంథనముగాచేసి యందు నేయి, తేనె, చక్కెర, వైచి త్రాగించవలెను.

చక్కఁగ వమనంబగుటచేఁ గలుగులక్షణములు.

హృత్కంఠశిరసాం శుద్ధిర్దీప్తాగ్నిత్వం చ లాఘవం,

కఫపిత్తవినాశశ్చ సమ్యగ్వాంతస్య చేష్టితమ్. 30

హృదయము, కంఠము, శిరస్సు వీనియందు కఫదోషము హరించి శుద్ధముగా నుండుట, అగ్నిదీప్తిగల్గుట, కఫపిత్తములు నశించి శరీరము లఘువుగనుండుట ఇవి చక్కఁగ వమనంబైనపుడు గల్గులక్షణంబులు.

వమనానంతరము చేయవలసిన పథ్యము.

తతోఽపరాహ్ణే దీప్తాగ్నిం ముద్గషష్టికశాలిభిః,
హృద్యైశ్చ జాంగలరసైః కృత్వా యూషం చ భోజయేత్. 31

చక్కఁగ వమనంబైన పిదప మూఁడవయామంబున అగ్నిదీప్తి గల్గియుండినచో పెసలు, షష్టికధాన్యము, వరిబియ్యము వానితో జాంగలమాంసమును చేర్చి యూషంబుగా నొనరించి భుజించవలెను.

చక్కఁగ వమనంబైనవానికి గలుగకుండురోగములు.

తంద్రానిద్రాస్యదౌర్గంధ్యం కండూశ్చ గ్రహణీవిషం,
సువాంతస్య న పీడార్యై భవంత్యేతే కదాచన. 32

వమనంబు చక్కఁగా నయ్యేనేని వానికి కన్నులయందు మబ్బు, అతినిద్ర, ముఖమందు దౌర్గంధ్యము, దురద, గ్రహణి, విషదోషము ఇవి ఎప్పుడును గలుగకుండును.

వమనానంతరము వర్జింపఁదగినపదార్థములు.

అజీర్ణం శీతపానీయం వ్యాయామం మైథునం తథా,
స్నేహాభ్యంగం ప్రకోపం చ దినైకం వర్జయేత్సుధీః. 33

ఇతి శ్రీదామోదరసూనుశార్ఙ్గధరేణ విరచితాయాం సంహితాయాం
ఉత్తరఖండే చికిత్సాస్థానే వమనవిధికథనంనామ
తృతీయోఽధ్యాయః

వమనార్థం బౌషధమును తీసికొనినదినమున అజీర్ణపదార్థములు, శీతోదకపానంబు, వ్యాయామము, మైథునము, అభ్యంజనము, కోపము వీనిని వర్జింపవలెను.

ఇది శ్రీదామోదరసూను శార్ఙ్గధరవిరచితసంహితయందు ఉత్తరఖండమున
చికిత్సాస్థానమున వమనవిధికథనమనియెడు తృతీయాధ్యాయము సంపూర్ణము.

---

# చతుర్థాధ్యాయము.

విరేచనవిధి.

స్నిగ్ధస్విన్నస్య వాంతస్య దద్యాత్సమ్యగ్విరేచనం,
అవాంతస్య త్వధః స్రస్తో గ్రహణీం ఛాదయే త్కఫః. 1

మందాగ్నిగౌరవం కుర్యాజ్జనయేద్వా ప్రవాహికాం,
అథవా పాచనైరామం బలాసం చ విపాచయేత్. 2

విరేచనంబును చేయించుటకు పూర్వము స్నేహపానంబు చేయించి పిదప స్వేద కర్మగావించి పిమ్మట వమనకర్మగావించి తరువాత విరేచనౌషధంబు నీయందగును. వమనంబుకానివానికి విరేచనౌషధంబు నిచ్చిన అధోగతంబగు కఫము గ్రహణియను పిత్తధారకకళను ఆచ్ఛాదనముచేసి అగ్నిమాంద్యము, జడత్వము, ప్రవాహిక వీనిని పుట్టించును. అట్టి ఆమదోషంబును, కఫమును, పాచనౌషధంబులచే పచనంబు గావింపవలెను.

అన్యచ్చ—స్నిగ్ధస్య స్నేహనైః కార్యం స్వేదై స్స్విన్నస్య రేచనమ్.

స్నేహపానంబుఁ జేయించిన పిదప స్నేహనద్రవ్యములచే స్వేదకర్మ గావించి పిమ్మట విరేచనంబు గావింపవలెను.

### రేచనములకు సామాన్యకాలము.

శరదృతౌ వసంతే చ దేహశుద్ధ్యై విరేచయేత్,
అన్యథాత్యయికే కాలే శోధనం శీలయేద్బుధః. 3

శరత్కాలము, వసంతకాలము వీనియందు శరీరశుద్ధికొఱకు వేతే ఔషధంబులను గ్రహింపవలెను. మఱియు ఇతరకాలంబులందు రేచనసాధ్యంబగు రోగముపుట్టెనేని విరేచనమునకు తీసికొనవలెను.

### బలముగ రేచనమునకుఁ బుచ్చుకొనఁదగినరోగములు.

పిత్తే విరేచనం దద్యాదామోద్భూతే గదే తథా,
ఉదరే చ తథాధ్మానే కోష్ఠశుద్ధౌ విశేషతః. 4

పిత్తప్రకోపము, ఆమ్లవాతము, ఉదరరోగము, ఆధ్మానము, బద్ధకోష్ఠము, ఈరోగంబులుగలవానికి విశేషంబుగా విరేచనౌషధంబు నీయందగును.

### విరేచనోత్కృష్టత.

దోషాః కదాచిత్కుప్యంతి జితాలంఘనపాచనైః,
యే తు సంశోధనై శ్శుద్ధా న తేషాం పునరుద్భవః. 5

వాతాదిదోషములు లంఘనపానంబులచే శమించినను మరల నొకానొకప్పుడును వృద్ధిఁబెందవచ్చును. వమనవిరేచకాది శోధనకర్మములచే నశించి దోషములు ఎన్నటికిని వృద్ధినొందనేరవు.

రేచనౌషధసేవన కర్హులు.

జీర్ణజ్వరీ గరవ్యాప్తో వాతరక్తీ భగందరీ,
అర్శః పాండూదరగ్రంథిహృద్రోగారుచిపీడితాః. 6
యోనిరోగప్రమేహార్తా గుల్మప్లీహవ్రణార్దితాః,
విద్రధిచ్ఛర్దివిస్ఫోటవిషూచీకుష్ఠసంయుతాః. 7
కర్ణనాసాశిరోవక్త్రగుదమేఢ్రామయాన్వితాః,
యకృచ్ఛోఫఘాక్షిరోగార్తాః కృమిక్షారానిలార్దితాః. 8
శూలినో మూత్రఘాతార్తాః విరేకార్హా నరా మతాః,

జీర్ణజ్వరము, విషదోషము, వాతరక్తము, భగందరము, మూలరోగము, పాండురోగము, ఉదరరోగము, గ్రంథిరోగము, హృద్రోగము, అరోచకము, యోనిరోగము, ప్రమేహము, గుల్మము, ప్లీహోదరము, వ్రణరోగము, విద్రధి, ఛర్ది, విస్ఫోటకము, విషూచి, కుష్ఠము, కర్ణరోగము, నాసారోగము, శిరోరోగము, ముఖరోగము, గుదరోగము, శోకరోగము, యకృదుదరము, శోఫరోగము, అక్షిరోగము, కృమిరోగము, క్షీణత, వాతరోగము, శూలరోగము, మూత్రాఘాతము ఈరోగంబులు గలవారలకు విరేచనంబును చేయింపందగును.

రేచనౌషధసేవన కనర్హులు.

బాలవృద్ధావతిస్నిగ్ధః క్షతక్షీణో భయాన్వితః. 9
శ్రాంతస్తృషార్తస్థూలశ్చ గర్భిణీ చ నవజ్వరీ,
నవప్రసూతా నారీ చ మందాగ్నిశ్చ మదాత్యయీ. 10
శల్యార్దితశ్చ రూక్షశ్చ న విరేచ్యా విజానతా,

బాలురు, వృద్ధులు, సుకుమారులు, క్షతక్షీణులు, భీతిగలవారు, అలసినవారు, దప్పిగలవారు, స్థూలశరీరముగలవారు, గర్భిణీస్త్రీలు, నవజ్వరపీడితులు, నూతనముగ ప్రసవించిన స్త్రీలు, అగ్నిమాంద్యముగలవారు, వాతరోగముగలవారు, శల్యపీడితులు, తేజోహీనులు వీరలకు విరేకౌషధంబు నీయందగదు.

మృదుమధ్యక్రూరకోష్ఠవివరణము.

బహుపిత్తో మృదుః కోష్ఠో బహుశ్లేష్మా చ మధ్యమః. 11
బహువాతః క్రూరకోష్ఠో దుర్విరేచ్యస్స కథ్యతే,
మృద్వీమాత్రా మృదౌ కోష్ఠే మధ్యకోష్ఠే చ మధ్యమా. 12
క్రూరే తీక్ష్ణా మతా తద్వై ర్మృదుమధ్యమతీక్ష్ణకైః,

పిత్తము విశేషంబుగా నుండిన మృదుకోష్ఠమనియు, కఫము విశేషంబుగా నుండిన మధ్యమకోష్ఠంబనియు, వాతము విశేషంబుగానుండిన క్రూరకోష్ఠంబనియు చెప్పఁబడును. అందు మృదుకోష్ఠంబున మృదుద్రవ్యములచేత మృదుమాత్రను, మధ్యకోష్ఠంబున మధ్యమ ద్రవ్యములచేత మధ్యమమాత్రను, క్రూరకోష్ఠంబున తీక్ష్ణంబులగు ద్రవ్యములచేత తీక్ష్ణ మాత్రను నొసంగవలెను.

మృద్వాదిరేచనౌషధములు.

మృదుర్ద్రాక్షాపయశ్చంచు తైలైరపి విరిచ్యతే. 13
మధ్యమస్త్రివృతా తిక్తా రాజవృక్షైర్విరిచ్యతే,
క్రూరస్స్నుక్పయసా హేమక్షీరీదంతీఫలాదిభిః. 14

మృదుకోష్ఠముగలవానికి ద్రాక్షపండు, పాలు, ఆముదము వీనిచేతను, మధ్యమ కోష్ఠముగలవానికి తెగడ, కటుకరోహిణి, రేల వీనిచేతను, క్రూరకోష్ఠంబు గలవానికి జెముడు, హేమక్షీరి (నేలతంగేడు), నేపాళపువిత్తులు మొదలగువానిచేతను విరేచనంబు చేయించవలయును.

ఉత్తమాదిభేదములచే రేచనప్రమాణము.

మాత్రోత్తమా విరేకస్య త్రింశద్వేగైః కఫాంతికా,
వేగైర్వింశతిభిర్మధ్యా హీనోక్తా దశవేగికా. 15

ముప్పదిమార్లు విరేచనంబులై విరేచనాంతమున కఫము పడెనేని యుత్తమౌషధం బనియు, ఇరువదిమార్లు విరేచనంబులైన మధ్యమమాత్రయనియు, పదిమార్లును విరేచ నంబులైన స్వల్పమాత్రయనియు చెప్పఁబడును.

రేచనములకు కషాయాదులప్రమాణము.

ద్విపలం శ్రేష్ఠమాఖ్యాతం మధ్యమం చ పలం భవేత్,
పలార్ధం చ కషాయాణాం కనీయస్తు విరేచనమ్. 16

విరేచనార్థంబగు కషాయమును రెండుపలములు సేవించిన నయ్యది ఉత్తమమాత్ర యనియు, ఒక్కపలము సేవించిన మధ్యమమాత్రయనియు, అరపలము స్వల్పమాత్ర యనియు చెప్పఁబడును.

రేచనములకు కల్కాదిప్రమాణము.

కల్కమోదకచూర్ణానాం కర్షం మధ్వాజ్యలేహతః,
కర్షద్వయం పలం వాపి వయోరోగాద్యపేక్షయా. 17

కల్కము, మోదకము, చూర్ణము వీనిని ప్రత్యేకంబున కర్షప్రమాణము తేనె, నెయ్యి వీనితోఁగలిపి సేవించినను, లేక వయస్సు, రోగబలము వీనిని బాగా తెలిసికొని రెండుకర్షములుగాని, పలముగాని సేవించిన విరేచనం బగును.

## రేచనౌషధములు.

పిత్తోత్తరే త్రివృచ్చూర్ణం ద్రాక్షాక్వాథాదిభిః పిబేత్,
త్రిఫలాక్వాథగోమూత్రైః పిబేద్వ్యోషం కఫార్దితః. 18
త్రివృత్సైన్ధవశుంఠీనాం చూర్ణమమ్లైః పిబేన్నరః,
వాతార్దితో విరేకాయ జాంగలానాం రసేన వా. 19

పిత్తప్రకోపంబున తెగడచూర్ణమును ద్రాక్షపండు మొదలగువాని కషాయంబుతో సేవించవలెను. కఫప్రకోపంబున త్రికటుకచూర్ణమును త్రిఫలాకషాయముతోఁడను గోమూత్రముతోఁడను సేవింపందగును. వాతప్రకోపంబున తెగడ, శుంఠి, సైంధవ లవణము వీనిచూర్ణములను అమ్లపదార్థములతోఁగాని, అనూపమాంసరసముతోఁగాని సేవింపవలెను.

## ప్రకారాంతరరేచనౌషధము.

ఏరండతైలం త్రిఫలాక్వాథేన ద్విగుణేన చ,
యుక్తం పీతం పయోభిర్వా న చిరేణ విరిచ్యతే. 20

ఆముదమును రెండింతల త్రిఫలాకషాయంబుతోఁగాని, రెండింతల పాలతోఁగాని సేవించిన శీఘ్రముగ విరేచనంబగును.

## ఋతుభేదములచే రేచనౌషధములు.

త్రివృతాకౌటజం బీజం పిప్పలీవిశ్వభేషజం,
సమృద్వీకారసక్షౌద్రం వర్షాకాలే విరేచనమ్. 21

తెగడ, కొడిసెపాలవిత్తులు, పిప్పళ్లు, సొంటి వీనిచూర్ణమును, ద్రాక్షరసము, తేనె వీనితోఁకలిపి వర్షాకాలంబున విరేచనార్థము తీసికొనవలెను.

## శరత్కాలమున రేచనౌషధము.

త్రివృద్దురాలభా ముస్తా శర్కరా దివ్యచందనం,
ద్రాక్షాంబునా సయష్టీకం శీతలం చ ఘనాత్యయే. 22

తెగడ, దురదగొండివేరు, తుంగముస్తలు, చక్కెర, శ్రీగంధము. అతిమధురము వీనిచూర్ణమును ద్రాక్షపండ్లరసముతోఁ గలిపి శరత్కాలంబున విరేచనార్థము గైకొనవలెను.

హేమంతఋతువునందు రేచనౌషధము.

త్రివృతాం చిత్రకంపాఠామజాజీం సరలాం వచాం,
హేమక్షీరీం చ హేమన్తే చూర్ణముష్ణాంబునా పిబేత్. 23

తెగడ, చిత్రమూలము, విషబొద్ది, జీలకఱ్ఱ, సరళదేవదారు, వస, హేమక్షీరి వీనిచూర్ణమును ఉష్ణోదకంబుతో హేమంతర్తువునందు విరేచనార్థము గైకొనవలెను.

శిశిరవసంతకాలములయందు రేచనౌషధము.

పిప్పలీనాగరం సింధూ శ్యామా త్రివృతయా సహ,
లిహేత్ క్షౌద్రేణ శిశిరే వసంతే చ విరేచనమ్. 24

పిప్పళ్లు, సొంటి, సైంధవలవణము, సుగంధిపాల, తెగడ వీనిచూర్ణమును తేనెతో గలిపి శిశిరవసంతర్తువులందుఁ గైకొనవలెను.

గ్రీష్మఋతువునందు రేచనౌషధము.

త్రివృతా శర్కరా తుల్యా గ్రీష్మకాలే విరేచనం,
తెగడచూర్ణంబున చక్కెరగలిపి గ్రీష్మర్తువునఁ గైకొనవలెను.

సుఖరేచనములకు అభయామోదకములు.

అభయా మరిచం శుంఠీ విడంగామలకాని చ. 25
పిప్పలీపిప్పలీమూలం త్వక్పత్రం ముస్తమేవ చ,
ఏతాని సమభాగాని దన్తీ చ ద్విగుణా భవేత్. 26
త్రివృదష్టగుణా జ్ఞేయా షడ్గుణా చాత్ర శర్కరా,
మధునా మోదకం కృత్వా కర్షమాత్రప్రమాణతః. 27
ఏకైకం భక్షయేత్ప్రాతశ్శీతం చానుపిబేజ్జలం,
తావద్విరిచ్యతే జంతుర్యావదుష్ణం న సేవతే. 28
పానాహారవిహారేషు భవేన్నిర్యంత్రణస్సదా,
విషమజ్వరమన్దాగ్నిపాణ్డుకాసభగందరాన్. 29
దుర్నామకుష్ఠగుల్మార్శోగలగండభ్రమోదరాన్,
విదాహప్లీహమేహాంశ్చ యక్ష్మాణం నయనామయాన్. 30
వాతరోగం తథాఽఽధ్మానం మూత్రకృచ్ఛ్రాణి చాశ్మరీం,
పృష్ఠపార్శ్వోరుజఘనజంఘోదరరుజం జయేత్. 31
సతతం శీలనాదేషాం పలితాని వినాశయేత్,
అభయామోదకా హ్యేతే రసాయనవరాస్స్మృతాః. 32

కరక్కాయలు, మిరియములు, సొంటి, వాయువిళంగములు, ఉసిరికపప్పు, పిప్పళ్లు, మోడి, లవంగపట్ట, లవంగపత్రి, తుంగగడ్డలు వీనిని సమభాగంబులుగాను, నేపాళము రెండుభాగములుగాను, తెగడ ఎనిమిదిభాగంబులుగాను, చక్కెర ఆఱుభాగంబులుగాను గ్రహించి చూర్ణముగావించి తేనెతోఁగలిపి కర్షప్రమాణముగా మాత్రలుగావించి యందొకమాత్రను ప్రాతఃకాలంబున శీతోదకం బనుపానంబుగా సేవించిన చక్కఁగా విరేచనంబులై విషమజ్వరము, అగ్నిమాంద్యము, పాండువు, దగ్గు, భగందరము, కుష్ఠము, గుల్మము, మూలవ్యాధి, గళగండము, భ్రమము, ఉదరరోగము, విదాహము, ప్లీహము, ప్రమేహము, రాజయక్ష్మ, నేత్రరోగము, వాతరోగము, కడుపుబ్బరము, మూత్రకృచ్ఛ్రము, అశ్మరీరోగము నశించును. మఱియుఁ వీఁపు, పార్శ్వములు, తొడలు, పిఱుఁదులు, మోకాళ్లు, నడుము వీనియందలి నొప్పులు హరించును. ఇయ్యది శ్రేష్ఠంబగు అభయామోదకంబను రసాయనంబు. దీనిని రసాయనోక్తప్రకారము సేవించుచుండినయెడల పలితము (వెంట్రుకలు నరయుట) నశించును.

### రేచనములకు సహజోపచారము.

పీత్వా విరేచనం శీతజలైస్సంసిచ్య చక్షుషీ,
సుగంధం కించిదాఘ్రాయ తాంబూలం శీలయేన్నరః. 33

విరేచనార్థం బౌషధమును సేవించి శీతోదకంబుతో నేత్రములను దుడిచికొని సువాసనగల గంధపుష్పాదిద్రవ్యంబులను వాసన చూపించి తాంబూలమును సేవించునటుల చేయందగును.

### రేచనకాలనియమములు.

నిర్వాతస్థో నవేగాంశ్చ ధారయన్న స్వపేత్తథా,
శీతాంబు న స్పృశేత్క్వాపి కోష్ణం నీరం పిబేన్ముహుః. 34

విరేచనార్థం బౌషధమును సేవించినవాఁడు గాలిలో తిరుగుట, మలమూత్రాదులను నిరోధించుట, నిద్రించుట, శీతల జలంబును స్పృశించుట వర్జింపవలెను. మఱియుఁ గొంచెము వెచ్చగనున్న నీటినే కావలసినపుడు త్రాగవలెను.

### రేచనముతోడ వెడలెడుపదార్థములు.

బలాసౌషధపిత్తాని వాయుర్వాంతే యథా వ్రజేత్,
రేకాత్తథా మలం పిత్తం భేషజం చ కఫో వ్రజేత్. 35

వమనంబునందు కఫము, పిత్తము, ఔషధము, వాతము ఇవి వమనముగుండా పోవునటుల విరేచనంబున మలము, పిత్తము, ఔషధము, కఫము ఇవి విరేచకముగుండా పోవును.

### రేచనవైకల్యముచేఁ గలుగునుపద్రవములు.

దుర్విరిక్తస్య నాభేస్తు స్తబ్ధత్వం కుక్షిశూలతా,

పురీషవాతసంగశ్చ కండూమండలగౌరవమ్. 36
విదాహోఽరుచిరాధ్మానం భ్రమశ్ఛర్దిశ్చ జాయతే,

చక్కఁగ విరేకముకానివానికి నాభిస్థానంబున స్తబ్ధత, ఉదరంబున శూల, మలవాతములు వెడలుచుండుట, శరీరమునందు దురద, రక్తమండలములు, శరీరమందు భారము, తాపము, అరోచకము, కడుపుబ్బరము, భ్రమ, వాంతులు గలుగును.

విరేచనవైకల్యమునఁ జేయఁదగినయుపచారములు.

తం పునః పాచనైస్స్నేహైః పక్త్వా సంస్నేహ్య రేచయేత్. 37
తేనాస్యోపద్రవా యాంతి దీప్తోఽగ్నిర్లఘుతా భవేత్,

పూర్వోక్తంబగు లక్షణంబులు చూపట్టెనేని పాచనద్రవ్యములచేత ఆమపాచనంబుగావించి స్నేహకర్మముచేసి మరల విరేకముకొఱకు ఔషధము నీయందగును. అట్లు చేసినయెడల నాయుపద్రవములు నశించి అగ్నిదీప్తి గలిగి, శరీరమందు లాఘవము గలుగును.

అధికముగ రేచనములగుటచేఁ గలుగునుపద్రవములు.

విరేకస్యాతియోగేన మూర్ఛాభ్రంశో గుదస్య చ. 38
శూలం కఫాతియోగస్స్యాన్మాంసధావనసన్నిభం,
మేదోనిభం జలాభాసం రక్తం చాపి విరిచ్యతే. 39

విరేచనంబులు అధికముగ నైనయెడల మూర్ఛ, గుదభ్రంశము, శూలము, కఫము, మాంసము కడిగిననీటివలెను, మేదోర్ణంబున నుండునీరును, రక్తము వెడలుట ఈలక్షణంబులు గలుగును.

అధికరేచనములచేఁ గలుగునుపద్రవములకు చికిత్స.

తస్య శీతామ్బుభిస్సిక్త్వా శరీరం తణ్డులాంబుభిః,
మధుమిశ్రైస్తథా శీతైః కారయేద్వమనం మృదు. 40

పూర్వోక్తలక్షణంబులు చూపట్టెనేని శరీరమును శీతోదకంబులోఁ దడిపి శీతంబగు బియ్యపుకడుగులో తేనెనుజేర్చి త్రాగించి మృదువుగ వమనంబునుజేయింపందగును. అందుచేత అధికరేచనంబుచేఁ గలిగిన యుపద్రవములు నశించును.

రేచనములను బంధించుట కుపాయము.

సహకారత్వచః కల్కో దధ్నా సౌవీరకేణ వా,
పిష్టో నాభిప్రలేపేన హంత్యతీసారముల్బణమ్. 41

తీయమామిడిపట్టను ఆవుపెరుఁగుతోగాని, సౌవీరముతోఁగాని నూరి కల్కముఁ గావించి నాభికి లేపనముఁజేసినయెడల అధికవిరేచనంబులు హరించును.

### రేచనబంధనోపాయము.

అజాక్షీరం పిబేద్వాపి వైష్కిరం హారిణం తథా,
శాలిభిష్షష్టికైస్స్వల్పం మసూరైర్వాపి భోజయేత్. 42
శీతైస్సంగ్రాహిభిర్ద్రవ్యైః కుర్యాత్సంగ్రహణం భిషక్,

రేచనంబు లధికముగా నగుచుండినయెడల మేకపాలనుగాని, శకునిపక్షియొక్క మాంసమునుగాని, జింకమాంసమును గాని భుజింపవలెను. లేక శాలిధాన్యముతో గాని, షష్టికధాన్యముతో గాని, యన్నముపండి యద్దానినిగాని, మసూరధాన్యమునుగాని, స్వల్పముగ భుజింపవలెను. మఱియు మలబంధమును గల్గించు శీతపదార్థములగాని భుజించవలెను.

### చక్కఁగ రేచనములైనవానికిఁ గలుగులక్షణములు.

లాఘవే మనసస్తుష్ట్యామనులోమం గతేనిలే. 43
సువిరక్తం నరం జ్ఞాత్వా పాచనం పాయయేన్నిశి,

బాగుగా విరేచనంబులైనయెడల శరీరమందు లాఘవము, మనంబునకు స్వస్థత, వాతమునకు స్వస్థానగమనము ఇవి గలుగును. పిమ్మట రాత్రియందు పాచనౌషధంబుల నీయందగును.

### రేచనసేవనచేఁ గలుగుగుణములు.

ఇంద్రియాణాం బలం బుద్ధేః ప్రసాదో వహ్నిదీప్తతా. 44
ధాతుస్థైర్యం వయస్థైర్యం భవేద్రేచనసేవనాత్,

రేచనార్థం బౌషధమును గ్రహించుటచే ఇంద్రియములకు పటుత్వము, బుద్ధిప్రసన్నత, అగ్నిదీప్తి, ధాతువృద్ధి, వయస్థైర్యము గలుగును.

### రేచనానంతరము వర్జింపఁదగినకార్యములు.

ప్రవాతసేవాం శీతాంబు స్నేహాభ్యంగమజీర్ణతామ్. 45
వ్యాయామం మైథునం చైవ న సేవేత విరేచితః,

విరేచనౌషధంబును సేవించినవారు గాలియందు సంచరించుట, శీతోదకంబును సేవించుట, అభ్యంగము, అజీర్ణద్రవ్యభోజనము, వ్యాయామము, మైథునంబు వీనిని విసర్జింపవలయును.

### రేచనానంతరము చేయఁదగినపథ్యము.

శాలిషష్టికముద్గాద్యైర్యవాగూం భోజయేత్కృతామ్. 46
జాంగలీవిష్కిరాణాం వా రసైశ్శాల్యోదనం హితం,

విరేచనానంతరమున యవలు, షష్టికములు, పెసలు వీనిచే తయారుచేయఁబడిన యవాగువును పానముచేయవలెను. లేక అనూపమాంసరసముతోఁగాని, కోడి మొదలగు వాని మాంసరసముతోఁగాని, శాల్యన్నమును భుజింపవలెను.

విరేకాద్యౌషధే పీతే సమ్యగ్యోగో న నిరిచ్యతే. 47
పిబేదుష్ణాంబునా తత్ర సైంధవం దోషశాంతయే,

ఇతి శ్రీదామోదరసూను శార్ఙ్గధరవిరచితాయాం సంహితాయాం
ఉత్తరఖండే చికిత్సాస్థానే విరేచనవిధికథనంనామ
చతుర్థోఽధ్యాయః.

రేచనౌషధంబు గ్రహించినపిమ్మట చక్కఁగా రేచనంబు కానియెడల సైంధవలవణమును ఉష్ణోదకంబుతో త్రాగిన విరేచనములై దోషము శమించును.

ఇది శ్రీదామోదరసూను శార్ఙ్గధరవిరచితసంహితయందు చికిత్సాస్థానమున
నుత్తరఖండమందు విరేచనవిధికథన మనియెడు
చతుర్థాధ్యాయము సంపూర్ణము.

---

# పంచమాధ్యాయము.

## వస్తివిధి.

వస్తిర్ద్విధాఽనువాసాఖ్యో నిరూహశ్చ తతఃపరం,
యస్స్నేహైర్దీయతే స స్యాదనువాసననామకః. 1
కషాయక్షీరతైలైర్యో నిరూహస్స నిగద్యతే,
వస్తిభిర్దీయతే యస్మాత్తస్మాద్వస్తిరితి స్మృతః. 2

వస్తికర్మ అనువాసనంబనియు, నిరూహంబనియు ద్వివిధంబు. అందు తైలాదులతో నుపయోగించునది యనువాసనంబనియు, కషాయాదులచే నుపయోగించునది నిరూహమనియు చెప్పఁబడును.

## అనువాసనవస్తి.

తత్రానువాసనాఖ్యో హి వస్తిర్యస్సోఽత్ర కథ్యతే,

పూర్వమేవ తతో వస్తిర్నిరూహాఖ్యో భవిష్యతి. 3
నిరూహాదుత్తరశ్చైవ వస్తిస్స్యాదుత్తరాభిదః,
అనువాసనభేదశ్చ మాత్రావస్తిరుదీరితః. 4
పలద్వయం తస్య మాత్రా తస్మాదర్ధాపి వా భవేత్,

ఈ యధ్యాయంబున మొదట అనువాసనవస్తియు రెండవ యధ్యాయంబున నిరూహవస్తియు, పిమ్మట ఉత్తరవస్తియు చెప్పఁబడును. మఱియు మాత్రావస్తి యనునది యనువాసనవస్తిభేదంబైయుండును. ఈమాత్రావస్తియందు స్నేహాదులు రెండుపలములు గాని, ఒకపలముగాని ప్రయోగింపఁబడును.

## అనువాసనవస్తికర్మ కర్హులు.

అనువాస్యస్తు రూక్షస్స్యాత్తీక్ష్ణాగ్నిః కేవలానిలీ. 5

స్నేహపానంబుచేయనివారు, అగ్నిదీప్తిగలవారు, కేవలవాతరోగముగలవారును అనువాసనవస్తికి యోగ్యులు.

## అనువాసనవస్తికర్మ కనర్హులు.

నానువాస్యస్తు కుష్ఠీ స్యాన్మేహీ స్థూలస్తథోదరీ,
నాస్థాప్యానానువాస్యాస్స్యురజీర్ణోన్మాదతృడ్యుతాః. 6
శోకమూర్ఛారుచిభయశ్వాసకాసక్షయాతురాః,

కుష్ఠము, ప్రమేహము, స్థూలశరీరము, ఉదరరోగము, అజీర్ణము, ఉన్మాదము, దప్పి, శోకము, మూర్ఛ, అరోచకము, భయము, శ్వాసము, కాసము, క్షయము ఈరోగంబులు గలవారికి అనువాసనవస్తికర్మ చేయఁగూడదు. వారలకు నిరూహవస్తిమాత్రమే చేయవలెను.

## వస్తినిర్మాణయోగ్యమగు ద్రవ్యములు.

నేత్రం కార్యం సువర్ణాదిధాతుభిర్వృక్షవేణుభిః. 7
నలైర్దంతైర్విషాణాగ్రైర్మణిభిర్వా విధీయతే,

వస్తిసంబంధమగునేత్రము సువర్ణము, కొయ్య, వెదురు, ఏనుఁగుదంతము, కొమ్ము, గాజు మొదలగువానిచేత చేయందగును.

## నేత్రఛిద్రప్రమాణములు.

ముద్గచ్ఛిద్రం కలాయాభం ఛిద్రం కోలాస్థిసన్నిభమ్. 8
యథాసంఖ్యం భవేన్నేత్రం శ్లక్ష్ణం గోపుచ్ఛసన్నిభం,
ఆతురాంగుష్ఠమానేన మూలే స్థూలం విధీయతే. 9

కనిష్ఠికాపరీణాహామగ్రే చ గుటికాముఖం,
తన్మూలే కర్ణికే ద్వే చ కార్యభాగాచ్చతుర్థకాత్. 10
యోజయేత్తత్ర వస్తిం చ బంధద్వయవిధానతః,

ఆఱంగుళముల గొట్టమునకు పెసరగింజంత ఛిద్రమును, ఎనిమిదంగుళముల గొట్టమునకు సెనగగింజంత రంధ్రమును, పన్నెండు అంగుళముల గొట్టమునకు రేగుగింజంత రంధ్రమునుచేసి యాగొట్టములను నునుపుగను, ఆవుతోఁకవలె నుండునవిగను నుండవలెను. దానిమూలమున రోగియొక్క బొటనవ్రేలు లావుగను, అగ్రమున చిటికెనవ్రేలు లావుగను, ముఖమందు వర్తులాకారంబుగను నుండునటులఁజేసి యద్దాని నాల్గవభాగంబున రెండుకర్ణికలను చేయవలెను. ఇది వస్తియనంబడును. దీనిని జింక మొదలగువానిచర్మముచే బాగుగా బంధింపవలెను.

వయోభేదంబుచే వస్తిప్రమాణము.

ఏకవర్షాత్తు షడ్వర్షం యావన్మానం షడంగులమ్. 11
తతో ద్వాదశకం యావన్మానం స్యాదష్టసంయుతం,
తతఃపరం ద్వాదశభిరంగులైర్నేత్రదీర్ఘతా. 12

ఒకసంవత్సరము మొదలు ఆఱుసంవత్సరముల వయస్సుగలవారికి నేత్రము ఆఱంగుళముల నిడివిగను, ఆఱువత్సరరబులు మొదలు పదిరెండువత్సరంబుల వయస్సుగలవారి కుపయోగించు వస్తి నేత్రము ఎనిమిదంగుళముల నిడివిగను, పదిరెండు వత్సరంబులకు పిదప పదిరెండు అంగుళములును నుండవలెను.

వస్తినిర్మాణమున కర్హమగు చర్మవివరణము.

మృగాజసూకరగవాం మహిషస్యాపి వా భవేత్,
మూత్రకోశస్య వస్తిస్తు తదలాభే చ చర్మజః. 13
కషాయరక్తస్సమృదుర్వస్తిస్స్నిగ్ధో దృఢోహితః,

జింక, మేఁక, పంది, ఎద్దు, పోతు మొదలైనవానియొక్క మూత్రకోశములు వస్తిచేయుట కుపయోగించును. అయ్యది సంభవింపకపోయెనేని జంతువులచర్మము తోడనైనను వస్తిని జేయవలెను. అట్టి మూత్రకోశమునుగాని, చర్మమునుగాని, రేగు, తంగేడు మొదలగువాని కషాయంబున పక్వముగావించి రక్తవర్ణంబుగను, స్నిగ్ధంబుగను, మృదువుగను, దృఢముగను నుండునట్లు చేయవలెను.

వ్రణవస్తిప్రమాణము.

వ్రణవస్తేస్తు నేత్రం స్యాచ్ఛ్లక్ష్ణమష్టాంగులోన్మితమ్. 14

ముద్గచ్ఛిద్రం గృధ్రపక్షనలికాపరిణాహి చ,

వ్రణవస్తియొక్క నేత్రము ఎనిమిదంగుళముల పొడవుగలిగి నున్నదై పెసరగింజయంత రంధ్రముగలిగి గ్రద్దఱెక్కయీ నెయంత లావుగలిగియుండవలెను.

వస్తికర్మచేఁ గలుగుఫలములు.

శరీరోపచయం వర్ణం బలమారోగ్యమాయుషః. 15

కురుతే పరివృద్ధిం చ వస్తిస్సమ్యగుపాసితః,

వస్తికర్మను సేవించినయెడల శరీరవృద్ధి, కాంతి, బలము, ఆరోగ్యము,ఆయుర్వృద్ధి ఇవి గలుగును.

వస్తికర్మసేవనకాలము.

దివసాంతే వసంతే చ స్నేహవస్తిః ప్రదీయతే. 16

గ్రీష్మవర్షాశరత్కాలే రాత్రౌ స్యాదనువాసనం,

న చాతిస్నిగ్ధశమనం భోజయిత్వాఽనువాసయేత్. 17

మదం మూర్ఛా చ జనయేద్ద్విధా స్నేహః ప్రయోజితః,

రూక్షం భుక్తవతోఽత్యన్నం బలం వర్ణం చ హీయతే. 18

స్నేహవస్తికర్మను వసంతర్తువునందు సాయంకాలము చేయవలెను. మఱియు గ్రీష్మ, వర్ష, శరదృతువులయందు రాత్రి చేయవలయును. అతిస్నిగ్ధభోజనానంతరము వస్తికర్మము చేసినయెడల మదము, మూర్ఛ ఇవి జనించును. అతిరూక్షభోజనానంతరము వస్తికర్మము చేసినయెడల బలము, కాంతి ఇవి నశించును.

న్యూనాధికవస్తికర్మచేఁ గలుగుఫలము.

హీనమాత్రావుభౌ వస్తీ నాతికార్యకరౌ స్మృతౌ,

అతిమాత్రౌ తథాఽఽనాహక్లమాతీసారకారకౌ. 19

వస్తులయందు ఔషధమును అల్పముగా ప్రయోగించిన రోగము నశింపకుండుటయు, అతిమాత్రముగా ప్రయోగించిన ఆనాహము, బడలిక, అతిసారము జనించును. కాన నాత్యల్పముగా ప్రయోగింపందగును.

బలతారతమ్యముచే స్నేహప్రమాణము.

ఉత్తమస్య పలైష్షడ్భిర్మధ్యమస్య పలైస్త్రిభిః,

పలైకార్ధేన హీనస్య యుక్తామాత్రాఽనువాసనే. 20

అట్టి అనువాసనవస్తియందు ఉత్తమబలముగలవానికి ఆఱుపలముల స్నేహమును,

మధ్యమబలము గలవానికి మూఁడుపలముల స్నేహమును, హీనబలము గలవానికి ఒకటిన్నర పలము స్నేహమును గూర్పందగును.

స్నేహస్థానమున సైంధవాదుల ప్రమాణము.

శతాహ్వాసైంధవాభ్యాం చ దేయం స్నేహే చ చూర్ణకం,
తన్మాత్రోత్తమమధ్యాంతాషట్చతుర్ద్వయమాషకైః. 21

అట్టి యనువాసనవస్తియందు పిల్లపీచర, సైంధవలవణము వీనిచూర్ణము ఆఱు మాషంబు లౌసంగుట ఉత్తమమాత్రయనియు, నాలుగు మాషంబు లొసంగుట మధ్యమ మాత్రయనియు, రెండుమాషంబు లొసంగుట హీనమాత్ర యనియు చెప్పఁబడును.

రేచనానంతరమున అనువాసనవస్తిక్రమము.

విరేచనాత్సప్తరాత్రే గతే జాతబలాయ చ,
భుక్తాన్నాయానువాస్యాయ వస్తిర్దేయోఽనువాసనః. 22

విరేచనౌషధగ్రహణానంతరమున ఏడుదినములు గతించి బలము బాగుగాఁజేరిన పిమ్మట చక్కఁగ భోజనంబిడి వాఁడు అనువాసనవస్తికి యోగ్యుఁడయినచో అనువాసన వస్తి చేయందగును.

వస్తికర్మ చేయు విధానము.

అథానువాస్యం స్వభ్యక్తముష్ణాంబుస్వేదితం శనైః,
భోజయిత్వా యథాశాస్త్రం కృతచంక్రమణం తతః. 23
ఉత్సృష్టానిలవిణ్మాత్రం యోజయేత్స్నేహవస్తినా,
సుప్తస్య వామపార్శ్వేన వామజంఘాప్రసారిణః. 24
కుంచితాపరజంఘస్య నేత్రం స్నిగ్ధే గుదే న్యసేత్,
బద్ధ్వా వస్తిముఖం సూత్రైర్వామహస్తేన ధారయేత్. 25
పీడయేద్దక్షిణేనైవ మధ్యవేగేన ధీరధీః,
జృంభాకాసక్షుతాదీంశ్చ వస్తికాలే న కారయేత్. 26

అనువాసనవస్తికర్మమున కర్హుఁడగువాని కభ్యంజనము గావించి ఉష్ణోదకంబుచే స్వేదకర్మముగావించి, యథావిధిగ భోజనంబిడి, ఇటునటు సంచరింపఁజేసి, మలమూత్రోత్సర్జనం బొటనెఱింగి వానిని ఎడమపార్శ్వమున పరుండఁబెట్టి ఎడమకాలును చాచునట్లును కుడికాలును ముడుచునట్లుచేసి గుదస్థానంబున స్నేహంబుచే స్నిగ్ధకర్మముగావించి వస్తిముఖమును త్రాళ్లతో గట్టిగకట్టి నేత్రమును గుదమందుంచి దానిని ఎడమచేతితో పట్టుకొని కుడిచేతితో మధ్యమభాగంబుచే పీడించుచు నాస్నేహమును లోనికిగొట్టవలెను.

అట్టిసమయమున రోగి జాగరూకుండై ఆవలింత, దగ్గు, తుమ్ములు, అపానవాతము ఇవి రాకుండునటులఁ జేసికొనవలెను.

చిమ్మనగ్రోవి కొట్టతగినకాలము.

త్రింశన్మాత్రామితః కాలః ప్రోక్తో వస్తిస్తు పీడనే,
తతః ప్రణిహితస్నేహః ఉత్తానోవాక్శతం భవేత్. 27

వస్తికర్మమును ముప్పది మాత్రలకాలములో ముగించి యారోగిని నూఱుమాత్రల కాలమువఱకు వెల్లకిలబరుండ నీయవలెను.

మాత్రాకాలప్రమాణము.

జానుమండలమావేష్ట్య కుర్యాత్తోస్ఫటికయా యుతం,
ఏకామాత్రా భవేదేషా సర్వత్రైష వినిశ్చయః. 28

మోకాటి చిప్పను వేలితో నొకమాఱు చుట్టి యొక్కచిటికెవేయునట్టికాలము మాత్రయనంబడును. ఈప్రకారము శాస్త్రమునం దంతటను మాత్రాకాలమును తెలిసికొనం దగును.

వస్తికర్మానంతరము జేయందగినక్రియ.

ప్రసారితైస్సర్వగాత్రైర్యథావీర్యం ప్రసర్పతి,
తాడయేత్తలయోరేనం త్రీన్వారాంశ్చ శనైశ్శనైః. 29
స్ఫిజోశ్చైవం తతశ్శ్రోణీం శయ్యాం చైవోత్క్షిపేత్తతః,
జాతే విధానే తు తతః కుర్యాన్నిద్రాం యథాసుఖమ్. 30

వస్తికర్మ చేసిన పిమ్మట నౌషధవీర్యము శరీరంబున నంతటను వ్యాపించునిమిత్తము వానిని వెల్లకిలఁ బరుండఁజేసి హస్తపాదాదులను చాచునటులజేసి పాదములయందును, కటిప్రదేశంబునను, పిఱుదులయందును ముమ్మాఱు తట్టి పిమ్మట శయ్యం బరుండబెట్టి, సుఖముగ నిద్రించునటులఁ జేయందగును.

చక్కగ వస్తికర్మ చేసినందుచేఁ గలుగుగుణము.

సానిలస్సపురీషశ్చ స్నేహః ప్రత్యేతి యస్య తు,
ఉపద్రవం వినా శీఘ్రం స సమ్యగనువాసితః. 31

ఉపద్రవరహితంబై గుదమున ప్రవేశించినస్నేహము, అపానవాతము, పురీషము వీనితో నవలకు వచ్చునయెడల వస్తికర్మము చక్కఁగాఁ జేయఁబడినదని యెఱుంగవలయును.

స్నేహవికారము హరించుట కుపాయము.

జీర్ణాత్తమథ సాయాహ్నే స్నేహే ప్రత్యాగతే పునః,

లఘ్వన్నం భోజయేత్కామం దీప్తాగ్నిస్తు నరో యది. 32
అనువాసితాయ దాతవ్యమితరేఽహ్ని సుఖోదకం,
ధాన్యశుంఠీకషాయో వా స్నేహవ్యాపత్తినాశనః 33

గుదముఁ ప్రవేశించిన స్నేహము జీర్ణంబై వెడలి అగ్నిదీప్తిగలిగినతోడనే లఘ్వాహారమును భుజింపవలెను. మఱియు అనువాసనవస్తిఁజేసినవానికి మఱునాఁడు కొంచెము వెచ్చగనున్న నీటినిగాని, ధనియములు, సొంటి వీనికషాయంబును గాని యొసంగవలెను.

వాతాదులయందు చిమ్మనగ్రొవికొట్టువిధానము.

అనేన విధినా షడ్వా సప్తవాఽష్టౌ నవాపి వా,
విధేయా వస్తయస్తేషామంతే చైవ నిరూహణమ్. 34

ఈప్రకారము ఆఱుమాఱులుగాని, ఏడుమాఱులుగాని, ఎనిమిదిమాఱులుగాని, తొమ్మిదిమాఱులుగాని వస్తికర్మముచేసి పిమ్మట నిరూహవస్తిని చేయందగును.

వస్తికర్మచేఁ గలుగుగుణము:

దత్తస్తు ప్రథమో వస్తిస్స్నేహయేద్వస్తివంక్షణౌ,
సమ్యగ్దత్తో ద్వితీయస్తు మూర్ధస్థమనిలం జయేత్. 35
బలం వర్ణం చ జనయేత్తృతీయస్తు ప్రయోజితః,
చతుర్థపంచమౌ దత్తౌ స్నేహయేతాం రసాసృజీ. 36
షష్ఠో మాంసం స్నేహయతి సప్తమో మేద ఏవ చ,
అష్టమో నవమశ్చాపి మజ్జనం చ యథాక్రమమ్. 37
ఏవం శుక్రగతాన్దోషాన్ద్విగుణస్సాధు సాధయేత్,
అష్టాదశాష్టాదశ కాన్వస్తీనాం యో నిషేవతే. 38
స కుంజరబలోఽప్యశ్వం జయేత్తుల్యోఽమరప్రభః,

మొదటజేసినవస్తికర్మము వస్తి, వంక్షణముల (గెజ్జల) ద్వారా శరీరమున వ్యాపించి ధాతువృద్ధిని గల్గించును. రెండవది శిరంబున నున్నవాతమును హరించును. మూఁడవది శరీరమునకు బలమును కాంతిని గలుగజేయును. నాల్గవది రసధాతువును, ఐదవది రక్తధాతువును స్నిగ్ధముగాచేయును. ఆఱవది మాంసమును, ఏడవది మేదస్సును, ఎనిమిదవది మజ్జాధాతువును, తొమ్మిదవది శుక్రధాతువును స్నిగ్ధముగాఁజేయును. శుక్రధాతువునందు దోషంబుండెనేని పదునెనిమిదిమాఱులు వస్తికర్మ చేయందగును. దానిని ముప్పదియాఱుమాఱులు సేసినయెడల ఏనుగంతబలము గలవాఁడై అశ్వధాటిని జయించును. దేవతలతో తుల్యమగుకాంతిగలవాఁ డగును.

అనువాసనాదివస్తికర్మల కర్తవ్యులు.

రూక్షాయ బహువాతాయ స్నేహవస్తిం దినేదినే. 39
దద్యాద్వైద్యస్తథాఽన్యేషామన్యాం బాధామపాహరేత్,
స్నేహోఽల్పమాత్రో రూక్షాణాం దీర్ఘకాలమనత్యయః. 40
తథా నిరూహస్స్నిగ్ధానామల్పమాత్రః ప్రశస్యతే,

రూక్షులకును, వాతప్రకోపముగలవారికిని వస్తికర్మ ప్రతిదినము చేయందగును. అతిస్నిగ్ధులకును, స్థౌల్యముగలవారలకును, ప్రతిదినము నిరూహవస్తి చేయందగును. అట్లు చేసినయెడల వారికిఁ గలరోగములు నశించును. రూక్షగలవారలకు అనువాసనవస్తిని లఘువుగను స్నిగ్ధతగలవారలకు నిరూహవస్తి లఘువుగను చేయందగును.

జీర్ణముఁ జెందక వెలువడినస్నేహమునకు ప్రతీకారము.

అథవా యస్య తత్కాలం స్నేహో నిర్యాతి కేవలః. 41
తస్యాన్యోఽల్పతరో దేయో న హి స్నిగ్ధస్య తిష్ఠతి,

గుదమునఁ జేయంబడిన అనువాసనవస్తిచే స్నేహము బైటకిరాకుండినయెడల అట్టి సమయమున నిరూహవస్తి చేయందగును. ఇట్లు పరస్పరముగా నిరూహవస్తిని, అనువాసన వస్తిని చేయుచుండవలెను.

స్నేహము వెలువడునటులఁ జేయుట కుపాయము.

అశుద్ధస్య మలోన్మిశ్రస్స్నేహో నైతి యదా పునః. 42
తదాంగశైథిలాధ్మానం శూలం శ్వాసశ్చ జాయతే,
పక్వాశయే గురుత్వం చ తత్ర దద్యాన్నిరూహణమ్. 43
తీక్ష్ణం తీక్ష్ణౌషధైర్యుక్తా ఫలవర్తిర్హితాథవా,
యథానులోమనం వాయుర్మలం స్నేహశ్చ జాయతే. 44
తథా విరేచనం దద్యాత్తీక్ష్ణం నస్యం చ శస్యతే,

వమన విరేచనంబులు చేయఁబడనివానికి అనువాసనవస్తిచేయుటచేత నాస్నేహము బైటికి రాకుండినచో అంగశైథిల్యము, ఆధ్మానము, శూలము, శ్వాసము, పక్వాశయం బున గురుత్వము గలుగును. అట్టితఱి నిరూహవస్తిఁజేయవలెను. లేక తీక్ష్ణౌషధంబులతోఁ గూడిన ఫలవస్తిని చేయందగును. అట్లుచేసినయెడల వాతము అధోగామియై మలమిశ్రితం బగుస్నేహమును బైటికి వెడలించును. లేక తీక్ష్ణం బగువిరేచనంబునుగాని, నస్యకర్మముగాని చేయవలెను.

స్నేహవస్తి కనర్హులు.

యస్య నోపద్రవం కుర్యాత్స్నేహవస్తిరనిస్సృతః. 45

సర్వోఽల్పోవా వృతో రౌక్ష్యాదుపేక్ష్యస్స్యవిజానతా,

అనువాసనవస్తి జేసినపుడు స్నేహము లోనే నిల్చియుండి పూర్వము చెప్పఁబడిన అంగశైథిల్యాది ఉపద్రవములను గల్గింపకుండినయెడల రోగి రూక్షతగలవాఁడనియెఱింగి యూరకుండవలెను.

స్నేహమును బైలుపుచ్చుటకు ఉపాయము.

అనాయాతం త్వహోరాత్రే స్నేహం సంశోధనైర్హరేత్. 46
స్నేహవస్తావనాయాతే నాన్యస్స్నేహో విధీయతే,

అట్టివానికి స్నేహము బైటికి రాకుండిన యెడల దానిని వస్తికర్మముచే హరింపవలెను. అట్టికార్యముచేతను, సాధ్యముకాక అహోరాత్రంబు లుండెనేని విరేచనౌషధములచేత సాధింపవలయును.

అనువాసనవస్తితైలము.

గుడూచ్యేరండపూతీకభార్గీ వృషకరోహిషమ్. 47
శతావరీం సహచరం కాకనాసాం పలోన్మితం,
యవమాషాతసీకోలకులుత్థాన్ప్రసృతోన్మితాన్. 48
చతుర్ద్రోణాంభసా పక్త్వా ద్రోణశేషేణ తేన చ,
పచేత్తైలాఢకం పేష్యైర్జీవనీయైః పలోన్మితైః. 49
అనువాసనమేతద్ధి సర్వవాతవికారనుత్,

తిప్పతీఁగ, ఆముదపువేరు, క్రానుఁగుపట్ట, గంటుభారంగి, అడ్డసరపుఆకు, కామంచికసవు, పిల్లిపీచరగడ్డలు, పచ్చముులుగోరింట, కాకిదొండ వీనిని ప్రత్యేకముగా నొక్కొకపలముగాను, యవలు, ఉద్దులు, అగసివిత్తులు, రేగువిత్తులు, ఉలవలు వీనిని ప్రత్యేకముగా రెండు పలములుగాను గ్రహించి కొంచెము నలియఁగొట్టి అందు నాల్గుద్రోణముల నీరు పోసి నాలవపాలు మిగులునట్లు కషాయంబుగాచి వడగట్టి యందు ఒక ఆఢకము నువ్వులనూనెఁ బోసి జీవనీయగణమందలి ద్రవ్యములను ప్రత్యేకముగా నొక్కపలము చొప్పున గ్రహించి కల్కము గావించి స్నేహపాకవిధానమున పక్వముగావించి గ్రహింపవలెను. ఇది అనువాసనతైల మనంబడును. ఇయ్యది ప్రబలంబు లగువాతరోగములను నశింపఁజేయును.

అనువాసనవస్తివిపర్యాసముచేఁ గలుగురోగములు.

షట్సప్తతిర్వ్యాపదస్తు జాయంతే వస్తికర్మణః. 50
దూషితాత్ప్రమాదాయేన తాశ్చికిత్స్యాస్తు సుశ్రుతాత్,

వస్తికర్మవిపర్యాసముచే డెబ్బదియాఱు రోగంబులు జనించును. వాని సుశ్రుతమందు చెప్పినరీతిని చికిత్సఁజేయవలెను.

వస్తికర్మయందు పథ్యము.

పానాహారవిహారాశ్చ పరిహారాశ్చ కృత్స్నశః,
స్నేహపానసమాః కార్యా నాత్ర కార్యా విచారణా. 52

ఇతి శ్రీదామోదరసూను శార్ఙ్గధరేణ విరచితాయాం సంహితాయాం
ఉత్తరఖండే చికిత్సాస్థానే స్నేహవస్తివిధికథనం నామ
పంచమోఽధ్యాయః.

స్నేహపానంబున చెప్పఁబడిన పథ్యాహారవిహారంబులను ఇచ్చట చేయందగును.
ఇది శ్రీదామోదరసూను శార్ఙ్గధరవిరచితసంహితయందు ఉత్తరఖండమున
చికిత్సాస్థానమున స్నేహవస్తివిధికథన మనియెడు
పంచమాధ్యాయము సంపూర్ణము.

---

# షష్ఠాధ్యాయము.

నిరూహవస్తివిధిః

నిరూహవస్తిర్బహుధా భిద్యతే కారణాంతరైః,
తైరేవ తస్య నామాని కృతాని మునిపుంగవైః. 1

నిరూహవస్తి కారణాంతరములచే ననేకవిధంబైయుండును. దానినామంబులు పూర్వాచార్యులచేఁ జేర్కొనఁబడియున్నవి.

అన్యచ్చ.—నిరూహస్యాపరం నామ ప్రోక్తమాస్థాపనం బుధైః,
స్వస్థానస్థాపనాద్దోషధాతూనాం స్థాపనం మతమ్. 2

ప్రకోపమునొంది వాతాదిదోషములను, రసాదిధాతువులను, స్వస్థానంబునఁ జేర్చుటచేత నీనిరూహవస్తి యాస్థాపనవస్తియను పేరంబరఁగు.

నిరూహవస్తికర్మయందు కషాయప్రమాణము.

నిరూహస్య ప్రమాణం తు ప్రస్థం పాదోత్తరం మతం,
మధ్యమం ప్రస్థముద్దిష్టం హీనం చ కుడవాస్త్రయః. 3

ఇట్టి నిరూహవస్తియందు ప్రయోగించుకషాయంబు ప్రస్థముండిన ఉత్తమమాత్ర యనియు, ఒకప్రస్థ మైనయెడల మధ్యమమాత్రయనియు, మూఁడుకుడవములైన హీన మాత్రయనియుంబరఁగు.

## నిరూహవస్తికర్మ కనర్హులు.

అతిస్నిగ్ధోత్క్లిష్టదోషా క్షతోరస్కాః కృశస్తథా,
ఆధ్మానచ్ఛర్దిహిక్కార్శః కాసశ్వాసప్రపీడితః. 4
గుదశోఫాతిసారార్తో విషూచీకుష్ఠసంయుతః,
గర్భిణీ మధుమేహీ చ నాస్థాప్యశ్చ జలోదరీ. 5

అతిస్నిగ్ధులు, ఉత్క్లిష్టదోషులు, ఉరఃక్షతము, కృశత్వము, ఆధ్మానము, వాంతి, ఎక్కిళ్లు, మూలరోగము, దగ్గు, ఉబ్బసము, గుదమందువాపు, అతిసారము, విషూచిక, కుష్ఠము ఈరోగంబులుగలవారు, గర్భిణీ స్త్రీలు, వీరలు ఆస్థాపనవస్తి (నిరూహవస్తి)కి అయోగ్యులు.

## నిరూహవస్తికర్మ కర్హులు.

వాతవ్యాధావుదావర్తే వాతాసృగ్విషమజ్వరే,
మూర్ఛాతృష్ణోదరానాహమూత్రకృచ్ఛ్రాశ్మరీషు చ. 6
వృద్ధాసృగ్దరమందాగ్నిప్రమేహేషు నిరూహణం,
శూలేఽమ్లపిత్తే హృద్రోగే యోజయేద్విధివద్బుధః. 7

వాతరోగము, ఉదావర్తము, వాతరక్తము, విషమజ్వరము, మూర్ఛ, దప్పి, ఉదరరోగము, ఆనాహము, మూత్రకృచ్ఛ్రము, అశ్మరి, అసృగ్దరము, అగ్నిమాంద్యము, ప్రమేహము, శూల, అమ్లపిత్తము, హృద్రోగము ఈరోగములు గలవారలకు ఆస్థాపన వస్తి చేయందగును.

## నిరూహవస్తిక్రమము.

ఉత్సృష్టానిలవిణ్మూత్రం స్నిగ్ధం స్విన్నమభోజితం,
మధ్యాహ్నే గృహమధ్యే చ యథాయోగ్యం నిరూహయేత్.
స్నేహవస్తివిధానేన బుధః కుర్యాన్నిరూహణం,
జాతే నిరూహే చ తతో భవేత్కుక్కుటకాసనః. 9
తిష్ఠేన్ముహూర్తమాత్రం తు నిరూహాగమనేచ్ఛయా,
అనాయాతే ముహూర్తే తు నిరూహం శోధనైర్హరేత్. 10

నిరూహవస్తికి యోగ్యుఁడగురోగి మలమూత్రోత్సర్జనం బగునటులఁ జేసి పిమ్మట స్నేహకర్మను, తరువాత స్వేదకర్మను జేసి భోజనంబిడక యొకగదియందుంచి పూర్వము

చెప్పఁబడిన అనువాసనవస్తినివలెనే నిరూహవస్తిని గూడఁ జేయఁదగును. ఇటులఁ జేసిన పిమ్మట నాకషాయము బైటికివచ్చునిమిత్తము రోగిని రెండు గడియలసేపు గొంతు కూర్చుండఁ బెట్టవలెను. అంతట నాకషాయంబు బైటకువచ్చును. అట్లు రాదేని యద్దానిని విరేచనకర్మచే బైటికి వెడలింపఁజేయవలెను.

వస్తివెలువడకున్నదానికి ప్రతీకారము.

నిరూహైరేవ మతిమాన్ క్షారమూత్రామ్లసైంధవైః,

మఱియు నట్లు కషాయంబు బైటికి రాకుండినయెడల యవక్షారము, గోమూత్రము, అమ్లము, సైంధవలవణము వీనినికలిపి మరల నిరూహవస్తిచేత నాకషాయంబును రప్పింపవలయును.

నిరూహవస్తికర్మ చక్కఁగాఁజేయుటచేఁ గలుగులక్షణము.

యస్య క్రమేణ గచ్ఛంతి విట్పిత్తకఫవాయవః. 11
లాఘవం చోపజాయేత సునిరూహం తమాదిశేత్,

నిరూహవస్తి చేయఁబడినవానికి మలము, పిత్తము, కఫము, వాతము ఇవి క్రమముగ గుదద్వారమునుండి క్రిందికివచ్చి శరీరము లఘువుగనుండెనేని నిరూహవస్తి చక్కఁగఁ జేయఁబడినదని యెఱుంగవలెను.

నిరూహవస్తికర్మ చక్కఁగఁ జేయకున్న గల్గులక్షణము.

యస్య స్యాద్వస్తిరల్పాల్పవేగో హీనమలానిలః. 12
మూత్రార్తిజాడ్యారుచిమాన్ దుర్నిరూహం తమాదిశేత్,

వస్తికర్మ అల్పవేగముతో చేయఁబడుటచేత మలమూత్రాదులు కొంచెముగనే వెడలినయెడల మూత్రాఘాతము, జడత్వము, అరుచి గల్గును. అట్టితఱి నిరూహవస్తి చక్కఁగఁ జేయఁబడలేదని యెఱుంగవలెను.

విరిక్తతా మనస్తుష్టిస్స్నిగ్ధతా వ్యాధినిగ్రహః. 13
ఆస్థాపనస్నేహవస్త్యోస్సమ్యగ్దానే తు లక్షణం,
అనేన విధినా యుంజ్యాన్నిరూహం వస్తిదానవిత్. 14

శరీరము లఘువుగనుండుట, మనస్సునకు సంతోషము గల్గుట, శరీరము స్నిగ్ధంబగుట, రోగములు హరించుట ఇట్టి లక్షణములు స్థాపన, స్నేహవస్తులఁజేసిన పిమ్మట గలిగెనేని చక్కఁగా కర్మనిర్వర్తింపఁబడినదని తెలియందగును. ఇట్టివస్తికర్మను బాగుగా తెలిసినవైద్యుఁడు చేయందగును.

నిరూహవస్తిసంఖ్య.

ద్వితీయం వా తృతీయం వా చతుర్థం వా యథోచితం,

సస్నేహ ఏకః పవనే పిత్తే ద్వౌ పయసా సహ. 15
కషాయకటురూక్షాద్యాః కఫే కోష్ణాస్త్రయో మతాః,
పిత్తశ్లేష్మానిలావిష్టం క్షీరయూషరసైః క్రమాత్. 16
నిరూహం యోజయిత్వా చ తతస్తమనువాసయేత్,

దోషబలానుసారంబుగ నిరూహవస్తిని రెండుమాఱులుగాని, మూఁడుమాఱులుగాని చేయందగును. నిరూహవస్తిని వాతప్రకోపంబున స్నేహయుక్తంబుగ నొక్కసారియు, పిత్తప్రకోపంబున పాలతోడ రెండుమాఱులును, కఫప్రకోపంబున కషాయపదార్థములను, కటుపదార్థములను, రూక్షపదార్థములను కషాయంబుగాచి యాఁగోంచెము వెచ్చని కషాయంబుతో మూఁడుమాఱులును, నిరూహవస్తిని చేయందగును. త్రిదోషముల ప్రకోపంబున పాలు, యూషము, మాంసరసము వీనితో క్రమముగా నిరూహవస్తిచేసి పిమ్మట అనువాసనవస్తి చేయందగును.

### సుకుమారాదులకుఁ జేయఁదగిన నిరూహవస్తివిధి.

సుకుమారస్య వృద్ధస్య బాలస్య చ మృదుర్హితః. 17
వస్తిస్తీక్ష్ణః ప్రయుక్తస్తు తేషాం హన్యాద్బలాయుషీ,

సుకుమారులు, వృద్ధులు, బాలురు వీరలకు లఘువుగ వస్తికర్మ చేయందగును. అట్టివారలకు తీవ్రముగ చేసినయెడల బలంబును, ఆయుస్సును నశింపఁజేయును.

### దోషములయందుఁ జేయఁదగినవస్తిప్రయోగము.

దద్యాదుత్క్లేశనం పూర్వం మధ్యే దోషహరం తతః. 18
పశ్చాత్సంశమనీయం చ దద్యాద్వస్తిం విచక్షణః,

ప్రథమమునను ఉత్క్లేశవస్తిని, మధ్యయందు దోషహరవస్తిని, అంతమున దోషశమనవస్తిని చేయందగును.

### ఉత్క్లేశనవస్తి.

ఏరండబీజం మధుకం పిప్పలీసైంధవం వచా. 19
త్రపుషాఫలకల్కశ్చ వస్తిరుత్క్లేశనస్స్మృతః,

ఆముదపువిత్తులు, ఇప్పపట్ట, పిప్పళ్లు, సైంధవలవణము, వస, వెఱ్ఱిపుచ్చకాయ వీనిని సమభాగంబులుగ నూరి కల్కముగావించి యాకల్కమును దోషములు ఉత్క్లేశమునందుటకు వస్తియందు ప్రయోగింపవలెను. ఇయ్యది ఉత్క్లేశవస్తి యనంబడును.

### దోషహరవస్తి.

శతాహ్వా మధుకం బిల్వం కౌటజం ఫలమేవ చ. 20
సకాంజికస్సగోమూత్రవస్తి ర్దోషహరస్స్మృతః,

పిల్లపీచరగడ్డలు, అతిమధురము, మారేడుపండు, వెలగపండు వీనిని సమభాగంబులుగా గ్రహించి గంజితోనూరి యందు గోమూత్రముం గలపి వాతాదిదోషములు శమించు నిమిత్తము వస్తికర్మయం దుపయోగింపవలెను. ఇయ్యది శమనవస్తి యనంబడును.

### శోధనవస్తి.

శోధనద్రవ్యనిఃక్వాథే తత్కల్కైస్స్నేహసైంధవైః. 21
యుక్త్యా ఖజేన మథితా వస్తయశ్శోధనాస్స్మృతాః,

తెగడ మొదలగు రేచనద్రవ్యములను కషాయంబుగాచి అందు ఆశోధనద్రవ్యములను కల్కముగావించి యందు స్నేహము, సైంధవలవణము గలిపి బాగుగా కవ్వముతో చిలికి యద్దాని వస్తియం దుపయోగింపవలెను. ఇయ్యది దోషములను శోధించుట చేత శోధనవస్తి యనంబడును.

### దోషశమనవస్తి.

ప్రియంగుర్మధుకం ముస్తా తథైవ చ రసాంజనమ్. 22
సక్షీరశ్శస్యతే వస్తి ర్దోషాణాం శమనస్స్మృతః,

ప్రేంకణము, ఇప్పపట్ట, తుంగగడ్డలు, రసాంజనము వీని సమముగ పాలతోనూరి దోషములు శమించుటకై వస్తియం దుపయోగింపవలెను. ఇది దోషశమనవస్తి యనంబడును.

### లేఖనవస్తి.

త్రిఫలాక్వాథగోమూత్రక్షౌద్రక్షారసమాయుతాః. 23
ఊషకాదిప్రతీవాపైర్వస్తయో లేఖనా స్స్మృతాః,

త్రిఫలాకషాయంబున గోమూత్రము, తేనె, యవక్షారము, ఊషకాదిగణద్రవ్యములు వీనిని వైచి వస్తికర్మముఁ జేయవలెను. ఇయ్యది లేఖనవస్తి యనఁబడును.

### బృంహణవస్తి.

బృంహణద్రవ్యనిఃక్వాథః కల్కైర్మధురకైర్యుతః. 24
సర్పిర్మాంసరసోపేతః వస్తయో బృంహణా మతాః,

నేలతాడిగడ్డ, పల్లేరు, దురదగొండివిత్తులు మొదలగు బృంహణద్రవ్యములను కషాయంబుగాచి అందు ఇప్పపువ్వు, ద్రాక్షపండు, దానిమ్మగింజలు మొదలగు మధుర

ద్రవ్యములను కల్కముగా వైచి ఘృతమును, మాంసరసమును జేర్చి వస్తికర్మ చేయందగును. ఇయ్యది శరీరమునకు బలము నిచ్చుటచేత బృంహణవస్తి యనంబడును.

పిచ్ఛిలవస్తిః

బదర్యైరావతీశేలుశాల్మలీధననాగరాః. 25
క్షీరసిద్ధాః క్షౌద్రయుక్తా నామ్నా పిచ్ఛిలసంజ్ఞితాః,
అజోరభ్రైణరుధిరైర్యుక్తా దేయా విచక్షణైః. 26
మాత్రా పిచ్ఛిలవస్తీనాం పలైర్ద్వాదశభిర్మతా,

రేగుపట్ట, విరిగిపట్ట, బూరుగుపట్ట, దురదగొండివేరు, సొంటి వీనిని సమభాగంబులుగ పాలతోనూఱి యందు తేనెగలిపి దీనిని మేక, గొఱ్ఱె, జింక వీనిరక్తములో మిశ్రమముచేసి దోషములు తేటబడునిమిత్తము వస్తికర్మ చేయందగును. ఇయ్యది పిచ్ఛిలవస్తి యనంబడును. ఇందుఁ జేర్చుద్రవ్యము పదిరెండుపలము లుండవలెను.

నిరూహణౌషధప్రమాణవిధి.

దత్వాదౌ సైంధవస్యాక్షం మధునః ప్రసృతిద్వయమ్. 27
వినిర్మథ్య తతో దద్యాత్స్నేహస్య ప్రసృతిత్రయం,
ఏకీభూతే తతస్స్నేహే కల్కస్య ప్రసృతిం క్షిపేత్. 28
సంమూర్ఛితకషాయే తు చతుఃప్రసృతిసమ్మితం,
క్షిప్త్వా విమథ్య దద్యాచ్చ నిరూహం కుశలో భిషక్. 29
వాతే చతుఃపలం క్షౌద్రం దద్యాత్స్నేహస్య షట్పలం,
పిత్తే చతుఃపలం క్షౌద్రం స్నేహస్య చ పలత్రయమ్. 30
కఫే షట్పలికం క్షౌద్రం స్నేహస్యైవ చతుఃపలం,

సైంధవలవణము ఒకఅక్షప్రమాణము, తేనె రెండుపలములు వీనింజేర్చి బాగుగా మర్దించి పిమ్మట ముందుచెప్పఁబోవు ద్రవ్యముల కల్కమును జేర్చిగాని, లేక ఆద్రవ్యములను కషాయంబుగాచి యందుగాని, ఎనిమిదిపలముల స్నేహమును జేర్చి చక్కఁగ కలియఁబెట్టి వస్తికర్మ జేయందగును. మఱియు వాతరోగంబున నాలుగుపలముల తేనెను, ఆఱుపలముల స్నేహంబును, పిత్తరోగంబున నాల్గుపలముల తేనెను, మూఁడుపలముల స్నేహంబును, కటిరోగంబున ఆఱుపలముల తేనెను, నాల్గుపలముల స్నేహంబును జేర్చి వస్తికర్మ చేయందగును. ఇయ్యది విశేషవిధానంబు.

మధుతైలకవస్తి.

ఏరండక్వాథతుల్యాంశం మధుతైలం పలాష్టకమ్. 31
శతపుష్పా పలార్ధేవ సైంధవార్ధేన సంయుతం,

మధుతైలకసంజ్ఞోఽయం వస్తిః ఖజవిలోడితః. 32
మేదోగుల్మకృమిప్లీహామలోదావర్తనాశనః,
బలవర్ణకరశ్చైవ వృష్యో బృంహణదీపనః. 33

ఆముదపువేళ్ల కషాయము ఎనిమిదిపలములు, తేనె నాల్గుపలములు, తైలము నాల్గు పలములు, సదాపాకు పలము, సైంధవలవణము అరపలము వీనినన్నిటినికలిపి కవ్వముతో చిలకవలెను. ఇయ్యది మధుతైలవస్తి యనంబడును. దానిని వస్తికర్మ జేసినయెడల మేదోరోగము, గుల్మరోగము, క్రిమిరోగము, ప్లీహోదరము, మందోష్ణము, ఉదావర్తము ఇవి నశించును. శరీరమునకు బలమును, కాంతిని, శుక్రవృద్ధిని, అగ్నిదీప్తిని గలిగించును.

### దీపనవస్తి.

క్షౌద్రాజ్యక్షీరతైలానాం ప్రసృతం ప్రసృతం భవేత్,
త్రపుషా సైంధవాక్షాంశో వస్తిస్స్యాద్దీపనః పరః. 34

తేనె, నెయ్యి, పాలు, తైలము - వీనిని ప్రత్యేకముగా నొక్కొకపలము గ్రహించి యందు చేదుపుచ్చకాయ, సైంధవలవణము వీనిని ప్రత్యేకముగా నొక్కొక అక్షప్రమాణము గలిపి అగ్నిదీప్తినిమిత్తము వస్తికర్మ చేయందగును. ఇయ్యది దీపనవస్తి యనంబడును.

### యుక్తరథవస్తి.

ఏరండమూలనిక్వాథో మధుతైలం ససైంధవం,
ఏష యుక్తరథో వస్తిస్సవచా పిప్పలీఫలః. 35

మహాపంచమూలకషాయంబున నూనె, పిప్పలీచూర్ణము, తేనె, సైంధవలవణము, ఇప్ప వీనింజేర్చి వస్తికర్మచేయందగును. ఇది సమస్తరోగములను హరించును గాన యుక్తరథవస్తి యనంబడును.

### సిద్ధవస్తి.

పంచమూలస్య నిఃక్వాణస్తైలం మాగధికామధు,
ససైంధవస్సమధుకస్సిద్ధవస్తిరితి స్మృతః. 36

బృహత్పంచమూలకషాయములో నూనెను, పిప్పలిచూర్ణమును, తేనెను, సైంధవలవణచూర్ణమును ఇప్పపట్టలోని నారను, లేక అతిమధురచూర్ణమును, కలిపి వస్తిప్రయోగము చేయవలెను. ఇదియ సిద్ధవస్తియని సమస్తరోగంబులయందును బ్రయోగింపందగు.

వస్తికాలనియమములు.

స్నానముష్ణోదకైః కుర్యాద్దివాస్వప్నమజీర్ణతాం,
వర్జయేదపరం సర్వమాచరేత్స్నేహవస్తివత్. 37

ఇతి శ్రీదామోదరసూనుశార్ఙ్గధరేణ విరచితాయాం సంహితాయాం
చికిత్సాస్థానే ఉత్తరఖండే నిరూహవస్తికథనంనామ
షష్ఠోఽధ్యాయః.

వస్తికర్మ చేయఁబడినవాఁడు ఉష్ణోదకంబుచే స్నానము చేయందగును. మఱియుం పగటినిద్ర, అజీర్ణపదార్థభోజనము వీనిని వర్జించి స్నేహపాకంబున చెప్పఁబడిన విధిని చేయందగును.

ఇది శ్రీదామోదరసూను శార్ఙ్గధరవిరచితసంహితయందు ఉత్తరఖండమున
చికిత్సాస్థానమున నిరూహవస్తికథన మనియెడు
షష్ఠాధ్యాయము సంపూర్ణము.

---

# సప్తమాధ్యాయము.

ఉత్తరవస్తివిధి.

అతఃపరం ప్రవక్ష్యామి వస్తిముత్తరసంజ్ఞితం,
నిరూహాదుత్తరో యస్మాత్తస్మాదుత్తరసంజ్ఞితః. 1
ద్వాదశాఙ్గులకం నేత్రం మధ్యే చ కృతకర్ణికం,
మాలతీపుష్పవృంతాభం ఛిద్రం సర్షపనిర్గమమ్. 2

ఈయధ్యాయంబున నుత్తరవస్తి నిర్ణయంబు చేయంబడును. ఇయ్యది నిరూహవస్తియనంతరంబున చేయంబడుటచేత నుత్తరవస్తి యనంబడును. ఈయుత్తరవస్తియొక్క నేత్రము పదిరెండంగుళముల పొడవుగనుండి జాజిపువ్వుతొడిమయంతలావు గలిగి మధ్యభాగంబున కర్ణములుఁగలిగి తెల్లయావగింజ యంత రంధ్రము గలిగియుండవలెను.

వయోవిశేషముచే ఔషధమానవిశేషము.

పంచవింశతివర్షాణామధో మాత్రా ద్వికార్షికీ,
తదూర్ధ్వం పలమానం చ స్నేహస్యోక్తా విచక్షణైః. 3

ఇట్టి నిరూహవస్తిని ప్రయోగించునపుడు అందు ఇరువదియైదు సంవత్సరముల వయస్సువఱకును రెండుకర్షముల స్నేహమును, ఆపిమ్మట ఒకపలము స్నేహమును ప్రయోగింపవలయును.

## ఉత్తరవస్తిప్రయోగవిధానము.

అథాస్థాపనశుద్ధస్య తృప్తస్య స్నానభోజనైః,
స్థితస్య జానుమాత్రే చ పీఠేత్వేష్టశలాకయా. 4
స్నిగ్ధయా మేఢ్రమార్గే చ తతో నేత్రం నియోజయేత్,
శనైశ్శనై ర్ఘృతాభ్యక్తం మేఢ్రరంధ్రేఽంగులాని షట్. 5
తతోఽవపీడయేద్వస్తిం శనై ర్నేత్రం చ నిర్హరేత్,
తతః ప్రత్యాగతే స్నేహేస్నేహ వస్తిక్రమో హితః. 6

నిరూహవస్తిచేయుటచే శుద్ధుఁడగురోగికి స్నాన, భోజనంబులచే తృప్తిగావించి మోకాళ్లయెత్తుగలపీఠముమీద కూర్చుండఁబెట్టి ఉత్తరవస్తియందు స్నేహమును పిచికారి లె గ్రహించి యావస్తినేత్రమునకు నూనె బాగుగా చఱిమి మేఢ్రమునకు నేయిచఱిమి మామేఢ్రరంధ్రమున ఆఱంగుళములవఱకును నేత్రమును పోనిచ్చి వస్తిపీడనముచేసి మాగొట్టమును మెల్లమెల్లగ వెలికిఁదీయవలెను. పిమ్మట నాస్నేహము బైటికివచ్చినతోడనే నువాసనవస్తిక్రమమును చేయందగును.

## స్త్రీలకు వస్తికర్మచేయుక్రమము.

స్త్రీణాం కనిష్ఠికాస్థూలం నేత్రం కుర్యాద్దశాంగులం,
ముద్గప్రవేశ్యం యోజ్యం చ యోఽన్యంతశ్చతురంగులమ్. 7
ద్వ్యంగులం మూత్రమార్గే చ సూక్ష్మం నేత్రం నియోజయేత్,

స్త్రీలకుఁజేయు ఉత్తరవస్తిని చిటికెనవ్రేలంతలావుగను, పదియంగుళముల పొడవు ను, పెసరగింజయంత రంధ్రముగలదిగను నిర్మింపవలెను. అట్టివస్తిని యోనిద్వారమున ాలుగంగుళములవఱకు ప్రవేశపెట్టి వస్తిపీడనముచేయవలెను. మఱియు మూత్రమార్గ ున వస్తికర్మము చేసినయెడల రెండంగుళములు ప్రవేశపెట్టవలయును.

## బాలురకు వస్తికర్మచేయువిధి.

మూత్రకృచ్ఛ్రవికారేషు బాలానాం త్వేకమంగులమ్. 8
శనైర్నిష్కంపమాధేయం సూక్ష్మం నేత్రం విచక్షణైః,

బాలురకు గల్గు మూత్రకృచ్ఛ్రములయందు ఉత్తరవస్తిని ప్రయోగింపవలసి

యుండెనేని హస్తకంపము లేక బుద్ధిమంతుఁడగు వైద్యుఁడు సన్ననిగొట్టమును మేఢ్ర ద్వారమున నొకయంగుళము ప్రవేశింపఁజేయవలెను.

స్త్రీలు మున్నగువారలకు వస్తిస్నేహప్రమాణము.

యోనిమార్గేషు నారీణాం స్నేహమాత్రా ద్విపాలికీ. 9
మూత్రమార్గే పలోన్మానా బాలానాం చ ద్వికార్షికీ,
ఉత్తానాయై స్త్రియై దద్యాదూర్ధ్వజాన్వై విచక్షణః. 10
అప్రత్యాగచ్ఛతి భిషగ్వస్తావుత్తరసంజ్ఞికే,

స్త్రీలకు యోనిమార్గంబున నుత్తరవస్తి చేయవలసియుండెనేని యావస్తియందు స్నేహమును రెండుపలములుగాను, మూత్రమార్గమునఁ జేయవలసియుండెనేని పలముగను జేయవలయును. బాలురకు చేయునెడల రెండుకర్షములు చేయవలెను. మఱియు నుత్తర వస్తి చేయునపుడు స్త్రీని వెల్లకిలఁబరుండఁబెట్టి మోకాళ్లను పైకి ఎత్తునట్లుచేసి స్నేహము వెలికి రాకుండునటులఁ జేయవలయును.

శోధనద్రవ్యములచే వస్తివిధానము.

భూయో వస్తిం విదధ్యాచ్చ సంయుక్తైశ్శోధనైర్గణైః. 11
ఫలవర్తిం నిదధ్యాద్వా యోనిమార్గే దృఢం భిషక్,
సూత్రైర్వినిర్మితాం స్నిగ్ధాం శోధనద్రవ్యసంయుతామ్. 12
దహ్యమానే తథా వస్తౌ దద్యాద్వస్తిం విచక్షణః,
క్షీరవృక్షకషాయేణ పయసా శీతలేన చ. 13
వస్తిశుక్రరుజః పుంసాం స్త్రీణామార్తవజాం రుజం,
హన్యాదుత్తరవస్తిస్తు నోచితో మేహినాం క్వచిత్. 14

మూత్రకృచ్ఛ్రాది రోగంబులందు వస్తికర్మముచేయునెడల శోధనద్రవ్యములచే చేయవలయును. లేక ఆముదపువిత్తులు మొదలగు శోధనద్రవ్యములనునూఱి వస్త్రమునకు గాని దారమునకుఁగాని లేపనముచేసి వర్తిగాచేసి ఆముదములో తడపి యావర్తిని యోని యందు ప్రవేశింపఁజేయవలెను. అట్టి వస్తికర్మముచే నాభి కధోభాగమున దాహము గలిగెనేని అత్తి, మఱ్ఱి మొదలగు క్షీరవృక్షముల పట్టల కషాయంబుతోఁగాని, పాలతో గాని మరల వస్తిచేయందగును. అట్లుచేసినయెడల నాదాహము నశించి పురుషులకుఁగల శుక్రగతరోగములు, స్త్రీలకుఁగల ఆర్తవరోగములు నశించును. ప్రమేహరోగికి ఉత్తర వస్తిని ప్రయోగింపఁదగదు. అట్లుచేసినయెడల నారోగి మృతినొందును.

వస్తికర్మ చక్కఁగఁజేయఁబడినం గలుగులక్షణములు.

సమ్యగ్దత్తస్య లింగాని వ్యాపదః క్రమశఏవచ,
వస్తేరుత్తరసంజ్ఞస్య శమనం స్నేహవస్తినా. 15

ఉత్తరవస్తిచేసినయెడల దోషములు శమించి ఉపద్రవములు గలుగకుండిన నయ్యది సమ్యగ్దత్త లక్షణము.

గుదమున ఫలవర్తి ప్రయోగము.

ఘృతాభ్యక్తే గుదే క్షేప్యా శ్లక్ష్ణా స్యాంగుష్ఠసన్నిభా,
మలప్రవర్తినీ వర్తిః ఫలవర్తిశ్చ సా స్మృతా. 16

ఇతి శ్రీదామోదరసూను శార్ఙ్గధరవిరచితాయాం సంహితాయాం
ఉత్తరఖండే చికిత్సాస్థానే ఉత్తరవస్తికథనంనామ
సప్తమోఽధ్యాయః.

గుదమున నేతినిఫూసి రోగియొక్క యంగుష్ఠపులావుగల వర్తినిజేసి యావర్తిపైన శోధనద్రవ్యములనుపూసి దానిని గుదంబున ప్రయోగించిన నద్దానిచే సుఖముగా రేచనం బగును. ఇయ్యది ఫలవర్తి యనంబడును.

ఇది శ్రీదామోదరసూను శార్ఙ్గధరవిరచితసంహితయందు చికిత్సాస్థానమున
నుత్తరఖండమందు ఉత్తరవస్తికథనమనియెడు
సప్తమాధ్యాయము సంపూర్ణము.

---

# అష్టమాధ్యాయము.

నస్యవిధి.

నస్యం తత్కథ్యతే ధీరైర్నాసా గ్రాహ్యం యదౌషధం,
నావనం నస్యకర్మేతి తస్య నామద్వయం మతమ్. 1

ఈయధ్యాయంబున నస్యకర్మ వివరింపఁబడును. నాసారంధ్రములయందు ప్రయోగించు నౌషధము నస్య మనఁబడును. అయ్యది నావనంబనియుఁ నస్యకర్మయనియు చెప్పఁబడును.

### నస్యభేదములు.

నస్యభేదో ద్విధా ప్రోక్తో రేచనం స్నేహనం తథా,
రేచనం కర్షణం ప్రోక్తం స్నేహనం బృంహణం మతమ్. 2

రేచనంబనియు, స్నేహనంబనియు నస్యము ద్వివిధంబు. అందు వాతాదిదోషములను కృశత్వము నొందించి నశింపఁజేయునది రేచనంబనియు, ధాతువృద్ధి గలుగఁజేయునది స్నేహంబనియు చెప్పఁబడును.

### నస్యసేవనకు కాలము.

కఫపిత్తానిలధ్వంసే పూర్వమధ్యాపరాహ్ణకే,
దినస్య గృహ్యతే నస్యం రాత్రావప్యుత్కటే గదే. 3

కఫప్రకోపంబున ప్రాతఃకాలంబునను, పిత్తప్రకోపంబున మధ్యాహ్నమునను, వాతప్రకోపంబున సాయంకాలమునను నస్యకర్మ చేయవలెను. మఱియు రోగము ప్రబలముగా నుండెనేని రాత్రియందు ప్రయోగింపవలెను.

### నస్యనిషేధము.

నస్యం త్యజేద్భోజనాంతే దుర్దినే చాపి తర్పణే,
తథా నవప్రతిశ్యాయీ గర్భిణీ గరదూషితః. 4
అజీర్ణీ దత్తవస్తిశ్చ పీతస్నేహోదకాసవః,
క్రుద్ధశ్శోకాభిభూతశ్చ తృషార్తో వృద్ధబాలకౌ. 5
వేగావరోధీ స్నాతశ్చ స్నాతుకామశ్చ వర్జయేత్,

భోజనంబు గావించినతోడను, మలమూత్రవిసర్జనముగానిదినమునను, లంఘనము చేసినపుడును, నూతనముగపుట్టిన ప్రతిశ్యాయరోగంబునను, గర్భిణీస్త్రీలకును, విషదోషంబుగలవానికి, అజీర్ణరోగికి, వస్తికర్మ చేసినవానికి, స్నేహమును, ఉదకమును, మద్యమును పానముజేసినవానికి, క్రోధము, శోకము, దప్పి ఇవిగలవానికిని, వృద్ధులకు, బాలురకు, వాతమూత్రములను నిరోధించువానికి, స్నానముచేయుట కుద్యుక్తుఁడగువానికిని నస్యకర్మలఁ జేయించఁదగదు.

### నస్యకర్మకర్హమగుకాలము.

అష్టవర్షస్య బాలస్య నస్యకర్మ సమాచరేత్. 6
అశీతివర్షాదూర్ధ్వం చ నావనం నైవ దీయతే,

ఎనిమిది వత్సరములప్రాయము మొదలు ఎనుబదివత్సరములవఱకును నస్యకర్మము జేయింపఁదగును.

## రేచననస్యవిధానము.

అథ వై రేచనం నస్యం గ్రాహ్యం తైలైస్సుతీక్ష్ణకైః. 7
తీక్ష్ణభేషజసిద్ధైర్వా స్నేహైః క్వాథై రసైస్తథా,

రేచననస్యమున తీక్ష్ణంబులగు ఓమము, తెల్లయావాలు వీనినుండి తైలమును దీసిగాని, లేక ఈయౌషధములయందు తైలమును సిద్ధముఁజేసిగాని, లేక వాని కషాయంబున స్నేహమును గలిపి సాధించికాని, లేక వానిరసములో స్నేహమును సాధించిగాని నస్యకర్మము చేయందగదు.

## రేచననస్యప్రమాణము.

నాసికారంధ్రయోరష్టౌ షట్చత్వారశ్చ బిందవః. 8
ప్రత్యేకం రేచనే యోజ్యా ముఖ్యమధ్యాంత్యమాత్రయా,

రేచననస్యతైలమును నాసికారంధ్రములయందు ఎనిమిదిబిందువులువేయుంట ఉత్తమప్రమాణమనియు, ఆఱుబిందువులువేయుంట మధ్యమప్రమాణమనియు, నాలుగు బిందువులువేయుంట కనిష్ఠప్రమాణమనియు చెప్పఁబడును.

## నస్యకర్మయం దౌషధప్రమాణము.

నస్యకర్మణి దాతవ్యం శాణైకం తీక్ష్ణమౌషధమ్. 9
హింగుస్స్యాద్యవమాత్రం తు మాషైకం సైంధవం మతం,
క్షీరం చైవాష్టశాణం స్యాత్పానీయం చ త్రికార్షికమ్. 10
కార్షికం మధురం ద్రవ్యం నస్యకర్మణి యోజయేత్,

నస్యకర్మయందు తీక్ష్ణౌషధమును శాణప్రకారముగాను, ఇంగువను యవప్రమాణముగాను, సైంధవలవణమును మాషప్రమాణముగాను, పాలను ఎనిమిదిశాణప్రమాణముగాను, ఉదకమును మూఁడుకర్షములుగాను, మధురద్రవ్యములను కర్షప్రమాణముగాను ప్రయోగింపవలెను.

## విరేచననస్యభేదములు.

అపపీడః ప్రధమనం ద్వౌ భేదావపరౌ స్మృతౌ. 11
శిరోవిరేచనస్థానే తౌ తు దేయౌ యథాయథం,

ఈవిరేచచననస్యము అవపీడనము, ప్రధమనము అని రెండువిధములు. ఈరెండిటిని శిరోవిరేచనార్థ ముపయోగించవలెను.

## అవపీడ ప్రధమన నస్యముల లక్షణములు.

కల్కీకృతాదౌషధాద్యః పీడితో నిస్సృతో రసః. 12

సోఽవపీడస్సముద్దిష్టస్తీక్ష్ణద్రవ్యసముద్భవః,
షడంగులాద్విపక్త్రాయానాడీచూర్ణం తయాధమేత్. 13
తీక్ష్ణం కోలమితం వక్త్రవాతైః ప్రధమనం హి తత్,

తీక్ష్ణంబులగు సొంటి, మిరియములు మొదలగువానిని నూరి కల్కముగావించి దాని రసమును ముక్కులో పిడుచుట అవపీడన మనంబడును. ఆఱంగుళములపొడవును, అగ్రభాగమున రెండు రంధ్రములును గలయొకగొట్టమునుచేసి యందు శుంఠి, పిప్పళ్లు మొదలగు కారపుద్రవ్యములను చూర్ణముచేసి వేసి దానిని రోగియొక్క నాసికారంధ్రములందుంచి నోటితోనూదిన నయ్యది ప్రధమననస్య మనంబడును.

## నస్యవిరేచనకర్మ కర్హమగురోగములు.

ఊర్ధ్వజత్రుగతే రోగే కఫజే స్వరసంక్షయే. 14
అరోచకే ప్రతిశ్యాయే శిరశ్శూలే చ పీనసే,
శోఫాపస్మారకుష్ఠేషు నస్యం వై రేచనం హితమ్. 15
భీరుస్త్రీకృశబాలానాం నస్యం స్నేహేన దీయతే,

ఊర్ధ్వజత్రుగతరోగములు, కఫోద్భవంబగు స్వరభంగము, అరుచి, పడిసెము, తలనొప్పి, పీనసము, ఉబ్బు, అపస్మారము, కుష్ఠము ఈరోగములు గలవారలకు విరేచననస్యము శ్రేష్ఠంబైయుండును. భయగ్రస్తులకును, స్త్రీలకును, కృశించినవారికిని, బాలురకును, స్నేహయుక్తమగు నస్యకర్మ చేయుట యుత్తమంబు.

## అవపీడననస్యమున కర్హమగురోగములు.

గళరోగే సన్నిపాతే నిద్రాయాం విషమజ్వరే. 16
మనోవికారే కృమిషు యుజ్యతే చావపీడనం,

గళరోగము, సన్నిపాతము, అతినిద్ర, విషమజ్వరము, మనోవికారము, క్రిమిరోగము వీనియందు అవపీడననస్యకర్మ శ్రేష్ఠంబు.

## ప్రధమననస్యమున కర్హమగురోగము.

అత్యంతోత్కటదోషేషు విసంజ్ఞేషు చ దీయతే. 17
చూర్ణం ప్రధమనం ధీరైస్తద్ధి తీక్ష్ణతరం యతః,

మూర్ఛ, అపస్మారము మొదలగుచేష్టానాశకరోగంబులందు మిగుల తీక్ష్ణంబగు ప్రధమననస్యమును జేయందగును.

## రేచనసంజ్ఞికనస్యము.

నస్యం స్యాద్గుడశుంఠీభ్యాం పిప్పలీసైంధవేన వా. 18

జలపిష్టేన తేనాక్షికర్ణనాసాశిరోగదాః,
హనుమన్యాగలోద్భూతా నశ్యంతి భుజపృష్ఠజాః. 19

సొంటిని ఉష్ణోదకంబుతో గంధముతీసి యందు బెల్లమును జేర్చి గాని, పిప్పళ్లను, సైంధవలవణమును, ఉష్ణోదకముతోఁగలిపి గాని నస్యముచేయించిన నేత్ర, శ్రోత్ర, నాసికా, శిరో, హను, మన్యా, గళ, భుజ, పృష్ఠ రోగములు నశించును.

అన్యచ్చ.—మధూకసారకృష్ణాభ్యాం వచామరిచసైంధవైః,
నస్యం కోష్ణజలే పిష్టం దద్యాత్సంజ్ఞాప్రబోధనమ్. 20
అపస్మారే తథోన్మాదే సన్నిపాతేపతంత్రకే,

ఇప్ప, పిప్పళ్లు, వస, మిరియములు, సైంధవలవణము వీనిని ఉష్ణోదకంబుతో నూరి నస్యముఁజేయించిన అపస్మారము, ఉన్మాదము, సన్నిపాతము, అపతంత్రకవాతము నశించి, జ్ఞానము గలుగును.

అన్యచ్చ.—సైంధవం శ్వేతమరిచం సర్షపాః కుష్ఠమేవ చ. 21
బస్తమూత్రేణ పిష్టాని నస్యం తంద్రానివారణం,

సైంధవలవణము, మునగవిత్తులు, తెల్లఆవాలు, చెంగల్వకోష్టు వీనిని మేకపోతు మూత్రములో నూరి నస్యముచేయించిన తంద్రయును మస్తిష్కరోగము నశించును.

## ప్రధమనసంజ్ఞికనస్యము.

రోహీతమత్స్యపిత్తేన భావితం సైంధవం వచా. 22
మరిచం పిప్పలీశుంఠీ కంకోలం లశునం పురం,
కట్ఫలం చేతి తచ్చూర్ణం దేయం ప్రధమనం బుధైః. 23

సైంధవలవణము, వస, మిరియములు, పిప్పళ్లు, సొంటి, తక్కోలములు, వెల్లుల్లి, గుగ్గిలము, కాయఫలము వీని చూర్ణమునుచేసి ఈచూర్ణమును రోహితసంజ్ఞికమత్స్యము యొక్క పిత్తములో భావనచేసి యెండించి యాచూర్ణమును పూర్వముచెప్పఁబడిన గొట్టములోవేసి దానిని ముక్కునందుంచి ప్రధమననస్యము చేయించిన పూరోక్తంబులగు అపస్మారాదిరోగములు నశించును.

## బృంహణకల్పనము.

అథ బృంహణనస్యస్య కల్పనా కథ్యతేఽధునా,
మర్శశ్చ ప్రతిమర్శశ్చ ద్వౌ భేదౌ స్నేహనే మతౌ. 24
మర్శస్య తర్పణీమాత్రా ముఖ్యా శాణైస్మృతాష్టభిః,
మధ్యమా చ చతుశ్శాణైర్హీనా శాణమితా స్మృతా. 25

ఏకైకస్మింస్తు మాత్రేయం దేయా నాసాపుటే బుధైః,
మర్శస్య ద్విత్రివేలం వా వీక్ష్య దోషబలాబలమ్. 26
ఏకాంతరం ద్వ్యంతరం వా నస్యం దద్యాద్విచక్షణః,
త్ర్యహం పంచాహమథవా సప్తాహం వా సుయంత్రతః. 27

పూర్వోక్తంబగు బృంహణనస్యము మర్శమనియు, ప్రతిమర్శమనియు ద్వివిధంబు. అందు మర్శనస్యంబున ఎనిమిదిశాణముల ప్రమాణముగలమాత్ర ఉత్తమమాత్రయనియు, నాలుగుశాణముల ప్రమాణముండిన మధ్యమమాత్రయనియు, శాణప్రమాణముండిన హీనమాత్రయనియు చెప్పంబడును. ఈచెప్పినప్రమాణము ఒక్కొక నాసారంధ్రమునకు సంబంధించియున్నది. ఇట్టి మర్శనస్యమును దోషబలాబలభేదంబుచే దినమునకు రెండుమార్లుగాని, మూఁడుమార్లుగాని, మూఁడవదినమునగాని, నాల్గవదినమునగాని, ఐదవదినమునగాని, యేడవదినమునగాని, ఎనిమిదవదినమునగాని ప్రయోగింపవలెను.

—— నస్యాధిక్యముచే గలుగునుపద్రవములకు ప్రతీకారము. ——

మర్శే శిరోవిరేకే చ వ్యాపదో వివిధాస్స్మృతాః,
దోషోత్క్లేశాత్క్షయాచ్చైవ విజ్ఞేయాస్తా యథాక్రమమ్. 28
దోషోత్క్లేశనిమిత్తాసు యుంజ్యాద్వమనశోధనం,
అథ క్షయనిమిత్తాసు యథా స్వం బృంహణం మతమ్. 29

శిరోవిరేచనార్థంబై మర్శనస్యమును అధికముగా నిచ్చినయెడల దోషోత్క్లేశంబుచేతను, క్షయచేత నుపద్రవములుగల్గును. అందు దోషోత్క్లేశంబుచే గల్గినయెడల ప్రథమనవిరేచనంబులును, క్షయచే జన్మించినయెడల బృంహణకర్మయు చేయందగును.

—— బృంహణనస్యసేవనకర్హమగురోగములు. ——

శిరోనాసాక్షిరోగేషు సూర్యావర్తార్ధభేదకే,
దంతరోగే బలేహీనే మన్యబాహ్వాంసజే గదే. 30
ముఖశోషే కర్ణనాదే వాతపిత్తగదే తథా,
అకాలపలితే చైవ కేశశ్మశ్రుప్రపాతనే. 31
యుజ్యతే బృంహణం నస్యం స్నేహైర్వా మధురద్రవైః,

శిరోరోగము, నాసారోగము, నేత్రరోగము, సూర్యావర్తము, అర్ధావభేదకము, దంతరోగము, దౌర్బల్యము, పెడతలనరము, బాహువులు, భుజశిరస్సులు వీనియందు పీడ, ముఖశోషము, కర్ణనాదము, వాత పిత్తరోగములు, పలితము, ఇంద్రలుప్తము వీనియందు స్నేహంబులచేగాని, మధురద్రవ్యములచేగాని బృంహణనస్యమును చేయందగును.

వాతరక్తాదులకు కుంకుమనస్యము.

సశర్కరం పయః పిష్టం భృష్టమాజ్యేన కుంకుమమ్. 32
నస్యప్రయోగతో హన్యాద్వాతరక్తభవా రుజః,
భ్రూశంఖాక్షిశిరఃకర్ణ సూర్యావర్తార్ధభేదకాన్. 33

కుంకుమపువ్వుకు సమముగా పంచదారగలిపి ఆవుపాలతో నూరి నస్యము చేసిన వాతరక్తపీడ, కనుబొమలు, శంఖప్రదేశము, కన్నులు, శిరంబు, చెవులు వీనియందలి పీడ, సూర్యావర్తము, అర్ధావభేదకము నశించును.

వాతాదులయందు నస్యము.

నస్యస్స్యాదణుతైలేన తథా నారాయణేన వా,
మాషాదినా వా సర్పిర్భిస్తత్తద్భేషజసాధితైః. 34
తైలం కఫే స్యాద్వాతే చ కేవలే పవనే వసా,
దద్యాన్నస్యం సదా పిత్తే సర్పిర్మజ్జానమేవ వా. 35

అణుతైలమునుగాని, నారాయణతైలమునుగాని, మాషతైలమునుగాని, పిత్తహర ద్రవ్యములచే నిర్మింపఁబడిన ఘృతముగాని వాతము దోషాంతరముతో గూడినపుడు ప్రయోగింపం దగును. మఱియు వాతము కఫముతో గూడిన తైలమును, వాతము కేవలముగా ప్రకోపించిన వసను, పిత్తముతోఁ గూడియుండిన ఘృతమునుగాని, మజ్జనుగాని నస్యము చేయించిన నీవాతము నశించును.

పక్షఘాతాదిరోగములకు నస్యము.

మాషాత్మగుప్తా రాస్నాభిర్బలారుబుకరోహిషైః,
కృతేఽశ్వగంధయా క్వాథో హింగుసైంధవసంయుతః. 36
కోష్ణో నస్యః ప్రయోగేణ పక్షాఘాతం సకంపనం,
జయేదర్దితవాతం చ మన్యాస్తంభాపబాహుకౌ. 37

ఉద్దులు, దురదగొండివిత్తులు, సన్నరాస్న, ముత్తవపులగము, ఆముదపువేరు, కామంచికసవు, పెన్నేరుగడ్డ వీని కషాయంబున వేయించిన ఇంగువ, సైంధవలవణము వీనిని జేర్చి కొంచె మష్ణంబుగ నస్యము చేయించిన కంపముతో గూడినపక్షఘాతము, అర్దితవాతము, మన్యాస్తంభము, అపబాహుకము నశించును.

ప్రతిమర్శనమాత్రాప్రమాణము.

ప్రతిమర్శస్య మాత్రా తు ద్విద్విబిందుమితా మతా,
ప్రత్యేకశో నాసికయోస్స్నేహేనేతి వినిశ్చితమ్. 38

ఘృతము మొదలగు స్నేహములను ప్రతినాసారంధ్రమునందును, రెండు రెండు బిందువులుగా ప్రయోగింపవలెను. ఇయ్యది ప్రతిమర్శనస్య మనంబడును.

బిందుసంజ్ఞికమాత్ర.

స్నేహే గ్రంథిద్వయం యావన్నిమగ్నం చోద్ధృతం తతః,
తర్జనీయం స్రవేద్బిందుస్సా మాత్రా బిందుసంజ్ఞితా. 39
ఏవంవిధైర్బిందుసంజ్ఞైరష్టభిశ్శాణ ఉచ్యతే,
స దేయో మర్శనస్యే తు ప్రతిమర్శో ద్విబిందుకః. 40

నేయి, నూనె మొదలగువానిలో తర్జనివ్రేలును రెండు కణుపులు మునుగునట్లు ముంచి తీయగా నావ్రేలినుండి స్రవించు స్నేహము బిందువనంబడును. ఇట్టి బిందువులు ఎనిమిదియైన నొక్కశాణమనంబడును. ఇయ్యది మర్శనస్యమున ప్రయోగింపఁబడును. ప్రతిమర్శనస్యమున రెండు బిందువులను ప్రయోగింపవలెను.

ప్రతిమర్శనస్యకాలములు.

సమయాః ప్రతిమర్శస్య బుధైః ప్రోక్తాశ్చతుర్దశ,
ప్రభాతే దంతకాష్ఠాంతే గృహాన్నిర్గమనే తథా. 41
వ్యాయామాధ్వవ్యవాయాంతే విణ్మూత్రాంతేఽంజనే కృతే,
కబళాంతే భోజనాంతే దివాస్వప్నోత్థితే తథా. 42
వమనాంతే తథా సాయం ప్రతిమర్శః ప్రయుజ్యతే,

ప్రతిమర్శనస్యము నుపయోగించుకాలములు పదునాల్గువిధంబులుగా విభజింపఁబడియున్నవి. అయ్యవి ఈక్రింద వివరింపఁబడును. ప్రభాతకాలము, దంతధావనానంతరకాలము, ఇంటినుండి బైలువెడలెడికాలము, వ్యాయామానంతరకాలము, మార్గగమనానంతరకాలము, మైథునానంతరకాలము, మలమూత్రోత్సర్జనానంతరకాలము, అంజనకరణానంతరకాలము, కబలానంతరకాలము, భోజనానంతరకాలము, దివాస్వప్నానంతరకాలము, వమనానంతరకాలము, సాయంకాలము.

ప్రతిమర్శనస్యముచేఁ దృప్తిజెందినవారికిఁ గలుగులక్షణములు.

ఈషదుచ్ఛిందనాత్స్నేహో యదా వక్త్రం ప్రపద్యతే. 43
నస్యే నిషిక్తం తం విద్యాత్ప్రతిమర్శప్రమాణతః,
ఉచ్ఛిందం న పిబేచ్చైతన్నిష్ఠీవేన్ముఖమాగతమ్. 44

ప్రతిమర్శనస్యమును జేసినపిమ్మట స్వల్పముగ తుమ్ములువెడలి యాస్నేహము నోటి

లోనికి పోయినయెడల చక్కగా నస్యము చేయఁబడెనని యెఱుంగవలెను. అట్లు నోటి లోనికి పోయిననస్యమును మ్రింగక ఉమియవలెను.

ప్రతిమర్శనస్యసేవన కర్తృలు.

క్షీణే తృష్ణాస్యశోషార్తే బాలే వృద్ధే చ యుజ్యతే,
ప్రతిమర్శేన శామ్యంతి రోగాశ్చైవోర్ధ్వజత్రుజాః. 45
వలీపలితనాశశ్చ బలమింద్రియజం భవేత్,

ధాతుక్షయము, దప్పి, ముఖశోష ఈరోగంబులు గలవారును, బాల, వృద్ధులును వీరు ప్రతిమర్శనస్యమున కర్తృలు. మఱియు ఊర్ధ్వజత్రుగతరోగములందును, వలీపలితములందును, ప్రతిమర్శనస్యమును సేవించినయెడల రోగంబులు నశించుటయే గాక ఇంద్రియబలముగూడ గలుగును.

పలితమునకు నస్యము.

విభీతనింబగంభారీ శివా శేలుశ్చ కాకినీ. 46
ఏకైకతైలనస్యేన పలితం నశ్యతి ధ్రువం,

తానికాయలు, వేప, గుమ్ముడు, కరక్కాయలు, విరిగి, కాకిని వీనియందలి పప్పులను వేర్వేఱుగ నూనెలో వైచి కాచి నస్యముఁజేయించిన తెల్లనివెండ్రుకలు నల్లబడును.

నస్యవిధి.

అథ నస్యవిధిం వక్ష్యే నస్యగ్రహణహేతవే. 47
దేశే వాతరజోముక్తే కృతదంతవిఘర్షణం,
విశుద్ధం ధూమపానేన స్విన్నఫాలగలం తథా. 48
ఉత్తానశాయినం కించిత్ప్రలంబశిరసం నరం,
ఆస్తీర్య హస్తపాదం చ వస్త్రచ్ఛాది చ లోచనమ్. 49
సమున్నమితనాసాగ్రం వైద్యో నస్యేన యోజయేత్,
కోష్ణమచ్ఛిన్నధారం చ హేమతారాదిశుక్తిభిః. 50
శుక్త్యా వా పత్రయుక్త్యా వా ప్లోతైర్వా నస్యమాచరేత్,

నస్యమును సేవించుటకు పూర్వము వాతసంచారము, దుమ్ములేని స్థలమందు దంతధావనము చేసికొని ధూమపానంబుచే శుద్ధుఁడగురోగిని కాళ్లుచేతులు చాచునటుల చేసి వెల్లకిలఁ బఱుండఁబెట్టి మెడక్రింద దిండునుంచి శిరంబును కొంచెము వంగునటులఁజేసి గుడ్డతో నేత్రములను మూసి ముక్కును పైకియెత్తి బంగారుదొప్పతోగాని, వెండిదొప్పతోగాని, గవ్వతోగాని సుఖోష్ణంబుగ ఏకధారగా నస్యపదార్థమును బోయవలెను.

నస్యకర్మానంతరము అనుష్ఠింపఁదగిన విధి.

నస్యే ష్వాసిచ్యమానేషు శిరో నైవ ప్రకంపయేత్. 51
న కుప్యేన్న ప్రభాషేత నోచ్ఛిదేన్న హసేత్తదా,
ఏతర్హి విహితస్నేహో నైవాంతస్సంప్రపద్యతే. 52
తతః కాసప్రతిశ్యాయశిరోఽక్షిగదసమ్భవః,

నాసికయందు నస్యద్రవ్యమును పోయుఁనపుడు శిరఃకంపము, కోపము, సంభాషణము, దంతములతో కొఱుకుట, నవ్వుట వీనిని వర్జింపవలెను. అట్లు వర్జింపకుండెనేని యాస్నేహము శిరంబున ప్రవేశింపక దగ్గు, పడిసెము, శిరస్సునందుపోటు, నేత్రములయందుబాధ వీనిని గల్గించును.

నస్యధారణప్రకరణము.

శృంగాటకమభిప్లావ్య స్థాపయేన్న గిలేద్ద్రవమ్. 53
పంచసప్తదశైవ స్యుర్మాత్రా నస్యస్య ధారణే,
ఉపవిశ్యాథ నిష్ఠీవేన్నాసావక్త్రాగతం ద్రవమ్. 54
వామదక్షిణపార్శ్వాభ్యాం నిష్ఠీవేత్సముఖేన హి,

అట్లు చేయఁబడిన స్నేహము నాసారంధ్రములగుండ శృంగాటకమును మర్మస్థానంబునఁజేరును. పిమ్మట నాస్నేహమును అట్లనే ఐదుగాని, ఏడుగాని, పదిగాని మాత్రల కాలమువఱకు నుంచి పిమ్మట లేచి కూర్చుండి నాసారంధ్రములు, ముఖము వీనిగుండా స్రవించు ద్రవమును ఎడమపార్శ్వమునుండిగాని, కుడిపార్శ్వమునుండిగాని ఉమియవలెను. ఎదుటిముఖమున నుమియరాదు.

నస్యకర్మానంతరము వర్జింపఁదగినకార్యములు.

నస్యే నీతే మనస్తాపం రజః క్రోధం చ సంత్యజేత్. 55
శయీత నిద్రాం త్యక్త్వా చ ఉత్తానోఽవాక్ఛతం నరః,
తథా వై రేచనస్యాంతే ధూమో వా కవలో హితః. 56

నస్యకర్మ జేయించుకొనిన పిదప మనస్సునకు సంతాపమును గలుగఁజేసికొనుట, దుమ్ముగలస్థలమున కూర్చుండుట, కోపించుట వీని త్యజింపవలెను. మఱియుఁ నూరుమాటల కాలమువఱకు నిద్రింపక వెల్లకిల బరుండవలెను. విరేచనస్యాంతమున ధూమపానముగాని, కబలముగాని గ్రహించుట యుత్తమంబు.

నస్యస్థానమున శుద్ధ్యాదిభేదములు.

నస్యే త్రీణ్యుపదిష్టాని లక్షణాని సమాసతః,
శుద్ధిహీనాతియోగాని విశేషాచ్ఛాస్త్రచింతకైః. 57

నస్యకర్మమునందు శుద్ధిలక్షణము, హీనయోగలక్షణము, అతియోగలక్షణము అన త్రివిధలక్షణంబులు గలవు.

ఉత్తమశుద్ధిలక్షణము.

లాఘవం మనసశ్శుద్ధిస్స్రోతసాం వ్యాధిసంక్షయః,
చిత్తేన్ద్రియప్రసాదశ్చ శిరసశ్శుద్ధిలక్షణమ్. 58

శరీరము లఘువుగనుండుట స్రోతోమార్గములు శుద్ధినొందుట, మనశ్శుద్ధి,రోగము నశించుట, ఇంద్రియములకు పాటవము ఇవి శుద్ధిలక్షణంబులు.

హీనశుద్ధిలక్షణము.

కండూపదేహౌ గురుతా స్రోతసాం కఫసంస్రవః,
మూర్ధ్ని హీనవిశుద్ధే తు లక్షణం పరికీర్తితమ్. 59

శిరంబునందు కొంచెము శుద్ధిగాన్పించుట శరీరమున దురద, జిగట, జడత్వము, ముఖమునుండియు ముక్కునుండియు కఫముస్రవించుట ఇవి హీనయోగలక్షణములు.

అతిశుద్ధిలక్షణము.

మస్తులుంగాగమో వాతవృద్ధిరింద్రియవిభ్రమః,
శూన్యతా శిరసశ్చాపి మూర్ధ్ని గాఢం విరేచితే. 60

నాసికాదులనుండి ద్రవము స్రవించుట, వాతవృద్ధి, ఇంద్రియవిభ్రమము, శిరశ్శూన్యత్వము ఇయ్యవి అతిశుద్ధలక్షణంబులు.

హీనశుద్ధ్యాదులయందు చికిత్స.

హీనాతిశుద్ధే శిరసి కఫవాతఘ్నమాచరేత్,
సమ్యగ్విశుద్ధే శిరసి సర్పిర్నస్యం నిషేచయేత్. 61

హీనశుద్ధియందును, అతిశుద్ధియందును, మరల కఫవాతహరమగు నస్యమును చేయందగును. సమ్యక్శుద్ధియందు నేతితో నస్యము చేయందగును.

అతిస్నిగ్ధలక్షణము.

కఫః ప్రసేకశ్శిరసో గురుతేంద్రియవిభ్రమః,
లక్షణం తదతిస్నిగ్ధే రూక్షం తత్ర ప్రదాపయేత్. 62

నస్యకర్మచేత శిరస్సునందు అతిస్నిగ్ధతగల్గెనేని కఫస్రావము, శిరోజాడ్యము, ఇంద్రియభ్రమ గల్గును. అపుడు రూక్షపదార్థములచే నస్యము చేయందగును.

నస్యస్థానమందు పథ్యము.

భోజయేచ్చానభిష్యంది నస్యాచారికమాదిశేత్,

నస్యకర్మ యందు శిష్టాచారము నవలంబించి పథ్యమును చేయందగును. గురు పదార్థములను త్యజింపవలెను.

పంచకర్మసంఖ్య.

వమనం రేచనం నస్యం నిరూహమనువాసనమ్. 63
ఏతాని పంచకర్మాణి కథితాని మునీశ్వరైః.

ఇతి శ్రీదామోదరసూను శార్ఙ్గధరేణ విరచితాయాం సంహితాయాం
ఉత్తరఖండే చికిత్సాస్థానే నస్యవిధికథనంనామ
అష్టమోఽధ్యాయః.

వమనము, రేచనము, నస్యము, నిరూహవస్తి, అనువాసనము ఇయ్యవి పంచకర్మలనంబడును.

ఇది శ్రీదామోదరసూను శార్ఙ్గధరవిరచితసంహితయందు ఉత్తరఖండమున
చికిత్సాస్థానమున నస్యవిధికథన మనియెడు
అష్టమాధ్యాయము సంపూర్ణము.

---

# నవమాధ్యాయము.

ధూమపానవిధి.

ధూమస్తు షడ్విధః ప్రోక్తశ్శమనో బృంహణస్తథా,
రేచనం కాసహా చైవ వామనో వ్రణధూపనః. 1

శమనము, బృంహణము, రేచనము, కాసహము, వామనము, వ్రణధూపనము అను భేదంబులచే ధూమపానములు ఆఱువిధంబులు.

శమనాదిపర్యాయశబ్దములు.

శమనస్య తు పర్యాయా మధ్యప్రాయోగికస్తథా,
బృంహణస్యాపి పర్యాయా స్నేహనో మృదురేవ చ. 2
రేచనస్యాపి పర్యాయా శోధనస్తీక్ష్ణ ఏవ చ,

శమనధూమము మధ్యమనియు, ప్రాయోగికంబనియు పర్యాయములచే చెప్పంబడును. బృంహణధూమపానము స్నేహనంబనియు, మృదువనియు పర్యాయంబులచే

చెప్పఁబడును. రేచనధూమపానంబు శోధనంబనియు, తీక్ష్ణంబనియు, పర్యాయంబులచే చెప్పఁబడును.

ధూమపానమున కనర్హులు.

అధూమార్హాశ్చ ఖల్వేతే శ్రాంతో భీరుశ్చ దుఃఖితః. 3
దత్తవస్తి ర్విరిక్తశ్చ రాత్రౌ జాగరిత స్తథా,
పిపాసితశ్చ దాహార్తస్తాలుశోషీ తథోదరీ. 4
శిరోఽభితాపీ తిమిరీ ఛర్ద్యాధ్మానప్రపీడితః,
క్షతోరస్కః ప్రమేహార్తః పాండురోగీ చ గర్భిణీ. 5
రూక్షః క్షీణోఽభ్యవహృతః క్షీరక్షౌద్రఘృతాసవః,
భుక్తాన్నదధిమత్స్యశ్చ బాలో వృద్ధః కృశ స్తథా. 6
అకాలే చాతిపీతశ్చ ధూమః కుర్యాదుపద్రవాన్,

శ్రమఁజెందినవాఁడు, భయపడినవాఁడు, దుఃఖముగలవాఁడు, వస్తికర్మచేయఁబడినవాఁడు, రేచనకర్మచేయఁబడినవాఁడు, రాత్రి మేల్కొనినవాఁడు, దప్పిగొన్నవాఁడు, దాహముగలవాఁడు, తాలుశోషముగలవాఁడు, ఉదరరోగి, శిరస్తాపము, తిమిరరోగము, వాంతి, ఆధ్మానము, ఉరఃక్షతము, ప్రమేహము, పాండువు, గర్భిణి, రౌక్ష్యము, క్షైణ్యము, ఇవిగలవారు పాలు, తేనె, నేయి, ఆసవము, అన్నము, పెరుగు, మత్స్యములు వీనిని భుజించినవారు, బాలురు, వృద్ధులు, కృశులు వీరలు ధూమపానంబున కనర్హులు. మఱియు అకాలంబునగాని, అధికముగఁగాని ధూమపానంబుచేసిన నయ్యది ఉపద్రవములను గల్గించును.

ధూమపానముచేఁగలుగు ఉపద్రవములకు ప్రతీకారము.

తత్రేష్టం సర్పిషః పానం నావనాంజనతర్పణమ్. 7
సర్పిరిక్షురసం ద్రాక్షాం పయో వా శర్కరాంబు వా,
మధురామ్లౌ రసౌ వాపి శమనాయ ప్రదాపయేత్. 8

అట్టియుపద్రవములు గల్గెనేని నేతిని విశేషముగ త్రాగించినగాని నాసికయందు వేసినగాని నేత్రములం దంజనముచేసినగాని, శరీరమునకు తర్పణముచేయించినఁగాని, నేయి, చెఱకురసము, ద్రాక్ష, పాలు, చక్కెర, నీరు వీనిని త్రాగించినఁగాని, మధురరసమును, అమ్లరసమును సేవించినఁగాని యాయుపద్రవములు నశించును.

ధూమసేవన కర్హమగుకాలము.

ధూమశ్చ ద్వాదశాదర్వాగ్గ్రాహ్యాతేశీతికాన్న చ,
కాసశ్వాసప్రతిశ్యాయా న్మన్యాహనుశిరోరుజః. 9
వాతశ్లేష్మవికారాంశ్చ హన్యాద్ధూమస్సుయోజితః,

ఇట్టి ధూమపానంబు పదిరెండు వత్సరంబులు మొదలు ఎనుబదివత్సరంబులు వఱకు సేవింపందగును. ఈ ధూమపానంబుచేత కాసము, శ్వాసము, పడిసెము, మన్యాస్తంభము, హనుస్తంభము, శిరఃపీడ, వాతదోషము, శ్లేష్మదోషము నశించును.

ధూమపానముచేఁ గలుగుగుణములు.

ధూమోపయోగాత్పురుషః ప్రసన్నేంద్రియవాఙ్మనాః. 10
దృఢకేశద్విజశ్మశ్రు స్సుగంధవదనో భవేత్,

ధూమపానంబు చేయుటచేత ఇంద్రియములకును, వాక్కునకును, మనంబునకును ప్రసన్నత గల్గును. వెండ్రుకలు, దంతములు, గడ్డము ఇవి దృఢముగనుండును. ముఖము సువాసన గల్గియుండును.

ధూమప్రయోగమున నాడీవిధానము.

ధూమనాడీ భవేత్తత్ర త్రిఖండా చ త్రిపర్వికా. 11
కనిష్ఠికా పరీణాహా రాజమాషాగమాంతరా,
ధూమనాడీ భవేద్దీర్ఘా శమనే రోగిణోఽంగులైః. 12
చత్వారింశన్మితైస్తద్వద్ద్వాత్రింశద్భిర్మృదౌ స్మృతా,
తీక్ష్ణే చతుర్వింశతిభిః కాసఘ్నే షోడశోన్మితైః. 13
దశాంగులిర్వామనీయే తథా స్యాద్వ్రణనాడికా,
కలాయమండలస్థూలా కులిత్థాగమరంధ్రకా. 14

ధూమపానార్థంబగు నాడిగొట్టము మూఁడుఖండములుగల్గి, మూఁడుకణుపులు గల్గి చిటికెనవ్రేలంత లావుగల్గి బొబ్బరగింజ దూఱునంత ఛిద్రము గల్గియుండవలెను. ఇయ్యది సామాన్యలక్షణంబు. శమన ధూమపానంబున కర్హంబగుగొట్టము రోగియొక్క నలుబది అంగుళములు పొడవుగల్గి యుండవలెను. మృదుధూమపానంబున ముప్పదిరెండు అంగుళములు పొడవుగ నుండవలెను. తీక్ష్ణ ధూమపానంబున నిఱువదినాల్గు అంగుళముల పొడవుగ నుండవలెను. కాసఘ్న ధూమపానంబున పదునాఱు అంగుళములును, వామనధూమపానంబున పదియంగుళముల పొడవుగలదిగను నుండవలెను. వ్రణధూమనాడి పదియంగుళముల పొడవుగల్గి చిఱుసెనగయంత లావుగల్గి ఉలవగింజ పట్టునంత రంధ్రముగల్గి యుండవలెను.

ధూమపానోపయుక్తవర్తివిధానము.

అథేషికాం ప్రలింపేచ్ఛ సుశ్లక్ష్ణాం ద్వాదశాంగులాం,
ధూమద్రవ్యస్య కల్కేన లేపశ్చాష్టాంగులస్మృతః. 15
కల్కం కర్షమితం లిప్త్వా చ్ఛాయయా శుష్కం చ కారయేత్;

ఈషికామపనీయాథ స్నేహాక్తాం వర్తిమాదరాత్. 16
అంగారైర్దీపితాం కృత్వా ధృత్వా నేత్రస్య రంధ్రకే,
వదనేన పిబేద్ధూమం వసనేనైవ సంత్యజేత్. 17
నాసికాభ్యాం తతః పీత్వా ముఖేనైవ వమేత్సుధీః,
శరావసంపుటే క్షిప్త్వా కల్కమంగారదీపితమ్. 18
ఛిద్రే నేత్రం నివేశ్యాథ వ్రణం తేనైవ ధూపయేత్,

పదిరెండంగుళముల పొడవుగల్గి నున్నగ నుండెడి పుడకను గ్రహించి ధూమపానార్థంబగు ద్రవ్యములను కల్కము చేసి యాకర్ష ప్రమాణముగల కల్కమును నాపుడకకు ఎనిమిదియంగుళములవఱకు లేపనంబుచేసి దానిని నీడనెండించి పిమ్మట నాపుడకను మెల్లగా లాగివైచి యావర్తిని స్నేహంబునఁ దడపి దానియగ్రభాగంబున నిప్పుతోనంటించి గొట్టములోతగిలించి యందుండివచ్చు ధూమమును నోటితోడనేగ్రహించి నోటితోడనే విడువవలయును. పిమ్మట నాసికతోఁ బీల్చి నోటితో విడువవలెను. మఱియు శరావంబునకు రంధ్రముచేసి యందు అగ్ని వేసి దానిపైన ధూమద్రవ్యకల్కమును వేసి యారంధ్రమునం దొకగొట్టమును తగిలించి దానిగుండా ధూమమును వ్రణములకు వేయందగును.

### ధూమపానోపయుక్త కల్కద్రవ్యములు.

ఏలాదికల్కం శమనే స్నిగ్ధం సర్జరసం మృదౌ. 19
రేచనే తీక్ష్ణకల్కం చ కాసఘ్నే క్షుద్రికోషణం,
వామనే స్నాయుచర్మాద్యం దద్యాద్ధూమస్య పానకమ్. 20
వ్రణే నింబవచాద్యం చ ధూపనం సంప్రశస్యతే,

శమనధూమంబున ఏలాదిగణద్రవ్యకల్కమును, బృంహణధూమంబున స్నిగ్ధంబగు సర్జరసమును, రేచనధూమంబున, తీక్ష్ణౌషధకల్కంబును, కాసఘ్నధూమంబున చిన్నములక, మిరియములు మొదలగువాని కల్కమును, వామనధూమంబున స్నాయువులు, చర్మము మొదలగువాని కల్కమును, వ్రణధూమంబున వేప, వస మొదలగువాని కల్కమును ప్రయోగింపందగును.

### బాలగ్రహాదిరోగహరణధూపము.

అన్యేఽపి ధూమా గేహేషు కర్తవ్యా రోగశాంతయే. 21
మయూరపింఛం నింబస్య పత్రాణి బృహతీఫలం,
మరిచం హింగుమాంసీచ బీజం కార్పాససంభవమ్. 22
ఛాగరోమాహినిర్మోకం విష్ఠా బైడాలికీ తథా,

గజదంతశ్చ తచ్చూర్ణం కించిద్ఘృతవిమిశ్రితమ్. 23
గేహేషు ధూపనం దత్తం సర్వాన్బాలగ్రహాన్ జయేత్,
పిశాచాన్ రాక్షసాన్ జిత్వా సర్వజ్వరహరం భవేత్. 24

సెమిలిఔక్కలు, వేపయాకు, మలకపండు, మిరియము, ఇంగువ, జటామాంసి, ప్రత్తివిత్తులు, గొఱ్ఱెపెంటికలు, పాముకుబుసము, పిల్లిపెంటికలు, ఏనుఁగుదంతము వీనిని చూర్ణముచేసి యందు కొంచెము నేయిగలిపి బాలగ్రహాదిరోగశాంతినిమిత్తము గృహంబున ధూమము ప్రయోగింపవలెను. ఇందుచే పిశాచ, యక్ష, రాక్షసాది క్రూరగ్రహములు, సర్వజ్వరములు నశించును.

ధూమస్థానమందు పరిహారము.

పరిహారస్తు ధూమేషు కార్యో రేచననస్యవత్,
నేత్రాణి ధాతుజాన్యాహుర్నలవంశాదిజాన్యపి. 25

ఇతి శ్రీదామోదరసూనుశార్ఙ్గధరేణ విరచితాయాం సంహితాయాం
చికిత్సాస్థానే ఉత్తరఖండే ధూమపానవిధికథనంనామ
నవమోఽధ్యాయః.

నస్యవిధింజెప్పిన యధ్యాయంబున రేచననస్యంబున నెయ్యవి యపథ్యంబులని చెప్పఁబడెనో వానిని యీధూమపానంబున విసర్జింపవలయును. మఱియు నీగొట్టపు నోఁటను సువర్ణాది ధాతువులతోగాని, రెల్లు, వెదుఱు వీనితోఁగాని నిర్మింపవలెను.

ఇది శ్రీదామోదరసూను శార్ఙ్గధరవిరచితసంహితయందు చికిత్సాస్థానమను
ఉత్తరఖండమున ధూమపానవిధికథనమను నవమాధ్యాయము
సంపూర్ణము.

---

# దశమాధ్యాయము.

గండూషభేదములు.

చతుర్విధస్స్యాద్గండూషస్స్నైహికశ్శమనస్తథా,
శోధనో రోపణశ్చైవ కవలశ్చాపి తద్విధః. 1

గండూషము, స్నైహికము, శమనము, శోధనము, రోపణము అను నాల్గువిధంబుల విభజింపఁబడియున్నది. మఱియు కబళముగూడ పూర్వభేదంబులచే నాల్గువిధంబులు.

### స్నైహికాదిగండూషలక్షణాదులు.

స్నిగ్ధోష్ణైస్స్నైహికో వాతే స్వాదుశీతైః ప్రసాదనః,
పిత్తే కట్వమ్లలవణైరుష్ణైస్సంశోధనః కఫే. 2

కషాయతిక్తమధురైః కటూష్ణో రోపణో వ్రణే,
చతుః ప్రకారో గండూషః కవలశ్చాపి కీర్తితః. 3

వాతప్రకోపంబున స్నిగ్ధోష్ణద్రవ్యములచే సిద్ధముచేయఁబడిన స్నైహికగండూషమును, పిత్తరోగంబులందు, మధుర, శీతలపదార్థములచే నిర్మింపఁబడి ప్రసాద మనుపర్యాయంబుచే నొప్పారు శమనగండూషంబును, కటు, అమ్ల, లవణ రసంబులుగల్గి యుష్ణవీర్యంబులగు పదార్థములచే నిర్మింపఁబడిన శోధనగండూషమును కఫరోగంబులందును, కషాయతిక్త, మధురపదార్థములచే నిర్మింపఁబడి కటూష్ణంబగు రోపణగండూషమును వ్రణములందును ప్రయోగింపందగును.

### గండూషకవళములలక్షణము.

అసంచారీ ముఖే పూర్ణే గండూషః కవలశ్చరః,
తత్ర ద్రవేణ గండూషః కల్కేన కవలస్మృతః. 4

ద్రవపదార్థములను నోటినిండఁ బోసికొని ఉమియుంట గండూష మనంబడును. కల్కాదులను నోటిలో వేసికొని నమలి యుమియుంట కబల మనంబడును.

### గండూషాదుల మానప్రమాణము.

దద్యాద్ద్రవేషు చూర్ణం చ గండూషే కోలమాత్రకం,
కర్షప్రమాణః కల్కశ్చ దీయతే కవళే బుధైః. 5

ద్రవద్రవ్యములచే నిర్మింపఁబడిన గండూషమునందు చూర్ణమును కోలప్రమాణంబుగా వేయందగును. కబలంబున కల్కంబును కర్షప్రమాణంబుగా ప్రయోగింపందగును.

### గండూషమున కర్హమగుకాలము.

ధార్యంతే పంచమాద్వర్షాద్గండూషకవలాదయః,
గండూషాన్ సుస్థితః కుర్యాత్స్విన్నఫాలగలాదికః. 6
మనుష్యస్త్రీంస్తథా పంచ సప్త వా దోషనాశనా,

గండూషము, కబలము వీనిని యైదువత్సరంబులకు పిదప స్వస్థచిత్తులై రోగశాంతి నిమిత్తము స్వేదయుక్తంబులగు ఫాలము, కంఠము, ముఖము మొదలగునవి కలవాఁడై

మూడుగాని, యైదుగాని, ఏడుగాని గండూషములను చేయందగును. అథవా దోషము హరించువఱకు చేయందగును.

### గండూషధారణకాలము.

కఫపూర్ణాస్యతా యావచ్ఛేదో దోషస్య వా భవేత్. 7
నేత్ర ఘ్రాణ స్రుతిర్యావత్తావద్గండూషధారణం,

కఫము నోటినుండి స్రవించువఱకుగాని, దోషములు నశించువఱకుఁగాని, నేత్రములు, ముక్కు వీనినుండి స్రావముగల్గువఱకుగాని గండూషము చేయందగును.

### వాతరోగమునకు స్నైహికగండూషము.

తిలకల్కోదకం క్షీరం స్నేహో వా స్నైహికే హితః. 8

నువ్వులకల్కము, పాలు, నూనె మొదలగువానిని స్నైహిక గండూషంబున ప్రయోగింపం దగును.

### పిత్తరోగమునకు శమనసంజ్ఞికగండూషము.

తిలానీలోత్పలం సర్పిశ్శర్కరాక్షీరమేవ చ,
సక్షౌద్రో హనువక్త్రస్థో గండూషో దాహనాశనః. 9

నువ్వులు, నల్లకలువలు, నేయి, చక్కెర, పాలు వీనియందు తేనె గలిపి గండూషము చేయించిన చెక్కిళ్లు, ముఖము వీనియందుగల తాపము హరించును.

### వ్రణాదులకు మధుగండూషము.

వైశద్యం జనయత్యాస్యే సందధాతి ముఖవ్రణాన్,
దాహతృష్ణాప్రశమనం మధుగండూషధారణమ్. 10

తేనెను గండూషముచేసిన నోటియందలి వ్రణములు, తాపము, దప్పి నశించును. మఱియు ముఖమునకు స్వచ్ఛతను గల్గించును.

### విషాదులకు గండూషము.

విషక్షారాగ్నిదగ్ధే చ సర్పిర్ధార్యం పయోఽథవా,

నేతినిగాని, పాలనుగాని గండూషము చేసిన విషదోషము, క్షారాగ్ని దగ్ధవికారములు నశించును.

### దంతచలనమునకు గండూషము.

తైలసైంధవగండూషో దంతచాలే ప్రశస్యతే. 11

నువ్వులనూనెయందు సైంధవలవణమువేసి గండూషముచేసిన కదలుచున్నదంతము శిగిఁబాఱును.

### ముఖశోషకు గండూషము.

శోషం ముఖస్య వైరస్యం గండూషః కాంజికో జయేత్,

కాంజికము గండూషము చేసినయెడల ముఖశోషము, ముఖవైరస్యము నశించును.

### కఫమునకు గండూషము.

సింధుత్రికటురాజీభి రార్ద్రికేణ కఫే హితః. 12

అల్లపురసమునందు సైంధవలవణము, త్రికటుకము, ఆవాలు వీని చూర్ణము కలిపి గండూషముచేసిన కఫప్రకోపము నశించును.

### కఫము, రక్తపిత్తము వీనికి గండూషము.

త్రిఫలామధుగండూషః కఫాసృక్పిత్తనాశనః,

త్రిఫలచూర్ణంబు తేనెనుగలిపి గండూషముచేసిన కఫము, రక్తపిత్తము నశించును.

### ముఖపాకమునకు గండూషము.

దార్వీ గుడూచీ త్రిఫలా ద్రాక్షా జాత్యాశ్చ పల్లవాః. 13
యవాసశ్చేతి తత్క్వాథష్షష్ఠాంశః క్షౌద్రసంయుతః,
శీతో ముఖేధృతో హన్యాన్ముఖపాకం త్రిదోషజమ్. 14

మ్రానుపసుపు, తిప్పతీఁగ, త్రిఫలములు, ద్రాక్షపండు, జాజిచిగుళ్లు, దురదగొండి వీనిని సమభాగంబులుగ కషాయంబుగాచి దానిలో నాఱవపాలు తేనెవైచి గండూషము చేసిన త్రిదోషోద్భవంబగు ముఖపాకంబు నశించును.

### గండూషమునకు నామాంతరము.

యస్యౌషధస్య గండూషస్తథైవ ప్రతిసారణం,
కవలశ్చాపి తస్యైవ జ్ఞేయోఽత్ర కుశలైర్నరైః. 15

గండూషముచేయు నౌషధముల నిర్మాణముచే ప్రతిసారణం బనంబడును. ఆ ద్రవ్యములనే కల్కముగాఁజేసిన నయ్యది కబలమనంబడును.

### కబళవిధి.

కేసరం మాతులుంగస్య సైంధవవ్యోషసంయుతం,
హన్యాత్కవలతో జాడ్యమరుచిం కఫవాతజామ్. 16

మాదీఫలములోని కేసరములు, సైంధవలవణము, త్రికటుకములు వీని కల్కము గావించి ముఖంబున ధరియించిన కఫవాతములచే జనించిన అరోచకము హరించును.

### ప్రతిసారణభేదము.

కల్కోఽవలేహశ్చూర్ణం చ త్రివిధం ప్రతిసారణం,

అంగుళ్యగ్రగృహీతం చ యథాస్వం ముఖరోగిణామ్. 17

కల్క, అవలేహ, చూర్ణంబులన ప్రతిసారము త్రివిధంబు. వీనిని రోగభేదంబుచే తగినంతమాత్రను వ్రేలికొనతోఁ గ్రహించి నాలుకకుగాని, ముఖమునకుగాని వ్రాయందగును.

### ప్రతిసారణచూర్ణము.

కుష్ఠం దార్వీసమంగా చ పాఠా తిక్తా చ పీతికా,
తేజనీముస్తలోధ్రం చ చూర్ణం స్యాత్ప్రతిసారణమ్. 18
రక్తస్రుతిం దంతపీడాం శోఫం దాహం చ నాశయేత్,

చెంగల్వకోష్టు, మ్రానుపసుపు, మంజిష్ఠ, విషబొద్ది, కటుకరోహిణి, పసుపు, చాగ, తుంగముస్తలు, లొద్దుగ వీనిని చూర్ణముగావించి నాలుకయందుగాని, ముఖమునందంతటనుగాని లేపనముచేసినయెడల దంతములనుండి రక్తముగాఱుట, దంతశూల, వాపు, తాపము నశించును.

### గండూషాదిహీనాదియోగముచేఁ గలుగులక్షణములు.

హీనయోగాత్కఫోత్క్లేశో రసాజ్ఞానారుచి స్తథా. 19
అతియోగాన్ముఖే పాకశ్శోష స్తృష్ణాక్లమో భవేత్,

గండూషములయొక్క హీనయోగంబుచే కఫాధిక్యము, రసాదులను తెలియకుండుట, అరుచి గలుగును. అతియోగముచేత ముఖపాకము, శోష, దప్పి, బడలిక గలుగును.

### శుద్ధగండూషలక్షణము.

వ్యాధేరపచయస్తుష్టిర్వైశద్యం వక్త్రలాఘవమ్. 20
ఇంద్రియాణాం ప్రసాదశ్చ గండూషే శుద్ధిలక్షణం,

ఇతి శ్రీదామోదరసూను శార్ఙ్గధరేణ విరచితాయాం సంహితాయాం ఉత్తరఖండే చికిత్సాస్థానే గండూషాదివిధికథనంనామ దశమోఽధ్యాయః.

గండూష ప్రయోగంబులచేత వ్యాధినాశము, మనంబునకుత్సాహము, ముఖమునకునైర్మల్యము, ఇంద్రియములకు ప్రసన్నత గల్గును.

ఇది శ్రీదామోదరసూను శార్ఙ్గధరవిరచితసంహితయందు చికిత్సాస్థానమునను త్తరఖండమందు గండూషాదివిధికథన మనియెడు దశమాధ్యాయము సంపూర్ణము.

# ఏకాదశాధ్యాయము.

## లేపనాదివిధి.

ఆలేపస్య చ నామాని లిప్తిర్లేపశ్చ లేపనం,
దోషఘ్నో విషహా వర్ణ్యో ముఖలేపస్త్రిధా మతః. 1
త్రిప్రమాణశ్చతుర్భాగస్త్రిభాగోఽర్ధాంగులోన్నతః,
ఆర్ద్రో వ్యాధిహరస్సస్యాచ్ఛుష్కో దూషయతి చ్ఛవిమ్. 2

ఆయాకార్యములకు నుపయోగించులేపనము లిప్తి, లేప, శబ్దములచే వ్యవహరింపఁబడును. అట్టిలేపనము దోషఘ్నమనియు, విషఘ్నమనియు, వర్ణ్యమనియుం త్రివిధంబు. అందొకయంగుళము ఎత్తువఱకు వేయఁబడిన లేపనము దోషఘ్నమనియు, ముక్కాలు అంగుళమువఱకు వేయులేపనము విషఘ్నమనియుం, అర్ధాంగుళము యెత్తువఱకు వేయులేపనము వర్ణ్యముఅనియుం చెప్పఁబడును. అందు తడిగానుండిన లేపనము రోగమును హరించును. శుష్కంబైన (ఎండిన) లేపనము శరీరముయొక్క కాంతిని బోనణచును.

## దోషఘ్నలేపనము.

పునర్నవాం దారుశుంఠీం సిద్ధార్థం శిగ్రుమేవ చ,
పిష్ట్వా చైవారనాలేన ప్రలేపస్సర్వశోఫహా. 3

తెల్లగలిజేరు, దేవదారు, శొంఠి, తెల్లఆవాలు, మునగపట్ట వీనిని సమభాగంబులు కాంజికముతో నూరి లేపనముచేసిన వాపు నశించును. ఇయ్యది దోషఘ్నలేపన మనంబడును.

## తాపము హరించుటకై లేపనము.

విభీతఫలమజ్జస్తు లేపో దాహార్తినాశనః,

తానికాయలలోని విత్తులను నూరి లేపనముచేసిన తాపము హరించును.

## దశాంగలేపనము.

శిరీషం మధుయష్టీ చ తగరం రక్తచందనమ్. 4
ఏలామాంసీనిశాయుగ్మం కుష్ఠం వాలకమేవ చ,
ఇతి సంచూర్ణ్య లేపోఽయం షట్చమాంశఘృతప్లుతః. 5
జలేన క్రియతే సుజ్ఞైర్దశాంగ ఇతి సంజ్ఞితః,
విసర్పాన్విషవిస్ఫోటాంశ్శోథఘ్నా దుష్టవ్రణాన్జయేత్. 6

దిరిసెనవిత్తులు, యష్టిమధుకము, గ్రంథితగరము, రక్తచందనము, ఏలకులు, జటామాంసి, పసుపు, మ్రానిపసుపు, చెంగల్వకోష్టు, కురువేరు వీనిని సమభాగంబులుగ

చూర్ణముగావించి యాచూర్ణమున కైదవభాగము నేయిగలిపి ఖల్వంబున చక్కగా మర్దనజేసి యందుదకముగలిపి లేపనముచేసిన విసర్పము, విస్ఫోటము, విషదోషము, వాపు, వ్రణము నశించును. ఇయ్యది దశాంగలేప మనంబడును.

విషఘ్న లేపనము.

అజాదుగ్ధతిలైర్లేపో నవనీతేన సంయుతః,
శోఫమారుష్కరం హన్తి లేపోవా కృష్ణమృత్తిలైః. 7

నువ్వులను మేకపాలతో నూరి యందు వెన్నగలిపి యాలేపనంబుచేగాని, నువ్వులను నల్లమంటితో నూరి యాలేపనంబునుగాని జేసిన నల్లజీడివిత్తులనుండి యుద్భవించిన వాపు నశించును.

అన్యచ్చ — లాంగల్యతివిషాలాబు జాలినీబీజమూలకైః,
లేపో ధాన్యాంబుసంపిష్టః కీటవిస్ఫోటనాశనః. 8

తఱిగొట్టు, అతివస, చేదుసొరకాయవిత్తులు, ముల్లంగివిత్తులు వీనిని సమభాగంబులుగ గంజితోనూరి లేపనముఁజేసిన పురుగులతో గూడిన విస్ఫోటము నశించును.

ముఖకాంతికి లేపనము.

రక్తచందన మంజిష్ఠా లోధ్ర కుష్ఠప్రియంగవః,
వటాంకురామసూరాశ్చ వ్యంగఘ్నా ముఖకాంతిదాః. 9

రక్తచందనము, మంజిష్ఠ, లొద్దుగచెక్క, చెంగల్వకోష్టు, ప్రేంకణము, మఱ్ఱిచిగుళ్లు, చిఱుసెనగలు వీనిని సమభాగంబులుగ నుదకముతో నూరి లేపనముచేసిన మొటిమలు నశించి ముఖమునకు గాంతిగల్గును.

అన్యచ్చ — మాతులుంగజటా సర్పిశ్శిలాగోశకృతో రసః,
ముఖకాంతికరో లేపః పిటికావ్యంగకాలజిత్. 10

మాదీఫలపువేళ్లు, నేయి, మణిశిల, ఆవుపేడరసము వీనిని గలిపి ముఖమునకు లేపనముచేసిన మొటిమలు మచ్చలు నశించి ముఖమునకు కాంతిగల్గును.

మొటిమలకు లేపనము.

లోధ్రధాన్యవచాలేపస్తారుణ్యపిటికాపహః,
తద్వద్గోరోచనాయుక్తం మరీచం ముఖలేపనాత్. 11
సిద్ధార్థకవచాలోధ్రం సైంధవైశ్చ ప్రలేపనం,

లొద్దుగచెక్క, దనియాలు వీనిని ఉదకముతోనూరిగాని, గోరోచనము, మిరియములు వీనిని ఉదకముతోనూరిగాని, తెల్లఆవాలు, వస, లొద్దుగచెక్క, సైంధవలవ

ణము వీనిని ఉదకముతో నూరికాని, ముఖమునకు లేపనముచేసిన యుదానపిటికలు నశించును.

వ్యంగరోగమునకు లేపనము.

వ్యంగేషు చార్జునత్వగ్వా మంజిష్ఠా వాసమాక్షికః. 12
లేపస్స నవనీతో వా శ్వేతాశ్వఖురజామషీ,

అర్జునవృక్షముయొక్కపట్ట చూర్ణంబునఁగాని, మంజిష్ఠాచూర్ణంబునఁగాని తేనె గలిపి లేపనముచేసినను, తెల్లగుఱ్ఱపుడెక్కయొక్క బూడిదెలో నవనీతమునుగలిపి లేపనముజేసినగాని ముఖమందలి మచ్చలు నశించును.

ముఖమున జనించెడిమంగుకు లేపనము.

అర్కక్షీరహారిద్రాభ్యాం మర్దయిత్వా విలేపనాత్. 13
కార్ష్ణ్యం తు శమనం యాతి చిరకాలోద్భవం ధ్రువం,

పసుపును జిల్లేడుపాలతో నూరి లేపనచేసిన చిరకాలంబునుండి ముఖమున జనించియుండు మంగు నశించును.

తారుణ్యపిటికలు మొదలగువానికి లేపనము.

వటస్య పాణ్డుపత్రాణి మాలతీ రక్తచందనమ్. 14
కుష్ఠం కాలీయకం లోధ్రమేభిర్లేపం ప్రయోజయేత్,
తారుణ్యపిటికావ్యంగా నీలికాదివినాశనమ్. 15

పండినమఱ్ఱియాకులు, జాజియాకులు, రక్తచందనము, చెంగల్వకోష్టు, మ్రానిపసుపు, లొద్దుగచెక్క వీనిని నూఱి లేపనముచేసిన ముఖమందలి యౌవానపిటికలు, మచ్చలు, నీలిక మొదలగునవి నశించును.

వ్రణవిశేషరోగములకు లేపనము.

పురాణమథ పిణ్యాకం పురీషం కుక్కుటస్యచ,
మూత్రపిష్టః ప్రలేపోఽయం శీఘ్రం హన్త్యారుంషికామ్. 16

ప్రాతనువ్వులపిండి, కోడిపిష్ఠను వీనిని గోమూత్రముతో నూరి లేపనముచేసిన అరూంషిక యనుక్షుద్రరోగము హరించును.

అన్యచ్చ —ఖదిరారిష్టజంబూనాం త్వగ్భిర్వా మూత్రసంయుతైః,
కుటజత్వక్సైన్ధవం వా లేపో హన్త్యారుంషికామ్. 17

చండ్ర, వేప, నేరేడు వీనిపట్టలను చూర్ణముగావించి గోమూత్రముతో నూఱిగాని, కొడిసెపాలపట్ట, సైంధవలవణము వీనిని గోమూత్రముతోగాని లేపనముచేసిన అరూంషిక నశించును.

దారుణరోగమునకు లేపనము.

ప్రియాలుబీజమధుకకుష్ఠమాషైస్ససైంధవైః,
కార్యో దారుణకే మూర్ధ్ని ప్రలేపో మధుసంయుతః. 18

చారపప్పు, అతిమధురము, చెంగల్వకోష్టు, మినుములు, సైంధవలవణము వీనిని సమభాగంబులుగ నూరి తేనెతో గలిపి లేపనము చేసిన శిరస్సునందలి విదారుణరోగము నశించును.

అన్యచ్చ—దుగ్ధేన ఖాఖసంబీజం ప్రలేపాద్దారుణం జయేత్,
ఆమ్రబీజస్య చూర్ణం తు శివాచూర్ణం సమం ద్వయమ్. 19
దుగ్ధపిష్టః ప్రలేపోఽయం దారుణం హన్తి దారుణం,

గసగసాలనుగాని, మామిడివిత్తులు, కరకపిందెలు వీనినిగాని చూర్ణముగావించి పాలతో నూఱి లేపనముచేసిన దారుణరోగము హరించును.

ఇంద్రలుప్తమునకు లేపనము.

రసస్త్రిక్తపటోలస్య పత్త్రాణాం తద్విలేపనాత్. 20
ఇంద్రలుప్తం శమం యాతి త్రిభిరేవ దినైర్ధ్రువం,

చేదుపొట్లయాకురసమును శిరస్సునకు లేపనము జేసిన ఇంద్రలుప్తము నశించును.

అన్యచ్చ—ఇంద్రలుప్తాపహో లేపో మధునా బృహతీరసః. 21
గుంజామూలం ఫలం వాపి భల్లాతకరసోఽపి వా,

చిన్నములకరసమునుగాని, గురిగింజవేరురసమునుగాని, గురిగింజరసమునుగాని, జీడివిత్తులరసమునుగాని తేనెతోఁగలిపి లేపనముచేసిన ఇంద్రలుప్తము నశించును.

కేశములు వృద్ధిజెందుటకై లేపనము.

గోక్షురస్తిలపుష్పాణి తుల్యేవ మధుసర్పిషీ. 22
శిరః ప్రలేపనం తేన కేశసంవర్ధనం పరం,

పల్లేరు, నువ్వుపువ్వులు వీనిని సమభాగంబులుగ చూర్ణముగావించి వీనికి సమముగ తేనె, నేయి కలిపి లేపనముచేసిన వెండ్రుకలు వృద్ధినొందును.

అన్యచ్చ.—హస్తిదంతమషీం కృత్వా చ్ఛాగీదుగ్ధం రసాంజనమ్. 23
రోమాణ్యనేన జాయంతే లేపాత్పాణితలేష్వపి,

ఏనుగుదంతపుమసి, రసాంజనము వీనిని మేకపాలతో నూరి లేపనముచేసిన నశించిన స్థలమునందు వెండ్రుకలు మరల మొలచును.

ఇంద్రలుప్తమునకు లేపనము.

యష్టీందీవరమృద్వీకాతైలాజ్యక్షీరలేపనైః. 24
ఇంద్రలుప్తశ్శమం యాతి కేశాస్స్యుస్స్నిగ్ధా దృఢాః,

అతిమధురము, నల్లకలువ, ద్రాక్ష వీనిని నువ్వులనూనె, ఆవుపాలు, నేయి వీనితో నూరి లేపనముచేసిన ఇంద్రలుప్తము నశించి కేశములకు దృఢత్వము గల్గును.

వెండ్రుకలు మొలచుటకు రెండవలేపనము.

చతుష్పదానాం త్వగ్రోమనఖశృంగాస్థిభస్మభిః. 25
తైలేన సహ లేపోఽయం రోమసంజననః పరః,

మేక మొదలగుజంతువులయొక్క చర్మము, వెండ్రుకలు, గోళ్లు, ఎముకలు వీనిని కాల్చి భస్మముచేసి యాభస్మమును నువ్వులనూనెలోఁగలిపి లేపనముచేసిన క్రొత్త వెండ్రుకలు మొలచును.

తెల్లవెండ్రుకలు నల్లనగుటకు లేపనము.

ఇంద్రవారుణికాబీజతైలేనాభ్యంగమాచరేత్. 26
ప్రత్యహం తేన జాయంతే కుంతలా భృంగసన్నిభాః,

వెఱ్ఱిపుచ్చకాయవిత్తులనుండి పాతాళయంత్రముచే తైలముతీసి ప్రతిదినము లేపనముచేయుచుండినయెడల తెల్లవెండ్రుకలు నల్లఁబడును.

అన్యచ్చ—అయోరజో భృంగరాజస్త్రిఫలా కృష్ణమృత్తికా. 27
స్థితమిక్షురసే మాసం లేపనాత్పలితం జయేత్,

ఇనుపచూర్ణము, గుంటగలగర, త్రిఫలములు, నల్లబంకమట్టి వీనిని సమభాగంబుగ చూర్ణముచేసి చెఱకురసములోవైచి యొకమాసంబునకు పిమ్మట దానిని లేపనముచేసిన అకాలంబున నరసినవెండ్రుకలు నల్లఁబడును.

అన్యచ్చ—ధాత్రీఫలత్రయం పథ్యే ద్వే తథైకం విభీతకమ్. 28
పంచామ్రమజ్జాలోహస్య కర్షైకం చ ప్రదీయతే,

పిష్ట్వా లోహమయే భాండే స్థాపయేదుషితం నిశి. 29
లేపోఽయం హన్తి న చిరాదకాలపలితం మహత్,

మూఁడు ఉసిరికపండ్లు, రెండు కరక్కాయలు, ఒక తానికాయ, ఐదు మామిడి పప్పులు, ఒకకర్షము లోహచూర్ణము వీనిని ఇనుపపాత్రమునవైచి నూఱి యాపాత్రంబునందే యొకరాత్రియుంచి పిమ్మట లేపనముచేసిన యకాలపలితంబులు హరించును.

అన్యచ్చ.—త్రిఫలా నీలికాపత్రం లోహం భృంగరజస్సమమ్. 30
అజామూత్రేణ సంపిష్టం లేపాత్కృష్ణీకరం స్మృతం,

త్రిఫలములు, నీలియాకు, లోహచూర్ణము గుంటగలగర వీనిని సమభాగంబులుగ మేఁకమూత్రముతో నూరి వెండ్రుకలకు లేపనముచేసిన నయ్యవి నల్లబాఱును.

అన్యచ్చ.—త్రిఫలా లోహచూర్ణం చ దాడిమత్వగ్బిసం తథా. 31
ప్రత్యేకం పంచపలికం చూర్ణం కుర్యాద్విచక్షణః,
భృంగరాజరసస్యాపి ప్రస్థషట్కం ప్రదాపయేత్. 32
క్షిప్త్వా లోహమయే పాత్రే భూమిమధ్యే నిధాపయేత్,
మాసమేకం తతః కుర్యాచ్ఛాగీదుగ్ధేన లేపనమ్. 33
కూర్చే శిరసి రాత్రౌ చ సంవేష్ట్యైరండపత్రకైః,
స్వపేత్ప్రాతస్తతః కుర్యాత్స్నానం తేన చ జాయతే. 34
పలితస్య వినాశశ్చ త్రిభిర్లేపైర్న సంశయః,

త్రిఫలములు, లోహచూర్ణము, దానిమ్మపట్ట, తామరతూండ్లు వీనిని ప్రత్యేకముగా నైదుపలములుగా గ్రహించి చూర్ణముగావించి యినుపపాత్రమునవైచి యందు గుంటగలగర రసమును ఆఱుప్రస్థములుపోసి దానికి సంధిబంధము గావించి యొకమాసంబు వఱకు భూమిలోపాతివైచి పిమ్మటదీసి మేఁకపాలతోఁగలిపి రాత్రియందు శిరంబున లేపనము చేసి శిరంబుపైని ఆముదపుయాకులువైచి గుడ్డఁగట్టి ప్రాతఃకాలంబున స్నానముచేయం దగును. ఇట్లు మూఁడుదినములుచేసిన ఆకాలమున నరసిన వెండ్రుకలు నల్లఁబడును.

### వెండ్రుకల నశింపంజేయుటకై లేపనము.

శంఖచూర్ణస్య భాగౌ ద్వౌ హరితాలశ్చ భాగికః. 35
మనశ్శిలా చార్ధభాగా స్వర్జికా చైకభాగికా,
లేపోఽయం వారిపిష్టస్తు కేశానుత్పాట్య దీయతే. 36
అనయా లేపయుక్త్యా చ సప్తవేలం ప్రయుక్తయా,
నిర్మూలకేశస్థానం స్యాత్క్షపణస్య శిరో యథా. 37

శంఖభస్మము రెండుభాగములు, తాళకము ఒకభాగము, మణిశిల అర్ధభాగము, సర్జక్షారము ఒకభాగము వీనిని ఉదకముతో నూరి వెండ్రుక లుండుస్థలమున నావెండ్రుకల నూడఁబెఱికి యీద్రవ్యమును ఏడుసారులు వ్రాసిన నచ్చట వెండ్రుకలు మొలవకుండును.

అన్యచ్చ.—తాలకం శాణయుగ్మం స్యాత్షట్శాణం శంఖచూర్ణకం,
ద్విశాణికం పలాశస్య క్షారం దత్వా ప్రమర్దయేత్. 38
కదలీదండతోయేన రవిపత్రరసేన వా,
అస్యాపి సప్తభిర్లేపైర్లోమ్నాం శాతనముత్తమమ్. 39

తాళకము రెండు శాణములు, శంఖచూర్ణము ఆఱు శాణములు, మోదుగక్షారము రెండు శాణములు ఇటుల వీనిని అరఁటిమట్టరసముతోనైనను, జిల్లేడు ఆకులరసముతోనైనను నూరి వెండ్రుకలను నశింపఁజేయవలయునపెడి యిచ్ఛగలస్థలమున దీనిని ఏడుమార్లు లేపనముజేసిన నచ్చట మరల వెండ్రుకలు మొలవకయుండు. ఈ లేపనము వెండ్రుకలను నశింపఁజేయుటయందు ఉత్తమమైనదిగ నున్నయది.

## శ్వేతకుష్ఠహర లేపనము.

సువర్ణపుష్పకాసీసవిడంగాని మనశ్శిలా,
రోచనా సైంధవం చైవ లేపనాచ్ఛ్విత్రనాశనమ్. 40

పసుపుజాజి, అన్నభేది, వాయువిళంగములు, మణిశిల, గోరోచనము సైంధవలవణము వీనిని సమభాగంబులుగ గోమూత్రముతో నూరి లేపనముచేసిన శ్విత్ర (బొల్లి) కుష్ఠము హరించును.

అన్యచ్చ.—వాయస్యేడగజాకుష్ఠకృష్ణాభిర్గుటికా కృతా,
బస్తమూత్రేణ సంపిష్టా ప్రలేపాచ్ఛ్విత్రనాశనీ. 41

కామంచి, తగిరిసెవిత్తులు, చెంగల్వకోష్టు, పిప్పళ్లు వీనిని సమభాగంబులుగ మేఁకమూత్రముతో నూఱి లేపనముచేసిన శ్విత్ర కుష్ఠము నశించును.

అన్యచ్చ.—వాకుచీ వేతసో లాక్షా కాకోదుంబరికా కణా,
రసాంజనమయశ్చూర్ణం తిలాః కృష్ణాస్తదేకతః. 42
చూర్ణయిత్వా గవాం పిత్తైః పిష్ట్వా చ గుటికాకృతా,
అస్యాః ప్రలేపాచ్ఛ్విత్రాణి ప్రణశ్యంత్యతివేగతః. 43

భావంచివిత్తులు, అమ్లవేతసము, లక్క, బ్రహ్మమేడి, పిప్పళ్లు, రసాంజనము, లోహచూర్ణము, నల్లనువ్వులు వీనిని సమభాగంబులుగ ఆవు పిత్తము (చేదికట్టు)తో నూరి లేపనముచేసిన శ్విత్రకుష్ఠము నశించును.

## దద్రురులకు లేపనము.

ధాత్రీసర్జరసశ్చైవ యవక్షారశ్చ చూర్ణితః,

సౌవీరేణ ప్రలేపోఽయం ప్రయోజ్యస్సిధ్మనాశనః. 44

ఉసిరికపప్పు, సర్జరసము, యవక్షారము వీనిని సమముగ చూర్ణముగావించి సౌవీరముతోగాని, కాంజికముతోగాని నూరి లేపనముచేసిన దద్దురు నశించును.

అన్యచ్చ—దార్వీమూలకబీజాని తాలకం సురదారు చ,
తాంబూలపత్రం సర్వాణి కార్షికాణి పృథక్పృథక్. 45
శంఖచూర్ణం శాణమాత్రం సర్వాణ్యేకత్ర చూర్ణయేత్,
లేపోఽయం వారిణా పిష్టస్సిధ్మానాం నాశనః పరః. 46

మ్రానిపసుపు, ముల్లంగివిత్తులు, తాళకము, దేవదారు, తమలపాకులు వీనిని ప్రత్యేకముగా కర్షప్రమాణముగాను, శంఖభస్మము ఒక శాణప్రమాణముగాను, చూర్ణముగావించి యుదకముతోనూఱి లేపనము చేసిన సిధ్మ (శోఫ) కుష్ఠము నశించును.

నేత్రరోగములకు లేపనము.

హారీతకీ సైంధవం చ గైరికం చ రసాంజనం,
బిడాలకో జలే పిష్టస్సర్వనేత్రామయాపహః, 47

కరక్కాయ, సైంధవలవణము, కావిరాయి, రసాంజనము వీనిని సమభాగంబులుగ నుదకముతో నూఱి నేత్రములకు లేపనము జేసిన నేత్రరోగములన్నియు నశించును. ఇది బిడాలక మనంబడును.

అన్యచ్చ.—రసాంజనం వ్యోషయుతం సంపిష్య వటకీకృతం,
కండూం పాకాన్వితాం హంతి లేపాదంజననామికామ్. 48

రసాంజనము, త్రికటుకములు వీనిని సమభాగంబులుగ నుదకముతో నూరి యుండఁజేసి లేపనము జేసిన నేత్రములందలి దురద, పాకము నశించును.

దురద మొదలగువానికి లేపనములు.

ప్రపున్నాటస్య బీజాని వాకుచీసర్షపాస్తిలాః,
కుష్ఠం నిశాద్వయం ముస్తం పిష్ట్వా తక్రేణ చైకతః. 49
ప్రలేపాదస్య నశ్యంతి కండూదద్రూవిచర్చికాః,

తగరిసెవిత్తులు, బావంచివిత్తులు, తెల్లఆవాలు, నువ్వులు, చెంగల్వకోష్టు, పసుపు, మ్రానిపసుపు తుంగగడ్డలు, వీనిని సమభాగంబులుగ మజ్జిగతో నూఱి లేపనము జేసిన దద్రుకుష్ఠము, దురద, విచర్చికాకుష్ఠము నశించును.

## గజ్జి - దద్రుకుష్ఠువు - వీనికి లేపనము.

హేమక్షీరీ విడంగాని దరదం గన్ధక స్తథా. 50
దద్రుఘ్నః కుష్ఠసిందూరం సర్వాణ్యేకత్ర మర్దయేత్,
ధుత్తూరనింబతాంబూలీపత్త్రాణాం స్వరసైః పృథక్. 51
అస్య ప్రలేపమాత్రేణ పామాదద్రువిచర్చికాః,
కండూశ్చ రకసశ్చైవ ప్రశమం యాతి వేగతః. 52

హేమక్షీరి, వాయువిళంగములు, ఇంగిలీకము, గంధకము, తగిరిసెవిత్తులు, చెంగల్వకోష్టు, సిందూరము వీనిని సమభాగంబులుగ ఉమ్మెత్తయాకులు, వేపయాకులు, తమలపాకులు వీనిరసములో ప్రతిదానియందును నూరి లేపనముచేసిన గజ్జి, దద్రుకుష్ఠము, విచర్చిక, దురద, రకసకుష్ఠము నశించును.

అన్యచ్చ:—దూర్వాభయా సైంధవం చ చక్రమర్దః కుఠేరకః,
ఏభి స్తక్రయుతో లేపః కండూదద్రువినాశనః. 53

గరిక, కరక్కాయలు, సైంధవలవణము, తగిరిసెవిత్తులు, అడవితులసి వీనిని సమభాగంబులుగ మజ్జిగతో నూరి అందు మజ్జిగగలిపి లేపనముచేసిన దురద, దద్రుకుష్ఠము నశించును.

## కండ్వాదులకు దూర్వాదిలేపము.

దూర్వానిశాయుతో లేపః కండూపామావినాశనః,
కృమిదద్రుహరశ్చైవ శీతపిత్తహరః స్మృతః. 54

దూర్వలు, పసుపు, అతిమధురము, చిట్టాముదపువేళ్లు, పులిగోరుచెట్టు, నల్లకలువ వీనిని సమభాగంబులుగ పాలతో నూరి లేపనముచేసిన రక్తపిత్తోద్భవంబగుతలపోటు నశించును.

## రక్తపిత్తాదులకు లేపనము.

చందనోశీరయష్ట్యాహ్వాబలావ్యాఘ్రినఖోత్పలైః,
క్షీరపిష్టైః ప్రలేపస్స్యాద్రక్తపిత్తశిరో రుజిత్. 55

రక్తచందనము, వట్టివేళ్లు వీనిని సీటితో నూరి లేపనముచేసిన గజ్జి, తీట, పురుగులు, దద్రుకుష్ఠము, శీతపిత్తము హరించును.

## ఉదర్దరోగమునకు లేపనము.

సిద్ధార్థరజనీకుష్ఠైః ప్రపున్నాటతిలైస్సహ,

కటుతైలేన సమ్మిశ్రం దద్రుఘ్నం చ ప్రలేపనమ్. 56

తెల్లయావాలు, పసుపు, చెంగల్వకోష్టు, తగరిసెవిత్తులు, నువ్వులు వీనిని సమభాగంబులుగ చూర్ణముచేసి తెల్లయావనూనెలో గలిపి లేపనముచేసిన పిత్తభేదంబగు నుదర్దము నశించును.

వాతవిసర్పమునకు లేపనము.

రాస్నానీలోత్పలం దారు చందనం మధుకం బలా,
ఘృతక్షీరయుతో లేపో వాతవీసర్పనాశనః. 57

సన్నరాష్ట్రము, నల్లకలువ, దేవదారు, రక్తచందనము, అతిమధురము, చిట్టాముదపువేళ్లు వీనిని సమభాగంబులుగ చూర్ణముగావించి నేయి, పాలు వీనిలో గలిపి లేపనముచేసిన విసర్పము హరించును.

పిత్తవిసర్పమునకు లేపనము.

మృణాలం చందనం లోధ్రముశీరం కమలోత్పలం,
సారిబామలకీ పథ్యా లేపః పిత్తవిసర్పనుత్. 58

తామరతూండ్లు, రక్తచందనము, లొద్దుగుచెక్క, వట్టివేళ్లు, తామర, నల్లకలువ, సుగంధిపాలవేళ్లు, ఉసిరిక, కరక్కాయ వీనిని సమభాగంబులుగ నుదకముతో నూఱి లేపనముచేసిన పిత్తవిసర్పము హరించును.

కఫవిసర్పమునకు లేపనము.

త్రిఫలాపద్మకోశీరం సముంగా కరవీరకం,
నలమూలమనంతా చ లేపశ్శ్లేష్మవిసర్పహా. 59
మాంసీం సర్జరసో లోధ్రం మధుకం సహారేణుకం,

త్రిఫలములు, పద్మకాష్ఠము, వట్టివేళ్లు, మంజిష్ఠ, వాడగన్నేరు, కాకివెదురువేళ్లు, దురదగొండివేళ్లు వీనిని సమభాగంబులుగ నుదకముతో నూఱి లేపనముచేసిన కఫవిసర్పము హరించును.

పిత్తవాతరక్తమునకు లేపనము.

మూర్వానీలోత్పలం పద్మం శిరీషకుసుమైస్సహా. 60
ప్రలేపః పిత్తవాతాస్రే శతధౌతఘృతప్లుతః,

సాగనారవేళ్లు, నల్లకలువ, తామరతూండ్లు, దిరిసెనపువ్వులు వీనిని సమభాగంబులుగ చూర్ణముగావించి నూఱుమార్లు ఉదకముతోగడిగిన నేతితోగలిపి లేపనముచేసిన పిత్తవాతరక్తము హరించును.

### ముక్కునుండి స్రవించు రక్తమునకు లేపనము.

ఆమలం ఘృతభృష్టం తు పిష్టం కాంజికవారిభిః, 61
జయేన్మూర్ధ్ని ప్రలేపేన రక్తం నాసికయా స్రుతం,

ఉసిరికవరుగును నేతిలో వేయించి కాంజికముతో నూరి శిరస్సునకు లేపనముచేసిన ముక్కునుండి స్రవించురక్తము హరించును.

### వాతసంబంధమగు మస్తకపీడకు లేపనము.

కుష్ఠమేరండతైలేన లేపాత్కాంజికపేషితమ్. 62
శిరోర్తిం వాతజాం హన్యాత్పుష్పం వా ముచుకుందజం,

చెంగల్వకోష్టుగాని, ముచుకుందపువ్వులుగాని వీనిని కాంజికముతో నూరి ఆముదము కలిపి లేపనముచేసిన వాతమునుండి జనించిన తలపోటు నశించును.

అన్యచ్చ.—దేవదారునతం కుష్ఠం నలదం విశ్వభేషజమ్. 63
సకాంజికస్నేహయుక్తో లేపో వాతశిరోర్తినుత్,

దేవదారు, గ్రంథితగరము, చెంగల్వకోష్టు, వట్టివేళ్లు, సొంటి వీనిని సమభాగంబులుగ కాంజికముతో నూరి ఆముదము కలిపి లేపనముచేసిన తలపోట్లు నశించును.

### పిత్తశిరోరోగములకు లేపనము.

ధాత్రీకసేరుహ్రీబేరపద్మపద్మకచందనైః. 64
దూర్వోశీరనలానాం చ మూలైః కుర్యాత్ప్రలేపనం,
శిరోర్తిం పిత్తజాం హన్యాద్రక్తపిత్తరుజస్తథా. 65

ఉసిరిక, తుంగముస్తలు, కురువేరు, తామర, పద్మకాష్ఠము, రక్తచందనము, గరిక వేళ్లు, వట్టివేళ్లు, కాకివెదురువేళ్లు సమభాగంబులుగ నుదకముతో నూరి లేపనముచేసిన పిత్తసంబంధమగు పీడ, రక్తపిత్తసంబంధమగు పీడ నశించును.

### శ్లేష్మసంబంధమగు మస్తకపీడకు లేపనము.

హరేణునతశైలేయముస్తైలాగరుదారుభిః,
మాంసీరాస్నేరుబూకైశ్చ కోష్ణో లేపః కఫార్తినుత్. 66

రేణుకలు, గ్రంథితగరము, రాతిపువ్వు, తుంగముస్తలు, ఏలకులు, అగరు, దేవదారు, జటామాంసి, సన్నరాష్ట్రము, ఆముదపువేళ్లు వీనిని సమభాగంబులుగ నుష్ణోదకంబుచే నూరి కించిదుష్ణముచేసి లేపనముచేసిన కఫమస్తకపీడ హరించును.

అన్యచ్చ.—శుంఠీకుష్ఠప్రపున్నాటదేవకాష్ఠైస్సరోహిషైః,

మూత్రపిష్టైస్సుఖోష్ణైశ్చ లేపశ్శ్లేష్మశిరోర్తినుత్. 67

సొంటి, చెంగల్వకోష్టు, తగిరిసెవిత్తులు, దేవదారు, కామంచిగడ్డి వీనిని సమభాగంబులుగ గోమూత్రముతో నూరి కొంచెము వెచ్చఁజేసి లేపనముచేసిన కఫసంబంధమగు మస్తకపీడలు హరించును.

సూర్యావర్తాదులకు లేపనము.

సారిబాకుష్ఠమధుకం వచాకృష్ణోత్పలై స్తథా,
లేపస్స కాంజికస్నేహస్సూర్యావర్తార్ధభేదయోః. 68

సుగంధిపాల, చెంగల్వకోష్టు, అతిమధురము, వస, పిప్పళ్లు, నల్లకలువ వీనిని సమభాగంబులుగ కాంజికముతో నూఱి ఆముదము కలిపి లేపనము చేసిన సూర్యావర్త, అర్ధావభేదములును శిరోరోగము నశించును.

శంఖకానంతవాతాదులకు లేపనము.

వరీనీలోత్పలం దూర్వా స్తిలాః కృష్ణాః పునర్నవా,
శంఖకేఽనంతవాతే చ లేపస్సర్వశిరోర్తిజిత్. 69

పిల్లిపీచరగడ్డలు, నల్లకలువ, గరిక, నల్లనువ్వులు, తెల్లగలిజేరు వీనిని సమభాగంబులుగ నీటితో నూఱి లేపనముచేసిన శంఖము, అనంతవాతము మొదలగు శిరోరోగములు నశించును.

అన్యచ్చ—అథ లేపవిధిశ్చాన్యః ప్రోచ్యతే సుజ్ఞసమ్మతః,
ద్వౌ తస్య కథితౌ భేదౌ ప్రలేపాఖ్యప్రదేహకౌ. 70

ప్రాచీనులగు ఋషిపుంగవులచే ప్రదేహకమనియు, ప్రలేపకమనియు లేపము ద్వివిధంబుగా చెప్పఁబడియె.

ప్రలేపాదిలేపముల ఉన్నతప్రమాణము.

చర్మార్ద్రం మాహిషం యద్వత్ప్రోన్నతం సామితిస్తయోః,
శీత స్తనుర్విశోషీ చ ప్రలేపః పరికీర్తితః. 71
ఆర్ద్రో ఘన స్తథోష్ణస్స్యాత్ప్రదేహశ్శ్లేష్మవాతహా,

ఈరెండు ప్రలేపములను ఎనుముయొక్క ఆర్ద్రచర్మమంత యెత్తున చేయందగును. ఇందు ప్రలేపకము శీతవీర్యంబై సూక్ష్మమగుటచే స్రోతస్సులం బ్రవేశించి రోగములను హరించును. ప్రదేహకము ఆర్ద్రంబై ఘనంబై యుష్ణవీర్యముగల్గి శ్లేష్మవాతములను బోనడచును.

### ప్రలేహ-ప్రదేహ-లేపనవిధి.

రోమాభిముఖమాదేయౌ ప్రలేపాఖ్యప్రదేహకౌ. 72
వీర్యం సమ్యగ్విశత్యాశు రోమకూపైస్సిరాముఖైః,

ఈరెండు లేపనములను లేపనముచేయునపుడు వెండ్రుకలకు ఎదురుగా లేపనము చేయవలెను. అట్లు చేసిన నీసారము రోమకూపంబుల గుండా సిరాముఖంబుల ప్రవేశించి శరీరమంతయుం వ్యాపించును.

### లేపననిషేధకాలము.

న రాత్రౌ లేపనం కుర్యాచ్ఛుష్యమాణం న ధారయేత్. 73
శుష్యమాణముపేక్షేత ప్రదేహం పీడనం ప్రతి,

లేపనంబును రాత్రులయందు చేయందగదు. మఱియుం ఎండినపిదప నాలేపనమును తీసివేయందగును. అట్లుంచినయెడల శరీరమునకు అనేకవిధంబులగు బాధలు గల్గును.

### రాత్రులయందు లేపననిషేధము.

తమసా పిహితో హ్యూష్మా రోమకూపముఖే స్థితః. 74
వినా లేపేన నిర్యాతి రాత్రౌ నాలేపయేత్తతః,

ఊష్మము తమస్సుచే నావృతంబై రాత్రులయందు రోమకూపంబులగుండా బైటికివచ్చును గాన రాత్రులందు లేపనము చేయఁగూడదు.

### రాత్రులయందు ప్రలేపాదులకర్తవ్యమగురోగములు.

రాత్రావపి ప్రలేపాదివిధిః కార్యో విచక్షణైః. 75
అపక్వశోఫే గంభీరే రక్తశ్లేష్మసముద్భవే,

కాని రక్తశ్లేష్మప్రకోపంబుచే జనించిన గంభీరంబగు నామ శోఫంబున రాత్రులయందు లేపనముచేయందగును. ఇది విశేషవిధి.

### వ్రణశోఫాదులకు లేపనక్రమము.

ఆదౌ శోఫహరో లేపో ద్వితీయో రక్తసేచనః. 76
తృతీయశ్చోపనాహస్స్యాచ్చతుర్థః పాటనక్రమః,
పంచమశ్శోధనో భూయాత్షష్ఠో రోపణ ఇష్యతే. 77
సప్తమో వర్ణకరణో వ్రణస్యైతే క్రమా మతాః,

వ్రణరోగంబున మొదట వాపు నశించుటకు లేపనము, పిమ్మట రక్తమును సంచరింపఁజేయుటకు రెండవలేపనము, తరువాత స్వేదకర్మచేయుటకు మూఁడవలేపనము, అనంతరంబు వ్రణము పగులుటకు నాల్గవలేపనము, తదుపరి చీము మొదలగుదానిని

స్రవింపఁజేయుటకు స్వైదవలేపనము, పిమ్మట పుండుమానుటకు నాటివలేపనము, తరువాత సహజమగు కర్మములు గల్గించుటకు నేడవలేపనము చేయందగును.

వాతసంబంధమగు వ్రణములకు లేపనము.

బీజపూరజటామాంసీ దేవదారుమహౌషధమ్. 78
రాస్నాగ్నిమంథలేపోఽయం వాతశోఫవినాశనః,

మాదీఫలపువేళ్లు, జటామాంసము, దేవదారు, సొంటి, సన్నరాష్ట్రము, నెల్లివేళ్లు వీనిని ఉదకముతో నూరి లేపనముచేసిన వాతవ్రణములయొక్క వాపు నశించును.

పిత్తవాపులకు లేపనము.

మధుకం చందనం మూర్వా నలమూలం చ పద్మకమ్. 79
ఉశీరం వాలకం పద్మం పిత్తశోఫే ప్రలేపనం,

అతిమధురము, రక్తచందనము, సాగనార, కాకివెదురువేళ్లు, పద్మకములు, వట్టివేళ్లు, కురువేరు, తామర వీనిని సమభాగంబులుగ నుదకముతో నూరి పిత్తవ్రణములకు లేపనము చేసిన నయ్యవి నశించును.

శ్లేష్మవ్రణశోఫములకు లేపనము.

కృష్ణా పురాణపిణ్యాకం శిగ్రుత్వక్సికతా శివా. 80
మూత్రపిష్టస్సుఖోష్ణోఽయం ప్రదేహశ్లేష్మశోఫహృత్,

పిప్పళ్లు, ప్రాతగానుగుపిండి, మునగపట్ట, ఇసుక, కరక్కాయ వీనిని సమభాగంబులుగ గోమూత్రముతో నూరి కొంచెము వెచ్చగ లేపనముఁజేసిన కఫవ్రణములయొక్క వాపు నశించును.

ఆగంతుకాదిశోఫము (వాపు) లకు లేపనము.

ద్వే నిశే చందనే ద్వే చ శివా దూర్వా పునర్నవా. 81
ఉశీరం పద్మకం లోధ్రం గైరికం చ రసాంజనం,
ఆగంతుజే రక్తజే చ శోఫే కుర్యాత్ప్రలేపనమ్. 82

పసుపు, మ్రానుపసుపు, చందనము, రక్తచందనము, కరక్కాయ, గరిక, తెల్లగలిజేరు, వట్టివేళ్లు, పద్మకములు, లొద్దుగచెక్క, కావిరాళ్లు, రసాంజనము వీనిని సమభాగంబులుగ నుదకముతో నూరి లేపనముచేసిన ఆగంతుకశోఫము నశించును.

వ్రణముపండుటకై లేపనము.

శణమూలకశిగ్రూణాం ఫలాని తిలసర్షపాః,

సక్తవః కిణ్వమతసీ ప్రదేహః పాచనస్స్మృతః. 83

పనసవిత్తులు, ముల్లంగివిత్తులు, మునగవిత్తులు, నువ్వులు, తెల్లఆవాలు, యవలు, ఇసుపచిట్టము, అగసివిత్తులు వీనిని సమభాగంబులుగ చూర్ణముగావించి యందకముతో నూఱి లేపనముచేసిన వ్రణములు పాకమునొందును.

పండినవ్రణము పగులుటకై లేపనము.

దంతీచిత్రకమూలత్వక్స్నుహ్యర్కపయసీగుడః,
భల్లాతకాస్థికాసీసం సైంధవం దారణే స్మృతః. 84

నేపాళపువేరు, చిత్రమూలము, బెల్లము, జీడివిత్తులు, అన్నభేది, సైంధవలవణము వీనిని సమభాగంబులుగ జెముడు, జిల్లేడు వీని పాలతో నూఱి లేపనముచేసిన వ్రణములు పగులును.

అన్యచ్చ.—చిరిబిల్వోఽగ్నికో దంతీ చిత్రకో హయమారకః,
కపోతకంకగృధ్రాణాం మలం లేపేన దారణమ్. 85

క్రానుగువిత్తులు, జీడివిత్తులు, నేపాళపువేరు, చిత్రమూలము, వాడగన్నేరు వీనిని చూర్ణముగావించి యందు పావురము, రాబందులు, గద్ద వీని మలమును గలిపి మర్దనచేసి దానిని లేపనముచేసిన వ్రణములు పగులును.

అన్యచ్చ—స్వర్జికాయావశూకాద్యాః క్షారా లేపేన దారుణాః,
హేమక్షీర్యాస్తథా లేపో వ్రణే పరమదారణః. 86

సర్జక్షారము, యవక్షారము మొదలగు వానినిగాని, హేమక్షీరినిగాని లేపనము చేసిన తప్పక వ్రణము పగులును.

వ్రణశోధనకై లేపనము.

తిలసైంధవయష్ట్యాహ్వానింబపత్రనిశాయుగైః,
త్రివృద్ఘృతయుతైః పిష్టైః ప్రలేపో వ్రణశోధనః. 87

నువ్వులు, సైంధవలవణము, అతిమధురము, వేపయాకు, పసుపు, మ్రానిపసుపు, తెగడ వీనిని సమభాగంబులుగ చూర్ణముచేసి యందు నేయి గలిపి లేపనము చేసిన వ్రణము శోధించును.

వ్రణశోధనరోపణములకు లేపనము.

నింబపత్రఘృతక్షౌద్రదార్వీమధుకసంయుతః,
తిలైశ్చ సహ సంయుక్తో లేపశ్శోధనరోపణః. 88

వేపయాకు, ద్రాక్షపసుపు, అతిమధురము, నువ్వులు వీనిని సమభాగంబులుగ చూర్ణముగావించి యందు నేయి, తేనె కలిపి లేపనముచేసిన వ్రణమును శోధించును.

### వ్రణసంబంధ మగుక్రిములు నశించుటకై లేపనము.

కరంజారిష్టనిర్గుండీలేపో హన్యాద్వ్రణక్రిమీన్,
లశునస్యాథవా లేపో హింగునింబభవోఽథవా. 89

కానుగ, వేప, నల్లవావిలి వీనియాకులను నూరిదైనను, లేక వెల్లుల్లిని నూరిదైనను, లేక ఇంగువ, వేపాకు వీనిని నూరిదైనను, లేక వ్రణసంబంధమగు క్రిములకు లేపనము జేసిన నవి నశించును.

### వ్రణశోధనరోపణములకు రెండవలేపనము.

నింబపత్రం తిలాదంతీ త్రివృత్సైంధవమాక్షికం,
దుష్టవ్రణప్రశమనో లేపశ్శోధనరోపణః. 90

వేపయాకు, నువ్వులు, నేపాళపువేరు, తెగడ, సైంధవలవణము వీనిని సమభాగంబులుగ చూర్ణముకావించి యందు తేనెగలిపి లేపనముజేసిన దుష్టవ్రణములు శుద్ధంబులై మాంసపూరితము లగును.

### ప్రక్కశూలలకు నాభికి లేపనము.

మదనస్య ఫలం తిక్తాం పిష్ట్వా కాంజికవారిణా,
కోష్ణం కుర్యాన్నాభిలేపం శూలశాంతిర్భవేత్తతః. 91

మ్రంగకాయ, కటుకరోహిణి వీనిని సమభాగంబులుగ కాంజికముతో నూఱి కించిదుష్ణముగ నాభికి లేపనముచేసిన శూల నశించును.

### వాతవిద్రధికి లేపనము.

శిగ్రుశేఫాలికైరండయవగోధూమముద్గకైః,
సుఖోష్ణో బహులో లేపః ప్రయోజ్యో వాతవిద్రధౌ. 92

మునగపట్ట, నల్లవావిలియాకు, ఆముదపువేర్లు, యవలు, గోధూమములు, పెసలు వీనిని సమభాగంబులుగ చూర్ణముగావించి యుదకముతో నూరి వెచ్చజేసి లేపనముచేసిన వాతవిద్రధి నశించును.

### పిత్తవిద్రధి లేపనము.

పైత్తికే సర్పిషా లాజా మధుకైశ్శర్కరాన్వితైః,
ప్రలింపేత్క్షీరపిష్టైర్వా పయస్యోశీరచందనైః. 93

వరిపేలాలు, అతిమధురము వీనిచూర్ణమును నేయి, చక్కెర వీనిలో గలిపిగాని, క్షీరకాకోళి, వట్టివేరు, రక్తచందనము వీనిని పాలతోగాని నూరి లేపనము చేసిన పిత్త విద్రధి హరించును.

శ్లేష్మవిద్రధికి లేపనము.

ఇష్టకాసికతాలోహకిట్టం గోశకృతా సహ,
సుఖోష్ణశ్చ ప్రదేహోఽయం మూత్రైస్స్యాచ్ఛ్లేష్మవిద్రధౌ. 94

ఇటుకరాయి, ఇసుక, ఇనుపచిట్టెము, ఆవుపేడ వీనిని గోమూత్రములో నూరి లేపనముచేసిన శ్లేష్మవిద్రధి నశించును.

ఆగంతుకవిద్రధికి లేపనము.

రక్తచందనమంజిష్ఠానిశామధుకగైరికైః,
క్షీరేణ విద్రధౌ లేపో రక్తాగంతునిమిత్తజే. 95

రక్తచందనము, మంజిష్ఠ, పసుపు, అతిమధురము, కావిరాయి వీనిని సమభాగంబులుగ పాలతోనూరి లేపనముచేసిన రక్త, ఆగంతుజ, విద్రధి నశించును.

వాతగలగండమునకు లేపనము.

నిచులశ్శిగ్రుబీజాని దశమూలమథాపి వా,
ప్రదేహో వాతగండేషు సుఖోష్ణస్సంప్రదీయతే. 96

నీటిప్రబ్బలి, మునగవిత్తులు వీనినిగాని, దశమూలములనుగాని ఉదకముతో నూరి కొంచెము ఉష్ణముగ లేపనముచేసిన వాతికగళగండము నశించును.

శ్లేష్మగలగండమునకు లేపనము.

దేవదారు విశాలా చ కఫగండే ప్రదేహకః,

దేవదారు, చేదుపుచ్చ వీనిని యుదకముతోనూరి లేపనముచేసిన కఫగళగండము నశించును.

అపచిరోగమునకు లేపనము.

సర్షపారిష్టపత్రాణి దగ్ధ్వా భల్లాతకైస్సహ, 97
ఛాగమూత్రేణ సంపిష్టమపచిఘ్నం ప్రలేపనం,

తెల్లఆవాలు, వేపయాకు, జీడిగింజలు వీనిని సమభాగంబులుగ కాల్చి భస్మము జేసి మేకమూత్రముతో నూరి లేపనముచేసిన అపచిరోగము నశించును.

గండమాలాదులకు లేపనము.

సర్షపాః శిగ్రుబీజాని శణబీజాతసీయవాః. 98

మూలకస్య చ బీజాని తక్రేణామ్లేన పేషయేత్,
గండమాలార్బుదం గండం లేపేనానేన శామ్యతి. 99

తెల్లఆవాలు, మునగవిత్తులు, జనపవిత్తులు, అగసివిత్తులు, యవలు, ముల్లంగివిత్తులు వీనిని సమభాగంబులుగ పుల్లనిమజ్జిగతో నూరి లేపనముచేసిన గండమాల, అర్బుదము, గలగండము నశించును.

అపబాహుకాదివాతములకు లేపనము.

తక్షయిత్వా క్షురేణాంగం కేవలానిలపీడితం,
తత్ర ప్రదేహం దద్యాచ్చ పిష్టం గుంజాఫలైః కృతమ్. 100
తేనాపబాహుజా పీడా విశ్వాచీ గృధ్రసీ తథా,
అన్యాపి వాతజా పీడా ప్రశమం యాతి వేగతః. 101

గురిగింజలను నుదకముతో నూరి కేవలవాతప్రకోపముచే శూలగలస్థలమున వెంట్రుకలు ఊడదీసి యందు లేపనముజేసిన అపబాహుకము, విశ్వాచీవాతము, గృధ్రసీవాతము, కటువాతము మఱియు ఇతరములగు వాతపీడలు నశించును.

శ్లీపదములకు లేపనము.

ధత్తూరైరండనిర్గుండీవర్షాభూశిగ్రుసర్షపైః,
ప్రలేపశ్శ్లీపదం హంతి చిరోత్థమపి దారుణమ్. 102

ఉమ్మెత్తయాకులు, ఆముదపాకులు, నల్లవావిలియాకులు, తెల్లగలిజేరు, మునగపట్ట, తెల్లయావాలు వీనిని సమభాగంబులుగ నుదకముతో నూరి లేపనముచేసిన చిరకాలము నుండి పుట్టినశ్లీపదము (బోదకాలు) నశించును.

కురండమునకు లేపనము.

అజాజీహపుషాకుష్ఠమేరండబదరాన్వితం,
కాంజికేన తు సంపిష్టం కురండఘ్నం ప్రలేపనమ్. 103

జీలకఱ్ఱ, పెద్దసోపు, చెంగల్వకోష్టు, ఆముదపువేళ్లు, రేగుపట్ట వీనిని సమభాగంబులుగ కాంజికముతో నూరి లేపనముచేసిన అండవృద్ధి నశించును.

ఉపదంశమునకు లేపనము.

కరవీరస్య మూలేన పరిపిష్టేన వారిణా,
అసాధ్యాపి వ్రజత్యస్తం లింగోత్థారుక్ప్రలేపనాత్. 104

గన్నేరువేళ్లను ఉదకముతోనూరి లేపనముజేసిన నసాధ్యంబగు ఉపదంశరోగము గూడ హరించును.

అన్యచ్చ — దహేత్కటాహే త్రిఫలాం సా మషీ మధుసంయుతా,
ఉపదంశే ప్రలేపోఽయం సద్యో రోపయతి వ్రణమ్. 105

త్రిఫలములను ఇనుపపాత్రలో వేసి భస్మముగావించి యందు తేనె గలిపి లేపనముచేసిన ఉపదంశరోగము హరించును.

అన్యచ్చ — రసాంజనం శిరీషేణ పథ్యయా చ సమన్వితం,
సక్షౌద్రం లేపనే యోజ్యముపదంశగదాపహమ్. 106

రసాంజనము, దిరిసెన, కరక్కాయలు వీనిని చూర్ణముగావించి తేనెలో గలిపి లేపనముచేసిన ఉపదంశము నశించును.

## అగ్నిదగ్ధమునకు లేపనము.

అగ్నిదగ్ధే తుగాక్షీరీ ప్లక్షచందనగైరికైః,
సామృతైస్సర్పిషా స్నిగ్ధైరా లేపం కారయేద్భిషక్. 107
తండులీయకషాయైర్వా ఘృతమిశ్రైః ప్రలేపయేత్,

తవాక్షీరి, జువ్వి, రక్తచందనము, కావిరాళ్లు, తిప్పతీగ వీనిని సమభాగంబులుగ చూర్ణముగావించి నేతిలోగలిపిగాని, చిఱ్ఱికూరకషాయంబున నేయిగలిపిగాని అగ్నిదగ్ధములకు లేపనము చేయందగును.

అన్యచ్చ — యవాన్దగ్ధ్వా మషీ కార్యా తైలేన యుతయా తయా. 108
దద్యాత్సర్వాగ్నిదగ్ధేషు ప్రలేపో వ్రణరోపణః,

యవలనుగాల్చి భస్మముగావించి నువ్వులనూనెలో గలిపి అగ్నిదగ్ధములకు లేపనము చేయందగును.

## యోని గట్టిపడుటకు లేపనము.

పలాశోదుంబరఫలైస్తిలతైలసమన్వితైః. 109
మధునా యోనిమాలింపేద్గాఢీకరణముత్తమం,

మోదుగఫలము, అత్తిపండు వీనిని నూటినువ్వుల నూనెలో గలిపి యందు తేనియజేర్చి లేపనముంజేసిన యోని గట్టిపడును.

అన్యచ్చ — మాకందఫలసంయుక్తం మధుకర్పూరలేపనాత్. 110
గతేఽపి యౌవనే స్త్రీణాం యోనిర్గాఢాతిజాయతే,

మామిడిపండ్లరసముతో తేనె, కర్పూరము గలిపి లేపనముచేసిన యోని గట్టిపడును.

### లింగస్తనాదులకు లేపనము.

మరీచం సైంధవం కృష్ణా తగరం బృహతీఫలమ్. 111
అపామార్గస్తిలాః కుష్ఠం యవా మాషాశ్చ సర్షపాః,
అశ్వగంధా చ తచ్చూర్ణం మధునా సహ యోజయేత్. 112
అస్య సంతత లేపేన మర్దనాచ్చ ప్రజాయతే,
లింగవృద్ధిస్తనోత్సేధస్సంహాతిర్భుజకర్ణయోః. 113

మిరియాలు, సైంధవలవణము, పిప్పళ్లు, గ్రంథితగరము, ములకపండ్లు, ఉత్తరేణి, నల్లనువ్వులు, చెంగల్వకోష్టు, యవలు, మినుములు, దిరిసెనపుకాయ, పెన్నేరుగడ్డ వీనిని సమభాగంబులుగ చూర్ణము గావించి యందు తేనెగలిపి లింగమునకు ప్రతిదినము లేపనముఁజేసి మర్దించుచుండిన నయ్యది పెద్దదియగును. మఱియు దీనిని స్త్రీలస్తనములు, కరములు, భుజములు వీనికి లేపనముచేసిన నయ్యవి వృద్ధిఁజెందు.

అన్యచ్చ.—సితాశ్వగంధాసింధూత్థచ్ఛాగక్షీరైర్ఘృతం పచేత్,
తల్లేపాన్మర్దనాల్లింగే వృద్ధిస్సంజాయతే పరా. 114

తెల్లపుష్పలపెన్నేరుగడ్డ, సైంధవలవణము వీనిని చూర్ణము గావించి దానికి నాల్గింతలు నేయి, నేతికి నాల్గింతలు మేకపాలు వైచి నేయి మిగులునంతవఱకుగాచి దానిని లింగమునకు లేపనముఁజేసిన నది వృద్ధినొందును.

### యోనిద్రావణమునకు లేపనము.

ఇంద్రవారుణికాపత్రరసైస్సూతం విమర్దయేత్,
రక్తస్య కరవీరస్య కాష్ఠేన చ ముహుర్ముహుః. 115
తల్లిప్తలింగసంయోగాద్యోనిద్రావోఽభిజాయతే,

చేదుపుచ్చయాకులరసములో పాదరసముగలిపి దానిని యెఱ్ఱపూవులుగలగన్నేరుకఱ్ఱతో ఐదుమాఱులుగాని, ఆఱుమార్లుగాని మర్దించి లింగమునకు లేపనము జేసికొని సంభోగముచేసిన స్త్రీయోని ద్రవించి అశక్తురాలగును.

### శరీరదౌర్గంధ్యము హరించుటకై లేపనము.

తాంబూలపత్రచూర్ణం తు చూర్ణం కుష్ఠశివాభవమ్. 116
వారిణా లేపనం కుర్యాద్గాత్రదౌర్గంధ్యనాశనం,

తమలపాకులు, చెంగల్వకోష్టు, కరక్కాయ వీనిచూర్ణమును నీటిలోగలిపి లేపనముచేసిన శరీరదౌర్గంధ్యము నశించును.

అన్యచ్చ.—కులిత్థసక్తవః కుష్ఠం మాంసీచందనజం రజః. 117
సక్తవశ్చణకస్యైవ త్వక్చైవైకత్ర కారయేత్,
స్వేదదౌర్గంధ్యనాశశ్చ జాయతేఽస్యావధూలనాత్. 118

వేయించిన ఉలవపిండి, చెంగల్వకోష్టు, జటామాంసి, శ్వేతచందనము, సెనగపొడి వీనిని శరీరముకునలుగు పెట్టిన స్వేదదౌర్గంధ్యము నశించును.

వశీకరణమునకు లేపనము.

వచా సౌవర్చలం కుష్ఠం రజన్యౌ మరిచాని చ,
ఏతల్లేపప్రభావేన వశీకరణముత్తమమ్. 119

వస, సౌవర్చలవణము, చెంగల్వకోష్టు, పసుపు, మ్రానిపసుపు, మిరియములు వీనిని ఉదకముతోనూరి శరీరమునకు లేపనము చేసికొనిన లోకము వశ్యమగును.

మూర్ధతైల విధి.

అభ్యంగః పరిషేకశ్చ పిచుర్వస్తిరితి క్రమాత్,
మూర్ధతైలం చతుర్ధా స్యాద్బలవచ్చ యథోత్తరమ్. 120

అభ్యంజనము, పరిషేకము, పిచుధారణము, వస్తిధారణము అని మస్తకతైలధారణము నాల్గువిధంబులు. ఇందు ఒకదానికంటె నొకటి శ్రేష్ఠము.

శిరోవస్తివిధి.

త్రయోఽభ్యంగాదయః పూర్వే ప్రసిద్ధాస్సర్వతస్స్మృతాః,
శిరోవస్తివిధిశ్చాత్ర ప్రోచ్యతే సుజ్ఞసమ్మతః. 121

పైశ్లోకమున చెప్పఁబడిన అభ్యంగ, పరిషేక పిచుధారణములు సర్వత్ర ప్రసిద్ధములుగ నుండుటచే వానిలక్షణంబులు చెప్పంబడవయ్యె. మఱియు ప్రాచీనమహర్షులు చెప్పిన శిరోవస్తిమాత్రము ఇచ్చట చెప్పఁబడును.

శిరోవస్తివివరణము.

శిరోవస్తిశ్చర్మణస్స్యాద్ద్విముఖో ద్వాదశాంగులః,
శిరః ప్రమాణం తం బధ్వా మస్తకే మాషపిష్టకైః. 122
సంధిరోధం విధాయాదౌ స్నేహైః కోష్ణైః ప్రపూరయేత్,

జింక మొదలగువానిచర్మమును టోపివలె జేసిన నయ్యది శిరోవస్తి యనంబడును. ఇది పదిరెండుఅంగుళముల పొడవుగలిగి, ఊర్ధ్వభాగమునను అధోభాగమునను ముఖము గల్గియుండి యీయధోభాగము సరిగా శిరస్సున కిమిడియుండవలెను. అట్టిదానిని మినుము

పిండిచే సంధిబంధముగావించి స్నేహమును పైద్వారముగుండా కించిదుష్ణముగ శిరంబుపై విడుచుచుండవలెను.

### శిరోవస్తిధారణకు కాలప్రమాణము.

తావద్ధార్యస్తు యావత్స్యాన్నాసానేత్రముఖస్రుతిః. 123
వేదనోపశమోవాఽపి మాత్రాణాం వా సహస్రకం,

ముఖము, నాసిక, నేత్రములు ఇవి స్రవించువఱకుగాని శిరస్సంబంధమైన పీడ హరించువఱకుగాని ఈశిరోవస్తిని ధరింపవలయును. మఱియుం పూర్వము జెప్పఁబడిన రీతిని వేయిమాత్రలకాలమైనను ధరింపవలెను.

### శిరోవస్తిధారణకు కాలము.

వినా భోజనమేవాత్ర శిరోవస్తిః ప్రశస్యతే. 124
ప్రయోజ్యస్తు శిరోవస్తిః పంచసప్తాహమేవ వా,

ఇట్టి శిరోవస్తిని భోజనముచేయుటకు పూర్వమే చేయవలెను. దీనిని ఐదుదినములుగాని, ఏడుదినములుగాని ప్రయోగింపంజనును.

### శిరోవస్త్యనంతరము చేయతగినక్రియ.

విమోచ్య శిరసో వస్తిం గృహ్ణీయాచ్చ సమంతతః. 125
ఊర్ధ్వకాయే తతః కోష్ణనీరైస్స్నానం సమాచరేత్,

ఇట్లు శిరోవస్తినిజేసిన పిదప నావస్తిని తీసి వైచి యూర్ధ్వకాయమును కించిదుష్ణమగుజలముతో స్నానము చేయింపవలెను.

### శిరోవస్తిచే హరించెడిరోగములు.

అనేన దుర్జయా రోగా వాతజా యాంతి సంక్షయమ్. 126
శిరఃకంపాదయస్తేన సర్వకాలేషు యుజ్యతే,

ఇట్టి శిరోవస్తిచే నసాధ్యంబులగు శిరఃకంపము మొదలగు వాతవ్యాధులు నశించును కాన దానిని ఎల్లపుడు ప్రయోగింపదగును.

### చెవిలో ఔషధముచేయుటకు విధి.

స్వేదయేత్కర్ణదేశం తు కించిద్వై పార్శ్వశాయినః. 127
మూత్రైస్స్నేహైః రసైః కోష్ణైస్తతః కర్ణం ప్రపూరయేత్,

కర్ణరోగంబులందు రోగిని ప్రక్కగా పఱుండఁబెట్టి చెవిచుట్టును స్వేదకర్మము చేసి పిమ్మట గోమూత్రాదులచే సిద్ధంబై కించిదుష్ణంబగు తైలమును పోయవలెను.

చెవిలో ఔషధము ధారణచేయఁదగినకాలము.

కర్ణం తు పూరితం రక్షేచ్ఛతం పఞ్చశతాని వా. 123
సహస్రం వాపి మాత్రాణాం శ్రోత్రకంఠశిరోగదే,

కర్ణరోగము, కంఠరోగము, శిరోరోగము వీనియందు కర్ణములయందు తైలమును వేయు నెడల నాతైలమును కర్ణమందు నూఱుమాత్రలకాలమువఱకుగాని, ఏనూఱుమాత్రలకాలమువఱకుగాని, వేయిమాత్రలకాలమువఱకుగాని ధరింపవలెను.

మాత్రాలక్షణము.

స్వజానునః కరావర్తం కుర్యాచ్ఛోటికయా యుతమ్. 129
ఏషా మాత్రా భవేదేకా సర్వత్రైవైష నిశ్చయః,

వ్రేలితో మోకాటిచిప్పను నొకమాఱు స్పృశింపుచు చుట్టి చిటికెవేయునంత కాలమే మాత్రాకాలమనంబడు. ఇటుల మాత్రాకాలమును సర్వత్ర నెఱుంగవలయు.

రసాదులను చెవిలోఁ బోయుటకు కాలము.

రసాద్యైః పూరణం కర్ణే భోజనాత్ప్రాక్ప్రశస్యతే. 130
తైలాద్యైః పూరణం కర్ణే భాస్కరేఽస్తముపాగతే,

రసాద్యౌషధములను చెవిలోఁబోయునపుడు భోజనమునకు పూర్వమునను తైలాదులనుఁ బోయునపుడు సూర్యాస్తమయమునకు పిమ్మటనుఁ బోయవలెను.

కర్ణశూలలకు చికిత్స.

పీతార్కపత్రమాజ్యేన లిప్తమగ్నౌ ప్రతాపయేత్. 131
తద్రసః శ్రవణే క్షిప్తః కర్ణశూలహరః పరః,

పండినజిల్లేడాకులను నేతితోఁదడపి వానిని నిప్పుపైగాచి యందలి రసమును తీసి యద్దానిని కర్ణమునఁ బోసిన కర్ణశూల హరించును.

కర్ణశూలాదులకు చికిత్స.

కర్ణశూలాతురే కోష్ణం బస్తమూత్రం ససైంధవమ్. 132
నిక్షిపేత్తేన శామ్యంతి శూలపాకాదికా రుజః,

అజామూత్రంబున సైంధవలవణముగలిపి వెచ్చఁజేసి యద్దానిని కర్ణంబునఁబోసిన కర్ణశూలము, కర్ణపాకము మొదలగురోగములు శమించును.

అన్యచ్చ — శృంగబేరం చ మధుకం మధుసైంధవమామలమ్. 133
తిలపర్ణీరసస్తైలం టంకణం నింబుకద్రవం,

కదుష్ణం కర్ణయోర్దేయమేతద్వా వేదనాపహమ్. 134

అల్లపురసము, అతిమధురము, తేనె, సైంధవలవణము, ఉసిరికపప్పు, వామింట యాకురసము, తెల్లఆవనూనె, వెలిగారము, నిమ్మపండ్లరసము వీనిని వెచ్చఁజేసి కర్ణమునఁ బోసిన కర్ణశూల హరించును.

అన్యచ్చ.—కపిత్థమాతులుంగామ్లశృంగబేరరసైశ్శుభైః,
సుఖోష్ణైః పూరయేత్కర్ణం కర్ణశూలోపశాంతయే. 135

వెలగపండురసము, మాదీఫలపురసము, పుల్లప్రబ్బలిరసము, అల్లపురసము వీనిని కొంచెము వెచ్చఁజేసి కర్ణంబునఁ బోసిన కర్ణశూల హరించును.

అన్యచ్చ.—అర్కాంకురానామ్లపిష్టాం స్తైలాక్తాన్లవణాన్వితాన్,
సన్నిదధ్యాస్స్నుహీకాండే పూరితే గచ్ఛదావృతే. 136
పుటపాకక్రమం కృత్వా రసైస్తస్య ప్రపూరయేత్,
సుఖోష్ణైస్తేన శామ్యంతి కర్ణపీడాస్సుదారుణాః. 137

జిల్లేడుచిగుళ్లను నిమ్మపండ్లరసముతోనూరి యందు నూనె సైంధవలవణము గలిపి ముద్దజేసి దానిని చీలియుండు జెముడుకాఁడలోనుంచి దానియాకులచే చుట్టు పైన మన్నుపూసి పుటపాకముగావించి పిమ్మట నాకాఁడతోడ రసమును పిండి దానిని కర్ణంబున కించిదుష్ణముగవైచిన దారుణంబులగు కర్ణపీడలు నశించును.

## కర్ణశూలలకు దీపికాతైలము.

మహతః పంచమూలస్య కాండాన్యష్టాంగులాని తు,
క్షౌమేణావేష్ట్య సంసిచ్య తైలేనాదీపయేత్తతః. 138
యత్తైలం చ్యవతే తేభ్యస్సుఖోష్ణం తేన పూరయేత్.
జ్ఞేయం తద్దీపికాతైలం సద్యో గృహ్ణాతి వేదనామ్. 139
ఏవం స్యాద్దీపికాతైలం కుష్ఠదేవతరోస్తథా,

దుందిలపువేళ్లు, గుమ్ముడువేళ్లు, నెల్లివేళ్లు, పాదిరివేళ్లు, మారేడువేళ్లు, వీనికాఁడలను ఎనిమిదియంగుళముల ప్రమాణముగ గ్రహించి వానికి పట్టువస్త్రముచుట్టి పైనతైలముచేఁ దడపి వెలిగించిన నందుండి తైలము స్రవించును. దానిని కించిదుష్ణముగ కర్ణంబునవైచిన కర్ణశూల హరించును. ఇది దీపికాతైలమనంబడును. ఇట్లనే చెంగల్వకోష్టు, దేవదారు మొదలగువాని నుండి తైలమును గ్రహింపవలెను.

## కర్ణశూలలకు శ్యోనాకతైలము.

తైలం శ్యోనాకమూలేన మందేఽగ్నౌ పరిపాచితమ్. 140

హరేదాశు త్రిదోషోత్థం కర్ణశూలం ప్రపూరణాత్,

పెద్దమ్రానువేరును కల్కముగావించి దానికంటె నాల్గింతలు తైలముంబోసి తైలమునకు నాల్గింతలు నీరుపోసి తైలము మిగులునట్లు కాచి దానిని కర్ణంబునంబోసిన త్రిదోషోద్భవంబగు కర్ణశూల హరించును.

### కర్ణనాదహరతైలము.

కల్కక్వాథేన యష్ట్యాహ్వ కాకోలీమాషధాన్యకైః. 141
సూకరస్య వసా పక్వా కర్ణనాదార్తిహారిణీ,

అతిమధురము, కాకోళి, మినుములు, ధనియములు వీనిని కషాయముగాచి వీనినే కల్కముగావించి పందియొక్క వసనుబోసి దానిని కర్ణంబునంబోసిన కర్ణనాదము హరించును.

### కర్ణనాదాదులకు తైలము.

స్వర్జికామూలకం శుష్కం హింగుకృష్ణాసమన్వితమ్. 142
శతపుష్పాచతైస్తైలం పక్వం సూక్తం చతుర్గుణం,
ప్రణాదం శూలబాధిర్యం స్రావం కర్ణస్య నాశయేత్. 143

సర్జక్షారము, ఎండినముల్లంగిదుంప, ఇంగువ, పిప్పళ్లు, పెద్దసోపు, వీనిని సమభాగంబులుగ కల్కము గావించి యాకల్కమునకు నాల్గింతలు నూనెంబోసి నూనెకుసమముగా సూక్తమువైచి పాకంబుగావించి కర్ణంబునం బోసిన కర్ణనావము, కర్ణశూల, కర్ణస్రావము మొదలగునవి నశించును.

### చెవుడుకు అపామార్గతైలము.

అపామార్గక్షారజలే తత్క్షారం కల్కితం క్షిపేత్,
తేన పక్వం జయేత్తైలం బాధిర్యం కర్ణనాదకమ్. 144

ఉత్తరేణిచెట్టునుగాల్చి యాబూడిదను నాల్గింతలు నీళ్లుపోసి రాత్రియుంచి ప్రాతఃకాలమున నాతేటనీరును తీసికొని యందు ఉత్తరేణిక్షారమును కల్కము గావించి యందు తైలము పోసి కాచి యాతైలమును కర్ణంబునంబోసిన చెవుడు, కర్ణనాదములు నశించును.

### కర్ణవ్రణములకు శంబూకతైలము.

శంబూకస్య తు మాంసేన పచేత్తైలం తు సార్షపం,
తస్య పూరణమాత్రేణ కర్ణనాడీ ప్రశామ్యతి. 145

నత్తగుల్లయందలి మాంసమును గ్రహించి దానికి నాల్గింతలు తెల్లఆవనూనెవైచి పక్వముగావించి కర్ణంబునంబోసిన కర్ణవ్రణములు నశించును.

### కర్ణస్రావమునకు చికిత్స.

చూర్ణం పంచకషాయాణాం కపిత్థరసమేవ చ,
కర్ణస్రావే ప్రశంసంతి పూరణం మధునా సహ. 146

పైశ్లోకమునం జెప్పంబోయెడిపంచకషాయద్రవ్యములను చూర్ణము గావించి యందు వెలగపండ్లరసము, తేనె గలిపి కర్ణంబునంబోసిన కర్ణస్రావము హరించును.

### పంచకషాయవృక్షములు.

తిందుకాన్యభయాలోధ్రస్సమంగాచామలక్యపి,
జ్ఞేయాః పంచకషాయాస్తు కర్మణ్యస్మిన్ భిషగ్వరైః. 147

నల్లతుమికి, కరకకాయ, లొద్దుగ, చిఱువేరు, ఉసిరిక, ఇయ్యవి పంచకషాయవృక్షము లనంబడును.

### కర్ణస్రావమునకు చికిత్స.

స్వర్జికాచూర్ణసంయుక్తం బీజపూరరసం క్షిపేత్,
కర్ణస్రావరుజాదాహాః ప్రణశ్యంతి న సంశయః. 148

సర్జక్షారమును మాదీఫలపురసముతో గలిపి కర్ణంబునంబోసిన కర్ణస్రావము, శూలతాపము హరించును.

### చెవిలో చీముకాఱుటకు చికిత్స.

ఆమ్రజంబూప్రవాళాని మధూకస్య వటస్య చ,
ఏభిస్సంసాధితం తైలం పూతికర్ణప్రశాంతికృత్. 149

మామిడి, నేరేడు, ఇప్ప, మఱ్ఱి వీనిచిగుళ్లను నూరి కల్కముచేసి నాలుగింతలు నూనెంబోసి కాచి కర్ణంబునంబోసిన కర్ణస్రావము హరించును.

### కర్ణకీటములకు చికిత్స.

పూరణం హరితాళేన గవాం మూత్రయుతేన చ,
అథవా సార్షపం తైలం కర్ణకీటహరం పరమ్. 150

తాళకము గోమూత్రములో గలిపిగాని, తెల్ల ఆవనూనెనుగాని కర్ణంబునంబోసిన కర్ణమందలి పురుగులు నశించును.

అన్యచ్చ.—స్వరసం శిగ్రుమూలస్య సూర్యావర్తరసం తథా,
త్ర్యూషణం చూర్ణితం చైవ కపికచ్ఛూరసం తథా. 151
కృత్వైకత్ర క్షిపేత్కర్ణే కర్ణకీటహరం పరం,

త్రికటుకములను చూర్ణముగావించి యందు మునగవేరురసము, సూర్యావర్తపు పువ్వులరసము, దురదగొండివేరురసము కలిపి కర్ణంబునంబోసిన పురుగులు నశించును.

సహోర్వ హింగుర్విహంత్యాశు కర్ణకీటం సుదారుణమ్.

ఇతి శ్రీదామోదరసూను శార్ఙ్గధరేణ విరచితాయాం సంహితాయా

ముత్తరఖండే చికిత్సాస్థానే లేపాదికర్ణపూరణాంతవిధికథనం నామ

ఏకాదశోఽధ్యాయః

ఇంగువను నీటితోఁ గలిపి కర్ణంబునంబోసిన పురుగులు నశించును.

ఇది శ్రీదామోదరసూను శార్ఙ్గధరవిరచితసంహితయందు చికిత్సాస్థానమున

నుత్తరఖండమందు లేపాదికర్ణపూరణాంతవిధికథన మనియెడు

ఏకాదశాధ్యాయము సంపూర్ణము.

---

# ద్వాదశాధ్యాయము.

## రక్తస్రావవిధి.

శోణితం స్రావయేజ్జంతోరామయం ప్రసమీక్ష్య చ,
ప్రస్థం ప్రస్థార్ధకం వాపి ప్రస్థార్ధార్ధమథాపి వా. 1

రక్తమోక్షణము చేయఁదగిన కుష్ఠాదిరోగంబులందు రోగభేదముచేత ప్రస్థమును గాని, అర్ధప్రస్థమునుగాని, ప్రస్థములో నాల్గవవంతుగాని రక్తమును స్రవింపఁజేయవలెను.

## రక్తస్రావమున కర్హ మగుకాలము.

శరత్కాలే స్వభావేన కుర్యాద్రక్తస్రుతిం నరః,
త్వగ్దోషగ్రంథిశోఫాద్యా న స్యూర్రక్తస్రుతేర్యతః. 2

స్వభావమర్యాదచే శరత్కాలంబున రక్తమోక్షణము చేయందగును. రక్తమోక్షణంబుచే చర్మవ్యాధులు, గ్రంథులు, శోఫము మొదలగు వ్యాధులు నశించును.

## రక్తముయొక్క రసాదిస్వరూపము.

మధురం వర్ణతో రక్తమశీతోష్ణం తథా గురు,

శోణితం స్నిగ్ధవిస్రం స్యాద్విదాహశ్చాస్య పిత్తవత్. 3

రక్తము మధురవర్ణంబుగల్గి, యెఱ్ఱనై, యతీతోష్ణంబునై జడత్వము గల్గి దట్టమై యామగంధము గల్గి పిత్తమునుంబోలి విదాహము గల్గియుండును.

రక్తస్థానమున పృథివ్యాదిపంచభూతగుణములు.

విస్రతా ద్రవతా రాగశ్చలనం విలయస్తథా,
భూమ్యాదిపంచభూతానా మేతే రక్తగుణాస్స్మృతాః 4

ఇందు ఆమగంధము పృథివీగుణంబై, ద్రవత్వము జలగుణంబై, రక్తవర్ణము తేజోగుణంబై, చలనము వాయుగుణంబై, లీనత ఆకాశగుణంబై, రక్తము పంచమహాభూత సమ్మేళనముచేఁ బుట్టుచున్నది.

దుష్టరక్తలక్షణము.

రక్తదుష్టే వేదనా స్యాత్పాకో దాహశ్చ జాయతే,
రక్తమండలతా కండూశ్శోఫశ్చ పిటికోద్గమః. 5

రక్తము దుష్టంబయ్యెనేని శరీరమున వేదన, పాకము, తాపము, రక్తమండలములు, దురద, వాపు, పుండ్లు గలుగును.

రక్తవృద్ధియందుఁ గలుగులక్షణములు.

వృద్ధే రక్తాంగనేత్రత్వం సిరాణాం పూరణం తథా,
గాత్రాణాం గౌరవం నిద్రా మదో దాహశ్చ జాయతే. 6

శరీరమున రక్తము వృద్ధిఁజెందెనేని, శరీరము, నేత్రములు యెఱ్ఱఁబాఱియుండుట, సిరలు ఉబ్బియుండుట, శరీరమున జాడ్యము, అతినిద్ర, మదము, తాపము గలుగును.

రక్తక్షయమున గలుగులక్షణములు.

క్షీణేఽమ్లమధురాకాంక్షా మూర్ఛా చ త్వచి రూక్షతా,
శైథిల్యం చ సిరాణాం స్యాద్వాతాదున్మార్గగామితా. 7

రక్తము క్షీణించినయెడల అమ్ల, మధురపదార్థములందు ఇచ్ఛ, మూర్ఛ, చర్మమందు రూక్షత, సిరలకు శైథిల్యము, వాతమునకు ఊర్ధ్వగమనము గలుగును.

వాతదుష్టరక్తలక్షణము.

అరుణం ఫేనిలం రూక్షం పరుషం తనుశీఘ్రగం,
అస్కంది సూచినిస్తోదం రక్తం స్యాద్వాతదూషితమ్. 8

వాతముచే దుష్టంబగురక్తము ఎఱ్ఱనై నురుగుతో గూడియుండి రూక్షంబై, పరు

మంబై, లఘువుగనుండి శీఘ్రగమనంబు గలదియై గడ్డగట్టక సూదులంబొడుచు చందంబున వేదనం గలుగఁజేయును.

### పిత్తదుష్టరక్తలక్షణము.

పిత్తేన పీతం హారితం నీలం శ్యావం చ విస్రకం,
అస్కందుష్ణం మక్షికాణాం పిపీలానామనిష్టకమ్. 9

పిత్తముచే దుష్టంబగురక్తము పచ్చగను, ఆకుపసరురంగుగను, నీలవర్ణంబుగఁగాని, శ్యామవర్ణంబుగఁగాని యుండి ఆమగంధముగల్గి చాంచల్యరహితంబై ఉష్ణంబుగను, ఈఁగ, చీమలు మొదలగు జంతువుల కనిష్టంబై యుండును.

### కఫదుష్టరక్తలక్షణము.

శీతం చ బహులం స్నిగ్ధం గైరికోదకసన్నిభం,
మాంసపేశీప్రభం స్కందీ మందగం కఫదూషితమ్. 10

కఫముచే దుష్టంబగురక్తము శీతలంబై, స్నిగ్ధంబై కావిరాయినీటిచందంబునను, మాంసపుతునకలంబోలియు సన్ననిగ్రంథులు గల్గి దట్టమైన మందగమనము గలదియై యుండును.

### ద్విదోషాదిదుష్టరక్తలక్షణము.

ద్విదోషదుష్టం సంసృష్టం త్రిదుష్టం పూతిగంధకం,
సర్వలక్షణసంయుక్తం కాంజికాభం చ జాయతే. 11

ద్విదోషదుష్టంబగురక్తము ద్విదోషలక్షణంబులను గల్గియుండును, త్రిదోషదుష్టంబగురక్తము దుర్గంధయుక్తమై త్రిదోషలక్షణంబులుంగలిగి కాంజికముం బోలియుండును.

### విషదుష్టరక్తలక్షణము.

విషదుష్టం భవేచ్ఛ్యావం నాసికోన్మార్గగం తథా,
విస్రం కాంజికసంకాశం సర్వకుష్ఠకరం బహు. 12

విషదుష్టంబగురక్తము కపిలవర్ణము గలిగి, ఊర్ధ్వగమనముగల్గి నాసికారంధ్రముగుండా స్రవించుచు ఆమగంధముగలదియై కాంజికమువలె నుండును. అట్టిరక్తము సర్వకుష్ఠములను జనింపఁజేయును.

### వికారరహితరక్తలక్షణము.

ఇంద్రగోపప్రభం జ్ఞేయం ప్రకృతిస్థమసంహతం,
శుద్ధంబగురక్తము ఆర్ద్రపురుగువలె నెఱ్ఱనై లేటగనుండును.

### రక్తస్రావమున కర్హమగు రోగములు.

శోఫే దాహేఽంగపాకే చ రక్తవర్ణే సృజస్స్రుతౌ. 13

వాతరక్తే తథా కుష్ఠే సపీడే దుర్జయేఽనిలే,
పాణిరోగే శ్లీపదే చ విషదుష్టే చ శోణితే. 14
గ్రంథ్యర్బుదాపచి క్షుద్రరోగరక్తాధిమంథిషు,
విదారీస్తనరోగేషు గాత్రాణాం సాదగౌరవే. 15
రక్తాభిష్యందతంద్రాయాం పూతిఘ్రాణాస్య దేహకే,
యకృత్ప్లీహావిసర్పేషు విద్రధౌ పిటికోద్గమే. 16
కర్ణౌష్ఠఘ్రాణవక్త్రాణాం పాకే దాహే శిరోరుజి,
ఉపదంశే రక్తపిత్తే రక్తస్రావః ప్రశస్యతే. 17

వాపు, తాపము, శరీరపాకము ఈరోగంబులుగలవారికిని, శరీరము రక్తవర్ణముగ నుండువారికిని, ముక్కునుండి రక్తము స్రవించెడువారికిని, వాతరక్తము, కుష్ఠము, వాతపీడ, పాణిరోగము, బోదకాలు, విషదోషము, రక్తదోషము, గ్రంథి, అర్బుదము, అపచి, క్షుద్రరోగము, రక్తాధిమంథము, విదారి, స్తనరోగము, గాత్రశైథిల్యము, అంగభారము, రక్తాభిష్యందము, తంద్ర, పూతినాసిక, పూతిముఖము, దేహమందు దౌర్గంధ్యము, యకృదుదరము, ప్లీహోదరము, విసర్పము, విద్రధి, పిటికారోగము, కర్ణపాకము, ఓష్ఠపాకము, తాపము, శిరఃపీడ, ఉపదంశము, రక్తపిత్తము ఈరోగములయందు రక్తస్రావము చేయందగును.

### రక్తముతీయువిధానము.

ఏషు రోగేషు శృంగైర్వా జలౌకాలాబుకైరపి,
అథవాఽపి సిరామోక్షైః కుర్యాద్రక్తస్రుతిం నరః. 18

పూర్వము చెప్పినరోగంబులందు కొమ్ముచేగాని, జలగలచేగాని, సొరకాయబుఱ్ఱలచేగాని, సిరలచేగాని రక్తమోక్షణము చేయందగును.

### సిరలచే రక్తము తీయుట కనర్హమగురోగములు.

న కుర్వీత సిరామోక్షం కృశస్యాతివ్యవాయినః,
క్లీబస్య భీరోర్గర్భిణ్యాస్సూతికాపాండురోగిణామ్. 19
పంచకర్మవిశుద్ధస్య పీతస్నేహస్య చార్శసాం,
సర్వాంగశోఫయుక్తానాముదరిశ్వాసకాసినామ్. 20
ఛర్ద్యతీసారయుక్తానామతిస్విన్నతనోరపి,
ఊనషోడశవర్షస్య గతసప్తతికస్య చ. 21
ఆఘాతస్రుతరక్తస్య సిరామోక్షో న శస్యతే,

ఏషాం చాత్యయికో రోగే జలోకాభిస్తు నిర్హరేత్. 22
తథాపి విషయుక్తానాం సిరామోక్షోపి శస్యతే,

కృశించినవానికి, అతిమైథునము చేసినవానికి, నపుంసకునకు, భీతునకు, గర్భిణీస్త్రీలకు, బాలింతరాలుకు, పాండురోగికి, వమనాది పంచకర్మలచే పరిశుద్ధుఁడయినవానికి, స్నేహనము చేసినవానికి, మూలరోగము, సర్వాంగశోఫము, ఉదరము, శ్వాసము, కాసము, వాంతి, అతిసారము ఈరోగంబులుగలవారికి, అతిస్వేదితునకు, పదునాఱువత్సరంబులకు లోబడినవారికి, డెబ్బదివత్సరంబులు దాఁటినవానికి, అభిఘాతముచే రక్తము నష్టమైన వానికి వీరలకు రక్తమోక్షణము చేయందగదు, కాని వీరలకైనను రక్తమోక్షణము చేయందగినరోగ ముద్భవించినపుడుగాని, విషదోషము సంక్రమించినపుడుగాని, జలగలచేఁగాని, సిరామోక్షంబుచేఁగాని రక్తస్రావమును గలుగఁజేయవలెను.

వాతాదిదుష్టరక్తమును తీయునట్టిక్రమము.

గోశృంగేణ జలౌకాభిరలాబుభిరపి త్రిధా. 23
వాతపిత్తకఫైర్దుష్టం శోణితం స్రావయేద్బుధః,
ద్విదోషాభ్యాం తు సంసృష్టం త్రిదోషైరపి దూషితమ్. 24
శోణితం స్రావయేద్యుక్త్యా సిరామోక్షైః పదైస్తథా,

వాతదుష్టమగురక్తమును ఆవుకొమ్ముచేతను, పిత్తదుష్టం బగురక్తమును జలగలచేతను, కఫదుష్టంబగురక్తమును సొరకాయబుఱ్ఱలచేతను, ద్విదోషదుష్టంబగునట్టుగాని, త్రిదోషదుష్టం బగునట్టుగాని, రక్తమును శిరామోక్షంబుచేఁగాని, శలాకచేఁబొడిచికాని స్రవింపఁ జేయందగును.

శృంగాదులచే రక్తముతీయుక్రమము.

గృహ్ణాతి శోణితం శృంగం దశాంగులమితం బలాత్. 25
జలౌకాహస్తమాత్రం చ తుంబీ చ ద్వాదశాంగులం,
పదమంగులమాత్రేణ సిరా సర్వాంగశోధినీ. 26

కొమ్ము పదియంగుళములకు లోనున్న రక్తమును వెలిబుచ్చును. జలగలు హస్తప్రమాణము విస్తీర్ణమున నున్నరక్తమును వెలిఁబుచ్చును. సొరకాయబుఱ్ఱలు పదిరెండంగుళముల విస్తీర్ణమున నున్నరక్తమును వెలిఁబుచ్చును. శలాకంగులము విస్తీర్ణమున నున్నరక్తమును వెలిబుచ్చును. సిరలు సర్వశరీరమున నున్న రక్తమును శోధించును.

రక్తము వెడలకుండుటకు గలకారణములు.

శీతే నిరన్నే మూర్ఛార్తి తంద్రాభీతిమదశ్రమైః,
యుతానాం న ప్రవేద్రక్తం తథా విణ్మూత్రసంగినామ్. 27

శీతకాలంబునను, భుజింపని వానికిని, మూర్ఛ, తంద్ర, భయము, వాదము, శ్రమము ఇవి గలవారికిని, బాగుగా మలమూత్రవిసర్జనము గానివారికిని రక్తము స్రవింపదు.

వెలిపడకుండెడిరక్తమునకు ప్రతీకారము.

అప్రవర్తిని రక్తే చ కుష్ఠచిత్రకసైంధవైః,
మర్దయేద్వ్రణవక్త్రం చ తేన సమ్యక్ప్రవర్తతే. 28

రక్తమోక్షణకాలంబున సిరలనుండి రక్తము బాగుగా స్రవింపక పోయినచో చెంగల్వకోష్టు, చిత్రమూలము, సైంధవలవణము వీనిని చూర్ణముగావించి వ్రణముఖంబున రుద్దిన రక్తము బాగుగా స్రవించును.

రక్తముతీయఁదగనికాలము.

తస్మాన్న శీతే నాత్యుష్ణే న స్విన్నే నాతితాపితే,
పీత్వా యవాగూం తృప్తస్య శోణితం స్రావయేద్బుధః. 29

అతిశీతము, అత్యుష్ణము గానికాలంబున, అతిస్వేదము, అతితాపము లేనివానికి యవాగువును పానంబుచేయించి రక్తమోక్షణము చేయందగును.

రక్తాతిప్రవృత్తికి కారణము.

అతిస్విన్నస్యోష్ణకాలే తథైవాతిసిరావ్యధాత్,
అతిప్రవర్తతే రక్తం తత్ర కుర్యాత్ప్రతిక్రియామ్. 30

అతిస్వేదితునకును, ఉష్ణకాలంబునను, సిరలను అధికముగ వేధించుటచేతను, రక్తమునకు అతిప్రవృత్తి గలుగును. అందు చికిత్సం జేయదగును.

రక్తాతిప్రవృత్తికి ప్రతిక్రియ.

అతిప్రవృత్తే రక్తే చ లోధ్రసర్జరసాంజనైః,
యవగోధూమచూర్ణైర్వా ధవధన్వనగైరికైః. 31

సర్పనిర్మోకచూర్ణైర్వా భస్మనా క్షౌమవస్త్రయోః,

ముఖం వ్రణస్య బధ్వా చ శీతైశ్చోపచరేద్వ్రణమ్. 32
విధ్యేదూర్ధ్వం సిరాంతాం వా దహేత్క్షారేణ వాఽగ్నినా,
వ్రణం కషాయస్సంధత్తే రక్తం స్కందయతే హిమమ్. 33
వ్రణాస్యం పాచయేత్క్షారో దాహస్సంకోచయేచ్ఛిరాం,

అట్లు రక్తము విశేషంబుగా స్రవించుచుండెనేని లొద్దుగచెక్క, సర్జరసము, రసాంజనము వీనిచూర్ణమునుగాని, యవలు, గోధుమలు వీనిచూర్ణంబునుగాని, ధవవృక్షపుపట్ట,

దురదగొండివేరు, కావిరాయి వీనిచూర్ణమునుగాని, పాముయొక్క కుబుసముయొక్క చూర్ణమునుగాని పట్టుగుడ్డ, లేక వస్త్రము వీని బూడిదనుగాని వ్రణముఖంబున నదిమి కట్టుకట్టి చందనలేపాదులచే శీతోపచారంబులఁ జేయందగును. ఇట్టికర్మచే రక్తస్రావము నిలువకుండెనేని మరల పైభాగముననున్న సిరను వేధించవలెను. లేక అట్టి వ్రణముఖంబున అగ్నికర్మమునుగాని, క్షారకర్మమునుగాని చేయందగును. ఈచెప్పినకర్మలయందు మొదటిచూర్ణాదులు వ్రణముఖమును సంధింపఁజేయును. చందనాది శైత్యోపచారములు రక్తమును గడ్డకట్టినట్లుచేయును. క్షారము వ్రణముఖపాకమును గల్గించును. అగ్నికర్మము సిరాసంకోచనమును గలుగఁజేయును.

## అగ్నిదాహముచేఁ దొలగెడిరోగములు.

వామాంగశోఫే దక్షస్య కరస్యాంగుష్ఠమూలజామ్. 34
దహేచ్ఛిరాం వ్యత్యయే తు వామాంగుష్ఠసిరాం దహేత్,
సిరాదాహప్రభావేన ముష్కశోఫః ప్రశామ్యతి. 35
విషూచ్యాం పాదదాహేన జాయతేఽగ్నేః ప్రదీపనం,
సంకుచంతి యతస్తేన రసశ్లేష్మవహాస్సిరాః. 36
యదా వృద్ధిర్యకృత్ప్లీహోర్నిశ్శోస్సంజాయతేఽసృజః,
తదా తత్స్థానదాహేన సంకుచంత్యసృజస్సిరాః. 37

ఎడమపార్శ్వమందలి అండము వాచియుండెనేని కుడి చేతిబొటనవ్రేలుయొక్క మూలసిరను దహింపవలెను. కుడిప్రక్క అండము వాచియుండెనేని ఎడమచేయి బొటనవ్రేలుయొక్క మూలసిరను దహింపవలయును. ఇట్లుచేసిన ముష్కశోఫము హరించును. విషూచికారోగంబున కాలియొక్క పార్ష్ణి (మడమ) యందు దాహముచేసిన రసవహాంబులును, కఫవహాంబులును నగు సిరలు సంకోచముఁజెంది అగ్నిదీప్తి గలుగును. రక్తదోషము వలన బాలురకు యకృత్ప్లీహములు వృద్ధిఁజెందెనేని యాస్థలమున దాహకర్మముచేసిన సిరలకు సంకోచము గలుగును.

## రక్తాతిస్రావముచేఁ గలుగుదోషములు.

రక్తే దుష్టేఽవశిష్టేఽపి వ్యాధిర్నైవ ప్రకుప్యతి,
అతః స్రావ్యం సావశేషం రక్తేనాతిక్రమో హితః. 38
ఆంధ్యమాక్షేపకం తృష్ణాం తిమిరం శిరసో రుజం,
పక్షాఘాతం శ్వాసకాసౌ హిక్కాం దాహం చ పాండుతామ్. 39
కురుతేఽతిస్రుతం రక్తం మరణం వా కరోతి చ,

రక్తమోక్షణముచేయునపుడు దుష్టరక్తము కొంచెముమిగిలియుండఁగనే విరమించవలెను. అంతమాత్రముచే వ్యాధి వృద్ధిఁజెందనేఱదు. కాని అతిమాత్రముగా మాత్రము స్రవింపచేయందగదు. అట్లుచేసిన గృధ్రసి, ఆక్షేపకము, దప్పి, తిమిరరోగము, శిరఃపీడ, పక్షఘాతము, శ్వాసము, కాసము, ఎక్కిళ్లు, తాపము, పాండువు ఈరోగంబులు పుట్టుటయేగాక మరణముగూడ సంభవించును.

రక్తసంరక్షణవిధి.

దేహస్యోత్పత్తిరసృజా దేహస్తేనైవ ధార్యతే. 40
వినా తేన ప్రజేజ్జీవో రక్షేద్రక్తమతో బుధః,

రక్తము దేహోత్పత్తికి కారణంబై దేహమును సర్వదా తృప్తిపఱచుచు ధరించుచున్నది. అట్టిరక్తము లేకుండిన శరీరము నశించును గాన రక్తము ఎల్లప్పుడు కాపాడుచుండందగును.

రక్తము తీసినపిదప ప్రకోపించుదోషములకు చికిత్స.

శీతోపచారైః కుపితే స్రుతరక్తస్య మారుతే. 41
కోష్ణేన సర్పిషా శోఫం సవ్యథం పరిషేచయేత్,

రక్తమోక్షణంబున శీతోపచారంబులచే వాతము ప్రకోపముఁజెంది వాపును, పోటును గల్గించెనేని నేతిని కొంచెము వెచ్చఁజేసి లేపనము చేయందగును.

రక్తము తీసినపిదప అనుష్ఠింపఁదగినపథ్యము.

క్షీణస్యైణశశోరభ్రహరిణచ్ఛాగమాంసజః. 42
రసస్సముచితః పానే క్షీరం వా షష్టికా హితా,

రక్తమోక్షణంబుచే శరీరమునకు కార్శ్యము గల్గినచో జింక, కుందేలు, మేఁక, నల్లజింక, గొఱ్ఱె వీని మాంసరసమును నొసంగవలెను. మఱియు షష్ఠికపు బియ్యపు అన్నమును పాలతో భుజింపఁజేయవలయును.

రక్తము చక్కఁగ వెడలుటచేఁ గలుగులక్షణములు.

పీడాశాంతర్లఘుత్వం చ వ్యాధేరుద్రేకసంక్షయః. 43
మనస్స్వాస్థ్యం భవేచ్చిహ్నం సమ్యగ్విస్రావితేఽసృజి,

బాధతొలఁగుట, శరీరమందు లాఘవము, దోషప్రకోపము శమించుట, మనస్సునకు స్వాస్థ్యము ఇవి బాగుగా రక్తమోక్షణంబైన గలుగుచిహ్నములు.

రక్తముతీసినపిదప వర్జించతగినక్రియలు.

వ్యాయామమైథునక్రోధశీతస్నాతప్రవాతకాన్. 44

౦శనం దివానిద్రాం క్షారామ్లకటుభోజనం,
ం వాదమజీర్ణం చ త్యజేదాబలదర్శనాత్. 45

ంమోదరసూను శార్ఙ్గధరేణ విరచితాయాం సంహితాయాం
కిత్సాస్థానే ఉత్తరఖండే రక్తమోక్షవిధికథనంనామ
ద్వాదశోఽధ్యాయః.

మోక్షణానంతరంబున వ్యాయామము, మైథునము, క్రోధము, శీతలజలస్నా
ము గాలియందుండుట, ఒకవిధమగు ధాన్యమునే భుజించుట, పగలు
క్షారము, పులుసు, కారము ఈపదార్థములను భుజించుట, దుఃఖించుట, వాద
అజీర్ణపదార్థములను భుజించుట వీనిని బలము వచ్చువఱకును విసర్జింపవలెను.

శ్రీదామోదరసూను శార్ఙ్గధరవిరచితసంహితయందు చికిత్సాస్థానమున
నుత్తరఖండమందు రక్తమోక్షవిధికథన మనియెడు
ద్వాదశాధ్యాయము సంపూర్ణము.

---

# త్రయోదశాధ్యాయము.

## నేత్రములు లేటపడుటకు ఉపచారములు.

క అశ్చ్యోతనం పిండీ బిడాలస్తర్పణం తథా,
టపాకోఽంజనం చైభిః కల్పైర్నేత్రముపాచరేత్. 1

ము, ఆశ్చ్యోతనము, పిండి, బిడాలవణము, తర్పణము, పుటపాకము, అంజ
నియెడు కల్పోపచారంబుచేతను నేత్రరోగంబులకు చికిత్సం జేయనగును.

## సేకలక్షణము.

కస్తు సూక్ష్మధారాభిస్సర్వస్మిన్నయనే హితః,
రాలితాక్షస్య మర్త్యస్య ప్రదేయశ్చతురంగులాత్. 2

త్రములను కొంచెము తెఱచి యందు పాలు, నేయి, ఆకులస్వరసము మొద
నాలుగు అంగుళముల యెత్తునుండి ధారగా విడచుట సేకం బనంబడును.

వాతాదులయందు సేకభేదములు.

స చాపి స్నేహనో వాతే రక్తే పిత్తే చ రోపణః,
లేఖనశ్చ కఫే కార్య స్తస్య మాత్రాఽధునోచ్యతే. 3

అట్టి సేకములో వాతప్రకోపంబున స్నేహనసేకంబును, రక్తపిత్తప్రకోపంబున రోపణసేకంబును, కఫప్రకోపంబున లేఖనసేకంబును ప్రయోగింపందగును. వీని ప్రమాణ కాలము ఉత్తరత్ర చెప్పఁబడును.

స్నేహనాదిసేకకాలప్రమాణము.

షడ్వాక్ఛతైః స్నేహనేషు చతుర్భిశ్చైవ రోపణే,
వాక్ఛతైశ్చ త్రిభిః కార్యస్సేకో లేఖనకర్మణి. 4

స్నేహనసేకంబున నాఱునూర్లసంఖ్యలు యెంచువఱకును, రోపణసేకంబున నాల్గునూర్లసంఖ్యలను యెంచువఱకును, లేఖనసేకంబున మున్నూఱుసంఖ్యల నెంచువఱకును ఔషధద్రవ్యమును నేత్రములందు ధారగ విడుచుచుండవలయును.

సేకమున కర్హమగుకాలము.

కార్యస్తు దివసే సేకో రాత్రౌ చాత్యయికే గదే,

ఇట్టి సేకమును పగటియందే ప్రయోగింపవలయును. కాని రోగాధిక్యత ననుసరించి రాత్రిగూడ ప్రయోగింపందగును.

వాతాభిష్యందరోగమునకు చికిత్స.

ఏరండత్వక్పత్రమూలైశ్శృతమాజం పయో హితమ్. 5
సుఖోష్ణం సేచనం నేత్రే వాతాభిష్యందనాశనం,

ఆముదపుపట్టను, ఆకులను, వేరును మేఁకపాలతో నుడుకఁబెట్టి యాపాలను కించిదుష్ణముగ నేత్రములయందుఁ బోసిన వాతాభిష్యందము నశించును.

అన్యచ్చ—పరిషేకో హితం నేత్రే పయః కోష్ణం ససైంధవమ్. 6
రజనీదారుసిద్ధం వా సైంధవేన సమన్వితం,
వాతాభిష్యందశమనం హితం మారుతపర్యయే. 7
శుష్కాక్షిపాకే చ హితమిదం సేచనకం తథా,

మేఁకపాలలో సైంధవలవణమును గలిపి కాచి సుఖోష్ణంబుగ నేత్రములంబోసిన గాని పసుపు, దేవదారు, సైంధవలవణము వీని చూర్ణమును మేఁకపాలతోఁ గలిపి వెచ్చఁజేసిగాని నేత్రములం బోసిన వాతాభిష్యందము, వాతవిపర్యయము, శుష్కాక్షిపాకము నశించును.

—• పిత్తరక్తాభిఘాతములకు సేకము. •—

్ఠం మధుకం తుల్యాం ఘృతభృష్టం సుచూర్ణితమ్. 8
్షీరే ఘృతం సేకాత్పిత్తరక్తాభిఘాతజిత్,

చెక్క, అతిమధురము వీనిని సమభాగంబులుగ నేతిలో వేచి చూర్ణము
ోఁ గాచి నేత్రములం బోసిన పిత్తవికారము, రక్తవికారము,అభిఘాతము
ములు నశించును.

—• రక్తాభిష్యందమునకు సేకము. •—

లాలోధ్రయష్టీభిశ్శర్కరాభద్రముస్తకైః. 9
శ్శీతాంబునా సేకో రక్తాభిష్యందనాశనః,

ములు, లొద్దుగ, అతిమధురము, చక్కెర, భద్రముస్తలు వీనిని సమభా
శీతోదకంబుతోఁ గలిపి నేత్రములంబోసిన రక్తాభిష్యందము నశించును.

—• రక్తాభిష్యందమునకు రెండక సేకము. •—

ామధుకమంజిష్ఠాలోధ్రకాలానుసారిబా. 10
ఁరీకయుతస్సేకో రక్తాభిష్యందనాశనః,

అతిమధురము, చిఱువేరు, లొద్దుగచెక్క, సుగంధిపాల, తెల్లతామర
నూటి నేత్రములంబోసిన రక్తాభిష్యందము నశించును.

—• నేత్రశూల తొలగుటకై సేచనము. •—

లోధ్రం ఘృతే భృష్టం చూర్ణితం పటవిస్రుతమ్. 11
ాంబునా విమృదితం సేకాచ్ఛూలఘ్నమంబకే,

ొద్దుగచెక్కను నేతిలో వేయించి చూర్ణముచేసి వస్త్రగాళితముచేసి యుష్ణో
నేత్రములంబోసిన నేత్రశూలలు హరించును.

—• ఆశ్చ్యోతనలక్షణము. •—

ాశ్చ్యోతనకం కార్యం నిశాయాం న కథంచన. 12
ిలితేఽక్ష్ణి దృక్మధ్యే బిందుభిర్ద్వ్యంగులాద్ధితం,

ములం దెఱచునటులఁజేసి నేత్రములకు రెండంగుళములయెత్తునుండి కషా
మొదలగువానిని ధారగ విడుచుట ఆశ్చ్యోతన మనంబడును. దానిని ఎపు
లయందు చేయందగదు.

—• లేఖనాదులయందు బిందుసంఖ్య. •—

వాోఽష్టౌ లేఖనేషు స్నేహనే దశబిందవః. 13

రోపణే ద్వాదశ ప్రోక్తాస్తే శీతే కోష్ణరూపిణః,
ఉష్ణే చ శీతరూపాస్స్యుస్సర్వత్రైవైష నిశ్చయః. 14

ఇట్టి నేత్రచికిత్సలందు లేఖనకర్మయందు ఎనిమిదిబిందువులను, స్నేహనకర్మయందు పదిబిందువులను, రోపణకర్మయందు పదిరెండుబిందువులను, శీతకాలంబున కించిదుష్ణముగను, ఉష్ణకాలంబున శీతలంబుగను ప్రయోగింపందగును. ఇయ్యది నేత్రచికిత్సలయందంతటను ప్రవర్తించు సామాన్యపరిభాష.

వాతాద్యాధిక్యము ఆశ్చ్యోతనద్రవ్యవిధి.

వాతే తిక్తం తథా స్నిగ్ధం పిత్తే మధురశీతలం,
తిక్తోష్ణరూక్షం చ కఫే క్రమాదాశ్చ్యోతనం హితమ్. 15

వాతప్రకోపంబున చేదు, స్నిగ్ధములగు ఆశ్చ్యోతంబులను, పిత్తప్రకోపంబున మధురము, శీతలము నగు నాశ్చ్యోతనంబులను, కఫప్రకోపంబున ఒగరు, ఉష్ణము రూక్షములగు ఆశ్చ్యోతనంబులను చేయవలయును.

ఆశ్చ్యోతనమాత్రాలక్షణము.

ఆశ్చ్యోతనానాం సర్వేషాంమాత్రా స్యాద్వాక్ఛతం హితం,
నిమేషోన్మేషణం పుంసామంగుళ్యోశ్చోఫ్టికాఽథవా. 16
గుర్వక్షరోచ్చారణం వా వాఙ్మాత్రేయం స్మృతా బుధైః,

ఇట్టి ఆశ్చ్యోతనంబును నూఱు సంఖ్యలు యెంచువఱకు చేయుచుండవలెను. ఱెప్పమూసి తెఱచునంతకాలముగాని, చిటికెవేయునంతటికాలముగాని, గుర్వక్షరమును ఉచ్చరించునంతకాలముగాని మాత్రాకాల మనంబడును.

వాతాభిష్యందమునకు ఆశ్చ్యోతనము.

బిల్వాదిపంచమూలేన బృహత్యేరండశిగ్రుభిః. 17
క్వాథ ఆశ్చ్యోతనే కోష్ణో వాతాభిష్యందనాశనః,

మారేడు, దుండిలము, గుమ్ముడు, నెల్లి, పాదిరి వీని వేళ్లతోడ ములక, ఆముదపువేళ్లు, మునగవేరు పట్ట వీనిని జేర్చి కషాయంబు గాచి దానిని సుఖోష్ణంబున నేత్రంబులం బోసిన వాతాభిష్యందము నశించును.

వాతాద్యభిష్యందములకు ఆశ్చ్యోతనము.

అంబుపిష్టైర్నింబపత్రైస్త్వచం లోధ్రస్య లేపయేత్. 18
ప్రతాప్య వహ్నినా పిష్ట్వా తద్రసో నేత్రపూరణాత్,
వాతోత్థం రక్తపిత్తోత్థమభిష్యందం వినాశయేత్. 19

వేపయాకులు నీటితోనూరి లొద్దుగచెక్కకు లేపనము చేసి నిప్పులో కాచి దానిని దంచి రసము తీసి యారసమును నేత్రములం బోసిన వాతాభిష్యందము, రక్త, పిత్తాభిష్యందము నశించును.

సర్వాభిష్యందములకు ఆశ్చ్యోతనము.

త్రిఫలాశ్చ్యోతనం నేత్రే సర్వాభిష్యందనాశనం,

త్రిఫలాకషాయంబును సుఖోష్ణంబుగ నేత్రములం బోసిన అభిష్యందరోగములన్నియు నశించును.

రక్తపిత్తాద్యభిష్యందములకు ఆశ్చ్యోతనము

స్త్రీస్తన్యాశ్చ్యోతనం నేత్రే రక్తపిత్తానిలార్తిజిత్. 20
క్షీరసర్పిర్ఘృతం వాపి వాతరక్తరుజం జయేత్,

చనుబాలను ఆశ్చ్యోతనంబు చేయుంటచేత రక్తపిత్తజనితవికారములు నశించును. మఱియుం పాల పైమీగడగాని, నేతినిగాని నేత్రములంబోసిన వాతరక్తపీడ హరించును.

పిండీలక్షణము.

పిండీకవలికా ప్రోక్తా బధ్యతే పట్టవస్త్రకైః. 21
నేత్రాభిష్యందయోగ్యా సా వ్రణేష్వపి నిబధ్యతే,

ఔషధద్రవ్యములను నూరి యుండఁజేసి నేత్రములపై వైచి బట్టతో కట్టుకట్టుట పిండి యనంబడును. ఇట్టిపిండి అభిష్యందములను బోగొట్టును, మఱియు దీనిని వ్రణములందుఁ గూడ గట్టదగును.

నేత్రాభిష్యందమునకై శిరోవిరేచనము.

అభిష్యందేఽధిమంథే చ సంజాతే శ్లేష్మసంభవే. 22
స్నిగ్ధస్విన్నోత్తమాంగస్య శిరస్తీక్ష్ణైర్విరేచయేత్,

శ్లేష్మాభిష్యందము, అధిమంథము ఈరోగములు గలవారిశిరంబునకు తైలముచే స్నిగ్ధకర్మముచేసి పిమ్మట స్వేదమునుజేసి తరువాత తీక్ష్ణౌషధంబులచే శిరోవిరేచనంబును జేయందగును.

అధిమంథరోగములకు చికిత్స.

అధిమంథేషు సర్వేషు లలాటే వేధయేచ్ఛిరామ్. 23
అశాంతే సర్వథా మంథే భ్రువోస్తు పరిదాహయేత్,

సర్వాధిమంథములయందును లలాటమందలి సిరను వేధించి రక్తమును స్రవింప

జేయవలయును. ఇట్టిదానిచే అధిమంథము శాంతిఁజెందకుండెనేని కనుబొమ్మలకుపైన అగ్ని కర్మ చేయందగదు.

సర్వాభిష్యందోపచారము.

అభిష్యందేషు సర్వేషు బధ్నీయాత్పిండికాం బుధః. 24
వాతాభిష్యందశాంత్యర్థం స్నిగ్ధోష్ణా పిండికా భవేత్,

అభిష్యందరోగముల కన్నిటికిని పిండి శ్రేష్ఠంబై యున్నది. అందు వాతాభిష్యందమున స్నిగ్ధంబై యుష్ణంబగుపిండి శ్రేష్ఠంబు.

వాతపిత్తాభిష్యందములకు పిండి.

ఏరండపత్రమూలత్వగ్భిర్నిర్మితా వాతనాశినీ. 25
పిత్తాభిష్యందనాశాయ ధాత్రీపిండీ సుఖావహా,

ఆముదపాకులు, వేరు, పట్ట వీనిని నూరి ముద్దఁజేసి నేత్రములందు కట్టుగట్టిగాని, ఉసిరికపప్పును నూరి కట్టినగాని వాతాభిష్యందము హరించును.

పిత్తాభిష్యందమునకు రెండవపిండి

మహానింబఫలోద్భూతా పిండీ పిత్తవినాశినీ. 26

తురకవేపపండును నూరి నేత్రములకు కట్టుకట్టిన శ్లేష్మాభిష్యందము నశించును.

శ్లేష్మాభిష్యందమునకు పిండి

శిగ్రుపత్రకృతా పిండీ శ్లేష్మాభిష్యందనాశినీ,

మునగయాకును నూరి ముద్దఁజేసి నేత్రములకు కట్టుగట్టిన శ్లేష్మాభిష్యందము హరించును.

శ్లేష్మపిత్తాభిష్యందములకు పిండి.

నింబపత్రకృతా పిండీ శ్లేష్మపిత్తహరా భవేత్. 27
త్రిఫలాపిండికా ప్రోక్తా నాశనే శ్లేష్మపిత్తయోః,

వేపయాకునుగాని, త్రిఫలములనుగాని నూరి ముద్దజేసి నేత్రములకు కట్టుగట్టిన శ్లేష్మ-పిత్త అభిష్యందములు హరించును.

రక్తాభిష్యందమునకు పిండి.

పిష్ట్వా కాంజికతోయేన ఘృతభృష్టా చ పిండికా. 28
లోధ్రస్య హరతి క్షిప్రమభిష్యందమసృగ్భవమ్,

లొద్దుగపట్టను కాంజికముతో నూరి నేతితో వెచ్చచేసి ముద్దగావించి నేత్రములకు కట్టుగట్టిన రక్తాభిష్యందము హరించును.

వాపు, దురద—వీనికి పిండి.

శుంఠీనింబదళైః పిండీ సుఖోష్ణా స్వల్పసైంధవా. 29
ధార్యా చక్షుషి సంయోగాచ్ఛోఫకండూవ్యథాపహా,

సొంటి, వేపయాకు వీనిని నూరి కొంచెము వెచ్చఁజేసి యందు స్వల్పముగా సైంధవలవణము గలిపి నేత్రములకు కట్టుగట్టిన నేత్రములందలి వాపు, దురద, బాధ నశించును.

బిడాలకలక్షణము.

బిడాలకో బహిర్లేపో నేత్రపక్ష్మవివర్జితః. 30
తస్య మాత్రా పరిజ్ఞేయా ముఖలేపవిధానవత్,

నేత్రములను మూయునటులంజేసి కనుఱెప్పవెంౘ్రుకలను వర్జించి నేత్రముల చుట్టును లేపనముచేయుట బిడాలక మనంబడును. ముఖలేపనంబునంబోలె దీని మాత్రాపరిమాణంబు నెఱుంగునది.

సర్వనేత్రరోగములకు లేపనము.

యష్టీగైరికసింధూత్థదార్వీతార్క్ష్యైస్సమాంశకైః. 31
జలపిష్టైర్బహిర్లేపస్సర్వనేత్రామయాపహః,

అతిమధురము, కావిరాయి, సైంధవలవణము, మ్రానిపసుపు, మయూరతుత్థము వీనిని సమభాగంబులుగ నీటితో నూరి నేత్రములపైన లేపనముచేసిన నేత్రరోగంబులన్నియుం నశించును.

అన్యచ్చ.—రసాంజనేన వా లేపః పథ్యావిశ్వాదళైరపి. 32
కుమారికాగ్నిపత్రైర్వా దాడిమీపల్లవైరపి,
వచాహరిద్రావిశ్వైర్వా తథా నాగరగైరికైః. 33

రసాంజనమునుగాని, కరక్కాయ, శొంఠి, లవంగపత్రి వీనినిగాని, కలబంద, చిత్రమూలపుఆకులు వీనినిగాని, దానిమ్మచిగుళ్లనుగాని, వస, పసుపు, శొంఠి వీనినిగాని, సొంటి, కావిరాయి వీనినిగాని నీటితో నూరి నేత్రములకు లేపనముచేసిన నేత్రరోగములన్నియుం నశించును.

అన్యచ్చ.—దగ్ధ్వాఽగ్నౌ సైంధవం లోధ్రం మధూచ్ఛిష్టయుతే ఘృతే,
పిష్టమంజనలేపాభ్యాం సద్యో నేత్రరుజాపహమ్. 34

సైంధవలవణము, లొద్దుగచెక్క వీనిని వేయించి అందు మైనమును, నేతిని గలిపి నేత్రముల కంజనముచేసినగాని, లేపనముజేసినగాని నేత్రరోగములు నశించును.

అన్యచ్చ — లోహస్య పాత్రే సంఘృష్టో రసో నింబఫలోద్భవః,
కించిద్ఘనో బహిర్లేపాన్నేత్రబాధాం వ్యపోహతి. 35

ఇనుపపాత్రములో నిమ్మపండ్లరసము వైచి యయ్యది గట్టిపడునట్లు మర్దించి నేత్రములచుట్టును లేపనము చేసిన నేత్రరోగము లన్నియు నశించును.

అర్మరోగమునకు లేపనము.

సంచూర్ణ్య మరిచం కేశరాజస్వరసమర్దనాత్,
లేపనాదర్మణాం నాశం కరోత్యేష ప్రయోగరాట్. 36

మిరియములను గుంటగలగరాకురసముతో మర్దనచేసి నేత్రములకు లేపనము చేసిన శుక్లార్మ, అధిమాంసార్మ మొదలగు నేత్రరోగములను హరించును.

కంటిమీఁదలేచు మొటిమకు ప్రతిసారణము.

స్విన్నాం భిత్త్వా వినిష్పీడ్య భిన్నామంజననామికాం,
శిలైలానతసింధూత్థైస్సక్షౌద్రైః ప్రతిసారయేత్. 37

అంజననామిక యనెడు కంటిమీఁది మొటిమలకు స్వేదకర్మముచేసి వానిని పగులునట్లుఁజేసి స్రావమును పిండిచేసి అందు మణిశిల, ఏలకులు, గ్రంథితగరము, సైంధవలవణము వీనిచూర్ణము తేనెతో గలిపి మర్దనచేసిన నవి నశించును.

నేత్రరోగములకు తర్పణము.

అథ తర్పణకం వచ్మి నేత్రతృప్తికరం పరం,
యద్రూక్షం పరిశుష్కం చ నేత్రం కుటిలమావిలమ్. 38
శీర్ణపక్ష్మశిరోత్పాతకృచ్ఛ్రోన్మీలనసంయుతం,
తిమిరార్జునశుక్రాద్యైరభిష్యందాధిమంథకైః. 39
శుష్కాక్షిపాకశోఫాభ్యాం యుక్తం వాతవిపర్యయైః,
తన్నేత్రం తర్పణే యోజ్యం నేత్రకర్మవిశారదైః. 40

రూక్షత్వము, శుష్కత, కౌటిల్యముగలనేత్రములందును, కలకఁబాఱిన నేత్రములందును, ఱెప్పవెండ్రుకలు రాలినపుడును, శిరోత్పాతము, కృచ్ఛ్రోన్మీలనము, తిమిరము, అర్జునము, కంటియందు పువ్వులు, అభిష్యందము, అధిమంథము, శుష్కాక్షిపాకము, నేత్రశోఫము, వాతవిపర్యయము అను నేత్రరోగంబులందును తర్పణచికిత్సం జేయవలెను. తర్పణ మనగా నేత్రములకు తృప్తిని గలుగఁజేయు చికిత్సాభేదము.

తర్పణచికిత్స కనర్హమగుకాలము.

దుర్దినాత్యుష్ణశీతేషు చింతాయాం సంభ్రమేషు చ,

అశాంతోపద్రవే చాక్ష్ణి తర్పణం న ప్రశస్యతే. 41

సూర్యరశ్మి లేని దినంబునను, అతిశీతకాలంబునను, అత్యుష్ణకాలంబునను, విచారము, తొందర గల్గియుండునపుడును, ఉపద్రవములు శాంతిజెందకుండునపుడును, నేత్రములందు తర్పణచికిత్స చేయదగును.

## తర్పణవిధానము.

వాతాతపరజోహీనే దేశే చోత్తానశాయినః,
ఆధారౌ మాషచూర్ణేన క్లిన్నేన పరిమండలౌ. 42
సమౌ దృఢావసంబాధౌ కర్తవ్యౌ నేత్రకోశయోః,
పూరయేద్ఘృతమండేన విలీనేన సుఖోదకైః. 43
అథవా శతధౌతేన సర్పిషా క్షీరజేన వా,
నిమగ్నాన్యక్షిపక్ష్మాణి యావత్స్యుస్తావదేవ హి. 44
పూరయేన్మీలితే నేత్రే తత ఉన్మీలయేచ్ఛనైః,

వాతము, ఎండ, దుమ్ము ఇవి లేని ప్రదేశంబున రోగిని వెల్లకిల పరుండబెట్టి మినుములను నానఁబెట్టి నూరి నేత్రముల చుట్టును సమంబుగను, దృఢంబుగను, కుదురువలె చేసి నేత్రములను మూసియుండు నటులఁజేసి యా కుదుటిలో నేత్రముల ఱెప్పవెండ్రుకలు మునుగువఱకును, లేటనేతినిగాని, సుఖోష్ణంబగు నుదకమునుగాసి నూరుమార్లు కడగబడిననేతినిగాని పాలనుగాని బోసి పిమ్మట నేత్రములను మెల్లగ తెఱచునటులఁ జేయందగును.

## తర్పణధారణమాత్రాకాలము.

ధారయేద్వర్త్మరోగేషు వాఙ్మాత్రాణాం శతం బుధః. 45
స్వచ్ఛే కఫే సంధిరోగే మాత్రాపంచశతం హితం,
శుక్లే చ షట్ఛతం కృష్ణారోగే సప్తశతం మతమ్. 46
దృష్టిరోగేష్వష్టశతమధిమంథే సహస్రకం,
సహస్రం వాతరోగేషు ధార్యమేవం హి తర్పణమ్. 47

వర్త్మరోగంబులందు నూఱుమాత్రలవఱకును, కఫరోగంబునను, సంధిగతనేత్రరోగంబునను, ఏనూఱుమాత్రల కాలంబువఱకును, శుక్ల (తెల్లగ్రుడ్డు) గతరోగంబులనాఱునూర్లమాత్రల కాలంబువఱకును, కృష్ణ (నల్లగ్రుడ్డు) గతరోగంబులందు ఏడునూర్ల కాలంబువఱకును, దృష్టిగతరోగంబున ఎనిమిదినూర్ల మాత్రల కాలంబువఱకును, అతిమంథము, వాతజరోగము వీనియందు వేయిమాత్రలకాలంబువఱకును తర్పణౌషధమును నేత్రములందు ధరించవలయును.

కఫశోధనవిధి.

స్విన్నేన యవపిష్టేన స్నేహావీర్యేరితం తతః,
యథాస్వం ధూమపానేన కఫమస్య విశోధయేత్. 4

ఇట్లు తర్పణమందలి స్నేహముచే నేత్రములందు కఫమువృద్ధిజెందెనేని తడః యవలను చూర్ణముచేసి ధూమపానంబు చేయించందగును.

తర్పణక్రియాకాలము.

ఏకాహం వా త్ర్యహం వాపి పంచాహం చేష్యతే పరం,

తర్పణోపచారమును ఒకదినముగాని, మూఁడుదినములుగాని, యైదుదినములుగా చేయందగును.

తర్పణతృప్తిలక్షణము.

తర్పణే తృప్తిలింగాని నేత్రస్యేమాని భావయేత్. 4
సుఖస్వప్నావబోధత్వం వైశద్యం వర్ణపాటవం,
నివృత్తిర్వ్యాధిశాంతిశ్చ క్రియాలాఘవమేవ చ. 5

తర్పణచికిత్స చక్కఁగా నిర్వర్తింపఁబడినచో సుఖముగ నిద్రపట్టుట, సుఖము మేల్కొనుట, నేత్రములు నిర్మలంబుగనుండుట, నేత్రములందు కాంతి చక్కఁగా గ యుండుట, దృష్టి నిర్మలంబగుట, రోగము నశించుట, సుఖముగా నేత్రములుమూయు తెఱచుట ఈచిహ్నంబులు చూపట్టును.

తర్పణాతృప్తిలక్షణము.

అథ సాశ్రు గురుస్నిగ్ధం నేత్రం స్యాదతితర్పితం,

నేత్రములనుండి నీరుకాఱుట, నేత్రములయందు మబ్బు, జిగటగలిగియుండు మొదలగు చిహ్నములు చూపట్టెనేని అతితర్పణ మయ్యెనని తెలియందగును.

తర్పణహీనలక్షణము.

రూక్షమస్రావిలం భుగ్నం నేత్రం స్యాద్ధీనతర్పితం. 5

నేత్రరోగములు తేజోహీనంబులై నీరుకాఱుటచే నెఱ్ఱఁబారి నేత్రములు కుం పోయి యుండినచో తర్పణము హీనమయ్యెనని తెలియందగును.

అతితర్పణాదులకు ప్రతిక్రియ.

రూక్షస్నిగ్ధోపచారాభ్యామేతయోస్స్యాత్ప్రతిక్రియా,

అతితర్పణం బయ్యెనేని రూక్షోపచారంబును, హీనతర్పణం బయ్యెనేని స్నిగ్ధో చారంబును చేయందగును.

### పుటపాకము.

అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి పుటపాకస్య సాధనమ్. 52
ద్వౌ బిల్వమాత్రౌ మాంసస్య పిండౌ స్నిగ్ధౌ సుపేషితౌ,
ద్రవ్యాణాం బిల్వమాత్రం తు ద్రవాణాం కుడవో మతః. 53
తదేకస్థం సమాలోడ్య పత్రైస్సుపరివేష్టితం,
పుటపాకేన తత్పక్త్వా గృహ్ణీయాత్తద్రసం బుధః. 54
తర్పణోక్తవిధానేన యథావదవచారయేత్,

జింక మొదలగువాని మాంసమును రెండుబిల్వముల ప్రమాణంబుగ గ్రహించి అందు ఘృతాది స్నేహద్రవ్యములను కలిపి ముద్దజేసి నూఱి యందు శుష్కద్రవ్యములను బిల్వప్రమాణంబులుగాను, ఆర్ద్రద్రవ్యములను కుడవ ప్రమాణముగాను గలపి నూఱి ముద్దజేసి దానిపైన నేరేడు, మామిడి మొదలగువాని యాకులను చుట్టి దానిపై గుడ్డచుట్టి మంటినిపూసి పుటపాక ప్రకారము అగ్నిలో పక్వముగావించి పిమ్మట యందలి మన్ను తీసివైచి యాపిండములోని రసము పిండికొని నేత్రతర్పణమున కుపయోగింపవలెను.

### పుటపాకమును నేత్రములలో వేయతగినవిధి.

దృష్టిమధ్యే నిషేచ్యస్స్యాన్నిత్యముత్తానశాయినః. 55
స్నేహనో లేఖనశ్చైవ రోపణశ్చేతి స త్రిధా,

ఇట్టి పుటపాకరసమును రోగిని వెల్లకిల పరుండఁబెట్టి దృష్టియందు వేయవలెను. మఱియుం నియ్యది స్నేహనము, లేఖనము, రోపణము అన త్రివిధంబు.

### స్నేహనాది భేదమువలన పుటపాకయోజన.

హితస్స్నిగ్ధోఽతిరూక్షస్య స్నిగ్ధస్యాపి హి లేఖనః. 56
దృష్టేర్బలార్థమితరః పిత్తాసృగ్వ్రణవాతనుత్,

రూక్షంబగు నేత్రములందు స్నేహరసమును, స్నిగ్ధంబగు నేత్రములందు లేఖనరసంబును నేత్రబలంబు కొఱకును, పిత్తరక్త, వ్రణ, వాతనాశనార్థంబు రోపణరసంబును ప్రయోగింపఁజనును.

### స్నేహ పుటపాకము.

సర్పిర్మాంసవసామజ్జామేదస్స్వాద్వౌషధైః కృతః. 57
స్నేహనః పుటపాకస్తు ధార్యో ద్వే వాక్శతే దృశి,

నేయి, మాంసము, వస, మజ్జ, మేదస్సు వీనిలో కాకోల్యాదిగణద్రవ్యములతో

నూఱి పుటపాకమువలె సాధించి యారసమును నేత్రములలో వైచి ఇన్నూరుమాత్రల కాలమువఱకును ధరింపవలెను. ఇది స్నేహ పుటపాకం బనంబడును.

### లేఖనపుటపాకము.

జాంగలానాం యకృన్మాంసైర్లేఖనద్రవ్యసంయుతైః. 58
కృష్ణలోహరజస్తామ్రశంఖవిద్రుమసింధుజైః,
సముద్రఫేనకాసీసస్రోతోజదధిమస్తుభిః. 59
లేఖనో వాక్శతం ధార్యస్తస్య తావద్ధి ధారణం,

జింక మొదలగువాని కుడిపార్శ్వంబున నున్న యకృత్తులోనిమాంసమును, లోహభస్మము, తామ్రభస్మము, శంఖభస్మము, పగడభస్మము, సైంధవలవణము, సముద్రపు నురుగు, అన్నభేది, స్రోతోంజనము, పెరుగుమీఁది నీరు వీనితోఁగలిపి నూఱి యండజేసి పుటపాకంబున సాధించి యారసమును నేత్రములందు నూఱుమాత్రల కాలంబువఱకు ధరించిన నియ్యది లేఖనపుటపాక మనంబడును.

### రోపణపుటపాకము.

స్తన్యజాంగలమధ్వాజ్యతిక్తకద్రవ్యపాచితః. 60
లేఖనాత్త్రిగుణో ధార్యః పుటపాకస్తు రోపణః,
వితరేత్తర్పణోక్తాం తు క్రియాం వ్యాపత్తిదర్శనే. 61

చనుబాలు, జాంగలమృగమాంసము, తేనె, నేయి, చేదువస్తువులు వీనిని కలిపి పుటపాకంబున సాధించి యారసమును నేత్రములందు మున్నూఱు మాత్రలకాలంబువఱకు ధరించిన నియ్యది రోపణ పుటపాకమనంబడును. ఇట్టి పుటపాకమందలి హీనాతియోగంబులకు తర్పణ హీనాతియోగ చికిత్సం జేయవలయును.

### సంపక్వదోషాదులకు అంజనము.

అథ సంపక్వదోషస్య ప్రాప్తమంజనమాచరేత్,
హేమంతే శిశిరే చైవ మధ్యాహ్నేంజనమిష్యతే. 62
పూర్వాహ్ణే చాపరాహ్ణే చ గ్రీష్మే శరది చేష్యతే,
వర్షాసు నాభ్రే నాత్యుష్ణే వసంతే చ సదైవ హి. 63

నేత్రరోగంబులు ఆమావస్థను విడిచి పాకావస్థం జెందునపుడు అంజనమువేయవలయును. అట్టి యంజనంబును హేమంతర్తువు, శిశిరర్తువు వీనియందు మధ్యాహ్నంబునను, గ్రీష్మర్తువునందును, శరదృతువునందును, పూర్వాహ్ణము, అపరాహ్ణము వీనియం

దును, వసంతర్తువునందు ఎల్లసమయంబులందును ప్రయోగింపవలెను. కాని వర్షకాలంబునను, మబ్బుదినమునను, అత్యుష్ణకాలంబునను అంజనమును ప్రయోగింపందగదు.

అంజనభేదములు.

లేఖనం రోపణం చైవ తథా స్యాత్స్నేహనాంజనం,
లేఖనం క్షారతీక్ష్ణామ్లరసై రంజనమిష్యతే. 64
కషాయతిక్తరసయుక్తస్స్నేహం రోపణం మతం,
మధురం స్నేహసంపన్నమంజనం చ ప్రసాదనమ్. 65

లేఖనము, రోపణము, స్నేహనము అన నంజనము త్రివిధంబు. క్షారము, కారము, పులుసు వీనితో గూడియుండు అంజనము లేఖనంబనియు, వగరు, చేదు అనునీరసంబులతో గూడి స్నిగ్ధమైన అంజనము రోపణాంజనమనియు, మధురరసముతో గూడియుండునది స్నేహనాంజనమనియు చెప్పఁబడును.

గుటికాదిభేదములవలన అంజనభేదములు.

గుటికారసచూర్ణాని త్రివిధాన్యంజనాని చ,
కుర్యాచ్ఛలాకయాఽంగుల్యా హీనాని చ యథోత్తరమ్. 66

గుటిక, రసము, చూర్ణము అన నంజనము త్రివిధంబైయుండును. అందు నొకదానికంటె నొకటి గుణహీనంబైయుండు. అట్టి యంజనమును శలాకతో గాని, వ్రేలితో గాని ప్రయోగింపందగును.

అంజనమున కనర్హులు.

శ్రాంతే ప్రరుదితే భీతే పీతమద్యే నవజ్వరే,
అజీర్ణే వేగఘాతే చ నాఞ్జనం సంప్రశస్యతే. 67

శ్రమఁ జెందినవానికి, రోదనము చేయువానికి, భయపడువానికి, మద్యపానము చేసినవానికి, నవజ్వరపీడితునకు, అజీర్ణరోగికి, మలమూత్రావరోధముచేయువానికి అంజన ప్రయోగము చేయందగును.

అంజనవర్తిప్రమాణము.

హరేణుమాత్రాం కుర్వీత వర్తిం తీక్ష్ణాంజనే భిషక్,
ప్రమాణం మధ్యమేధ్యర్థం ద్విగుణం తు మృదౌ భవేత్. 68

తీక్ష్ణాంజనమున రేణుకగింజ యంతమాత్రను వర్తిగాఁచేయవలెను. మధ్యమాంజనమున ఒకటిన్నర రేణుక యంతమాత్రను వర్తిగాఁ జేయవలెను. మృద్వంజనమున రెండు రేణుకలయంతమాత్రను వర్తిగా చేయందగును.

### అంజనరస ప్రమాణము.

రసక్రియా తూత్తమా స్యాత్త్రివిడంగమితా హితా,
మధ్యమా ద్వివిడంగా స్యాద్ధీనా త్వేకవిడంగికా. 69

ద్రవరూపంబగు నంజనము రసక్రియయనంబడును. దానిని మూఁడు వాయు విడంగములయంత నేత్రమునవైచిన ఉత్తమమాత్రయనియు, రెండువాయువిడంగముల యంతమాత్ర మధ్యమమనియు, ఒక వాయువిడంగమంతమాత్ర హీనమాత్రయనియు చెప్పఁబడును.

### వైరేచన-అంజన-చూర్ణ ప్రమాణము.

వైరేచనికచూర్ణం తు ద్విశలాకం విధీయతే,
మృదౌ తు త్రిశలాకం స్యాచ్చతస్రస్స్నేహికేఽంజనే. 70

నేత్రములనుండి విశేషముగ నీటిని వెడలింపఁజేయునది విరేచనికచూర్ణ మనంబడును. అద్దానిని శలాకను రెండుమార్లు అంటించి నేత్రములం ద్రిప్పవలయును. ఇది ఉత్తమ మనంబడును. మూఁడుమార్లు త్రిప్పిన నియ్యది మృదువనఁబడును. స్నేహాది ద్రవ్యములను శలాకను నాల్గుమార్లు అంటించి నేత్రములందు ద్రిప్పవలెను.

### శలాకానిర్మాణయోగ్యద్రవ్యములు.

ముఖయోః కుంఠితా శ్లక్ష్ణా శలాకాష్టాంగులోన్మితా,
అశ్మజా ధాతుజా వా స్యాత్కలాయపరిమండలా. 71

ఈశలాకను రత్నాదిపాషాణంబులచేగాని సువర్ణాదిధాతువులచేగాని నిర్మించి ఎనిమిదియంగుళములు ప్రమాణముగలదానినిగను, నునుపై చిఱుసెనగయంత లావుగల్గి ముఖమునందు పదనులేక యుండునట్లును చేయందగును.

### లేఖనాదులయందు శలాకాభేదములు.

తామ్రలోహాశ్మసంజాతా శలాకా లేఖనే మతా,
సువర్ణరజతోద్భూతా శలాకా స్నేహనే మతా. 72
అంగులీ చ మృదుత్వేన కథితా రోపణే బుధైః,

లేఖనాంజనంబున తామ్రము, ఇనుము, రాయి వీనితోచేయఁబడిన శలాకను నుపయోగింపందగును. స్నేహనాంజనంబున బంగారము, వెండి వీనిచే చేయఁబడిన శలాకను ప్రయోగించవలెను. రోపణాంజనమున మృదువుగానుండు వ్రేలితో నంజనము వేయందగును.

## అంజనమున కర్హమగు కాలములు.

సాయం ప్రాతర్వాంజనం స్యాత్తత్సదా నైవ కారయేత్. 73
నాతిశీతోష్ణవాతాభ్రవేలాయాం న ప్రశస్యతే,
కృష్ణభాగాదధః కుర్యాదపాంగం యావదంజనమ్. 74

అంజనమును సాయంకాలమునగాని, ప్రాతఃకాలమునగాని వేయందగును. అతిశీతము, అత్యౌష్ణ్యము, అతివాతము, మబ్బు ఇవిగలదినమున నంజనము వేయందగదు. అట్టి యంజనమును నల్లగ్రుడ్డు క్రిందిరెప్పమొదలు కడకంటివఱకు వేయవలయును.

## చంద్రోదయవర్తి.

శంఖనాభిర్విభీతస్య మజ్జాపథ్యా మనశ్శిలా,
పిప్పలీ మరిచం కుష్ఠం వచా చేతి సమాంశకమ్. 75
ఛాగీక్షీరేణ సంపిష్య వర్తిం కుర్యాద్యవోన్మితాం,
హరేణుమాత్రాం సంఘృష్య జలైః కుర్యాదథాంజనమ్. 76
తిమిరం మాంసవృద్ధిం చ కాచం పటలమర్బుదం,
రాత్ర్యంధం వార్షికం పుష్పం వర్తిశ్చంద్రోదయా జయేత్. 77

శంఖనాభి, తానికాయవిత్తులు, కరకకాయ, మణిశిల, పిప్పళ్లు, మిరియములు, చెంగల్వకోష్టు, వస వీనిని సమభాగంబులుగ మేకపాలతో నూరి యందు యవప్రమాణమును వర్తివలె చేసి యందు రేణుకగింజయంతను నీటితో చాది నేత్రముల కంజనము వేసిన తిమిరము, మాంసవృద్ధి, కాచబిందు, పటలము, అర్బుదము, నక్తాంధ్యము, సంవత్సరము నుండియుండెడి కంటిపువ్వు నశించును. ఇయ్యది చంద్రోదయవర్తి యనంబడును.

## కంటిపూలు మొదలగువానికి లేఖనవర్తి.

పలాశపుష్పస్వరసైర్బహుశః పరిభావితా,
కురంజబీజవర్తిస్తు శుక్రాదీన్ శస్త్రవల్లిఖేత్. 78

కానుగవిత్తులచూర్ణమును మోదుగపువ్వులరసముతో పలుమార్లుభావనచేసి మెత్తగ నూఱి వర్తివలె పొడవుగ మాత్రలుచేసి దానిని నీటితో చాది నేత్రముల కంజనము వైచిన కంటిపువ్వు, మాంసవృద్ధి, నంజు మొదలగురోగంబులు శస్త్రకర్మచే నశించుచందమున శమించును.

## కంటిపూలు మొదలగువానికి రెండవలేఖనీవర్తి.

సముద్రఫేనసింధూత్థశంఖరక్తాండవల్కలైః,
శిగ్రుబీజయుతైర్వర్తిశ్శుక్రాదీన్ శస్త్రవల్లిఖేత్. 79

సముద్రపునురుగు, సైంధవలవణము, శంఖము, కోడిగ్రుడ్డుపైనిపెంకు, మునగ విత్తులు వీనిని సమభాగంబులుగ నీటితోనూఱి వర్తిచేసి నేత్రములం దంజనముచేసిన కంటిపువ్వులు, నంజు మొదలగు రోగములు నశించును.

## లేఖనీదంతవర్తి.

దంతైర్దంతివరాహోష్ట్రగోహయాజఖరోద్భవైః,
శంఖముక్తాంభోధిఫేనయుతైస్సరైర్విచూర్ణితైః 80
దంతవర్తిః కృతా శ్లక్ష్ణా శుక్రాణాం నాశనీ పరా,

ఏనుఁగు, పంది, ఒంటె, ఎద్దు, గుఱ్ఱము, మేఁక, గాడిదె వీనిదంతములు, శంఖము, ముత్తియములు, సముద్రపునురుఁగు వీనిని చూర్ణముగావించి వర్తిచేసి నేత్రములందు అంజనముచేసిన కంటిపువ్వులు నశించును.

## తంద్రతొలఁగుటకై లేఖనీవర్తి.

నీలోత్పలం శిగ్రుబీజం నాగకేసరకం తథా. 81
ఏతత్కల్కైః కృతా వర్తిరతితంద్రాం వినాశయేత్,

నల్లకలువ, మునగవిత్తులు, నాగకేసరములు వీనిని సమభాగంబులుగ నూఱి వర్తి చేసి యెండించి, నీటితో చాది నేత్రములందు వైచిన తంద్ర నశించును.

## రోపణీకుసుమికావర్తి.

తిలపుష్పాణ్యశీతిస్స్యుః షష్టిసంఖ్యా కణాకణాః. 82
జాతీకుసుమపంచాశన్మరిచాని చ షోడశ,
సూక్ష్మం పిష్ట్వా జలే వర్తిః కృతా కుసుమికాభిధా. 83
తిమిరార్జునశుక్రాణాం నాశనీ మాంసవృద్ధిహృత్,
ఏతస్యాశ్చాంజనే మాత్రా ప్రోక్తా సార్ధహరేణుకా. 84

నువ్వులపువ్వులు ఎనుబది, పిప్పలీకణము అఱువది, జాజిపువ్వులు ఏఁబది, మిరియములు పదునాఱు వీని ఉదకముతో నూఱి మాత్రలుచేసి యందొకటిన్నరరేణుకవిత్తు ప్రమాణము నుదకముతో చాది నేత్రముల కంజనముచేసిన తిమిరము, అర్జునము, కంటి పువ్వులు, మాంసవృద్ధి ఇవి హరించును. ఇది కుసుమికావర్తి యనంబడును.

## రేచీఁకటితొలఁగుటకై వర్తి.

రసాంజనం హరిద్రే ద్వే మాలతీనింబపల్లవాః,
గోశకృద్రససంయుక్తా వర్తిర్నక్తాంధ్యనాశనీ. 85

రసాంజనము, పసుపు, మ్రానిపసుపు, జాజిచిగుళ్లు, వేపచిగుళ్లు వీనిని సమముగ గోమయరసముతో మెత్తగనూరి మాత్రఁజేసి దానిని ఉదకముతో నూరి నేత్రములందు వైచిన నక్తాంధ్యము హరించును.

నేత్రస్రావమునకై స్నేహనీవర్తి.

ధాత్ర్యక్షపథ్యాబీజాని ఏకద్విత్రిగుణాని చ,
పిష్ట్వా వర్తిర్జలైః కుర్యాదంజనం ద్విహరేణుకమ్. 86
నేత్రస్రావం హరత్యాశు వాతరక్తరుజం తథా,

ఉసిరికవిత్తులు ఒకభాగము, తానికాయవిత్తులు రెండు భాగములు, కరకకాయ విత్తులు మూఁడుభాగములు వీనిని ఉదకముతో నూరి మాత్రకట్టి, అందు రేణుకవిత్తుల ప్రమాణమును చాది నేత్రములందు వైచిన నేత్రమునుండి నీరుగారుట, వాతరక్తపీడ నశించును.

నేత్రాంజనరసక్రియ.

తుత్థమాక్షికసింధూత్థసితాశంఖమనశ్శిలా. 87
[illegible]రికోదధిఫేనం చ మరిచం చేతి చూర్ణయేత్,
సంయోజ్య మధునా కుర్యాదంజనార్థం రసక్రియామ్ 88
వర్త్మరోగార్మతిమిరకాచశుక్రహరం పరం,

మయూరతుత్థము, స్వర్ణమాక్షికము, సైంధవలవణము, ఖండశర్కర, శంఖము, మణిశిల, సముద్రఫేనము, మిరియములు వీనిని సమముగ చూర్ణముగావించి తేనెలోఁ గలిపి యంజనమువేసిన వర్త్మరోగము, అర్మరోగము, తిమిరము, కాచబిందు, కంటిపువ్వు నశించును.

కంటిపూలు హరించుటకై రసక్రియ.

వటక్షీరేణ సంయుక్తో ముఖ్యః కర్పూరజః కణః. 89
క్షిప్రమంజనతో హంతి కుసుమం చ ద్విమాసికం,

కర్పూరము మఱ్ఱిపాలతో నూరి నేత్రముల కంజనమువైచిన రెండు మాసముల నుండి పుట్టిన కుసుమము (కంటిపువ్వు) నశించును.

అతినిద్ర హరించుటకై లేఖనీరసక్రియ.

క్షౌద్రాశ్వలాలాసంఘృష్టైర్మరిచైర్నేత్రమంజయేత్, 90
అతినిద్రా శమం యాతి తమస్సూర్యోదయాదివ,

మిరియములను, తేనె, గుఱ్ఱపుజొల్లు వీనితో గలపి నేత్రముల కంజనము వైచిన సూర్యోదయంబుచే నంధకారము తొలఁగు భంగి అతినిద్ర నశించును.

తంద్రకు రసక్రియ.

జాతీపుష్పం ప్రవాళం చ మరిచం కటుకం వచా. 91
సైంధవం బస్తమూత్రేణ పిష్టం తంద్రాఘ్న మంజనం,

జాజిపువ్వులు, జాజిచిగుళ్లు, మిరియములు, కటుకరోహిణి, వస, సైంధవలవణము వీనిని సమభాగంబులుగ మేఁకమూత్రముతో నూఱి నేత్రముల కంజనము వైచిన నేత్రములందలి మబ్బు హరించును.

సన్నిపాతములకు లేఖనీరసక్రియ.

శిరీషబీజగోమూత్రకృష్ణామరిచసైంధవైః, 92
అంజనం స్యాత్ప్రబోధాయ సరసోనశిలావచైః,

దిరిసెనవిత్తులు, పిప్పళ్లు, మిరియములు, సైంధవలవణము, వెల్లుల్లి, మణిశిల, వస వీనిని సమభాగంబులుగ గోమూత్రముతో నూఱి నేత్రముల కంజనము వైచిన సన్నిపాతమందలి చేష్టానాశము హరించి ప్రబోధము గల్గును.

దాహాదులకు రోపణీరసక్రియ.

దార్వీపటోలం మధుకం సనింబం పద్మకోత్పలమ్. 93
ప్రపౌండరీకం చైతాని పచేత్తోయే చతుర్గుణే,
విపాచ్య పాదశేషం తు శృతం నీత్వా పునః పచేత్. 94
శీతే తస్మిన్మధుసితాం దద్యాత్పాదాంశకాన్నరః,
రసక్రియైషా దాహాస్రరక్తరాజరుజోహరీ. 95

మ్రానుపసుపు, చేదుపొట్ల, అతిమధురము, వేపచిగుళ్లు, పద్మకములు, నల్లకలువ, ప్రపౌండరీకము వీని సమభాగంబులుగ నాల్గింతల నీటిలో నాలవభాగము మిగులునట్లు కషాయంబుగాచి వడగట్టి మరల దానిని గట్టిపడువఱకు గాచి చల్లార్చి యందు తేనె, చక్కెర వీనిని నాలవభాగముగఁ గలపి నేత్రముల కంజనము వైచిన తాపము, స్రావము, రక్తవికారము నశించును. ఇయ్యది రసక్రియాభేదము.

కంటికొలుకులలో జనించు రోగములకు రోపణీరసక్రియ.

రసాంజనం సర్జరసో జాతీపుష్పం మనశ్శిలా,
సముద్రఫేనో లవణం గైరికం మరిచాని చ. 96

ఏతత్సమాంశం మధునా పిష్ట్వా ప్రక్లిన్నవర్త్మని,
అంజనం క్లేదకండూఘ్నం పక్ష్మణాం చ ప్రరోహణమ్. 97

రసాంజనము, సర్జరసము, జాజిపువ్వులు, మణిశిల, సముద్రఫేనము, సైంధవలవణము, కావిరాయి, మిరియములు వీనిని సమభాగంబులుగ చూర్ణముగావించి తేనెలోఁ గలపి నేత్రముల కంజనము చేసిన ప్రక్లిన్నవర్త్మరోగము, పుసి, దురద ఈరోగంబులు నశించుటయేగాక ఱెప్పలనుండి రాలిపోయిన వెండ్రుకలు మరల పుట్టును.

తిమిరాదులకు రోపణీరసక్రియ.

గుడూచీస్వరసః కర్షః క్షౌద్రం స్యాన్మాషకోన్మితం,
సైంధవం క్షౌద్రతుల్యం స్యాత్సర్వమేకత్ర మర్దయేత్. 93
అంజయేన్నయనం తేన పిల్లార్మతిమిరం జయేత్,
కాచం కండూం లింగనాశం శుక్లకృష్ణగతాన్గదాన్. 99

తిప్పతీఁగరసము ఒకకర్షము, తేనె ఒకమాషము, సైంధవలవణము ఒకమాషము వీనిని చక్కఁగా మర్దించి నేత్రముల కంజనము వైచిన పిల్లరోగము, అర్మరోగము, తిమిరము, కాచము, దురద, లింగనాశము, శుక్లరోగము, కృష్ణరోగము హరించును.

కండ్వాదులకు పునర్నవాంజనము.

దుగ్ధేన కండూం క్షౌద్రేణ నేత్రస్రావం చ సర్పిషా,
పుష్పం తైలేన తిమిరం కాంజికేన నిశాంధతామ్. 100
పునర్నవా జయేదాశు భాస్కరస్తిమిరం యథా,

తెల్లగలిజేరువేరు పాలతో నూరి యంజనము వైచిన దురదయు, తేనెతో గలపి యంజనము వైచిన నేత్రస్రావము, నేతితోఁ గలపి యంజనము వైచిన పువ్వు, నూనెతో గలపి యంజనము వైచిన తిమిరము, కాంజికములో చాది యంజనము వైచిన రేఁచీకటియు నశించును.

నేత్రస్రావములకు రోపణీరసక్రియ.

బబ్బూలదలనిక్వాథో లేహీభూతస్తదంజనాత్. 101
నేత్రస్రావం జయత్యేష మధుయుక్తో న సంశయః,

నల్లతుమ్మయాకులను గట్టిపడునట్లు కషాయము గాచి యందు తేనెగలపి నేత్రముల కంజనము వైచిన నిస్సంశయముగ నేత్రస్రావము హరించును.

అన్యచ్చ.—పిఞ్జలస్య ఫలం ఘృష్ట్వా పానీయే నిత్యమంజనమ్. 102
చక్షుః స్రావోపశాంత్యర్థం కార్యమేతన్మహౌషధం,

గారపండును ఉదకముతో చాది ప్రతిదినము నేత్రముల కంజనము వేయుచుండిన నేత్రస్రావము హరించును. ఇది మిగులశ్రేష్ఠమైనది.

నేత్రములు తేటపడుటకై స్నేహసీరసక్రియ.

కతకస్య ఫలం ఘృష్ట్వా మధునా నేత్రమంజయేత్. 103
ఈషత్కర్పూరసహితం స్మృతం నేత్రప్రసాదనం,

చిల్లగింజను తేనెతో చాది యందు కొంచెము పచ్చకర్పూరముగలపి యంజనము వైచిన నేత్రములు ప్రసన్నము లగును.

శిరోత్పాతమునకు అంజనము.

సర్పిః క్షౌద్రం చాంజనం స్యాచ్ఛిరోత్పాతస్య శాంతయే. 104

నేయి, తేనె వీనినిగలపి నేత్రముల కంజనమువైచిన శిరోత్పాతము హరించును.

అంధత్వము తొలఁగుటకై రసక్రియ.

కృష్ణసర్పవసాశంఖకతకాఫలమంజనం,
రసక్రియేయమచిరాదంధానాం దర్శనప్రదా. 105

కృష్ణసర్పముయొక్కవస, శంఖము, చిల్లగింజ వీనిని మెత్తగ నూఱి నేత్రముల కంజనమువైచిన అంధ్యము నశించి నేత్రము నిర్మలంబగును.

లేఖనచూర్ణాంజనము.

దక్షాండత్వక్శిలాకాచైశ్శంఖచందనగైరికైః,
ద్రవ్యైరంజనయోగోఽయం పుష్పార్మాదివిలేఖనః. 106

కోడిగ్రుడ్డుయొక్కచిప్ప, మణశిల, తెల్లకాచు, శంఖము, శ్వేతచందనము, కావిరాయి వీనిని సమముగ చూర్ణముగావించి నేత్రముల కంజనమువైచిన కంటిపువ్వు, మాంసార్మము మొదలగురోగములు హరించును.

రేచీఁకటి హరించుటకై లేఖనచూర్ణాంజనము.

కణాచ్ఛాగయకృన్మధ్యే పక్త్వా తద్రసపేషితా,
అచిరాద్ధంతి నక్తాంధ్యం తద్వత్సక్షౌద్రమూషణమ్. 107

గొఱ్ఱెయొక్క యకృత్తులో పిప్పళ్లను బోసి పాకముగావించి అందలిరసమును పిండికొని దానిచే పిప్పళ్లను నూఱికాని, పక్వముచేయంబడిన పిప్పళ్లను తేనెతో నూఱిగాని అంజనముచేసిన శీఘ్రముగ హరించును.

### లేఖనచూర్ణాంజనము.

శాణార్ధం మరిచం ద్వౌ చ పిప్పల్యర్ణవఫేనయోః,
శాణార్ధం సైంధవం శాణం నవసౌవీరకాంజనమ్. 108
పిష్టం సుసూక్ష్మం చిత్రాయాం చూర్ణాంజనమిదం శుభం,
కండూకాచకఫార్తానాం మలానాం చ విశోధనమ్. 109

మిరియములు అరశాణము, పిప్పళ్లు రెండుశాణములు, సముద్రఫేనము రెండుశాణములు, సైంధవలవణము అర్ధశాణము, సౌవీరాంజనము తొమ్మిదిశాణములు వీనిని చిత్రానక్షత్రయుక్తదినంబున నూఱి నేత్రములం దంజనము వైచిన నేత్రములందలి దురద, కాచము, కఫజనేత్రరోగములు, కంటియందలి మలములు నశించును. ఇది చూర్ణాంజనమనంబడును.

### సర్వనేత్రరోగములకు మృదుచూర్ణాంజనము.

శిలాయాం రసకం పిష్ట్వా సమ్యగాప్లావ్య వారిణా,
గృహ్ణీయాత్తజ్జలం సర్వం త్యజేచ్చూర్ణమధోగతమ్. 110
శుష్కం చ తజ్జలం సర్వం పర్పటీసన్నిభం భవేత్,
విచూర్ణ్య భావయేత్సమ్యక్త్రివేలం త్రిఫలారసైః. 111
కర్పూరస్య రజస్తత్ర దశమాంశేన నిక్షిపేత్,
అంజయేన్నయనే తేన సర్వదోషహరం హి తత్. 112
సర్వరోగహరం చూర్ణం చక్షుషోస్సుఖకారి చ,

కపురిని చక్కగా ఖల్వమున నూఱి యుదకంబున కలపి పైతేటనీరుమాత్రము గ్రహించి క్రిందిచూర్ణము విడిచివైచి యాయుదకమును ఇగురుపఱుచును గాచిన యెడలనందు బిల్లగానేర్పడును. ఆబిల్లను త్రిఫలాకషాయంబున ముమ్మాఱు మర్దించి మూఁడుపుటంబులువైచి చూర్ణముగావించి దీనికి పదియవపాలు పచ్చకర్పూరమును చేర్చి నేత్రములకంజనమువైచిన నేత్రరోగము లన్నియు శమించు.

### సర్వనేత్రరోగములకు సౌవీరాంజనము.

అగ్నితప్తం చ సౌవీరం నిషించేత్త్రిఫలారసైః. 113
సప్తవేలం తథా స్తన్యైః స్త్రీణాం సిక్తం విచూర్ణితం,
అంజయేన్నయనే తేన ప్రత్యహం చక్షుషోర్హితమ్. 114
సర్వానక్షివికారాంస్తు హన్యాదేతన్న సంశయః,

సౌవీరాంజనమును నిప్పులోఁగాల్చి త్రిఫలాకషాయంబున నేడుమార్లును, చనుఁ

బాలలో నేడుమార్లును ముంచి పిమ్మటఁ దానిని మెత్తగ చూర్ణముగావించి నేత్రముల కంజనమువైచిన నేత్రరోగము లన్నియును నశించి నేత్రములకు సుఖమును గల్గును.

శలాకానిర్మాణక్రమము.

త్రిఫలాభృంగశుంఠీనాం రసై స్తద్వచ్చ సర్పిషా. 115
గోమూత్రమధ్వజాక్షీరై స్సిక్తో నాగః ప్రతాపితః,
తచ్ఛలాకా హర త్యేవ సర్వా న్నేత్రభవాన్గదాన్. 116

నాగము (నల్లసీసము) ను ఏడుమార్లు కరిగించి త్రిఫలాకషాయము, గుంటగలగర రసము, శొంఠి కషాయము, నేయి, గోమూత్రము, తేనె, మేఁకపాలు వీనిలోఁ బోసి పిమ్మట దానిచే శలాకజేసి దానిని నేత్రములలోఁ దుడిచిన నేత్రరోగము లన్నియు శమించును.

ప్రత్యంజనవిధానము.

గతదోషమపేతాశ్రుం సంపశ్య న్ సమ్యగంభసి,
ప్రక్షాల్యాక్షి యథాదోషం కార్యం ప్రత్యంజనం తతః. 117

పూర్వోక్తప్రకార మంజనము వేసినతరువాత నేత్రమందలి దోషములు హరించి స్రావముతగ్గినతోడనె కండ్లు తెఱచి పిమ్మట నీటితో నానేత్రములను గడిగి ప్రత్యంజనము చేయందగును. అట్టి ప్రత్యంజనవిధానము ఇఁకమీఁద వివరింపఁబడును.

దోషయుక్తనేత్రములకు ప్రత్యంజనాదిక్రియ.

నవానిర్గతదోషేఽక్ష్ణి ధావనం న ప్రయోజయేత్,
ప్రత్యంజనం తీక్ష్ణతప్తే నేత్రచూర్ణః ప్రసాదనః. 118

నేత్రములయందు దోషములు మిగిలియుండెనేని నేత్రములను కడుగఁగూడదు. తీక్ష్ణాంజనముచే నేత్రములు తాపముఁజెందెనేని కర్పూరము మొదలగు శీతలపదార్థంబులచే నిర్మితంబై స్నేహయుక్తమగు ప్రసాదనాంజనమును ప్రయోగింపవలయును.

ప్రత్యంజనచూర్ణము.

శుద్ధే నాగే ద్రుతే తుల్యం శుద్ధం సూతం వినిక్షిపేత్,
కృష్ణాంజనం తయో స్తుల్యం సర్వమేకత్ర చూర్ణయేత్. 119
దశమాంశేన కర్పూరం తస్మిన్ చూర్ణే ప్రదాపయేత్,
ఏతత్ప్రత్యంజనం నేత్రగదజిన్నయనామృతమ్. 120

శుద్ధిచేయఁబడిననాగము (నల్లసీసము)ను కరిగించి యందు సమముగ పాదరసమును

వైచి ఈరెంటికిని సమముగ కృష్ణాంజనము (సురమారాయి) గలపి కాటుకవలె చక్కగ నూఱి దానికి పదియవపాలు పచ్చకర్పూరము గలపి యంజనముచేసిన నేత్రరోగము లన్నియును నశించును. ఇయ్యది నేత్రముల కమృతతుల్యంబైయుండు. ఇయ్యది ప్రత్యంజన చూర్ణ మనంబడును.

### సర్పవిషము తొలగుటకు అంజనము.

జయపాలస్య మజ్జానం భావయేన్నింబుకద్రవైః,
ఏకవింశతివేలం తు తతో వర్తిం ప్రకల్పయేత్. 121
మనుష్యలాలయా ఘృష్ట్వా తతో నేత్రే తయాఽంజయేత్,
సర్పదష్టవిషం జిత్వా సంజీవయతి మానవమ్. 122

నేపాళపువిత్తులలోని పప్పును నిమ్మపండ్లరసముతో నిరువదియొక్కమార్లు భావన చేసి దానిని మాత్రచేసి మనుష్యునియొక్క జొల్లుతోఁ చాది నేత్రముల కంజనమువైచిన సర్పదుష్టముచేఁ గల్గినబాధ హరించి మనుజుఁడు జీవించును.

### పాణీతలస్పర్శచే గలుగుగుణములు.

భుక్త్వా పాణితలం ఘృష్ట్వా చక్షుషోర్యది దీయతే,
జాతరోగా వినశ్యంతి తిమిరాణి తథైవ చ. 123

భోజనముచేసి చేతినికడగికొనిన పిదప నాతడిచేతుల రెంటిని చేర్చి రుద్ది దానిచే నేత్రములను దుడిచికొనిన నేత్రరోగములు నశించుటయేగాక తిమిరము తప్పక నశించు.

### శీతోదకసేచన.

శీతాంబుపూరితముఖః ప్రతివాసరం యః
కాలత్రయేణ నయనద్వితయం జలేన,
ఆసించతి ధ్రువమసౌ న కదాచిదక్షి
రోగవ్యథామతితరాం భజతే మనుష్యః. 124

ప్రతిదినంబున మూఁడుకాలములయందును నోటినిండ శీతోదకము పోసికొని పూరించుచు, నేత్రములందు రెండుమార్లు శీతోదకమును పోసి ఆసేచనముచేసిన నేత్ర రోగములు నశించుటయేగాక మరల నారోగములు జనింపకుండును.

### సజ్జనప్రార్థన.

ఆయుర్వేదసముద్రస్య గూఢార్థమణిసంచయం,
జ్ఞాత్వా కైశ్చిద్బుధైస్తైస్తు కృతా వివిధసంహితాః. 125
కించిదర్థం తతో నీత్వా కృతేయం సంహితా మయా,
కృపాకటాక్షవిక్షేపమస్యాం కుర్వంతు సాధవః. 126

త్రికాలవేత్తలగు అగ్నివేశ, సుశ్రుత, చరకాదిఋషిపుంగవులు ఆయుర్వేదమహా సముద్రమందలి నిగూఢార్థమాణిక్యంబులం గ్రహించి సంహితారూపంబున ప్రదర్శించియున్నారు. అట్టి నిగూఢార్థమాణిక్యపుంజములనుండి యుత్తమమాణిక్యంబులం గ్రహించి యీసంహిత నేను రచియించియున్నాను. గుణగ్రహణపారీణులగు సహృదయులు కృపాకటాక్షంబుచే నీ "శార్ఙ్గధరసంహిత"ను నాదరింతురుగాత.

### గ్రంథధారణఫలము.

వివిధగదార్తిదరిద్రనాశినీ యా హరిరమణీవ కరోతి యోగరత్నైః
విలసతు శార్ఙ్గధరస్య సంహితా సా కవిహృదయేషు సరోజనిర్మలేషు

'శ్రీమహాలక్ష్మి దివ్యతరమగుమాణిక్యములచే స్వభక్తులదారిద్ర్యంబు నడంచుభంగి ప్రాత్యక్షిక యోగరత్నంబులచే విలసిల్లి సర్వరోగనివారణోపాయంబుం జక్కఁగా నేయుచు నీ శార్ఙ్గధరసంహిత" అత్యచ్ఛంబులగు కవిహృదయసరోజంబులం జిరకాల క్రీడించుఁగాత.

### గ్రంథప్రాశస్త్యము.

అల్పాయుషామల్పధియామిదానీం కృతం సమస్తశ్రుతిసారశక్త్యా,
తదత్ర యుక్తం ప్రతిబీజమాత్రమభ్యస్యతామాత్మహితం ప్రయత్నాత్.

ఇతి శ్రీచంద్రశేఖరపదారవిందపరిచర్యాపరిలబ్ధవైద్యవిద్యాసామ్రాజ్యలక్ష్మీకటాక్షపాత్రీభూత శ్రీదామోదరసూనుశార్ఙ్గధరవిరచితాయాం సంహితాయాం చికిత్సాస్థానే ఉత్తరఖండే నేత్రవిధికథనం నామ త్రయోదశోఽధ్యాయః.

సంహితా చ సమాప్తా.

ఈయుగంబున మనుజులు అల్పాయుర్దాయము, అల్పజ్ఞానము కలవారగ నియ్యది పఠనపాఠనానుకూలంబుగ సారమును గ్రహించి నిర్మింపఁబడినది. దాన నామూలాగ్రంబుగ పఠించి శరీరంబును సంరక్షించుకొనియెదరుగాత!

ఇది శ్రీదామోదరసూను శార్ఙ్గధరవిరచితసంహితయందు చికిత్సాస్థానమున నుత్తరఖండమందు నేత్రవిధికథన మనునట్టి త్రయోదశాధ్యాయము సర్వంబును సంపూర్ణము.




---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1945